# యమ్. యన్. రాయ్

## జీవితం - సిద్ధాంతం





కోగంటి రాధాకృష్ణమూర్తి

ప్రజాస్వామ్య ప్రచురణలు (ప్రై) లిమిటెడ్.,
తెనాలి

ప్రజాస్వామ్య ప్రచురణలు — 1

# యమ్. యన్. రాయ్ జీవితం - సిద్ధాంతం

— కోగంటి రాధాకృష్ణమూర్తి

ప్రథమ ముద్రణ : జూన్ 1978

ప్రతులు : 1500

పబ్లిషర్స్ :

ప్రజాస్వామ్య ప్రచురణలు (ప్రై) లిమిటెడ్., తెనాలి.

సోల్ డిస్ట్రిబ్యూటర్స్ :




ముద్రణ :

నాగార్జున ప్రింటింగ్ అండ్ బైండింగు వర్క్సు - తెనాలి.

వెల : రు. 25—00



# స్వవిషయం

‘ప్రజాస్వామ్య ప్రచురణలు’ ఒక వినూత్న ప్రయత్నం. ఇతర సంస్థలతో రూపసామ్యం వున్నా ఆదర్శాలలో, లక్ష్యసాధనా విధానాలలో, కార్యాచరణ రీతులలో భిన్నమైనది.

వ్యక్తి జీవితంలో, సమాజ జీవితంలో అన్నిరంగాలలో ప్రజాస్వామ్యం వెల్లివిరిసి మూడుపూవులు, ఆరుకాయలుగా వర్ధిల్లాలని ఈ సంస్థ అభిమతం, ఆశయం కూడాను.

ఇలాంటి ప్రయత్నాలు పూర్వం జరిగినవి. ప్రస్తుతం జరుగుచున్నవి. కాని వానికీ, మా యీ ప్రయత్నానికీ తారతమ్యమున్నది. ఉదాత్తమయిన ఆశయాలతో, ఉత్తేజం పొందిన మేధావుల సమిష్టి సహకార కృషి ఫలితంగా యీ సంస్థ ఉద్భవించినది.

విశ్వజనీయతే దీని విశిష్టత. మొత్తం మానవ ప్రపంచ సంస్కృతీ, సాహిత్యాలు దీని వారసత్వం. ముఖ్యంగా భారతదేశ సంస్కృతిలో ఇంతవరకు మరుగునపడిన మాణిక్యాలు - చార్వాక, కపిల, కణాదుల మతాలు, సిద్ధాంతాలు - దీని సొమ్ము. తెలుగుదేశమే కాదు తెలుగు భాష విస్తరించిన ప్రాంతమంతా దీని కార్యక్షేత్రము.

ప్రపంచంలో విప్లవాలు ఎక్కడ వచ్చినా, ఏకాలమందు జరిగినా అవన్నీ దీనికి అధ్యయన యోగ్యాలే. ఇంగ్లండులో 1689 లో బ్రిటిషు రాచరికానికి పరిమితులు, హద్దులు విధించిన విప్లవం; అమెరికాలో 1776 లో ప్రాతినిధ్యాధికారమున్నవారే పన్నులు విధించ గల హక్కుదారులని ‘ప్రజాస్వామ్య’ సూత్రాన్ని ఎలుగెత్తిచాటిన విప్లవం; 1789 లో స్వేచ్ఛ, సమానత్వము, సౌభ్రాతృత్వము ఆదర్శాలుగా విజయవంతమయిన ఫ్రెంచి విప్లవం; 1917 లో ‘భూమి, తిండి, శాంతి’ నినాదాలతో కార్మికవర్గం, మధ్యతరగతి రష్యాలో సాధించిన విప్లవం; 1947 లో భారతదేశం పొందిన స్వాతంత్ర్యం; 1949 లో కర్షక బలంతో చైనాలో జరిగిన విప్లవం మొదలయిన చరిత్రాత్మక సంఘటనలను లోతుగా, సునిశితంగా,

సమ్యక్‌దృష్టితో పరిశీలించి తదనుగుణమైన ప్రచురణలు చేయాలని ఈ సంస్థ ఆదర్శం.

సామాజిక పరివర్తనకూ, భావగమనానికీ అవినాభావ సంబంధమున్నదనే విషయం జగద్విదితం. అయితే భావాలు ప్రాతిభాసికాలేనా లేక మానవ మస్తిష్కములో - ఉదయించిన తరుణం నుంచీ ప్రత్యేక గమన సూత్రాలతో స్వతంత్ర లక్షణాలు కలిగి పెంపొందు చున్నవా? రెండవ స్వరూపం అవశ్య పరిగ్రహణ యోగ్యం. ఈ సూత్రాన్ని విశ్వవిఖ్యాత విప్లవవాది, మేధావి అయిన యమ్. యన్. రాయ్ 1946 లో ప్రవచించాడు. ఈ భావన యీ సంస్థకు జీవగఱ్ఱ.

వ్యక్తివాదం, హేతువాదం, మానవవాదం ఈ సంస్థను శాసించే త్రికము (త్రిగుణాలు). మానవులంతా వొకటే; మానవ సమాజానికి మూలము మానవుడే; మానవుని అభ్యున్నతియే మానవ సమాజ అభ్యుదయానికి, శ్రేయస్సుకు కొలమానం లేక వరుమానం; ప్రకృతి నియమ బద్ధమైనది కనుక ప్రకృతి నుంచి ఉద్భవించిన మానవుడు కూడా వస్తుతః నియమబద్ధుడు అంటే హేతువాది. కనుక ఆతడు నీతివంతునిగా మనగలడని ప్రకటించిన రాడికల్ హ్యూమనిజం యొక్క తాత్విక సిద్ధాంతం ఈ సంస్థకు వెలుగుబాటగా అడుగడుగునా ప్రభావితం చేస్తుంది.

మానవ వాదం యీనాటిది కాదు. మానవజాతి సమాజంగా మనుగడ సాగించి నప్పటినుంచీ యీ తాత్విక చింతన జరుగుతూనే వచ్చినది. కాని ఆధునిక యుగంలో మానవ విజ్ఞానం ఎంతో అభివృద్ధి చెందటంతో ప్రస్తుతం నూతన భాష్యాలతో, వినూత్న విషయ పరిజ్ఞానంతో ఆ పాతకాలపు మానవ వాదాన్ని పరిశీలించి, సవరించి పునరుద్ధరించ వలసిన అవసర మేర్పడినది. ఆ కృషి ఫలితమే యమ్. యన్. రాయ్ నవ్యమానవ వాదం.

స్వేచ్ఛాపిపాస, సత్యాన్వేషణ మానవ మనుగడ ప్రేరకాలని పేర్కొనటం ఈ నవ్యమానవవాద విశిష్టత. (1) అంతరాత్మ ప్రేరిత నీతి లేక దైవ నిర్దేశిత నీతి; (2) ప్రయోజనాత్మక నీతి అనే రెంటికీ ప్రత్యామ్నాయంగా హేతుబద్ధమయిన నీతిని చాటి చెప్పినది. రాజకీయ రంగంలో పార్టీ రహిత ప్రజాస్వామ్యాన్ని ప్రతిపాదించినది. ఆర్థిక రంగంలో సహకార సంబంధమయిన ప్రణాళికా రచనలను రూపొందించినది. సాంస్కృతిక రంగంలో భావ స్వతంత్ర ప్రతిపత్తిని గుర్తించి

నది. సాంఘికంగా కుల, మత, వర్గ, లింగ, ప్రాంతీయ, భాష, జాతి, దేశ విభేదాలను నిరసించినది. విశ్వజనీయ సంస్కృతికి విలువ నిచ్చినది. ఏకత్వంలో భిన్నత్వాన్ని, భిన్నత్వంలో ఏకత్వాన్ని చూడగలిగినది. అంధ విశ్వాసాలకు గొడ్డలిపెట్టు. ప్రబోధ కార్యక్రమాలను బలపరుస్తుంది. అందులో ఒక భాగమే ఈ సంస్థ ప్రచురణ యత్నం.

ఈ ప్రకృతికి అతీతమయిన మరే యితర శక్తి లేదని తెలుసుకొనటం, తన మనుగడకు, భవిష్యత్తుకు తానే బాధ్యుడనని గుర్తెరగటం, తన క్షేమానికీ, అభ్యున్నతికీ, తోటి మానవుల శ్రేయస్సుకూ వైరుధ్యం లేదనే విషయాన్ని గ్రహించి సమాజ స్థితి గతులను మెరుగుపరచటానికి ఉద్యుక్తుడు కావటం ఉత్తమ మానవ లక్షణం.

ఈ మానవవాద లక్ష్యాలనే 1952 లో నెలకొల్పబడిన అంతర్జాతీయ హ్యూమనిస్టు నైతిక సంఘం మరోరూపంలో ప్రకటించినది. భారత రాడికల్ హ్యూమనిస్టు సంఘాన్ని ఆ ప్రపంచసంస్థ గుర్తించి పూర్తి సభ్యత్వాన్నిచ్చినది. ఆ అంతర్జాతీయ సంఘం ఐదు ఖండాలలోని అనేక దేశాలలో అనుబంధ సంస్థలు కలిగి అనమానమైన కృషిసాగిస్తున్నది.

ప్రస్తుతం ప్రపంచ మానవాళి సాంస్కృతికంగా విషమ స్థితిలో చిక్కుకొని యున్నది. ఒక వైపు మత ప్రాబల్యాలు, మరోవైపు ఫాసిజం, కమ్యూనిజం లాంటి నియంతృత్వ విధానాలు చలామణి అవుతూ ప్రజల సంక్షేమం కొరకు ప్రజల ఆశయాలను నెరవేర్చకపోగా హీనస్థితికి దిగజార్చు చున్నవి. దీని ఫలితంగా తృతీయ మార్గాన్వేషణ ప్రారంభ మయినది. విజ్ఞానం పెరుగుదల, మానవ మేధస్సు, సృజనాశక్తి అభివృద్ధి చెందడంతో నూతన తాత్విక చింతనలకు ప్రాతిపదిక ఏర్పడినది.

దీనినే నైతిక హ్యూమనిజం అని పిలువటం కూడా కద్దు. ఇది ప్రజా స్వామ్య సూత్రానికి కట్టుబడి వున్నది. ప్రతివ్యక్తి సాధ్యమైనంతగా వికాసం పొందటానికి హక్కు కలిగియున్నాడు. కేవలం ప్రభుత్వ పరిధిలోనేగాక జీవిత సంబంధా లన్నింటిలోనూ ఈ ప్రజాస్వామ్య సూత్రం వర్తిస్తుంది. విజ్ఞానాన్ని మానవ వినాశనానికి కాక క్షేమానికి, శ్రేయస్సుకు, నిర్మాణయుతంగా వినియో

గించటం ఈ సిద్ధాంతపు ఆదర్శ ముఖ్యలక్షణాలలో వొకటి. విజ్ఞానము లక్ష్యాలను నిర్దేశించదు. మానవ శ్రేయస్సును సాధించటానికి అనువైన మార్గాలను సూచిస్తుంది.

హ్యూమనిజం నైతిక దృక్పథం కలది. మానవుని హుందాతనాన్ని సాధ్య మైనంతలో ప్రతి వ్యక్తి ఇతోధికంగా ఇతరుల హక్కులకు భంగం కలుగని రీతిగా స్వయంగా వికాసాన్ని పొందగల హక్కును గుర్తిస్తుంది. సామర్థ్యం, క్రమశిక్షణ పేరుతో మానవ జీవితాన్ని యాంత్రికం చేసే వ్యవస్థను వ్యతిరేకిస్తుంది. యాంత్రీకరణ మానవ విలువలను వమ్ము చేస్తుంది. తాత్కాలిక లక్ష్యాలను సాధించే ప్రయత్నంలో సమగ్ర నియంతృత్వ సిద్ధాంతాలు అమలుపరచ జూచే సమగ్ర యాంత్రీకరణను త్రోసిరాజంటుంది. సమాజం యెడ బాధ్యతతో సమ్మిళితమైన వ్యక్తి స్వేచ్ఛను లక్ష్యంగా స్వీకరిస్తుంది. భౌతిక అవసరాలను తీర్చటం, భౌతిక పరిస్థితులను మెరుగుపరచటం అనే పేరుతో పైన పేర్కొనబడిన వ్యక్తి స్వేచ్ఛను త్యజించ నిచ్చగించదు. మానసిక స్వేచ్ఛ, మౌలికచింతన లేనప్పుడు అభ్యుదయం అసాధ్యం.

పిడివాదాన్ని, పిడివాదపు సిద్ధాంతాన్ని త్రోసి రాజని హ్యూమనిజం స్వేచ్ఛను ప్రబోధిస్తుంది. నైతిక విలువలను, సృజనా శక్తులతో సమ్మిళితమైన జీవితవిధానాన్ని, వ్యక్తివికాసాన్ని లక్ష్యంగా అంగీకరిస్తుంది. మారుచున్న సమాజానికి అనుగుణంగా అభ్యుదయ పథంలో అనుసరించదగిన మౌలిక జీవిత సూత్రం యిది.

విజ్ఞానాన్ని ప్రపంచ శాంతి కొరకు వినియోగించ గలిగితే ప్రస్తుత విషమస్థితినుంచి మానవాళి విముక్తి చెందగలదు. భయ విముక్తుడయిన మానవుని పరిపూర్ణ వికాసానికి పరిమితు లుండకూడదు. ఈ తాత్విక ఆలోచనారీతి మానవ ప్రపంచం ప్రస్తుతం ఎదుర్కొనే సవాలుకు సరియైన జవాబుగా భావించ వచ్చును.

ఇలాంటి తాత్విక ధోరణి స్వేచ్ఛా భావుకతను పోషిస్తుంది. కనుక అన్ని సామాజిక రంగాలలోను విసూత్నమయిన రీతిలో స్వేచ్ఛను పెంపొందించి అభ్యుదయ మార్గాన అడుగులు వేయించగల నూతన భావాన్వేషణమే 'ప్రజా స్వామ్య ప్రచురణల సంస్థ' ధ్యేయం.

అట్టి భావాలను ప్రజాబాహుళ్యానికి ఎరుక పరచటం ఈ సంస్థ ప్రథమ కర్తవ్యంగా భావిస్తుంది. ఇది సాహసమే కావచ్చు. ప్రమాదభరితం కూడా

కావచ్చును. కాని లక్ష్యసాధన కొరకు చేసే యిట్టి కృషిని విస్మరించజాలము. ఈ ప్రయత్నానికి, వ్యాపారానికి స్వేచ్ఛాపిపాసకల వ్యక్తులందరి సానుభూతి, సహకారాలను అర్థిస్తున్నాము.

ఎం. వి. రామమూర్తి
అధ్యక్షుడు
బోర్డ్ ఆఫ్ డైరెక్టర్స్
ప్రజాస్వామ్య ప్రచురణలు (ప్రై) లిమిటెడ్

9. M. I. G. H. కాలనీ
మెహదీ పట్నం
హైదరాబాద్



# ప్రజాసాహిత్య ప్రచురణలు (ప్రై) లిమిటెడ్

సభ్యులు

శ్రీ ఎం. వి. రామమూర్తి

శ్రీ కోగంటి రాధాకృష్ణమూర్తి

శ్రీ గుంటుపల్లి గోపాలరావు

శ్రీమతి మల్లాది వెంకట సుబ్బమ్మ

శ్రీ గురిజాల సీతారామయ్య

శ్రీ కొల్లా సుబ్బారావు

# తొలి పలుకులు

ఫెయిజ్‌పూర్ కాంగ్రెసు (1937) కు వెళ్లిన మిత్రులు కామ్రేడ్ రాయ్‌ని గురించి చెప్పిన కొన్ని విషయాలు విన్నాను. ఆ సంవత్సరం మధ్యలో రాయ్ గుంటూరు వచ్చి అనేక సభలలో ఉపన్యసించగా కొన్నింటికే వెళ్లి వారి ఉపన్యాసాలను ఆసక్తితో వినగలిగాను. 41 లో తెనాలిలో ఆంధ్ర రాష్ట్ర రాడికల్ డెమోక్రాటిక్ పార్టీ అవతరణ సమయంలో వారితో ముఖాముఖి పరిచయం కలిగినది. 46 లో డెహ్రాడూన్ రాజకీయ పాఠశాల తరుణంలో ఆ పరిచయం సన్నిహితత్వాన్ని ఏర్పరచినది. రాయ్ ఆ క్యాంపులో అందరినీ ఆప్యాయంగా పలుకరించి 'కామ్రేడ్ రాయ్'గా వ్యవహరించటం అందరినీ ఆశ్చర్యచకితులు కావించినది.

ఆ రోజుల్లో రాయ్ జీవిత చరిత్ర గురించి నాకు అంతగా తెలియదు. దొరికిన సమాచారాన్ని బట్టి 'యమ్. యన్. రాయ్' పేరుతో ఒక చిన్న పుస్తకం వెలువరించ గలిగాను. దానికి విశేష ప్రాధాన్యత కలుగుటచేత త్వరలో పునర్ముద్రణ జరిగినది. తరువాత కొలది కాలానికే తృతీయ ముద్రణ జరుగవలసిన అవసరం కూడా కనబడినది. కాని అంతటితో ఆ ప్రయత్నం విరమించాను.

రాయ్ మరణానంతరం రాయ్‌ని గురించి జాతీయంగానే కాదు, అంతర్జాతీయంగా అనేక పరిశోధనలు జరిగినై. ఇంకా జరుగుచున్నవి. రాయ్ జీవితం కేవలం ఒక విప్లవ వీరుని గాథ లేక రాజకీయ నాయకుని చరిత్రకు పరిమితం కాదు. అది ఒక మహోజ్వల మయిన మానవ ఉద్యమ చరిత్ర.

రాయ్‌ని గురించి తెలుగులో ఒక ఉద్గ్రంథం వెలువరించాలనే కోర్కె నాలో చాల కాలం నుంచీ వున్నది. రాయ్ రచించిన అనేక గ్రంథాలను పఠించాను. వానితో బాటు రాయ్‌ని గురించి వ్రాసిన ఇతర గ్రంథాలను కూడా కొన్నింటిని పఠించ గలిగాను. ఆ ఫలితమే నా యీ రచన.

నాలుగు సంవత్సరాల క్రితమే ఈ గ్రంథం అచ్చు కావలసి వున్నా కొన్ని కారణాలచేత ఇంతవరకు ఆగవలసి వచ్చినది. 'ప్రజాస్వామ్య ప్రచురణలు' వారి ప్రథమ ప్రచురణగా దీనిని వెలువరించటం నాకు ఎంతో ముదావహంగా వున్నది.

## నా యీ రచనకు తోడ్పడిన రాయ్ గ్రంథాలు

1. M. N. Roy's Memoirs
2. Men I Met
3. India in Transition
4. The Russian Revolution
5. Revolution and Counter Revolution in China
6. My Experience in China
7. Our deferences
8. My Defence
9. India and War
10. Draft constitution
11. People's plan
12. New Orientation
13. New Humanism
14. Beyond Communism

## ఇతర గ్రంథాలు

1. Restless Brahmin —Samaren Roy
2. Communism and Nationalism in India —John Patrik Haith Cox
3. Communism in India —Subodh Roy
4. Contributions of M. N. Roy to political Philosophy —Krishna Chand Jena
5. Evolution of Political Philosophy of M. N. Roy —G. P. Bhattacharje
6. M. N. Roy - Political Biography —V. B. Karnik
7. Documents of Communist Party Vols. I, II

ఆ యా గ్రంథకర్తలకు నా హృదయ పూర్వక కృతజ్ఞతలు. నా యీ రచనను పరికించి అవసరమయిన సలహా, సంప్రదింపులతో మెరుగులు దిద్దుటకు తోడ్పడిన మిత్రులకు, అచ్చులో: ప్రత్యేక శ్రద్ధ తీసికొనిన తెనాలి 'నాగార్జున ప్రింటింగ్ అండ్ బైండింగ్ వర్క్స్' యజమానులకు, పనివారలకు నా అభివందనములు.

రచయిత

# విషయ సూచిక

## జీవితము

## నవ్య మానవ వాద సిద్ధాంతము

☞ గమనిక : 140 వ పేజీ 3 వ లైను "వామపక్ష కమ్యూనిజం - బాలారిష్టం" బదులుగా "వామపక్ష కమ్యూనిజం - చిన్నతనపు అపకతవకలు" అని చదువ ప్రార్థన.

# పరిచయం:

"విద్యార్థిదశలో, అంటే పదునాలుగవయేటనే నా రాజకీయ జీవితం ప్రారంభమయినది. స్వతంత్రజీవిగా, స్వేచ్ఛగా బ్రతకాలని నా మనోసంకల్పం. 'స్వాతంత్ర్యం - సంపూర్ణస్వాతంత్ర్యం' అప్పటి పరిస్థితుల ననుసరించి నూతనంగా స్థిరపడిన ఆదర్శం. పాతభావాలతో, పాత దృక్పథంతో కృషిచేసిన విప్లవకారులు 'స్వేచ్ఛ - సంపూర్ణస్వాతంత్ర్యం' తమధ్యేయంగా దృఢచిత్తులయ్యారు. ఆ రోజుల్లో మాకు కారల్‌మార్క్సునుగురించి ఏమీ తెలియదు. మేము మార్క్సు గ్రంథాలు, రచనలు ఏమీ చదువలేదు. ప్రోలిటేరియన్ విప్లవం అంటే మాకు తెలియదు. అసలు అట్టి వర్గం వున్నట్లే మాకు తెలియదు. విప్లవకారులు అనేకమంది తమ జీవితమంతా జయిళ్ళలోనే వెళ్ళబుచ్చారు. ఎంతోమంది చిరునవ్వులతో ఉరికంబాలు ఎగబ్రాకారు. వారి ఆ సాహసకృత్యాలకూ, ప్రాణత్యాగాలకూ అప్పుడు, అచ్చట ఏ ప్రోలిటేరియన్‌వర్గ వత్తిడి, ప్రభావం కారణభూతం కాలేదు. అసలు 'వర్గ కలహం' అంటే ఏమిటో వారికి తెలియదు. అప్పటి వర్తమాన పరిస్థితులను ఏ విధంగా మార్చాలో వారికి యదార్థంగా తెలియదు కూడాను. అయినా ఏదో ఒక విధంగా వాటిని మార్చాలనే వారి దృఢసంకల్పం. అదే సంకల్పంతో, అదే మనో బలంతో నా రాజకీయజీవితం కూడా ప్రారంభించాను. కారల్‌మార్క్సు రచించిన 'కాపిటల్' మూడు సంపుటాలు లేక మార్క్సిస్టులు రచించిన మూడువందలు, వేల సంపుటాలకంటె యిప్పటికీ అదే సంకల్పం, కాంక్ష, తృష్ణ నా కర్తవ్యానికి ఆదర్శ సూత్రాలు. అట్టి సంకల్పబలం - స్వాతంత్ర్యకాంక్ష మానవ సమాజాభివృద్ధికి ప్రధాన కారణాలని మీరు గ్రహించాలి".

1946 సంవత్సరం మేలో డెహ్రాడూన్‌లో జరిగిన అఖిలభారత రాడికల్ డెమోక్రాటిక్‌పార్టీ రాజకీయ పాఠశాలను ప్రారంభిస్తూ కామ్రేడ్ యమ్. యన్. రాయ్. చెప్పిన మాటలివి. అంతకుముందు 1937 లో కాంగ్రెసుపార్టీ ప్రచారానికి, రెండవ ప్రపంచయుద్ధం తరువాత కాంగ్రెసునుంచి ఒయటకువచ్చి రాడికల్ డెమోక్రాటిక్ పార్టీని స్థాపించి 1941 లో ఆంధ్రప్రాంతంలో పర్యటనకు వచ్చి నప్పుడు ఈ రచయితకు రాయ్‌తో కొలది పరిచయం యేర్పడినది. డెహ్రాడూన్ రాజకీయపాఠశాలలో విద్యార్థిగా పాల్గొనిన యీ రచయిత మొదటి పరిచయం రాయ్

సన్నిహితునిగా పరిణమించటం మహద్భాగ్యంగా భావించాడు. ఆ పాఠశాల జరిగినది కొలదిరోజులే, అయినా ఆ కొద్ది సమయంలోనే రాయ్ తన మేధాశక్తి నంతటినీ అచ్చటికి వచ్చిన వివిధ రాష్ట్రాల పార్టీ నాయకులకు, కార్యకర్తలకు ధారపోయటానికి ప్రయత్నించా డనటంలో అతిశయోక్తి ఏమాత్రం లేదని చెప్ప వచ్చును. 'బ్రిటిషుప్రభుత్వం ఎంత బిగుసుకుకూర్చున్నా మనకు యుద్ధానంతరం స్వరాజ్యం యివ్వకతప్పదని' రాయ్ మా ఎదుట నిలబడి మాకు ఉపదేశించినప్పుడు మాలో హెచ్చుమంది 'అంత త్వరలో మనకు స్వరాజ్యంవస్తుందా' అనే భావనలో వుండిపోయాము. రెండవ ప్రపంచయుద్ధం ప్రారంభమయినప్పటినుంచి కామ్రేడ్ రాయ్ 'ఇది ఫాసిస్టు వ్యతిరేకయుద్ధం. కనుక ఏ షరతులు లేకుండానే యిందులో మనం ఫాసిజానికి వ్యతిరేకంగా బ్రిటిషు ప్రభుత్వంతో కలసి పోరాడాలి. ఫాసిజాన్ని వోడించగలిగితే భారతదేశానికి బ్రిటిషు ప్రభుత్వం దానంతటదే అధికారం అప్పగించక తప్పదు. ఒకవేళ ఫాసిజం గెలిస్తే మొత్తం మానవప్రపంచానికే ముప్పుతప్పదు' అని బాహాటంగా వెల్లడించుతూ వచ్చాడు. ఇది రాడికల్సులోనే మొదట కొంత మందికి నమ్మశక్యంగా కనబడలేదు. రాను రాను రాయ్ భావన వాస్తవరూపం దాల్చినది. మేము డెహ్రాడూన్‌లో వుండగానే బెంగాలు కార్మికనాయకుడు రజనీ ముఖర్జీనుంచి రాయ్‌కి టెలిగ్రామ్ వచ్చినది. "మీ దూరదృష్టికి అనేక ధన్యవాదాలు. బ్రిటిషు ప్రభుత్వం భారతీయులకు అధికారం అప్పగించటానికి అంగీకరించినది," అని అందులోని వార్త. అచ్చట సమావేశంలో వున్న మేమంతా ఎంతో ఉల్లాసంలో మునిగిపోయాము. ఎలెన్‌రాయ్ మా అందరికీ స్వీట్సు పంచిపెట్టినది. యమ్. యన్. రాయ్ కిది ఏమంత ఆశ్చర్యంగా, వుల్లాసంగా కనబడలేదు. రజనీముఖర్జీకి ప్రత్యుత్తరంగా 'హండ్రెడ్ యండ్ వన్ లెఫ్ట్ కాంప్లిమెంట్సు' అని టెలిగ్రామ్ పంపమని ఎలెన్‌రాయ్‌కి సూచించాడు. రాయ్‌లో మూకీభావం ఏర్పడినది. ముఖ బింబములో గాంభీర్యత అలముకొన్నది. 'ఇంతటితో మనకార్యం గట్టెక్కినట్లు మీరు భావించకూడదు. మన గమ్యస్థానం దరిదాపులలో లేదు. మనం యింకా చాల దూరప్రయాణం చేయవలసివున్నది' అని ఆనాటి సమావేశాన్ని ముగించాడు.

*   *   *   *

1857 సిపాయి మ్యూటినీ, నిద్రాణంలో వున్న భారత ప్రజానీకాన్ని మేల్కొలపటమేకాక ఒకవిధంగా బ్రిటిషు సామ్రాజ్యాధికారులకు కనువిప్పు కూడా కలిగించినది. ఈస్టు ఇండియా కంపెనీ స్థానంలో బ్రిటిషు ప్రభుత్వం అధికారం

చేపట్టినా దేశంలో శాంతి నెలకొనలేదు. ఒకవంక పరపీడన, మరొకవంక దేశీయ భూస్వాముల, జమీందారుల రక్తపిపాస మరియు వీటికితోడు దేశంలో సంభవించిన కరువు కాటకాదులు జాతిని నిర్వీర్యమొనర్చుటయేగాక దారిద్ర్యం విలయతాండవ మొనర్చసాగినది. వలసరాజ్యతత్వంతో చేతివృత్తులను బ్రిటిష ప్రభుత్వం నాశనం చేయగా, శిస్తులు, బకాయిలు, సిబ్బంది ఖర్చులు, పరిపాలన వ్యయం వగైరా, వగైరా పేర్లతో జమీందారులు గ్రామికరైతులను పీల్చి పిప్పిచేయటం తటస్థించినది. సామాన్య ప్రజానీకం తమ నిత్యదారిద్ర్యానికి, నికృష్ట జీవితానికి 'కర్మ' కారణంగా తృప్తి చెందటం వినా వారికి వీటిని అధిగమించగల మరోమార్గం కనబడలేదు. ఆర్థికంగా సమాజం అధఃపాతాళంలో క్రుంగి కృశించి పోవటంతోపాటు సాంఘికంగా మూఢవిశ్వాసాలతో, బూజుపట్టిన పాతభావాలతో నిండి నిబిడీకృతమై జీవచ్ఛవము కాసాగినది.

బ్రిటిష ప్రభుత్వం తన అధికారం భారతదేశంలో సుస్థిరం చేసుకొనాలనే తలంపుతో ఇంగ్లీషుభాషను ప్రవేశపెట్టినది. భారతీయులను కేవలం గుమాస్తా ఉద్యోగాలకు పనికివచ్చే సిబ్బందిగా తయారుచేసి తమ పరిపాలన కొనసాగించాలని ఇంగ్లీషువారి తలంపు. బ్రిటిషువారు తమ పెట్టుబడులతో అచ్చటచ్చట కొన్ని పరిశ్రమలు, ఫ్యాక్టరీలు నెలకొల్పి భారత ఖనిజ సంపదను, మానవశ్రమను కొల్లగొట్టటానికి ప్రయత్నించారు. ముడిసరుకులు లోతట్టు ప్రదేశాలనుంచి సముద్ర తీరాలకు చేరవేయటానికి దేశంలో రైల్వేలు, రహదారులు నిర్మించటం జరిగినది. అంధకారబంధురమయిన భారతావనిలో అచ్చటచ్చట ఆశాకిరణాలు వెలుగొంద సాగినవి. ఇవే క్రమేపి విప్లవకణాలుగా ప్రజ్వలించినవి.

అంతవరకు ముక్కచెక్కలుగా, ఖండఖండాలుగావున్న భారతావని బ్రిటిషు యేలుబడితో స్వదేశీరాజులను మినహాయించి సమైక్యం చేయబడినది. (స్వదేశీరాజులు కూడా బ్రిటిషువారి తాబేదార్లుగానే వ్యవహరించారు) పాశ్చాత్యభాష, నాగరికతలు దేశంలో మధ్యతరగతి, మేధావుల ప్రాబల్యానికి, నూతనభావాల ప్రచారానికి దోహదం కలుగజేసినవి. బ్రిటిషు పరిశ్రమలకు అనుబంధంగా దేశీయ వర్తకము, వాణిజ్యము పెంపొందసాగినవి. నూతన పట్టణాలు, నగరాలు వెలసినవి. జనం పల్లెలనుంచి పట్టణాలకు వలసవెళ్లటం ఎక్కువయినది. పంటపొలాల్లో పనిచేసే శ్రామికులు ఫ్యాక్టరీ కార్మికులుగా జీవనం సాగించవలసివచ్చినది.

ఈ మార్పులు ఒక విధంగా సామాన్య ప్రజానీకాన్ని పీడించి వారి శ్రమను దోపిడీ చేయటానికే జరిగినవి. ఆర్థిక పరిస్థితుల్లో ఏ మాత్రం మెరుగులేదు. సామాజిక పరిస్థితులు అంతకంటె హీనంగానే వున్నవి. పల్లెల్లో, గ్రామాల్లో పనిలేక, తిండిలేక పొట్టచేతబట్టుకొని ఆలు, బిడ్డలతో పట్టణాలకు గంపెడాశతో వెళ్లిన జనం అచ్చటా పనిదొరకక, దొరికినా రోజుకు పదిహేను, పదహారు గంటలు ఫ్యాక్టరీల్లో పనిచేస్తూ, యిచ్చినది తమకే చాలక కుటుంబాలు పస్తులు వుండటం, కప్పుకొనటానికి గుడ్డ, వుండటానికి వసతీ లేక నానా బాధలు పడటం మామూలు జీవితంగా పరిణమించినది. తిరిగి గ్రామాలకు వస్తే వారికి అక్కడ పనిదొరుకుతుందనే ఆశలేదు. కాబట్టి ఏదో ఆశతో పట్టణాలను అంటిపెట్టుకొనటం వినా వారికి గత్యంతరం కనబడలేదు.

ప్రజల్లో అసంతృప్తి తీవ్రస్థాయికి చేరినది. పొలాల్లో పనిచేసే రైతులు, ఫ్యాక్టరీలలో పనిచేసే కార్మికులు, చదువు, సంస్కారాలు వున్నా వుద్యోగాలు, తగిన జీవనవసతిలేని మధ్యతరగతి కుటుంబీకులు, కులవృత్తులను, చేతివృత్తులను, కోల్పోయిన కళాకారులు, చిన్న చిన్న వర్తకులు, వ్యాపారస్తులు మొదలయిన వారంతా యీ అసంతృప్తికి లోనయినవారే. దాదాపు దేశవ్యాప్తంగా 19 వ శతాబ్దం చివరి భాగంలో యావత్తు భారతదేశం యిదే పరిస్థితులలో వున్నది. దీని ఫలితంగా బ్రిటిషు ప్రభుత్వంమీద తీవ్రంగా వ్యతిరేకత పెరుగసాగినది.

ముఖ్యంగా వంగరాష్ట్రానికి యిచ్చట ప్రథమస్థానం యివ్వటం అవసరం. ఇంగ్లీషు భాషాప్రాబల్యం వలననేమి, పాశ్చాత్యనాగరికతా ప్రభావం వలననేమి మిగిలిన భారతదేశంలోకంటె బెంగాలులో ముందుగా నూతనభావ పరిణామం, వికాసం హెచ్చుగా జరిగినవి. తత్ఫలితంగా రాజారామమోహనరాయ్, ఈశ్వరచంద్ర విద్యాసాగర్, పండిత ద్వారకానాథ్ విద్యాభూషణలాంటి మేధావులు సాంఘిక, సాంస్కృతిక రంగాల్లో నూతనభావాలకు అనుగుణంగా సంస్కరణలకు పూనుకొన్నారు. పారిశ్రామిక అభివృద్ధికి, ఆర్థిక అసమానతలు తొలగటానికి రాజకీయ అధికారం అవసరం కనుక మితవాదులు జాతీయ కాంగ్రెసును 1885 లో స్థాపించి పిటీషనులు, మహజరులు, తీర్మానాలద్వారా బ్రిటిషు ప్రభుత్వాన్ని అర్థించసాగారు. ఇందుకు ప్రభుత్వంలో యేమాత్రం చలనం లేకపోవటంతో బాలగంగాధర్ తిలక్, బిపిన చంద్రపాల్, లాలా లజపతిరాయ్ (బాల్, పాల్, లాల్) తీవ్రవాద రాజకీయాలను

ప్రచారం చేసారు. బంకిమ్ చంద్ర చటర్జీ తనరచనలు, ముఖ్యంగా 'ఆనందమఠం' ద్వారా పరాయి ప్రభుత్వంమీద తిరుగుబాటును రేకెత్తించితే, విశ్వకవి రవీంద్రనాధ్ టాగూరు తన కవిత, గేయ రచనలద్వారా జాతీయభావాలను పెంపొందించారు. వివేకానంద్, అరవింద్ ఘోష్ జాతీయభావాలతోపాటు హిందూమతాన్ని సంస్కరించటానికి, 'ఆధ్యాత్మిక సంపద'ను పెంపొందించటానికి ప్రయత్నించారు.

"ఇప్పుడు మనదేశానికి కావలసినది ఇనుపకండరాలు, ఉక్కునరాలు, అంతకంటె దృఢతరమయిన, శక్తివంతమయిన మనోసంకల్పం." ఇది వివేకానందుని సందేశం.

భగవద్గీతను గురించి విపులీకరిస్తూ "ఐహికజీవితంలోనేగాదు, ఆముష్మిక జీవితంలో కూడా దుర్బలులకు స్థానం లేదు. బలహీనత బానిసత్వానికి దారితీస్తుంది. బలహీనత మరణంతో సమానం" అని ప్రబోధించాడు.

వివేకానందుని శిష్యురాలు ఐరిష్ వనిత నివేదిత "మోక్షసాధనకృషికి ముందు జాతికి, దేశానికి విమోచన కలిగించటానికి మీ కృషిని తీవ్రతరం చేయండి" అని భారతీయులను హెచ్చరించింది.

అరవింద్‌ఘోష్ 'భవానీ మందిర్' అనే కరపత్రంలో 'విప్లవమార్గం-ఆదర్శం' గురించి విపులంగా వివరించాడు. అరవిందుని సోదరుడు బిరిన్ విప్లవకారుల రహస్యసంఘాలకు నాయకత్వం వహించాడు.

మితవాద, మతవాద రాజకీయాలతో, మహజర్లతో, విజ్ఞాపనలతో, చివరకు కాంగ్రెసులోని తీవ్రవాద రాజకీయాలతో కూడా తృప్తిచెందని బెంగాలు మధ్యతరగతి యువకులు రహస్య విప్లవసంఘాలను స్థాపించారు. దౌర్జన్యపూరితం, హింసాత్మకం అయిన బ్రిటిషు ప్రభుత్వాన్ని 'చాణుక్యనీతి' ననుసరించి దౌర్జన్యం, హింసా పద్ధతుల ద్వారానే ఎదుర్కొనటం వీరి ప్రధానధ్యేయం. తద్వారానే భారత జాతికి విముక్తి కలుగుతుందని వీరి దృఢవిశ్వాసం. ఇందుకు కత్తులు, కటారులు, తుపాకులు, పిస్తోలులు, బాంబులు వుపయోగించారు. దౌర్జన్యకాండలు, దోపిడీలు, హత్యలు కూడా జరిగినవి. ఇలాంటి వాతావరణంలో, ఇట్టి పరిస్థితులలో యమ్. యన్. రాయ్ పుట్టిపెరగటం జరిగినది.



# బాల్యం :

యమ్. యన్. రాయ్. అసలు పేరు నరేంద్రనాధ్ భట్టాచార్య. బ్రాహ్మణ కుటుంబం. జననం 1887 సంవత్సరం మార్చి 21. తండ్రి దీనబంధు భట్టాచార్య పూజారి. వంగరాష్ట్రంలోని మిద్నపూర్ జిల్లా ఖేత్ పుట్ గ్రామవాసి. ఆ గ్రామం లోని ఖేత్ పుటేశ్వరి ఆలయ పూజారిగా వుండేవాడు. అచ్చటి ఆచారం ప్రకారం పూజారి వంశంలోని ప్రథమపుత్రుడు పూజారికావటం పరిపాటి. దీనబంధు భట్టా చార్యకు తొమ్మిదిమంది సోదరులు, ఒక సోదరి కలరు. దీనబంధు ఆ గ్రామం వదలిపెట్టి వేరే దూరప్రాంతంలో నివాసం యేర్పరచుకొనినా ఆలయ ఉత్సవ సమయంలో సంవత్సరమున కొకపర్యాయము అచ్చటికివచ్చి ఆలయంలో క్రతువులు, పూజలు చేయించుట కద్దు. మిగిలిన కాలంలో తనకు బదులుగా తన సోదరులలో ఒకరిని ఆలయ పూజలు జరుపుటకు ప్రతినిధిగా నియమించుతూ వుండేవాడు. ఖేత్ పుటేశ్వరి ఆలయంమీద వచ్చే ఆదాయాన్ని వదలివేసి దీనబంధు వంగరాష్ట్రం లోని ఇరువదినాలుగు పరగణాల జిల్లాకు చెందిన కొడాలియా గ్రామంలో ఒక పాఠశాలలో సంస్కృత పండితునిగా ఉపాధ్యాయవృత్తిని స్వీకరించాడు. ఇద్దరు సంతానం తరువాత మొదటి భార్య గతించినది. రెండవ వివాహం జరిగినది. నరేంద్రనాధ్ భట్టాచార్య రెండవభార్యకు మూడవ సంతానం. ఇచ్చటనే నరేంద్రుడు సంస్కృతము, ఇంగ్లీషు, బెంగాలీ భాషల నభ్యసించుటకు స్కూలులో ప్రవేశించాడు.

చిన్నతనంనుంచీ నరేంద్రుడు రాజకీయాలన్నా, విప్లవం అనినా మిక్కిలి ఆసక్తితో వుండేవాడు. ఆర్థిక పరిస్థితులు సరిగ్గా లేకపోయినా కుమారుని చురుకు దనము చూచి తండ్రి నరేంద్రుని ఉన్నతవిద్య కొరకు కలకత్తా పంపాడు. అచ్చట నరేంద్రుడు విద్యాభ్యాసముతోపాటు విప్లవ రాజకీయాల్లో పాల్గొనసాగాడు. వినాయక దామోదర సావర్కార్, బంకింమ్‌చంద్ర ఛటర్జీ, స్వామి రామతీర్థ, వివేకానంద, అరవింద్ ఘోష్ మొదలైనవారి రచనలకు ప్రభావితుడై రహస్య విప్లవ సమా వేశాల్లో పాల్గొంటూవుండేవాడు. కొంతకాలం నరేంద్రుడు అరవిందుడు స్థాపించిన జాతీయ కళాశాలలో, తరువాత కొద్దికాలం ఒక టెక్నికల్ కళాశాలలో విద్య నభ్యసించాడు.

1899 లో దీనబంధు తన రెండవ మామగారి గ్రామం చింగ్రిపోట తరలివెళ్లి అక్కడే నివాసం యేర్పరచుకున్నాడు. ఆ గ్రామం కలకత్తాకు పన్నెండు మైళ్ల దూరంలో ఇరువది నాలుగు పరగణాల జిల్లాలోనే గంగానది వొడ్డున వున్నది. తన అంతిమ జీవితం పవిత్ర గంగానదీ తీరాన గడపాలని దీనబంధు వాంఛ. దీనబంధు మామగారికి ఏకైక పుత్రికాసంతానం కావటం కూడా వారు ఆ గ్రామం తరలి వెళ్లటానికి కొంతకారణం కావచ్చు. మామగారు తన సంపాదనలో మిగిలిన దంతా అల్లునికిస్తూ వుండేవాడు. చివరకు తన స్థిర, చరాస్తులను దీనబంధుకు సంక్రమింప చేయటంకూడా జరిగింది.

చింగ్రిపోట, ఆ పరిసరగ్రామాలు కలకత్తానగరానికి సమీపంలో వుండటం చేత పాశ్చాత్యనాగరికతకు, వేషభాషలకు కొంత ప్రభావితమయి ముందడుగు వేయసాగినవి. సంఘ సంస్కరణోద్యమానికి, భావవికాసానికి అవి కేంద్రాంగా రూపొందినవి. ప్రముఖులయిన అనేకమంది మత, సాంఘిక సంస్కర్తలకు అవి జన్మస్థలాలు. రాజా నారాయణబోసు (అరవిందుని తల్లి తండ్రి), ద్వారకానాథ విద్యాభూషణ (ఈశ్వరచంద్రవిద్యాసాగరుని సన్నిహితుడు), పండిత శివనాథశాస్త్రి మొదలగువారు ఇచ్చటనే జన్మించారు. శివనాథశాస్త్రి 19 వ శతాబ్దపు బెంగాలు పండితులలో ప్రముఖ వ్యక్తిగా రాణించాడు. ఆయన తన జందెపుపోగులను త్రెంచివేసి బ్రహ్మసమాజములోచేరి ముందంజవేసిన వ్యక్తి. శివనాథశాస్త్రి నరేంద్రనాథ భట్టాచార్య తల్లికి పినతండ్రి. వీరి ప్రభావం, పలుకుబడి ఆ ప్రాంతపు యువకులు రకరకాలుగా ముందుకు సాగటానికి యెంతో దోహదకారి అయినవి.

రాజనారాయణబోస్, శివనాథశాస్త్రి 19 వ శతాబ్దము చివరిలో రహస్య విప్లవసంఘాన్ని స్థాపించటానికి ప్రయత్నించిన వారిలో ముఖ్యులు. మిగిలిన యువకులతోబాటు నరేంద్రనాథ్‌భట్టాచార్య మీద వీరి ప్రభావం చెరగని ముద్రగా పడినది. వీరితోబాటు నరేంద్రనాథ్ విద్యాభ్యాసంచేసే పాఠశాల ప్రధానోపాధ్యాయులు దత్తు ప్రభావం కూడా మిళితమయినది. దత్తు బ్రహ్మసమాజవాది. కీర్తిశేషులు 'ద్వారకానాథ్ విద్యాభూషణ' జ్ఞాపకచిహ్నంగా ఒక గ్రంథాలయం స్థాపించాడు. ఆ గ్రంథాలయ అభివృద్ధికొరకు నరేంద్రనాథ్ దత్తుకు కుడిభుజంగా వుండి సాంఘిక, సాంస్కృతిక కార్యకలాపాల్లో సహాయపడుతూ వుండేవాడు.

ఆకాలంలో 'బోసు సర్కసు' బెంగాలులో ప్రసిద్ధి గాంచిన సర్కసుగా బహుళవ్యాప్తంగా అందరి మన్ననలు పొందినది. స్వామి వివేకానంద్ ఆ సర్కసును

గురించి 'బెంగాలీలు తమ శారీరకబలంతో కార్యం ఎలా సాధించగలరో మోతీ (బోసు) చక్కగా చూపిస్తున్నాడు' అని చెప్పినాడు. ఈ 'సర్కసు' వలన కూడా నరేంద్రనాథ్ కొంతవరకు ప్రభావితుడయ్యాడు.

చిన్నతనంనుంచీ నరేంద్రనాథ్‌కు సాహసకృత్యాలంటే మక్కువ ఎక్కువ. సాహసోపేతమయిన కథలు చదువుతూ తానూ ఆ కథానాయకుని మాదిరిగా వీరోచితకృత్యాలు చేయాలని కలలుకంటూ వుండేవాడు. ఎంతదూరమయినా, పగలు, రాత్రి అనకుండా గాడాంధకారంలో కూడా నడచివెళ్లటం నరేంద్రనాథ్‌కి సరదా. ఎప్పుడూ, ఏదో ఆలోచిస్తూ దేనికొరకో అన్వేషిస్తూ వుండటం ఆయనకు అలవాటు. ఎక్కువ కాలం, ముఖ్యంగా రాత్రులందు స్మశానవాటికలలో ఏకాంతంగా గడపటం ఆయనకు పరిపాటి. రాను రాను యీ స్మశానవాటికలే విప్లవకారుల రహస్య సమావేశాలకు భూమికలయినవి. హరికుమార్‌చక్రవర్తి (బెంగాలీ విప్లవకారుడు), నరేంద్రనాథ్ బాల్యంలో పెనవేసిన మిత్రులుగా రహస్యసమావేశాలకు హాజరవుతూ వుండేవారు.

సాహసకృత్యాలమీద మమత, ఏవో అవ్యక్తమయిన నిగూఢరహస్యాలను తెలుసుకోవాలనే వాంఛ, పట్టుదల నరేంద్రనాథ్‌ని విశ్రాంతి నెరుగని జీవిగా మార్చినవి. స్వామి వివేకానంద్ స్థాపించిన బేలూరు మఠం చింగ్రిపోటకు దాదాపు ముప్ఫయిమైళ్ల దూరంలో వున్నది. నరేంద్రనాథ్ ఎక్కువగా అచ్చటకు నడిచి వెళ్లుతూ వుండేవాడు. అంతేగాదు ఆ చుట్టూవున్న యితర మఠాలు, ఆశ్రమాలు కూడా తరచుగా దర్శిస్తూ వుండేవాడు. జ్ఞానం పొందాలని, సత్యాన్ని వెలికితీయాలని నరేంద్రుని ఆకాంక్ష. తండ్రి సంస్కృత పండితుడు కావటంచేత కుమారునికి బాల్యంనుంచి సంస్కృతభాష నేర్పి అందులో అభిరుచి కలిగించాడు. తత్ఫలితంగా ప్రాచీన హిందూ తత్వశాస్త్రాన్ని కూలంకషంగా తెలుసుకోవాలనే తృష్ణ నరేంద్రనాథ్‌లో జనించినది.

తన పదునాల్గవయేటనే నరేంద్రనాథ్ శివనారాయణస్వామిని దర్శించాడు. వీరు సిపాయి మ్యూటినీలో పాల్గొనినవ్యక్తి. తరువాత అంతర్ధానులై, స్వామిగా అవతరించి ఆశ్రమం స్థాపించారు. 'వర్ణవ్యవస్థ హిందూమత నాశనానికి ప్రధాన కారణం, సమాజ పతనానికి అందులో ప్రవేశించిన చెడుగుణాలు ముఖ్యకారణం' అని వీరి వాదన. కాబట్టి వైదికమతాన్ని యథాతథంగా పునరుద్ధరించినప్పుడే

సమాజం, దేశం బాగుపడగలవని' వీరి ప్రగాఢవిశ్వాసం. బాలుడయినా నరేంద్రుని పట్టుదలకు, స్థిరసంకల్పానికి శివనారాయణస్వామి ముగ్ధుడయినాడు. ఆశ్రమరీతులను ఉపదేశించాడు. యోగాభ్యాసంలో క్రమపద్ధతులను బోధించిచాడు. విప్లవరాజకీయాల్లో ఉత్సుకత, ఉత్తేజం కలిగించాడు. లాఠీప్రయోగము, కర్రసాము, కత్తిసాములు నేర్పాడు. శివనారాయణస్వామి సూర్యోపాసకులు. సూర్యోపాసనగురించి నరేంద్ర నాధ్ వారిదగ్గర అనేక విషయాలు తెలుసుకున్నాడు. అప్పుడప్పుడూ నరేంద్రనాధ్ తన మిత్రుడు హరికుమార చక్రవర్తితో "సూర్యభగవానుడు సకల జీవరాసులకు ప్రాణప్రదాత. సకలజీవులకు శక్తిని, బలాన్ని యిస్తున్నాడు. కాబట్టి అట్టి సూర్య భగవానుని తెలుసుకోవాలని నా ఆకాంక్ష" అని చెప్పుతూవుండేవాడు.

కొడాలియా గ్రామంలో వున్నప్పుడే నరేంద్రనాధ్ పూనాలోని ప్రముఖ జాతీయవాదులయిన చపాట్కార్ సోదరులను గురించి, వారు స్థాపించిన సైనిక శిక్షణాలయం గురించి విన్నాడు. వారి వివరాలను, గోఖలే మీద బ్రిటిష ప్రభుత్వం 1897 లో దేశద్రోహ కార్యకలపాలపేరుతో అభియోగించిన నేరవివరాలను గురించి నరేంద్రనాధ్ శివనారాయణస్వామిని అడిగి తెలుసుకున్నాడు. విప్లవరాజకీయాల్లో నరేంద్రుని శ్రద్ధాసక్తులు స్వామికి నరేంద్రుని ఆత్మీయుని చేసినది. 'ముక్కుపచ్చ లారని బాలునిలో భావిభారత భాగ్యోదయం పెల్లుబకటం' స్వామి గ్రహించాడు. నరేంద్రుని బాలహృదయంలో జాతీయభావాలకు విప్లవబీజాలను నిండుహృద యంతో అంకురార్పణ చేసాడు. 'సంఘాన్ని మూఢవిశ్వాసాలనుంచి దేశాన్ని పర దాస్యంనుంచి విముక్తి కావించు', అని నరేంద్రుని ప్రేరేపించి దీవించాడు. నరేంద్రునికి గీతను గురించి విపులీకరిస్తూ "ఉన్నతాదర్శంకొరకు ముందుకు సాగు తున్నప్పుడు విజయంకొరకు తహ తహ పడనక్కర్లేదు. ఆదర్శం గొప్పదయినప్పుడు సాధన లెలాంటివని పరికించ నక్కర్లేదు; ఇదే గీతారహస్యం" అని ప్రబోధం చేసాడు.

అప్పటికీ నరేంద్రునిలో తృప్తి కనబడలేదు. ఇంకా ఎక్కడో ఏదో నిగూఢ మయిన రహస్యాన్ని తెలుసుకోవాలనే వాంఛ, తృష్ణ నరేంద్రునిలో మిగిలి వున్నవి. వివిధ మఠాలు, ఆశ్రమాలు సందర్శించాడు. ఎంతోమంది సన్యాసులను, గురువులను దర్శించాడు. వారి బోధనలు, ఉపదేశాలు శ్రద్ధగా ఆలకించాడు. ఒకమారు ప్రఖ్యాత వైష్ణవసాధు రామదాస్ బాబాజీ దర్శనంచేసుకొనటం జరిగినది. బాబాజీ నరేంద్రనాధ్

శ్రద్ధాసక్తులను గమనించి తన శిష్యునిగా చేసికొనుటకు సంకల్పించాడు. కాని నరేంద్రనాథ్ అందుకు సమ్మతించలేదు. ఆయనకు మతం ప్రధానంగా కనబడలేదు. అంతకంటె ముఖ్యమయినది, యదార్థమయిన దానికొరకు నరేంద్రుని మనస్సు అన్వేషింపసాగినది.

'సత్యాన్వేషణ - స్వాతంత్ర్యం' నరేంద్రుని చరమలక్ష్యంగా స్ఫురించినవి. ఈ అన్వేషణలో 1904లో నరేంద్రుడు ఒకనాటి రాత్రి తన ముఖ్య అనుచరులయిన హరికుమార్, శైలేశ్వరులతో 'మనం ఏదో ఒకటి చేయాలి' అని బయటికి పొంగటం, తెల్లవారకముందే వారు యదార్థమయిన స్వాతంత్ర్య గమ్యాన్ని, స్వరూపాన్ని తెలుసుకొనటానికి పున్నగ్రామం విడిచి వెళ్ళటానికి నిశ్చయించుకోవటం, అనుకొనటమే తరువాయి ఊరువదలి బయలుదేరటం జరిగినది.

నరేంద్రనాథ్ ఆర్బేలియా గ్రామం చేరుకొని తన పెదతండ్రి కుమారుడు అవినాశభట్టాచార్యను కలుసుకొన్నాడు. అవినాశ అప్పటికే జతీంద్రనాథ్‌ముఖర్జీ స్థాపించిన రహస్య విప్లవసంఘంలో చేరి విప్లవ కార్యక్రమంలో నిమగ్నుడయి వున్నాడు. అవినాశభట్టాచార్య నరేంద్రుని రాజకీయ గురువు. తమ్ముని రాకకు కారణం తెలుసుకున్నాడు. విప్లవసంఘాల ఆదర్శం, దేశం నలుమూలలా వాటిని స్థాపించవలసిన అవశ్యకతను గురించి నరేంద్రునితో ముచ్చటించి బరిన్ ఘోష్‌కు (అరవిందుని సోదరుడు) పరిచయం చేసాడు. నరేంద్రనాథ్ చింగ్రిపోట తిరిగివచ్చి తన ఆప్తమిత్రులతో కలసి రహస్య విప్లవసంఘాన్ని స్థాపించాడు. అది అనతికాలంలోనే చింగ్రిపోట విప్లవవర్గంగా అభివృద్ధి చెంది జతీంద్రనాథ్‌ముఖర్జీకి ప్రముఖ విప్లవసంస్థగానూ, జుగంతరపార్టీకి కుడిభుజంగానూ పరిణతి చెందినది.

ఇంతవరకు ఒకప్రక్క రాజకీయవాదం, మరోప్రక్క ఆధ్యాత్మిక వాదంతో వూగిసలాడుతూ డోలాయమాన మనస్కుడయిన నరేంద్రుని మనస్సు బెంగాలు విభజనతో పూర్తిగా విప్లవ జాతీయవాదంపైపు మొగ్గినది. అప్పటినుంచి నరేంద్రనాథ్ తన వునికిని, ప్రాణాలను కూడా లెక్కచేయకుండా స్వాతంత్ర్య పథంలో, సత్యాన్వేషణలో ముందంజవేస్తూ దేశం నలుమూలలా, ప్రపంచం నలుచెరగులా తిరిగి ఎన్నో సాహసకృత్యాలను, వీరోచితఘట్టాలను చేపట్టి తన జీవితమంతా ఆ సుదీర్ఘ యాత్రలోనే వినియోగించటం చరిత్రలో అద్భుతగాథగా నిలచిపోయినది.

తండ్రి దీనబంధుభట్టాచార్య 1905 లో మరణించాడు. కుమారుడు ఇంటిపట్టున వుండక 'అగమ్యగోచరుడు,' 'దేశద్రిమ్మరి' అయినందుకు ఏమాత్రం విచారాన్ని పొందకపోగా ఆత్మసంతృప్తిని పొందకలిగాడు. తన పుత్రుడు సుపుత్రుడయి తనకు కీర్తి, ప్రతిష్టలు తేగలడనే ఆశ తండ్రిలో లేకపోలేదు. ఇక కొద్ది కాలంలో మృత్యువును చేరబోయేముందు తన పెద్దకుమారుడు సుశీలను దగ్గరకు పిలుచుకొని 'దోనా' (నరేన్) చాలా చాలా పెద్ద ఆదర్శాలతో పయనం సాగిస్తున్నాడు. 'వాణ్ణి జాగ్రత్తగా చూడు' అని మరీ, మరీ చెప్పటం జరిగినదట. తండ్రిగారి అంతిమకోర్కెను సుశీల, ఆతని చెల్లెండ్రు అక్షరాలా పాటించారు.

## ముందడుగు :

దేశంలో, ముఖ్యంగా బెంగాలులో అసంతృప్తి, అశాంతి, అల్లర్లు, అరాచకం యేర్పడటంతో 1905 లో అప్పటి వైస్రాయ్ లార్డు కర్జను బెంగాలును రెండుగా విభజించటం జరిగినది. ఇది 'విభజించి పరిపాలన సాగించే పద్ధతి'కి నాంది. 'పరిపాలనా సౌలభ్యం' పేరుతో మతాలను విడగొట్టటం జరిగినది. ఒకటి హిందువులు మెజారిటీ రాష్ట్రంగా, రెండవది మహమ్మదీయులు మెజారిటీ రాష్ట్రంగా బెంగాలు విభజించబడినది. రెండింటిలోనూ అల్పసంఖ్యాకవర్గాలు వెలసినవి. బ్రిటిషు ప్రభుత్వం మీద ఆకాలంలో ఎదురుతిరిగినది హెచ్చుగా హిందూమతస్థులే. కనుక వీరికి వ్యతిరేకంగా బ్రిటిషు ప్రభుత్వం ముస్లిములను చేరదీసి రెచ్చగొట్టే ప్రయత్నమే బెంగాలు విభజన.

విభజనకు వ్యతిరేకంగా బెంగాలులో తీవ్రఆందోళన బయలుదేరినది. జాతీయ కాంగ్రెసు మహాసభలో 'వందే మాతరం' గీతాలాపన జరిగినది. సిస్టరు నివేదిత అదే కాంగ్రెసు వేదికమీద "వ్యక్తిగతంగా భారతీయులు ముక్తి - మోక్షం కొరకు ప్రాకులాడే బదులు రాజకీయంగా దేశానికి స్వతంత్రం లభించటమే పరమావధిగా భావించి అందుకు కృషిచేయటం అవసరం" అని ఎలుగెత్తి చాటినది. అరవిందుడు 'భవానీమందిర్' అనే ఒక కరపత్రం ప్రకటించి అందులో విప్లవకారులు చేపట్టవలసిన కార్యక్రమం, వారి ఆదర్శం గురించి విపులంగా సూచించాడు.

విప్లవకారులు బంకిమ్‌చంద్ర చటర్జీ 'ఆనందమఠం', వివేకానందుని 'కర్మ యోగము', మజినీ, గారిబాల్డి జీవితాలు, ఇటలీ, ఫ్రెంచి, ఐరిష్ విప్లవాలు, రష్యా మీద జపాను విజయం (1904) మొదలయినవి మార్గసూత్రాలుగా చేపట్టి వాటిని ప్రజానీకంలో బహుళప్రచారం చేయసాగారు.

నరేంద్రనాథ్ అప్పుడు తన జీవితం విద్యార్థిగానే గడుపుచున్నాడు. అయినా తరచుగా బెంగాలు విభజన వ్యతిరేక ప్రదర్శనలకు, సమావేశాలకు, తన గ్రామం నుంచి కలకత్తాకు వచ్చి వాటిల్లో పాల్గొనటం, తనతోపాటు మరికొందరిని వెంటతీసుకొని రావటం, కలకత్తావచ్చినప్పుడల్లా అచ్చటి విప్లవసంఘమయిన 'ఆత్మోన్నతిసమితి' కార్యకర్తలను, నాయకులను కలుసుకొంటూ విప్లవ కార్యక్రమం గురించి చర్చిస్తూ వుండేవాడు. నరేంద్రుని రహస్య కార్యకలాపాలు పాఠశాల ప్రధానోపాధ్యాయుని దృష్టికి వచ్చినవి. రెండు మూడుసార్లు వారు నరేంద్రుని మందలించి తీవ్రంగా హెచ్చరించటం కూడా జరిగినది. అయినా నరేంద్రునిలో ఏమాత్రం సడలింపు జరుగలేదు.

బెంగాలు విభజనకు వ్యతిరేకంగా 'భారత జాతీయవాద పిత' సురేంద్రనాథ్ బెనర్జీ బెంగాలు ప్రాంతంలో నలుమూలలా పర్యటించి సమావేశాలు జరిపి ఉపన్యసించ సాగాడు. నరేంద్రుడు బెనర్జీని తమ గ్రామం ఆహ్వానించాడు. పాఠశాల ప్రాంగణంలో సభను ఏర్పరచటానికి ప్రయత్నించగా ప్రధానోపాధ్యాయులు అందుకు అంగీకరించలేదు. అయినా నరేంద్రుడు తన పట్టుదల విడువక పాఠశాలకు సెలవు సమయం చూచి అచ్చటే బెనర్జీ సభను యేర్పాటు చేయటం జరిగినది. అందుకు పాఠశాల అధికారులు నరేంద్రునితోబాటు మరి ఏడుగురిని పాఠశాలనుంచి బహిష్క-రించారు. అంతేకాదు నరేంద్ర - హరికుమారులు కొలదికాలం జైలుజీవితం అనుభ వించటం కూడా జరిగినది.

ఆందోళనతో ప్రభుత్వం లొంగే పరిస్థితుల్లోలేదు. ఒకనాడు నరేంద్రుడు తన మిత్రుడు హరికుమారచక్రవర్తితో "ఈ బ్రిటిషువాళ్ళు మీటింగులతో, పిటీషన్లతో మన దేశాన్ని వదలిపెట్టరు. వీళ్లను బలప్రయోగంతోనే వెళ్లగొట్టాలి" అని చెప్పాడు. నరేంద్రునికి, ఆయన అనుచరవర్గానికి ఏమాత్రం విశ్రాంతి లేదు. 'ఏదో వొకటి చేయాలి. కార్యం సాధించాలి' అనే పట్టుదల వారిలో రోజురోజుకీ

ఇనుమడింపసాగినది. బ్రహ్మబాంధవ ఉపాధ్యాయ ప్రచురించే 'సంధ్య' పత్రికలోని సంపాదకీయం చదివారు. "పరాయిపెత్తనం వున్నంతవరకూ మన దేశం అభివృద్ధి చెందదు. కాబట్టి మనకు సంపూర్ణస్వాతంత్ర్యం కావాలి. విదేశీవస్తు బహిష్కరణ, స్వదేశీవస్తు ప్రోత్సాహం మొదలైనవన్నీ మనకు సంపూర్ణ స్వరాజ్య సాధనకు నిరుపయోగ మయిన సాధనాలు" అని అందులో వ్రాయబడి వున్నది.

ఆ రాత్రి వారికి నిద్రపట్టలేదు. స్వామి వివేకానందుని వారు ఆదర్శంగా మూర్తీభవించుకున్నారు. స్వామి రచించిన గ్రంథం — 'ప్రస్తుత భారతదేశం' శ్రద్ధగా పఠించారు. తమ బాధ్యత లెట్టివో గమనించారు. ఈ పరిస్థితులలో రామదాసు బాబాజీ నరేంద్రుని తన దగ్గరకు పిలిపించుకొని తన శిష్యునిగా, సన్యాసిగా మార్చ టానికి అనేకవిధాల ప్రయత్నించాడు. కాని అది నరేంద్రునికిగాని, నరేంద్రుని సహచరులకుగాని రుచించలేదు. 'స్వామి వివేకానందుడు చూపిన మార్గమే తమ మార్గంగా' వారు శపథం పూనారు. "దేశమే మనకు భగవంతుడు. 'ఆనంద మఠ'మే మనకు కార్యాచరణము" అని వారు నిశ్చయించుకున్నారు. (ఆనందమఠం 1771—72 లో సన్యాసులు ఈస్టు యిండియా కంపెనీ మీద చేసిన తిరుగుబాటును ఆధారంగా తీసుకొని రచించిన నవల. ప్రభుత్వం దీనిని బహిష్కరించి ఆంక్ష విధించినది.)

నరేంద్రుడు, హరికుమారచక్రవర్తి స్వామి వివేకానందునిచే స్థాపింప బడిన బేలూరు మఠానికి వెళ్లి అచ్చటి అధిపతి స్వామి శారదానందను దర్శించారు. వారు అనుశీలనసమితిలో గీతోపదేశం చేస్తూ వుండేవారు. అనుశీలనసమితికి సతీష్‌బోసు ప్రధాన కార్యదర్శిగా తన విధులను నెరవేరుస్తూ వుండేవాడు. స్వామి శారదానంద్ సతీష్‌బోసుకు వీరిద్దరినీ పరిచయం చేసాడు. అప్పటినుంచీ నరేంద్ర - హరికుమారులు సతీషునికి పరిచయులై చాల దగ్గర సన్నిహితులయ్యారు. కాగా 1905 చివరిలో అనుశీలనసమితిలో వీరిద్దరూ సభ్యులుగా చేరారు. 1905-1906 లో నరేంద్ర హరికుమారులు అనుశీలనసమితి కేంద్ర కారాల్యయమయిన కలకత్తా ఆఫీసులో పనిచేసారు. తరువాత దీనికి అనుబంధంగా చింగ్రిపోటలో అనుశీలన సమితిని స్థాపించి తాలిమ్‌ఖానా (వ్యాయామశాల) యేర్పరచి కసరత్తులు, లాఠీ ప్రయోగాలతో అనేకమంది యువకులకు తర్ఫీదు యివ్వటం జరిగినది. కేంద్ర కార్యాలయమయిన కలకత్తా ఆఫీసులో వున్నప్పుడు నరేంద్రుడు అనుశీలనసమితిలో

ప్రధానపాత్రను చేపట్టి సమితి అభివృద్ధికి విశేషంగా రాత్రింబవళ్లు కృషి చేసాడు. కాగా వివిధదేశాల విప్లవచరిత్రలు, మజినీ, గారిబాల్డీ మొదలగు చరిత్ర ప్రసిద్ధి కెక్కిన గొప్ప పురుషుల జీవితగాథలను ఎంతో శ్రద్ధగా పఠించాడు.

చింగ్రిపోటలో తిరిగి స్కూలు అధికారులు నరేంద్ర, హరికుమారులను పాఠశాలలో చేర్చుకొనటానికి అనుమతించారు. కాగా ప్రవేశపరీక్షకు హాజరు కావటానికి కూడా అనుమతించారు. వీరిద్దరూ పరీక్షఫీజును చెల్లించాలని తమ పెద్దల దగ్గర కొంతధనం తీసుకొని పరీక్షఫీజు చెల్లించకుండానే ఆ ధనంతో ఒరిస్సా ప్రాంతాలకు ప్రయాణం సాగించారు. ఆసమయంలో ఒరిస్సా క్షామదేవతకు గురి అయి అచ్చటి ప్రజలు తీరనిబాధలతో వున్నారు. నరేంద్ర హరికుమారులు అనుశీలన సమితి తరఫున అచ్చట క్షామనివారణ కార్యకలాపాల్లో పాల్గొనటానికి వెళ్ళారు. వీరి కార్యదీక్ష, శ్రద్ధాసక్తులు మిన్నగా శ్లాఘింపబడుటయేగాక అనుశీలన సమితి ప్రధానాంగమయిన 'రహస్యశాఖ'లో కూడ వీరికి సభ్యత్వం లభించినది.

నూటకి నూరుపాళ్లు, కరుడుగట్టిన విప్లవవాదికే అనుశీలనసమితి రహస్య శాఖలో సభ్యత్వం లభిస్తుంది. అదికూడా అనేక పడపోతలు జరిగిన తరువాతనే. అంతిమఘట్టంగా భగవద్గీతను శిరస్సున ధరించి కాళికాదేవి ఆలయంలో కాళీమాత సన్నిధిలో 'నా మాతృభూమి విముక్తికి నా జీవితసర్వస్వం, చివరకు ప్రాణాలను కూడా అర్పిస్తాను' అని ప్రమాణం చేసి తన రక్తంతో తిలకం ధరించుకొని రక్తంతోనే ప్రమాణపత్రంమీద సంతకం చేయవలసి వుంటుంది. దీనివలన ఎన్ని అవాంతరాలు వచ్చినా అనుశీలనసమితిలో చేరిన సభ్యుడు వెనుతిరగడు అని సమితి గాఢవిశ్వాసం. ఈ ప్రమాణబంధానికి నరేంద్రుడు సమ్మతించలేదు. 'నా మాటమీద మీకు విశ్వాసంలేదా ?' అని ఎదురుతిరిగాడు. వారిచేత ప్రమాణం చేయించకుండానే రక్తంతో వారిచేత సంతకాలు చేయించకుండానే నరేంద్ర - హరికుమారులు అనుశీలన సమితి రహస్యశాఖలో సభ్యులుగా చేర్చుకొనబడ్డారు.

ఒరిస్సాలో క్షామనివారణ కార్యక్రమ సమయంలో నరేంద్రుడు ఝూరియా హట్ క్యాంపులో వుండేవాడు. ఇది ఆ చుట్టూవున్న పన్నెండు క్యాంపులకు ముఖ్య కేంద్రంగా వుండేది. ఒకనాడు పూర్ణిమరోజున నరేంద్రుడు ఉపవాసం వుండి వలంటీర్లు అందరూ రాత్రి బోజనం ముగించిన తరువాత దగ్గరలో వున్న ఒక

ఎత్తైన అనకట్ట గోడమీద పద్మాసనంలో కూర్చొని తదేకధ్యానంతో పూర్ణిమచంద్రుని కన్నార్పకుండా వీక్షించసాగాడు. నరేంద్రుడు తన నిరీక్షణను చంద్రుడు పడమటి కొండకు చేరేవరకు నిర్విఘ్నంగా కొనసాగించాడు.

ధ్యాననిష్ఠలో నున్న నరేంద్రుని చాటుగా, దూరంగా నిలబడి చూచి నివ్వెర పోయిన డాక్టరు అశ్వనీరాయ్ మరునాడు నరేంద్రుని నిష్ఠకు కారణమేమని గుచ్చి గుచ్చి అడగటంతో నరేంద్రుడు "అశ్వనీ! నేను బీదకుటుంబంలో జన్మించాను. ప్రపంచంలో వివిధదేశాల్లో, వివిధప్రాంతాల్లో అనేకమంది మహాపురుషులు, కారణ జన్ములు జన్మించి వున్నారు. వారిని దర్శించి నా జన్మ తరింప చేసుకొనే భాగ్యం నాకు లేదు. కనుక వారు కూడా యీ పూర్ణిమ రాత్రి సమయంలో చంద్రుని చూస్తూవుంటే యీ పూర్ణచంద్రుని ద్వారా వారికీ నాకూ సంబంధం యేర్పడుతుందనే ఆశతో చంద్రుని నిరీక్షిస్తున్నాను" అని సమాధానం చెప్పాడు.

అనుశీలన సమితిలో చేరినప్పటి నుంచి నరేంద్రుడు పత్రికారచనలో ఎక్కువ శ్రద్ధ చూపుతూ వచ్చాడు. తరచుగా 'న్యూఇండియా' సంపాదకుడు పంచానన మజుందార్, 'బెంగాలీ' సహాయ సంపాదకుడు కాశీనాధ్ (వీరు తరువాత లాహోర్‌లో 'ట్రిబ్యూన్' పత్రికకు సంపాదకుడుగా పనిచేసారు) మొదలయిన పత్రికారచయితలను కలుసుకొంటూ వుండేవాడు. అప్పటి నరేంద్రుని రచనలు ఏమీ కనబడవు. కాని 1907 లో వ్రాసిన 'భారతదేశ పరిపాలకు లెవరు?' అనే వ్యాసం ఒకటి మాత్రం కనబడుతుంది. ఇందులో నరేంద్రుడు "ప్రజలవాక్కే భగవంతుని వాక్కు. భారత ప్రజలే తమ పరిపాలకుని ఎన్నుకోదగినవారు. బ్రిటిషువారు బలవంతంగా భారతదేశంమీద, ప్రజలమీద అధికారం చలాయిస్తూ వున్నారు. కాబట్టి భారత ప్రజలకు వారిని వెళ్ళగొట్టే హక్కు వున్నది. ఇది భారతప్రజల జన్మ హక్కు" అని విపులంగా చెప్పాడు.

ఈ కాలంలో నరేంద్రుడు గ్రంధపఠనం ఎక్కువగా చేస్తూవుండేవాడు. మిగిలిన కార్యకర్తలు, విప్లవవాదుల కంటె అన్నివిధాలా కార్యదీక్ష గలవాడని, తెలివిగలవాడని మన్నన లందుతూ వుండేవాడు. నరేంద్రుడు అనుశీలన సమితిలో ప్రముఖస్థానాన్ని అలంకరించటానికి ఇచ్చట ఒక సంఘటనను పేర్కొనటం అవసరం. 1908 లో 'అర్ధోదయయోగ' ఉత్సవ సందర్భమున కొన్ని లక్షలమంది ప్రజలు పవిత్ర గంగానదిలో స్నానమాచరించుటకు కలకత్తా వచ్చారు. ఇందులో ఎక్కువమంది స్త్రీలు. యాత్రికుల సహాయార్ధం అనుశీలన సమితి వలంటీర్లను

నియమించినది. బ్రిటిషు అధికారులు కొంతమంది యాత్రికులను క్రమబద్ధంలో స్నాన ఘట్టాలకు పంపే యేర్పాట్లుచేసే నెపంతో స్త్రీల యెడల అమర్యాదగా ప్రవర్తిస్తున్నట్లు అనుశీలన సమితి కార్యాలయానికి రిపోర్టు వచ్చినది. కార్యదర్శి సతీన్‌బోసు కోపోద్రిక్తు డయ్యాడు. డాక్టరు అశ్వనీరాయ్ 'చాటుననుండి వాళ్ళను తుపాకితో కాల్చివేద్దామని' సలహా యిచ్చాడు. నరేంద్రుడు అంతదూరం పోనక్కర లేదని, దానివలన అనేక దుస్సంఘటనలు జరుగవచ్చునని, బ్రిటిషు ప్రభుత్వం దీన్ని ఆసరాగా తీసుకొని అనుశీలన సమితిని అణచివేయటానికి ప్రయత్నించ వచ్చునని సలహాయిచ్చి తనవెంట నలుగురు దృఢకాయులు, లాఠీప్రయోగంలో బాగా ఆరితేరిన వలంటీర్లను తీసుకొని వెళ్ళాడు. నరేంద్రుని సలహాతో వలంటీర్లు లాఠీకర్రముక్క లను చొక్కాచేతులలో కనబడకుండా పట్టుకున్నారు. అధికారులు స్త్రీలను అవమాన పరిచే ఘట్టం దగ్గర వారి వెనుకనే దగ్గరలో వలంటీర్లను అప్రమత్తులై నిలబడమని ఆజ్ఞాపించాడు. తాను విజిల్ యివ్వగానే వలంటీర్లు ఏమాత్రం సంకోచించకుండా ఆ అధికారుల తలకు ప్రక్కగా చెవులమీద గట్టిగా లాఠీలతో కొట్టి వెంటనే ఆ లాఠీలను తమ యథాస్థానంలో దాచుకొని ట్రాముల్లోఎక్కి పారిపొమ్మని ఆదేశించాడు. ఆ వలంటీర్లు నరేంద్రుని విజిల్‌వినగానే ఆజ్ఞలను తు. చ. తప్పకుండా పాటించి కనురెప్పకాలంలో అదృశ్యులయినారు. అధికారులలో ఐదుగురికి తీవ్రమయిన లాఠీ దెబ్బలు తగిలి స్పృహతప్పి పడిపోవటం, ఆ సంఘటన చూచిన తక్కిన అధికారులు దెబ్బలు తిన్నవారిని ఆస్పత్రికి చేర్చి తాముకూడా అచ్చటనుంచి పలాయనం చిత్త గించటం జరిగినది. ఈ ఘటనకు అనుశీలన సమితి కార్యదర్శి ఎంతో ఆనందించి నరేంద్రునితో ''నరేన్ ! త్వరలో నీవు మాలో ప్రధానస్థానం అలంకరించగలవు'' అని నరేంద్రుని ఎంతగానో పొగడటం జరిగినది.

# విప్లవ రాజకీయాలు:

భారత జాతీయ కాంగ్రెసులో ముఖ్యంగా మితవాదులు బ్రిటిషు ప్రభుత్వం భారతదేశానికి 'డొమినియన్ స్టేటస్' (అధినివేశ ప్రతిపత్తి) యిచ్చినా చాలనే దృష్టిలో వున్నారు. తీవ్ర జాతీయవాదులు యిందుకు వ్యతిరేకించారు. వీరికి అరవిందుడు నాయకుడు. 'బ్రిటిషు అధికారం పూర్తిగా తొలగాలి', సంపూర్ణ

స్వరాజ్యం స్థాపించాలి' అనేవి వీరి నినాదాలు. ఈ ఆదర్శాలతో అరవిందుడు ఒక కార్యక్రమాన్ని రూపొందించాడు. అవసరమయితే ఆయుధాలనుకూడా ప్రయోగించి బ్రిటిష ప్రభుత్వాన్ని పడగొట్టటానికి సిద్ధంగా వుండటం యిందులో ఒక భాగం.

ఆ కాలంలో రహస్యవిప్లవ సంఘాలు - ఒకవర్గం జితేంద్రనాథ్‌బెనర్జీ నాయకత్వంక్రింద, మరోవర్గం అరవిందుని సోదరుడు బిరిన్ ఘోష్ నాయకత్వం క్రింద పనిచేస్తూ వుండేవి. వీటి రెంటినీ సమైక్యపరచి బెంగాలులో అన్ని ప్రాంతాలలోవున్న విప్లవరహస్య సంస్థలను ఒకే త్రాటిమీద నడుప గలిగితే విప్లవం సుగమం కాగలదని ఆశించి, అందుకు అరవిందుడు ప్రయత్నించి కొంతవరకు కృతకృత్యుడు కాగలిగాడు. ఇదేకాలంలో జతిన్‌ముఖర్జీ కూడా విప్లవనాయకుడుగా పేరు ప్రఖ్యాతులు గడించాడు. 'ఛత్రభండారీ' పేరుతో స్టూడెంట్సు కో-ఆపరేటివ్ స్టోర్సు అసోసియేషను స్థాపించి విద్యార్థులను, యువకులను రహస్యంగా సమావేశపరచి విప్లవ ప్రచారం చేయసాగాడు. జతిన్ ముఖర్జీ ప్రభుత్వ ఆంతరంగిక డిపార్టుమెంటులో స్టెనోగ్రాఫరుగా ఉద్యోగం చేస్తూవుండేవాడు. అందువలన ప్రభుత్వంలో విప్లవవాదులకు వ్యతిరేకంగా, వారిని అణచటానికి నడిచే రహస్యఫైల్సులోని విషయాలను ముందుగా విప్లవాదులకు తెలియజేస్తూ వుండేవాడు. అతని విగ్రహపుష్టి (పర్సనాలిటి), వేష-భాషలు, మాటలపొందిక, వాక్చాతుర్యము, నమ్రత, గంభీరత వీటన్నింటినీమించి ఆయనలో ప్రస్ఫుటించే విప్లవజ్వాలలకు తోడి విప్లవవాదులు జతిన్ అంటే మితిలేని గౌరవ మర్యాదలు, అంతకంటె మిన్నగా ఆప్యాయత చూపసాగారు. ఆఫీసువేళలు ముగియటం ఆలస్యం ఎంతోమంది యువకులు, విద్యార్థులు 'ఛత్రభండారీ' దగ్గర కోలాహలంగా గుమిగూడుతూ వుండేవారు.

జతిన్‌మీద తక్కిన విప్లవాదులకు గురుభావం కలుగటానికి వేరే కారణంకూడా వున్నది. 1906 లో నాడియా ప్రాంతంలోని కోయా అడవుల్లో 'బెంగాలు పులి' తో వీరోచితంగా ఢీకొని కత్తితో దాన్ని హతమార్చాడు. అప్పటి నుంచి 'టైగర్ జతీన్', 'దాదాజతీన్'గా తోడి విప్లవకారులచే పిలువబడుతూ వుండేవాడు.

బిరిన్‌ఘోషుకు జతిన్ ముఖర్జీమీద తక్కిన విప్లవవాదులుచూపే గౌరవం ద్వేషంగా మారసాగినది. తానే విప్లవనాయకునిగా వుండాలని, ఆ స్థానాన్ని యితరులెవరూ ఆక్రమించరాదని బిరిన్ ఆకాంక్ష. ప్రభుత్వంలో స్టెనోగ్రాఫరుగా ఉద్యో

గంతో పొట్టపోసుకునేవ్యక్తి విప్లవవాది ఎలా అవుతాడని' జతిన్‌ముఖర్జీకి వ్యతిరేక ప్రచారం సాగించాడు. నరేంద్రుడు మొదట్లో బిరిన్‌కు చాల సన్నిహితుడుగా వుండేవాడు. రహస్య విప్లవ కార్యక్రమాల్లో, బాంబులు తయారు చేయటంలో బిరిన్‌తో కలసి పనిచేశాడు. అదేవిధంగా తరువాత జతిన్‌తో కూడా కలసి పనిచేయ నారంభించాడు. కొంతకాలం యిద్దరూ కలిసి జైలుజీవితం అనుభవించారు కూడాను. బిరిన్ ఘోష నాయకుని హోదా చూపుతూ 'జతిన్‌తో ఎవరూ మాట్లాడకూడదు. అతనితో కలియటానికి కూడా వీల్లేదు' అని తోటి విప్లవకారులను ఆదేశించాడు. ఇది చాలామందికి అసంతృప్తిని కలిగించటమే కాకుండా బిరిన్‌మీద హేయభావాన్ని కూడా కలిగించినది. నరేంద్రుని కిది విచిత్రంగా కనుపించినది. ఒకేధ్యేయం కొరకు పోరాడే ఒక విప్లవకారుని మరొక విప్లవకారుడు ద్వేషించటం నరేంద్రుడు సహించలేకపోయాడు. కాగా జతిన్ ముఖర్జీకి దగ్గర సన్నిహితుడు గా సాగాడు. బిరిన్ వలదని చెప్పినా అతనికి తెలియకుండా రహస్యంగా నరేంద్రుడు జతిన్‌తో కలసి మంతనాలు జరుపుతూ వుండేవాడు. ఇద్దరి మనస్తత్వాలను పరీక్షించాడు. జతిన్‌లో యే మాత్రం కల్మషం కనబడలేదు. తరువాత కొలది కాలంలోనే నరేంద్రుడు బిరిన్ అనుచర వర్గంనుంచి తప్పుకొని జతిన్ అనుయాయునిగా స్థిరపడి పోయాడు.

"జతిన్ అంటే ఎందుకో నాకు ఆయనమీద అంతులేని అభిమానం యేర్పడి పోయింది. సూదంటురాయిలాగా ఆయన నన్ను ఆకర్షించాడు. మొదట దీనికి కారణమేమిటో నాకు అర్థంకాలేదు. తరువాత క్రమేపి తెలుసుకో గలిగాను. అన్నివిధాల మూర్తీభవించిన ఆయన వ్యక్తిత్వమే దీనికి కారణంగా గ్రహించ గలిగాను. ఆ తరువాత ప్రపంచంలో, వివిధదేశాల్లో అనేకమంది గొప్ప వ్యక్తులను, మహాపురుషులను కలిసి పరిచయం చేసుకొన్నాను. వారు గొప్పవారు. అంతే! కాని జతిన్ చాల మంచి స్వభావం గల వ్యక్తి. అట్టి మంచితనంగల వ్యక్తిని యింత వరకు నేను మరొకరిని చూడలేదు. సర్వసాధారణంగా దాదాలు (సాధువులు) 'సంకల్పసిద్ధి' కొరకు రకరకాల యోగాభ్యాసాలు చేయటం కద్దు. దాదా (పెద్దన్న) జతిన్ కీ సంకల్పసిద్ధి స్వభావ సిద్ధంగా లభించిన మహద్భాగ్యం"....ప్రపంచం నలు మూలలా పర్యటించి ముప్పయి సంవత్సరాల తరువాత జతిన్ గురించి నరేంద్రుడు అన్నమాట లివి.

నరేంద్ర హరికుమారులను, మరి కొలదిమంది ప్రముఖ విప్లవకారులను జతిన్ ఆంతరంగిక అనుచర వర్గంగా యేర్పరచుకొని వారిచేత సాంఘిక సేవా కార్య

కలాపాలను విస్తరింప చేయటమే కాకుండా విప్లవ కార్యకలాపాలు కూడా ముమ్మరంగా జరిపించాడు. నరేంద్ర హరికుమారులు రహస్యప్రదేశమయిన, అడవులమధ్య కొండప్రాంతాలకు వెళ్ళి బాంబులు తయారుచేయటం, షూటింగుచేయటం మొదలయినవి ప్రారంభించారు. క్రమేపి 40-50 మంది గట్టి విప్లవవాదులను తమ అనుచరవర్గంగా కూడగట్టి వారికి కూడా యిందులో తగిన ప్రవేశం కలిగించారు. ఒక మహమ్మదీయ తుపాకి వ్యాపారి దగ్గర రహస్యంగా కొన్ని తుపాకులను ఖరీదుచేసి వాటిని రహస్యప్రదేశంలో భద్రంగా దాచిపెట్టారు.

# అరవిందుని కార్యక్రమం:

1906 మధ్యకాలంలో బిరిన్‌ఘోష అనుశీలన సమితి నిర్వహించే తాలీమ్ ఖానాలోని కసరత్తులు, కత్తిసాములు, లాఠీప్రయోగాలతో విసుగెత్తి వాటివలన దేశానికి ఆశించినంత ఫలితం కలుగటం లేదనే నిర్ణయానికి వచ్చాడు. అనుశీలన సమితిని వదలిపెట్టి దేశప్రజలను చైతన్యవంతం, ఉత్తేజితం చేయగల రాజకీయ ప్రచారాన్ని, విప్లవ కార్యక్రమాన్ని చేపట్టటం అవసరమనే నిర్ణయానికి వచ్చాడు. ఇందుకు ప్రాతిపదికగా 'జుగాంతర' అనే పత్రికను ప్రారంభించటానికి నిశ్చయించుకున్నాడు.

అంతవరకు అరవిందుని ప్రయత్నంవలన బిరిన్‌వర్గం, జతీంద్రనాధ్ బెనర్జీవర్గం కలసి పనిచేస్తూ వచ్చినవి. కాని బిరిన్ అభిప్రాయాలతో రెండవవర్గం ఏకీభవించలేదు. అప్పుడు రెండవవర్గానికి ప్రమధమిత్ర నాయకుడుగా వున్నాడు. ఇరువర్గాలకు కార్యక్రమంలో భేదాభిప్రాయాలు వచ్చినవి. 'ప్రభుత్వంమీద వెంటనే తిరుగుబాటుకు ఆయత్తం కావాలని, బిరిన్ వాదిస్తే, 'తిరుగుబాటుకు కావలసిన పరిస్థితులను ముందుగా చక్కపెట్టుకొని అన్నీ సిద్ధం అయిన తరువాతనే ప్రయత్నానికి పూనుకోవాలని లేకపోతే విప్లవసంస్థ అణచబడే ప్రమాదం వుందని' ప్రమధమిత్ర వాదించాడు.

బిరిన్ నాయకత్వంతో, కార్యక్రమంతో భేదించి విసుగెత్తిన జతీంద్రనాధ్ బెనర్జీ కలకత్తా వదలి ఉత్తరప్రదేశ్, పంజాబు ప్రాంతాలకువెళ్ళి అచ్చట సర్దార్

అజిత్ సింగ్ (భగత్ సింగ్ తండ్రి), మరికొంతమంది యువకులను విప్లవరాజకీయాల్లో ఉత్తేజపరచి రహస్య విప్లవ సంఘాన్ని స్థాపించటానికి కొంత దోహదకారి అయ్యాడు. ఆయనే తరువాత 'నిరాలంబస్వామి' పేరుతో సన్యాసిగా తన శేష జీవితం గడిపినాడు. బిరిన్ వ్యతిరేక ప్రచారానికి, దుష్ప్రచారానికి జతిన్‌ముఖర్జీ కూడా విసుగెత్తి పోయాడు. ఇదే సమయంలో తన కుమారుడు అకాలమరణం చెందటంతో జీవితంమీద విరక్తిచెంది 'సన్యాసిజీవితం ద్వారా మనశ్శాంతిని పొందా' లనే దృష్టితో హరిద్వారం వెళ్లాడు. అక్కడ తన మతగురువు భోలానాథ్ గిరిని దర్శించాడు. విప్లవ సంఘాల్లో పనిచేసిన యువకులు మొదట్లో ఎంతో కార్యదీక్ష, పట్టుదలతో కృషిచేసినా ప్రభుత్వ దమననీతివలన అనేక కష్ట, నష్టాలకు గురి అయి చివరకు తాము ఆశించిన ఫలితం అగమ్యగోచరం కావటంతో జీవితంమీద విరక్తిచెంది, లేక ప్రభుత్వబారి నుండి దూరంకావటానికి ఆశ్రమాల్లో సన్యాసి జీవితం గడుపసాగారు. భోలానాధ్ ఆశ్రమంలోకూడా అనేకమంది విప్లవకారులు ఆశ్రితులుగా చేరి స్వామివారి శిష్యులుగా తమజీవితం గడుపసాగారు. ఆ కాలంలో మతగురువులు కేవలం మతోద్ధరణకొరకు ఆశ్రమాలు స్థాపించినా అందులో కొంతమంది మతంతో పాటు తమ శిష్యులకు రాజకీయంగా దేశాన్ని, ప్రజల్ని ఉద్ధరించవలసిన అవసరాన్ని గురించి బోధించటంకూడా కద్దు. ఈ ఆశ్రమాల్లో కొన్ని విప్లవరాజకీయాలు వ్యాప్తి చెందటానికి ఆ కాలంలో ఎంతగానో తోడ్పడినవి.

భోలానాధ్‌గిరి స్వామి జతిన్ సన్యాసాశ్రమం స్వీకరించటానికి అంగీకరించలేదు. 'దేశంకొరకు, ప్రజలకొరకు నీవు చేయవలసినది, సాధించవలసినది యీ ఆశ్రమంలో కాదు. నీ కొరకు భారత ప్రజానీకం ఎదురు చూస్తున్నది' అని హెచ్చరించాడు. స్వామివారి హెచ్చరిక జతిన్ వైరాగ్యాన్ని పటాపంచలు చేసినది. ఆయన శరీరంలో, నరనరాల్లో తిరగి విప్లవ కణాలు ప్రవహింప సాగినవి. భోలానాధ్ గిరి స్వామివారి ఆశీర్వాదము పొంది ఆశ్రమం విడిచిపెట్టాడు. తరువాత నిరాలంబ స్వామిని (జతీంద్రనాధ్ బెనర్జీ) కూడా కలుసుకొన్నాడు. వీరు జతిన్‌కు రాజకీయ గురువులు. వారి సలహామీద తిరిగి కలకత్తావచ్చి విప్లవ కార్యక్రమం ముమ్మరం కావటానికి తీవ్రకృషి చేసాడు. బిరిన్ స్థాపించిన బాంబునిర్మాణ సంస్థతో పని చేసాడు. బ్రిటిషు ప్రభుత్వానికి వ్యతిరేకంగా బెంగాలు నలుమూలలా యుద్ధం పురికొల్పటానికి, అందుకు అవసరమయిన ముఠాలను, సంస్థలను యేర్పరచటానికి

జతిన్ తన శాయశక్తులా కృషిసల్పాడు. తన యీ కార్యక్రమంలో జతిన్ ముందుగా నిరాలంబస్వామి సలహాలను పొందుతూ వుండేవాడు.

ఈ సమయంలో నరేంద్రుడు కూడా బిరిన్‌తో కలసి పనిచేయ సాగాడు. బిరిన్ అనుశీలన సమితితో తెగత్రెంపులు చేసుకున్నా, నరేంద్రుడు అందులో వుంటూనే బిరిన్ ఆజ్ఞానుసారం విప్లవకార్యక్రమాలు నెరవేరుస్తూ ఉండేవాడు. బిరిన్ ప్రేరేపణతో బెంగాలీలో 'మాతృభూమి పిలుపు' అనే పేరుగల ఒక పుస్తకం కూడా వ్రాశాడు. ఈ వ్రాత ప్రతిని అచ్చుకాకముందే పోలీసులు 'చింగ్రిపోట రైల్వే స్టేషను దొమ్మీ కేసు'లో స్వాధీనం చేసుకొన్నారు. నరేంద్రుడు బాంబులు చేయటంలో తగిన నిపుణత సంపాదించాడు. బిరిన్ ఆశయాలకు దగ్గరగా 'లాఠీప్రయోగాలు లాభంలేదని విప్లవానికి దౌర్జన్యాలు, హింసాకాండలు చేపట్టాలి' అనే నిర్ణయానికి వచ్చాడు. డాకరు అశ్వనీతో "మనమార్గం సరియైనదికాదు. స్వాతంత్ర్యం పొంద టానికి వేరే మార్గమున్నది. దాన్ని మనం కనుగొనాలి' అని అంటూ వుండేవాడు. అప్పటినుంచి నరేంద్రుడు విప్లవ రాజకీయాల్లో ఎక్కువగా శ్రద్ధ తీసికొని విప్లవ కార్యక్రమం గురించి గాఢంగా, దీర్ఘంగా ఆలోచించ సాగాడు. అరవిందుడు సూచించిన కార్యక్రమమే నరేంద్రునికి ఆచరణీయము, సమర్ధవంతముగా కనుపించి నది. ఈ కార్యక్రమం గురించి విపులంగా అరవిందుడు అదివరకే జతిన్ ముఖర్జీతో చర్చించాడు.

1. ఎ) యువకులను శారీరకంగా, సైనికంగా తర్ఫీదు పొందటానికి ఆసక్తులను చేసి సమీకరించటం.
   బి) రహస్య సంఘాలను స్థాపించి విప్లవభావాలను ప్రచారం చేయటం.
   సి) సాయుధ పోరాటానికి అవసరమయిన ఏర్పాట్లు సంసిద్ధ పరచటం.
2. కరపత్రాలు, పుస్తకాలు, పత్రికలు మొదలయిన ప్రచురణల ద్వారా సభలు, సమావేశాలు, వూరేగింపులు మొదలయిన వాటి ద్వారా ప్రజల్లో చైతన్యం కలిగించి స్వాతంత్ర్యం పొందితే, అందువలన కలిగే ప్రయోజనాలు వారికి విడమరిచి చెప్పి స్వాతంత్ర్య పోరాటం కొరకు భారత ప్రజలను సన్నద్ధులు చేయటం.
3. రహస్య సంస్థతో బాటు చట్టబద్ధమయిన ప్రజాసంస్థను కూడా స్థాపించి శాంతియుత పద్ధతుల ద్వారా సహాయనిరాకరణ, విదేశీవస్తు బహిష్కరణ

మొదలయిన కార్యక్రమాలు చేపట్టి ప్రభుత్వ యంత్రాంగానికి పోటీగా మరో ప్రభుత్వ యంత్రాంగాన్ని సృష్టించటం.

ఈ కార్యక్రమానికి జతిన్‌తో బాటు నరేంద్రుడు కూడా సంసిద్ధుడు కావటం చేత జతిన్ సన్నిహితుడుగా కలిసి పని చేయసాగాడు.

1907 చివరి భాగంలో విప్లవవాదులు తమ విప్లవసంస్థ పునర్నిర్మాణానికి, అభివృద్ధికి, బాంబులు తయారు చేయటానికి, ప్రభుత్వాన్ని కూలద్రోయటానికి ఒక క్రమబద్ధమయిన కార్యక్రమాన్ని నిర్ణయించటానికి సమావేశమయ్యారు. ఇందులో భేదాభిప్రాయాలు లేకపోలేదు. దౌర్జన్యాలు, దోపిడీలు, హింసాకాండలు, హత్యలు మొదలయిన కర్మకాండలో భేదాలు పొడసూపినవి. పరిపాలనా యంత్రాంగాన్ని స్తంభింప చేయటంలో, ప్రభుత్వాన్ని కల్లోలపరచటంలో అందరూ యేకాభిప్రాయానికి వచ్చినా ఆత్మరక్షణకు తప్ప ఎదుటివాళ్లను హత్య చేయకూడదని, కేవలం ధనం కొరకే దోపిడీలు చేయరాదని జతిన్ తన అభిప్రాయం వెల్లడించాడు. అయితే అవసరాలనుబట్టి వాటి యోగ్యతాయోగ్యతలను నిర్ణయించవలసి వుంటుందని జతిన్ వాదన. 1908 లో ఒకసారి, ప్రపంచయుద్ధ ప్రారంభంలో 1914 లో జతిన్ విప్లవ సంఘానికి సుప్రీమ్ కమాండరుగా వున్నప్పుడు మరొకసారి ధన అవసరాన్నిబట్టి దోపిడీలు జరుపటానికి తన అంగీకారముద్ర వేయటం జరిగినది.

ఈ హింసాపద్ధతి, ప్రయోగాలలో నరేంద్రుడు నీతి, నిజాయితీలు చూచే వాడుకాదు. దోపిడీ అనినా, హత్యాకాండ జరగాలనినా నరేంద్రుడు తేలికభావంతోనే ఆలోచించేవాడు. ఇందులో వెనుక - ముందులు, మంచి - చెడ్డలు చూచేవాడుకాదు. లక్ష్యసాధనే నరేంద్రుని పరమాశయం. జదుగోపాల్, మరికొందరు విప్లవకారులు బ్రిటిషుజాతి మీద కేవలం ద్వేషం, పగతో వాళ్లను చంపాలనీ, వాళ్ల ఆస్తులు, ధనం దోచుకోవాలని అంటూ వుండేవాళ్లు.

1907 అక్టోబరులో హుగ్లీ జిల్లాలో రెండు పర్యాయాలు గవర్నరు ప్రయాణం చేసే రైలు పడగొట్టటానికి ప్రయత్నాలు జరిగినవి. కాని అవి ఫలించ లేదు. అదే సంవత్సరం డిశంబరులో మిడ్నపూరు దగ్గర గవర్నరు ప్రయాణంచేసే రైలును పడగొట్టటానికి విప్లవకారులు కొంత విజయం సాధించారు. ఆ రోజుల్లో ఫ్రెంచి వలస ప్రాంతంగావున్న చంద్రనగర్ నుంచి విప్లవకారులు తమకు కావలసిన

ఆయుధాలను, ఆయుధసామగ్రిని కొనుగోలు చేస్తూవుండేవారు. చంద్రనగర మేయరు దీన్ని అరికట్టటానికి ఒక ఆర్డినెన్సునుకూడా జారీచేశాడు. దీనికి ప్రతీకారంగా 1908 ఏప్రియల్ 11 న మేయరు నివాసభవనంమీద బాంబు విసరటం జరిగినది.

ఆయుధాల కొనుగోలుకు, బాంబుల నిర్మాణానికి విప్లవకారులకు ధనావశ్యకత కలుగటంతో వరుసగా దొమ్మీలు చేయటానికి కార్యక్రమం రూపొందించుకున్నారు. ఇందులో మొదటిది 1907 డిశంబరు 6 న నరేంద్రుడు చింగ్రిఘోట రైల్వేస్టేషనుమీద దాడి జరిపాడు. దురదృష్టవశాత్తు నరేంద్రుడు పట్టుబడ్డాడు. అతని దగ్గర తాను రచించిన వ్రాతప్రతి 'మాతృభూమి పిలుపు', బిరిన్ రచించిన 'ఆధునిక యుద్ధవ్యూహం' అనే అచ్చుప్రతి పోలీసులు స్వాధీనం చేసుకున్నారు. బెయిలు దరఖాస్తు పెట్టుతూ న్యాయవాది నరేంద్రుని గురించి "ఈ యువకుడు బెంగాలు టెక్నికల్ ఇన్స్టిట్యూటులో విద్యార్థి. జాతీయ కళాశాలలో ప్రవేశ పరీక్షలో ప్రథమునిగా ఉత్తీర్ణుడయి బంగారు పతకాన్ని పొందాడు'' అని నరేంద్రుని కోర్టుకు పరిచయం చేశాడు. అదివరకు లోగడ సాంఘికసేవా కార్యకలాపాల్లో విశేషకృషి చేసి అధికారుల మన్ననలు పొందివుండుటచేత నరేంద్రునికి బెయిలుమీద విడుదల లభించినది. న్యాయస్థానంలో ఒకవంక తనమీద విచారణ జరుగుతూ వున్నా నరేంద్రుడు యథాప్రకారంగా రహస్యజీవితం సాగిస్తూ హరికుమార చక్రవర్తితో కలిసి ఎన్నో దోపిడీలు జరిపాడు. ఒక పర్యాయం ఒక యింటిమీద దాడిజరిపి బయటికి వస్తూ ప్రక్కనే పవళించియున్న ఒకచిన్న బాలిక మెడలోని బంగారు గొలుసును లాగటానికి నరేంద్రుడు ప్రయత్నించాడు. హరికుమార్ వెంటనే నరేంద్రుని కంఠాన్ని గట్టిగా వత్తటంతో నరేంద్రుడు మూర్ఛావస్థనుచెంది తరువాత 'ఇకముందెన్నడూ అట్టి పనులు చేయనని' హరికుమారునికి వాగ్దానం చేయటం జరిగినది.

బిరిన్ 'జుగాంతర' పత్రికాబాధ్యతను వేరొకరికి అప్పగించి 1907 లో మానిక్టుల్లా గార్డెన్సులో బాంబునిర్మాణ సంస్థను స్థాపించే ప్రయత్నంలో నిమగ్నుడయ్యాడు. విద్రోహ కార్యకలాపాలను యింకా ముమ్మరం చేయాలని బిరిన్ కృతనిశ్చయుడయ్యాడు. ముజాఫర్పూర్ క్లబ్బునుంచి జోడుగుర్రాల బండిలో కింగ్సుఫోర్డు వెళ్ళుచున్నాడనే భ్రాంతిలో కెన్నడీ దంపతుల బండిమీద బాంబు విసరడం జరిగినది. పోలీసులు అనేక విప్లవకారులను బంధించారు. వారి గాలింపు చర్యలో

మానిక్‌టుల్లా బాంబు నిర్మాణసంస్థ కనుగొనబడినది. ఆలీపూర్ బాంబుకేసులో అరవిందుడు, అతని సోదరుడు బిరిన్, మరికొంత మంది విప్లవకారులు బంధింప బడ్డారు. విచారణానంతరం అరవిందుడు వినా తక్కిన వారందరూ తీవ్రశిక్షలకు గురి అయ్యారు.

విచారణ సమయంలో జైల్లో వున్న అరవిందుడు రాజకీయాలకు స్వస్తి చెప్పి ఆధ్యాత్మిక చింతనలో మునిగి యోగాభ్యాసము ప్రారంభించాడు. దీనికి తోడుగా అరవిందుని తరఫున న్యాయవాదిగా పనిచేసిన చిత్తరంజనదాసు, కోర్టులో చేసిన ఉత్తేజితకరమయిన విజ్ఞప్తిని పురస్కరించుకొని న్యాయాధికారి అరవిందుని దోషరహితునిగా విడుదల చేయటం జరిగినది. బిరిన్ జైలుశిక్షతో అతని అనుచర వర్గంలో నిరాశ ప్రబలి చెల్లాచెదరై పోయినది.

ఈ విచారణ జరుగుతున్న కాలంలో విప్లవకారుల అరెస్టుకు కారణభూతు లయిన ప్రభుత్వాధికారులను, ప్రధాన అప్రూవరుగా మారిన విప్లవద్రోహిని విప్లవ కారులు హత్య చేశారు. నరేంద్రుడు, మరి యిద్దరు విప్లవకారులు కలిసి ఒక విప్లవ వాదిని బంధించటానికి ప్రయత్నించిన సబ్‌యిన్స్పెక్టరును హత్య గావించారు. కేసును నడపుచున్న పోలీసు సూపరెండెంటు కోర్టు ఆవరణలోనే మరొక విప్లవ వాదిచే హత్య కావించబడ్డాడు.

అరవిందుడు విడుదల అయ్యాడు. ఏకాకిగా హింసాకాండను ఖండించ సాగాడు. ప్రభుత్వ దమననీతికి ప్రతీకారం చేయాలని బోధించిన అరవిందుడు బాధలను అనుభవించటానికి సిద్ధపడాలని ప్రచారం చేయసాగాడు. ప్రభుత్వం నమ్మలేదు. అరవిందుని బర్మా పంపాలనే నిశ్చయంతో వున్నట్లు సిస్టరు నివేదిత ఆయనకు రహస్య సమాచారం అందచేయటంతో, అరవిందుడు కలకత్తా వదలి ఫ్రెంచి వలస ప్రాంతమయిన చంద్రనగర్‌కు నివాసం మార్చాడు. తరువాత రెండు నెలలకే దక్షిణ భారతదేశంలోని ఫ్రెంచి వలస ప్రాంతమయిన పాండుచేరీ చేరి ఆశ్రమం స్థాపించుకొని తన జీవితకాలం 1951 వరకు అచ్చటే వుండి ఆధ్యాత్మిక ప్రచారం కొనసాగించాడు.

విప్లవకార్యక్రమాన్ని రూపొందించి విప్లవమార్గదర్శి కాదగిన అరవిందుడు రాజకీయంగా మరణించాడు. బలప్రయోగంతో, బాంబుల ఆధారంతో బ్రిటిషు

ప్రభుత్వాన్ని కూలద్రోయటానికి 'యుద్ధవ్యూహం' పన్నిన బిరిన్ ప్రభుత్వ బందీగా జైలు కటకటాల వెనుక నికృష్టజీవితం గడుపసాగాడు. బిరిన్‌తోపాటు ఎంతోమంది వీరులు యావజ్జీవబందీలయ్యారు. మరికొందరు ఉరికంబాలకు గురికావలసి వచ్చినది. అనుశీలన సమితి నిషేధింప బడినది. విప్లవవాదులలో క్రమశిక్షణ లోపించసాగినది; ఆశాజ్యోతి నశించినది; నిరాశ ప్రబలసాగినది. 'ఎవరికివారే యమునాతీరే'గా విప్లవ సంఘాలు ఛిన్నాభిన్నమయ్యే పరిస్థితులు యేర్పడినవి. ఇట్టి విపత్కరసమయంలో విప్లవ తారాపథంలో సూర్య - చంద్రులలాగా మిగిలినది జతిన్ - నరేంద్రు లిద్దరే. ప్రభుత్వానికి 'తగినశాస్తి' చేయాలనే దృఢకాంక్ష వారిలో ప్రబలసాగినది.

# కుట్రలు - కేసులు :

జతిన్ - నరేంద్రులు తరచుగా ఒకరి నొకరు కలుసుకొన సాగారు. సన్నిహిత సంబంధాలు యేర్పరచుకో గలిగారు. విప్లవ కార్యక్రమాలను పునరుద్ధరించి విస్తృతం చేయటానికి కలకత్తాలో హారిసన్‌రోడ్డులో ఒక కార్యాలయాన్ని, (శ్రీమజీవి కార్యాలయం) వ్యాపారకేంద్రమయిన డల్‌హౌసీ స్క్వేరులో యస్. డి. హారీ & సన్సు పేరుతో మరియొక కార్యాలయాన్ని స్థాపించారు. ఈ రెంటి ద్వారా జతిన్ - నరేంద్రులు తమ విప్లవ కార్యక్రమాల్ని విస్తృతం చేయసాగారు. అప్పటినుంచీ విప్లవ వుద్యమం జతిన్ - నరేంద్రులు, హరికుమార చక్రవర్తి, అమరేంద్రనాధ్ ఛటోపాధ్యాయ, మరికొందరి నాయకత్వం క్రింద నడువసాగినది. అరవిందుని రాజకీయ అస్త్రసన్యాసం, బిరిన్ జైలువాసం, అనుశీలనసమితి నిషేధంతో అస్తవ్యస్తులయి, నిరాశాపూరితులయి, చెట్టుకొకరు పుట్టకొకరు చేరిన విప్లవ కారులను సంఘటితపరచి వారిని తిరిగి క్రమపంధాలో పెట్టి విప్లవ కార్యక్రమానికి ఒక స్వరూపం యివ్వటంలో నరేంద్రుడు ప్రముఖపాత్ర వహించాడు.

జతిన్-నరేంద్రులు తమ విప్లవకార్యక్రమం సాగింపుకు అవసరమయిన ధనసేకరణ నిమిత్తం ఎన్నోలూటీలు చేశారు. 1909 ఏప్రియల్ 25 న నరేంద్రుడు ఇరువదినాల్గు పరగణాల జిల్లాలోని డైమండు హార్బరు సమీపంలో ఒకయింటిని లూటీచేసి ముసుగులో బయటికివస్తూ ఆ యింటి యజమానితో 'ఈ ధనం మాకోసం

కాదు. బ్రిటిషువాళ్లను వెళ్ళగొట్టటానికి మీ దగ్గర అప్పుగా తీసుకుంటున్నాము' అని చెప్పివచ్చాడు. ఆ లూటీ సందర్భంలో పోలీసులు నరేంద్రుని పట్టుకొని బంధించారు. జూన్ లో నరేంద్రుడు బెయిలుమీద విడుదలఅయి పోలీసులబారినుంచి తప్పించుకొని కేసు విచారణకు హాజరుకాకుండా అంతర్ధాను డయ్యాడు. బెయిలుకు హామీగా వున్న వ్యక్తికి పూచీకత్తు ధనాన్ని చెల్లించమని ప్రభుత్వం తాఖీదు యిచ్చినది. విప్లవనిధి నుంచి ఆమొత్తం చెల్లించటం జరిగినది.

నరేంద్రుడు అన్నివిధాలా మిగిలిన విప్లవకారులకు అగ్రగామిగా వుంటూ వచ్చాడు. గెరిల్లా పద్ధతిలో బ్రిటిషువాళ్లని వెళ్ళగొట్టటానికి అవసరమయిన కార్యక్రమం రూపొందించాడు. అంతేకాదు బ్రిటిషువాళ్ళు వెళ్ళిన తరువాత ఏర్పడే ప్రభుత్వం ఏ కొలదిమంది స్వార్ధపరుల చేతుల్లో వుండరాదని ప్రజల యీతిబాధలను తీర్చగల 'ప్రజాప్రభుత్వం' యేర్పడాలని తోడి అనుచరవర్గానికి బోధిస్తూ వుండేవాడు. నరేంద్రుని కార్యదీక్ష, ముందుచూపు, అచంచల ధైర్యసాహసాలకు తన అనుచర వర్గంలో ఆయన నాయకుని కంటె మిన్నగా చూడబడుతూ వచ్చాడు.

"1905-10 మధ్యకాలంలో హౌరాజిల్లాలో శివపూర్, తదితర బ్రిటిషు యిండియా ప్రాంతాల్లో విప్లవకారులు 'హిజ్ మెజెస్టీ కింగు యంపరరు' మీద యుద్ధం ప్రకటించి బ్రిటిషు యిండియాలో ప్రభుత్వాధికారాన్ని కూలద్రోయటానికి, చట్టబద్ధమయిన ఇండియా ప్రభుత్వాన్ని అక్రమంగా, హింసాపద్ధతులద్వారా పడగొట్టటానికి ప్రయత్నించటం వలన ఇండియన్ పీనలు కోడు 121 ఎ. సెక్షను క్రింద నేరం చేసినారు" అని అనుమానించబడిన 44 మంది విప్లవకారులను బంధించి ప్రభుత్వం వారిని 1910 జనవరిలో న్యాయవిచారణకు పెట్టింది. ఇందులో జతిన్ - నరేంద్రులు కూడా వున్నారు. తగిన సాక్ష్యాధారాలు లేకపోవటంచేత జతిన్‌తోపాటు మరికొందరు విడుదల అయ్యారు. కొందరికి శిక్షలు వేయబడ్డవి. నరేంద్రుడు ఆరునెలలు కారాగారశిక్ష అనుభవించాడు. ఈ జైలువాసంలో నరేంద్రుడు శివనారాయణస్వామి దగ్గర నేర్చుకొనిన యోగములు, వివేకానందుని రాజయోగము అభ్యాసం చేశాడు.

ఈ 'హౌరా కుట్రకేసు'లో విప్లవకారులు చేసిన అనేకమయిన దోపిడీలు, హత్యలు సాక్ష్యాధారంగా చూపబడ్డవి. 10 వ రెజిమెంటులోని కొంతమంది సిపాయీలతో వీరికి రహస్య సంబంధ మున్నదని చూపబడినది. తరువాత యీ రెజిమెంటును రద్దు చేయటంకూడా జరిగినది. విప్లవనిధి కొరకు అనేక ప్రాంతాల్లో లూటీలు

చేసినట్లు చూపబడినది. 'జుగాంతర' పత్రికకు, 'ఛాత్రభండార్'కు యిందులో సంబంధ మున్నట్లు రుజువు చేయబడినది. యీ కుట్రకేసులో ప్రభుత్వం తరఫున కృషిచేస్తున్న అధికారిని విప్లవకారులు హత్యచేసారు.

యదార్ధంగా యీమధ్య కాలంలోనే విప్లవసంఘాలకు, ముఠాలకు చెందిన అనేకమంది విప్లవవాదులను జతిన్-నరేంద్రులు సంఘటిత పరచి కలసికట్టుగా పని చేయించ గలిగారు. గెరిల్లా యుద్ధతంత్రంతో బ్రిటిషు ప్రభుత్వాన్ని కూలద్రోయ టానికి ప్రయత్నాలు జరిగినవి. 10 వ జాట్ రెజిమెంటుతో సంబంధం యేర్పరచుకో గలిగారు. అందులోని సిపాయీలద్వారా ప్రపంచయుద్ధం రాబోతున్నదని గ్రహించ గలిగారు. దీనికి మద్దతుగా వివిధదేశాలకు పంపబడిన విప్లవవాదులు కూడా ఇంగ్లండు - జర్మనీల మధ్య యుద్ధం సంభవించే సూచనలున్నవని తెలియచేయటం జరిగినది.

ప్రభుత్వం విప్లవసంఘాలయిన 'అనుశీలన,' 'ఆత్మోన్నతి' సమితులను నిషేధించి రద్దు చేసినది. అరవిందుడు రాజకీయాలనుంచి నిష్క్రమించి ఆశ్రమవాసి అయ్యాడు. విప్లవం విజయవంతం చేయాలనే దృఢసంకల్పంతో జతిన్-నరేంద్రులు అన్ని బరువు - బాధ్యతలను స్వీకరించారు. చింగ్రిపోట వర్గంలో, జుగాంతరవర్గంలో నరేంద్రుడు చూపించిన, సాధించిన కార్యనిపుణతకు, సాహసకృత్యాలకు జతిన్‌కు నరేంద్రుని మీద అచంచలమయిన ప్రగాఢవిశ్వాసం యేర్పడినది. తన తరువాత తనంతవానిగా విప్లవ సారధ్యం బూనగల ప్రముఖ వ్యక్తిగా నరేంద్రుని ఎన్నిక చేసుకున్నాడు.

## మారు వేషాలు - మారు జీవితం :

సురేంద్రనాథ్ బెనర్జీ నాయకత్వం క్రింద మితవాదులు బెంగాలు విభజనను రద్దు చేయించటానికి శతవిధాల ప్రయత్నం చేసినా ఏమాత్రం లొంగని ప్రభుత్వం, విప్లవవాదుల దౌర్జన్యాలకు, లూటీలకు, హత్యలకు, ముఖ్యంగా బెంగాలు ప్రాంతంలో వ్యాపించిన కల్లోలానికి, అరాచకవాదానికి కారణం బెంగాలు విభజన అని గుర్తించి బ్రిటిషు ఇండియా ప్రభుత్వం 1911 ఆగస్టులో భారత చక్రవర్తికి బెంగాలు విభజ-

నను రద్దుచేయాలని సిఫారుసు చేయటం, డిశంబరులో విభజన రద్దుకావటం జరిగినది. కాని రాజధానిని అదే సమయంలో కలకత్తానుంచి ఢిల్లీకి మార్చటం, బెంగాలులోని కొన్ని ప్రాంతాలను బీహారు, ఒరిస్సా రాష్ట్రంలో చేర్చటం జరిగినది. బెంగాలు విభజన రద్దుకు బెంగాలు ప్రజలు హర్షం ప్రకటించారు. కాని విప్లవవాదుల కార్యకలాపాలను, తీవ్రజాతీయవాదాన్ని ప్రభుత్వం అణచలేక పోయినది. విప్లవ సంఘాలను నిషేధిస్తూ ప్రభుత్వం అనేక దమనచర్యలను చేపట్టినది. ప్రజానీకంలో వ్యాపించిన అసంతృప్తిని తొలగించటానికి కొన్ని ఆశలు చూపించినది. అయినా విప్లవ ఉద్యమాన్ని అణచజాలక పోయినది.

1912 డిశంబరు 23 న రాసబిహారీబోసు, వసంతకుమార్ విశ్వాస్ పరదాలోని మహమ్మదీయ స్త్రీల వేషంతో వైస్రాయిని హత్యచేయటానికి బాంబు విసరటంతో 'ఢిల్లీకుట్రకేసు' ఆవిర్భవించినది. దీనితో ప్రభుత్వం తన అస్తిత్వం కొరకు విశేష జాగరూకత నవలంబించి దేశం నలుమూలలా విప్లవవాదుల కొరకు గాలించసాగినది.

హౌరాకుట్ర కేసులో కారాగారవాస శిక్ష ననుభవించి విడుదల చేయబడిన తరువాత నరేంద్రుడు కొంతకాలం ఒకమిత్రుని యింట్లో రహస్య జీవితం గడిపాడు. సాధువేషం ధరించి గురువుకొరకు వెదుక నారంభించాడు. ప్రభుత్వ దృష్టిని మరలించటానికే నరేంద్రుడు ఈ మారువేషం - సన్యాసివేషం ధరించాడు. సాధు వేషంతో వారణాసి, తదితర ప్రాంతాలు పర్యటించాడు. సిపాయి మ్యూటినీలో (1857) పరాజితులయి విరాగులయిన సాధువు లెవరన్నా జీవించివుంటే వారిని కలుసుకొని వారిద్వారా ప్రభుత్వాన్ని ఎదిరించటానికి గెరిల్లా యుద్ధ తంత్రాన్ని తెలుసుకొనాలని నరేంద్రుని ఆశయం. అప్పటికి తనగురువు శివనారాయణస్వామి పరమపదించాడు. మూడు నాలుగు నెలలు వారణాసిలో గడిపి తిరిగి అదే వేషంలో కలకత్తా చేరుకున్నాడు.

నరేంద్రుని సమకాలీకుడయిన భూపతి మజుందార్ అన్నమాట లివి. "నరేంద్రుడు తనవెంట నన్నుకూడ తీసుకొని ఒక సాధువు తరువాత వేరొక సాధువు దగ్గరకు - యీవిధంగా ఎన్నో ఆశ్రమాలు, ఎంతోమంది సాధువుల సందర్శనం చేయించటం వలన నిజంగా ఆయన రాజకీయజీవితం నుంచి విరక్తిచెంది విరాగిగా మారాడని గాఢంగా విశ్వసించాను. కాని యదార్థం వేరు. నరేంద్రుడు

తన భుజాలమీద మోపిన బాధ్యతను నిరాటంకంగా వహించటానికి, విప్లవసంఘాలన్నింటినీ కూడగట్టి ఒక త్రాటిమీద నడిపించటానికి ఈ వేషం వేసాడు."

హౌరాకుట్ర కేసులో తనమీద పడిన కోర్టు ఖర్చులు చెల్లించటానికి నరేంద్రుడు తన సోదరునితో కలిసి చింగ్రిపోటలో వున్న తమ స్వంతయింటిని మూడువందల రూపాయలకు తాకట్టు పెట్టవలసివచ్చినది. తిరిగి వారు ఆ సొమ్ము చెల్లించనూలేదు, ఆ యింటిని స్వాధీన పరచుకొననూ లేదు. సోదరుడయిన సుశీల నరేంద్రుని అంతటి విప్లవవాది కాకపోయినా, నరేంద్రుని కార్యక్రమాలకు అభిమానం చూపుతూ తనశక్తి కొలది నరేంద్రునికి సాయపడుతూ, అవసరమయిన రక్షణకు ఆదుకొంటూ వుండేవాడు. చింగ్రిపోటలో తాము వుండటానికి ఏమీ లేకపోవటంచేత కొంతకాలం వారిద్దరూ కలసి కలకత్తాలో నివాసం యేర్పరచుకున్నారు. కాని ఎప్పుడో కదాచిత్తుగా సోదరుని కలుసుకొనటం వినా నరేంద్రుడు ఎప్పుడూ సుశీలకు అగమ్యగోచరుడు గానే వుంటూ వుండేవాడు.

కొంతకాలం నరేంద్రుడు ఒక ఇన్సూరెన్సు కంపెనీలో ఏజంటుగా పని చేశాడు. మరి కొంతకాలం ఒక ధాన్యం ఫ్యాక్టరీలో గుమస్తాగా చేరాడు. తరువాత కలప అడితీలో బాకీలు వసూలుచేసే బిల్లు కలెక్టరు పుద్యోగం చేసాడు. ఇవి అన్నీ కేవలం తనను తాను మరుగు పరచుకొనటానికే. ఏ వేషం వేసినా 'ఏ వృత్తి చేపట్టినా నరేంద్రుడు తన విప్లవ కార్యక్రమం మాత్రం విడువలేదు. 1912—13 సంవత్సరాలలో జతిన్-నరేంద్రులు కలకత్తాలో వేరు వేరు ప్రాంతాల్లో నివసిస్తున్నా, తప్పని సరిగా రోజూ సాయంత్రం ప్రెసిడెన్సీ కాలేజీ హిందూహాస్టలు దగ్గరకు వెళ్లి విద్యార్థులతో కలిసి టీ సేవిస్తూ వుండటం అలవాటు. తరువాత చీకటిపడగానే వారిద్దరూ సైన్సు కాలేజీ విద్యార్థుల హాస్టలుకు వెళ్లి వారితో రాజకీయాలు చర్చిస్తూ వుండేవారు. జ్ఞానచంద్రఘోషు (వీరు తరువాత విశ్వవిద్యాలయ గ్రాంట్సు కమిటీ అధ్యక్షులుగా పనిచేసినవారు), మేఘనాధ్ సహా (వీరు గొప్ప విజ్ఞానశాస్త్రవేత్తగా పేరు పొందారు. వీరి పేరుతో అణుశక్తి పరిశోధన కేంద్రం స్థాపించబడినది) మొదలయిన వారితో వీరు బాగా పరిచయం చేసికొన్నారు. కాలేజీ విద్యార్థి కాకపోయినా నరేంద్రుడు రాజకీయాల్లో కాలేజీ విద్యార్థులకంటె మిన్నగా రాణిస్తూ వుండేవాడు. స్వతంత్ర భారతావనిలో ప్రభుత్వం యేర్పడవలసిన పద్ధతి, కలకత్తా కార్పొరేషను మున్సిపాలిటీలు, జిల్లా బోర్డులు మొదలయిన స్థానికసంస్థల్లో ప్రజలు శ్రద్ధ తీసికొని

తమ దైనందిన వ్యవహారాలు సరిదిద్దుకొనవలసిన అవసరం, సంఘాభివృద్ధికి చేపట్ట వలసిన కార్యక్రమం, ఇంకా అనేక విషయాలను గురించి వారితో చర్చించుతూ వుండేవాడు. ఆకాలంలో విప్లవవాదుల దృష్టిలో కేవలం బ్రిటిషువాళ్లను వెళ్ల గొట్టటమే పరమావధిగా వుండేది. కాని నరేంద్రుని లాగా ప్రజాభివృద్ధిని గురించి ఆలోచించేవారు చాల అరుదుగా వుండేవారు.

# జతిన్ నాయకత్వం:

జతిన్ - నరేంద్రులు, హరికుమార్ - అమరేంద్రులు, మరికొంతమంది విప్లవవాదులు కలిసి విప్లవసంఘాల వివిధ ముఠాలను, వర్గాలను జతిన్ నాయకత్వం క్రింద సుసంఘటిత మొనర్చి బ్రిటిషు ప్రభుత్వాన్ని కూలద్రోయటానికి సాయుధ తిరుగుబాటును లేవదీయటానికి ప్రయత్నం సాగించారు. జతిన్ తన రాజకీయ గురువయిన నిరాలంబస్వామి (జతీంద్రనాథ్ బెనర్జీ) ని దర్శించి తమ పథకం వారితో చర్చించి వారి అనుజ్ఞ, ఆశీర్వాదం పొందివచ్చాడు. నరేంద్రుడు పాండుచెరీ వెళ్ళి అరవిందునితో సమాగమం జరిపి తమ వ్యూహాన్ని (ఇది మొదట అరవిందుడు విప్లవవాదిగా జతిన్ ముఖర్జీతో చర్చించిన పథకమే) గురించి తెలియబరచి అరవిందుడు తిరిగి రాజకీయాల్లో అగ్రగామిగా ప్రవేశించాలని అర్థించాడు. రాజకీయాలు త్యజించి సన్యాసిగా మారిన అరవిందుడు తన వెనుకటి జీవితమార్గాన్ని చేపట్టటానికి తిరస్కరించటమే కాకుండా నరేంద్రునితో వారి ప్రయత్నం నుంచి విముఖులను చేయటానికి తీవ్రంగా ప్రయత్నించటం కూడా జరిగినది.

అరవిందుడు తమతో సహకరించటానికి నిరాకరించినా జతిన్-నరేంద్రులు తమ పథకాన్ని ఆచరణలో పెట్టటానికి ఏమాత్రం వెనుకంజ వేయలేదు. 'అనుశీలన,' 'ఆత్మోన్నతి' సమితులను ప్రభుత్వం నిషేధించటంవలన క్రొత్తగా 'నేషనల్ రీడింగు సొసైటీ', 'ఫిజికల్ కల్చరల్ సెంటరు' పేర్లతో సంఘాలు స్థాపించబడినవి. విప్లవవాదుల వివిధవర్గాలలో రహస్యంగా సన్నిహిత సంబంధాలు నెలకొల్పబడ్డవి. 1912 లో భోలానాథ్ చటర్జీని సయాము పంపి, అచ్చటి భారత విప్లవవాదులతో సంబంధాలు దృఢతరం చేయటానికి ఏర్పాట్లు జరిగినవి.

1913 ఏప్రియల్‌లో నరేంద్రుడు ప్రముఖనాయకు లనబడే విప్లవకారు లందరినీ కూడగట్టి రహస్య సమావేశం జరిపాడు. సాధారణంగా విప్లవవాదులు ఒకచోట సమావేశమయినప్పుడు బహిరంగ ప్రదేశాల్లో అయితే చుట్టూ కూర్చొని మధ్య ఒక పెద్ద బంతిని పెట్టుకొని కూర్చొనటం అలవాటు. పోలీసులు తమ వునికిని పసిగట్టి ఆ ప్రాంతానికి వస్తే విప్లవ విషయాలు మానివేసి క్రీడా సంబంధమయిన విషయాలను గురించి చర్చిస్తున్నట్లు పెద్దగా సంభాషణలు సాగించటం కద్దు. ఈ సమావేశం కూడా అదే పద్ధతిలో జరిగినది.

"దేశం స్వతంత్రమయ్యే వరకూ మనం సోమరిపోతుల్లాగా కుడిచి కూర్చొన రాదని రక్తతిలకం దిద్దుకొని, రక్తాక్షరాలతో ప్రమాణపత్రంమీద సంతకాలు చేసాము. అనుశీలన సమితిని ప్రభుత్వం నిషేధించినది. అయితే మనం చేయవలసిన పని యిక ఏమీలేదా ? ప్రభుత్వం సాగించే అమానుష కృత్యాలను మనము చూస్తూ వూరుకొనటమేనా ?" అని తాను సమావేశపరచిన విప్లవ వాదులను నరేంద్రుడు హెచ్చరించాడు.

ప్రభుత్వాన్ని సాయుధ పోరాటంతో ఎదిరించి కూలద్రోయాలనే సంకల్పం అందరిలోనూ ప్రస్ఫుట మయినది. ఇందులో ఎవరూ వెనుకంజ వేయలేదు. అయితే 'నాయకు డెవరా ?' అనే ప్రశ్న చర్చకు వచ్చినది. నరేంద్రుని మనస్సులో 'జతిన్ వొక్కడే యిందుకు తగినవాడు' అనే భావం వున్నది. జతిన్ యీసమావేశం లో పాల్గొనలేదు. కాగా నరేంద్రునిపై 'తనపేరు బయటపెట్టవద్దు' అని ఆంక్ష విధించాడు. కాబట్టి జతిన్ ఆజ్ఞానుసారం ఆయన పేరు సూచించకుండా "మనకు తగిన నాయకుడున్నాడు. అయితే ఆయన ప్రస్తుతం తనపేరు బయట పెట్టటానికి యిచ్చగించటం లేదు. కాబట్టి ఆయన ఆజ్ఞలను మీకు ఎప్పటికప్పుడు నేను అందిస్తూ వుంటాను" అని నరేంద్రుడు చెప్పటంతో ఆనాటి సమావేశం ఏ నిర్ణయం లేకుండా వాయిదా పడినది.

ఇది జరిగిన కొన్ని నెలలకే దామోదర నదికి వరదలు రావటంతో మిడ్నపూర్, బర్ద్వాన్ జిల్లాలు మునిగిపోయి పూర్తిగా దెబ్బతిన్నవి. వరద బాధితుల సహాయార్థం విప్లవవాదులందరూ ముందుకువచ్చి తగిన కృషి చేసారు. ఇదే సమయంలో తమ భావి కార్యక్రమం గురించి విపులంగా చర్చించుకొన్నారు. జతిన్ అభిప్రాయం ప్రకారం "విప్లవసంస్థ వికేంద్రీకరణ రూపంలో వుండాలి. ఒకవేళ

ప్రభుత్వ గాలింపులకు, దమనచర్యలకు ఒక ప్రాంతంలో పనిచేసే విప్లవవర్గం గుట్టు బయటపడి బంధింపబడినా మిగిలిన వర్గాలు తమ తమ ప్రాంతాల్లో తమ కార్యకలాపాలు నిర్విఘ్నంగా కొనసాగించేటట్లు వుండాలి. వివిధ ముఠాలకు చెందిన నాయకులు ఒక నిర్ణీత ప్రదేశంలో సమావేశమయి కార్యక్రమం నిర్ణయించుకొనటం వినా ఏ ముఠాలో ఎంతమంది విప్లవవాదులున్నది మిగిలిన ముఠానాయకులు, లేక అనుచరవర్గం తెలుసుకొనటానికి, కలుసుకొనటానికి, ఎట్టి ప్రయత్నం చేయరాదు". నరేంద్రుడు 'కేంద్ర సంస్థను స్థాపించి దానిద్వారా అన్ని ముఠాలను సమన్వయంచేసి సంఘటిత పరచాలని' అభిప్రాయపడ్డాడు. కాని జతిన్ నిర్ణయాన్ని ఎదిరించక అంగీకరించాడు. కాని తరువాత జతిన్ నరేంద్రునితో ఏకీభవించి కార్యాచరణకు కేంద్ర సంఘాన్ని యేర్పరచటానికి అంగీకరించాడు.

అలాంటి కేంద్ర విప్లవ సంఘాన్ని యేర్పరచి దానికి జతిన్ ముఖర్జీని నాయకుని చేయాలని నరేంద్రుని సంకల్పం. నాయకునిగా జతిన్ వ్యవహరించినా విప్లవవాదులందరినీ కూడగట్టి నిర్ణీత కార్యక్రమం చూపించి ఆచరణలో పెట్టటానికి, వారిని కార్యోన్ముఖులను చేయటంలో నరేంద్రుడు ప్రముఖపాత్ర వహించాడు. ఆ సమయంలో నరేంద్రుడు నిర్వహించిన పాత్రను గురించి హరికుమార చక్రవర్తి యీవిధంగా చెప్పాడు. "నరేంద్రుడు లేకపోతే జతిన్‌గాని, జుగాంతర విప్లవసంఘం గాని అంత కొద్దికాలంలో ఛిన్నాభిన్నమయిన విప్లవకారులను సుసంఘటిత పరచి వారిని కార్యోన్ముఖులు చేయటం అసంభవం. జుగాంతర వర్గానికి "విప్లవ సంస్థగా నరేంద్రుడు ఆకారం యేర్పరచితే జతిన్ దానికి ప్రాణం పోసి చైతన్యవంతమయిన రాజకీయ సంస్థగా రూపొందించాడు".

ఇంగ్లండు ఏదైనా ఆపదలో చిక్కుకుంటే అది భారతదేశానికి అవకాశంగా భావిస్తూ వుండేవారు విప్లవవాదులు. ఇంగ్లండుకు శత్రువులుగా కనబడే దేశాలతో సంబంధాలు కల్పించుకొని వాటి సహాయంతో ఆయుధాలు సమకూర్చుకొని గెరిల్లా యుద్ధంచేసి భారతదేశాన్ని స్వతంత్రదేశంగా తీర్చిదిద్దాలని కలలు కంటూ వుండేవారు.

నిరాలంబ స్వామిగా మారిన జతీంద్రనాథ్ బెనర్జీ పంజాబు ప్రాంతంలో విప్లవ ప్రచారంచేసి అనేకమందిని విప్లవకారులుగా మార్చాడు. ఇంగ్లండులో ఉన్నత విద్యకొరకు వెళ్ళిన హరదయాల్ 1908 లో తిరిగివచ్చి పంజాబు విప్లవ

నాయకుడు కిషన్‌సింగుద్వారా బెంగాలు విప్లవవాదుల కార్యక్రమంలో ఆసక్తి చూపాడు. 1911 లో తిరిగి అమెరికా వెళ్ళినప్పుడు అక్కడ 'గదర్' పేరుతో ఒక పత్రికను 'జుగాంతర్ ఆశ్రమ' పేరుతో ఒక సంఘాన్ని స్థాపించి విప్లవ ప్రచారం చేసాడు. 1914 మార్చిలో అమెరికా ప్రభుత్వం హరదయాల్‌ను అరెస్టు చేసినది. అతడు తప్పించుకొని స్విట్జర్‌లాండ్ పారిపోయాడు. అతడు ప్రారంభించిన పత్రిక, ఆశ్రమ బాధ్యతలను రామచంద్ర అనే మరో విప్లవవాది చేపట్టాడు. పింగ్లీ, సత్యసేన్ అను విప్లవవాదులు శాన్‌ఫ్రాన్‌సిస్కోలోని గదర్‌పార్టీ శాఖలో పని చేసారు. గదర్‌పార్టీతో సంబంధాలు యేర్పరచు కొనటానికే జతిన్ సత్యసేనను అమెరికా పంపాడు.

1913 లో హరదయాల్ అమెరికా లోని భారతీయులతో "జర్మనీ ఇంగ్లండుతో యుద్ధానికి ఆయత్త మవుతూ వున్నది. కాబట్టి భారతదేశంలో రాబోవు విప్లవానికి సన్నద్ధులు కావాలని" హెచ్చరించాడు. గదర్‌పార్టీ అమెరికాలోని కొంతమంది సిక్కులను సాయుధ తిరుగుబాటుకు భారతదేశం పంపినది. జర్మనీలోని గదర్‌పార్టీ, జర్మనీదేశస్థులతో కలిసి ఇంగ్లండుకు వ్యతిరేకంగా కృషిచేయసాగినది. బెర్లినులో 'భారతదేశ స్వరాజ్య సంఘ స్థాపన జరిగినది. ఈ సంస్థ కార్యనిర్వాహకుడు ధీరేన్ సరకార్ (బి. కె. సరకార్ సోదరుడు)' 'యుద్ధం సంభవించితే విప్లవ వాదులకు సహాయ పడటానికి జర్మనీ సిద్ధంగా వుందని' 1913 లో జర్మనీనుంచి బెంగాలు విప్లవకారులకు వర్తమానం పంపాడు. అమెరికాలోని గదర్‌పార్టీ ముఖ్యంగా కాలిఫోర్నియా శాఖకు చెందిన భారతీయులు అమెరికానుంచి యుద్ధ సామగ్రిని పంపటానికి శాయశక్తులా కృషిచేయగలమని భారతదేశంలోని విప్లవ వాదులకు హామీ యిచ్చారు.

అమెరికా, జర్మనీ దేశాల్లోని భారత విప్లవవాదుల కార్యక్రమం ముఖ్యంగా బెంగాలు విప్లవవాదులను ఉత్తేజపరచినది. 1913 చివరనుంచీ నరేంద్రుడు కలకత్తాలోని జర్మనీకాన్సల్ ద్వారా జర్మనీ ప్రభుత్వంతో సంబంధం యేర్పరచు కొనటానికి ప్రయత్నం చేస్తూవచ్చాడు. 1914 ప్రారంభంలో కలకత్తా విశ్వవిద్యాలయ రిజిష్ట్రారు ద్వారా జర్మను - కాన్సల్‌తో సమావేశం కావటానికి ఏర్పాట్లు జరిగినవి. ఈ సమావేశం ఎందుకు జరుగుచున్నదో ఆ రిజిష్ట్రారుకు కూడా తెలియదు. "జర్మనీతో వర్తకం చేయాలని, అందుకు కాన్సలు ద్వారా కొన్ని విషయాలు తెలుసు

కొనాలనే" మిషతో యీ సమావేశం యేర్పాటు చేయబడినది. జతిన్ - నరేంద్రులు జర్మనీ - కాన్సలు జనరల్‌తో రిజిష్ట్రారు ద్వారా పరిచయం చేసుకొనిన తరువాత రహస్యంగా అనేక సమావేశాలు జరిపి ఇంగ్లండు - జర్మనీలకు యుద్ధం సంభవిస్తే ఇచ్చట విప్లవవాదులు జరుపబోయే గెరిల్లాయుద్ధం, దానికి అవసరమయిన సొమ్మును, ఆయుధ సామగ్రిని జర్మనీ సహాయం చేయటం గురించి విపులంగా చర్చించారు. జర్మను - కాన్సలు జనరల్ భారతదేశ స్థితిగతులు తెలియపరుస్తూ సహాయం కొరకు తన ప్రభుత్వానికి సిఫారసు చేసాడు.

భారత విప్లవ కారులు దేశవిముక్తికి జర్మనీ మీద ఎన్నో ఆశలు పెట్టుకున్నారు. జర్మనీ ఇంగ్లడుకు బద్ధశత్రువు. కనుక ఇంగ్లండును ఓడించటానికి జర్మనీ తమకు అన్నివిధాల - ధనరూపంలో, ఆయుధ రూపంలో సహాయం చేస్తుందని విప్లవకారుల గాఢవిశ్వాసం. కాని ఏదైనా సహాయంచేస్తే జర్మనీ కేవలం స్వార్థంతోనే చేస్తుందని వీరు వూహించలేదు. "భారత దేశంలో సాయుధ తిరుగుబాటును లేవదీస్తే ఇంగ్లండు అచ్చటి దేశీయ సైనికులను తరలించటానికి వీలులేక పోవటమే కాకుండా ఐరోపా ఖండంలోని తన స్వంతసైన్యాలను కూడా భారతదేశంలో విప్లవం అణచటానికి పంపే అవసరం యేర్పడవచ్చు. అట్టి స్థితిలో జర్మనీ ఇంగ్లండును తేలిగ్గా వోడించటానికి వీలు కలుగుతుంది." ఇది జర్మనీ ప్రభుత్వ ఆలోచన. కనుక భారత విప్లవకారులకు సహాయం చేస్తానని ఆశపెట్టినది. కైజరు ప్రభుత్వం అమెరికా, బటేవియా, మనిలా మొదలైన తమ విదేశ కార్యాలయాలకు, భారత విప్లవకారులకు అన్నివిధాల సహాయం చేయమని ఆదేశాలు పంపినది.

ఈ సమయంలో నరేంద్రుడు తన వుద్యోగానికి స్వస్తిచెప్పి హారీ అండ్ సన్సు దగ్గరలో ఒక చిన్న రెస్టారెంటును తెరచి నావికులకు, సైనికులకు కావలసిన ప్రత్యేక వంటకాలను తయారు చేయించేవాడు. ఈ వంటకాలమీద వున్న అభిరుచితో సైనికులు, నావికులు యీ రెస్టారెంటుకు ప్రత్యేకించి రావటం ప్రారంభించారు. ఈ అవకాశాన్ని వినియోగించుకొని నరేంద్రుడు ప్రభుత్వ రహస్యాలు తెలుసుకొనటానికి, ఆయుధాలు సంపాదించటానికి ఎత్తులు వేయగలిగాడు.

ఇదే సమయంలో విప్లవవాదులను ఉత్తేజ పరచగల వేరొక సంఘటన జరిగినది. 1913 లో కెనడాలో నివసిస్తున్న సిక్కులు భారతదేశంనుంచి తమ

కుటుంబాలను తీసికొని వెళ్లటానికి అచ్చట ప్రభుత్వం నిషేధించినది. కాగా క్రొత్తగా అక్కడకు వెళ్ళదలచిన వారికి కూడా యీ నిషేధం వర్తింప జేయబడినది. చివరకు కెనడావెళ్ళే ఓడలలో భారతీయులకు బుకింగు కూడా లభించలేదు. దీనివలన ముఖ్యంగా సిక్కులలో తీవ్ర అసంతృప్తి చెలరేగినది. ఈ సవాలును ఎదుర్కొనటానికి సింగపూరు వ్యాపారస్థుడయిన సిక్కు గురుదత్తసింగు వివిధ ప్రాంతాలనుంచి 500 మంది సిక్కులను ప్రోగుచేసి జపానువోడను అద్దెకు తీసుకొని కెనడాకు ప్రయాణం కట్టాడు. గదర్‌పార్టీ వీరితో సంబంధాలు పెట్టుకొని వీరిలో విప్లవ ప్రచారం కావించినది. కెనడా ప్రభుత్వం వీరికి తమదేశంలో దిగటానికి అనుమతి నిరాకరించటంతో తిరిగి 1914 సెప్టెంబరులో యీ ఓడ కలకత్తా చేరినది. బ్రిటిషు ప్రభుత్వం వీరిని ఒక సీలుచేసిన రైలుబండిలో బొంబాయి చేర్చటానికి నిశ్చయించటంతో వీరు తిరస్కరించారు. ప్రభుత్వం వీరిని బలవంతంగా ఓడనుంచి కలకత్తా రేవులో దింపటానికి ప్రయత్నించగా ప్రభుత్వ సైనికులను వీరు ఎదిరించి ముఖాముఖి తుపాకి యుద్ధం చేసారు. చాలమంది సిక్కులు ప్రాణాలు కోల్పోయారు. కొంతమందిని ఆస్పత్రిలో చేర్చటం జరిగినది. మరికొంతమంది పారిపోయారు. చివరకు గురుదత్తసింగుతో బాటు 28 మంది సిక్కులు ప్రభుత్వ బారినుంచి తప్పించుకొని బెంగాలు విప్లవవాదుల ముఠాలో చేరారు. ఈ యుద్ధంలో గాయపడిన వారికి నరేంద్రుడు, చింగ్రిపోటవర్గంలోని విప్లవవాది బెనర్జీ కలసి వారికి కావలసిన వసతులను సమకూర్చి ఎంతో సహాయపడ్డారు. ఈ సంఘటన బెంగాలు విప్లవవాదులలో ఉత్సాహం యినుమడింప చేసినది. ఇతర దేశాల్లోవున్న భారతీయులు, గదర్ పార్టీ తమకు సహాయంగా ఆయుధాలు సేకరిస్తున్నారనే విశ్వాసం వీరిలో కలుగ సాగినది.

## సాయుధ తిరుగుబాటు :

1914 ఆగస్టు 4 న బ్రిటిషు ప్రభుత్వం జర్మనీతో యుద్ధం ప్రకటించటంతో మొదటి ప్రపంచయుద్ధం ప్రారంభ మయినది. నరేంద్రుడు కలకత్తాలోని జర్మను కాన్సలుతో తిరిగి రహస్య సమావేశాలు ప్రారంభించాడు. ఒకరోజు రాత్రి చీకటిలో వానజల్లులో 6 అడుగుల 2 అంగుళాల ఎత్తుగల బెంగాలీ యువకుడు ధోవతి ధరించి కలకత్తాలోని జర్మను - కాన్సలు జనరల్‌ను కలుసుకొని మాతృదేశానికి దాస్య

విముక్తి కలిగించాలనే దీక్షలో బ్రిటిషు ప్రభుత్వాన్ని కూలద్రోయటానికి జర్మనీ ఆయుధ సహాయం చేయాలని అభ్యర్థించాడు." కాన్సలు జనరల్ నరేంద్రునికి జర్మనీ ప్రభుత్వం విప్లవవాదులకు ఆయుధ సంపత్తిని సమకూర్చటంలో సహాయ పడగలదని హామీ యిచ్చాడు. ఈ హామీ ఆధారంగా నరేంద్రుడు జతిన్ నాయకత్వం క్రింద బెంగాలులోని అన్ని విప్లవ సంస్థలను సమన్వయ పరచి కేంద్రీకరించటానికి ప్రయత్నించాడు. వివిధ విప్లవసంస్థల నాయకులు రహస్య సమావేశం జరిపి జతిన్ ముఖర్జీని ప్రధాన నాయకునిగా ఎన్నుకొన్నారు.

1914 డిశంబరు 20 న నరేంద్రుని అభ్యర్థనను పురస్కరించుకొని కాన్సలు జనరల్ బెర్లినులోని జర్మను ప్రభుత్వానికి "భారతదేశంలోని రహస్య విప్లవకారుల సంఘాలు, ముఖ్యంగా బెంగాలు రాష్ట్రంలో చాల బలవత్తరమయి ప్రముఖ స్థానాన్ని సంపాదించినవి. కాబట్టి యీ అవకాశాన్ని పురస్కరించుకొని ప్రభుత్వం వీరికి తగిన సహాయం చేయగలిగితే వీరిద్వారా యిక్కడ బ్రిటిషు ప్రభుత్వాన్ని బలహీన పరచవచ్చునని" సిఫారసు చేయటం, దానికి అనుకూలంగా జర్మను ప్రభుత్వం బెంగాలు విప్లవవాదులను తమకు నమ్మిన బంటును తమ ప్రతినిధిగా బటేవియా పంపి అచ్చటి జర్మను అధికారులతో అంతిమ నిర్ణయానికి రావాలని కాన్సులు జనరల్‌కు ఆదేశాలు పంపటం జరిగినవి.

విప్లవ సంస్థలన్నీ మిళితమయి ఒక కేంద్ర సంస్థగా రూపొందినవి. అయితే దీనికి ప్రత్యేకించి యీ సమావేశంలో నామకరణం చేయకపోయినా బాగా ప్రచారంలోవున్న 'జుగాంతర' పేరుతో కరపత్రాలు వేయాలని నిశ్చయించటంతో ఇది రాను రాను 'జుగాంతర్ పార్టీ' గా ప్రచారంలోనికి వచ్చినది. ఢాకా అనుశీలన సమితికి ఈ పార్టీ కార్యక్రమంలో కొన్ని సందేహాలు పొడసూపటంతో ఆ వర్గం వినా రాష్ట్రంలోని తక్కిన అన్ని విప్లవ ముఠాలు యిందులో కలిసి జతిన్ ఆజ్ఞలను శిరసా వహించటానికి అంగీకరించినవి.

నరేంద్రుడు రూపొందించిన సాయుధ తిరుగుబాటు కార్యక్రమానికి జతిన్ ఆమోదముద్ర వేసాడు. సతీష్ సరకార్ (వీరు తరువాత నిర్వాణ స్వామి పేరుతో సన్యాసిగా మారారు) దీనికి రెండు షరతులు చేర్చాడు.

1) రోడ్డు - రైల్వే మొదలయిన రవాణా సౌకర్యాలు, వార్తా సౌకర్యాలు స్తంభింప చేయగల శక్తిసామర్థ్యాలు విప్లవవాదులు కలిగివుండాలి,

2. అవసరమైనప్పుడు ముఖ్యంగా పల్లెప్రాంతాల్లో విప్లవవాదులకు రక్షణ కల్పించి సహాయపడటానికి ప్రజల్లో సానుభూతి, అభిమానం సంపాదించు కొనాలి.

మొదటిది తేలిగ్గా నిర్వహించగలమని యిందుకు తగిన విప్లవ వీరులు సిద్ధంగా వున్నారని నరేంద్రుడు చెప్పాడు. రెండవదానిని గురించి "మనం తగినన్ని ఆయుధాలు సమకూర్చుకొని యుద్ధరంగంలో ప్రవేశించితే ప్రజలు తమంతట తామే మనకు సహాయపడటానికి వుద్యుక్తు లవుతారని, యీ యుద్ధ మూలకంగా బ్రిటిషు సైనికులను యిక్కడనుంచి వివిధ రంగాలకు పంపక తప్పదని తత్ఫలితంగా విప్లవ వాదులను ఎదిరించటానికి అవసరమయిన బ్రిటిషుసైన్యం యిక్కడ వుండదని, భారత సిపాయిల్లో కొంతమంది మనలో చేరటానికి అవకాశం వుందని" చెప్పాడు.

నరేంద్రుడు కార్యాచరణకు పూనుకున్నాడు. బెంగాలు - నాగపూర్ రైల్వే లైనులో ప్రధానమయిన చక్రధర్‌పూర్‌లో ఒక వస్త్రాలయం తెరువబడది. దీనికి అనుబంధంగా కొలది దూరంలో సయాంనుంచి తిరిగివచ్చిన బోలానాథ్‌చే మరొక షాపు తెరువబడినది. బాలసోర్‌లో శైలేశ్వరబోస్ సైకిలుషాపు తెరిచాడు. ఈ విధంగా రహదార్ల - రైల్వేల కూడలి ప్రాంతాల్లో అక్కడక్కడా రకరకాల షాపులు తెరువబడ్డవి. ఇవి ఒకదానితో వొకటి రహస్య సంబంధాలు యేర్పరచు కొన్నవి. అవసరమైనప్పుడు అంటే విప్లవం ప్రారంభం కాగానే రహదార్లను, రైల్వే లైనులను, కమ్యూనికేషన్లను బంద్‌చేసి విచ్ఛిత్తు కావించాలని వీరి పథకం.

జర్మనీ ప్రభుత్వం విప్లవవాదులకు ఆయుధ సామగ్రిని సహాయం చేస్తుందనే వార్త మినహాయించి అప్పటికి ప్రత్యేకించి జర్మనీతో విప్లవవాదులకు ఖచ్చితమయిన ఏర్పాట్లు ఏమీ జరుగలేదు. కనుక యీ మధ్యలో రొడ్డా అండ్ కంపెనీ మీద దాడిచేసి ఆయుధాలు కొల్లగొట్టాలనే నిర్ణయం విప్లవవాదుల రహస్య సమావేశంలో జరిగినది. ఇందులో నరేంద్రుడు ప్రముఖపాత్ర వహించాడు. ఆ కంపెనీలో శ్రీష్‌మిత్రా అను పేరుగల విప్లవవాది ఉద్యోగిగా వున్నాడు. అతడు కూడా యీ సమావేశంలో పాల్గొన్నాడు. 'కొద్ది రోజుల్లో ఆ కంపెనీ పేరుతో ఓడలో ఆయుధాలు వస్తున్నట్లు' అతడు సమాచారం అందచేసాడు. విప్లవ వాదుల పథకం రూపొందినది. "ఓడలోని కొంత ఆయుధ సామగ్రిని మిత్రా విప్లవవాదు లకు అందచేయటం, వారు వాటిని వివిధ రహస్య ప్రాంతాల విప్లవవాదులకు

పంపటం." సెడిషన్ కమిషన్ రిపోర్టు ప్రకారం "1914 ఆగస్టు 26 బుధవారం నాడు రొడ్డా అండ్ కంపెనీ ఉద్యోగి శ్రీష్‌మిత్రా కష్టమ్సు ఆఫీసులో 202 ఆయుధ సామగ్రి పెట్టెలను అప్పగించుకున్నాడు. కాని కంపెనీకి 192 పెట్టెలను అప్పగించి తక్కినవి తీసుకొని రావటానికి వెళ్ళుచున్నట్లు చెప్పాడు. కాని అతడు తిరిగి రాక పోవటంతో మూడు రోజుల తదుపరి పోలీసులకు ఫిర్యాదు చేయటం జరిగినది. మిగిలిన 10 పెట్టెలలోను 50 మాస్టర్ పిస్టల్సు, వాటికి 46000 రౌండ్సు వాడటానికి అవసరమయిన మందువున్నది .... ...."

ఇందులో 25 పిస్టల్సు కలకత్తాలోని విప్లవవాదులు ఒక రహస్య స్థలానికి చేర్చారు. మిగిలిన 25 పిస్టల్సు ఒక పాడుబడిన దేవాలయంలో అర్చకుని ద్వారా దాచిపెట్టారు. పోలీసుల గాలింపు ఎక్కువ కావటంతో గుడిలో దాచిన పిస్తోళ్ళను నరేంద్రుడు వేరొక ప్రాంతానికి చేర్చాడు. ఈ పిస్తోళ్ల నాధారం చేసుకొని విప్లవవాదులు విప్లవనిధి కొరకు అనేక దోపిడీలు, లూటీలు చేసారు. ఇవి సాయుధ తిరుగుబాటుకు వుపయోగపడే ఆయుధాలు కూడాను. రాష్ట్రంలోని ప్రధాన కార్యాలయాలకు వీటిని పంపటం జరిగినది. "ఇందులో 44 పిస్తోళ్ళు 9 విప్లవ కార్యాలయాలకు పంపబడ్డవి. 1914 ఆగస్టు తరువాత వీటి సహాయంతో దాదాపు దొమ్మీలు, హత్యలకు సంబంధించి 54 కేసులు జరిగినవి" అని సెడిషన్ రిపోర్టులో తెలియ పరచబడ్డది.

ఒకరోజున నరేంద్రుడు ఒక పెద్ద భవనం మూడవ అంతస్తులోని ఒక అచ్చాఫీసులో వున్నాడు. ఆయన ముందువున్న టేబిలుమీద 2 పిస్తోళ్ళు, సుందర వన స్థల వివరాలను తెలియబరచే పటము వున్నవి. అప్పుడే బయటనుంచి తలుపు కొట్టిన చప్పుడు. నరేంద్రునితో బాటు వున్న మరొక విప్లవవాది సురేష్ కిది భయోత్పాతాన్ని కలిగించినది. కాని నరేంద్రుడు టేబిలు మీద వున్న పిస్తోళ్ల మీద వార్తాపత్రికల కట్టను పడవేసి తాను కుర్చీలో కూర్చొని ప్రూఫ్‌లు దిద్దుతున్నట్లు నటిస్తూ సురేషన్‌ను తలుపు తెరువమని సౌంజ్ఞచేసాడు. అప్పటి పోలీసు అధికారు లలో అతి తెలివైన వానిగా అర్హత పొందిన 'టేగార్డు' లోపలికి ప్రవేశించాడు. నరేంద్రుడు ఏ మాత్రం చలించలేదు. అతి మర్యాదగా ఆతనిని తనముందు కుర్చీలో కూర్చొనబెట్టి టీ తెప్పించి అరగంటసేపు ఖాతాఖానీ కొట్టాడు. చివరకు టేగార్డ్ అక్కడ రహస్య విప్లవకార్యక్రమా లేమీ జరగటంలేదని, నరేంద్రుడు, తదితరులు అచ్చు పనిలో నిమగ్నులయి వున్నారనే నమ్మకంతో తిరిగి వెళ్ళిపోయాడు.

1914 నవంబరులో సత్యసేన్ అమెరికానుంచి తిరిగి కలకత్తా వస్తూ చైనాలో సన్‌యట్‌సేన్‌ను కలుసుకొని వచ్చాడు. ఆతడు వచ్చిన వోడలో అనేక మంది సిక్కులు, పింగ్లీ కూడా ప్రయాణం చేసారు. కలకత్తా చేరగానే పింగ్లీని, సిక్కుల నాయకుడైన కర్తార్‌సింగును సత్యసేన్ జతిన్ - నరేంద్రులకు పరిచయం చేసాడు. జతిన్ - నరేంద్రులు వీరిని రాస్‌బిహారి దగ్గరకు కొన్ని ఆదేశాలిచ్చి పంపారు. "అమెరికానుంచి 4000 మంది విప్లవకారులు వచ్చారని, సాయుధ తిరుగుబాటు జరుగగానే ఇంకా కొన్ని వేలమంది రాగలరని" పింగ్లీ వర్తమానం తీసికొని వచ్చాడు.

ఢిల్లీ కుట్రకేసు తరువాత రాస్‌బిహారీబోసు వారణాసిలో నివాసం యేర్పరచుకున్నాడు. ఆయన పింగ్లీతో కలసి లాహోరు వెళ్లాలని నిశ్చయించుకొని జతిన్-నరేంద్రులకు వర్తమానం పంపాడు. వీరు, మరికొందరు వారణాసిలో సమావేశమయి సాయుధ తిరుగుబాటుకు ఒక ప్రణాలికను సిద్ధపరచారు. బెంగాలు రాష్ట్రం జతిన్ నాయకత్వంక్రింద, ఉత్తరప్రదేశ్, పంజాబు రాష్ట్రాలు రాస్‌బిహారీ నాయకత్వంలో తిరుగుబాటు జరుపవలసి వున్నది. 1915 ఫిబ్రవరి 21 సాయుధ తిరుగుబాటు రోజుగా నిర్ణయింప బడినది.

పంజాబు మెయిలును రాస్‌బిహారి అమృతసరులో ఆపటం సాయుధ తిరుగుబాటుకు నాందీ చిహ్నంగా నిర్ణయించు కొనబడినది. దీనివలన పంజాబులో విప్లవం చెలరేగినట్లు భావించి విప్లవవాదులు తక్కిన ప్రాంతాల్లోకూడా వెనువెంటనే అందుకు సిద్ధంగా వుండవలసి వున్నది. ఒకవేళ రాస్‌బిహారినుంచి తగిన వర్తమానం సకాలంలో రాకపోవచ్చు ననే సందేహంతో వేరే ఆదేశం అవసరమని ఒకస్కూలు మాస్టరును ప్రత్యేకించి యిందుకు నిర్దేశించటం కూడా జరిగినది. మహారాష్ట్రలో వీరసావర్కారు సోదరుడు డాక్టరు సావర్కార్ (వీరు అప్పుడు కలకత్తా మెడికల్ కళాశాల విద్యార్థిగా వున్నారు), మరికొందరు అదే సమయంలో సాయుధ తిరుగుబాటు చేయాలని నిర్ణయించుకున్నారు. కలకత్తాలోని విప్లవవాదులు 'ఫోర్టు విలియమ్' సైనికులతో సంబంధాలు పెట్టుకొని విప్లవకాలంలో వారితో కలసి ప్రభుత్వం మీద తిరుగుబాటు చేయటానికి పథకం వేసుకున్నారు.

ఇదే సమయంలో అనేక లూటీలు. దోపిడీలు జరిగినవి. పార్టీ నిధికొరకు లక్షరూపాయలు ప్రోగుచేయాలని జతిన్ ఆదేశించాడు. దీని పూర్తి బాధ్యత

నరేంద్రునికి అప్పగించ బడినది. కలకత్తా నగరంలో లూటీలు చేయటానికి కొంత మంది మొదట అభ్యంతరం తెలిపారు. నగరంలోనే చేయాలని, పల్లెప్రాంతాల్లో చేసే పది లూటీలకు నగరంలో ఒకటి సమానమని, దీనివలన ప్రభుత్వ ప్రతిష్ట కూడా భంగపడుతుందని నరేంద్రుడు వారికి నచ్చచెప్పాడు.

1915 ఫిబ్రవరి 12న నరేంద్రుడు యిద్దరు అనుచరులతో కలసి కలకత్తా నగరంలో గార్డెన్‌రీచ్ లోని బర్డ్ అండ్ కంపెనీ పట్టపగలే లూటీ చేసాడు. ఇది విప్లవవాదుల పథకంలో మొదట లూటీ. గార్డెన్‌రీచ్ దొమ్మి కలకత్తా నగరంలో పెద్ద దుమారం లేపినది. మోటారుకారు లూటీగా ప్రసిద్ధి కెక్కినది. నరేంద్రుడు, తన అనుచరులు మోటారుకారులో ముసుగులో వచ్చి తుపాకులు చూపించి అవి ప్రేల్చకుండానే కొన్ని నిముషాలలో తమ పని ముగించుకొని వెళ్ళిపోయారు, ఇదే ప్రకారం తరువాత కూడా విప్లవవాదులు ముసుగులో మోటారు కార్లలో వచ్చి కలకత్తాలో అనేకచోట్ల లూటీలుచేసి పరారు అయ్యారు.

'గార్డెన్ రీచ్' లూటీలో 18000 రూపాయలు లభించినవి. ఇది జరిగిన మరునటి రోజుననే నరేంద్రుడు స్వయంగా జతిన్ దగ్గరకు వెళ్లి లూటీ వివరాలు తెలిపి తానే ఆ సొమ్మును ఆ మరునటి రోజున స్వయంగా జతిన్‌కు అందచేయ గలనని చెప్పి వెళ్లాడు. నిర్ణీతసమయానికి నరేంద్రుడు రాలేదు. జతిన్ చికాకులో పడ్డాడు. 'పోలీసుల బారి నుండి తప్పించుకొనటానికి వేరే మార్గం నుంచి వస్తున్నా డని' వర్తమానం వచ్చినది. తరువాత కొలది గంటలకే 'నరేంద్రుడు పోలీసులకు చిక్కాడు' అనే వర్తమానం రావటంతో జతిన్‌కు నోటమాట రాలేదు. షాక్ తగిలిన వానివలె మూర్ఛావస్థ చెందాడు. 'నా దక్షిణహస్తం తెగగొట్టబడినది' అని ఖిన్నుడయ్యాడు.

పోలీసు స్టేషను మీద దాడిచేసి నరేంద్రుని విడిపించాలనే ఆలోచన జతిన్ మనస్సులో మెదలినది. ఆ మరునాడే పోలీసులు నరేంద్రుని కోర్టులో హాజరు పరచటానికి వ్యానులో తీసుకొని వెళ్లుతారనే వర్తమానం రావటంతో ఆ రోజుకు ఆ ప్రయత్నం విరమించబడినది. మరునాడు వ్యానును ముట్టడించి నరేంద్రుని తప్పించటానికి జతిన్ నలుగురు విప్లవకారులను నియమించాడు. కాని జైలులో నరేంద్రుడు తీవ్రంగా జ్వరపడటంతో అనుకున్న ప్రకారం పోలీసులు రెండవ రోజున కోర్టులో హాజరు పరచటానికి నరేంద్రుని తీసుకొని రాలేదు,

తరువాత నరేంద్రుని బెయిలుమీద జెయిలు నుంచి బయటకు తీసికొని రావటానికి ప్రయత్నం జరిగినది. ఇది అంతతేలికైన పనికాదు. పట్టపగలు దోమ్మీ, అందులో పేరు గాంచిన ప్రముఖ విప్లవవాది అయిన నరేంద్రునికి బెయిలు యివ్వటం అంతతేలికైన విషయం కాదు. ఎలాగైనా నరేంద్రుని విడిపించాలనే కృతనిశ్చయంలో జతిన్ వున్నాడు. ప్రభుత్వం తనమీద యిదివరకే ఒక కన్నువేసి వుంచినది. ఇంతవరకు తాను రహస్య స్థలాల్లో అతిరహస్యంగా వుంటూ వున్నాడు. బయటకు వస్తే ప్రభుత్వ కబంధ హస్తాలకు గురిగాక తప్పదు. అయినా లెక్క-చేయలేదు. తన ప్రాణాల నయినా పణంగాబెట్టి తన ప్రాణంలో ప్రాణమయిన నరేంద్రుని రక్షించాలనే దృఢ నిశ్చయంతో ప్రభుత్వ వకీలు అయిన తారక్‌సాధు దగ్గరకు తానే స్వయంగా వెళ్లి ఆయన సలహా అడిగాడు. ఆతడు ప్రభుత్వ వకీలు అయినా జతిన్ దేశభక్తిని, విప్లవ ఆదర్శాన్ని బాగా తెలుసుకొన్నవా డగుటచేత జతిన్ మీద వున్న అభిమానంతో తగిన మర్యాద నిచ్చి 'నరేంద్రునికి బెయిలు యివ్వాలంటే యీ లూటీలో తనదే పూర్తి బాధ్యత 'ని మరో వ్యక్తి ముందుకు వచ్చి వాగ్మూలం యివ్వవలసి వుంటుందని సలహా యిచ్చాడు. ఆతని సలహా ప్రకారం నరేంద్రుని వెంట వెళ్లిన రాధాచరణ్ అందుకు సిద్ధపడి "తనదే పూర్తి బాధ్యత' అని వాగ్మూలం మీద సంతకం చేసాడు. అతనికి ఏడు సంవత్సరాల కారాగారవాస శిక్ష పడినది. చివరకు అతడు మానసిక రోగంతో పిచ్చివాడై జైలులోనే మరణించాడు. నరేంద్రుడు 1915 ఫిబ్రవరి 22 న వెయ్యి రూపాయల ధరావతు, ఇద్దరు వ్యక్తుల స్వంతపూచీ మీద విడుదల అయ్యాడు. వెంటనే ఒక మిత్రుని దగ్గరకు వెళ్లి రెండువందల రూపాయలు అప్పుగా తీసికొని తరువాత వేరే ప్రాంతంలో వున్న సోదరిని కలుసుకొని ఆ రాత్రే రహస్య ప్రదేశానికి పరారి అయ్యాడు. జతిన్ ఆజ్ఞానుసారం నరేంద్రుని పట్టుకొనిన పోలీసు ఇన్స్పెక్టరు సురేష్ ముఖర్జీ ఫిబ్రవరి 28 న హత్య కావించబడ్డాడు.

రాస్‌బిహారీ మొదట అనుకున్న ప్రకారం ఫిబ్రవరి 21 న గాక తమ ప్లాను రహస్యం బయటపడినదనే అనుమానంతో ఫిబ్రవరి 19 కి నిర్ణయించాడు. అదికూడా విఫలమయినది. ఇందుకు కారణం విప్లవవాదిగా కనబడుతూ వచ్చిన కృపాల్‌సింగు విప్లవవాదుల రహస్యాలను ఎప్పటికప్పుడు ప్రభుత్వానికి తెలియజేస్తూ వచ్చాడు. ఇతడు షాంఘాయిలోని గదర్‌పార్టీలో పనిచేసానని నమ్మించి రాస్‌బిహారీ అనుచరు డయ్యాడు. రాస్‌బిహారీ అతని యందు పూర్తి విశ్వాసముంచి తన

పార్టీలో చేర్చుకున్నాడు. తారీఖు మార్చటం కూడా కృపాల్ సింగు ప్రభుత్వానికి తెలియజేయటంతో రాస్‌బిహారి పథకం భగ్నమైనది.

ఫిబ్రవరి 19 కి ముందే లాహోరులో ప్రభుత్వం పదముగ్గురు విప్లవకారులను పట్టుకొని కొన్ని ఆయుధాలు, విప్లవ సాహిత్యం వశపరచుకొనటం జరిగినది. రాస్‌బిహారి, పింగ్లీలను పట్టించటానికి కృపాల్ సింగు ప్రయత్నించాడు. అదృష్టవశాత్తు వారు తప్పించుకొని పారిపోయారు. లాహోరు కుట్రకేసు జరిగినది. అనేకమంది దీర్ఘ కారాగారవాస శిక్షలకు గురిఅయ్యారు. కర్తారుసింగు ఉరి తీయబడ్డాడు. రాస్‌బిహారి వారణాసిచేరి అక్కడనుంచి బెంగాలుచేరి తరువాత రహస్యంగా 1915 మే 12 న 'పి. యన్. టాగూర్ పేరుతో జపానుదేశం చేరుకున్నాడు. పింగ్లీ సైనికులతో పొత్తు పెట్టుకొని విప్లవ ప్రచారం చేసాడు. చివరకు 1915 మార్చి 23 న ప్రభుత్వం అతనిని బంధించినది. అతని దగ్గర 10 బాంబులు దొరికనవి. పింగ్లీతో బాటు కొంతమంది సైనికులు గూడా బంధింప బడ్డారు. పింగ్లీ ఉరిశిక్షకు గురి అయ్యాడు.

# జర్మనీ సహాయం:

1915 ఫిబ్రవరి 22 న నరేంద్రుడు జెయిలునుంచ విడుదల చేయబడిన రాత్రి జతిన్‌తో కలసికొని కొంతమంది అనుచర వర్గంతో కలిసి ఒక యింటిలోని మారుమూల గదిలో రహస్య సమావేశం జరుపుతుండగా ఒక పోలీసు సబ్ ఇన్స్పెక్టరు గదిలో ప్రవేశించి నరేంద్రుడున్నాడా అని అడిగి జతిన్ ముఖర్జీని గుర్తించి "జతిన్‌బాబూ! మీరిక్కడేం చేస్తున్నారని" ప్రశ్నించాడు. జతిన్ కనుసన్నలతో అతడు అప్పటికప్పుడే పిస్టలుకు గురి అయ్యాడు. వెంటనే వారు మరొక రహస్య స్థలానికి పారిపోయారు. కలకత్తాలో జతిన్ వుండటం ప్రమాదమని భావించి దూర ప్రదేశమయిన మొహందియా అనే వొక పల్లెటూరుకు కొంతమంది అనుచరుల సహాయంతో నరేంద్రుడు జతిన్ ముఖర్జీని పంపాడు. బాలసోర్‌లో స్థాపించిన 'యూనివర్సల్ యంపోరియమ్' పేరుతోనున్న సైకిలుషాపును, కలకత్తాలోని నరేంద్రుడు, తదితర విప్లవవాదులకు జతిన్ ముఖర్జీకి మధ్య ఎప్పటి కప్పుడు సమాచారం అందచేయటానికి ఒక కేంద్రంగా యేర్పరచు కున్నారు.

1915 మార్చిలో అమెరికా నుంచి 2 వోడల్లో ఆయుధ సామగ్రి పంపు చున్నట్లు జర్మనీనుంచి ఒకరు వర్తమానం తీసుకొని వచ్చారు. ఇదే సమయంలో అమెరికానుంచి జర్మనీ ప్రభుత్వ సహాయంతో బర్మాలోని విప్లవవాదులకు (అప్పుడు బర్మా భారతదేశంతోపాటు బ్రిటిషు పరిపాలనలో వుండేది) యుద్ధంలో తర్ఫీదు నివ్వటానికి జార్జిపాల్ బోహమ్ అనే సైనికాధికారిని పంపుచున్నట్లు కూడా వర్తమానం వచ్చినది. ముందు బ్రిటిషు ప్రభుత్వంనుంచి బర్మాదేశాన్ని విముక్తి కావించిన తరువాత బర్మా, సయాము దేశాల్లోవున్న భారతీయుల సహాయంతో బెంగాలు రాష్ట్రాన్ని ముట్టడించాలని విప్లవకారులు ఒక పథకం రూపొందించు కొన్నారు. ఇదే సమయంలో గదర్‌పార్టీ పంజాబు రాష్ట్రంలోనూ, అచ్చట సైని కులలోనూ తిరుగుబాటును లేవదీయాలని నిర్ణయం జరిగినది.

ఈ యుద్ధ తంత్రాన్ని గురించి విపులంగా చర్చించటానికి బెంగాలు విప్లవ వాదులకు వారి తరఫున విశ్వాసపాత్రుడయిన, ఒక ప్రతినిధిని బటేవియా (నేటి ఇండొనేషియా) పంపవలసినదని అచ్చటి జర్మనీ అధికారులు కోరటం జరిగినది. అమరేంద్రనాథ్ చటర్జీ యింట్లో రహస్య సమావేశం జరిగినది. ఇందులో జతిన్, అమరేంద్రుడు, హరికుమార చక్రవర్తి, అతుల కృష్ణఘలేష్ పాల్గొన్నారు. నరేంద్రుడు లేడు. అయినా నరేంద్రుడే దీనికి తగిన వ్యక్తి అని బటేవియా పంప టానికి నిశ్చయించుకున్నారు.

1915 మేలో నరేంద్రుడు మద్రాసు చేరుకొని అచ్చటినుండి హారీ అండ్ సన్సు ఏజంటుగా ఎ. మార్టిన్ పేరుతో ఓడ మీద బటేవియా చేరుకున్నాడు. బటేవియా, కలకత్తాల మధ్య సమాచారం అందటానికి కలకత్తాలోని యీ కంపెనీ పేరును వుపయోగించుకొనటం జరిగినది. ఇది "ఎగుమతులు - దిగుమతులు" నిర్వ హిస్తున్న కంపెనీగా విదేశాలనుండి ధనసహాయం పొందటానికి హరికుమార చక్రవర్తి స్థాపించిన కంపెనీ.

ఇదే సమయంలో మద్రాసులో జాతీయ కాంగ్రెసు మహాసభలు ప్రారంభ మయినవి. ఆ సమావేశానికి మద్రాసు గవర్నరు 'లార్డు పెట్లాండు' ప్రధాన అతిథిగా ఆహ్వానింప బడ్డాడు. ఆతని సమక్షంలో సురేంద్రనాథ్ బెనర్జీ "బ్రిటిషు ప్రభుత్వానికి భారతదేశం యుద్ధంలో మిత్రరాజ్యంగా వుంటుంద"నే తీర్మానం ప్రవేశపెట్టాడు. మహాత్మాగాంధీ కూడా అప్పుడే దక్షిణాఫ్రికా నుంచి భారతదేశం తిరిగి వచ్చాడు.

మద్రాసు సమావేశం కాగానే మొదట బ్రిటిషు ప్రభుత్వానికి అనుకూలంగా తన కృషిని సాగించాడు.

ఒకవంక మహాత్మాగాంధీ భారతీయులను బ్రిటిషు వారికి అనుకూలంగా సైన్యంలో చేరాలని ప్రోత్సహిస్తూ ప్రచారం సాగించగా మరోవంక నరేంద్రనాథ్ భట్టాచార్య బ్రిటిషు ప్రభుత్వాన్ని కూలద్రోయటానికి జర్మనీ సహాయంతో ఆయుధాలు సేకరించి భారతదేశాన్ని దాస్యశృంఖలాల నుంచి విముక్తి కావించటానికి బటేవియా వెళ్లాడు.

బటేవియాలోని జర్మను కాన్సల్ జనరల్ జావాలోని జర్మనీ దేశ వ్యాపారస్థులయిన 'థియోడోర్ హెల్ఫిరిచ్' సోదరులకు నరేంద్రుని పరిచయం చేసాడు. వారు నరేంద్రునితో కరాచీ రేవులోనికి ఆయుధసామగ్రితో ఒక వోడ రాబోతుందని చెప్పటం కరాచీలో విప్లవసంస్థ లేదని, దానిని బెంగాలుకు మరలించ మని నరేంద్రుడు కోరటం జరిగినది. షాంఘాయిలో వున్న జర్మను కాన్సలు జనరల్ అనుమతితో ఓడను మరలించుటకు ఆతడు అంగీకరించాడు. నరేంద్రుడు కలకత్తాలోని 'హారీ అండ్ సన్సు'కి 'వ్యాపారం లాభదాయకంగా వున్నది' అని టెలిగ్రాము పంపాడు. జూన్ నెలలో ఆ కంపెనీ నుంచి 'సొమ్ము పంపమని' నరేంద్రునికి టెలిగ్రాము చేరినది. జర్మనీ వ్యాపారస్థుడయిన హెల్ఫిరిచ్ ఆ కంపెనీ ద్వారా బెంగాలు విప్లవవాదులకు జూన్ - ఆగస్టు నెలల మధ్య నలుబది మూడువేల రూపాయల వరకు చెక్కులు పంపాడు. ప్రభుత్వానికి యీ రహస్యం బయటపడేలోపల విప్లవాదులు బ్యాంకు నుంచి దాదాపు ముప్ఫయి మూడువేల రూపాయలు తీసికొన గలిగారు.

బటేవియాలో వున్నప్పుడు నరేంద్రుడు జావా, మనిలా, సయాము ప్రాంతాల్లోని అనేకమంది భారత విప్లవకారులను కలుసుకొని పరిచయం చేసుకు న్నాడు. ఇందులో ఆత్మారామ్ ముఖ్యుడు. ఇతడు అమెరికానుంచి తప్పించుకొని సయాము చేరి అచ్చటి విప్లవకారులతో కలసి భారతదేశానికి ఆయుధాలు పంపే ప్రయత్నంలో నిమగ్నుడై వున్నాడు. ఈ విధంగా ప్రపంచంలో వివిధ దేశాల్లో మాతృభూమి కొరకు కృషిచేసే విప్లవకారుల నందరినీ కలుసుకొనాలని నరేంద్రుని వాంఛ. బటేవియా నుంచి తిరిగి వచ్చేటప్పుడు స్వయంగా 'ఎ. మార్టిన్' పేరుతో రూ 18000 లకు డ్రాఫ్టు, కొన్ని వేలు ఖరీదుచేసే బంగారు మొహరీలు తీసికొని

వచ్చాడు. బటేవియాలో వున్నప్పుడు కలకత్తాలోని హారీ అండ్ సన్సును పోలీసులు సోదాచేసి అచ్చటి విప్లవవాదులకొరకు గాలింపుచర్య సాగించినప్పుడు బటేవియాలో కూడా బ్రిటిషు గూఢచారులు 'ఒక విప్లవవాది' కొరకు అన్వేషణ సాగించారు. కాని నరేంద్రుడు జాగ్రత్తగా వ్యవహరించటం వలన యీ ప్రమాదాన్ని తప్పించుకో గలిగాడు.

అమెరికా నుంచి ఆయుధాలు తెస్తున్న వోడ - 'యస్. యస్. మావెరిక్' దక్షిణ బెంగాలులోని, 'రాయమంగల్' తీరం చేరే ఏర్పాట్లు చేసి నరేంద్రుడు జూన్ మధ్యలో భారతదేశం తిరిగి వచ్చాడు. ఈ వోడ 3 లక్షల రైఫుల్సు, ఒక్కొకటి 400 సార్లు వుపయోగించటానికి సరిపడే మందు, 2 లక్షల రూపాయలతో వస్తుందని చెప్పబడినది. నరేంద్రుడు భారతదేశం చేరగానే జతిన్‌ముఖర్జీని కలుసుకొని వివరాలు చెప్పాడు. వీరిద్దరూ, మరికొందరు రహస్య సమావేశం జరిపి, ఆయుధాలను, ఆయుధసామగ్రిని వోడ నుంచి ఎలా అందుకొనాలో, అందుకొనిన తరునాత వాటిని ఏయే ప్రాంతాలకు ఎలా చేర్చాలో, చేర్చిన తరువాత వాటిని ఏ విధంగా వుపయోగించాలో మొదలైన విషయాలు చర్చించి ఒక పథకం రూపొందించారు. వారి పథకం ప్రకారం వీటిని మూడు ప్రాంతాలకు చేరవేయవలసి వున్నది.

1. తూర్పు బెంగాలు జిల్లాలకు - హాతియా కేంద్ర స్థావరం - అచ్చటికి ముందుగా కొంతమంది విప్లవకారులు పంపబడ్డారు.
2. కలకత్తా నగరం - దీనికి నరేంద్రుడు నాయకుడు.
3. బాలసోర్ - బెంగాలు పడమటి ప్రాంతాలు. దీనికి జతిన్ ముఖర్జీ నాయకుడు.

నరేంద్రుని అంచనా ప్రకారం జర్మనీతో యుద్ధం ఏర్పడిన ఫలితంగా బ్రిటిషు ప్రభుత్వం హెచ్చుమంది భారత సైనికులను ఇతర యుద్ధరంగాలకు పంపటం జరిగినది. భారత దేశంలో ముఖ్యంగా బెంగాలు రాష్ట్రంలోవున్న బ్రిటిషు సైనికుల బలంకంటె విప్లవవాదులు తమ బలమే హెచ్చుగా వుందని అంచనా వేసుకున్నారు. కనుక యిట్టి పరిస్థితుల్లో బయటనుంచి బెంగాలు రాష్ట్రానికి అదనంగా బ్రిటిషుసైన్యం రాకుండా చేయటానికి కీలకమార్గాలయిన మూడు మార్గాలను అరికట్ట టానికి విప్లవవాదులు పథకం వేసుకున్నారు. జతిన్ మద్రాసు - కలకత్తా మార్గాన్ని విచ్ఛిన్నం చేయటానికి బాలసోర్ కేంద్రంగా ఏర్పరచుకున్నాడు. బోలానాథ చటర్జీ

బెంగాలు - నాగపూరు రైల్వేలైనును విచ్ఛిత్తి చేయటానికి, అజయనది మీదవున్న వంతెనను ధ్వంసంచేసి ఈస్టరన్ రైల్వేలైను విచ్ఛిత్తి చేయటానికి సతీష్‌కుమార్ వినియోగింప బడ్డారు. నరేన్‌ఘోషు, ఫణీచక్రవర్తులు హాతియా వెళ్ళి అచ్చటి ప్రజానీకాన్ని రెచ్చగొట్టి కలకత్తామీద దాడిచేయటానికి నిశ్చయింప బడ్డారు. నరేంద్రుడు, బిపిన్ గంగూలీలు కలకత్తా నగరంలో ఆయుధ కంపెనీలమీద దాడి చేసి వాటిని స్వాధీనం చేసుకొనటానికి, ఫోర్టు విలియమ్‌ను పట్టుకొనటానికి, తరువాత కలకత్తా నగరాన్ని స్వాధీనం చేసుకొనటానికి నియుక్తులయ్యారు. కాని ప్రభుత్వం ఫిబ్రవరి 21/19 సాయుధ తిరుగుబాటు విఫలమయిన తరువాత బెంగాలు రాష్ట్రంలో జర్మనీ సహాయంతో సాయుధ తిరుగుబాటుకు విప్లవ వాదులు చేసే యత్నాన్ని పసికట్ట గలిగినది.

## యస్. యస్. మావెరిక్ :

మావెరిక్ పేరుగల ఓడ ఒక ఆయిలు టాంకరు. ఇది శాన్ ఫ్రాన్సిస్ కోలోని ఒక జర్మను కంపెనీకి చెందినవోడ. 1915 ఏప్రియల్ 22 న యీ వోడ లాస్‌ఏంజిల్సు నుంచి కాలిఫోర్నియా ప్రయాణంచేసి పసిఫిక్ సముద్రం మీదుగా జావా ప్రయాణం చేయటానికి అనుమతి పొందినది. ప్రయాణంలో మెక్సికో దగ్గర ఒక చిన్న ద్వీపం దగ్గరకు యీ వోడ చేరినది. అక్కడ యీ వోడ మరొక పడవ- ఆనీ లారెన్సును కలుసుకోవలసి వున్నది. రెండవది మెక్సికోనుంచి ఆయుధాలు- సామగ్రి తీసికొనివచ్చి యీ వోడకు అందచేయవలసి వున్నది. ఆ పడవలో వచ్చిన రైఫుల్సును మావెరిక్‌లోని ఆయిలు టాంకరులో వేసి దానిని మామూలుగా ఆయిలుతో నింపటం, మందు సామగ్రిని మరొక టాంకరులోవేసి ప్రయాణంలో శత్రువులు తనిఖీచేసే ప్రమాదం యేర్పడుతుందని అనుమానం కలిగినప్పుడు దానిని కూడా ఆయిలుతో నింపే యేర్పాట్లు జరిగినవి. కాని మావెరిక్ ద్వీపం చేరకముందే లారెన్సు అక్కడకు వచ్చి తిరిగి మెక్సికో వెళ్ళినట్లు వర్తమానం రావటంచేత ఆనీ మళ్ళీ వచ్చేవరకు మావెరిక్ అనే ద్వీపం దగ్గర వేచివుంటుందని ఆనీకెప్టెనుకు సందేశం పంపబడినది. కాని ఒక నెలరోజుల వరకు ఆ పడవ తిరిగి రాకపోవటం చేత మధ్యలో మావెరిక్ కెప్టెనుకు అతని యజమానులనుంచి వోడను హవాయి

తీసుకొని వెళ్లమని అక్కడకు తరువాత సమాచారం అందచేస్తామని సందేశం పంపటం వలన ఆ వోడ హవాయి చేరినది. హవాయిలో మరొక జర్మనీవోడ కెప్టెను, 'మావెరిక్'ను అక్కడకు ఆగ్నేయ దిశలోవున్న మరొక ప్రాంతానికి వెళ్ళి ఆనీ లారెన్సు కొరకు వేచివుండమని వర్తమానం అందచేయటం వలన మావెరిక్ ముందుకు సాగినది. కాని ఆ వోడ అక్కడకు చేరగానే ఫలానావోడ ఆయుధాల కొరకు వచ్చినదని అచ్చటి పత్రికలు ప్రచురించటంతో యీ రహస్యం బట్టబయలు అయినది. ఈ వోడలో కొంతమంది గదర్ పార్టీవారుకూడా ప్రయాణం చేస్తున్నారు. బహుశ వారు భారతదేశంలో తాము చేయబోయే ఘనకార్యాన్ని ఘనంగా చెప్పుకొని నందున యీరహస్యం వెల్లడి అయినట్లు వూహించబడినది. హవాయిలో వుండగానే అమెరికన్ అధికారులు దానిని పరీక్షించటం, అందులో వున్న గదర్‌పార్టీ సభ్యులు పర్షియన్ జాతీయులుగా అభినయించటం, తమ దగ్గరవున్న కరపత్రాలను, విప్లవ సాహిత్యాన్ని తగుల బెట్టటం జరిగినది. తన రహస్యం బయటపడటం వలన మావెరిక్ లారెన్సును కలుసుకొనకుండానే జావా ప్రయాణం చేసినది. జావా చేరగానే అక్కడ డచ్ ప్రభుత్వం కూడా ముందు చేరిన సమాచారాన్ని బట్టి దానిని తనిఖీ చేసినది.

ఒక సింగపూరు పత్రిక కథనం ప్రకారం 'యిందులో కొన్ని ఆయుధాలు, ఆయుధ సామగ్రి కూడా వున్నవని డచ్ ప్రభుత్వానికి ముందుగా యీ సమాచారం అందినదనే భీతితో వీటిని ఓడ తీరానికి చేరకముందే సముద్రంలో పారవేయటం జరిగినదని' తెలియ వచ్చినది. మరొక కథనం ప్రకారం "బ్రిటిషు గూఢచారులు ఇందులో భారత విప్లవ కారులకు ఆయుధాలు వస్తున్నట్లు పసికట్టి బ్రిటిషు అధికారులకు తెలియ చేయగా బ్రిటిషు నావలు మావెరిక్ నౌకను వెంటాడినవి. తత్ఫలితంగా ప్రమాదం రాగలదని వూహించి మావెరిక్ నౌక కెప్టెను ఇందులో ఆయుధాలను, ఆయుధ సామగ్రిని, దానికి సంబంధించిన పత్రాల నన్నింటినీ పసిఫిక్ మహా సముద్రములో పా ర వే య ట ం జరిగినది." తరువాత యీ నౌక ఇండోనేషియా హార్బరులో బంధింప బడ్డది. చివరకు యీ వోడ బటేవియాలోని హెల్ఫిరిచ్ ఆధీనం లోనికి వచ్చినది. (నరేంద్రుడు ఎ. మా ర్టి న్ పేరుతో యిందులోనే అమెరికా ప్రయాణం చేసి నట్లు ఒక కథ వున్నది.)

మరొకవోడ 'హెన్రీ. యస్' లో మనిలానుంచి ఆయుధాలు పంపటానికి ప్రయత్నం జరిగినది. ఈ వోడ షాంఘాయికి ప్రయాణం చేయవలసి వున్నది.

ఇది బయలుదేరకముందే మనిలాలో దీన్ని కస్టమ్సు అధికారులు పరీక్షించి ఇందులో వున్న ఆయుధాలు, ఆయుధ సామగ్రిని స్వాధీనం చేసుకొనటం జరిగినది. ఈ ఓడలో అమెరికా నుంచి బర్మాలో విప్లవవాదులకు సైనిక శిక్షణ యివ్వటానికి వచ్చిన జర్మను అధికారి జార్జిపాల్ బొహెమ్ కూడా వున్నాడు. ఇతను సెప్టెంబరు 27 న సింగపూర్‌లో అరెస్టు చేయబడ్డాడు. మనిలాలో జర్మను - కాన్సలుకు ఇతని రాకను గురించి పంపిన రహస్య ఉత్తరం ఫ్రెంచి అధికారులు పట్టుకొని బ్రిటిషు అధికారులకు అందచేయగా వారు సింగపూరులో జార్జిపాల్‌ను అరెస్టు చేయ గలిగారు.

ఇందులో 5000 రివాల్వర్లు పంపుతూ 500 బ్యాంకాక్‌లో దించి మిగిలినవి చిటంగాగ్ చేర్చాలని మనిలాలోని జర్మను - కాన్సలు జనరల్ బొహెమ్‌ను ఆదేశించాడు. కాని మొదట్లోనే సంధి కొట్టడంతో యీ పథకం కూడా విఫలమయినది.

# జతీంద్రుని వీరోచిత పోరాటం :

బటేవియా వెళ్ళేముందు నరేంద్రుడు టెలిగ్రాఫు - సిగ్నలింగు ట్రెయినింగుకు ఒక సెంటరు, గెరిల్లా యుద్ధ తంత్రానికి మరొక ట్రెయినింగు సెంటరును ఏర్పాటు చేసాడు. ఇవి చాల రహస్యంగా ఏర్పాటు చేయబడ్డవి. ఇందులో 50 మంది యువకులు తర్ఫీదు పొందటానికి యేర్పాట్లు చేయబడ్డవి. నరేంద్రుడు కూడా వేరే రహస్య స్థలంలో వుండి అప్పుడప్పుడు యీ కేంద్రాలకు వెళ్ళి తనిఖీ చేస్తూ వుండేవాడు. మధ్యలో మొహందియా వెళ్ళి జతిన్‌తో భావి కార్యక్రమం గురించి చర్చించి వస్తూ వుండేవాడు.

బటేవియాలో జర్మను -కాన్సలు జనరల్‌ను, హెల్ఫెరిచ్ (హెరీ-ఫెరిక్స్) సోదరులను కలుసుకొని బెంగాలు విప్లవ వాదులకు ధనం, ఆయుధ సామగ్రిని పంపే యేర్పాట్లు చేసి నరేంద్రుడు జూన్‌లో తిరిగి భారతదేశం వచ్చాడు. మొదట మేఘపట్నం వచ్చి అచ్చటినుంచి మద్రాసు చేరి తాను బటేవియా నుంచి తెచ్చిన చెక్కును అచ్చటి బ్యాంకులో మార్చటానికి ప్రయత్నించాడు. కాని అప్పటికి

ఆ బ్యాంకుకు బటేవియా బ్యాంకు నుంచి ఎట్టి సమాచారం లేనందున అచ్చట మార్చజాలక తరువాత కలకత్తాలో మార్చటం జరిగినది.

మద్రాసు నుంచి తాను బయలుదేరి వస్తున్నట్లు నరేంద్రుడు కలకత్తాకు టెలిగ్రామ్ పంపాడు. ఇది గమ్యస్థానం చేరలేదు. పోలీసులు చేజిక్కించుకొన్నారేమో ననే అనుమానం కలుగక పోలేదు. కలకత్తా చేరిన తరువాత నరేంద్రుడు వోడ కొరకు రెండు వారాలు ఎదురు చూచి తరువాత ఇద్దరు విప్లవ వాదులను 'రాయ్‌మంగలు' కు పంపాడు. ఆయుధ సామగ్రిని నింపుకొని వస్తున్న వోడకు ప్రత్యేకంగా మూడు లైట్లు అమర్చి వుంటవని గుర్తు చెప్పటం వలన దానిని గమనించటానికి రాయ్‌మంగలు చేరిన యిద్దరు విప్లవకారులు వంతుల ప్రకారం ఒక ఎత్తైన చెట్టు పై కొమ్మమీద కూర్చొని నిద్రాహారాలు లేక రాత్రింబవళ్ళు నిరీక్షించ సాగారు. కాని వారికి ఓడ వచ్చే ఆమూకి ఏమాత్రం కనపడక పోవటంతో నిరాశా పూరితులయి వెనుదిరిగి వచ్చారు. 11/669 — 10195

మావెరిక్ నౌకలో భారత విప్లవకారులకు ఆయుధ సామగ్రి రావటం, దానిని డచ్ ప్రభుత్వం సోదాచేయటం, మొదలయిన సీలివార్తలు బటేవియా పత్రికల్లో పడటం, ఆ వార్తలు భారతదేశం చేరటం జరిగనది. బెంగాలు పోలీసులు వీటి నాధారం చేసుకొని తమ గాలింపు చర్యలను తీవ్రతరం చేసారు. అనుమానం గల ప్రతి వ్యక్తిని, ప్రతి ఆఫీసును సోదా చేయ సాగారు.

అనుకొన్న సమయానికి ఆయుధ నౌక రాకపోవటంతో ఏదో ప్రమాదం జరిగి వుండవచ్చుననే అనుమానం నరేంద్రునికి కూడా కలిగినది. కాలం వృథా చేస్తూ ఆ ఓడ కొరకు ఎదురు చూడటంకంటే మళ్ళీ బటేవియా వెళ్ళి పరిస్థితులను స్వయంగా తెలుసుకొని తగిన నిర్ణయం చేసుకొనటం మంచిదని భావించాడు. వెళ్ళేముందు నరేంద్రుడు మొహందియా వెళ్ళి జతిన్‌తో పరిస్థితులన్నీ వివరించిన మిదట ఈశాన్య ప్రాంతమయిన అస్సాం సరిహద్దుల ద్వారా ఆయుధ సామగ్రిని చేరవేయాలనే నిర్ణయానికి వచ్చి ఆగస్టులో తనవెంట ఫణిచక్రవర్తిని కూడా తీసుకొని బటేవియా వెళ్ళాడు. ఆయుధాలు రాగానే వాటిని అందుకొని తగిన రక్షణ స్థలాలకు చేర్చటానికి ముందుగానే కొంతమంది విప్లవ కారులు సీషా ప్రాంతానికి చేరుకున్నారు.

భారతదేశ విముక్తికి నరేంద్రుడు విదేశంలో కాలుపెట్టి కార్యం గిట్టెక్కించటానికి మునిగి తేలు తున్నాడు. ఇచ్చట పోలీసులు తమ గాలింపు చర్యలో హారీ అండ్ సన్సును సోదా చేయటం జరిగినది. అచ్చట దొరికిన సమాచారాన్నాధారం చేసుకొని బాలసోర్‌లోని యూనివర్సల్ యంపోరియమ్ సైకిలు షాపును సోదా చేసారు. అది మొహందియాలోని జతిన్ ముఖర్జీకి, కలకత్తాలోని విప్లవ కేంద్రానికి రహస్య సమాచారాలు నడిపే కేంద్రం. అచ్చట దొరికిన రహస్య పత్రాల నాధారం చేసుకొని పోలీసులు మొహందియా వచ్చారు. అచ్చటి పల్లెవాసులను నయాన, భయాన దగ్గరకుచేర్చి, 'కొంతమంది దోపిడిగాండ్రు రహస్యంగా అడవుల్లో కాపురం చేస్తున్నారని' వారి వునికి చెప్పితే లక్షలు బహుమానం యిస్తామని ఆశలు చూపి సమాచారం తెలుసుకొని అడవులు గాలించి చివరకు జతిన్ రహస్య స్థావరాన్ని కనుగొన్నారు.

జతిన్ అడవుల మధ్య చిత్తప్రియ, మనోరంజన్ అను యిద్దరు అనుచరులతో, చిన్న కుటీరంలో నివాసం యేర్పరచు కున్నాడు. అచ్చటికి నాలుగైదుమైళ్ళ దూరంలో నిరేన్, జ్యోతిష్ వేరే నివాసం యేర్పరచు కున్నారు. పోలీసు గాలింపు చర్యలను పసిగట్టి వీరైదుగురు నిద్రాహారాలు లేక మూడు రోజులు అడవులమధ్య తిరుగుతూ ఒక నది వొడ్డుకు చేరి నది దాటటానికి పడవ సహాయం కోరగా అచ్చటి పల్లెవాసులు పోలీసులు చెప్పిన గుర్తు ప్రకారం వీరిని పోల్చుకొని "దోపిడిగాండ్రుగా పర్గించుకొని" పోలీసులకు సమాచారం అందచేయగా, పోలీసులు వీరిని వెంటాడటంతో వీరు తప్పించుకొని నదివొడ్డున మరికొంత దూరం ప్రయాణం చేసి తమ దగ్గర వున్న మందు సంచులను తలకు కట్టుకొని యీతతో నదిని దాటి ఒక చిన్నగుట్ట చాటున దట్టమైన చెట్లమధ్య తమ రక్షణస్థానం ఏర్పరచు కొన్నారు. అనుచరులు జతిన్‌తో "మీరు తప్పించుకొని ముందుకు పారిపొండి. మేము పోలీసు బలగాన్ని మా ప్రాణాలిచ్చి ఆపుచేయగలము. విప్లవానికి మీ నాయకత్వం అవసరమని" ఎంత ప్రాధేయ పడినా జతిన్ అంగీకరించక 'విజయమో - వీరస్వర్గమో' అందరం కలిసి పోరాడుదా మనే కృతనిశ్చయ నికి వచ్చాడు.

కేవలం నలుగురి సహాయంతో ఏభై మందికి పైగావున్న బ్రిటిషుబలాన్ని అంతకుముందు మూడు రోజులనుండి తిండి, నిద్రలేకపోయినా వీరోచితంగా మూడు గంటలసేపు నిలబెట్టి పోరాడిన జతిన్‌గాధ భారత విప్లవకారుల చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖింపబడినది. చిత్రప్రియ తుపాకి గుండు దెబ్బకు నేల కొరిగాడు.

జతిన్ గుండెలో నుంచి తుపాకి గుండు దూసుకొని పోయినది. శరీరమంతా రక్తధారలు ప్రవహించ సాగినవి. అయినా తన సంకల్పం విడువలేదు. చిత్రప్రియ తలను తన వొడిలో పెట్టుకొని ఒకదాని తరువాత ఒకటి ఏకధారగా గుండ్లు పేల్చటం మానలేదు. తన దగ్గరవున్న గుండ్లు అయిపోవటంతో కొత్త సంచిని తెరువటానికి ప్రయత్నించాడు. విధి ఎదురు తిరిగినది. ఆ సంచి తాళం చెవి పోయినది. రక్తస్రావం వలన, నిద్రాహారాలు లేకపోవటం చేత జతిన్, మిగిలిన ముగ్గురు మూర్ఛావస్థలో పడ్డారు. ఈ అదను చూచుకొని సైనికులు వారిని పట్టుకొన్నారు.

సాయంత్రానికి చిత్రప్రియ శవంతో బాటు గాయపడిన నలుగురినీ బాలసోర్ ఆస్పత్రికి చేర్చటం జరిగినది. జిల్లా అధికారి జతిన్‌ని 'ఏమైనా చెప్ప దలిచావా' అని అడిగినప్పుడు "అవును. దీనికంతటికీ బాధ్యుడను నేనే. బ్రిటిష రాజ్యం క్రింద నా మిత్రులయిన వీరికి ఏమాత్రం అన్యాయం జరుగకుండా చూడండి" అని సమాధానం చెప్పాడు. జతిన్ శరీరంలోని గుండ్లను తీసి అతని ప్రాణం రక్షించటానికి డాక్టర్లు విశ్వప్రయత్నం చేసారు. మొదట ఆశారేఖలు కన్పించినా చివరకు బ్రతుకుతాడనే ఆశ కనబడలేదు. సైన్యానికి నాయకత్వం వహించిన పోలీసు కమీషనరు సర్. టేగార్డు జతిన్‌ను సమీపించి విచార వదనంతో "నేనేమైనా సహాయం చేయగలనేమో చెప్పండి" అని అడిగినప్పుడు చిరునవ్వుతో "ఏమీ అక్కరలేదు. మీకు దన్యవాదాలు. అంతా అయిపోయినది. నమస్కారం" అని అంతిమ యాత్ర చేసాడు.

తరువాత టేగార్డు అచ్చటి జనంతో "నేను భారతీయుల్లో సాహసోపేత మయిన వీరుని ఎదుర్కొన వలసి వచ్చినది .... .... నావిధి నిర్వహణ నేను చేయక తప్పినదికాదు" అని తన విచారం ప్రకటించాడు.

నిరేన్, మనోరంజన్‌లు తరువాత ఉరిశిక్షకు గురి అయ్యారు. వారు 'భారతదేశంలో బ్రిటిష రాజ్యం నశించాలి' అని కేకలు వేస్తూ ఉరికంబా లెక్కారు. జ్యోతిష్ అండమాను దీవులకు పంపబడ్డాడు. తరువాత అతడు బరహంపూరు జైలులో చనిపోయాడు. చనిపోయే ముందు జైలు గోడమీద జతిన్ సాహసగాధను వర్ణిస్తూ వ్రాసాడు. జతిన్ అమరజీవి అయ్యాడు. 23-9-1923 లో సర్దారు భగత్ సింగు జతిన్ స్మృతి చిహ్నంగా పంజాబులో 'అమరవీరుల దినం' జరిపాడు.

నాజ్రుల్ ఇస్లామ్ కవి బాలసోర్ యుద్ధాన్ని 'నవభారత్'కు నాందిగా గానా లాపం చేసాడు. పోలీసులు జతిన్ కొరకు వెంటాడిన రహదారి నేడు ఆయన స్మృతి చిహ్నంగా 'బాఘ్ (పులి) జతిన్ రోడ్డు'గా పిలువబడుతూ వున్నది.

మనిలాలో వుండగా నరేంద్రుడు జతిన్ మరణవార్తను విన్నాడు. ఈ హృదయ విదారకమైన వార్తకు ఆయన స్థైర్యం చలించి మిక్కిలి ఖిన్నుడయ్యాడు. జతిన్ పనుపున తానీ ప్రయాణం కట్టి రెండవసారి బటేవియా వచ్చాడు. 'ఈసారి యుద్ధ సామగ్రి లేకుండా నేను వెనుదిరిగి రానని' జతిన్ చేతిలో చేయివేసి ప్రమాణం చేసి వచ్చాడు. 'ఈ విపత్కర ఘోర చర్యకు ప్రతిగా బ్రిటిషు ప్రభుత్వానికి ప్రతీకారం చేసి తీరుతాను' అని దృఢనిశ్చయంతో శపథంచేసి ఆయుధ సేకరణకు, ఆయా ప్రాంతాల్లో ప్రవాసం అనుభవిస్తున్న భారత విప్లవ కారులను కలుసుకొనటానికి నరేంద్రుడు ఆగ్నేయాసియాలోని అన్ని దేశాలు గాలించాడు.

## చివరి ప్రయత్నం :

సముద్ర ప్రాంతం ద్వారా ఆయుధ సామగ్రి చేరవేయటంలో బ్రిటిషు గూఢచారుల, నౌకల వలయాన్ని ఛేదించటం ప్రమాద భరితం అని వూహించి కాబోలు రెండవసారి భారతదేశ ఈశాన్య సరిహద్దులోని సీఫా ప్రాంతం నుంచి బెంగాలు రాష్ట్రానికి ఆయుధాలు చేరవేయాలనే పథకంతో నరేన్ బటేవియా వెళ్లాడు. ఆ ప్రాంతంలోని కొండ జాతులవారు బ్రిటిషు ప్రభుత్వాన్ని ఎప్పుడూ అంగీకరించక ఎదురు తిరుగుతూ వుండేవారు. ఆయుధ సేకరణకు అక్కడకు పంపబడ్డ విప్లవ వాదుల ద్వారా కొండ జాతులను కూడగట్టుకొని బ్రిటిషు ప్రభుత్వానికి వ్యతిరేకంగా రెచ్చగొట్టి రాబోయే ఆయుధాలద్వారా వారి సహాయంతో ప్రభుత్వాన్ని పడగొట్టి విప్లవం విజయవంతం చేయటానికి ఒక పథకం రూపొందించ బడినది.

బటేవియా చేరగానే నరేంద్రుడు జర్మను - కాన్సలు జనరలును, హెల్ఫిరిచ్ సోదరులను కలుసుకొని సీఫా ప్రాంతం ద్వారా ఆయుధ సహాయం కొరకు అభ్యర్థించాడు. మొదట్లో చూపిన ఆసక్తి ఉత్సాహం యీ సారి వారిలో కనబడలేదు,

ఒకటికి నాలుగుసార్లు కలుసుకున్నాడు. ప్రయోజనం కలుగలేదు. 'భూమి మీద నుంచి ఆయుధాలు సప్లయి చేయటం అసంభవం' అని వారు సమాధానం చెప్పారు. తరువాత ఇండోనేషియా నుంచి ఆయుధాలు సముద్రం ద్వారా తీసుకొని రావటానికి కూడా ప్రయత్నించాడు. ఈ పథకం ద్వారా ముందు అండమానుదీవుల నాక్రమించు కొని అచ్చటి జైలు శిక్ష ననుభవించే భారతీయులను విడుదలచేసి వారికి ఆయుధాలిచ్చి వారిని ఒరిస్సా ప్రాంతంలో దించాలని, చైనీయుల ద్వారా ఆయుధాలను, ఆయుధ సామగ్రిని కూడా భారతదేశం చేర్చాలని నరేంద్రుడు ప్రయత్నించాడు. ఇవి కూడా ఫలించలేదు. ఆయుధాలు ఇతరత్రా ఖరీదు చేయటానికి కావలసిన సొమ్మును యివ్వటానికి జర్మను - కాన్సలు జనరల్ మొదట వాగ్దానం చేసాడు. కాని తీరా అవసర మయినప్పుడు అతడు నరేంద్రునికి కనబడకుండా అంతర్ధాను డగుటచే యీ ప్రయత్నం కూడా విఫలమైనది.

వరుసగా ఒకటి తరువాత ఒకటిగా నరేంద్రుని ప్రయత్నాలు విఫలం కాసాగినవి. జర్మనుల మీద పెట్టుకొన్న ఆశలు నిరాశలు కాసాగినవి. నరేంద్రు నిలో అసంతృప్తి, వ్యాకులత పెరుగసాగినవి. అయినా తన ప్రయత్నం విరమించ లేదు. జర్మనులనుంచి కొంత ధనం సంపాదించి, భారతదేశంలో విప్లవ కార్య క్రమాలు స్థభించకుండా వుండటానికి ఆ మొత్తం విప్లవకారులకు పంపే యేర్పాట్లు చేసి, నరేంద్రుడు టోకియోలో ఒక వర్తకుని చిరునామా ఆధారంతో జపాను ప్రయాణం కట్టాడు.

భారత విప్లవకారులలో అగ్రగామిగా పేరుగాంచిన రాస్‌బిహారి బోసు ఫిబ్రవరి విప్లవం విఫలం కావటంతో లాహోరు కుట్రకేసు నుంచి తప్పించుకొని జపానుచేరి ప్రవాసంలో వున్నాడు. బోసు సహాయంతో ఆయుధ సేకరణకు ప్రయ త్నించ వచ్చుననే ఆశతో నరేంద్రుడు జపాను దేశం చేరుకున్నాడు. జపాను సహాయంతో తెల్లజాతుల నన్నింటిని పారద్రోలి మొత్తం ఆసియా ఖండాన్నే విముక్తి కావించాలనే కోర్కెతో రాస్ బిహారీబోసు జపానులో తిష్ట వేసుకున్నాడు. నరేంద్రుడు జపాను చేరగానే బోసును కలుసుకొని తన రాకకు కారణం చెప్పాడు. బోసు జపానుద్వారా మాతృదేశ విముక్తికి కృషి చేయటం అవసరమని సూచించా డు. ఆయన జపాను ఆసియా ఖండాన్ని పరాధీనత నుంచి విముక్తి చేయగలదనే నమ్మకంలో వున్నాడు. నరేంద్రున కిది సమ్మతం కాలేదు. యుద్ధంలో జపాను ఇంగ్లండుతో కలిసి పోరాడుచున్నది. అట్టి జపానుదేశం భారతదేశ విముక్తికి

సహాయం చేయటం అసంభవమని నరేంద్రుడు వాదించినా ప్రయోజనం లేక పోయినది. యుద్ధం అంతమయ్యే వరకు వేచివుండాలని తరువాత పరిణామాలు భారత దేశానికి అనుకూలంగా పరిణమించ గలవనే రాస్‌బిహారీ వాదనలో యే మాత్రం పస కనబడలేదు. కాగా అంతవరకు వేచివుండటం కార్యసాధకుని లక్షణం కాదనీ, తన రాక కొరకు ఎదురు తెన్నులు చూస్తూ అజ్ఞాతంగా ప్రమాదావస్థలో తన సహచరులు సీఫా ప్రాంతంలో సరియైన రక్షణ, సదుపాయాలు లేక పడిగాపులు పడుతున్నారనీ నరేంద్రుడు కలత చెందాడు. రాస్‌బిహారి వలన ఏ మాత్రం సహాయం లభించదనే విషయం తేల్చుకున్నాడు. తరువాత అక్కడే 1913 జూలైలో చైనాలో పరాజయం పొంది తలదాచు కొంటున్న సన్ - యట్ - సేన్‌ను కలుసుకున్నాడు. ఆయన కూడా జపాను మీద గంపెడు ఆశ పెట్టుకొనినట్లు కనబడటం చేత నరేంద్రుడు పూర్తిగా నిరుత్సాహం చెందాడు.

1915 లో భారత సరిహద్దు ప్రాంతాలయిన చైనా దక్షిణ రాష్ట్రాలలో తిరుగుబాటు చెలరేగినది. దీనికి ప్రధాన కారణం సన్-యట్-సేన్ ప్రభావమేనని నరేంద్రుని దృఢవిశ్వాసం. అందుకని సన్-యట్-సేనుని కలుసుకొని 'భారత - చైనా ప్రజల ఏకైక లక్ష్యం తమ మాతృదేశాలను విదేశీ శృంఖలాలనుంచి విముక్తి కావించు కొనటమే' కనుక దక్షిణ రాష్ట్రాలలోని చైనా తిరుగుబాటు దారులు భారత సరిహద్దులకు ఆయుధాలు పంపగలిగితే భారత ప్రజలు కూడా తమ పోరాటాన్ని కొనసాగించి స్వాతంత్ర్యం పొందగలరని, అందుకు సన్ - యటే-సేన్ తన పలుకుబడిని వుపయోగించి సహాయం చేయాలని నరేంద్రుడు అభ్యర్థించాడు. సన్-యట్-సేన్ ఇందుకు ఒక షరతు పెట్టాడు. "పెకింగులో వున్న జర్మనీ రాయబారిని నరేంద్రుడు కలుసుకొని అతని నుంచి 5 మిలియన్ల డాలర్ల ధనసహాయం పొందాలి. ఆ మొత్తం సొమ్ముతో చైనా తిరుగుబాటు దారులు తమ పోరాటాన్ని విజయవంతం చేసుకొనేటట్లు తాను చేయగలనని దానికి ప్రతిఫలంగా వారి దగ్గర వున్న ఆయుధాలు భారత విప్లవ కారులకు అందేటట్లు తాను ప్రయత్నించ గలనని" చెప్పాడు. మాతృదేశ విముక్తియే పరమావధిగా భావించిన నరేంద్రుడు సన్ - యట్ - సేన్ అంతరార్థాన్ని పూర్తిగా గ్రహించలేక పోయాడు. 'తన దేశం స్వతంత్రం పొందటానికి ఇదొక మంచి అవకాశం' గా భావించి చైనా బయలు దేరాడు,

తరువాత రాయ్ తన స్వీయ గాథల్లో సన్ - యట్ - సేన్‌ను గురించి యిలా వ్రాసాడు. "సన్-యట్-సేన్‌తో మొదటి పరిచయం కావటంచేత ఆయన భావాలను పూర్తిగా అర్థం చేసుకొనలేక పోయాను. తరువాత అనేక సంవత్సరాలకు చైనా చరిత్రను, చైనాలో జరుగుచున్న విప్లవాలను పూర్తిగా అర్థం చేసుకొనిన తరువాత సన్-యట్ - సేన్ అప్పటి తిరుగుబాటును సమర్థించ లేదని, ఇందుకు కారణం ఆ తిరుగుబాటు నాయకుడైన యూనాన్ గవర్నరు తన ప్రత్యర్థి లిబరల్ పోలిట్ (పార్టీ) సభ్యుడయిన లియాన్-చిన్‌చావో అనుయాయురు కావటమే నని తెలుసుకున్నాను."

నరేంద్రుడు జపానులోని నాగసాకిలో దిగినప్పటినుంచి జపాను పోలీసులు ఆయనను ఒక కంట కనిపెట్టి వెంటాడుతూనే వున్నారు. కనుక నరేంద్రుడు పోలీసులను తికమకలుచేసి మభ్యపెట్టటానికి తన చైనా ప్రయాణం కొరియా దేశం గుండా 'డొంకతిరుగుడు ప్రయాణం' చేయటానికి నిశ్చయించుకున్నాడు. జపానులో వున్న రెండవరోజు మధ్యాహ్నం నరేంద్రుడు ఒక పెద్ద షాపులో ప్రవేశించాడు. ఈ షాపు సందర్శించే వారు, విదేశస్థులతో సహా బయట ద్వారం దగ్గరే తమ బూటులను వదలి షాపు వారిచ్చే గుడ్డ బూటులను ధరించ వలసి వుంటుంది. బజారులో బూట్లకు అంటుకొనిన మట్టి షాపులోని పరిశుభ్రమయిన పాలగచ్చును, తివాచీలను మలినం చేయరాదని వారి ఆంక్ష. నరేంద్రుడు అదేవిధంగా బయట ద్వారం దగ్గర తన బూట్లు వదలి లోపల ప్రవేశించాడు. ఆ బూట్లను తదేక ధ్యానంతో నిరీక్షిస్తూ నలుగురు పోలీసులు దూరంగా నిలబడి కాపలా కాయసాగారు. నరేంద్రుడు షాపు లోపల 2, 3 గంటలు గడిపి మామూలు ద్వారాన్ని తప్పించి వెనుకగేటు గుండా సరాసరి రైల్వేస్టేషనుకు వెళ్ళాడు.

మరునాడు ఉదయమే నరేంద్రుడు ఫూసాన్‌నది దాటి కొరియా రాజధాని అయిన సియోల్‌కు వెళ్ళే రైలులో తరువాత స్టేషను ముక్డెనుకు టిక్కెట్టు తీసుకొని సియోల్‌లోనే దిగి అక్కడినుంచి చిమూల్‌పో రేవు చేరుకొని అచ్చట నుంచి షాంఘైన్‌వాన్ లేక టింటోసిన్ వెళ్ళాలని నిశ్చయించుకున్నాడు. గదర్‌పార్టీ ప్రముఖ నాయకు డొకడు అక్కడ వుంటున్నాడని రాస్‌బిహారి చెప్పటంచేత అచ్చట దిగాలని నరేంద్రుని మొదటి తలంపు. ఒకవేళ పోలీసులు అప్పటికీ వెంటాడితే వారిని మోసగించాలనే దృష్టితో తన అభిప్రాయం మార్చుకొని సరాసరి షాంఘైన్‌వాన్

వెళ్లకుండా ఓడ నుంచి డైరెన్‌లో దిగి అచ్చట నుంచి ముక్డెను రైలులో వెళ్లి ముక్డెను నుంచి పెకింగు వెళ్లాడు. పెకింగు కూడా సరాసరి వెళ్లకుండా మధ్యలో ఒకరోజు షాంఘైన్‌వాన్‌లో ఆగి అక్కడనుంచి లోకల్‌రైలు మీద టింటోసిన్ చేరాడు.

స్టేషను ప్లాట్‌ఫారం మీద ఒక బ్రిటిషు పోలీసు అడ్డు రానే వచ్చాడు. వచ్చి 'గుడ్ మార్నింగ్, మిస్టరు వైట్' అని పలకరించాడు. (జపానులో నరేంద్రుడు యీ పేరుతో వున్నాడు.) పోలీసు మాటలు విననట్లుగా నటించి నరేంద్రుడు ముందుకు సాగటానికి ప్రయత్నించాడు. కాని లాభం లేకపోయినది. అతడు మళ్ళీ అడ్డంవచ్చి 'మీరు మీ గమ్యస్థానం చేరేముందు నా వెంట కొన్ని నిముషాలు రావలసి వుంటుందని' హెచ్చరించాడు. ఈ విషయాన్ని గురించి రాయ్ తన స్వీయగాథల్లో ఈవిధంగా వ్రాసాడు. 'ఎక్కడకు ? ఎందుకు ?' అని నేను ప్రశ్నించాను. 'పోలీసు స్టేషనుకు, నేను పోలీసు అధికారిని' అని అతడు సమాధానం చెప్పాడు. అంతకు ముందు యీ స్టేషను రషియన్ల అధీనంలో వున్నదని, ఒక బజారుదాటితే అవతల జర్మను లున్నారని తెలుసుకున్నాను. కనుక నేను మరో ప్రయత్నం చేశాను. 'ప్రయాణం వలన నేను బాగా బడలిక చెందివున్నాను. ముందు ఒక మంచి హోటలుకు వెళ్లవలసి వున్నది...మనం యిప్పుడు బ్రిటిషు ప్రాంతంలో లేము గదా !' అన్నాను. అతడు వెంటనే 'అది వేరే సంగతి. నా బాధ్యత నాకు తెలుసు. మిమ్ములను ఎక్కువ కాలం ఆపను. నా వెంట రావాలి' అని ఆజ్ఞాపించాడు.

"పోలీసు స్టేషనులో అతడు నన్ను కొన్ని ప్రశ్నలు అడగటం, నేను సమాధానం చెప్పటం జరిగినది. చివరకు అతడు 'మీరు ఈ రాత్రికి ఇక్కడే వుండవలసి వస్తుంది. మీకు అవసరమయిన సౌకర్యాలన్నీ చేయబడగలవు. జపాను నుంచి కొంత సమాచారం రావలసి వున్నది" అని చెప్పాడు. తనను కొట్టి బాధిస్తారేమోననే భయం నరేంద్రునికి కలిగినది. చివరకు 'నేను వస్తున్నట్లు మీరు ఎలా తెలుసుకున్నారు ?' అని ప్రశ్నించటం, అతడు నవ్వి 'జపాను పోలీసులు కడు సమర్థవంతులు. గుడ్ నైట్ !' అని చెప్పి వెళ్లటం నరేంద్రుని ఇనుప కటకటాల గదిలో బంధించటం జరిగినది.

జైలు అనుభవం నరేంద్రునికి క్రొత్తగాదు. అట్టి స్థితిలోగూడా నరేంద్రుడు ఏటల తరబడి నిద్రపోవటం అలవాటు చేసుకున్నాడు. ఇప్పుడూ అదే చేసాడు.

తెల్లవారక మునుపే ఫలహారం, పాలు వచ్చినవి. తరువాత ఒక పోలీసు వచ్చి 'కాన్సలేటు దగ్గరకు నా వెంట రావాలి' అని ఆదేశించాడు. త్రోవలో కారులో అతడు నరేంద్రునితో కాన్సల్ జనరల్ కోర్టులో హాజరు పరచటానికి తీసుకొని వెళ్లు చున్నట్లు చెప్పాడు. తనమీద మోపబడిన నేర మేమిటో తెలుసుకొనటానికి నరేంద్రుడు ప్రయత్నించాడు. 'జపానునుంచి రిపోర్టు కొరకు ఎదురుచూస్తున్నాము' అని అతడు సమాధానం చెప్పాడు.

కాన్సల్ జనరల్ ముసలివాడు. అయినా దర్పంగా వున్నాడు. చూపుల్లో కటువు కనబడినా మాటల్లో నమ్రత ప్రస్ఫుటించినది. కోర్టులో హాజరు పరచగానే అతడు నరేంద్రు నుద్దేశించి అడిగిన ప్రశ్నలు - 'జపాను ఎందుకు వెళ్లారు ? విప్లవ వాది అయిన రాస్‌బిహారీని, అతని ఏజంట్లను అచ్చట ఎందుకు కలుసుకున్నారు ? భవిష్యత్తులో మీరు చేయబోయే పని యేమిటి ?'

నరేంద్రుడు వినయపూర్వకంగా సమాధానం చెప్పాడు. 'నేను ఉన్నత విద్యాభ్యాసానికి ఇంగ్లండు వెళ్లే ప్రయత్నంలో వున్నాను. కాని యుద్ధం నా ప్రయాణానికి ఆటంకం కలిగించినదని' పూర్వాపరాలను కాన్సల్ జనరల్‌కు నమ్మకం కుదిరేటట్లు మేళవించి చెప్పాడు. అతడు శ్రద్ధగా విని పోలీసు అధికారితో 'జపాను నుంచి నీకేమైనా వ్యతిరేక రిపోర్టు వచ్చినదా ?' అని అడగటం అతడు 'లేదు సార్ ! త్వరలో రాగలదని ఆశిస్తున్నానని' చెప్పడంతో కాన్సల్ జనరల్ తన కళ్ల అద్దాల నుంచి ఆ పోలీసును తీవ్రంగా చూచి నరేంద్రుని వదలిపెట్టమని ఆజ్ఞాపించాడు.

ఆ పోలీసు అధికారి ముఖం కందగడ్డగా మారినది. 'ముసలి తొక్క' అని తనలో తాను తిట్టుకుంటూ నరేంద్రుని 'మీ రెక్కడికి వెళ్ళదలచారు ?' అని ప్రశ్నించటం, నరేంద్రుడు మళ్ళీ 'ఒక మంచి హోటలుకు' అని సమాధానం చెప్పటం, 'ఇక్కడ ఒక మంచి హోటలు వున్నది. అయితే అది బ్రిటిషు ప్రాంతం లోనిది' అని అతడు వ్యంగ్యంగా చెప్పటం. 'నేను బ్రిటిషు పౌరుడను. నేను అక్కడికే వెళ్ళతాను' అని నరేంద్రుడు ఘాటుగా సమాధానం చెప్పి అక్కడికే వెళ్లాడు. అది నిజంగా మంచి హోటలు. నరేంద్రుడు స్నానంచేసి తృప్తిగా భుజించాడు. వెంటనే ఆ నగర పటాన్ని తీసుకొని వివరంగా పరిశీలించి మధ్యాహ్నం రిక్షాలో చైనీయులు నివసించే ప్రాంతానికి బయలుదేరాడు. అక్కడనుంచి ప్రక్కనే వున్న ఒక చిన్న ఏరు సమీపానికి వెళ్ళాలని నరేంద్రుని ఆలోచన. 'నది అవతల

జర్మను ప్రాంతము. కాని రెండు రిక్షాలు తనను వెన్నాడటం నరేంద్రుడు గమనించాడు.

చీకటి పడసాగినది. నరేంద్రుడు దగ్గరలోని ఒక పెద్ద షాపులో ప్రవేశించి అవి, ఇవి చూస్తూ కాలం గడుప సాగాడు. వెంటాడుతున్న పోలీసులు విసుగు పుట్టటంతో టీ సేవించటానికి ప్రక్కనున్న హోటలులో ప్రవేశించారు. ఈ అవకాశం చూచుకొని నరేంద్రుడు నెమ్మదిగా ప్రక్కవాకిలి గుండా బయటపడి ఒక చిన్న సందు ద్వారా ఏటివొడ్డుకు చేరి బోటువాని చేతిలో ఒక వెండి నాణెము పెట్టి అవతల వొడ్డుకు చేరాడు. నరేంద్రుడు నిరపాయ స్థితిలోనికి వచ్చాడు. మరునాడు ఉదయమే అచ్చటి జర్మను కాన్సలేటుకు వెళ్ళి కాన్సలు జనరల్‌తో తన పథకం గురించి చర్చించాడు.

అచ్చటనుండి నరేంద్రుడు తిరుగుబాటు జరిగిన దక్షిణ రాష్ట్రీయమయిన హాంకో వెళ్లి యూనాన్ నాయకులను కలుసుకొని ఆయుధాలను, ఆయుధ సామగ్రిని 5 మిలియన్ల డాలర్లకు అమ్మే ఏర్పాటును ఖరారు చేసుకొని పెకింగు వచ్చి జర్మనీ రాయబారితో యీ పథకం గురించి చర్చించాడు. జర్మనులకీ పథకం బాగానే నచ్చినది. కాని జర్మను రాయబారి నరేంద్రుడు 'ఇంత పెద్దమొత్తంగల పథకం ఆమోదం పొందాలంటే తనకు అధికారంలేదని జర్మనీ ప్రభుత్వ యుద్ధకార్యాలయ అనుమతి వుండాలని, దీన్ని జర్మనీ పంపవలసిన అవసరంవుందని, కనుక నరేంద్రుడు స్వయంగా బెర్లిను వెళ్ళటం మంచిదని సలహా చెప్పాడు. ఇందుకు నరేంద్రుడు తీవ్ర అసంతృప్తిని వ్యక్తం చేసి అంతవరకు వేచివుంటే పరిస్థితులు చేయిజారి పోవచ్చునని వెంటనే సహాయం చేయాలని జర్మను రాయబారిని వత్తిడి చేసాడు. అతడు తన అసహాయతను వ్యక్తం చేస్తూ మాటల ధోరణిలో 'జర్మనీ సహాయం లేనిదే మీరు ఏమీ చేయలేరా?' అని నరేంద్రుని చులకనగా చూడటంతో నరేంద్రుడు రెచ్చిపోయాడు. 'భారత విప్లవకారులు ఏ విదేశీ సహాయం మీద ఆధారపడి వుండలేదు. ముఖ్యంగా జర్మనీ భారత విప్లవ కారులకు చేసే సహాయం స్వార్థదృష్టితో, స్వలాభాపేక్షతో చేయాలనుకొనటం మేము సహింపరాని విషయం' అని నిర్మొగమాటంగా సమాధాన మివ్వటంతో అతడు నరేంద్రుని మాటలకు తన డాంబికం వదలుకొని క్షమాపణ చెప్పుకునే ధోరణిలో మాట్లాడ సాగాడు.

ఈ సంఘటన గురించి రాయ్ తన స్వీయగాధల్లో చెప్పిన మాటలు - "శ్వేతజాతేతరుడయిన ఒక యువకుడు ఘాటుగా సమాధానం చెప్పుతాడని అతడు

వూహించి వుండలేదు. నేనేమి మాట్లాడుచున్నానో నాకు తెలియ దన్నట్లుగా అతడు చులకనచేసి నన్ను రెచ్చగొట్టాడు. నేనేమి మాట్లాడుచున్నానో నాకు బాగా తెలుసు అని అతనికి సమాధానం చెప్పాను. బ్రిటిషు ప్రభుత్వం ఇండియాను పోగొట్టుకొనటమంటే వారు యీ యుద్ధంలో దాదాపు పరాజితులయినట్లే, కనుక యీ యుద్ధంలో 5 మిలియన్ల డాలర్లు ఒక లెక్కగా పరిగణించరాదు. నేను భారత యుద్ధాన్ని గెలువాలను కొనటం జర్మనీదేశం కొరకు కాదు" అని ఘాటుగా మాట్లాడాను. నరేంద్రుని నిర్మొగమాట సమాధానానికి జర్మనీ కాన్సలు జనరల్ పశ్చాత్తాప పడటమే కాకుండా క్షమాపణ చెప్పుకొని నరేంద్రుడు బెర్లిను వెళ్లటానికి అవసరమయిన యేర్పాట్లు చేయటానికి సిద్ధపడ్డాడు.

తన రెండవ ప్రయాణంలో నరేంద్రుడు దాదాపు ఒక సంవత్సరంపాటు ఇండోనేషియా, మలయా, ఇండోచైనా, ఫిలిప్పైన్సు, జపాను, కొరియా, చైనా దేశాలు ఆయుధ సేకరణకు విఫలప్రయత్నం చేసి చివరకు నిరాశచెందినా, తన తూర్పుదేశాల ప్రయాణంలో నరేంద్రుడు అచ్చటి విప్లవనాయకులైన సిగ్‌మన్‌రీ, హోచిమిన్ మొదలైనవారిని కలుసుకొని ఆ యా దేశాల విప్లవ కార్యక్రమాలను గురించి తెలుసుకొనటమేగాక వారి పోరాటాలకు నూతనోత్సాహం సమకూర్చాడు. కొరియా స్వాతంత్ర్య నాయకుడు సిగ్‌మన్‌రీ రాయ్‌ని గురించి 'ఆయన తన దేశం కొరకు తీవ్రపోరాటాన్ని సాగిస్తున్న వీరుడు. ఆయన విప్లవభావాలు నన్ను ఉత్తేజ పరచి నాకు మార్గదర్శకమయినవి" అని వర్ణించాడు.

## అమెరికా ప్రయాణం :

పెకింగులోని జర్మను కాన్సలు జనరల్ నరేంద్రుడు కోరిన ప్రకారం వెంటనే ఆర్థిక సహాయం చేయటానికి తన అసమర్థతను వెల్లడించినా తన బెర్లిన్ (అమెరికా ద్వారా) ప్రయాణానికి తోడ్పడటం నరేంద్రుని అదృష్టంగా భావించవచ్చును. ఇది నరేంద్రుని నూతన జీవితానికి తొలిమలుపు. దాదాపు ఒక సంవత్సరం ఆసియాఖండంలోని తూర్పు దేశాలన్నీ తిరిగి ఆయుధ సేకరణలో విఫలుడయిన నరేంద్రుడు తిరిగి భారతదేశం వెళ్ళితే ఎన్నో ఆశలతో తన రాక కొరకు కళ్లు

కాయలు కాచుకొని వేచి వున్న తన అనుచర వర్గానికి ఏమి చెప్పాలో తోచలేని స్థితిలో పడ్డాడు. జతిన్ చేతిలో చేయివేసి 'ఆయుధాలతోగాని యీసారి తిరిగిరాను' అని చేసిన ప్రమాణం తరువాత జతిన్ విషాద మరణం నరేంద్రుని మనస్సును కలవర పెట్టుతూనే వున్నవి. ఇన్నిచోట్ల నానాబాధలు పడి పొందలేని సహాయం బెర్లిను వెళ్ళినంత మాత్రాన జరుగుతుందా అనే సంశయం నరేంద్రునికి లేకపోలేదు. అయినా ఆ ప్రయత్నం కూడా ఎందుకు చేయరాదనే పట్టువల సడలలేదు. బెర్లిను వెళ్ళటానికి తుదినిర్ణయం చేసుకున్నాడు. ముందు అమెరికావెళ్లి అచ్చటి జర్మనీ రాయబారిని కలుసుకొని అవసరమయితే అచ్చటినుంచి జర్మనీ వెళ్లాలని నరేంద్రుడు నిశ్చయించుకున్నాడు.

నరేంద్రుడు అమెరికా వెళ్లటానికి మరొక కారణంకూడా వున్నది. తాను తూర్పుదేశాల్లో పర్యటిస్తున్నప్పుడు అచ్చట ప్రవాసంలోవున్న భారత విప్లవ కారుల ద్వారా అమెరికాలోని గదర్‌పార్టీని, భారత విప్లవ కారులను గురించి అనేక విషయాలు తెలుసుకొన్నాడు. అప్పటినుంచీ నరేంద్రుడు వారిని కలుసుకొని, వారి విప్లవ కార్యక్రమాలను తెలుసుకొనాలనే ఆసక్తిలో వున్నాడు.

పెకింగులోని జర్మను కాన్సలు జనరల్ తన అమెరికా ప్రయాణానికి సహాయపడ్డాడు. పసిఫిక్ సముద్రం మీదుగా అమెరికానుంచి జర్మనీ వెళ్లటానికి ప్యాస్‌పోర్టు వసతులు కల్పించబడ్డవి. పాండుచేరీ నుంచి క్రైస్తవ మత ప్రచారానికి అవసరమయిన ఉన్నత విద్యాభ్యాసం కొరకు ప్యారిస్ వెళ్ళుచున్నట్లు నరేంద్రుడు 'ఫాదర్ మార్టిన్' పేరుతో క్రిస్టియన్ మతప్రచారకుని వేషంతో చేతిలో బైబిలు, చేతిగొలుసుకు క్రాసును ధరించాడు. ఒక అమెరికన్ వోడలో ప్రయాణం సాగించాడు.

ద్వితీయ ప్రపంచ యుద్ధంలో నేతాజీ సుభాస్‌చంద్రబోస్ జర్మనీ సహకారంతో మాతృదేశాన్ని విముక్తి కావించాలనే దృఢ సంకల్పంతో మారు వేషంలో భారత సరిహద్దులను దాటి జర్మనీదేశం వెళ్లినట్లు కొందరు చరిత్రకారుల కథనం. అదే దృష్టితో, అదే దృఢసంకల్పం, దృఢకాంక్షతో అంతకు ముందు పాతిక సంవత్సరాల క్రితం ప్రథమ ప్రపంచ యుద్ధంలో మారువేషంలో నరేంద్రుడు అమెరికా, అచ్చటినుండి జర్మనీ వెళ్లటానికి ప్రయాణం కట్టాడు.

తన యీప్రయాణంలో నరేంద్రుడు అనేక యిబ్బందులకు గురి కావలసి వచ్చినది. నౌక జపాను చేరే లోగానే బ్రిటిషు అధికారులు ఓడను ఒకటికి రెండు

సార్లు తనిఖీ చేయటం జరిగినది. ఓడ అధికారులు ఓడలోని ఒక చెక్కను తొలగించి నరేంద్రుని లోపలకు దించి మళ్ళీ చెక్క బిగించారు. సముద్ర మధ్యంలో మరొకసారి గూడా యిదే విధంగా నరేంద్రుడు దాగుకొనవలసి వచ్చినది. అమెరికా తీరం చేరేవరకు నరేంద్రుడు తోడి ప్రయాణీకులకు ఏమాత్రం అనుమానం కలుగని విధంగా ప్రవర్తిస్తూ కేవలం మత ప్రచారకునిగా కనబడి వారితో మత సంబంధమయిన అనేక విషయాలు చర్చిస్తూ నిరపాయంగా తన ప్రయాణం సాగించాడు.

నరేంద్రుడు అమెరికా పడమటి తీరంలోని శాన్‌ఫ్రాన్‌సిస్కో రేవులో అధికారుల కనుగప్పి సురక్షితంగా దిగ గలిగాడు. వెంటనే స్టాన్‌ఫర్డు విశ్వవిద్యాలయ నగరం చేరుకొని అచ్చట ఉన్నత విద్య నభ్యసించటానికి వచ్చిన ధన్‌గోపాల్ ముఖర్జీతో పరిచయం చేసుకొన్నాడు. ఇతడు నరేంద్రుని అనుచరుడు, భారత విప్లవకారుడు అయిన జదుగోపాల్ ముఖర్జీ సోదరుడు. నరేంద్రుని రాకను గురించి ధన్‌గోపాల్‌కు ముందుగానే తెలియపరచటమైనది. అదే సాయంత్రం నరేంద్రుడు ధన్‌గోపాల్ సలహా ననుసరించి తన తలిదండ్రులు పెట్టిన పేరు మార్చుకొని మానవేంద్రనాథ్ రాయ్ (యమ్. యన్. రాయ్) - అని నూతన నామకరణం చేసుకున్నాడు. ఈ మార్పు తన వెనుకటి జీవితాన్ని వదిలి నూతన జీవితాన్ని ప్రారంభించటానికి నాందిగా పరిణమించటం మరీ ఆశ్చర్యకరమైన విషయం.

## అమెరికాలో :

నరేంద్రుడు భారతదేశంలోనూ, తూర్పుఆసియా దేశాల పర్యటనలోనూ అమెరికా దేశం, అమెరికావాసుల గురించి అనేక గాథలు విన్నాడు. 'ప్రజాస్వామ్యానికి పెట్టనికోట,' 'విదేశీ విప్లవకారులకు రక్షణ గృహం,' 'మానవ నాగరికతకు, విభిన్న దేశస్థుల సహజీవనానికి ఆదర్శభూమి'గా వర్ణింపబడుచూ వుండేది. 'స్వర్గ ధామం కాకపోయినా ఆ పవిత్ర భూమి'ని దర్శించాలనే అభిలాష నరేంద్రునిలో ప్రబలంగా వుండేది.

నరేంద్రుడు అమెరికాతీరం చేరగానే అచ్చటి దినపత్రికలన్నీ పసిగట్టి నరేంద్రుని గురించి మొదటి పేజీలో ప్రముఖంగా వార్తలు ప్రచురించినవి. 'ఒక

నిగూఢమయిన శత్రువు దేశంలో ప్రవేశించాడు. అతడు ప్రసిద్ధ హిందూ బ్రాహ్మణ విప్లవకారు డయినా కావచ్చు, లేక జర్మను ప్రభుత్వానికి చెందిన గూఢచారి అయి వుండ వచ్చును', అని. కాని నరేంద్రుని ప్యాస్‌పోర్టు ప్రకారం 'మార్టిన్ ఫ్రెంచి దేశానికి చెందిన రేవునుంచి ఉన్నత విద్యకొరకు అమెరికా ద్వారా ప్యారిస్ ప్రయాణం చేస్తున్నాడని' వున్నది. నౌకలోని ప్రయాణీకులు నరేంద్రుడు ఫ్రెంచి రేవునుంచి ఓడ ఎక్కలేదని చెప్పటంతో అనుమానం కలిగి పత్రికలు రకరకాలుగా వార్తలు ప్రచురించినవి. హోటలుకు చేరిన నరేంద్రుడు యీ వార్తను చూచి హడావుడిగా అప్పటి కప్పుడు హోటలు ఖాళీచేసి దగ్గరలోవున్న స్టాన్‌ఫర్డ్ విశ్వ విద్యాలయ నగరమయిన 'పాలోఆల్టో' రహస్యంగా చేరుకున్నాడు. ధన్‌గోపాల ముఖర్జీకి నరేంద్రునిరాక ముందుగా తెలిసి వుండుటచేత ఆతిధ్యమిచ్చి కొంతకాలం తన దగ్గరే రక్షణయిచ్చి అట్టిపెట్టుకొన్నాడు.

ధన్‌గోపాల ముఖర్జీ విద్యార్థి దశలోనే మంచి వక్త, కవిగా రాణించాడు. నరేంద్రుని గత చరిత్రను విస్మరింపచేసి నూతన జీవితానికి దోహదం కలుగజేసాడు. ఆ విశ్వవిద్యాలయంలో నరేంద్రుడు కొంతకాలం అధ్యయనం సాగించాడు. అచ్చటి వాతావరణం, అధ్యయనం, ధనగోపాలునితో సహచర్యం, చర్చలు నరేంద్రునిలో నూతన భావాలను రేకెత్తించినవి. అంతర్జాతీయ రాజకీయాలు, కాపిటలిజమ్, సోషలిజమ్ గురించి విశేషంగా తెలుసుకొన గలిగాడు. తత్ఫలితంగా నరేంద్రుని మనస్సు దౌర్జన్య రాజకీయాలనుంచి, జాతీయవాదం నుంచి అంతర్జాతీయ తత్వానికి మళ్లసాగినది.

అమెరికా ప్రథమ ప్రపంచ యుద్ధంలో చేరక మొదట కొంతకాలం తటస్థ వైఖరి అవలంబించినది. అందువలన భారత విప్లవకారులు బ్రిటిషు వ్యతిరేక ప్రచారం చేసినా, జర్మనులతో ఆయుధ సహాయానికి మంతనాలు జరిపినా అమెరికన్ ప్రభుత్వం జోక్యం కలిగించుకొన లేదు. 'ప్రజాస్వామ్యాన్ని రక్షించాలి' అనే పిలుపుతో ప్రశిడెంటు విల్సను అమెరికన్ విదేశాంగ విధానాన్ని మార్చి యుద్ధంలో ఇంగ్లండుకు సహాయంగా పాల్గొనటంతో పరిస్థితులు మారినవి. భారత విప్లవకారుల చర్యలు అరికట్టబడినవి. జర్మనులపై నిర్బంధాలు విధించబడ్డవి. పోలీసుల నిఘా ఎక్కువ కావటంచేత జర్మనులు, భారత విప్లవ నాయకులు అంతకుముందు తిరుగు చున్నట్లు కలిసిమెలసి తిరుగటానికి వీలు లేకపోయినది. బ్రిటిషు వ్యతిరేక ప్రచారం

సాగించటానికి వున్న అవకాశాలు సన్నగిల్లినవి. పైగా అమెరికన్ పత్రికలు ఆసియాలో తూర్పుదేశాల్లో, ఆగ్నేయ ప్రాంతాల్లో 'హిందూ - జర్మను కుట్ర' విరివిగా జరుగుచున్నదని ప్రకటించ సాగినవి. దీని ఫలితంగా అనుమానితులు అయిన జర్మనులు, భారత విప్లవకారులు కొందరు బంధింప బడ్డారు.

ఇట్టి పరిస్థితుల్లో రాయ్ ఎక్కువకాలం శాన్‌ఫ్రాన్సిస్కోలో వుండటం క్షేమకరం గాదని భావించాడు. బహిరంగంగా సంచరించ టానికి వీలులేదు. రహస్యంగా కొద్దికాలం అక్కడవుండి తరువాత న్యూయార్కు వెళ్ళాడు. శాన్ ఫ్రాన్సిస్కోలో వుండగా రాయ్‌కి అమెరికన్ యువతి 'ఇవెలిన్' తో పరిచయ మేర్పడి పరిచయం స్నేహంగా, ప్రేమగా మారినది. ఇవెలిన్ రాయ్‌తో కలిసి న్యూయార్కు వెళ్ళినది. ఒక కథనం ప్రకారం - ఇవెలిన్ తండ్రి పోలీసులకు రిపోర్టు చేయటంవలన రాయ్ అరెస్టు చేయబడ్డాడు. కాని ఇవెలిన్ రాయ్‌ని వివాహం చేసుకొనటానికి నిశ్చయించు కొన్నానని కోర్టులో చెప్పటంచేత రాయ్ విడుదల అయ్యాడు. తరువాత వీరిద్దరూ వివాహం చేసుకొని 1925 వరకు కలిసి వున్నారు. ఇవెలిన్ అప్పటి రాయ్ రాజకీయ జీవితంలో ప్రముఖపాత్ర వహించి ఎంతో అండ దండగా వున్నట్లు కొన్ని సాక్ష్యాధారాలు కనబడుచున్నవి. మరొక కథనం ప్రకారం 'హిందూ - జర్మను కుట్రకేసు' సందర్భంగా రాయ్ న్యూయార్కులో అరెస్టుకాబడ్డాడని ఆలాకాక అనుమతి పత్రం లేకుండా ఆయన అమెరికాలో వుండటం కారణం కావచ్చునని రకరకాల వూహాలు వ్యాప్తి చెందినవి.

'బాల్, పాల్, లాల్' పేరులతో తీవ్రవాద రాజకీయాల్లో ఈ శతాబ్దం మొదట్లో భారత దేశంలో ప్రముఖస్థానం వహించిన రాజకీయ వేత్తలలో లాలా లజపతిరాయ్ వొకరు. భారత స్వాతంత్ర్య సాధనకు అమెరికనుల సాను భూతిని, సహాయాన్ని పొందాలనే సంకల్పంతో ఆ క్రిందటి సంవత్సరమే అమెరికా వచ్చి ప్రచారం ప్రారంభించాడు. ఆయన వాగ్ధాటి అమెరికన్లలో కొంత సంచలనం కలిగించినది. లజపతిరాయ్ మీటింగులకు హెచ్చు సంఖ్యలో అమెరికన్లు వచ్చి భారతదేశ పరిస్థితులను ఆసక్తితో వినసాగారు. భారతదేశంమీద కొందరు సాను భూతి ప్రకటించ సాగారు.

కాని అమెరికా ఇంగ్లండు తరఫున యుద్ధంలో చేరటంతో పరిస్థితులు తారుమారైనవి. లాలాలజపతిరాయ్ సాగించే బ్రిటిషు వ్యతిరేక ప్రచారం జర్మనులకు

అనుకూల ప్రచారంగా భావించబడినది. అమెరికనుల సానుభూతి సన్నగిల్ల సాగినది. అంతవరకు అశేష సంఖ్యలో వుంటున్న లజపతిరాయ్ సభలు - సమావేశాలకు ఏకొద్ది మంది యుద్ధ వ్యతిరేకులయిన 'సోషలిస్టులు, రాడికల్సు, అనార్కిస్టులు, సిండికలిస్టులు' వినా మిగిలిన వారంతా రావటం మానివేసారు.

రాయ్ న్యూయార్కు చేరగానే లజపతిరాయ్‌తో పరిచయం చేసుకొన్నాడు. ఆ పరిచయం ఇద్దరినీ సన్నిహితులు చేసినది. వృద్ధనాయకుడయిన లజపతిరాయ్‌కి యమ్. యన్. రాయ్. చేదోడు వాదోడుగా వుండటమే కాకుండా అప్పుడప్పుడు స్వయంగా వంట చేసి పెట్టుతూ వుండేవాడు. ఒకసారి లజపతిరాయ్‌కి బెంగాలు రసగుల్లాల మీద మోజుకలగటం, రాయ్ వాటిని తయారు చేయగా వాటి రుచిని చూచి ఆయన పసిపిల్లవాని మాదిరిగా ఎంతో మురిసి పోవటంకూడా జరిగినది.

లాలాలజపతిరాయ్ ఆర్యసమాజవాది. యమ్. యన్. రాయ్ అప్పుడే సోషలిస్టు భావాలను కొద్ది కొద్దిగా అవగతం చేసుకొంటున్నా, ఆయనలో యింకా తీవ్ర దౌర్జన్య జాతీయభావాలు తొలగిపోలేదు. వీరిద్దరికీ అమెరికాలోని సోషలిస్టు - అనార్కిస్టులకు రాజకీయ - ఆర్థిక దృక్పథాల్లో, సాంఘిక విప్లవంలో అభిప్రాయ భేదాలు వుండటం సహజమే. వారి అంతర్జాతీయతత్వానికీ, మార్క్సిస్టు భావాలకూ, వీరి జాతీయవాదానికీ, ఆధ్యాత్మిక చింతనకూ అప్పుడప్పుడూ చర్చలూ, వాదోప వాదాలు జరుగుతూ వుండేవి. రాయ్‌కి వారి వాదనలు, చర్చలు మొదట కొంత క్రొత్తగా కనిపించినా అందులోని విలువలను గ్రహించటానికి ఎక్కువ కాలం పట్ట లేదు. మార్క్సిజాన్ని క్షుణ్ణంగా అర్థం చేసుకోవాలనే ఆసక్తి ప్రబలినది. కాని రాయ్ ఆర్థికంగా చాల నిస్సహాయస్థితిలో వున్నాడు. లజపతిరాయ్ రాయ్‌కి కావలసిన కారల్ మార్క్సు గ్రంథాలను, సోషలిజం, మార్క్సిజం గురించి వ్రాసిన యితర గ్రంథాలను కొనిపెట్టాడు. రాయ్ వాటిని ఒకటికి రెండుసార్లు క్షుణ్ణంగా పరిశీ లించాడు. అందులో ఏవైనా లోపాలుంటే వాటిని అచ్చట తమ సోషలిస్టు - అనార్కిస్టు మిత్రులకు చూపించి వారిని తమ వాదనకు అనుకూలం చేసుకొనాలనే దృష్టితోనే మొదట రాయ్ ఆ సాహిత్యం పఠించాడు. కాని క్రమేపి రాయ్‌లోనే మార్పు రాసాగినది.

ఒకనాడు లజపతిరాయ్ ఒక సభలో ఉపన్యసిస్తూ భారతదేశంలో వున్న అసమానతకు, దారిద్ర్యానికి అచ్చటి బ్రిటిషు ప్రభుత్వమే మూలకారణంగా చూపి

విమర్శించసాగాడు. కాగా ఒక పెద్దదేశం వలస రాజ్యంగా వున్నంత కాలం కాపిట లిస్టు దేశమయిన మాతృదేశంలో కార్మికులు దోపిడికి గురి కావటం అసంభవమనే వాదాన్ని సమర్థించసాగాడు. సాధారణంగా అచ్చట సమావేశాల్లో ఉపన్యాసాలకంటే, ప్రశ్నలు - సమాధానాలకు ఎక్కువ విలువ యివ్వబడుతుంది. సభికులు వేసే ప్రశ్నలకు సరియైన సమాధానాలిచ్చి వారిని తృప్తిపరచ గలిగినప్పుడే అది సరియైన సమావేశంగా భావించబడుతుంది.

మొదటి ప్రశ్నగా ఒక సభికుడు "మీ జాతీయ నాయకులు భారతదేశం లోని ప్రజల దారిద్ర్యాన్ని పోగొట్టటానికి ఏమి చేయదలచారు ?" అని ప్రశ్నించాడు. లజపతిరాయ్ చెప్పిన సమాధానం వారికి నచ్చలేదు. సభికులనుంచి ప్రశ్నల వర్షం కురిసినది.

"ముందు మేము మా యింటికి యజమానులం కావాలి. తరువాత అన్నీ చక్కపెట్టుకుంటాం." అని లజపతిరాయ్ చెప్పిన సమాధానం వారికి నచ్చలేదు.

"పరదేశి సామ్రాజ్యవాదులకు మారుగా దేశీయ పెట్టుబడి దారులు దోపిడీ సాగిస్తే సామాన్య ప్రజానీకానికి ఒరిగేదేమిటని" మరో ప్రశ్న వచ్చినది.

లజపతిరాయ్ సభ్యుల ప్రశ్నలకు తికమకలు కావటమేకాక చిరాకు కూడా చూపించసాగాడు.

"పరదేశీ బందిపోటు దొంగలచేత దెబ్బలు తినటంలోనూ, స్వంత సోదరుని చేతితో దెబ్బలు తినటంలోనూ భేదంలేదా ?" అని సమాధానం యివ్వటంతో ఆ సభికులు ఆశ్చర్యంతో ఒకరి ముఖం వొకరు చూసుకొన సాగారు.

ఈ సమావేశంలోవున్న రాయ్ సభికుల ప్రశ్నలను, లజపతిరాయ్ సమాధానాలను జాగ్రత్తగా వినసాగాడు. సభికులకున్న అనుమానాలే రాయ్‌కీ కలుగ సాగినవి. సమావేశం పోయి బయటకు వచ్చి దీర్ఘాలోచనలో పడ్డాడు. స్వేచ్ఛ, స్వతంత్ర భావాలను గురించి రాయికి వేరొక రూపం, మార్గం కనుబడ సాగినవి. తరువాత తరుచుగా న్యూయార్కు పబ్లికు లైబ్రరీకి వెళ్ళి కారల్ మార్క్స్ రచనలను, తదితర సోషలిస్టు రచనలను, వివిధ దేశ చరిత్రలను క్షుణ్ణంగా పఠించి జాతీయ, అంతర్జాతీయ సంస్థలను వివిధ కోణాలలో అవగాహన చేసికొన గలిగాడు. అమెరికాలో వున్నప్పుడు రాయ్ ఎక్కువకాలం యిందుకే వినియోగించాడు.

జపాను దేశంలో రాస్‌బిహారిని కలుసుకొన్నప్పుడు ఆయనతోపాటు రహస్యంగా వుంటున్న "గుప్త" అనే విప్లవవాదితో రాయ్‌కి పరిచయం యేర్పడినది. అతడు 'జర్మను విప్లవ కమిటీ' ప్రతినిధినని చెప్పుకొనటంచేత రాయ్ తన జర్మను ప్రయాణం గురించి ముచ్చటించటం జరిగినది. రాయ్ స్వయంగా బెర్లిను వెళ్లటం ఆతని కిష్టంగాలేదు. జర్మనీ ప్రభుత్వ మేదైనా సహాయం చేస్తే అది తన ద్వారానే జరగాలని అతని అభిమతం. అందుకని రాయ్‌ని కొలది రోజులు ఆగితే 'ఇద్దరం కలిసి జర్మనీ వెళ్లుదాము' అని చెప్పి ఒకవేళ రాయ్ ముందుగా వెళ్లినా తాను వచ్చే వరకు జర్మనీ అధికారులతో కలియవద్దని సలహా యిచ్చాడు.

అమెరికాలో రాయ్‌కి 'గుప్త' స్థానాన్ని డాక్టరు చక్రవర్తి అనే మరో విప్లవవాది ఆక్రమించినట్లు తెలిసినది. చక్రవర్తి అమెరికాలోనే వుంటున్నాడు. ప్రముఖ విప్లవవాదు లెక్కడున్నా వారి పేర్లు రాయ్‌కి సుపరిచితమే. కాని చక్రవర్తి పేరు ఎప్పుడూ వినలేదు. అయినా చక్రవర్తిని కలుసుకొని ఆయన సహాయంతో జర్మనీ చేరాలనే అభిలాషతో అమాకీతీసి కలుసుకొన గలిగాడు.

అది రెండంతస్తుల భవనం. అందులో క్రింది భాగంలో డాక్టరు చక్రవర్తి, పై అంతస్థులో ఒక జర్మను డాక్టరు వుంటున్నారు. భవనంలోని గోడలకు తగిలించి వున్న బొమ్మలు, అతికించిన పోస్టర్లను బట్టి ముఖ్యంగా మానసిక వ్యాధుల చికిత్సాలయంగా కనబడినది. విప్లవవాదుల రహస్యజీవితాని కిది పై ముసుగు కావచ్చునేమోనని రాయ్ మొదట వూహించుకున్నాడు. చక్రవర్తిని కలుసుకొని పరిచయం సంభాషణ ముగిసిన తరువాత రాయ్ తన రహస్యప్రయత్నాన్ని బయలు పరచకుండా వేరే కారణాలు చెప్పి తన జర్మనీ ప్రయాణానికి ఏర్పాట్లు చేసి పెట్టమని కోరటం అందుకు చక్రవర్తి 'రేపు రమ్మని' సమాధానం చెప్పటం జరిగినది. ఆ రేపు రేపుగానే మిగిలిపోయినది. అతడు అందుకొరకు ప్రయత్నించినట్లుగా కూడ కనుపించలేదు.

డాక్టరు చక్రవర్తిని లోతుగా పరిశీలించి చూసాడు. రాయ్ దృష్టిలో అతడు విప్లవ వాదిగా కనబడలేదు. ఎప్పుడు వెళ్ళినా శరీరంమీద నూనె మర్దన చేసుకొనటం చూస్తూ వుండేవాడు. పై అంతస్థులో వున్న జర్మను డాక్టరు (?) అప్పుడప్పుడూ క్రిందకు వచ్చి రాయ్‌తో భారతదేశంలోని మాంత్రిక వాదాన్ని గురించి చర్చించటం రాయ్‌కి మరీ అగమ్య గోచరంగా వుండేది. వీరు నిజంగా



విప్లవవాదులా లేక ఘాతపైద్యులా అనే సంశయం కలుగక పోలేదు. ఇట్టి వ్యక్తులు విప్లవం యెలా నడుప గలరు ? వీరు నిజంగా జర్మనీ విప్లవ కమిటీకి ప్రాతినిధ్యం వహిస్తున్నారా ? అనే సందేహాలు రాయ్‌కి కలిగినవి.

వీరిని గురించి యదార్థం తెలుసుకొనటానికి రాయ్ యితర పరిచయస్థుల ద్వారా ప్రయత్నించి నప్పుడు మరికొన్ని విషయాలు తెలుసుకో గలిగాడు. "జర్మనీ లోని బెర్లిన్ కమిటీ సరిగా పనిచేయటం లేదు. ఎవరికి వారు స్వార్థపరులై, ధనా పేక్షతో, స్వలాభంకొరకు, పనిచేస్తున్నట్లు నటిస్తూ ఒకరి మీద వొకరు గిట్టక వ్యక్తిగత భేదాభిప్రాయాలను పెంచుకుంటున్నారు. జర్మనీ ప్రభుత్వం నామ మాత్రంగా వీరి హోదాను గుర్తించటం వినా క్రియాత్మకంగా భారత విప్లవకారుల విప్లవానికి పొందే సహాయం శూన్యం. గుప్త అట్టివాడు కావటంచేత అతడు తొలగించబడి ఆతని స్థానంలో చక్రవర్తి నియమితుడయ్యాడు. ఇతడు అంతకంటే చవట" అని తెలుసుకున్నాడు.

భారతదేశంలో వున్నప్పుడు రాయ్ అమెరికా విప్లవ కారుల నుంచి బెర్లిన్ కమిటీ గురించి అనేక వూహాగానాలు చేసుకున్నాడు. 'దూరపు కొండలు నునుపు'గా కనబడటం సహజం. ఇట్టి వ్యక్తుల సహాయం పొందటం, ఒకవేళ పొంద గలిగినా జర్మనీ ప్రభుత్వంనుంచి ఆయుధ సహాయం లభించటం రాయ్‌కి గగన కుసుమాలుగా కనబడ సాగినవి. అమెరికా యుద్ధంలో దిగినప్పటినుంచి భారతదేశంనుంచి వచ్చే పత్రికలు చాలవరకు తగ్గిపోయినై. వచ్చిన వాటిని కూడా ప్రభుత్వం సెన్సారు చేయకుండా విడుదల చేయటం లేదు. అట్టి పరిస్థితులలో భారతదేశ విప్లవం యే పరిస్థితుల్లో వున్నదీ రాయ్ అంచనా వేసుకొనలేక పోయాడు. అప్పుడప్పుడు రహస్యంగా వచ్చే వార్తల ననుసరించి భారతదేశంలో అనేకమంది విప్లవ కారులు బంధింప బడ్డారని, కొంతమంది దీర్ఘకాల శిక్షలకు గురి అయినట్లు, కొంతమంది విచారణ లేకుండా జైళ్లలో మ్రగ్గుతున్నారని, మిగిలినవారు ప్రభుత్వ దమన నీతిని యెదుర్కొన లేక అదృశ్యులై దూరప్రాంతాలకు పారిపోయినట్లు రాయ్ తెలుసుకొన్నాడు.

ఇట్టి పరిస్థితుల్లో తన జర్మనీ యాత్ర ఎంతవరకు ఉపకరించ కలదు అనే అనుమానం రాయ్‌కి కలిగినది. తన గత అనుభవంద్వారా, అమెరికా బెర్లిన్ కమిటీ విప్లవవాదుల ద్వారా జర్మనీ సహాయం లభించటం అంత తేలికగా కనబడలేదు.

ఒకవేళ పొందగలిగినా భారతదేశంలో దానిని అందుకోగల బలగం రాయ్‌కి మృగ్యంగా కనబడినది. ముందు వెనుకలు తోచక పరిపరి విధాల ఆలోచించ సాగాడు.

దీనికి తోడు రాయ్‌లో భావసంఘర్షణ చెలరేగినది. నూతన దేశంలో నూతన భావాలను స్వీకరించిన రాయ్‌కి భారత స్వాతంత్ర్య సిద్ధికి తన వెనుకటి మార్గం దౌర్జన్యవాదం, హింసాపద్ధతులు సరియైన పంథాకాదేమోననే అనుమానం కలుగ సాగినది. దాన్ని విసర్జించితే భారత ఈశాన్య సరిహద్దులలోని సీమా ప్రాంతంలో తన రాకకొరకు ఎదురు చూస్తున్న అనుచర వర్గానికి ద్రోహం తల పెట్టటం కాదా అనే భావన రాయ్‌ని సతమతం చేసినది. మాతృదేశ విముక్తిని రాయ్ పరమావధి, పవిత్ర ఆశయంగా భావించాడు. ఆ ఆశయసిద్ధి కొరకు మొదట ఒక మార్గం చేపట్టాడు. ఆ మార్గంలోనే అమెరికా చేరుకున్నాడు. కాని అమెరికాలో రాయ్‌కి మరొక మార్గం కనబడినది. కేవలం కొలది మంది విప్లవకారులు, కొన్ని ఆయుధాలు చేపట్టి బ్రహ్మాండమయిన పునాదులమీద సామ్రాజ్యాన్ని నిర్మించి సుస్థిరత్వం పొందిన బ్రిటిషు ప్రభుత్వాన్ని కూలద్రోయటానికి చేసే ప్రయత్నం ఎంతవరకు సఫలీకృతమవుతుంది ? దీనికి భిన్నంగా ప్రజానీకంలో చైతన్యం కలిగించి ప్రజాశక్తిని సమీకరించి ప్రజాపోరాటం, ప్రజావిప్లవం ద్వారా గమ్య స్థానం చేరి ఆశయ సిద్ధిని పొందటం, రాయ్‌కి అమెరికాలో కలిగిన భావ పరివర్తన.

# ప్రభుత్వ నిర్బంధం :

ఒకరోజు సాయంత్రం రాయ్ లాలాలజపతిరాయ్ మీటింగుకు వెళ్లి కొలంబియా విశ్వవిద్యాలయ ప్రాంగణం నుంచి బయటకు వస్తున్నప్పుడు ఒక వింతసంఘటన జరిగినది. చీకటి పడినది. ఒక్కడే నడచి వస్తున్నాడు. ఒక పోలీసు అధికారి అరడజనుమంది పోలీసులు వెంటరాగా చెట్లగుబుర్ల చాటు నుంచి అకస్మాత్తుగా అంధకారంలో పిస్తోళ్లు చూపించి రాయ్‌ని చుట్టుముట్టారు. 'హింసా విప్లవవాదికి ఏ మాత్రం అవకాశం దొరికినా తమకు పెద్దప్రమాదం జరుగుతుంది" దేమోనన్న భయంతో వారు ముందుగా అనేక జాగ్రత్తలు తీసికొని రాయ్‌ని పట్టు కొనినట్లుగా కనబడినది. రాయ్ కిది దిగ్భ్రాంతిని, చీకాకును కలిగించినది. తాను

లోగడ వూహించుకొనిన 'స్వేచ్ఛావాయువుల భాము'కి పోలీసుల యీ 'అనాగరిక చర్యకు' ఏ మాత్రం సంబంధం కనబడలేదు.

రాయ్ తన నిర్బంధానికి కారణమడిగినా పోలీసులు ఏమీ సమాధానం చెప్పకుండా హడావుడిగా విశ్వవిద్యాలయ బయటిగేటు దగ్గరకు తీసుకొనివచ్చి అక్కడ సిద్ధంగా వుంచబడిన కారులోనికి బలవంతంగా నెట్టి చాల దూరం తీసుకొని వెళ్లారు. చివరకు ఒక ఇనుప కటకటాలగేటు దగ్గర కారు ఆపి లోపల ఒక వరండా మీదుగా రాయ్‌ని చాల దూరం తీసుకొని వెళ్లి ఒక పెద్దభవనంలో విద్యుద్దీపాలతో బాగా వెలుగుతూ, తివాచీ, కుర్చీలు, సోఫాలు, డ్రాయర్లతో శోభాయమానంగా అలంకరింపబడిన ఒక గదిలో ప్రవేశపెట్టారు. అందులో వున్న న్యూయార్కు డిస్ట్రిక్టు అటార్నీకి (పబ్లిక్ ప్రాసిక్యూటరు) రాయ్ అప్పగించబడ్డాడు.

అమెరికను చట్టం ప్రకారం పబ్లిక్ ప్రాసిక్యూటరు పోలీసు అధికారిగా కూడా వ్యవహరిస్తాడు. నిర్బంధంలోనికి తీసుకొనబడిన వ్యక్తిని కోర్టులో హాజరు పరచేముందు అతడు క్రాసు పరీక్షచేసి ముద్దాయిచేత స్వయంగా తన నేరం వొప్పింప చేయటానికి నయాన, భయాన అనేక డొంక తిరుగుడు ప్రశ్నలవరం కురిపించి తికమకలు చేయటం పరిపాటి. రాయ్ కరుడుగట్టిన విప్లవవాది. కాగా భారత దేశంలోనే గాక జపాను, చైనా దేశాల్లో కూడా యిట్టి అనుభవం ముందుగానే పొంది వున్నాడు.

డిస్ట్రిక్టు అటార్నీ రాయ్‌ని చిరునవ్వుతో సాదరంగా ఆహ్వానించి ఎదురుగా వున్న సోఫాలో ఆసీనుడు కమ్మని సోఫా చూపించాడు. తన టేబిలుమీద వున్న ఖరీదైన సిగారును అందించబోయాడు. రాయ్ సోఫాలో ఆసీనుడయ్యాడు. కాని సిగారును అందుకొనలేదు. కావలసిన మర్యాదలు చేసి ముద్దాయిని లోబరచు కొని తరువాత నెమ్మదిగా ముద్దాయి నుంచి వ్యతిరేకమయిన వాఙ్మూలం తీసికొని దాని ఆధారంతో రాయ్‌ని కోర్టులో ప్రవేశపెట్టటానికి ఆతడు ప్రయత్నించాడు.

"ప్రాక్‌దేశం నుంచి వచ్చిన పెద్దమనిషివిగా కనబడుచున్నావు. నిజం చెప్పగలవని ఆశిస్తున్నాను. ఈ దేశం ఏవిధంగా ప్రవేశించగలిగావు?" అని మర్యాదపూర్వకంగా ప్రశ్నించాడు.

'సముద్రం మీదుగా' అని రాయ్ సమాధానం చెప్పటంతో ఆతడు నిర్విణ్ణుడయి తనకుతాను తమాయించుకొని "అప్పుడు....కాని మొదట నీ వెక్కడ ప్రవేశించావు ?' అని తిరిగి ప్రశ్నించాడు.

'పోలీసులకు వివరాలు చెప్పటానికి నేనేమీ అమ్ముడు పోలేదు' రాయ్ ధైర్యంగా, నిర్మొగమాటంతో సమాధానం చెప్పటంతో డిస్ట్రిక్టు అటార్నీ ముఖం చిట్లించుకున్నాడు.

"నాకు అంతా తెలుసు. నన్ను మోసగించటానికి ప్రయత్నించకు."

"అయితే నన్ను వేధించటం అనవసరం. నేను మీ స్వాధీనంలోనే వున్నాను. మీ యిష్టం వచ్చినట్లు చేసుకొనవచ్చును.........అమెరికా స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలు గల దేశంగా భావించాను." అని రాయ్ సమాధానం చెప్పాడు.

ఆతడు రాయ్‌ని ఎగాదిగా చూచి మరేమీ ప్రశ్నించకుండానే ప్రక్క నిలబడి వున్న వ్యక్తుల వంక చూసాడు. వారు రాయ్‌ని నిర్బంధించి అక్కడకు తీసుకొని వచ్చిన పోలీసు బలగమే.

"మిగిలిన వాళ్ళున్న చోటుకు యీయన్ని కూడా తీసికొని వెళ్లమంటారా" అని వారు అడగటం డిస్ట్రిక్టు అటార్నీ అందుకు తలవూపటం జరిగినది. పోలీసులు రాయ్‌ని అటూ యిటూ త్రిప్పి చివరకు గాఢాంధకారంగా వుండే ఒక జైలు కవాటం తెరచి "అదుగో! అవతల గదిలో 'హిందు ఆయుధం విప్లవ నాయకుడు' వున్నాడు. ఆతడు అంతా చెప్పాడు. దాచి పెట్టినందువలన ప్రయోజనం లేదు. మేము చాలా పిట్టలను - నల్లవి, గవరరంగువి, ఎర్రవి - పట్టుకొన్నాము. అవి అన్నీ సురక్షితంగా వున్నవి. నీకు కూడా భయంలేదు. పారిపోవటానికి ప్రయత్నించావో!' జాగ్రత్త!' అని అందులోనికి నెట్టి తాళం వేసారు. ఆ జైలు చూడటానికి సమాధి ఆకారంలో వున్నది. అందులోని నిర్బంధితులు జీవసమాధిలో వున్నట్లుగానే కనబడినది. విచారణకు ముందు వారు వారాలు, నెలలు అందులో గడుపవలసి వుంటుంది.

అకస్మాత్తుగా కొద్దిసేపటికే తాళం తీసి గది తలుపులు తెరువబడ్డవి. అదే డిస్ట్రిక్టు అటార్నీ లోపల ప్రవేశించి రాయ్‌ని అదేవిధంగా మర్యాదగా పలుకరించాడు. 'ఫాదర్ మార్టిన్ ! మంచి క్రైస్తవునిగా ప్రవర్తించు - ఇప్పటికే చాలా

ప్రొద్దు పోయినది. నేను గృహస్థుణ్ణి. నామీద దయవుంచు.' అని సాదరంగా సంబోధించాడు.

రాయ్ ఆ మారుపేరుతో సముద్ర ప్రయాణంచేసి అమెరికా ప్రవేశించాడు. కాని ఆ ప్యాసుపోర్టును ఎప్పుడో, ఎక్కడో చించి పారవేశాడు. ప్రయాణీకుల లిస్టులో ఆ పేరు నమోదు కావటంచేత డిస్ట్రిక్టు అటార్నీ తననట్లు సంబోధించటం కొద్ది నిముషాలకుగాని తెలుసుకొనలేక పోయాడు. రాయ్ సందిగ్ధావస్థను గమనించిన అటార్నీ "మీరు చాల లోతుగల మనుషులని నాకు తెలుసు. కాని మీరిప్పు డెక్కడున్నారో మీరు గుర్తుంచుకొనాలి. ఈ సమాధి జీవితాన్నో లేక బయట స్వేచ్ఛావాయువులనో ఏదో వొకదానిని మీరు కోరుకొనటం మంచిది." అని బెదరింపుగా ప్రశ్నించాడు.

"అవును .... ఇంతకంటె మరీ అధ్వాన్నమయిన జైళ్లను కూడా నేను చూచాను. కనుక దీనివలన మీరు నన్ను భయపెట్ట కలిగేది యేమీలేదు. కాని నేను బయటకు వెళ్లవలసిన అవసరం వున్నది. నేను ఒక ప్రత్యేక కార్యక్రమం మీద వచ్చాను. మీదేశానికి ఏమాత్రం అపకారం చేయటం నా అభిమతం కాదు. మీరు నన్ను గురించి అనుమాన పడవలసిన అవసరం లేదు." అని రాయ్ నదురు, బెదురు లేకుండా సమాధాన మిచ్చాడు.

అటార్నీ మొదట కొంత సంకోచించి చివరకు స్నేహ పూర్వకంగా "మరి మీరు మాదేశంలో చట్టవిరుద్ధంగా ప్రవేశించారు గదా?" అని అడగటంతో రాయ్‌కి కొంత స్థిమితం చిక్కినది.

"మీరు గోరంతలు కొండంతలు చేస్తున్నారు. నేను మీ దేశంలో స్థిర నివాసం యేర్పరచు కొనటానికి రాలేదు. కొలది రోజుల్లోనే మీ దేశం విడిచి వెళ్ళుతాను" అని స్థిరసంకల్పంతో చెప్పినట్లుగా సమాధాన మిచ్చాడు.

డిస్ట్రిక్టు అటార్నీ ఏమనుకున్నాడో యేమో రాయ్ దగ్గరకు వచ్చి స్నేహ భావంగా భుజంమీద చేయివేసి "ఇప్పుడు మీరు బయటకు వెళ్ళిపోవచ్చు. కాని రేపు ఉదయం పదకొండు గంటలకు టవున్ హాల్లో గ్రాండ్ జ్యూరీ ముందు హాజరు కావలసి వున్నది. మీమీద వున్న నమ్మకంతో, మీరు పరారు కారనే విశ్వాసంతో

మిమ్ములను విడిచిపెట్టుచున్నానని" బయటనున్న పోలీసులను పిలిచి "వీరికి టాక్సీ యేర్పాటు చేయండి. ఇంటికి వెళ్ళుతాడు" అని ఆజ్ఞాపించాడు.

రాయ్ టాక్సీలో యెక్కి తను నివసిస్తున్న న్యూయార్కు ఉత్తర ప్రాంతానికి బయలుదేరాడు. కారులో వున్నంతసేపూ తన భవిష్యత్తును గురించి, ముందు కార్యక్రమం గురించి ఆలోచిస్తూనే వున్నాడు. తన యింటికి చేరేటప్పటికి దాదాపు తెల్లవార వచ్చినది. పత్రికలు అమ్మే కుర్రవాళ్లు పత్రికలు చేత్తో పట్టుకొని పెద్దగా "హిందూ-జర్మను కుట్రకేసు బయటపడ్డది. 'శత్రువుల ఏజంట్లు పట్టుబడ్డారు' అని కేకలు వేయటం రాయ్ విన్నాడు. కొన్ని పత్రికలు కొని చూసాడు. అన్నింటిలోనూ ప్రముఖంగా మొదటి పేజీలో పెద్ద పెద్ద అక్షరాలతో "బిడ్డులయుదం విప్లవానికి సంబంధించిన జిడ్డు నూనె విప్లవ నాయకుడు సమాధి జైల్లో బంధించ పడ్డాడు." అని వుండటం గమనించాడు. ఆ క్రిందటి రాత్రి అనేకమంది ప్రవాస భారతీయులు నిర్బంధింపబడ్డట్లు వున్నది. అందులో జర్మనీ 'బెర్లిన్ కమిటీ' ప్రతినిధిగా చెప్పుకుంటున్న డాక్టరు చక్రవర్తి కూడా వున్నాడు.

మరునాడు డిస్ట్రిక్టు అటార్నీ చెప్పిన ప్రకారం రాయ్ టవున్ హాలుకు హాజరయ్యాడు. అందులో రకరకాల మనుషులు అనేకమంది అటూయిటూ తిరగటం గమనించాడు. రాయ్ గేటుముందు నిలబడి యీ దృశ్యం చూస్తూనే వున్నాడు. వెనుకనుంచి ఒకచేయి తన భుజంమీద పడటంతో రాయ్‌కి క్రిందటి రోజు గుర్తుకు వచ్చి "మళ్లీ అరెస్టు అయినానా ?" అనే స్థితిలో పడటం జరిగినది. ఆతడు క్రిందటి రోజున తనను తీసుకొచ్చిన వారిలో ఒక పోలీసుగా రాయ్ గుర్తించాడు.

"ఓ ! వచ్చారా ! మీ మాట నిలబెట్టుకున్నారు" అని రాయ్‌ని తనవెంట హాలు లోపలికి తీసుకొని వెళ్లాడు. అది న్యాయస్థానంగా కనబడలేదు. దాదాపు రెండువందలమంది రకరకాల వ్యక్తులు ఆసీనులై వున్నారు. చుట్టల పొగకంపుతో ఆ గది నిండిపోయి వున్నది. డిస్ట్రిక్టు అటార్నీ రాయ్‌ని వారి ముందు నిలబెట్టి "ఇదిగో గ్రాండ్ జ్యూరీ" అనీ అనకముందే రాయ్ "అవును. వెరీగ్రాండ్" అని అన్నాడు. అటార్నీ కిది తప్పుగా కనబడినా కోర్టు ధిక్కరణ క్రిందకు తీసికొనక పోవటం రాయ్ అదృష్టం. ఆ జ్యూరీకి నిజంగా రాయ్ విచారణ మీద ఏ మాత్రం శ్రద్ధ వున్నట్లు కనబడటం లేదు. తమలో తాము పిచ్చాపాటి కబుర్లు చెప్పుకుంటూ చుట్టలు ముట్టించుకొనటంలో నిమగ్నులై వున్నారు.

అటార్నీ రాయ్ వంకచూస్తూ 'చట్టవిరుద్ధంగా అమెరికాలో ప్రవేశించి నందుకు నీ మీద నేరం మోపుతున్నాను' అని అన్నాడు. ఇందుకు ఆధారంగా అటార్నీ సాక్షులను విచారించటంగాని సాక్ష్యాధారం చూపటం గాని జరుగలేదు. 'ప్రజాస్వామిక దేశం'లో జరుగుచున్న న్యాయవిచారణకు రాయ్ విస్తుపోయాడు. జ్యూరీ అంగీకరించినది. తరువాత జరుగనిచో యే విచారణ వరకు రాయ్‌ని వ్యక్తిగత పూచీమీద విడుదల చేస్తున్నట్లు అటార్నీ ప్రకటించాడు. అతడే తీర్పును కూడా కోర్టులో జ్యూరీ ముందు చదివాడు.

'నీకు మళ్లీ నోటీసులు వస్తవి. దాని ప్రకారం కోర్టుకు హాజరు కావలసి వుంటుంది. కాని యీ మధ్యలో నీవు పారిపోవటానికి ప్రయత్నించరాదు. అని హెచ్చరిస్తున్నాను. నీ మీద పోలీసు నిఘా, బందోబస్తు వుంటుంది.' అని ఆ తీర్పులో వున్నది.

రాయ్ బెర్లిన్ వెళ్లాలనే ప్రయత్నంలో అమెరికా చేరాడు. కాని అమెరికాలోని జర్మను రాయబార కార్యాలయం ద్వారా గాని, అమెరికాలో వున్న బెర్లిన్ కమిటీ ద్వారా గాని ఏ మాత్రం సహాయం పొందే అవకాశం రాయ్‌కి కనబడ లేదు. అయినా అమెరికాలో వున్నది కొలది కాలమే అయినా ప్రముఖ విప్లవనాయకు లయిన డాక్టరు చంద్రచక్రవర్తి, వసంతకుమార్‌రాయ్, భూపేంద్రనాధ్‌దత్తు, లాలాలజపతిరాయ్, తారకానాధ్‌దాసు మొదలైన వారితో పరిచయం యేర్పరచుకో గలిగాడు. వారి ద్వారానే ప్రవాస భారత విప్లవకారులలో, బెర్లిన్ కమిటీ విప్లవ వాదులలో వున్న పరస్పర ద్వేషభావాలు, సంకుచితతత్వం, స్వలాభాపేక్ష, స్వార్ధ పరత్వం తెలుసుకొన గలిగాడు. కాగా రాయ్ తన వెనుకటి భావాలు విడనాడి నూతనభావాలతో కొలది కాలంలో అంతర్జాతీయంగా ప్రముఖ వ్యక్తిగా రాణింప బడటానికి అవకాశం కలిగినది. రాయ్ అంతర్జాతీయ పరిస్థితులను, కాపిటలిజం, సోషలిజం, మార్క్సిజం వంటి అంతర్జాతీయ సిద్ధాంతాలను ఇక్కడ బాగా పఠించి, కూలంకషంగా జీర్ణించుకో గలిగాడు. ఇంగ్లండు సామ్రాజ్యవాద దేశం, అదేవిధంగా జర్మనీ కూడా సామ్రాజ్యవాద దేశమే. సామ్రాజ్య విస్తరణకు, ఆధిపత్యానికి యీ రెండు దేశాలు యుద్ధానికి దిగినవి కాని వీటివలన వెనుకబడిన దేశాలకు, వలస రాజ్యాలకు ఏ మాత్రం సహాయం లభించదనే మూలసత్యాన్ని కనుగొన గలిగాడు.

అమెరికాలో వుండటం రాయ్ క్షేమంగా భావించలేదు. 'హిందూ-జర్మనీ కుట్రకేసు'లో తాజాగా సాక్ష్యాధారాన్ని ప్రోవుచేయటానికి, అమెరికాలోని విప్లవ

కారుల రహస్య జీవిత చరిత్రను బట్టబయలు చేయటానికి భారతదేశం నుంచి అనుభవంగల బ్రిటిషు పోలీసు అధికారి అప్పటికే అమెరికాలో మకాం వేసినట్లు రాయ్ తెలుసుకున్నాడు. అమెరికన్ ప్రభుత్వం తనను అతనికి అప్పగించితే తిరిగి భారతదేశంలో తనకు సంభవించే ప్రమాదమేమిటో రాయ్‌కి తెలుసు. యావజ్జీవ కారగారవాసమో, ఉరికంబమో తన కొరకు వేచివుంటుంది. కనుక వెంటనే అమెరికా విడిచి వేరే దేశం ప్రవేశించటానికి ప్రయత్నించటం అవసరంగా భావించాడు.

మొదట తన గమ్యస్థానం బెర్లిను. కాని ఇప్పుడు అక్కడికి వెళ్ళినందు వలన ప్రయోజనం లేదనే నిర్ణయానికి రావటంచేత అమెరికా ప్రక్కనున్న కెనడా లేక మెక్సికో వెళ్లటానికి నిశ్చయించుకొన్నాడు. కెనడా దేశం బ్రిటిషు డొమినియన్ స్టేటు కాబట్టి అక్కడికి వెళ్ళినా తనకు రక్షణ వుండదని రాయ్ తెలుసుకొని మెక్సికో వెళ్లటానికి నిశ్చయించు కున్నాడు.

మెక్సికోలో అంతర్యుద్ధం చెలరేగుచున్న కాలమది. దేశం విప్లవ భావాలతో నిండియున్నది- అమెరికాలోని తన మిత్రులద్వారా మెక్సికను పరిస్థితులు తెలుసుకొన్నాడు. అచ్చట ఒక రాష్ట్రంలో జనరల్ ఆల్వారాడ్ అధికారం చేపట్టి సోషలిస్టు ఆర్థిక వ్యవస్థను నెలకొల్పటం కూడా విన్నాడు. తనకు రాగల ప్రమాదాన్ని వూహించుకొని పైగా మెక్సికో సందర్శించాలనే అభిలాషతో రాయ్ 'హిందూ-జర్మను కుట్రకేసు' బయటపడక ముందే శాన్‌ఫ్రాన్సిస్కోలోని స్టాన్‌ఫోర్డు విశ్వవిద్యాలయ అధ్యక్షుని దగ్గరనుంచి జనరల్ ఆల్వారాడోకి ఒక పరిచయ లేఖను సంపాదించ కలిగాడు.

చివరకు మెక్సికో ప్రయాణానికి సిద్ధపడ్డాడు. పోలీసుల నిఘా తప్పించుకొని మరొక దేశంలో ప్రవేశించటం అంత తేలికైన విషయం కాదు. అయినా ఆ సాహస కృత్యానికి రాయ్ పూనుకున్నాడు. ముందుగా తనమీద వున్న కేసును బట్టి తన చుట్టూ తిరిగే పోలీసుల బారినుండి తప్పించుకొనటానికి ఒకనాడు తాను నివసించే యింటిని ఖాళీచేసి మరో యింటికి బస మార్చాడు. పోలీసుల నిఘా వుండనే వున్నది. అయినా ఒకనాడు సాయంత్రం భోజనం మిషతో ఒక హోటలుకు వెళ్ళి తిరిగి మెయిన్ గేటును కాకుండా ప్రక్క వాకిలిద్వారా బయటకు వచ్చి సరాసరి టాక్సీలో రైల్వే స్టేషనుకు వెళ్ళి ఆరాత్రే రైలులో మెక్సికో సరిహద్దులకు

వెళ్ళి రైలులో ప్రయాణం సాగించి అమెరికన్ మధ్య రాష్ట్రాలను అధిగమించి మూడవ రోజున సరిహద్దు స్టేషను అయిన సాన్ అన్‌టోనియో చేరి అచ్చట పోలీసుల బారి పడకుండా మెక్సికోలో ప్రవేశించాడు.

# మెక్సికోలో:

జర్మనీ వెళ్లాలనే కృతనిశ్చయంతో అమెరికా చేరిన యమ్. యన్. రాయ్ తన నిర్ణయం మార్చుకొని మెక్సికో దేశంలో కాలుపెట్టాడు. (వెనుకటి అధ్యాయంలో చూపినట్లు యిందుకు కారణాలు వేరు కావటమే.) జర్మనీ ప్రభుత్వం సహాయం చేస్తుందనే ఆశ రాయ్‌కి లేదు. ఒకవేళ సహాయం చేసినా జర్మను సామ్రాజ్య విస్తరణకాంక్షతోనే గాని తన మాతృదేశ విముక్తి కొరకు కాదని రాయ్ గ్రహింపగలిగాడు. ప్రస్తుత పరిస్థితుల్లో భారతదేశం తిరిగి వెళ్ళినందువలన రాయ్ చేయగలిగినది ఏమీ లేకపోగా తనకు ప్రాణాపాయం కూడ జరుగవచ్చు. మెక్సికోలో సోషలిస్టు నవసమాజం కొరకు ప్రజాపోరాటం జరుగుచున్నది. తానిప్పుడు జాతీయవాదికాడు, సోషలిస్టు. అంతర్జాతీయవాది. మానవాభ్యుదయం కొరకు ప్రపంచంలో ఎక్కడ ఏమి జరిగినా అందులో పాల్గొనటం తన కర్తవ్యం, ఉత్తమ ఆదర్శంగా భావించి చివరకు రాయ్ మెక్సికో వెళ్లటానికి నిశ్చయించుకొని నిరపాయంగా ఆ దేశం చేరగలిగాడు. రాయ్ మెక్సికోను తన 'పునర్జన్మ మాతృదేశం'గా వర్ణించాడు. పాశ్చాత్య నాగరికతకు ముందు మెక్సికోలో భారతీయులు ప్రవేశించి తమ ఆధ్యాత్మిక సంపర్కంతో ఆ దేశాన్ని పునీతం చేసినట్లు కొన్ని చరిత్రగాథలు చెప్పుచున్నవి. కనుక అట్టి దేశాన్ని చూడాలనే కుతూహలం కూడా రాయ్ మనస్సులో కలిగి వుండవచ్చును.

మెక్సికో స్పెయిను వలస రాజ్యంగా సామ్రాజ్యాధికారుల క్రింద చాలా కాలం క్రుంగిపోయిన దేశం. 19 వ శతాబ్దం చివరిలో అనేక తిరుగుబాటులు జరిగినవి. చివరకు స్పెయిను పెత్తనం తొలగినా అంతర్యుద్ధాలు చెలరేగటంతో దేశంలో సుస్థిరశాంతి లేకపోగా ఈ అదను చూచుకొని ఇంగ్లండు, ఫ్రెంచి, అమెరికను పెట్టుబడిదారులు ప్రాబల్యం పొందటం, ఏ రాష్ట్రాని కారాష్ట్రం స్వతంత్రాన్ని

ప్రకటించుకొని ప్రభుత్వాలు యేర్పడటం, ఎవరికి వారు ముఠాలుగా యేర్పడి ఒకరిపై నొకరు బందిపోటు దాడులు సాగించటంతో దేశం అరాచక పరిస్థితులకు ఆలవాలంగా మారినది.

1915 లో జనరల్ వెనుస్టియన్ కరంజా ఒక ముఠాకు నాయకత్వం వహించి తనకు అనుకూలమయిన రాష్ట్రగవర్నరులు, మిలిటరీ నాయకుల సహాయంతో ప్రభుత్వం స్థాపించ గలిగాడు. రాయ్ మెక్సికోలో ప్రవేశించి నప్పుడు అంతర్యుద్ధ ఫలితంగా దేశం మొత్తం కల్లోల పరిస్థితిలోనే వున్నది. కరంజా ప్రభుత్వం దేశంలో సుస్థిరశాంతిని నెలకొల్పటానికి కొన్ని చర్యలు తీసికొన్నది. ప్రజాస్వామిక, సోషలిస్టు భావాలు గల నాయకుల సమావేశం జరిపి రాజ్యాంగాన్ని రూపొందించి అమలులో పెట్టినది. కూలంకషంగా చర్చించకుండా తొందరపాటులో రూపొందించిన రాజ్యాంగం కావటంచేత అందులో కొన్ని అపలక్షణాలు లేకపోలేదు.

మెక్సికో నూతన రాజ్యాంగంవలన విదేశీ పెట్టుబడులకు కొంత నష్టం వాటిల్లినది. కాని ఇంగ్లండు, అమెరికా దేశాలు ముమ్మరంగా యుద్ధంలో మునిగి వుండటంచేత వెంటనే ప్రతీకార చర్య తీసికొనక పోవటంచేత కరంజాకు తన ప్రభుత్వాన్ని సుస్థిరం చేసుకొనటానికి కొంత అవకాశం దొరికినది. కాని స్వతహాగా కరంజా భూస్వామందు, స్పెయిను జాతికి చెందినవాడు కావటంచేత అంతర్గతంగా అనేక చిక్కులు ఎదుర్కొనవలసి వచ్చినది. మెక్సికో దేశీయులనుంచి కరంజా ప్రభుత్వానికి తగినంత అండ లభించకపోగా వ్యతిరేక ముఠాలు ఏర్పడ సాగినై. కరంజా సోషలిస్టు భావాలు స్పష్టంగా, విప్లవ పూరితంగా లేకపోవటంచేత ప్రజాస్వామిక వాదులు, సోషలిస్టులు, అనార్కిస్టులు, సిండికలిస్టులు మొదలయిన మధ్య తరగతి వర్గాలనుంచి కూడా కరంజా ఆశించిన మద్దతు పొందలేక పోయాడు.

రాయ్ మెక్సికో ప్రవేశించినప్పుడు తనకు పరిచయమున్న వ్యక్తి ఎవరూలేరు. బయలుదేరేముందు అక్కడ ఎవరైనా వున్నారేమోనని తెలుసుకొనే ప్రయత్నం కూడా చేయలేదు. అసలు రాయ్ ప్రయాణం ముందు అనుకోకుండా అకస్మాత్తుగా జరిగినది. స్టాన్ ఫర్డు విశ్వవిద్యాలయ అధ్యక్షులు మెక్సికో లోని జనరల్ ఆల్వరాడో పేర యిచ్చిన పరిచయ లేఖ మాత్రం రాయ్ తన దగ్గర భద్రంగా అట్టిపెట్టుకో గలిగాడు. మెక్సికో చేరగానే ఒక పెద్ద కెనడియన్

హోటలులో బస చేసాడు. అది ఎక్కువగా విదేశీయులు నివసించే ప్రాంతం కావటంచేత స్వదేశస్థులు అక్కడ బసచేయటం చాలా అరుదు. రెండు మూడు రోజుల్లోనే రాయ్‌కి మెక్సికో తన స్వంత దేశంగా కనబడినది. ఆ పట్టణం, పరిసర ప్రాంతాలు, ప్రజలు, వారి స్వభావం, మర్యాదలు రాయ్‌కి ఎంతో ఆనందం, సుఖాన్ని కలుగ జేసినవి.

జనరల్ ఆల్వరాడో యూకటాన్ రాష్ట్రానికి గవర్నరు. అక్కడకు వెళ్లాలంటే దాదాపు మెక్సికో నగరం నుంచి వెయ్యి మైళ్ళ ప్రయాణం చేయవలసి వుంటుంది. రైలుమార్గం ప్రమాదభరితం. సముద్రం మీదుగా వెళ్ళాలంటే అమెరికన్ యుద్ధ నావలగస్తీ. అది మరీ ప్రమాదకరం. జనరల్ ఆల్వరాడో యూకటాన్ రాష్ట్రంలో సోషలిస్టు ఆర్థిక విధానాలు ప్రవేశ పెట్టినట్లు ప్రచారం జరుగుచున్నది. అదే సమయంలో రష్యాలో కార్మిక రాజ్యస్థాపన జరిగినట్లు మెక్సికోకు వార్తలు వచ్చినవి. ప్రయాణం ఎంత ప్రమాదభరితమయినా యూకటాన్ రాష్ట్రం వెళ్ళి అచ్చట పరిస్థితులను స్వయంగా పరికించాలని రాయ్ మొదట ఆరాట పడ్డాడు. కాని అచ్చటి ప్రభుత్వ యాజమాన్యం పేరుతో జరిగే ఆర్థిక వ్యవస్థ కేవలం 'స్టేట్ కాపిటలిజమే' నని అది సరియైన సోషలిస్టు పంథా కాదని తెలుసు కొనటంతో రాయ్‌కి ఆ రాష్ట్రం వెళ్లాలనే కుతూహలం తగ్గినది. కాని తన దగ్గర వున్న పరిచయం లేఖను జనరల్ ఆల్వరాడోకి అందచేయవలసిన అవసరం వున్నది.

దీర్ఘంగా ఆలోచించిన మీదట రాయ్‌కి ఒక ఉపాయం తట్టినది. మెక్సికోలో రక్షణమంత్రిని కలుసుకొనటానికి ప్రయత్నించాడు. ఇతడు మెక్సికో ప్రెసిడెంటు జనరల్ కరంజాకు అల్లుడుకూడాను. వెంటనే అనుమతి లభించినది. ఎంతో మర్యాదపూర్వకంగా రాజలాంఛనాలతో రక్షణమంత్రి రాయ్‌ని తనగదిలోనికి ఆహ్వానించి ఒక పెద్ద సోఫాలో ఆసీనుని చేసాడు. ఒక అనామకుడయిన విదేశీయుడు రక్షణ మంత్రిని తనకంటె క్రింది హోదాలో (సబార్డినేటు) వున్న గవర్నరును చూడటానికి సహాయం అర్థించి నప్పుడు అతడు సకల రాజలాంఛనాలతో ఆహ్వానించటం రాయ్‌కి ఎనలేని ఆనందాన్ని, ఆశ్చర్యాన్ని కలిగించినవి. పరిచయ మర్యాదలు జరిగిన తరువాత రాయ్ తన 'లెదర్‌బ్యాగు' నుంచి ఉత్తరం బయటకు తీస్తూ 'దీన్ని జనరల్ ఆల్వరాడోకి చూపవచ్చునా' అని సంకోచంగా అడిగాడు.

అది సీలుచేసి వున్న కవరు. రక్షణమంత్రి వెంటనే దాన్ని అందుకొని చించి చదివాడు. అతని ముఖంలో చిరునవ్వు చూచి రాయ్ కొంతవరకు స్థిమితపడి సంతృప్తి చెందాడు.

"జనరల్ అల్వారాడో రాజధానికి కొద్దిరోజుల్లోనే రావచ్చునని అను కుంటున్నాము. అతడు రావటం తరువాయి, మా మంత్రిత్వశాఖ మీకు తెలియ జేస్తుంది" అని రక్షణమంత్రి సమాధానం చెప్పాడు.

సునాయాసంగా తను వచ్చిన పని నెరవేరినందుకు రాయ్ మనసారా సంతృప్తి చెంది తిరిగి వెళ్లటానికి రక్షణమంత్రి అనుజ్ఞకొరకు లేచి నిలబడ్డాడు. మర్యాద సూచకంగా మంత్రికూడా లేచి నిలబడి రాయ్‌ని తిరిగి సోఫాలో ఆసీనులు కమ్మని సౌంజ్ఞ చేస్తూ "మెక్సికో మీకు స్వాగత మిస్తున్నది. ఇక్కడ మీ కేవిధ మయిన ప్రమాదం లేదు. మీరు యిక్కడ సురక్షితంగా వుండవచ్చును." అని అభయ హస్త మిచ్చాడు.

'సురక్షితం' అనే మాట రాయ్‌లో వేయిగొంతుకలతో హృదయ కుహరంలో ప్రతిధ్వనించినది.

"విదేశీ వ్యవహారాలశాఖామంత్రి మిమ్ములను గురించి, మీరాకను గురించి కొంత సమాచారం తెలుసుకున్నాడు. ప్రస్తుతం ఆ విషయం మీతో చర్చించటం అనవసరం........మీరు స్వతంత్ర పోరాటం జరిపిన దేశంలో వున్నారు. ఇక్కడ మీరు స్వేచ్ఛగా, సురక్షితంగా వుండవచ్చును." అని యీసారి అతనే ముందుగా లేచి మర్యాద సూచకంగా రాయ్‌కి త్రోవచూపిస్తూ ద్వారం వరకు వచ్చి రాయ్‌కి వీడ్కోలు యిచ్చాడు.

ఇంతటి ఘనసన్మానం జరుగుతుందని రాయ్ కలలో కూడా వూహించి వుండలేదు. రక్షణమంత్రి తనను సాదరపూర్వకంగా అభినందించినందుకు రాయ్ తనలో తాను ఎంతో గర్వపడ్డాడు. తాను బసచేస్తున్న హోటలుకు చేరే లోపల ఆయనలో ఎన్నో వూహలు బయలుదేరినై. తనరాక ముందుగానే ప్రభుత్వం తెలుసు కొని తనను రాజలాంఛనాలతో రక్షణమంత్రి తన గదికి ఆహ్వానించటం రాయ్‌కి విచిత్రసంఘటనగా కనబడింది. అంతర్జాతీయంగా తన వ్యక్తిత్వం, పలుకుబడి పెరిగినట్లుగా భావించాడు.

ఆ మరుసటి రోజునే అనధికార ప్రభుత్వ పత్రికగా పేరొందిన ఒక దినపత్రిక సంపాదకుని నుంచి రాయ్‌కి ఆహ్వానము వచ్చినది.

"మీరు అవకాశం చూచుకొని మా ఆఫీసుకు రాగలందులకు మిమ్ములను హృదయపూర్వకంగా ప్రార్థిస్తూ వున్నాను. స్వయంగా నేనే వచ్చి మిమ్ములను ఆహ్వానించ దలచాను. కాని మీరున్న హోటలు ప్రాంతం ప్రమాదభరితం కావటం చేత నేను స్వయంగా అక్కడకు రాజాలనందులకు విచారిస్తున్నాను." అని ఆ ఆహ్వానంలో వున్నది.

ఈ సంఘటన కూడా రాయ్‌కి విచిత్రంగానే కనబడినది. తాను మెక్సికోలో ప్రవేశించినది కొలది రోజుల క్రితమే. వారం రోజులు కాకమునుపే తాను ప్రభుత్వంలో పలుకుబడి గల వ్యక్తిగా పరిగణింపబడి ప్రభుత్వ అనుకూల దిన పత్రిక సంపాదకుని నుంచి ఆహ్వానం అందటం, పైగా అందులో తాను నివసించే ప్రదేశం ప్రమాదభరితంగా హెచ్చరిక చేయటం రాయ్‌కి విడ్డూరంగా కనబడినది. ఏదో తనకు తెలియని, వూహించని నూతన అనుభవాన్ని పొందగలిగాడు. మరొక రయినట్లయితే ఇది కేవలం దైవ సంకల్పంగా భావించి వుండేవారు.

సంపాదకుడు కోరిన ప్రకారం మరునాడు రాయ్ పత్రికా కార్యాలయానికి వెళ్ళాడు. రాయ్‌ని మర్యాదపూర్వకంగా ఆహ్వానించి సోఫాలో ఆసీనుని చేసి తాను స్వయంగా ఆహ్వానం అందచేయ లేనందులకు క్షమాపణ చెప్పుకొని "మీరు మాకు ముఖ్య అతిథులు. మేము చాల మర్యాదస్థులము అని యితరుల భావన. కాని .... కాని - తన పొరపాటును సమర్థించు కున్నట్లుగా - మేము వెనుకబడి వున్నాము" అని అన్నాడు.

రాయ్ కూడా తనకు తగిన సమాధానం చెప్పటానికి అవకాశం దొరికి నట్లుగా "మేము కూడా అదే స్థితిలో వున్నాము. తెల్లజాతి సామ్రాజ్యవాదం మా దేశాన్ని - మా ప్రజల్ని పీల్చి పిప్పిచేస్తుంది" అని అన్నాడు.

ఆ సంపాదకుడు రాయ్‌ని రెండు గంటలవరకు తన ఆఫీసు గదిలో కూర్చో పెట్టుకొని రాయ్ గత చరిత్రను గురించి వివరంగా తెలుసుకొని తన సానుభూతిని ప్రకటించాడు.

"మనం తరచుగా కలుసుకుంటూ వుందాము .... మీరు ఆ హోటలులో వుండటం మంచిదికాదు. అది ప్రమాద భరితమయిన ప్రాంతం." అని అతడు

రాయ్‌ని హెచ్చరించాడే కాని వివరాలు మాత్రం చెప్పలేదు. రాయ్‌ని సాగనంపు తూ తనయింటికి విందుకు ఆహ్వానించాడు. రాయ్ వుండటానికి వేరొక నివాస గృహం చూడగలనని చెప్పాడు.

రాయ్ వేరే యిల్లు చూసుకొని హోటలు ఖాళీచేసే ప్రయత్నంలో వుండగా ఆ క్రిందటి రోజున మరొక విచిత్ర సంఘటన జరిగినది. ఆ హోటలు అంతర్జాతీయ ప్రాముఖ్యం పొందివుండటం చేత అక్కడ వివిధ దేశస్థులు బసచేయటం కద్దు. కాని ప్రథమ ప్రపంచయుద్ధ కారణంగా అది కూడా ఒక యుద్ధరంగంగా మారినది. మిత్ర రాజ్యాల దేశస్థులు, జర్మనీ, తదనుకూలదేశస్థులు ఒకరిపై నొకరు ద్వేషపూరితంగా పిడికిళ్ళు బిగించటం పరిపాటి అయినది. అదివరకు అన్ని జాతుల వారికి ఒకేచోట ఒకే హాలులో వడ్డనలు జరుగుతూ వుండేవి. తన వ్యాపారానికి నష్టం కలుగుతుందేమో ననే భయంతో యజమాని వేరు వేరు ఏర్పాట్లు చేయటం జరిగినది. రాయ్ మాత్రం ప్రత్యేకించి తనగది లోనికే భోజన పదార్థాలు తెప్పించు కుంటూ వుండేవాడు.

మధ్యాహ్నం భోజనం ముగించి విశ్రాంతి తీసుకుంటున్న సమయంలో గది తలుపు కొట్టడం, రాయ్ తలుపు తెరువగానే ఒక జర్మనీ జాతీయుడు లోపలికి ప్రవేశించి విశ్రాంతికి భంగం కలిగించినందులకు క్షమాపణ చెప్పుకొని తలుపు గడియ బిగించి తనరాక ఎవరికీ తెలియగూడదని రాయ్‌తో నెమ్మదిగా మాట్లాడ సాగాడు. తరువాత కొన్ని నిముషాలకే అతడు నెమ్మదిగా బయటకు వెళ్ళటం, అతనిని పంపుతూ దూరంగా అతని కొరకు ఎదురు చూస్తున్న అతని సహచరుడు నిలబడి వుండటం రాయ్ గమనించాడు.

"రాయ్‌కి జావాలో కలిసిన మిత్రులిద్దరు ప్రస్తుతం మెక్సికోలో వున్నారు. రాయ్‌ని కలుసుకోవాలని వారు ఆతురతతో వున్నారు. కాబట్టి చీకటి పడగానే ఫలానా వీథిలో ఫలానా గుర్తుగల ప్రదేశానికి రాయ్ వస్తే అక్కడ రాయ్ కొరకు ఒక కారు ఎదురుచూస్తూ వుంటుంది. ఆ కారు రాయ్‌ని వారున్న ప్రదేశానికి తీసుకొని వెళ్లుతుంది". ఇది ఆ ఆగంతకుడు రాయ్‌కి రహస్యంగా చెప్పిన వార్త.

రాయ్ కిది నిజంగా 'ఇంద్రజాలం'గా కనపడినది. జావాలో తాను ఆయుధ సహాయం కొరకు కలుసుకొన్న వ్యక్తులు మెక్సికో ఎందుకు వచ్చారో వూహించలేక పోయాడు. 'ఈ ప్రాంతం ప్రమాద భరిత'మని తనను ఆహ్వానించిన

దిన పత్రిక సంపాదకుడు ఒకటికి రెండుసార్లు హెచ్చరించటం జరిగినది. వెళ్లటమా, మానుకొనటమా అనే మీమాంసాలో పడ్డాడు. రక్షణమంత్రి అంతటివాడు 'ఇక్కడ మీకేమీ భయంలేదు. సురక్షితంగా సంచరించవచ్చును' అని అభయ హస్త మిచ్చాడు. కనుక మళ్ళీ వాళ్లను కలుసుకొనాలనే కుతూహలం రాయ్‌కి కలిగినది.

తనను రహస్యంగా పట్టుకొని వెళ్లటానికి ఆంగ్లో - అమెరికను రహస్య పోలీసు దళం ప్రయత్నించినట్లు రాయ్ తరువాత తెలుసుకొన గలిగాడు. రాయ్ అమెరికాలో వున్నప్పుడు బ్రిటిషు గూఢచారి ప్రధానాధికారి డెన్‌హామ్ 'హిందూ - జర్మను కుట్రకేసు'ను నడపటానికి భారతదేశంనుంచి శాన్‌ఫ్రాన్సిస్కో వచ్చాడు. రాయ్‌తో కలసి పనిచేసిన విప్లవవాదికి లంచమిచ్చి రాయ్ ఆమాకీ తెలుసుకొనటానికి భారతదేశం నుంచి బయటకు పంపటం, అతడు షాంఘాయిలో అరెస్టు కాపటం, అతన్ని యీ కేసులో అప్రూవరుగా హాజరు పరచి రాయ్‌ని ప్రధాన ముద్దాయిగా రుజువు చేయించటానికి ప్రయత్నించటం రాయ్ పత్రికల్లో చూచాడు. తన సహచరుడు, తోటి విప్లవవాది చేయ తలపెట్టిన దారుణ ద్రోహ కార్యానికి రాయ్ వ్యాకులత చెందాడు. పదిహేను సంవత్సరాల తరువాత రాయ్ తిరిగి భారతదేశంలో రహస్యంగా ప్రవేశించినప్పుడు అతనిని గురించి వాకబు చేసాడు. అతడు ఒక సన్యాసిగా జీవితం గడపు మన్నట్లు తెలిసికో గలిగాడు.

శాన్‌ఫ్రాన్సిస్కోలో విచారణ పూర్తి అయినది. డెన్‌హామ్ రాయ్‌ని బందీకృతుని చేసి భారతదేశం తీసుకొని వెళ్లాలనే ప్రయత్నంలో అమెరికాలో కొంతకాలం వుండి తరువాత మెక్సికో గూడ వచ్చినట్లు రాయ్ తెలుసుకున్నాడు.

## తిరిగి జర్మనులతో కలయిక:

సాయంత్రం జర్మను దేశస్థుడు చెప్పిన ప్రకారం గుర్తుగా చెప్పిన ప్రదేశానికి రాయ్ వెళ్ళాడు. అప్పుడే ఒక వ్యాను వచ్చి ఆగటం, వెంటనే తలుపు తెరచుకొనటం, డ్రైవరు ప్రక్కసీటుమీద రాయ్ కూర్చొనటం, యేమీ ఆర్భాటం లేకుండా వ్యాను బయలుదేరి వెళ్ళటం కొన్ని నిముషాలలో జరిగిపోయినవి. వెనుక

సీటులో తనకు అమధ్యాహ్నమే చెవిలో వూది వెళ్ళిన ఆ జర్మను జాతీయుడు, అతని సహచరుడు వున్నారు. ఒకరి నొకరు చూచి మూగ సైగలతో అభినందించు కొనటం మించి నోటివెంట మాటలు కూడా వెలువడే ప్రయత్నం చేయలేదు. తరువాత కొలది నిముషాలకే ఆవ్యాను ఒక సందుకు వెళ్ళి ఒక యింటిముందు ఆగినది. ముందుగా డ్రైవరు దిగి రాయ్ కూర్చొనిన సీటు ప్రక్కతలుపు తెరచాడు. రాయ్ కూడా క్రిందకు దిగాడు. మిగిలిన యిద్దరూ వ్యానులోనే వున్నారు. ఏమాత్రం చప్పుడు లేకుండా ఆయింటి బయటి తలుపులు తెరచుకొన్నవి. డ్రైవరు ముందు నడువగా రాయ్ లోపల ప్రవేశించాడు. బాగా అలంకరింపబడిన ఒక గదిలోనికి ఆతడు ముందుగా ప్రవేశించి 'దయచేయండి' అన్నట్లుగా రాయ్‌ని ఆహ్వానించాడు.

రాయ్ గదిలో అడుగు పెట్టగానే అక్కడ ఆసీనులై వున్న యిద్దరు వ్యక్తులు లేచి నిలబడ్డారు. రాయ్ వారిని గుర్తించాడు. ఒకరు మిలిటరీ ఆఫీసరు. రెండవవ్యక్తి జర్మను ప్రభుత్వంలో పెద్ద హోదాగల అధికారి. మిలిటరీ ఆఫీసరుని సోదరుడు కెయిజరు ప్రభుత్వంలో ఆర్థికశాఖామంత్రి పదవిని నిర్వహించి తరువాత ఒక రాష్ట్రానికి అధ్యక్ష పదవిని అలంకరించినట్లు తెలుసుకున్నాడు. దాదాపు రెండు సంవత్సరాల తరువాత వారు తిరిగి కలుసుకొనటంతో ఒకరినొకరు అభినందించుకొని సంతోషాన్ని వెలిబుచ్చిన తరువాత అసలు విషయానికి వచ్చారు.

మిలిటరీ అధికారి జర్మను సబ్‌మారిన్ 'డ్యూబ్‌లాండ్' కు కమాండరుగా పనిచేసాడు. సబ్‌మారిన్ యుద్ధానికి సంబంధించిన కొన్ని రసాయనిక పదార్థాలతో అమెరికారేవు చేరినది. అమెరికా యుద్ధంలో ప్రవేశించటంతో ఆ సబ్‌మారిన్‌ను పట్టుకొనటం జరిగినది. కాని సమయానికి కెప్టెను అయిన యీ మిలిటరీ అధికారి అందులో లేకపోవటంచేత అమెరికను పోలీసులబారి పడకుండా తప్పించుకొని మెక్సికో చేరాడు. ప్రస్తుతం కెయిజరు ప్రివీకౌన్సిలు మెంబరు మెక్సికో రాబోవు చున్నాడు. అమెరికాలోని జర్మనీ రాయబార కార్యాలయం, వివిధ నగరాల్లోని గూఢచారి కార్యకలాపాలు, ఆసియాలోని తూర్పుదేశాల్లో యుద్ధవిజయానికి జర్మనుల కృషిని సమీక్షించటానికి, అవసరమయిన ఆదేశాలు, సహాయం అందచేయటం అతని రాకకు ప్రధాన కారణాలు. కాబట్టి రాయ్ తన పెనుకటి యుద్ధ పథకాన్ని యిస్తే వెంటనే సహాయం జరుగగలదని మిలిటరీ అధికారి వ్యక్తీకరించాడు.



రాయ్‌కి వాళ్ళ సంభాషణ తీరునుబట్టి వాళ్ళమీద కొంత నమ్మకం కుదిరినది. తన పథకం గురించి తిలోదకాలిచ్చి రాయ్ మెక్సికో ప్రవేశించాడు. కాని ఆ యిద్దరూ తనను తరచి తరచి అడగటంచేత ఆ వివరాలన్నీ వివరంగా చెప్పి పెకింగులోని జర్మను ఏజంట్లు అదనుకు తాను కోరిన సహాయం చేయకపోవటంచేత తన విప్లవ పథకం భగ్నమయినట్లు వెల్లడించాడు. ఈ చర్యకు వారు పెకింగులోని జర్మను అధికారులను కోపంతో దూషణగా మాట్లాడటం జరినది.

"మీరు న్యూయార్కునుంచి బెర్లిను ఎందుకు వెళ్ళలేదు ?" అని కెప్టెను రాయ్‌ని ప్రశ్నించాడు.

"వెళ్ళే ప్రయత్నం చేసాను. అక్కడ నా మిత్రులద్వారా నాకు తగిన సహాయం లభించలేదు" అని రాయ్ సమాధాన మిచ్చాడు.

"మీరు అచ్చటి జర్మను రాయబారిని ఎందుకు కలుసుకొనలేదు ? కలిసి వుంటే నేను నా సబ్‌మారిన్ ద్వారా మిమ్మల్ని బెర్లిను చేర్చి వుండేవాడిని" అని అనటంతో రాయ్ 'నిజమే' నన్నట్లుగా గతచరిత్ర నెమరువేయ సాగాడు.

"అవును .... 'జిడ్డునూనె విప్లవనాయకుడు' తనను మోసం చేసాడు..... కాదు విప్లవాన్నే నాశనం చేసాడు. అతడు జర్మనీ రాయబారితో మాట్లాడుతానని తనకు మాట యివ్వటం తప్ప అసలు మాట్లాడనేలేదు." అని రాయ్ తనలో తాను వ్యాకులత చెంది యీ రహస్యం వాళ్ళతో చెప్పటం మంచిది కాదని బయటకు పొక్కలేదు.

(తరువాత రాయ్ రష్యా వెళ్ళుతూ జర్మనీలో ఆగినప్పుడు పరాజయం పొందిన ఆ దేశ శిథిలాలను చూచి తాను రాకపోవటమే మంచిదని, ఒకవేళ వచ్చినా చావు బ్రతుకుల మధ్యవున్న జర్మనీ ప్రభుత్వం ద్వారా తనకు ఆయుధ సహాయం యేమీ జరిగివుండేదికాదని తెలుసుకొనగలిగాడు.)

వాళ్ల మాటల ధోరణినిబట్టి రాయ్‌కి సరాసరి జర్మను హైకమాండుతోనే సంబంధాలు పెట్టుకుంటే బాగుండునేమో ననిపించినది. ఒకవేళ జర్మను ప్రభుత్వం తన పథకం అంగీకరిస్తే తాను తిరిగి చైనా వెళ్లవలసి వుంటుంది. కాని చైనా వదలి సంవత్సరం దాటినది. అచ్చట ప్రస్తుత పరిస్థితులు రాయ్‌కి తెలియవు.

రాయ్‌కి వాళ్ళ సంభాషణ తీరునుబట్టి వాళ్లమీద కొంత నమ్మకం కుదిరినది. తన పథకం గురించి తిలోదకాలిచ్చి రాయ్ మెక్సికో ప్రవేశించాడు. కాని ఆ యిద్దరూ తనను తరచి తరచి అడగటంచేత ఆ వివరాలన్నీ వివరంగా చెప్పి పెకింగులోని జర్మను ఏజంట్లు అదనుకు తాను కోరిన సహాయం చేయకపోవటంచేత తన విప్లవ పథకం భగ్నమయినట్లు వెల్లడించాడు. ఈ చర్యకు వారు పెకింగులోని జర్మను అధికారులను కోపంతో దూషణగా మాట్లాడటం జరినది.

"మీరు న్యూయార్కునుంచి బెర్లిను ఎందుకు వెళ్లలేదు ?" అని కెప్టెను రాయ్‌ని ప్రశ్నించాడు.

"వెళ్ళే ప్రయత్నం చేసాను. అక్కడ నా మిత్రులద్వారా నాకు తగిన సహాయం లభించలేదు" అని రాయ్ సమాధాన మిచ్చాడు.

"మీరు అచ్చటి జర్మను రాయబారిని ఎందుకు కలుసుకొనలేదు ? కలిసి వుంటే నేను నా సబ్‌మారిన్ ద్వారా మిమ్మల్ని బెర్లిను చేర్చి వుండేవాడిని" అని అనటంతో రాయ్ 'నిజమే' నన్నట్లుగా గతచరిత్ర నెమరువేయ సాగాడు.

"అవును .... 'జడ్డునూనె విప్లవనాయకుడు' తనను మోసం చేసాడు..... కాదు విప్లవాన్నే నాశనం చేసాడు. అతడు జర్మనీ రాయబారితో మాట్లాడుతానని తనకు మాట యివ్వటం తప్ప అసలు మాట్లాడనేలేదు." అని రాయ్ తనలో తాను వ్యాకులత చెంది యీ రహస్యం వాళ్ళతో చెప్పటం మంచిది కాదని బయటకు పొక్కలేదు.

(తరువాత రాయ్ రష్యా వెళ్ళుతూ జర్మనీలో ఆగినప్పుడు పరాజయం పొందిన ఆ దేశ శిథిలాలను చూచి తాను రాకపోవటమే మంచిదని, ఒకవేళ వచ్చినా చావు బ్రతుకుల మధ్యవున్న జర్మనీ ప్రభుత్వం ద్వారా తనకు ఆయుధ సహాయం యేమీ జరిగివుండేదికాదని తెలుసుకొనగలిగాడు.)

వాళ్ల మాటల ధోరణినిబట్టి రాయ్‌కి సరాసరి జర్మను హైకమాండుతోనే సంబంధాలు పెట్టుకుంటే బాగుండునేమో ననిపించినది. ఒకవేళ జర్మను ప్రభుత్వం తన పథకం అంగీకరిస్తే తాను తిరిగి చైనా వెళ్లవలసి వుంటుంది. కాని చైనా వదలి సంవత్సరం దాటినది. అచ్చట ప్రస్తుత పరిస్థితులు రాయ్‌కి తెలియవు.

ఈ సంవత్సర కాలంలో అనేక మార్పులు జరిగివుండవచ్చు. తిరిగి కొత్త సంబంధాలు యేర్పరచుకొన వలసి వుంటుంది. అందుకు ఆర్థిక సహాయం కావాలి. దానికి వీరిద్దరూ అనుకూలంగా కనబడటంతో రాయ్‌లో తిరిగి ఆశలు చిగురెత్త సాగినవి.

తిరిగి కొలదిరోజుల్లో కలుసుకుందామని మధ్యలో అవసరమయితే మధ్యవర్తుల ద్వారా సంప్రదింపులు సాగించుకొనవచ్చునని అప్పటికి ఆ సమావేశం ముగించి రాయ్ వీడ్కోలు చెప్పి బయటకు వచ్చి వొంటరిగా కొంతదూరం నడువగానే ఒక బజారు మూలలో తనకొరకు ఒకకారు సిద్ధంగా వున్నట్లు గ్రహించాడు. కారులో ఎక్కటం ఆలస్యం, డ్రైవరు తన అడ్రెసు అడగకుండానే సరాసరి తాను వుంటున్న యింటిముందుకు కారు తీసుకొనివచ్చి ఆపటం రాయ్‌కి మరీ ఆశ్చర్యం కలిగించినది. 'జర్మనుల తెలివితేటలు' అనుకున్నాడు.

మరునాడు ఒక యువకుడు తనయింటికి వచ్చి దినపత్రిక సంపాదకుని విందు ఆహ్వానాన్ని అందజేసాడు. ఆ యువకుని అణకువ, మాటల ధోరణి చూచి అలాంటి వ్యక్తి తనకు కార్యదర్శిగా వుంటే బాగుంటుందని రాయ్ వూహించుకున్నాడు. కాని హోటలు బిల్లు చెల్లించగా ప్రస్తుతం చేతిలో ఒక చిల్లిగవ్వ కూడా లేని స్థితిలో రాయ్ వున్నాడు. ఆనాటి రాత్రి భోజనానికి సరిపడ చిల్లర డబ్బులు కూడా లేవు. అట్టి పరిస్థితుల్లో కార్యదర్శిని గురించి ఆలోచించటం రాయ్‌కి విడ్డూరముగా కనబడినది. కాని అనుకోకుండ విందుకు పిలుపు రావటం తన అదృష్టంగా భావించి తిరిగి సాయంత్రం రమ్మని ఆ యువకుని పంపివేసాడు.

ఆ రాత్రి విందులో రాయ్‌కి మెక్సికన్ ఆచారాలు, మర్యాదలు తెలుసుకొనే అవకాశం కలిగినది. రాయ్‌తోపాటు మరిద్దరు అతిధులు కూడా వున్నారు ఒకరు స్త్రీ, 'అధునిక యువతి' పత్రికా సంపాదకురాలు. కరంజా అధికారం చేపట్టక ముందు ఆయనకు కార్యదర్శిగా పనిచేసినది. రెండవవ్యక్తి ఒక యువకుడు. బ్యాంకు ఉద్యోగి. విదేశాంగ శాఖామాత్యుని సోదరుడు. విందు అనంతరం ఆరాత్రి చాల ప్రొద్దుపోయే వరకు రాయ్ కబుర్లలో అక్కడే వున్నాడు. సంపాదకుడు రాయ్‌ని భారతదేశ స్థితిగతుల గురించి, బ్రిటిషు పరిపాలన గురించి వ్యాసాలు వ్రాసి యివ్వమని అభ్యర్థించాడు. అది స్పెయిను భాషలో వెలువడే పత్రిక. ఆ భాష రాయ్‌కి బొత్తిగా తెలియదు. తన అసమర్థతను వెల్లడించాడు. కాని తన ఇంగ్లీషు రచనను తనను ఆహ్వానించటానికి వచ్చిన యువకుడు స్పెయిన్ భాషలోనికి

తర్జుమా చేసే యేర్పాటు చేయబడినది. అప్పటినుంచి రాయ్ కాతడు కార్యదర్శి అయ్యాడు.

మరునాటి నుంచి వ్యాసరచనకు రాయ్‌ని సంపాదకుడు బలవంతపెట్ట సాగాడు. ఒక కొత్త టైపురైటరు తీసుకొని వచ్చి రాయ్ గదిలో పెట్టటం ఆయనకు మరీ ఆశ్చర్యంగా కనబడినది. వూహించని సంఘటనలు జరిగిపోతున్నవి. ఆ మరునాటి మధ్యాహ్నమే రాయ్ వూహించని మరొక సంఘటన కూడా జరిగినది. ఆ రాత్రి విందులో కలిసిన బ్యాంకు ఉద్యోగి - విదేశాంగమంత్రి సోదరుడు- రాయ్ దగ్గరకు వచ్చి 'బ్యాంకి ఖాతాదారు వొకరు' రాయ్‌కి 'పదివేల పెసోలు' అందచేయమని తనను ఆదేశించి వెళ్ళినట్లుగా చెప్పి వెళ్లాడు. పెసో మెక్సికన్ నాణెము. అమెరికన్ డాలరుకు సగం విలువ కలిగివుంటుంది. కరంజా అధికారానికి రాగానే 'పేపరు కరెన్సీ'ని రద్దుచేసి నాణాలు కరెన్సీగా చలామణి లోనికి తీసుకొని వచ్చాడు. చివరి నాణెము వెండితోను, మిగిలిన పై నాణెములన్నీ బంగారముతోనూ ముద్రింప బడుతవి.

మరునాడు పదకొండు గంటలు కాకముందే ఆ బ్యాంకు జవాను ఒక పెద్ద సంచిలో పదివేల బంగారు నాణెములు తీసుకొని వచ్చి రాయ్‌కి అప్పగించి రసీదు తీసుకొని వెళ్లాడు. ఆ బంగారు నాణెముల కుప్పచూచి రాయ్ తనకు తెలియని, వూహించని విచిత్ర సంఘటనలకు అయోమయ స్థితిలో పడ్డాడు.

## సోషలిస్టుల పరిచయం :

రాయ్ మెక్సికో చేరినప్పుడు ఆ దేశంలో రాజకీయపార్టీలనేవి లేవు. ఒక్కొక్క నాయకుని క్రింద ఒక ముఠా లేక వర్గం వుంటూ ఆ నాయకుని పేరుతో పిలువబడుతూ వుండేది. శతాబ్దాల తరబడి విదేశీ పరిపాలనతో, అంతర్యుద్ధాలతో మెక్సికో తలమునకలు కావటంచేత అరాచకం ప్రబలి అభ్యుదయభావాలు గల మధ్యతరగతి ప్రజలు రాజకీయాల్లో తలదూర్చక తటస్థంగా, దూరంగా వుండటం జరుగుతూ వచ్చినది.

కరంజా నాయకత్వం క్రింద వున్న వర్గం 'కరంజిస్టాన్'గా పిలువబడుతూ వుండేది. వేరొక వర్గం - హెచ్చుగా మేధావులు, లాయర్లు, డాక్టర్లు మొదలగు వారితో సోషలిస్టు వర్గంగా పిలువబడుతూ వుండేది. వీరు వేరే వర్గంగా వున్నా కరంజా ప్రభుత్వానికి పూర్తిగా వ్యతిరేకం కాకుండా అందులో అభ్యుదయ కార్య క్రమాలను బలపరుస్తూ వుండేవారు. రాయ్ మెక్సికో చేరిన రెండునెలల తరువాత ఒకసారి సోషలిస్టుపార్టీ కార్యాలయానికి వెళ్లి కార్యదర్శిని పరిచయం చేసుకొన్నాడు. భారతదేశాన్ని గురించి పత్రికలో ప్రచురింపబడుచున్న వ్యాసకర్త ఆయనేనని తెలుసుకొని కార్యదర్శి రాయ్‌ని ఘనంగా గౌరవించాడు. ఆ పరిచయం క్రమేపీ కార్యవర్గ సభ్యులతోనూ, యితర పార్టీ ప్రముఖులతోనూ విస్తరించి రాయ్ వారి మన్ననలకు, సహకారానికి పాత్రుడు కాగలిగాడు.

"భారతదేశం పవిత్ర భూఖండం. ఆధ్యాత్మిక సంపత్తుకు అంతులేని ఖనిజరాశి," అని కలలుకంటూ వుండే మెక్సికనులు 'భారతదేశం కూడా తమదేశం మాదిరిగా పరాధీనతలో మ్రగ్గి దారిద్ర్యంతో క్రుంగికృశిస్తున్న దేశం'గా రాయ్ వ్యాసాల ద్వారా తెలుసుకొనటంతో వారు భారతదేశ స్థితిగతులను, చరిత్రను గురించి యింకా లోతుగా తెలుసుకోవాలనే ఆసక్తితో రాయ్‌ని అనేక ప్రశ్నలు వేస్తూ వుండే వారు. ఒకవిధంగా రాయ్ కిది పరీక్షా సమయంగా వుండేది. భారతదేశ చరిత్రను మార్క్సిస్టు దృక్పథంతో పరిశీలించాడు. వేయి సంవత్సరాల నుంచి భారత భూఖండం పరాధీనతలో మ్రగ్గటానికి, మాటిమాటికి విదేశీయుల దండయాత్రలకు గురికావటానికి కారణాలు పరిశీలించాడు. ప్రజల దుర్భరదారిద్ర్యానికి బ్రిటిషు సామ్రాజ్యవాదుల దోపిడీ విధానంతోపాటు దేశీయ జమిందారీ, ఫ్యూడల్ విధానం కూడా ఒక పెద్ద కారణంగా కనబడినది. "కేవలం దేశం పరపాలన నుంచి విముక్తి చెందినంత మాత్రంచేత దారిద్ర్యం తొలగదు. అందుకు పట్టుగొమ్మగా వున్న దేశీయ ఫ్యూడల్ విధానాన్నికూడా అంతం చేయాలని" రాయ్ గ్రహించాడు.

ఒకనాడు సోషలిస్టు కార్యవర్గం రాయ్‌ని ఆహ్వానించి సన్మానించినది. ఆ సమావేశంలో ఒకరి భావాలను ఒకరు తెలుసుకొన గలిగారు. అప్పటినుంచి వివిధ వర్గాలకు చెందిన అభ్యుదయగాములు తరచుగా కలసికొంటూ రాజకీయ, ఆర్థిక విషయాలను చర్చించుకుంటూ వుండేవారు. సాధారణంగా ఒక చిన్న హోటలులో కూర్చొని కాఫీ సేవిస్తూ యీ చర్చలు జరుపుకుంటూ వుండేవారు. అచ్చటి సోషలిస్టు ముఠా అనార్కిస్టులు - సిండికలిస్టులు వగైరాల కలయిక.

రాయ్ మార్క్సిస్టు. కనుక సాధారణంగా మార్క్సిజానికి - అనార్కో సిండికలిజానికి మధ్య వాగ్వివాదం జరుగుతూ వుండేది. ఈ చిన్నపోట్లు తరువాత రష్యాకు బయట ప్రపంచంలో ప్రథమ కమ్యూనిస్టుపార్టీకి జన్మస్థల మయినది.

ఒకనాటి చర్చలో 'అమెరికా మెక్సికో ఆంతరంగిక రాజకీయాల్లో జోక్యం కలుగచేసుకుంటే సోషలిస్టుల పాత్ర యేమిటి ?' అనే విషయం మీద మీమాంస జరిగినది.

"రెండూ బూర్జువా వర్గాలకు చెందిన ప్రభుత్వాలు కనుక తమది తటస్థ విధానమని" సోషలిస్టు వర్గం సమాధాన మిచ్చినది.

"ఒకవేళ అమెరికా జోక్యం మెక్సికోమీద యుద్ధానికి దారి తీస్తే ?" అని రాయ్ ప్రశ్నించాడు.

"అప్పుడూ మాది ఆదేవిధానం. ప్రోలిటేరియనులకు ఆరెండు వర్గాలలో యెవరైనా ఒకటేగదా !" అని వారు సమాధానం చెప్పటంతో రాయ్ విభ్రాంతి చెందాడు. 'ఇదేనా వీరిసోషలిజం ?' అని ఆలోచనలో పడ్డాడు. ఆనాటి సమావేశం ముగిసినది. మెక్సికోలో సోషలిజానికి గట్టి పునాదులు నిర్మించవలసిన ఆవశ్యకతను రాయ్ గుర్తించాడు.

ద్వితీయ ప్రపంచ సంగ్రామంలో ఒక ప్రక్క ఫాసిస్టుశక్తులు ప్రపంచాధిపత్యం కొరకు పెనగులాడుచుండగా అనాటి మెక్సికో సోషలిస్టులవలె భారత కమ్యూనిస్టులు విజ్ఞతలేని వారగుటచే రెండు సామ్రాజ్యదేశాల మధ్య జరిగే యుద్ధంగా దానిని అభివర్ణించుకొని తటస్థ విధానాన్ని అవలంబించారు. రాయ్ యుద్ధ స్వభావాన్ని, యుద్ధ లక్షణాలను, యుద్ధఫలితాలను గురించి విపులంగా చర్చించి కళ్లకు కట్టినట్లు చూపించినా వారు వాస్తవం గ్రహించలేక పోయారు. ఈ విషయం ముందు అధ్యాయాలలో విపులంగా చర్చించబడుతుంది.

# జర్మనుల వాగ్దానం:

జావా నుంచి వచ్చిన జర్మనీ అధికారులను రాయ్ అప్పుడప్పుడూ రహస్యంగా కలుసుకొంటూ వుండేవాడు. వారి ద్వారా అప్పటి జర్మను రాయబార కార్యాలయ అధికారులతో, యుద్ధకారణంగా అమెరికా, యూరప్ దేశాల నుంచి రహస్యంగా తటస్థదేశమయిన మెక్సికో ప్రవేశించి తాత్కాలిక నివాస మేర్పరచుకొనిన అనేకమంది ప్రముఖ జర్మను జాతీయులతో రాయ్ పరిచయ మేర్పరచుకొన గలిగాడు. ఇందులో శాస్త్రజ్ఞులు, తత్వవేత్తలు, విద్యాధికులు, కళా కారులు, సంగీత నిపుణులు, విభిన్నరుచులు గల మేధావులు వున్నారు. వారి పరి చయం, సన్నిహితత్వం వలన రాయ్ అంతవరకు తనకు తెలియని, అనుభవం లేని అనేక విషయాలను తెలుసుకొనటం, అభిరుచిని పొందటం, అధ్యయనం చేయటం జరిగినది.

కారల్‌మార్క్సు సిద్ధాంతాలతోబాటు సర్ వాన్‌టిస్, వాల్టైర్ మొదలయిన ప్రముఖ రచయితల గ్రంథాలు పఠించాడు. ఫ్రెంచి, జర్మనీ, స్పానిష్ భాషలను నేర్చుకున్నాడు. స్పెయిన్ భాషలో వ్యాసాలు, పుస్తకాలు వ్రాయగిల పరిజ్ఞానం పొందగలిగాడు. చైనా, జపాను, జర్మనీ, ఫ్రెంచి, ఇంగ్లీషు భాషలతో నిఘంటువు రచించటానికి పూనికొని జపానులో ఇరవై సంవత్సరాలు ఒక విశ్వవిద్యాలయంలో ఆచార్యునిగా వుండి యుద్ధకారణంగా మెక్సికో చేరిన ఒక విద్యావేత్త పరిచయంతో రాయ్ అనేక విషయాలు తెలుసుకొన గలిగాడు. ఒక జర్మనీ 'ఇనుప వస్తువుల వ్యాపారస్తుని' భార్య రాయ్‌ని కూర్చోపెట్టి రాయ్ చిత్ర పటం గీసి చిత్రకళను గురించి పాఠాలు చెప్పినది. సంగీతమంటే రాయ్‌కి తల నొప్పిగా వుండేది. ఒక వీణావాద్యకారుడు సంగీతంలోని మధురస్వరాలను వినిపించి సంగీతప్రియుని చేసాడు. ఈవిధంగా రాయ్ మెక్సికోలో సంగీత - సాహిత్య - లలిత కళల మెలకువలు ఆకళింపు చేసుకొనటమేగాక ఉన్నతవర్గాలలోని అధికారులతో, రాయబారులతో సన్నిహిత సంబంధాలు యేర్పరచుకొని వారి వేషభాషలు, ఆచార వ్యవహారాలు, మర్యాద మన్ననలు అర్థం చేసుకొని వారి మధ్య ఏవిధంగా ప్రవర్తించాలో గ్రహించ గలిగాడు,

ఒకనాడు జర్మను ప్రభుత్వ కాన్సల్‌గా పనిచేస్తున్న మెక్సికో లోని జర్మను అధికారి తనభార్య (అమెరికను యువతి) తో కలిసి స్వయంగా వచ్చి టీకి ఆహ్వానించటం, ఆ యువతి రాయ్‌తో చనువుగా మాట్లాడి తమ స్వవిషయాలు కూడా ముచ్చటించటం రాయ్‌కి ఎంతో ఆశ్చర్యాన్ని కలిగించినది. టీపార్టీ అయిన తరువాత రాయ్ వీడ్కోలు చెప్పకముందే ఆమె "రేపు మీరు మాయింటికి విందుకు రావాలి" అని ఆజ్ఞాపన పూర్వకంగా ఆహ్వానించటం, ఆమెభర్త ప్రక్కను నిలబడి, రహస్యంగా 'జర్మనీ మినిష్టరు మిమ్ములను కలుసుకోవాలనే ఆసక్తితో వున్నాడని' అనటంతో రాయ్ చకితుడై తన వెనుకటి యుద్ధపథకం గుర్తుకు వచ్చి అది ఒక రూపం దాల్చబోతున్నట్లుగా భావించాడు.

జర్మను కాన్సలు విందులో రాయ్, జర్మనుమంత్రి, జావానుంచి వచ్చిన జర్మను అధికారు లిద్దరు మాత్రమే వున్నారు. కేవలం మర్యాద కొరకుగాక ఒక ప్రత్యేక కార్యసాధనకు యేర్పరచిన విందు కావటంచేత ఇతరులెవరూ ఆహ్వానించబడలేదు. విందు అనంతరం రాయ్‌ని ఆయన పథకం గురించి జర్మను మంత్రి హెచ్చరించాడు. రాయ్ తన సంభాషణలో "అమెరికాలోని కొంతమంది విప్లవవాదులతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతున్నాను. అందులో కొంతమంది వీలైనంత త్వరలో చైనా వెళ్ళగలరు. జపానులో రాస్‌బిహారీ బోసును కలుసుకొని ఆయన సహాయం అభ్యర్థించటానికి ఒక ప్రత్యేక దూత వెళ్ళబోవు చున్నాడు. ఆ యేర్పాట్లకు ఒక విప్లవవాది త్వరలో నాదగ్గరకు రానున్నాడు." అని చెప్పాడు.

"చైనాలోగాని అమెరికాలోగాని ఎవరైనా చైనా విప్లవవాదులతో పరిచయమున్నదా ?" అని మంత్రి ప్రశ్నించటం 'లేదని' రాయ్ సమాధానం చెప్పటం జరిగినది.

"అయితే వారిని మీకు పరిచయం చేస్తాను. వారి సహకారం మీకు అవసరం, మంచిదికూడాను." అని జర్మనుమంత్రి అనటంతో రాయ్ అందుకు అంగీకరించాడు. భారత విప్లవవాదులమీద రాయ్‌కి పూర్తిగా విశ్వాసం సన్నగిల్లటమే యిందుకు కారణం.

ఒక చైనా వ్యాపారస్థునిద్వారా ఒక రహస్య ఉత్తరాన్ని జపానులోని రాస్‌బిహారి బోసుకు అందచేసే ఏర్పాటు చేసాడు రాయ్. కాని కేవలం ఆ ఉత్తరం ద్వారా కార్యం గట్టెక్కదనే విషయం రాయ్‌కి తెలుసు. చైనాలోని యూనాను,

రాష్ట్రంలోని ప్రజలతో సరాసరి సంబంధాలు పెట్టుకొనటం మంచిదిగా భావించాడు. చైనావ్యాపారికి ఇండో - చైనాలో వ్యాపార సంబంధాలు వున్నవి. కనుక అవసర మయితే అతనినే సరాసరి యూనాన్ రాష్ట్రానికి పంపవచ్చునని రాయ్ వూహించాడు.

"చైనాలోవున్న జర్మను అధికారులుకూడా యీ విషయంలో తగిన శ్రద్ధ తీసికొనటం అవసరం. డాక్టరు యక్సు (కలోనియల్ ఆఫీసరు)కు తూర్పు దేశాలతో బాగా సంబంధమున్నది. కనుక అతడు కూడా వెళ్ళటం మంచిది. అతడు జపానువెళ్లి రాస్‌బిహారిని కలుసుకొంటాడు." అని మంత్రి అనగానే 'జర్మనీ అధికారి యీ యుద్ధసమయంలో జపానులో ఎలా ప్రవేశించ గలడని' రాయ్ ఆశ్చర్యంగా మంత్రివంక చూసాడు.

'ఇందులో పెద్దగా ఆశ్చర్యపడవలసిన దేమీలేదు. డాక్టరు యక్సు వేరే దేశస్థునిగా ఫోర్జరీ ప్యాసుపోర్టుతో జపానులో తేలిగ్గా ప్రవేశించ గలడు." అని మంత్రి సమాధాన మిస్తూ రాయ్‌ని ఆంతరంగికునిగా భావించినట్లు 'నిజానికి జపాను మాకు శత్రుదేశం కాదుగా' అని అన్నాడు.

ఫోర్జరీ ప్యాసుపోర్టుతో మారువేషంలో ప్రయాణం చేయటం రాయ్‌కి సాధారణ విషయమే కనుక డాక్టరును వీలైనంత త్వరలో తూర్పుదేశాలకు పంపాలని నిర్ణయించుకొని మిగిలినవాళ్ళ ప్రయాణానికి అవసరమయిన ధనం రాయ్‌కి అందచేయబడినది.

గతంలో జర్మనీ ప్రభుత్వం కొంత ధనం, కొన్ని పిస్తోళ్లు గదర్ పార్టీ సభ్యుల కిచ్చి తూర్పుదేశాలకు పంపగా దేశీయ సైనికులుతమప్రక్క చేరుతారనే గంపె డాశతో వారు మలయా, సయాము, బర్మా ప్రాంతాలలో పొంచులు వేసుకొని తిరగటం, జర్మనీ పత్రికలు బ్రిటిషు వలస దేశాల్లో విప్లవాలు చెలరేగుచున్నవని గోరంతలు కొండంతలు చేసి వ్రాయటం, దాని ఫలితంగా జర్మనీ దేశస్థులు పస్తులు చేస్తున్నా తమ దేశం గెలుస్తుందనే కలలు కనటం రాయ్‌కి తెలుసును. ఈ గదర్ పార్టీ సభ్యులలో కొందరు తమ గమ్యస్థానం చేరలేకపోవటం, చేరిన వాళ్లలో కొందరు బ్రిటిషు గూఢచారులకు పట్టుబడి జైలుశిక్షలకు, మరణశిక్షలకు గురికావటం కూడా రాయ్‌కి తెలుసు.

చైనాలోని జర్మనీ అధికారులతో రాయ్‌కి బాగా అనుభవమున్నది. భారత దేశ సరిహద్దులలోని చైనా రాష్ట్రి తిరుగుబాటుదారుల నుంచి తాను ఆయుధాలు ఖరీదు

చేయటానికి ప్రయత్నించినప్పుడు వారు ధన సహాయం చేయటానికి నిరాకరించారు. కనుక కేవలం వాళ్ల దయాధర్మాలమీద ఆధారపడి వుంటే తన ప్రయత్నం సఫలం కాకపోవచ్చును. ఈసారి వారు సహాయం చేయటానికి ముందుకు వచ్చారు. కనుక ముందుగానే వారి దగ్గర నుంచి తనకు కావలసిన ధనసహాయమంతా పొందటం అవసరమని రాయ్ నిశ్చయించుకున్నాడు.

ఒక వారం రోజులలోగానే రాయ్‌కి ఏభై వేల పెసోలు అందజేయబడ్డవి. భారత యీశాన్యప్రాంతమయిన సీమా సరిహద్దులలో తనకొరకు ఎదురు చూస్తున్న విప్లవవాదులకు తాను కార్యనిమగ్నతలో వున్నట్లు వర్తమానం పంపాలి. కాగా ముందుగా వారికి కొంత సొమ్ముకూడా పంపటం అవసరం. ఈ మధ్య వాళ్లతో రాయ్‌కి బొత్తిగా సంబంధాలు లేకుండా పోయినవి. వాళ్లు రాస్‌బిహారితో సంబంధాలు కలిగి వున్నట్లు కొన్ని కట్టుకధలు విన్నాడు. ఆ నమ్మకంతో చైనా వ్యాపారస్థుని ద్వారా బోసుకు అందచేయమని ఇరవై వేల రూపాయలకు సమానమయిన పెసో బంగారు నాణెములు యివ్వటం జరిగినది. తరువాత కొలది కాలానికే జర్మనీ అధికారుల వర్తమానం ప్రకారం ఆ చైనా వ్యాపారి జపాను దేశం చేరి ఆ సొమ్ము రాస్‌బిహారీకి అప్పగించి యూనాన్ రాష్ట్రంతో సంబంధాలు పెట్టుకొనటానికి ఇండో చైనా వెళ్లినట్లు వార్త వచ్చినది. కాని కొన్ని సంవత్సరాల తరువాత రాయ్ తానిచ్చి పంపిన సొమ్ము గమ్యస్థానం చేరలేదని, జర్మనుల మాంత్రికమని తెలుసుకో గలిగాడు.

రాయ్ చైనా వ్యాపారి మీద పూర్తిగా ఆధారపడలేదు. అమెరికాలోని కొంతమంది భారత విప్లవకారులతో సంబంధాలు పెట్టుకున్నాడు. ఒక విప్లవవాది మెక్సికో వచ్చి రాయ్‌ని స్వయంగా కలుసుకున్నాడు. "కొంతమంది గదర్‌పార్టీ సభ్యులను చైనా పంపి అచట తగిన యేర్పాట్లు చేయగలను. నేను అమెరికాలో వుండి భారతదేశానికి అనుకూలంగా ప్రచారం చేసి ఒక వుద్యమాన్ని లేవదీసే ప్రయత్నంలో వున్నాను. కాబట్టి కొంత ధన సహాయం చేయాలి." అని అతడు రాయ్‌ని బలవంతపెట్టాడు. అందుకు రాయ్ అంగీకరించలేదు. "ఈ ధనం ఒక ప్రత్యేక కార్యక్రమం కొరకు నిర్దేశింపబడినది. కనుక యితరత్రా ఖర్చుపెట్టటానికి వీలులేదని' రాయ్ తిరస్కరించటంతో అతడు తిరిగి అమెరికా చేరి రాయ్‌ని దూషిస్తూ వుత్తరం వ్రాసాడు.

తరువాత కొలది రోజులకే మెయిజరు ప్రివీకౌన్సిలరు రహస్యంగా మెక్సికో విచ్చేసాడు. రాయ్ అతనినికూడా కలుసుకొని తన యుద్ధపథకాన్ని గురించి విశదీకరించాడు. తూర్పుదేశాల్లోని బ్రిటిషు వ్యతిరేక ఉద్యమం మాదిరిగా లాటిన్ అమెరికను దేశాల్లో అమెరికా వ్యతిరేక ఉద్యమం లేవదీయటం తన అభిమతంగా చెప్పాడు. రాయ్ చైనా బయలుదేరేముందు ఆయుధ సేకరణకుగాను ఐదు మిలియన్ల డాలర్లు, అదనపు ఖర్చులకు పదివేల డాలర్లు అందచేయటానికి తగిన ఏర్పాట్లు జరుపగలనని అతడు హామీ యిచ్చాడు.

ఒకరోజున అనుకోకుండా ప్రివీకౌన్సిలరు విందుకు ఆహ్వానించినట్లు ఒక ప్రత్యేక కారువచ్చి రాయ్‌ని వెంటతీసుకొని వెళ్లాడు. గేటు దగ్గరకు కారు చేరగానే అతడే సాదరంగా ఎదురువచ్చి అతిథి మర్యాదలతో రాయ్‌ని లోపలకు తీసుకొనివెళ్ళి ఒక ప్రత్యేకగదిలో ఆసీనులయి వున్న మెక్సికో ప్రెసిడెంటు కరంజాను పరిచయం చేసాడు. తనకు ముందుగా తెలియకుండానే యీ పరిచయం జరిగినది. కరంజా రాయ్‌ని ప్రత్యేకంగా కరచాలనం చేసి అభినందించాడు. యుద్ధమంత్రి, ప్రివీకౌన్సిలరు రాయ్‌ని గురించి కరంజాముందు విశేషంగా పొగడసాగారు. రాయ్ నిర్విణ్ణుడయి ప్రెసిడెంటుకు ఏమి సమాధానం చెప్పాలో తెలియని స్థితిలో పడ్డాడు.

కరంజా తన సంభాషణలో రాయ్‌ని ఎంతో ఆప్యాయతతో, ఆదరంగా పలుకరించాడు. మెక్సికోలో రాయ్ నివాసం తనకు మిక్కిలి సంతోషదాయకమనీ, మెక్సికో ప్రజలయెడ సానుభూతిగల ప్రతి విదేశీయుడు ఇక్కడ స్వదేశీయుని లాగానే నివసించవచ్చునని హామీ యిచ్చాడు. ప్రివీకౌన్సిలరు రాయ్ భవిష్యత్ పథకం గురించి మాట్లాడుతూ రాయ్ ప్రయాణానికి కావలసిన యేర్పాట్లు త్వరలో జరుగగలవని వాగ్దానం చేసాడు. ఒకవేళ రాయ్ తిరిగి మెక్సికో వచ్చినట్లయితే రాయ్ సేవలను హిజ్‌యక్సలెన్సీ (కరంజా) అంగీకరించ గలడని చెప్పాడు.

విందు అనంతరం కరంజా తిరిగి రాయ్‌తో కరచాలనంచేసి ఒకరి కొకరు వీడ్కోలు చెప్పుకున్నారు. ప్రివీకౌన్సిలరు రాయ్‌కి వీడ్కోలు యిస్తూ 'రేపే నేను అర్జెంటైనా వెళ్ళుచున్నాను. మీ ప్రయత్నంలో మీరు ఘనవిజయం సాధిస్తారని నాకు గాఢ విశ్వాసం వున్నది' అని కరచాలనం చేసాడు.

# తిరుగు ప్రయాణం :

కలలో కూడా ఊహింపరాని విచిత్రసంఘటనలు రాయ్‌కి మరీ విచిత్రంగా కనబడసాగినై. ఎప్పుడో తిలాంజలి యిచ్చిన తన పథకం తిరిగి కార్యరూపం ధరించినది. రాయ్ వెంటనే చైనా వెళ్ళవలసిన అవసరం కలిగినది. ఈసారి ఆయుధ సేకరణతోబాటు స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలను గురించి తనలో యేర్పడిన నూతన భావాలను తన సహచరులకు వివరంగా చెప్పాలి. అంతేకాదు, వాటిని ఆచరణ యోగ్యంచేసి తాను, తన సహచరులు నూతన సమాజ నిర్మాణానికి తీవ్రకృషి చేయవలసి వున్నది. ఇప్పుడు రాయ్‌లో ద్విగుణీకృత వుత్సాహ మేర్పడినది. 'బ్రిటిషు ప్రభుత్వాన్ని కూలద్రోసినంత మాత్రాన గమ్యస్థానం చేరినట్లుకాదు. ప్రధానంగా సామాజిక విప్లవం జరుగవలసి వున్నది' అని రాయ్ ఒక నిర్ణయానికి వచ్చాడు.

ప్రస్తుత పరిస్థితుల్లో రాయ్ చైనా ప్రయాణం అంతతేలికయిన విషయం కాదు. అమెరికా, యుద్ధంలో మిత్రరాజ్యాలతో చేరినది కనుక ఆ దేశం ద్వారా ప్రయాణం చేయటానికి వీల్లేదు. పైగా తనమీద యిదివరకే ఒక నేరం మోపబడి వున్నది కనుక ఆ దేశ ప్రభుత్వం తనకొరకు ఎదురుచూస్తూ వున్నది. నెలకో పర్యాయం జపాను నౌకలు మెక్సికో వస్తూవుంటవి. కాని అందులో కొన్ని తిరుగు ప్రయాణంలో శాన్‌ఫ్రాన్‌సిస్కో సందర్శించి కాని వెళ్ళవు. ఆ నౌకలలో ప్రయాణించటానికి వీల్లేదు. భద్రతకొరకు ముందుగానే రాయ్ మెక్సికో ప్రభుత్వం నుంచి రాయబార కార్యాలయ హోదాలో ప్యాస్‌పోర్టును, జపానులోని మెక్సికన్ కాన్సలు జనరలు పేర పరిచయలేఖను పొందగలిగాడు. జపానులోని బ్యాంకు ద్వారా అవసరమయిన సొమ్ము తీసుకొనటానికి అన్ని ఏర్పాట్లు పూర్తి చేయబడ్డవి. ఇక రాయ్ మెక్సికో నుంచి సరాసరి జపాను వెళ్లి నౌకలో ప్రయాణించటమే తరువాయి.

యుద్ధకారణంగా జపాను నౌకలు మెక్సికో రేవులకు ఫలానా రోజున వస్తవని నిర్ణయించటానికి వీలులేని పరిస్థితులవి. మెక్సికోలోని ఒకటి రెండు రేవులకు మాత్రం జపాను నౌకలు తరచుగా వచ్చే అవకాశం వున్నది. కాని ఆ రేవులు మెక్సికో పట్టణానికి చాలదూరంగా వున్నవి. ప్రయాణ వసతులు తక్కువ. కొండలు, అడవుల ప్రాంతాలనుంచి ప్రయాణం చేయవలసి వున్నది. దేశంలో శాంతిపరిస్థితులు యింకా నెలకొనక పోవటంచేత రైళ్ళలో బందిపోటు దొంగతనాలు,

దోపిడీలు తరచుగా జరగటం కద్దు. ఆప్రయాణంలోని కొన్ని ప్రాంతాలు కరంజాకు వ్యతిరేక ముఠా అయిన 'జపాటిస్టా ముఠా పలుకుబడిలో వున్నవి. సాధారణంగా దూరప్రాంతాలకు వెళ్ళే రైలుబండ్లు సైనిక సహాయంతో నడుపబడుతూ వుంటవి.

రాయ్ మొదట మెక్సికో నగరంనుంచి పసిఫిక్ సముద్రానికి దగ్గరలో వున్న ఒక పట్టణానికి రైలులో ప్రయాణించి సాయంత్రానికి ఆ పట్టణం చేరుకో గలిగాడు. అక్కడ నుంచి రేవుపట్టణానికి ఐదారు గంటలు రైలులోనే ప్రయాణించ వలసి వుంటుంది. అది కొండప్రాంతం కావటంచేత రైలు నెమ్మదిగా గంటకు 15, 20 మైళ్ళకు మించిన వేగంతో పోవటానికి వీలులేదు. భద్రత కొరకు ముందుగా కేవలం సైనికులతో రెండు రైలుబండ్లు ప్రయాణం చేసినవి. ఒకటి సాఫీగానే వెళ్ళినా రెండవది బందిపోటు దొంగలను ఎదుర్కొనవలసి వచ్చినది. వెంటనే తిరిగి దోపిడీ జరుగక పోవచ్చుననే నమ్మకంతో అర్ధరాత్రి రాయ్ ప్రయాణం చేసే రైలుబండి కదలినది. అందులో కూడా కొంతసైనిక సిబ్బంది వున్నది. రాయ్‌కి, ఆయనతోబాటు రైలులో వున్న మరి కొందరికి మాస్టర్‌పిస్టల్సు యివ్వబడ్డవి. రైల్లో దీపాలు ఆర్పివేయబడ్డవి. తలుపులు, కిటికీలు పూర్తిగా మూసి వేయబడ్డవి. ఒకవేళ బయటనుంచి తుపాకి పేలుడు మోత వినిపిస్తే రైలులో వున్న వాళ్లందరూ ముందు జాగ్రత్త కొరకు బోర్లగా పడుకోవాలని హెచ్చరించ బడినది.

రాయ్ ప్రయాణం చేసిన రైలుబండి ఏమీ ప్రమాదం లేకుండానే తెల్ల వారేసరికి రేవుపట్టణం చేరినది. అది జనసమ్మర్దం లేని చాల చిన్నరేవుపట్టణం. రెండురోజులు రాయ్ అక్కడ మకాంవేసి జపాను నౌక అక్కడకు వస్తుందేమోనని విచారించాడు. ఆ రేవుకు వచ్చే జపాను నౌక లేదని, అక్కడకు మూడువందల మైళ్ల దూరంలో వున్న మరొక రేవు పట్టణానికి వచ్చే అవకాశం వుందని తెలుసు కొని అక్కడకు వేరే నౌకలో చేరాడు. రాయ్ ఆ పట్టణంలో ఒక నెలరోజుల వరకు మకాం వేసినా జపాను వెళ్లే నౌక రాలేదు. చివరకు విచారించగా అక్కడకు రావలసిన నౌక వేరే రేవులో సరిపడ్డ సామాను నింపుకొనటంచేత ఆ రేవుకు రాకుండానే వెళ్లినట్లు మళ్లీ మరో జపాను నౌక రావాలంటే ఇంకో నెలరోజులు వేచి వుండవలసి వుంటుందని తెలుసుకోగలిగాడు. అంతవరకు అక్కడ వుండటం రాయ్‌కి అసాధ్యంగా కనబడినది.

ఈ విశ్రాంతి సమయంలో రాయ్ తిరిగి వెనుక ముందులు ఆలోచించ సాగాడు. తీరా నానా అవస్థలు పడి చైనా చేరగలిగినా తన పథకం సానుకూల మవుతుందనే పూర్తి విశ్వాసం లేదు. ఒకవేళ యూనాన్ రాష్ట్రం నుంచి ఆయుధాలు-ఆయుధసామగ్రి ఖరీదు చేయగలిగినా సీమా సరిహద్దులలోని తన అనుచరవర్గం అందుకోగల స్థితిలో వున్నదో, లేదో ? బ్రిటిషు ప్రభుత్వం భారతదేశంలో అనేక మంది విప్లవకారులను బంధించటంతో అచ్చటి విప్లవ కార్యక్రమం సన్నగిల్లిపోయి వుండవచ్చును. మానవసేవ ప్రధానం అనుకొనిన వ్యక్తులకు దేశ సరిహద్దులు అడ్డుగోడలు కాజాలవు. పాతవాటిని పట్టుకొని వూగిన లాడటంకంటె మెక్సికోలో తాను చేయవలసిన, చేయగలిగిన కృషి చాలా వున్నదని రాయ్ ముందు ప్రయాణం మానుకొని తిరుగు ప్రయాణంచేసి మెక్సికో నగరం చేరుకున్నాడు. దీనితో రాయ్ అంతవరకు కలలుకంటూ వున్న యుద్ధపథకం శాశ్వతంగా సమాధి చేయబడినది.

రాయ్ మెక్సికో రాజధానిలో లేని సమయంలో అమెరికాలోని వివిధ ప్రాంతాలనుంచి 'గదర్‌పార్టీ', 'బెర్లిన్ కమిటీ' సభ్యులుగా అనేకమంది మెక్సికో వచ్చి జర్మను కాన్సల్‌తో తాము సిసలయిన విప్లవవాదులమని, జపాను, చైనా దేశాల్లో తమకు అధిక పలుకుబడి గలదని, భారతదేశంలో సాయుధ తిరుగుబాటు తేగల స్తోమతు తమకుగలదని కనుక జర్మనులు తమకే ఆర్థిక సహాయం చేయాలని వివిధ రకాల ప్రయత్నాలు చేసారు. ఇందులో విప్లవవాదులు కానివారు కూడా వున్నారు.

దీనికంతటికీ మొదట్లో అమెరికానుంచి వచ్చి రాయ్‌ని కలుసుకొని తన పన్నాగం నెరవేరక తిరిగి వెళ్ళిన యువకుడే కారకుడు. అమెరికాలో భారతదేశ అనుకూల ప్రచారానికి రాయ్ నుంచి విరివిగా ఆర్థిక సహాయం ఆశించాడు. అతని యందు విశ్వాసం లేకపోయినా రాయ్ రెండువేల డాలర్లు యిచ్చాడు. అతడు అమెరికావెళ్ళి రాయ్‌కి ఘాటుగా వుత్తరం వ్రాయటమే కాకుండా అమెరికాలో రాయ్‌ని గురించి విప్లవవాదులలో వ్యతిరేక ప్రచారం సాగించాడు. జర్మనులను మోసగించి బోలెడు బంగారం కాజేస్తున్నాడని పుకార్లు పుట్టించాడు. మరొక వ్యక్తి రాయ్‌ని అంతకుముందు కలుసుకొని జపానులో తనకు ఎంతో పలుకుబడి వున్నదని తన పలుకుబడితో చైనాలో ఎట్టి కార్యాన్నయినా సాధించగలనని ఆర్థికసహాయం కోరగా ముందుగా ఏమీ యివ్వజాలనని తరువాత పంపగలనని సమాధానం చెప్పి

పంపటంతో ఆతడు జర్మనులను కలుసుకొని రాయ్ వాళ్ళను మోసగిస్తున్నాడని హెచ్చరిక చేసాడు.

రాయ్‌ని స్వయంగా ఆహ్వానించి చైనాలో ఆయుధాలు కొనటానికి అవసరమయిన ఐదు మిలియన్ల డాలర్ల ఆర్థిక సహాయం చేయటానికి అంగీకరించిన కెయిజరు ప్రివీకౌన్సిలరుగాని, రక్షణమంత్రిగాని, జావానుంచి వచ్చి రాయ్‌ని కలుసుకొనిన మిలిటరీ అధికారులుగాని వారికి అందుబాటులోలేరు. వారు అప్పటికే మెక్సికో విడిచి వెళ్ళిపోయారు. మెక్సికోలోని జర్మను కాన్సలేటుకు రాయ్ పథకంతో ఏమాత్రం సంబంధంలేదు. కాన్సలేటులోని అధికారులు విప్లవవాదులతో తాము నిస్సహాయులమని, రాయ్‌ని కలుసుకొనమని చెప్పటంతో వారు నిరాశతో తిరిగి అమెరికావెళ్ళి రాయ్‌కి వ్యతిరేక ప్రచారం సాగించారు.

ఈ ఘట్టంలో ఒకరు మరొకరిని మోసగించారనే ప్రశ్న పుదయించ టానికి వీలులేదు. రాయ్‌కి సహాయం చేయటానికి వాగ్దానం చేసిన జర్మను అధికారులు ముందుగానే ఆ దేశం విడిచి వెళ్ళిపోయారు. రాయ్ చైనా ప్రయాణానికి కొంత దూరం ముందుకుసాగి విరమించుకొని తిరిగి మెక్సికో నగరం వచ్చాడు. చివరకు తన పథకానికే స్వస్తి చెప్పుకొనటం జరిగినది. రాయ్ జపానుదేశం వెళ్ళినప్పుడు అచ్చటి బ్యాంకులో సొమ్ము తీసుకొనటానికి చేసిన ఏర్పాట్లు అలాగే నిలచిపోయినవి. రాయ్ జపాను వెళ్లనూలేదు, ఆ సొమ్ము బ్యాంకు నుంచి స్వీకరించనూలేదు. కనుక రాయ్ జర్మనులను మోసగించి ధనం అపహరించటం గాని లేక మరొకరిని మోస గించటంగాని, మరొకరిచేత మోసగింపబడటం గాని జరుగని విషయం.

రాయ్ తన చైనా యాత్ర విరమించుకొనిన తరువాత తిరిగి మెక్సికో రాజకీయాల్లో ఎక్కువ శ్రద్ధ చూపసాగాడు. 'అమెరికా అమెరికన్లదే' అనే మన్రో సిద్ధాంతంతో అమెరికా ప్రభుత్వం లాటిన్ అమెరికను దేశాలను తన పలుకుబడి క్రిందకు తీసికొని రావాలనే ప్రయత్నం, ప్రచారం సాగించినది. అమెరికా మిత్ర రాజ్యాల తరపున యుద్ధంలో చేరటంతో జర్మనీప్రభుత్వం అమెరికాకు వ్యతిరేకంగా లాటిన్ అమెరికను దేశాలను సంఘటిత పరచాలనే దృఢసంకల్పంతో తీవ్రకృషి చేయసాగినది. అందుకు ప్రాతిపదికగా మెక్సికో రాజధానిని కీలకస్థానంగా యేర్పరచుకొని అక్కడ ఒక రేడియో కేంద్రాన్ని స్థాపించి తద్వారా అమెరికా వ్యతిరేక ప్రచారానికి, లాటిన్ అమెరికను దేశాల సుసంఘటితత్వానికి, ప్రచార సాధ నంగా వినియోగించటానికి కావలసిన ఆర్థిక సహాయం చేయటానికి అంగీకరించినది.

సోషలిస్టు ముసుగులో యూకటాన్ గవర్నరు జనరల్ ఆల్వెరాడో 1920 లో మెక్సి కోలో జరుగబోవు ఎన్నికలలో అధ్యక్షపదవికి పోటీ చేయాలనే సంకల్పంతో ఒక ఇంగ్లీషు దినపత్రికను స్థాపించే ప్రయత్నంలో వున్నాడు. ఆల్వెరాడోకి ప్రత్యర్థిగా మరొక వ్యక్తి జనరల్ ఆబ్రెగాన్ కూడా అధ్యక్ష పదవికి పోటీ చేయాలనే సంకల్పములో వున్నాడు. అమెరికా సహాయంతో ఎవరికి వారు విజయం సాధించటానికి వీరిద్దరూ పోటీపడసాగారు. కాని అమెరికా పలుకుబడి మెక్సికోలో లేకుండా చేయటం కరంజా ప్రభుత్వ అభిమతం.

ఇలాంటి రాజకీయ వాతావరణంలో రాయ్ సోషలిస్టు భావాలుకల వివిధ వర్గాలను సంఘటిత పరచి సమావేశం యేర్పాటు చేసాడు. భావి రాజకీయ, ఆర్థిక పరిస్థితులను గురించి దీర్ఘంగా చర్చించిన మొదట ఆల్వెరాడో స్థాపించిన ఇంగ్లీషు దినపత్రికకు ఆల్వెరాడో అనుమతితో వేరొకరిని సంపాదకునిగా నియమించటం జరిగినది. ఆ పత్రిక ద్వారా 'మన్రోసిద్ధాంతానికి' వ్యతిరేకంగా లాటిన్ అమెరికను దేశాల సంఘటితకు అనుకూలంగా ప్రచారం తీవ్రతరం చేయబడినది. రాను రాను యీ పత్రిక మెక్సికన్ సోషలిస్టు భావాలకు ప్రచార సాధనం అయినది.

# మెక్సికన్ రాజకీయాలు :

జర్మనీ ప్రభుత్వం మెక్సికో రాజధానిలో రేడియో కేంద్రం స్థాపించి అమెరికా, కెనడాదేశాల వ్యతిరేక ప్రచారం ముమ్మరం కావించినది. అమెరికనులు మెక్సికోను తమ శత్రురాజ్యంగా భావించసాగారు. దీనికితోడు మెక్సికన్ నూతన రాజ్యాంగం ప్రకారం కీలక పారిశ్రామిక కేంద్రాలు, ముఖ్యంగా పెట్రోలియం పరిశ్రమలు జాతీయ సంపత్తిగా పరిగణింపబడ్డవి. దీని ఫలితంగా విదేశ పెట్టుబడు లకు, ప్రధానంగా అమెరికను పెట్టుబడులకు విఘాతం కలిగే పరిస్థితి యేర్పడినది. తమ పెట్టుబడుల రక్షణకు అమెరికా జోక్యం కల్పించుకొనే అవసరం కలిగినది. అవకాశముకొరకు ఎదురుచూడ సాగినది. జనరల్ ఆబ్రెగాన్ అధ్యక్షపదవిని చేపట్ట టానికి అమెరికా సహాయంతో సైనిక తిరుగుబాటు చేయటానికి రహస్య మంతనాలు జరుపుచున్నాడు. బందిపోటు దొంగలబారినుండి తమ పెట్టుబడులను, పరిశ్రమలను

రక్షించుకొనాలనే నెపంతో అమెరికా మెక్సికోలో కొంత సైన్యాన్ని దించటం కూడా జరిగినది. అమెరికాకు కరంజా ప్రభుత్వానికి ఈ వ్యవహారంలో రాజీ కుదరని పరిస్థితి యేర్పడినది. సోషలిస్టులు - ముఖ్యంగా అనార్కో- సిండికలిస్టులు 'రెండూ బూర్జువా ప్రభుత్వాలు' కనుక తమకు యేదైనా వొకటే ననే మూకీభావం వహించారు. కరంజా ప్రభుత్వ పతనానికి మార్గం సుగమం చేయబడినది.

ఎంతోమంది విదేశీయులకు, ప్రవాసులకు ఆశ్రయమిచ్చి రక్షణ కల్పించిన మెక్సికో ప్రజలను ఆదుకొనే విషయం రాయ్‌ని వ్యాకుల పరచినది. తనలాగా ఆశ్రయం పొందిన అనేకమందిని సంప్రదించాడు. "పెట్రోలియం పెట్టుబడుల నెపంతో ఒక విదేశీ ప్రభుత్వం జాతీయ ప్రభుత్వాన్ని కూలద్రోయటానికి సిద్ధ పడి నది. విదేశీ పెత్తనంతో మెక్సికో తిరిగి పీడింపబడక తప్పదు. శ్రామిక వర్గాన్ని కూడగట్టుకొని బలవత్తరమయిన ఒక రాజకీయ పార్టీని నిర్మించవలసిన అవసరం వున్నది. అందుకు చట్టబద్ధమయిన కొన్ని హక్కులు ముందుగా వారికి కలుగ జేయాలి," అని రాయ్ కరంజా ప్రభుత్వంతో సంప్రదించి అందుకు అనుకూల వాతావరణాన్ని సృష్టించ గలిగాడు. సోషలిస్టులను, అనార్కో- సిండికలిస్టులను సమావేశపరచి వారికి తన కార్యక్రమ స్వరూపాన్ని గురించి విపులీకరించాడు. విభిన్న మార్గాలలో, విభిన్న దృక్పథాలుగల అందరినీ వొప్పించి అందరి సహకారంతో శ్రామిక వర్గాన్ని కూడా కూడగట్టి సోషలిస్టు భావాలుగల ఒక బలవత్తరమయిన పార్టీ నిర్మాణానికి కృషిచేసి సఫలీకృతు డయ్యాడు.

మెక్సికో చేరగానే రాయ్ ఒక స్పానిష్ ప్రొఫెసరు దగ్గర స్పెయిను భాషను అభ్యసించటం ప్రారంభించాడు. క్రమేపి ఆ భాషలో చక్కగా మాట్లాడటమే కాకుండా, వుపన్యసించటం, వ్రాయటంకూడా అలవరచుకున్నాడు. మెక్సికోను అమెరికన్ పెత్తనం నుంచి విముక్తి చేయాలని, లాటిన్ అమెరికను దేశాలు సమైక్యం కావాలని రాయ్ వ్రాసిన వ్యాసాలు ఇంగ్లీషు, స్పెయిన్ పత్రికలలో తరచుగా ప్రచురింపబడుతూ వుండేవి. ఇందుకొరకు రాయ్ లాటిన్ అమెరికను దేశాల చరిత్రను, అమెరికా స్వాతంత్ర్య పోరాటాన్ని లోతుగా పరిశోధించి నూతన దృక్పథంతో వ్యాసరచన ప్రారంభించాడు. అమెరికాలో వుండగానే 'శాంతిమార్గం' అనే పేరుతో ఒక చిన్న పుస్తకం రచించాడు. అది అముద్రితంగానే మిగిలి పోయినది. మెక్సికోలో దానికి 'మన్రోసిద్ధాంతం - దాని లోటుపాతులు' అనే మరొక అధ్యాయంచేర్చి అచ్చొత్తించాడు రాయ్ రచించిన యీ గ్రంథం, ఇతర

రచనలు అచ్చటి విద్యాధికులలో, ప్రభుత్వ అధికారులలో నూతన భావాలకు ప్రోద్బలాన్ని చేకూర్చినవి. రాయ్ కరంజా అభిమాన పాత్రుడు కావటానికి ఇవే ముఖ్య కారణం.

మెక్సికో విశ్వవిద్యాలయంలో 'మన్రోసిద్ధాంతం - లాటిన్ అమెరికన్ దేశాలు' గురించి ఉపన్యాసాలు యివ్వటానికి రాయ్ ప్రత్యేకంగా ఆహ్వానింప బడ్డాడు. రాయ్‌కి బహిరంగంగా వేదికమీద వుపన్యసించటం అదే ప్రథమ అనుభవం కూడాను. విప్లవవాదులు మాటలకంటె చేతలకే ఎక్కువ ప్రాముఖ్యం యిస్తారు. ఇప్పుడు రాయ్ నూతన భావాలతో నూతన ప్రపంచంలో వున్నాడు. భావప్రచారం, భావవిప్లవం జరుగవలసిన అవసరం గుర్తించాడు. రాయ్ ఉపన్యాసాలకు విశ్వ విద్యాలయ అధికారులు, ఆచార్యులు, విద్యార్థులు అందరూ హాజరయి అతిశ్రద్ధతో విన్నారు. వరుసగా ఐదు ఉపన్యాసా లిచ్చాడు. చివరిరోజున ఒక ఆచార్యుడు అధ్యక్ష పీఠంనుంచి "తూర్పుగోళంనుంచి పశ్చిమగోళానికి వచ్చిన ఒక మేధా సంపన్నుడు ఇచ్చట చరిత్రను నూతన అర్థాలతో, నూతన భావాలతో మనకు పరిచయం చేస్తూవున్నాడు. మేధావులయిన మీరంతరూ ప్రత్యేక శ్రద్ధతో వాటిని పరిశీలించి నవసమాజ నిర్మాణానికి పూనుకొనవలసిన అవసరం గుర్తించాలి" అని హెచ్చరించాడు.

రాయ్ రచించిన గ్రంథ ఆవిష్కరణకు ఒక ప్రత్యేక సమావేశం యేర్పాటు చేయబడినది. అనేకమంది ప్రముఖులు - విద్యాధికులు, ప్రభుత్వాధికారులు, మంత్రులు, విదేశస్థులు పాల్గొని స్వయంగా రాయ్‌తో కరచాలనంచేసి అభినందించారు. మన్రోసిద్ధాంతానికి వ్యతిరేకంగా 'లాటిన్ అమెరికనులీగు' స్థాపన గురించి రాయ్ అందులో ప్రధానంగా ఉదహరించాడు. కరంజా రాయ్‌ని అంతరంగికునిగా చేసుకొనటాని కిది ప్రధాన కారణం.

"ఆధ్యాత్మిక సంపత్తికి ఆలవాలమయిన ప్రాచీన భారతఖండం నుంచి నిద్రావస్థలోవున్న తమను మేల్కొలపటానికి మెక్సికో వచ్చినట్టు" గా రాయ్‌ని గురించి వారు భావించారు.

రాయ్ మెక్సికోలో కేవలం రాజకీయాలలోనే మునిగి వుండలేదు. తనకు స్పానిష్‌భాషను నేర్పిన ఆచార్యుడు చదరంగం (చెస్ ఆట) లో విశేష ప్రతిభాశాలి. మెక్సికో జాతీయ చాంపియన్. స్పెయిను భాషను నేర్చుకుంటూనే రాయ్ ఆ ఆచా

ర్యుని దగ్గర 'చదరంగం' నేర్చుకొని మంచి ప్రవీణతను పొంది అందులో గురువును మించిన శిష్యు డనిపించుకో గలిగాడు. తరువాత రష్యా వెళ్ళినప్పుడు ఆదేశ చాంపియన్ అలెఖిన్‌తో సమవుజ్జీ అనిపించుకో గలిగాడు. అలెఖిన్ మరుసటి సంవత్సరం ప్రపంచ చాంపియన్ అయిన కాసబ్లాంకాను వోడించి ప్రపంచ చాంపియను షిప్పును పొందగలిగాడు.

గుర్రపుస్వారీ అంటే రాయ్‌కి మక్కువ. భారతదేశంలో వున్నప్పుడే గుర్రపుస్వారి నేర్చుకొనటానికి ప్రయత్నించాడు. కాని పార్టీ కార్యక్రమంలో హెచ్చుగా నిమగ్నుడు అయివుండటంచేత బాగా అభ్యాసం చేయటానికి అవకాశం కలుగలేదు. మెక్సికోలో రోజూ నియమం ప్రకారం ఐదారుమైళ్ళు గుర్రపు స్వారీ చేస్తూ మార్గమధ్యంలో తటుచుగా అందరితో పరిచయం చేసుకొంటూ వుండేవాడు.

## సోషలిస్టు పార్టీ:

సోషలిస్టు పార్టీని క్రమపద్ధతిలో ఒక రూపానికి తెచ్చిన తరువాత పార్టీ పత్రికను రాయ్ 'వారపత్రిక'గా మార్పించాడు. పత్రిక ప్రచురణార్థము ఆధునిక యంత్రాలతో, క్రొత్త టైపులతో అన్నిహంగులూ కల ముద్రణా యంత్రాలయాన్ని సమకూర్చాడు. దానికి కావలసిన ఆర్థిక సహాయం రాయ్ ద్వారానే జరిగినది. శ్రామికవర్గ అండదండలు పొంది శ్రామికవర్గాన్ని పార్టీ ఆధ్వర్యం క్రిందకు తీసుకొని రావటానికి, సోషలిస్టు పార్టీ శ్రామికవర్గ ఆశయాలకు అనుగుణంగా యేర్పడిన పార్టీయే అనే భావప్రచారానికి రాయ్ అనేక కరపత్రాలు, సోషలిస్టు పార్టీ ప్రణాళికను అచ్చొత్తించి ప్రజాబాహుళ్యంలో విరివిగా పంపిణీ చేయించాడు. ఈ ప్రచారం ముఖ్యంగా శ్రామికులను బాగా ఆకర్షించినది. పార్టీ ప్రణాళిక నాలుగైదుసార్లు తిరిగి ముద్రించవలసి వచ్చినది.

1918 మధ్యలో రష్యా విప్లవం గురించిన వార్తలు మెక్సికో కూడ చేరినవి. శ్రామికవర్గం అధికారం చేపట్టటం అంతవరకు వూహా మాత్రం గానే వుండేది. రష్యా విప్లవం మెక్సికోలోని అభ్యుదయగాములకు మార్గదర్శి అయినది. అప్పటివరకు తటస్థంగా వున్న అనార్కో-సిండికలిస్టులు, ఇతర ప్రజాస్వామిక

వాదులు సోషలిస్టు పార్టీ పైపునకు మొగ్గ చూపసాగారు. రాయ్ పార్టీ కార్యవర్గాన్ని సమావేశపరచి ప్రతినిధుల మహాసభను యేర్పరచి పార్టీ ప్రణాళికను ఆమోదింప చేయవలసినదిగా సూచించాడు.

మహాసభ విపుల సన్నాహాలతో, పెద్ద యెత్తున నిర్వహించాలనే నిర్ణయం జరిగినది. మెక్సికోలోని అన్ని రాష్ట్రాల నుంచి ప్రతినిధులు పాల్గొనేటట్లు చూడాలి. అంతేకాదు అమెరికా నుంచి, లాటిన్ అమెరికనుదేశాల నుంచి సౌహార్ద ప్రతినిధులను కూడా ఆహ్వానించి ఆ మహాసభకు అంతర్జాతీయ ప్రాముఖ్యం కలుగచేయాలని రాయ్ ఆశయం. పార్టీ ప్రణాళికకు మెక్సికోలోని అన్ని రాష్ట్రాల నుంచి మద్దతు లభించినది. వివిధప్రాంతాల నుంచి అనేకమంది ప్రముఖులు పార్టీ మహాసభలో పాల్గొనటానికి తమ ప్రగాఢ వాంఛను వ్యక్తపరుస్తూ పార్టీ కార్యాలయానికి ఉత్తరాలు వ్రాశారు.

పెద్ద ఎత్తున మహాసభను నిర్వహించటం, వివిధ రాష్ట్రాలనుంచి, ప్రక్కదేశాల నుంచి వచ్చిన ప్రతినిధులకు, ప్రముఖులకు తగిన మర్యాదలతో వసతిసౌకర్యాలు కలిగించటం తేలికైన పని కాదు. ప్రజలఅండ, ఆర్థిక సహాయం అవసరం. ఈ బాధ్యతను రాయ్ స్వీకరించాడు. ప్రశిడెంటు కరంజాకు రాయ్ సూచించిన సోషలిస్టు ప్రణాళిక నచ్చటంచేత ప్రభుత్వ యంత్రాంగంకూడ మహాసభ నిర్వహణకు తమ మద్దతు నిచ్చినది. అమెరికా సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా లాటిన్ అమెరికను దేశాలను సంఘటిత పరచి ఒక బలవత్తర మయిన ప్రజా పార్టీని నిర్మించటం రాయ్ ఆశయం. కరంజాకు అమెరికను పెట్టుబడిదారీ తనాన్ని, బెదరింపులను ఎదుర్కొనటానికి ఇది ఒక తగిన సాధనగా కనబడినది. కనుక కరంజాకు సోషలిస్టుపార్టీ మీద, ముఖ్యంగా ఆ పార్టీ నిర్మాత అయిన రాయ్ మీద ప్రత్యేక అభిమాన మేర్పడినది.

పార్టీ కార్యదర్శిగా రాయ్ మెక్సికోలోని వివిధ వర్గాలను ఒక పతాకం క్రిందకు చేర్చగలిగాడు. శ్రామికవర్గం పార్టీకి కుడిభుజ మయినది. మెక్సికోలో రాయ్ పలుకుపడి పరాకాష్ట నందుకొన్నది. ప్రశిడెంటు కరంజా ఇది గమనించక పోలేదు. కరంజాకు రాయ్ సహకారం అవసరం. విదేశీ పెట్టుబడిదారీ వర్గం, ముఖ్యంగా అమెరికా ప్రభుత్వం కరంజా ప్రభుత్వాన్ని కూలద్రోయాలనే సంకల్పంతో వున్నది. అందుకు సొనోరా రాష్ట్రగవర్నరు జనరల్ అబ్రెగాన్‌కు రహస్యంగా

సహాయం అందచేస్తున్నది. ఆ రాష్ట్రం అమెరికా సరిహద్దు రాష్ట్రం. పెట్రోలు పరిశ్రమలకు కూడలి. అధ్యక్షుని ఎన్నిక పోటీలో అమెరికను పెట్టుబడిదారులు ఆబ్రెగాన్‌కు సహాయపడటం, అందుకు ప్రతిఫలంగా ఆబ్రెగాన్ వారి పెట్టుబడులకు ముప్పు కలుగకుండా హామీ యివ్వటం గురించి ఒక రహస్య వొప్పందం కూడా వారి మధ్య జరిగినది. ప్రశిడెంటు కరంజాకు యీ విషయం తెలుసు. కాని దేశ ద్రోహ నేరానికి ఆబ్రెగాన్‌ని పదవీచ్యుతుని చేసే సాహసకృత్యం చేయలేక పోయాడు. అలాచేస్తే అతడు తిరుగుబాటు చేయవచ్చును. అమెరికా జోక్యం చేసుకొని అంతర్యుద్ధాన్ని పురికొల్పే ప్రమాదం వున్నది. కనుక ఒక బలవత్తర మయిన ప్రజాపార్టీ తనకు అండగా వుండవలసిన అవసరం గుర్తించాడు.

కరంజా విందు యేర్పరచి రాయ్‌ని ప్రత్యేకంగా ఆహ్వానించాడు. విదేశాంగ శాఖామాత్యులు, పార్లమెంటు ప్రతినిధుల అధ్యక్షులు, ఇతర ప్రముఖులు విందుకు ఆహ్వానింప బడ్డారు. విందు అనంతరం మూడుగంటలసేపు సమావేశం జరిగినది. వివిధ రాష్ట్రాలనుంచి మహాసభలో సోషలిస్టు భావాలను బలపరచే ప్రతినిధులు, శ్రామికవర్గ ప్రతినిధులు, ప్రత్యేకించి సొనోరా రాష్ట్రంనుంచి ఆబ్రెగాన్‌కు వ్యతిరేకులయిన పారిశ్రామిక ప్రతినిధులతోబాటు వ్యవసాయ కూలీల ప్రతినిధులు కూడా పాల్గొనవలసిన విషయాలు చర్చించి ఒక పథకం రూపొందించ బడినది. సొనోరా రాష్ట్రం పెట్రోలు పరిశ్రమలతోబాటు వ్యవసాయ క్షేత్రాలకు కూడా ముఖ్య కేంద్రస్థానం. ఇందులో అమెరికను వ్యవసాయ క్షేత్రాలు హెచ్చుగా వున్నవి. అచ్చటి వ్యవసాయ కూలీలకు అండగావున్న సోషలిస్టు భావాలుకల ఒక పాఠశాల ఉపాధ్యాయుడు కాలెస్ మహాసభకు వస్తున్నట్లు ముందుగా తెలియబరచాడు. ఆతని సహాయంతో అమెరికను పెట్టుబడులకు వ్యతిరేకంగా వ్యవసాయ కూలీల వుద్యమాన్ని బలపరచాలనే నిర్ణయం జరిగినది. ఇతడు తరువాత కరంజా ప్రభుత్వంలో కార్మికమంత్రిగా పదవి నలంకరించాడు. ఆబ్రెగాన్‌కు వ్యతిరేకంగా గవర్నరు పదవికి పోటీ చేసాడు. చివరకు ప్రశిడెంటు పదవికి కూడా పోటీ చేసాడు.

మహాసభకు, అవసరమయిన ఆర్థిక సహాయం చేయటానికి కరంజా అంగీకరించాడు. మహాసభ అనంతరం అమెరికను సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా లాటిన్ అమెరికనులీగు'ను స్థాపించటానికి నిర్ణయం జరిగినది. ఈ సందర్భంగా

కరంజా రాయ్‌ని గౌరవమర్యాదలతో సత్కరించి చైనాయాత్రకు గాను అంతకు పూర్వం రాయ్ మెక్సికో దక్షిణ, పడమటి రాష్ట్రాల ప్రయాణం గురించి, అచ్చటి బందిపోటు దొంగల చర్యలగురించి ముచ్చటించి ఆసక్తిగా వివరాలు తెలుసుకొన్నాడు.

# సోషలిస్టు మహాసభ:

1918 డిశంబరులో మెక్సికోలో ప్రథమ సోషలిస్టు మహాసభ జరిగినది. వివిధ రాష్ట్రాల నుంచి కొన్నివందలమంది ప్రతినిధులతోబాటు లాటిన్ అమెరికను దేశాల నుండి కూడ అనేకమంది యీ మహాసభలో పాల్గొన్నారు. బయట దేశాల నుంచి వచ్చిన వారిలో ఎక్కువమంది లాయర్లు, డాక్టర్లు, ఉపాధ్యాయులు, కవులు, రచయితలు, జర్నలిస్టులు. వీరు శ్రామికవర్గ విముక్తికి పాటుబడే వారే కాని ఫక్తు శ్రామికవర్గానికి చెందిన ప్రతినిధు లెవరూ ఇందులో లేరు. ప్రోలితేరియన్ వర్గానికి మధ్యతరగతి వర్గం ప్రతినిధులుగా పాల్గొనటం ఇచ్చట గమనించదగిన విషయం. దేశంలోని వివిధ రాష్ట్రాల ప్రతినిధులలో పారిశ్రామిక, వ్యవసాయిక రంగాలకు చెందిన శ్రమజీవుల ప్రతినిధులు కూడా వున్నారు. సోషలిస్టు భావాలకు గట్టి పునాదిని నిర్మించటమే కాకుండా, లాటిన్ అమెరికను దేశాల లీగుకు ఒక ఆర్గనైజింగు కమిటీని యేర్పాటు చేయటం కూడా యీ మహాసభ ప్రధానలక్ష్యంగా భావించబడినది.

మెక్సికో నగరంలోని అనేక పారిశ్రామిక సంస్థలకు చెందిన శ్రామిక వర్గాలు పెద్ద పెద్ద వూరేగింపులతో, 'సోషలిజం వర్ధిల్లాలి', 'సామ్రాజ్య వాదం నశించాలి' అనే నినాదాలతో తండోపతండలుగా వచ్చి మహాసభలో పాల్గొన్నారు. ప్రతినిధులసభ ఒక హాలులో జరిగినది. బయట వేలాది ప్రజలు గుమిగూడి అమితోత్సాహంతో మహాసభ నిర్ణయాలకు ఎదురు చూడసాగారు. శ్రామికవర్గానికి తన ప్రభుత్వ మద్దత్తు వున్నదనే సూచకంగా కరంజా తన బాల్కనీలో నిలబడి శ్రామికుల వూరేగింపులను అభినందించటంతో ప్రజలలో ఉత్సాహం ద్విగుణీకృత మయినది.

సోషలిస్టు సోవియటు రష్యా నుంచి మెక్సికో మహాసభకు అభినందన సందేశం రావటంతో మెక్సికోలో కూడా అట్టి ప్రభుత్వం యేర్పడటానికి ఆట్టేకాలం పట్టకపోవచ్చుననే అభిప్రాయం ప్రతినిధులలో ప్రబల సాగినది. ప్రతినిధులలో హెచ్చుమంది 'బూర్జువా రాజకీయవాదులు' అనే నిరసనభావం అనార్కో - సిండికలిస్టు వర్గాలకు కలుగకపోలేదు. కాని అభ్యుదయ భావాలుకల అన్నివర్గాల ప్రాతినిధ్యంతో విశాలప్రాతిపదిక మీద మహాసభను జరుపాలనే నిర్ణయం రాయ్‌ది. విపుల సన్నాహాలతో వివిధ రాష్ట్రాల నుంచి ఇతర దేశాల నుంచి మహాసభకు ప్రతినిధులను ఆహ్వానించి జయప్రదంగా జరిపినందులకు దేశంలోని అన్నివర్గాలు రాయ్ శక్తి, సామర్థ్యాలను పొగడటమే కాకుండా విదేశీ ప్రతినిధుల ప్రశంసలకు కూడా ఆయన పాత్రుడయ్యాడు.

మొదటగా యీ సమావేశంలో పార్టీకి 'మెక్సికో సోషలిస్టు పార్టీ' అని నామకరణం చేయాలని ఒక ప్రతిపాదన వచ్చినది. సోషలిస్టులకు జాతీయ సరిహద్దులు వుండరాదని యీ ప్రతిపాదన మీద తర్జన భర్జనలు జరిగినవి. చివరకు 'రీజినల్ సోషలిస్టు ఇంటర్‌నేషనల్" అని నామకరణం చేయటం జరిగినది. రాయ్ మీద వున్న అభిమానం చేతనూ, అంతర్జాతీయ వాదానికి అనుగుణంగానూ, మెక్సికన్ జాతీయుడు కాని రాయ్ వలదన్నా పార్టీ ప్రధాన కార్యదర్శిగా యెన్నుకొనబడ్డాడు. 'లాటిన్ అమెరికను దేశాలలీగు' యేర్పరచటానికి ఒక ఉపసంఘాన్ని యేర్పరచి, త్వరలో 'రీజినల్ అంతర్జాతీయ మహాసభ' ను జరిపి అందులో యీ నిరయాలు ఆమోదింప చేయటానికి నిశ్చయం జరిగినది.

ఉపసంఘంలో లాటిన్ అమెరికను దేశాల ప్రతినిధులనుంచి వేరు వేరుగా సభ్యులను ఎన్నుకొనటం జరిగినది. రాయ్ సమావేశకర్తగా ఎన్నుకొనబడ్డాడు. ప్రధానకార్యాలయం మెక్సికో నగరంలోనే యేర్పరచబడ్డది. ఇతర దేశాలలోని ప్రభుత్వాలతో, పార్టీలతో సత్సంబంధాలు కలిగించుకొని రీజినల్ అంతర్జాతీయ మహాసభను జరిపి అమెరికను సామ్రాజ్యవాదానికి ప్రతిగా గట్టి పునాదులమీద 'లాటిన్ అమెరికనులీగు' స్థాపించటం దీని ప్రధాన కర్తవ్యం.

మహాసభ అనంతరం కార్యవర్గం సమావేశమయి రాష్ట్రస్థాయిలో వివిధ రాష్ట్రాలలో పార్టీ సంఘాలను యేర్పాటు చేయాలనే నిర్ణయం తీసికొనబడినది. కాలెస్ సొనోరా రాష్ట్రంలో తిరుగుబాటు లేవదీసి అబ్రెగాన్‌ను గవర్నరు పదవి

నుంచి తొలగించాలని ప్రతిపాదించాడు. అమెరికా జోక్యం వుండవచ్చునని కొందరు వాదించారు. కాలెస్ ఉక్కుమనిషి. తన ప్రతిపాదనను ఉపసంహరించు కొనుటకు మారుగా "ఫెడరలు ప్రభుత్వము మనకు మద్దతుగా వుండాలని" వాదించి యీ విషయంలో స్వయంగా 'కామ్రేడ్ రాయ్'తో చర్చించాలని కోరాడు. కార్యవర్గం యిష్టపడితే తనకు అభ్యంతరం లేదని రాయ్ చెప్పటం, కార్యవర్గం అంగీకారం తెలుపటం జరిగినది.

ఆ రోజే రాయ్ తన నివాసంలో యిష్టాగోష్టిగా స్కూలు మాస్టరు కాలెస్‌తో అనేక విషయాలు చర్చించాడు. కాలెస్‌కు ఉజ్వల రాజకీయ భవిష్యత్తు వుందని గ్రహించ గలిగాడు. తరువాత నాలుగు సంవత్సరాలకు కాలెస్ మెక్సికో ప్రభుత్వ అధ్యక్ష పదవినే అలంకరించాడు.

సోషలిస్టు పార్టీ ప్రధాన కార్యదర్శి హోదాలో రాయ్ రాష్ట్రస్థాయిలో, నగరాల్లో పార్టీ శాఖలను నిర్మించవలసిన అవసరమున్నది. సొనోరా రాష్ట్రంలో పర్యటించటానికి కాలెస్ రాయ్‌ని ఆహ్వానించాడు. అది అమెరికా సరిహద్దు రాష్ట్రం. అమెరికను గూఢచారులు రాయ్‌ని అపహరించే ప్రమాదం లేకపోలేదు. కనుక రాయ్ తగిన రక్షణతో ఆ రాష్ట్రంలో పర్యటించవలసి వచ్చినది. కాలెస్ ముందుగా ఒక పథకం వేసుకొని 'ఆబ్రెగాన్ అధ్యక్ష పదవికి పోటీ చేయటానికి నిశ్చయించుకున్నాడు, కనుక ఆయనను ప్రశిడెంటు కరంజా గవర్నరు పదవినుండి తప్పించి స్వేచ్ఛగా ఎన్నికల ప్రచారం చేసుకొనటానికి అవకాశం కలిగించాలి' అని ప్రచారం సాగించాడు. ఆబ్రెగాన్ కిది చక్కని సలహాగా కనబడినది. విరివిగా ఎన్నికల ప్రచారం చేసుకొనటానికి గవర్నరు పదవి అవరోధంగా కనబడినది. కనుక తానే గవర్నరు పదవిని వదలుకొని తన ఎన్నికల ప్రధాన కార్యాలయాన్ని మెక్సికో నగరానికి మార్చాడు. ఈ అవకాశాన్ని పురస్కరించుకొని, రాయ్ సహకారంతో కాలెస్ సొనోరా రాష్ట్ర గవర్నరు కాగలిగాడు. ఎన్నికలలో పోటీ లేకపోవటంచేత కరంజా కాలెస్‌ను గవర్నరుగా నియమించాడు.

కాలెస్ గవర్నరుగావున్న తరుణంలో అమెరికా ప్రభుత్వం తనదేశంలో మద్యపానాన్ని నిషేధించినది. మెక్సికోలోని అమెరికన్లు, ఇతర విదేశీయులు సరిహద్దు రాష్ట్రమయిన సొనోరా, అమెరికా సరిహద్దులలో బ్రాంది షాపులు పెట్టి దొంగ వ్యాపారంచేసి విపరీత లాభాలు గడించసాగారు. ఆ షాపులను మూసివే

యించి, అట్టి వ్యాపారస్థులను బంధించటానికి కాలెస్ ఉత్తరువులు జారీ చేయటం జరిగినది. దీని ఫలితంగా అమెరికనులు కాలెస్‌కు వ్యతిరేక ప్రచారం సాగించి తమ ప్రభుత్వంద్వారా దండయాత్ర చేయించటానికి పత్రికలు పన్నసాగారు. దీనిని ఆబ్రెగాన్ తనకు అనుకూల వాతావరణంగా మార్చుకొనటానికి ప్రయత్నించాడు. పరిస్థితులు చేయిజారుచున్నట్లు గమనించిన కరంజా కాలెస్‌ను తన మంత్రిమండలిలో కార్మికశాఖామంత్రిగా నియమించి ఆబ్రెగాన్‌కు తిరిగి గవర్నరుపదవిని అప్పగించాడు.

కరంజా సిద్ధాంతరీత్యా విప్లవవాది కాదు. అమెరికాయందు వ్యతిరేక భావం కలిగినవాడు కావటంచేత అందుకు పత్తాసుగా ఒక ఉద్యమం ఆయనకు కావాలి. సోషలిస్టుపార్టీ అందుకు పుపకరించగలదని ఆశించాడు. మరి సోషలిస్టు పార్టీ అంటే తనకు అభిమానమున్నట్లు కరంజా కనపడాలి. 'కార్మికుల హక్కులను రక్షించటానికి ప్రత్యేకంగా ఒక మంత్రిత్వశాఖను యేర్పరచాలి' అని కరంజాకు సలహా యిచ్చినప్పుడు అందుకు అతడు అంగీకరించి 'సోషలిస్టు పార్టీలో ఎవరన్నా అందుకు సమర్థులైన వారు పున్నారా' అని అడిగి సోషలిస్టు భావాలుకల కాలెస్‌ను కార్మిక మంత్రిగా నియమించటం జరిగినది.

కార్మికులకు తగిన రక్షణ, హక్కులు కలిగించటానికి అవసరమయిన వివరాలను గురించి కాలెస్ ఆ శాఖకు సంబంధించిన అధికారులతో చర్చించాడు. రాయ్ సోషలిస్టుపార్టీ, కార్మిక సంఘాల నాయకులతో చర్చించి ఒక చిత్తుబిల్లును రూపొందించాడు. 'కార్మిక సంఘాలను ప్రభుత్వం గుర్తించాలి. కార్మికులు తమ హక్కులు పరిరక్షించుకొనటానికి వారికి సమ్మెచేసే హక్కు వుండాలి,' అనేవి యిందులో ప్రధానాంశాలు. ఈ బిల్లు స్వరూపం బయటకు పొక్కటంతో ముఖ్యంగా విదేశీ పారిశ్రామిక కేంద్రాలలోని పారిశ్రామిక వర్గాలు తమకు కావలసిన హక్కుల గురించి ముందుగానే పెద్దయెత్తున సమ్మెలు చేయటం ప్రారంభించారు. దీని ఫలితంగా అమెరికా జోక్యం, మెక్సికోకు ప్రమాదం కలిగే స్థితి యేర్పడినది. పరిస్థితులను చక్కబరచటానికి ప్రత్యేక అధికారాలతో కరంజా కార్మిక మంత్రి కాలెస్‌ను ఆ ప్రదేశాలకు పంపాడు. సోషలిస్టుపార్టీ ప్రధాన కారదర్శిగా రాయ్ కార్మిక మంత్రితోపాటు వెళ్లటం జరిగినది.

కాలెస్ పట్టువిడుపులు లేని మనిషి. తన పిడివాదంతో 'శ్రామికులు కోరిన షరతులు నూటికి నూరుపాళ్లు అంగీకరించాలని' పట్టుబట్టి పారిశ్రామిక ప్రతినిధులను

వత్తిడి చేయసాగాడు. 'అందుకు అంగీకరించటం అసంభవం. అట్టి పరిస్థితులలో తాము ఫ్యాక్టరీలను మూసివేయవలసి వస్తుందని' వారు సమాధానం చెప్పటం దానికి ప్రతిగా 'అయితే ప్రభుత్వమే ఫ్యాక్టరీలను స్వాధీనం చేసుకొని నడుపుతుందని' కాలెస్ బెదరించటంతో పరిస్థితులు విషమరూపం దాల్చే ప్రమాదం యేర్పడినది. రాయ్ జోక్యం కలిగించుకొని పారిశ్రామిక ప్రతినిధులను, శ్రామిక ప్రతినిధులను సమావేశపరచి రాజీ కుదిర్చి సమ్మెలు రద్దు చేయించ గలిగాడు. దీనివలన కరంజా ప్రభుత్వ మనుగడకు ముప్పుతప్పినది. సోషలిస్టు పార్టీ పలుకుబడి, ప్రతిష్ఠలు యినుమడించినవి.

## మిస్టరు బ్రాన్ట్వీన్:

1918 సంవత్సరం చివరిలో జర్మనీ యుద్ధంలో వోడిపోయినది. అచ్చట విజయం ఆశించిన కమ్యూనిస్టు విప్లవాన్ని మిత్రరాజ్యాల సహకారంతో మితవాదులు, సైనికులు కలసికట్టుగా అణచివేసారు. ఈ వార్తలు మెక్సికోలోని అభ్యుదయగాములను, సోషలిస్టు పార్టీని కలవరపెట్టినవి. వాతావరణం ఉద్రిక్తంగా వున్నది. అట్టి సమయంలో ఒకనాడు రాయ్ తన యింటి ఆవరణ ముందు భాగంలో కూర్చొని వుండగా పార్టీ సభ్యులు యిద్దరు హడావుడిగా వచ్చి "సోవియట్ రష్యా నుంచి ఒక బోల్షివిక్ రహస్యంగా యిక్కడకు వచ్చాడు. ఆయన ప్రత్యేకించి మిమ్ములను చూడాలనే కుతూహలంతో వున్నాడు," అని చెప్పటంతో ప్రత్యేకించి ఒక వ్యక్తి తనకొరకు రష్యా నుంచి మెక్సికో రావటం, రాయ్‌కి ఆశ్చర్యంగానే కనబడినది.

రాయ్‌కి ఒకవిధంగా అనుమానం కూడా కలుగక పోలేదు. అమెరికను, బ్రిటిషు గూఢచారులు రాయ్ ఆచూకీ తెలుసుకొనటానికి మారువేషాలతో మెక్సికో వచ్చి తనను పట్టుకొని వెళ్లటానికి ప్రయత్నాలు చేసిన ఘట్టాలు కూడా వున్నవి. కనుక 'ఆయన రష్యను బోల్షివిక్ అని మీరెలా నిర్ణయించగలరు ? బ్రిటిషు గూఢచారి ఎందుకు కాకూడదు ?' అని రాయ్ ఆ యిద్దరినీ ప్రశ్నించాడు. కొండంత ఆశతో,

ఉత్సాహంతో వచ్చిన వారిద్దరూ ఒకరి మొగం వొకరు ఎగాదిగా చూచుకున్నారు. ఆ ఆగంతుకుని గురించి సవివరంగా చెప్పమని రాయ్ కోరాడు.

"ఆతడు మన పత్రికా కార్యాలయానికి వచ్చాడు. వచ్చీ రావటంతోనే 'యమ్. యన్. రాయ్'ని కలుసుకొనటానికి ఎప్పుడు, ఎక్కడ అవకాశం దొరుకు తుందని అడిగాడు. విదేశస్థునిగా కనబడటంచేత కారణం అడిగినా చెప్పలేదు. రెండురోజుల క్రితమే అమెరికా నుంచి ఒక అవసరమైన పనిమీద యిక్కడకు వచ్చినట్లు, అందుకు మిమ్మల్ని కలుసుకొనాలని చెప్పాడు. ఆయన తన పేరు బ్రౌన్‌ట్వీన్ అని, నగరంలో ఒక మారుమూల హోటలులో దిగినానని, తనరాకను గురించి మీకు అందచేయమని, రేపు తిరిగి అదేసమయానికి మన పార్టీ కార్యా లయానికి వస్తానని చెప్పి వెళ్ళినాడని" వారు తమకు తెలిసినంతవరకు రాయ్‌కి సమాచారం అందచేసారు. పరిస్థితు లెలాపరిణమించినా ఆ నూతన వ్యక్తిని కలుసు కొనటానికి రాయ్ నిశ్చయించుకున్నాడు. 'ఆయనను గురించి ఇంకా వివరాలు తెలుసుకొనటానికి ప్రయత్నించండి' అని ఆ వచ్చిన యిద్దరినీ రాయ్ ఆదేశించాడు.

ఆ సాయంత్రమే ఆ యిద్దరిలో వొకరు బ్రౌన్‌ట్వీన్ వుండే హోటలుకు వెళ్ళి ఆయనను కలుసుకొన్నాడు. ఆయన వేషభాషలు, వాలకం పరికిస్తూనే కొంత కాలం కులాసా కబుర్లతో గడిపి ఆ హోటలు మంచిది కాదని చెప్పి ఆ వ్యక్తిని ఆతడు భోజనానికి ఆహ్వానించి ఒక ఇటాలియన్ హోటలుకు తీసికొని వెళ్ళాడు. దారిలో, హోటలులో బ్రౌన్‌ట్వీన్ రష్యాగురించి ఆ సభ్యునికి అనేక విషయాలు చెప్పాడు. లెనిన్‌కు తాను ఆంతరంగిక మిత్రునిగా వర్ణించుకొన్నాడు. ఈ విషయా లన్నీ పూసగ్రుచ్చినట్లుగా మరునాడు ప్రొద్దుననే వచ్చి ఆతడు రాయ్‌కి వివరించాడు.

రాయ్ అనుకున్న ప్రకారం ఉదయమే పార్టీ కార్యాలయానికి వచ్చి బ్రౌన్‌ట్వీన్‌ను కలుసుకొన్నాడు. మధ్యాహ్న భోజన సమయం వరకు వారిద్దరూ బజారులో గమనం సాగించి తరువాత బ్రౌన్‌ట్వీన్ రాయ్‌ని తాను బసచేసిన హోటలుకు దారి తీసాడు. కాని ఇంత సమయం జరిగినా ఆ నూతన వ్యక్తి వచ్చిన పని యేమిటో, రాయ్‌ని ఎందుకు కలుసుకోదలిచాడో బయట పెట్టలేదు. హోటలు దగ్గర రాయ్‌కి వీడ్కోలు యిచ్చి సాయంత్రం తిరిగి తప్పకుండా హోటలుకే రావాలని రాయ్ దగ్గర మాట తీసుకొని హోటలులో ప్రవేశించాడు. రాయ్ కిది మరీ విచిత్రంగా కనబడినది.

సాయంత్రం తిరిగి రాయ్ ఆ వ్యక్తిని అదే హోటలులో కలుసుకొన్నాడు. ఆ హోటలు చూడటానికి ధనికులు, ముఖ్యంగా విదేశీయులు వుండటానికి తగినదిగా కనబడలేదు. సోవియట్ రష్యానుంచి వచ్చినవ్యక్తి ఆ హోటలులో బసచేయటం రాయ్‌కి వింతగా కనబడినది. 'బహుశ బోల్షివిక్కులు అలాంటి హోటలునే ఎన్నుకుంటారా లేక తన రహస్య జీవితానికి ఆయన ఆ హోటలును ఎన్నుకున్నాడా' అనే సందేహం రాయ్‌కి కలుగక పోలేదు. 'అతని మెక్సికో రాకకు కారణం ? తనతో పని ? యీదేశం రాకమునుపే తన విషయం తెలుసుకున్నాడా ?' అనే ప్రశ్నలు రాయ్‌ని వేధిస్తూనే వున్నవి. బ్రౌన్‌ట్వీన్ రాయ్‌తో అనేక విషయాలు గురించి ముచ్చటించాడు. కాని అసలు విషయం బయటపెట్టటం లేదు. రాయ్ ఆ వ్యక్తిని భోజనానికి ఆహ్వానించి ఇటాలియన్ హోటలును గుర్తుచేసాడు. ఆ హోటలు బాగానే వున్నది. అయినా ఎందుకో బ్రౌన్‌ట్వీన్ అంగీకరించక పోవటంతో ఒక ఫ్రెంచి హోటలుకు వెళ్ళటానికి నిశ్చయించుకున్నారు.

బ్రౌన్‌ట్వీన్ దుస్తులు మార్చుకొనటానికి ప్రక్కగది లోనికి వెళ్ళాడు. రాయ్ ఆయన టేబిలుమీద పత్రికలు, మాగజైన్లు తిరుగవేశాడు. రాయ్‌కి ఆశ్చర్యం, అనుమానం కలిగినవి. వాటిలో ఎక్కువగా రాయ్ దృష్టిలో పడినవి 'గాలేస్ - మాగజైను' — ఇంగ్లీషు మాసపత్రికలు.

రాయ్ ఆలోచనలు గతాన్ని స్మరణకు తెచ్చినవి. గాలే మతోన్మాది, యుద్ధ వ్యతిరేకుడు. అమెరికా ప్రభుత్వం యుద్ధంలో చేరగానే యుద్ధ వ్యతిరేకులను బంధించి జైళ్లలో పెట్టటం ప్రారంభించటంతో అచ్చటి జర్మని దేశస్థులు, భారత విప్లవవాదులు, యుద్ధవ్యతిరేకులు రహస్యంగా పారిపోయి వచ్చి మెక్సికో దేశంలో ఆశ్రయం పొందసాగారు. ఆ సందర్భంగా వచ్చినవారిలో గాలే కూడా వున్నాడు. ఒకనాడు గాలే తన భార్యతో కలిసి రాయ్ యింటికి వచ్చి భారతదేశ ఆధ్యాత్మిక తత్వాన్ని గురించి ఆయనతో అనేక విషయాలు చర్చించి రాయ్‌ని విశేషంగా ప్రస్తుతించారు. వెళ్ళేముందు తమ యింటికి విందుకు రమ్మని రాయ్‌ని ఆహ్వానించారు. గాలే కేవలం మతోన్మాది, పాసిఫిస్టు అని తెలిసికూడా ఆహ్వానం కాదనలేక విందుకు వెళ్లాడు. ఆ దంపతులు అన్ని మర్యాదలుచేసి విందు అనంతరం తమ పత్రిక (గాలేస్ మాగజైను) కు ప్రభుత్వంనుంచి ఆర్థిక సహాయం కావాలని, అందుకు రాయ్ సహాయ పడాలని అర్థించారు. అట్టి పత్రికకు తాను సహాయపడ

జాలనని రాయ్ నిర్మొగమాటంగా చెప్పివచ్చాడు. అప్పటినుంచి గాలే ప్రతి మాస పత్రికలోనూ రాయ్‌ని తీవ్రంగా విమర్శిస్తూ ఒక వ్యాసం వ్రాయటం ఆశయంగా పెట్టుకున్నాడు. ఆ పత్రికలన్నీ బ్రాన్‌ట్వీన్ టేబిలుమీద చూడటంతో రాయ్‌కి ఐధిగా నూతన వ్యక్తిమీద సంశయం కలిగినది.

ఇద్దరూ ఫ్రెంచి హోటలుకు వెళ్లారు. హోటలులో అడుగుపెట్టుచూ బ్రాన్‌ట్వీన్ రాయ్‌ని "మీ జేబులో అవసరమయిన సొమ్ము వున్నదా?" అని ప్రశ్నించటం రాయ్‌కి మొదట అర్థం కాలేదు. ముందుగా ఆయనే 'నా దగ్గర ప్రస్తుతం ఏమీ సొమ్ములేదు. ఉన్నది కాస్తా యీ రెండురోజుల ఖర్చులకు అయి పోయింది' అని చెప్పటం, రాయ్ 'వున్నది' అన్నట్లుగా తలవూపటంతో యిద్దరూ లోపలికి వెళ్లారు. బ్రాన్‌ట్వీన్ మెనూ చూచి కావలసిన పదార్థాలకు ఆర్డరు యిచ్చాడు.

భోజనసమయంలో రాయ్ "తనను గురించి మెక్సికో రాక ముందు ఏమైనా తెలుసుకున్నారా?" అని బ్రాన్‌ట్వీన్‌ను ప్రశ్నించాడు. 'లేదు' అని సమాధానం రావటంతో రాయ్ నివ్వెరపోయాడు. మరి ఆ వ్యక్తి నేరుగా పార్టీ కార్యాలయానికి ఏవిధంగా రాగలిగాడు? తనను గురించి ఎందుకు వాకబు చేసాడు? బ్రాన్‌ట్వీన్ చిరునగవుతో రాయ్ వంక చూడసాగాడు. రాయ్ తన సందేహానివృత్తికి అదే విషయం గ్రుచ్చి గ్రుచ్చి అడుగసాగాడు.

"నేను అనుకోకుండా అమెరికాలో ఒక రేవులో దిగవలసి వచ్చినది. అమెరికా నాకు పాతదేశమే. అక్కడ నేనెరిగిన మిత్రులు చాలామంది వున్నారు. కాని అక్కడ వుండటం ప్రమాదం. కనుక యిక్కడకు వచ్చాను. ఇక్కడ నేనెరిగిన వ్యక్తులు గాని, మిత్రులుగాని ఎవరూలేరు. అమెరికా నుంచి వచ్చేటప్పుడు ఒక మిత్రుడు నాకొక సలహా యిచ్చాడు. అమెరికా నుంచి వచ్చిన రాడికల్సు యిక్కడ చాలామంది వున్నారని, వారితో నెమ్మదిగా పరిచయం చేసుకొనమని, గాలే అనే వ్యక్తి మాత్రం చాల ప్రమాదభరితుడని, అతనినుంచి దూరంగా వుండమని ఆ సలహా."

"మెక్సికో చేరగానే ముందుగా పత్రికలతో పరిచయం చేసుకొనటానికి ప్రయత్నించాను. అన్నీ స్పెయిను భాషలో వున్నవి. ఒకటిమాత్రం ఇంగ్లీషులో

'గాతేస్ మాగజైను' పేరుతో దొరికినది. వెనుకటి పత్రికలు కూడా కొని చూచాను. ప్రతిసంచికలోనూ యమ్. యన్. రాయ్‌ని గురించి ఒక వ్యాసం కన్పబడసాగినది. ఆయన సోషలిస్టు పార్టీ ప్రధాన కార్యదర్శిగా కనుగొన్నాను. అయితే ఆయనను గురించి దూషణగా, నీచంగా వర్ణించటం చూచాను. నా మిత్రుడు గాలేను గురించి చేసిన హెచ్చరిక నాకు గుర్తుకు వచ్చినది. కనుక మిమ్ములను కలుసుకొనటం అవసరమని భావించాను. నేను బూర్జువావర్గానికి చెందిన వ్యక్తిగా నటించటం చేత సరాసరి పార్టీ కార్యాలయానికి వెళ్లితే ఏదైనా ప్రమాదం జరుగవచ్చుననే భయంతో అక్కడకు వెళ్లకుండా ముందుగా 'యల్ హెరాల్డు' పత్రికా కార్యాలయానికి వెళ్లి అచ్చట మిమ్ములను గురించి వాకబు చేసాను." అని బ్రౌన్‌ట్వీన్ విడమరిచి చెప్పటంతో రాయ్ విస్మయం చెందాడు.

అప్పటికి చాలా ప్రొద్దుపోయినది. మరునాడు తిరిగి యిద్దరూ రాయ్ యింటి దగ్గర కలుసుకొందామని అనుకున్నారు. రాయ్ బ్రౌన్‌ట్వీన్‌ను హోటలులో దిగవిడిచి తన యింటికి చేరుకున్నాడు.

మరునాడు సాయంత్రం రాయ్ మిస్టరు బ్రౌన్‌ట్వీన్‌ను విందుకు ఆహ్వానించాడు. రాయ్ నివసించే యిల్లు పట్టణానికి బయట వుండటంచేత సహాయకారిగా ముందు వొకరిని పంపుతానని రాయ్ కబురు పెట్టినా బ్రౌన్‌ట్వీన్ అందుకు అంగీకరించక ఒంటరిగానే రాగలనని చెప్పి రాయ్ నివసించే యింటి అడ్రెసు, వివరాలు తెలుసుకొన్నాడు.

రాయ్‌కి బ్రౌన్‌ట్వీన్ మెక్సికో ఎందుకు వచ్చాడో, తనను కలుసుకొనాలనే ఆసక్తి ఎందుకు చూపాడో అన్న విషయాలు అనూహ్యంగానే మిగిలి వున్నవి. 'తాను సోషలిస్టు పార్టీ ప్రధాన కార్యదర్శియే కాకుండా ప్రెశిడెంటు కరంజాకు అనధికార సలహాదారునిగా మెక్సికోలో మిక్కిలి పలుకుబడిగల హోదాలో వున్నాడు. కనుక బ్రౌన్‌ట్వీన్ తన సహాయంకొరకు వచ్చి యుండవచ్చును. నెమ్మదిగా ఆయనే బయటపడవచ్చును. ఈ మధ్యలో బ్రౌన్‌ట్వీన్ నిజస్వరూపం తెలుసుకొనటానికి తనకు కొంత వ్యవధి వుండగల'దని రాయ్ భావించాడు.

రాయ్ మిత్రులలో ముఖ్యులిద్దరు చార్లీ, ఇర్విన్ అనువారు రాయ్‌ని బ్రౌన్‌ట్వీన్ రాకను గురించి పదేపదే గ్రుచ్చి గ్రుచ్చి అడుగసాగారు. 'తనకూ

తెలియటంలేదని' రాయ్ చెప్పినా వారు 'ఇందులో ఏదో రహస్యం వుందని' రాయ్‌ని అనుమానించ సాగారు. ఇది సహజం కూడాను. రాయ్ వారిద్దరిసీ సమాధాన పరిచే స్థితిలో లేక కొంత యిరుకున పడవలసి వచ్చినది. తామిద్దరం కూడా బ్రౌన్‌ట్వీన్‌తో పాటు విందుకు రాగలమని చెప్పారు. మిస్టరు బ్రౌన్‌ట్వీన్ విందుకు మిరెవ్వరినీ ఆహ్వానించ వద్దని ముందుగానే హెచ్చరించాడు. బహుశః ఏకాంతంగా తన రాకకు కారణం తెలియబరచాలని ఆయన వుద్దేశం కావచ్చును. రాయ్ వారిని రమ్మని, వద్దని చెప్పలేక చివరకు బ్రౌన్‌ట్వీన్ వచ్చిన తరువాత రెండు గంటలకు రమ్మని మరీ మరీ సర్దిచెప్పి పంపగలిగాడు.

ఆనాడు సాయంత్రం అనుకున్న ప్రకారం మసకవేళలో రాయ్ యింటి ముందు ఒక టాక్సీ వచ్చి ఆగినది. అందులోనుంచి టోపి ముఖానికి అడ్డంగా పెట్టుకొని త్వరగా లోపలికి ప్రవేశించిన బ్రౌన్‌ట్వీన్‌ను రాయ్ ఆహ్వానించాడు. వంటమనిషి టాక్సీ డ్రైవరుకు బాడుగయిచ్చి పంపినది. ఇద్దరూ డ్రాయింగు రూములో ఆసీను లయ్యారు. బ్రౌన్‌ట్వీన్ తన గతచరిత్రను గురించి రాయ్‌తో కొంత ఉపోద్ఘాతం ప్రారంభించాడు.

"1905 రష్యా విప్లవ కాలంలో ప్రవాసిగా అమెరికా ప్రవేశించాను. 1917 విప్లవం వరకు అక్కడే వున్నాను. విప్లవానంతరం రష్యావెళ్ళి మళ్ళీతిరుగు ప్రయాణం చేసి అమెరికాలో దిగవలసి వచ్చినది. కాని అక్కడ నావునికికి ప్రమాద సూచనలు కనబడటంతో రహస్యంగా యిచ్చటకు రాగలిగాను. ఇచ్చట 'ఒక మార్క్సిస్టు - హిందూ ఆధ్యాత్మికవాది'ని కలుసుకొనటం జరిగినది". అని పక పక నవ్వుతూ తన సంభాషణ ముగించాడు. తరువాత అనేక విషయాలను గురించి ముచ్చటించు కున్నారు.

ఇంతలో చార్లీ, ఇర్విన్‌లు కూడా వచ్చి సంభాషణలో పాల్గొన్నారు. "లెనిన్ జర్మనీ ధనంతో రష్యా విప్లవాన్ని జయప్రదం చేసాడు. యమ్. యన్. రాయ్ భారత విప్లవం కొరకు అదే పధకంతో జర్మనీ సహాయం కొరకు అంతకు ముందే తీవ్రకృషి సాగించాడు" అని వారు బ్రౌన్‌ట్వీన్‌కు గుర్తు చేయటం జరిగినది. 'మార్క్సిస్టు, బోల్షివిక్కు' అని చెప్పుకుంటున్న బ్రౌన్‌ట్వీన్ బూర్జువా పద్ధతులను వారు హేళన చేయగా రాయ్ అందుకు కారణాలను చెప్పి బ్రౌన్‌ట్వీన్‌ను సమర్ధించాడు.

విందు అనంతరం ముందుగా చార్లీ, ఇర్విన్‌లు వెళ్ళిపోయారు. బ్రాన్‌ట్విన్ తానుంటున్న హోటలు ఖాళీ చేయాలనుకుంటున్నట్లు వెల్లడించాడు. నగరంలో మంచి హోటళ్లు చాలా వున్నవి. కాని వాటిల్లో వుండటానికి బ్రాన్‌ట్విన్ ఇచ్చగించ లేదు. బహుశః తన రహస్యజీవితం బయట పడవచ్చుననే సందేహంలో వుండి వుండవచ్చును. ఇది గ్రహించిన రాయ్ 'తాత్కాలికంగా తనయింట్లో కొంత కాలం వుండవచ్చునని' అనటంతో బ్రాన్‌ట్విన్‌కు పోయిన ప్రాణం తిరిగివచ్చినంతగా కనబడ్డాడు.

మరునాడు రాయ్ బ్రాన్‌ట్విన్ వున్న హోటలుకు వెళ్లేటప్పటికే ఆయన తనవెంట తెచ్చిన అరడజను పెట్టెలను సర్దుకొని ప్రయాణానికి సిద్ధంగా వున్నట్లు కనబడ్డాడు. రాయ్ హోటలుబిల్లు చెల్లించాడు, ఇద్దరూ కలిసి టాక్సీలో రాయ్ యింటికి చేరారు.

ఇంట్లో ప్రవేశిస్తూనే బ్రాన్‌ట్విన్ రాయ్‌తో "ఇక్కడ విదేశస్థులు ముందుగా తమ పేరు నమోదు చేయించు కోవాలా ?" అని అడిగాడు. రాయ్ సమాధానం చెప్పకముసుపే "నాపేరు గ్రుజన్‌బర్గ, ఆస్ట్రియన్ లాయరును. అమెరికాలో చాలా సంవత్సరాలు నివాసం." అని చెప్పాడు.

"ఇక్కడ ఆ భయంలేదు. నా యింట్లో వున్న వ్యక్తిని ఎవరూ ఏ విధం గానూ ఆచూకీ తీయటానికి ప్రయత్నించరు" అని రాయ్ సందేహ నివృత్తి చేసాడు.

"విదేశస్థుల రిజిష్టరులో నా పేరు నమోదు కావలసిన అవసరం లేకపోతే మీరు యిప్పటివరకూ పిలుస్తున్న బ్రాన్‌ట్విన్ పేరును మరచి పోవచ్చును. నాపేరు మైకేల్ బరోడిన్. నేను రష్యానుంచి నూతన ప్రపంచానికి ప్రత్యేక రాయబారిగా వచ్చాను" అని చెప్పగా రాయ్‌కి అంతులేని ఆశ్చర్యం కలిగినది.

యాదృచ్ఛికంగా ఒకరినొకరు కలుసుకున్నారు. ఒకరినుంచి ఒకరు అనేక విషయాలు తెలుసుకొన్నారు. గాఢమిత్రులయ్యారు. రాయ్ బరోడిన్‌ని తన రాజకీయ గురువుగా అభివర్ణించాడు. మార్క్సిజం గురించి, మార్క్సిజానికి మూలాధారమయిన హెగిలియన్ సిద్ధాంతాల గురించి, పాశ్చాత్య తత్వ సిద్ధాంతాల గురించి, సంస్కృతిని గురించి మైకేల్ బరోడిన్ ద్వారా రాయ్ అనేక విషయాలు తెలుసుకో

గలిగాడు. తరువాత చైనాలో విప్లవ పథకం గురించి యిద్దరికీ భేదాభిప్రాయాలు వచ్చినవి. (ఈ విషయం ముందు భాగాల్లో వివరించబడుతుంది). రాజకీయంగా ఒకరి నొకరు విమర్శించుకుంటూ పున్నా రాయ్ రష్యాలో పున్నంతకాలం (1929) వ్యక్తిగతంగా ఇద్దరూ మిత్రులుగానే పుండి ఒకరి నొకరు గౌరవించుకుంటూ వచ్చారు.

# రష్యా వెలుపల ప్రథమ కమ్యూనిస్టు పార్టీ :

రాయ్ యింటికి చేరిన మరునాడే బరోడిన్ తన మెక్సికో రాకను గురించి, తన గత చరిత్రను గురించి రాయ్‌కి మరికొన్ని విషయాలు వెల్లడించాడు.

1905 విప్లవం తరువాత బరోడిన్ అమెరికావచ్చి మధ్యలో ఒకసారి రష్యా వెళ్ళివచ్చినా 1918 వరకు అక్కడే నివసించి న్యాయశాస్త్రము, తత్వశాస్త్రము అభ్యసించి అమెరికా విశ్వవిద్యాలయంలో పరిశోధనలు జరుపుతూ ఉపాధ్యాయ వృత్తిలో పున్నాడు. అక్కడే వివాహం జరిగినది. ఇద్దరు బిడ్డలుకూడా కలిగారు. భార్య, బిడ్డలను వదలి విప్లవానంతరం రష్యా వెళ్ళివచ్చాడు. అమెరికాలో పున్నంతకాలం గుర్జనుబర్గు పేరుతో తన జీవితం గడిపాడు.

రష్యానుంచి తిరిగి వచ్చేటప్పుడు జారుప్రభుత్వానికి చెందిన అమూల్యమయిన వజ్రాలను రహస్యంగా రెండు తోలుపెట్టె సూటుకేసులలో చర్మం లోపల పొదిగించి తీసుకొని వచ్చాడు. ఆ సమయంలో రష్యా వ్యాపార ప్రతినిధివర్గం అమెరికాలో వున్నది. యుద్ధకారణంగా మిత్రరాజ్యాలు రష్యాకువెళ్ళే సరకులను దిగ్బంధం చేసినవి. వ్యాపార ప్రతినిధి వర్గానికి అవసరమయిన ధనసహాయం బ్యాంకుల ద్వారా చేయటానికి వీలుపడలేదు. మిత్రరాజ్యాల అజమాయిషీ వలన సరాసరి రష్యానుంచి ధనం పంపటానికి కూడా వీలుపడలేదు.

బరోడిన్ ధర్డుకమ్యూనిస్టు ఇంటరనేషనల్ ప్రధాన కార్యదర్శికి, సోవియట్ రష్యా వైస్‌కమిషారుకు మిత్రుడు కావటం చేతనూ, అమెరికా సంయుక్త రాష్ట్రాల నివాసి కావటం చేతనూ ఆయన ద్వారా వజ్రాలను పంపటం జరిగినది. వాటిని అమెరికా చేర్చి సాన పట్టించి తగిన వెలకు అమ్మి కొంతధనం వ్యాపార ప్రతినిధి

పర్గానికి అందచేసి మిగిలినది నూతన ప్రపంచంలో కమ్యూనిస్టు ప్రచారానికి, పార్టీల స్థాపనకు వినియోగించాలని సోవియట్ రష్యా ఆదేశించినది.

బరోడిన్ సరాసరి అమెరికా సంయుక్త రాష్ట్రాలు ప్రయాణించే అవకాశం లేదు. రహస్యంగా, ఫోర్జరీ ప్యాసుపోర్టుతో ప్రయాణించవలసి వున్నది. రష్యానుంచి హాలండుచేరి అచ్చటి రష్యను రాయబార కార్యాలయంలో ప్యాసుపోర్టు తీసుకొని అమెరికా ప్రయాణం చేసాడు. వెంట ప్రభుత్వ సేవకుని కూడా తీసుకొని వచ్చాడు. ఒకవేళ తాను మార్గమధ్యంలో పట్టుబడితే ఆ రెండు తోలు పెట్టెలను చికాగోలోవున్న తన భార్యకు చేర్చాలని ఆ సేవకునికి గట్టి ఆదేశం యివ్వబడినది. ఓడలో బరోడిన్‌కి ఒక జర్మను సైనికాధికారితో పరిచయం కలిగినది. జర్మను పరాజయానికి అతడు విరక్తిచెంది నూతన ప్రపంచానికి వెళ్లి స్థిరపడాలనే భావంతో ప్రయాణం చేస్తున్నాడు.

చివరకు బరోడిన్ అనుమానించినట్లుగానే బంధింపబడ్డాడు. తన ప్రభుత్వ సేవకుడు, జర్మను సైనికాధికారి కూడా అమెరికా చేరలేదు. వజ్రాలు దాచబడిన ఆ తోలు పెట్టెలు ఎటుచేరినవో అంతులేదు. రాయ్‌కి యీ విషాధగాథ మిక్కిలి బాధ కలిగించినది. ఆ తోలు పెట్టెలలోవున్న అమూల్య రత్నాలు ఒక నిర్ణీత కార్యానికి తీసుకొని రాబడినవి. వాటి విలువ ఆ కాలంలో షుమారు ఐదు లక్షల డాలర్లగా నిర్ణయించబడినది. పైగా చికాగోలోవున్న బరోడిన్ భార్య బిడ్డలతో ఆర్థిక చిక్కులకు గురిఅయి భర్త రాక కొరకు ఎదురు చూస్తూ వున్నది.

(ఆ సైనికాధికారి కొరకు రాయ్ తరువాత గాలింపు చేయించాడు. అతడు వెస్టు ఇండీసులోని ఒక చిన్నద్వీపంలో ఒక గుడిసె నిర్మించుకొని అందులో వుంటున్నట్లు ఆచూకీ తెలియటంతో ప్రత్యేకంగా అచ్చటికి మనుషులను పంపి తోలుపెట్టెల సంగతి తెలుసుకొనటానికి ప్రయత్నించాడు. బరోడిన్ భార్యాబిడ్డలకు కొంత ధనం అందే యేర్పాట్లు కూడా చేసాడు.)

బరోడిన్ అమెరికాలో ప్రవేశించగానే బంధింపబడ్డాడు. అతడు బెయిలు మీద విడుదల అయి రహస్యంగా మెక్సికో ప్రవేశించాడు. మెక్సికోలో రాయ్‌ని కలుసుకొనటం కూడా యాదృచ్ఛికమే. రాయ్ తన దగ్గరవున్న సొమ్ముతో, బరోడిన్ ష్మే ఆశయసిద్ధి కొరకు నూతన ప్రపంచం దర్శించాడో అందుకు వినియోగించ

టానికి సిద్ధపడటంతో బరోడిన్ కొంత పూరట చెందటం జరిగినది. తరువాత రాయ్, బరోడిన్‌లు రష్యా చేరినప్పుడు సోవియటు అధికారులు వజ్రాల గురించి బరోడిన్‌ను అనేక ప్రశ్నలు వేయటం, ఆతనిని అనుమానించటం జరిగినది. బరోడిన్ అమాయకుడని సోవియటు అధికారులను వొప్పించటానికి రాయ్ మిక్కిలి శ్రమపడవలసి వచ్చినది.

బరోడిన్ రహస్యజీవితాన్ని గురించి ఎక్కువకాలం దాచటం రాయ్‌కి అసమంజసంగానూ, అసాధ్యంగానూ కనబడినది. ఆయన రాకను గురించి, వచ్చిన అవసరాన్ని గురించి కనీసం పార్టీ ప్రముఖులకు తెలియచేయవలసిన బాధ్యత రాయ్ కున్నది. ప్రత్యేక పార్టీ కార్యవర్గాన్ని సమావేశపరచి రాయ్ బరోడిన్‌ని వారికి పరిచయం చేసి లాటిన్ అమెరికాకు ఆయన వచ్చిన అవసరాన్ని గురించి, కమ్యూనిస్టు ఇంటర్‌నేషనల్ స్థాపన గురించి వివరించాడు. మెక్సికో సోషలిస్టు పార్టీ, రష్యను కమ్యూనిస్టుపార్టీ ఆశయాలు వొకటే. 1918-19 లో రష్యా విప్లవానంతరం రెండవ సోషలిస్టు ఇంటర్నేషనల్ లోని తీవ్రవాదులంతా రష్యాలో సమావేశమయి మూడవ ఇంటర్నేషనల్ స్థాపించటానికి నిశ్చయించుకున్నారు. దీని గుర్తింపు కొరకు కారల్‌మార్క్స్ సూచించిన 'కమ్యూనిస్టు' పదం దీనికి జోడించి 'మూడవ కమ్యూనిస్టు ఇంటర్‌నేషనల్' నామకరణం చేయటం జరిగినది. మార్క్స్ యిచ్చిన కమ్యూనిస్టు ప్రణాళికకు అనుగుణంగా ఒక ప్రత్యేక కమ్యూనిస్టు ప్రణాళికను ఆమోదించి వివిధదేశాల్లో అందుకు అనుగుణంగా కమ్యూనిస్టు పార్టీలు స్థాపించటానికి తీర్మానించ బడినది.

కాని అంతవరకు రష్యా మినహాయించి ఆ తీర్మానం ప్రకారం క్రొత్తగా ఏదేశంలోనూ కమ్యూనిస్టుపార్టీ స్థాపన జరుగలేదు. మెక్సికోలో కమ్యూనిస్టుపార్టీ స్థాపించటానికి రాయ్ నిశ్చయించుకున్నాడు. బరోడిన్ యిది తనకు రాజకీయ ఘనవిజయంగా భావించాడు. కమ్యూనిస్టు ప్రచారం కొరకు తాను తెచ్చిన వజ్రాలు మాయమయినా కమ్యూనిస్టు ప్రచారం చేస్తున్నట్లు రష్యాకు తెలియజేయ వచ్చునని బరోడిన్ సంతృప్తి చెందాడు.

సోషలిస్టుపార్టీలో వివిధవర్గాలకు చెందిన వారున్నారు. వారు సోషలిస్టు పార్టీని కమ్యూనిస్టుపార్టీగా మార్చటానికి అంగీకరించక పోవచ్చును. కనుక రాయ్ వివిధవర్గ నాయకులను విడివిడిగా, ప్రత్యేకంగా కలుసుకొని రెండు పార్టీల

ఆదర్శాలు, ఆశయాలు ఒకటిగా చూపించి, థర్డు ఇంటర్నేషనల్‌కు తమ పార్టీని అనుబంధ పార్టీగా మార్చటం వలన అంతర్జాతీయంగా తమ పార్టీకి మెక్సికో దేశానికి కలుగ గల ప్రాముఖ్యాన్ని, ప్రయోజనాలను వారికి వివరించి చెప్పాడు. లాటిన్ అమెరికన్ దేశా లన్నింటినీ కలుపుతూ 'కమ్యూనిస్టు బ్యూరో'ను స్థాపించ గలిగితే అమెరికను సామ్రాజ్యావాదానికి వ్యతిరేకంగా గట్టిపునాదిని నిర్మించ గలుగుతామని చెప్పాడు. దీనికి అందరి అంగీకారం పొందగలిగారు. సోషలిస్టుపార్టీ సర్వసభ్య సమావేశం జరిపి సభ్యులకు లోతుపాతులు, మంచిచెడ్డలు వివరించి మహాసభ అంగీకారంతో సోషలిస్టుపార్టీని కమ్యూనిస్టుపార్టీగా మార్చటానికి నిర్ణయం చేయగలిగాడు. కాని 'కమ్యూనిస్టు పార్టీ' స్థాపనకు ప్రభుత్వ అనుమతి, ముఖ్యంగా ప్రశిడెంటు కరంజా అనుమతి అవసరం. అమెరికా ప్రభుత్వం ఏదో ఒక మిషతో కరంజాను కూలద్రోసి అబ్రెగాన్‌ని అధికారంలోనికి తీసుకు రావాలనే ప్రయత్నంలో వున్నది.

ప్రత్యేకంగా రాయ్ శ్రద్ధ తీసుకొని రహస్యంగా కరంజా - బరోడిన్‌ల అంతరంగిక సమావేశాన్ని ఏర్పాటు చేసాడు. అన్నివిషయాలు చర్చించబడ్డవి. ఇంతవరకు సోషలిస్టుపార్టీ కరంజా ప్రభుత్వానికి అండగా వున్నది. అదే దృక్పథంతో స్థాపించబోయే కమ్యూనిస్టుపార్టీ కూడా కరంజా ప్రభుత్వానికి మద్దత్తునిస్తుంది. కాగా అంతర్జాతీయంగా సోవియటు రష్యా ప్రభుత్వ సహకారం కూడా లభించ గలదు. బహిరంగంగా కాకపోయినా అంతరంగికంగా ప్రశిడెంటు కరంజా, విదేశాంగమంత్రి, పార్లమెంటు స్పీకరు తమ అనుకూలతను ప్రకటించారు. 'లాటిన్ అమెరికను లీగు'కు యిది తోడ్పడ గలదని వారికి నమ్మకం కలిగినది.

సోషలిస్టుపార్టీ ప్రత్యేక మహాసభలో పార్టీని కమ్యూనిస్టుపార్టీగా మార్చ టానికి ఏకగ్రీవంగా తీర్మానించబడినది. రాయ్ ప్రధాన కార్యదర్శిగా అందరూ ఆమోదించారు. రాయ్ యిందుకు అంగీకరించలేదు. మెక్సికన్ జాతీయుడే పార్టీ ప్రధాన కార్యదర్శిగా వుండటం మంచిదని రాయ్ అభిప్రాయం కనుక రాయ్‌తోపాటు మరోవ్యక్తిని కూడా కార్యదర్శిగా ఎన్నుకొని అతడు పార్టీ సిద్ధాంతాల్లో, ప్రచారంలో తగిన అనుభవం గడించటానికి రాయ్ తోడ్పడుతూ అంతవరకూ రాయ్ ప్రధాన కార్యదర్శిగా వుండాలనే తీర్మానం ఆమోదించబడినది. మహాసభకు సోవియటు రష్యానుంచి అభినందన సందేశం వచ్చినది. తమ పార్టీకి అంతర్జాతీయ ప్రతిష్ఠ కలిగినందుకు సభ్యులు సంతోషం వెలిబుచ్చారు.

బరోడిన్ తన మెక్సికో రాకను గురించి, మెక్సికో రాజకీయాలను గురించి, కమ్యూనిస్టు పార్టీ సిద్ధాంతాలు - నాయకత్వం గురించి ఎప్పటి కప్పుడు సోవియటు రష్యాకు రిపోర్టు పంపుతూ వచ్చాడు. 1920 లో జరిగే థర్డు ఇంటర్నేషనల్ రెండవ కాంగ్రెసు మహాసభకు రాయ్ నాయకత్వాన ప్రతినిధివర్గాన్ని పంపాలని రష్యానుంచి మెక్సికో కమ్యూనిస్టు పార్టీకి ఆహ్వానం వచ్చినది.

పార్టీ కార్యవర్గ సమావేశంలో బరోడిన్ సోవియట్ రష్యాను గురించి, కమ్యూనిస్టు పార్టీని గురించి, సామ్రాజ్య వ్యతిరేక ఉద్యమాన్ని గురించి అనేక విషయాలమీద చర్చలు సాగిస్తూ వుండేవాడు. భోజనానంతరం అర్ధరాత్రి వరకు రాయ్ - బరోడిన్‌లు మార్క్సిస్టు సిద్ధాంతాల గురించి చర్చించుకుంటూ వుండేవారు. అమెరికాలో వున్నప్పుడు రాయ్ సోషలిస్టు భావాలు కలిగి కొంతవరకు మార్క్సిజం అభ్యసించాడు. మెక్సికోలో బరోడిన్ సహకారంతో ముఖ్యంగా మార్క్సిజానికి కారణభూతమయిన పాశ్చాత్య సమాజ సంస్కృతులను, చరిత్రను భిన్నదృక్పధాలతో తర్కించి ఆకళింపు చేసుకొనటానికి చక్కని అవకాశం లభించినది.

బరోడిన్ ఏకాంతంగా అనేక రాత్రింబవళ్లు తన గదిలో కూర్చుని కాగితాలు టైపుచేస్తూ వుండేవాడు. సూచాయగా తనతోబాటు రాయ్‌కూడా రష్యా రావలసి వుంటుందని చెప్పటం వినా ఆ పత్రాల రహస్యాన్ని రాయ్‌కి కూడా తెలియనిచ్చేవాడు కాదు. ఒకనాడు అనుకోకుండా రష్యానుంచి ఆహ్వానం రావటం రాయ్‌కి ఆశ్చర్యం కలిగినది. ఇంతవరకు మెక్సికో తనకు ఆశ్రయమిచ్చినది. మెక్సికోను తన మాతృదేశంగా భావించి రాజకీయాల్లో ప్రముఖపాత్ర వహించి అభ్యుదయ భావాలతో పార్టీని స్థాపించ గలిగాడు. పార్టీలో, ప్రభుత్వంలో విశేష పలుకుబడి, ప్రతిష్టలు సంపాదించ గలిగాడు. పార్టీ, ప్రభుత్వం రెండూ తనకు విశేష గౌరవాన్నిచ్చి ఆదరించినవి. ముందు ముందు ఆబ్రెగాన్ సహకారంతో అమెరికా ప్రభుత్వం మెక్సికోలో అంతర్యుద్ధాన్ని ప్రేరేపించ వచ్చును. కరంజా తనమీద అంతులేని విశ్వాసం కలిగివున్నాడు. అమెరికా సామ్రాజ్యవాద వ్యతిరేకంగా పార్టీని, ప్రజా బాహుళ్యాన్ని సమీకరించవలసిన అవసరం ఆసన్నమయినది. ఇట్టి పరిస్థితుల్లో రష్యా వెళ్ళటం వలన ప్రత్యేక ప్రయోజనం కవబడలేదు. కనుక భరోడిన్‌తో రాయ్ తన వ్యతిరేకతను ప్రదర్శించాడు.

'బోల్షివిక్కు క్రమశిక్షణకు బద్ధుడు కావాలి' అని బరోడిన్ గుర్తు చేసాడు. ఏది క్రమశిక్షణ ? హేతుబద్ధమయిన మానవస్వేచ్ఛను, వ్యక్తిగత భావాలను కుదించగల 'క్రమశిక్షణ' గమ్యస్థానమేది ? రానురాను యీ 'క్రమశిక్షణ' పేరుతోనే కమ్యూనిజంలో నిరంకుశత్వం, నియంతృత్వ విషబీజాలు అంకురించినవి; మానవస్వేచ్ఛ మంట గలిసినది.

రాయ్ మానసిక వ్యథను బరోడిన్ పసిగట్ట గలిగాడు. కేవలం 'తమాషాకు' అన్నట్లు తప్పుకొనటానికి ప్రయత్నించాడు. అయితే బరోడిన్ సామాన్యుడు కాదు. అసాధారణ వ్యక్తి; మేధావి. రాయ్ జీవితాన్ని, భవిష్యత్తును మార్చగల మరొక అస్త్రం ప్రయోగించాడు.

"మాస్కో ఇండియా మార్గంలో వున్నది. అక్కడ విప్లవం మీరాకకు ఎదురు చూస్తూ వున్నది."

అవును, రాయ్ మాతృదేశం చేరవలసిన అవసరం గుర్తించాడు. టెర్రరిస్టుగా మొదట తనకున్న భావాలకు, ప్రస్తుత భావాలకు హస్తిమశకాంతరం వున్నది. కేవలం కొలదిమంది వ్యక్తులతో నామమాత్రపు ఆయుధసామగ్రితో బాగా స్థిరపడిన ఏ ప్రభుత్వాన్నయినా కూలద్రోయటం అసాధ్యం, అసంభవం కూడాను. ఇప్పుడు మరో మార్గం కనబడుచున్నది. ఈ మార్గంలో భారతదేశంలో విప్లవం జయప్రదం కాగలదనే విశ్వాసం రాయ్‌కి కలిగినది. విప్లవం సాధించిన ఒక దేశం మరొక దేశంలో విప్లవం నెగ్గటానికి విధిగా తోడ్పడుతుంది. మొదట తాను భావించిన భారత ఈశాన్య సరిహద్దులకు మారుగా ఇప్పుడు వాయువ్య సరిహద్దులు భారతదేశంతో ప్రవేశించటానికి సరియైన మార్గంగా భావించాడు. సోవియట్ రష్యా ప్రయాణానికి సిద్ధపడ్డాడు.

వెంటనే బయలుదేరి రావాలని బరోడిన్‌కు రష్యా నుంచి పిలుపువచ్చినది. ఆయన బహిరంగంగా ప్రయాణించటానికి వీల్లేదు. రోగగ్రస్తుడయినట్లు రోజూ డాక్టరు వచ్చి వెళ్లుచున్నాడు. ప్రభుత్వ సహకారంతో, ఫోర్జరీ ప్యాసుపోర్టుతో బరోడిన్ రహస్యంగా నార్వే నౌకలో ప్రయాణానికి యేర్పాటులు జరిగినవి. రహస్యంగా రాయ్ బరోడిన్‌ను నౌక దగ్గరకు చేర్చాడు. తరువాత రాయ్ ప్రయాణం. స్పెయినులో ఇద్దరూ కలుసుకొనే యేర్పాట్లు చేసుకొన్నారు.

ఇక రాయ్ ప్రయాణం చేయవలసి వున్నది. మెక్సికో నుంచి బయలుదేరే ప్రతినౌక అమెరికా రేవుల్లో ఆగి వెళ్లవలసి వుంటుంది. రాయ్ అమెరికా వెళ్లటం ప్రమాదం. రాయ్ మీద అమెరికను ప్రభుత్వ వారంటు వుండటం చేత ఆ పోలీసుల నిఘా వుండి తీరుతుంది. పశ్చిమ, మధ్య ఐరోపాఖండ ప్రాంతమంతా మిత్ర రాజ్యాల అధీనంలో వున్నది. రష్యా చుట్టూ మిత్రదేశాల నౌకల దిగ్బంధం కట్టు దిట్టం చేయబడ్డది. ఇన్ని ప్రమాదాలను అధిగమించి రాయ్ ప్రయాణం చేయవలసి వున్నది.

1919 నవంబరులో మెక్సికోలోని వేరాక రేవు (వేరాక్రూజ్) నుంచి స్పెయినుకు సంబంధించిన నౌక బయలుదేరటానికి సిద్ధంగా వున్నది. అందులో మెక్సికో విదేశాంగశాఖామాత్యులు మారుపేరుతో రాయ్‌కి రాయబార కార్యా లయోద్యోగి స్థానంలో ప్యాసుపోర్టు యిచ్చి ప్రయాణానికి కావలసిన యేర్పాట్లు చేసాడు. ముందుగా రాయ్ రెండువారాలు అంతర్థానమయి తరువాత రహస్యంగా ఆ నౌకలో ప్రయాణం చేయవలసి వున్నది. అందుకు తగిన యేర్పాట్లు చేసుకొని రాయ్ వీడ్కోలు చెప్పటానికి మర్యాద సూచకంగా ప్రశిడెంటు కరంజాను కలుసు కొన్నాడు. రాయ్‌కి వీడ్కోలివ్వటం ప్రశిడెంటు కరంజా తన కుడిచేతిని పోగొట్టు కొన్నట్లుగానే భావించాడు. తనకు తన భవిష్యత్తు అంధకారంగా కనబడినది. అయినా మనసు కుదుటబరచుకొని "మీరు యింకా యౌవనదశలోనే వున్నారు. విధితో చెలగాటం ఆడవద్దు. ఇంకా చాల కాలం విజయవంతంగా జీవించాలని నా హృదయపూర్వక అభినందనలు" అని రాయ్ భుజం తట్టి ఆశీర్వదించాడు. రాయ్ కూడా వీడ్కోలులో అంతకంటె మిక్కుటంగానే వ్యధతో కలత చెందాడు. కాని ఇంతకంటె ఎక్కువ బాధ్యత నిర్వహించటానికి బయలుదేరుచున్నాననే అచంచల విశ్వాసం రాయ్‌లో నిలచిపోయినది.

# ఐరోపా యాత్ర:

అనుకున్న ప్రకారం 1919 నవంబరులో స్పానిష్‌నౌకలో రాయ్ రష్యా ప్రయాణానికి కాలు పెట్టాడు. నాలుగు సంవత్సరాలక్రితం రాయ్ మాతృదేశాన్ని వదలి పసిఫిక్ మహాసముద్రం దాటి నూతన ప్రపంచం చేరాడు. ఆనాటి రాయ్

ప్రయాణం నిరాశాజనకం, నిస్పృహలతో కూడియున్నది. తన గమ్యస్థానం తనకే తెలియదు. పాండుచేరి నుంచి బయలుదేరిన కాథలిక్కులు మత ప్రచారకునిగా మారువేషంలో ఒక బైబిలు గ్రంథం చేబూని ప్రయాణం సాగించాడు. ఈ నాలుగు సంవత్సరాలు రాయ్‌కి నాలుగువందల సంవత్సరాల అనుభవాన్ని గడింప చేసినది. ఈసారి మరొక మారుపేరుతో మెక్సికో ప్రభుత్వ రాయబారి హోదాలో అట్లాంటిక్ మహాసముద్రం మీదుగా ఐరోపా ఖండానికి ప్రయాణం సాగించాడు. ఈ పర్యాయం నూతన భావాలతోనూ. తన కార్యక్రమంలో కార్యాచరణ నిమగ్నుడై మరో ప్రపంచానికి బయలుదేరాడు. నూతన సమాజ నిర్మాణంలో భాగస్వామి కాబోవు చున్నాననే ఉత్సుకత రాయ్‌లో నిండి నిబిడీకృత మైనది.

నౌకా ప్రయాణానికి ముందు రాయ్ రక్షణకు తగు చర్యలన్నీ సమకూర్చ బడినవి. రౌలట్ చట్టంద్వారా రాయ్‌ని అరెస్టు చేయటానికి బ్రిటిషు ప్రభుత్వం వారంటును ప్రకటించినది. బెయిలుమీద అమెరికా ప్రభుత్వం కళ్లుగప్పి మెక్సికో చేరి అచ్చట సోషలిస్టు పార్టీని స్థాపించి ఆ ప్రభుత్వానికి అండగా వుండటం అమెరికాకు తెలుసును కనుక ఈ రెండు సామ్రాజ్య ప్రభుత్వాల కబంధ హస్తాలను తప్పుకొని రాయ్ స్పెయినుదేశం చేరాలి. అది అంతతేలికయిన విషయం కాదు. నౌకాధిపతిని మెక్సికన్ ప్రభుత్వం 'రాయ్‌ని చాల జాగ్రత్తగా తీసుకొని వెళ్లాలి సుమా !' అని ఒకటికి నాలుగుసార్లు మరీమరీ హెచ్చరించి పంపినది.

నౌక క్యూబా పట్టణమయిన హవానా రేవు చేరినది. రేవు కార్మికులు సమ్మెలో వున్నారు. రేవులో చేరిన పడవలన్నీ తిరిగి బయలుదేరటానికి వీలులేని పరిస్థితులు కూడా కలుగచేసారు. క్యూబా అమెరికా ప్రభుత్వ రక్షణ క్రింద వున్నది. యుద్ధం ముగిసినా అమెరికను అధికారులు ఆ రేవుకు వచ్చే ప్రతినౌకను తనిఖీ చేయటం మానలేదు. సమ్మె ఎంతకాలం సాగుతుందో తెలియదు. రాయ్ సంకట పరిస్థితుల్లో పడ్డాడు. నౌకలో వుండటానికి వీలులేదు. బయటకు వెళ్లటానికి అంత కంటె వీలుకాని పరిస్థితి. రాయ్‌ని ఎలా దాచిపెట్టాలో కెప్టెనుకు తెలియక అయోమయ స్థితిలో పడ్డాడు.

డాక్ వర్కర్సు యూనియన్ నాయకు డెవరో రాయ్ వాకబుచేసి తెలుసు కున్నాడు. అదృష్టవశాత్తు అతడు రాయ్‌కి పరిచయస్థుడు. అనేకసార్లు అతడు మెక్సికో కూడా రావటం రాయ్ ఎరుగును. నెమ్మదిగా రాయ్ రేవు దగ్గర పికెటింగు

చేస్తున్న కార్మికులతో సంభాషణకు దిగి తన సానుభూతిని ప్రకటించాడు. రేపులోని ఒక నౌకలో వర్కర్సు యూనియన్ నాయకుని ఆప్తమిత్రుడు చిక్కుకున్నట్లు రహస్యంగా ఒక ఉపనాయకునితో చెప్పాడు. నాయకుని కీ విషయం అందజేయ బడినది. ఆతడు సరాసరి నౌక లోనికి ప్రవేశించి రాయ్‌ని గుర్తించి "మెక్సికో కామ్రేడ్సు నా కీ విషయం ముందుగా ఎందుకు తెలియ చేయలేదు" అని విచారం ప్రకటించాడు. రాయ్ తాను అత్యవసర కార్యం మీద వెంటనే ఐరోపాఖండం చేరవలసి వున్నదని ఆ నాయకుని హెచ్చరించాడు.

"ఫరవాలేదు. మీ కేమీ భయంలేదు. ఈ అమెరికను సామ్రాజ్యవాదులు మననేమీ చేయలేరు. తెల్లవారక మునుపే మీ నౌకను రేవు బయటకు పంపుతా"నని చెప్పి వెళ్లటం, ప్రయాణీకుల నౌకను ఆపటం తమ అభిమతం కాదని రేవు కార్మికులు ఆ నౌకను వెంటనే బయటకు పంపటం జరిగినది. అకస్మాత్తుగా యిలా జరగటం నౌకలోని ప్రయాణీకులకు, ఆశ్చర్యాన్ని కలిగించినది. కెప్టెనుకు వినా యీ రహస్యం యితరుల కెవరికీ తెలియదు. వెంటనే రేవు అధికారులకు తన నౌకకు సంబంధించిన పత్రాలు చూపి అనుమతి పొంది ప్రయాణం సాగించాడు.

మెక్సికోలో ఒక జర్మను స్కూలు హెడ్‌మాష్టరుగా పనిచేస్తున్న వ్యక్తి నౌకలో ప్రయాణం చేస్తున్నాడు. ఈ రహస్యాన్ని ఎలాగో పసికట్టకలిగి రాయ్ చేసిన సహాయానికి తన అభివందనలు ప్రకటించాడు. నౌక స్పెయిను దేశం చేరటానికి ఒక వారం రోజులు పట్టినది. ఈ వారం రోజులు రాయ్, ఆ హెడ్ మాస్టరు, అదే నౌకలో ప్రయాణం చేస్తున్న మెక్సికన్ రాయబార కార్యాలయ దంపతులతో కులాసా కబుర్లతో కాలం గడిపి నిరపాయంగా ఐరోపా ఖండం చేరాడు. స్పెయినులో ముందుగా వచ్చే ఒక చిన్న రేవులో రాయ్ దిగి అక్కడ నుంచి రాజధాని నగరం మాడ్రిడ్ రైలులో ప్రయాణం చేసాడు.

మెక్సికోలో వుండగానే రాయ్ మాడ్రిడ్ సోషలిస్టు పార్టీతో సంబంధాలు యేర్పరచు కున్నాడు. అచ్చటనుంచి కొంతమందిని రష్యా కమ్యూనిస్టు మహాసభకు ప్రతినిధులుగా తీసుకొని వెళ్లాలని రాయ్ అభిమతం. ముందుగా పార్టీ నాయకుడు ఇన్లీషియాస్‌ను కలుసుకొన్నాడు. ఆతడు సిద్ధాంతరీత్యా సోషల్ డెమోక్రాట్ కావటంచేత రష్యను విప్లవాన్ని విమర్శిస్తూ నిరసనభావం చూపించాడు. తరువాత

పార్టీలోని కొంతమంది తీవ్రవాదులను కలుసుకొని రష్యాకు ప్రతినిధి వర్గాన్ని పంపే యేర్పాటుచేసి బెర్లిన్ ప్రయాణానికి సిద్ధపడ్డాడు.

ఈ మధ్యలో మరొక వింతసంఘటన జరిగినది. మాడ్రిడ్ నగరాన్ని సందర్శిస్తూ రాయ్ ఒకచోట నాజూకయిన చేతికర్రనుకొని టాక్సీలో తాను బసచేసిన హోటలుకువచ్చి బాడుగ యివ్వటానికి జేబులో చేయిపెట్టగా మనీపర్సు కనబడ లేదు. అందులో తాను మెక్సికోనుంచి తెచ్చిన దాదాపు రెండువేల డాలర్లు, అవసర మయితే బ్యాంకుద్వారా మార్చుకొనటానికి (letter of credit) యల్. సి. తన ప్యాస్‌పోర్టు వున్నవి. రాయ్ నిస్తబ్ధు డయ్యాడు. సొమ్ము పోగొట్టుకొనినా స్పెయినులో తన మిత్రులద్వారా ముందుకు ప్రయాణం సాగించవచ్చును. కాని ప్యాస్‌పోర్టు లేనిదే ముందుకు ఒక అడుగు వేయటానికి వీలులేదు. చివరకు యేమి తోచక అదే టాక్సీలో తాను చేతికర్రను కొన్న షాపుకు వెళ్ళాడు. ఆ షాపు యజమాని రాయ్‌కి మనీపర్సు అందజేస్తూ తనకు రాయ్ కృతజ్ఞతలు తెలుపుకొంటా డనే భావనలో వుండగా రాయ్ తన అజాగ్రత్తకు తాను సిగ్గుపడి పర్సులో ప్యాస్ పోర్టు వున్నదీ, లేనిదీ చూచుకొని మెదలకుండా బయటకు నడవటం ఆ యజమానికి తీవ్ర కోపాన్ని కలిగించినది. పైగా 'స్పానిష్‌వారు దొంగలుకాదు' అని అతడు ఎత్తిపొడవటంతో రాయ్ వెంటనే యజమానికి క్షమాపణ చెప్పుకొని తన కృతజ్ఞత వెల్లడించటం జరిగినది.

తరువాత రాయ్ ఆమరునాడే బెర్లిను చేరుకున్నాడు. నాలుగు సంవత్సరాల క్రితం ఆయుధసహాయం కొరకు బెర్లిను ప్రయాణం కట్టిన రాయ్ ఇప్పుడు ఆ ప్రయత్నంతో రాలేదు. ఆ కార్యక్రమం ఎప్పుడో విరమించుకున్నాడు. అప్పుడు తాను కలలు గని వూహించుకొనిన బెర్లిను పట్టణం యిప్పుడు స్మశానవాటికగా మారినది. బ్రిటిషు సామ్రాజ్య దేశాన్ని ఉగ్రూతలూగించిన కెయిజరు ప్రభుత్వం యీనాడు నామరూపాలు లేకుండా నశించిపోయినది. కెయిజరు ప్రాణాలు గుప్పిట బట్టి పారిపోయి హాలండులో తలదాచుకుంటున్నాడు. జర్మనీదేశ ఆర్థిక వ్యవస్థ తలక్రిందులయినది. వర్సైల్సు సంధితో జర్మనీ నిస్సైనికమండలం అయినది. యుద్ధంలో గాయపడిన సైనికులు కాళ్లు విరిగి, చేతులు పోగొట్టుకొని బజార్లలో బిచ్చగాండ్ర జీవితం గడుపుచున్నారు. మరొకవంక మిత్రరాజ్యాల సైనికులు బెర్లిన్ నగరంలో వీరవిహారం చేస్తూ కవాతు త్రొక్కుతున్నారు.

సోషల్ డెమాక్రాటిక్ పార్టీ అధికారం చేపట్టినది. దేశంలో శాంతి భద్రతలు లోపించినవి. తీవ్రవాదులు సోవియటు రష్యా ఆదర్శంగా విప్లవ వుద్యమం లేవదీసారు. పారిశ్రామిక కేంద్రాలు సమ్మెలతో స్తంభించి పోయినవి. అంతర్యుద్ధం చెలరేగినది. ప్రభుత్వం సైనిక సహాయంతో తీవ్రవాదులను క్రూరంగా హింసించ సాగినది. రోజా లగ్జంబర్గు, లెబ్‌నెట్ మొదలయిన ప్రముఖ విప్లవ నాయకులు చిత్రవధలకు గురిఅయ్యారు. కమ్యూనిస్టు విప్లవం పూర్తిగా సమాధి చేయబడినది. ఆ సమాధిశకలాల నుండియే నేషనల్ సోషలిజానికి (నాజీయిజం) అంకురార్పణ జరిగినది.

కారల్ మార్క్స్ సిద్ధాంతం ప్రకారం కాపిటలిజానికి ప్రథమ దేశమయిన ఇంగ్లండులోనో లేక పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన జర్మనీలోనో ముందుగా 'ప్రోలిటేరియన్ విప్లవం' రావలసి యున్నది. మార్క్సిజం ప్రకారం ఆర్థిక విధానాన్ని బట్టి చరిత్రాత్మకంగా సమాజంలో జరుగవలసిన మార్పు యిది. కాని పెట్టుబడిదారీ విధానం పెరుగని, పారిశ్రామికంగా అభివృద్ధి చెందని, 'ప్రోలిటేరియన్' కార్మికవర్గం బలపడని రష్యా దేశంలో 'ప్రోలిటేరియన్ విప్లవం' జయప్రదం కావటం రాజకీయంగా చైతన్యం కలిగిన జర్మనీ శ్రామికవర్గం విప్లవాన్ని జయప్రదం చేయలేకపోగా సర్వనాశనానికి గురి కావటంతో చరిత్రగతిని పునఃపరిశీలన చేయవలసిన అవసరం కలిగినది.

కారల్ మార్క్స్ ఫ్రెంచి విప్లవాన్ని ఆదర్శంగా తీసికొని అప్పటి పరిస్థితుల కనుగుణంగా సమాజాన్ని అర్థం చేసుకొని విప్లవ కార్యక్రమం యావొందించాడు. అప్పటి ప్రభుత్వాలు సైనికంగా బలవత్తరమయినవి కావు. రష్యా ప్రభుత్వం కూడా దాదాపు అదే స్థితిలో వుండటంచేత మైనారిటీలో వున్నా లెనిన్ తన శక్తిసామర్థ్యాలతో విప్లవం సాధించగలిగాడు. జర్మనీ పరిస్థితులు వేరు. ప్రోలిటేరియన్ వర్గం వున్నది. కాని అంతకంటె కట్టుదిట్టమయిన, బలవత్తరమయిన సైనికబలం ప్రతిగా వుండటంచేత విప్లవం పరాజయాన్ని పొందక తప్పలేదు. ఒకచోట పరిస్థితులకు మించిన మేధాసంపత్తిగల నాయకత్వం వున్నది. రెండవచోట పరిస్థితులు అనుకూలంగా వున్నా అట్టి నాయకత్వం లోపించినది. ఉద్యమం లేవనెత్తటం తేలిక. కాని ఆ వుద్యమం పరాకాష్ఠకు చేరినప్పుడు వున్న ప్రభుత్వాన్ని కూలద్రోసి ప్రత్యామ్నాయ ప్రభుత్వాన్ని నెలకొల్పటానికి తగిన

స్తోమతు గల పార్టీ యంత్రాంగం, నాయకత్వం సిద్ధంగా వుండాలి. జర్మనీలో సమ్మెలు సాగినవి. అంతర్యుద్ధం చెలరేగినది. కాని తగిన నాయకత్వం లోపించినది. విప్లవ పరాజయానికి ప్రధాన కారణం యిదే. దీనికితోడు ప్రభుత్వ సైనికశక్తి దమననీతికి, అమానుషకాండకు, క్రూరహింసకు 'ప్రోలిటేరియన్' శ్రామికవర్గం బదాబదలై సమ్మెలు విఫలమయినవి. అంతర్యుద్ధం అణగారిపోయినది.

# సార్వత్రిక సమ్మె :

బరోడిన్ మెక్సికోనుంచి బయలుదేరేముందు రాయ్‌తో బెర్లినులో ఒక హోటలు పేరుచెప్పి అందులో మకాంచేసి ఒక డాక్టరు ఎడ్వర్టుప్యూక్ ద్వారా తన వునికిని తెలుసుకొన వచ్చునని చెప్పాడు. అలాగే రాయ్ అదే హోటలులో బసచేసి ఆ డాక్టరును కలుసుకొనటానికి ప్రయత్నించాడు. ఆ డాక్టరు సాంఘిక ఆచారాలను గురించి ఒక బృహత్ గ్రంథం రచించి జర్మనీలో పేరు, ప్రఖ్యాతులు గడించిన వ్యక్తి. ఆ గ్రంథంలేని జర్మనీ లైబ్రరీ లేదనే చెప్పవచ్చును. స్త్రీజాతి ఆగ్రంథాన్ని పఠించ కూడదనే నిషేధం వున్నది. అయినా సంపన్న గృహిణులు అనేకమంది రహస్యంగా ఆ గ్రంథ పఠనం చేస్తూవుండేవారు. ఆ డాక్టరుకు రోజా లగ్జంబర్గ, తదితర జర్మను కమ్యూనిస్టు మేధావులతో బాగా పరిచయ మున్నది.

రాయ్‌కి ఆ డాక్టరును కలుసుకొనే అవకాశం లభించలేదు. రాయ్ బెర్లిను వస్తే ఫలానా హోటలులో వుండగలడని బరోడిన్‌కు తెలుసు. కాని ఫలానాతేదీకి రాగలడనే విషయం బరోడిన్‌కు తెలియదు. బరోడిన్ ఎక్కడ వుంటాడో రాయ్‌కి తెలియదు. కనుక వారిద్దరూ కలుసుకునే అవకాశం అసలే లేకపోయినది. కమ్యూనిస్టులను గురించి యితరులను అడిగి తెలుసుకొనే సమయం కాదది. గూఢచారుల నిఘా సర్వత్రా వ్యాపించివున్నది. కనుక రాయ్ కొన్ని రోజులు అక్కడే వుండి బరోడిన్ ఆగమనం కొరకు నిరీక్షించసాగాడు. మధ్య అప్పుడప్పుడూ డాక్టరు ప్యూక్‌ను గురించి వాకబు చేస్తూనే వున్నాడు. ఆయన తన నివాస గృహంలోగాని, విశ్వవిద్యాలయంలోగాని, పబ్లిక్ లైబ్రరీలోగాని వున్నట్లు సమాచారం అందలేదు.

సమాచారం కొరకు ఎదురుచూస్తూనే రాయ్ ఒకనాడు తన దగ్గరవున్న చెక్కును యిచ్చి సొమ్ము తీసుకొనటానికి బ్యాంకుకు వెళ్ళాడు. బ్యాంకు యజమాని సోషల్ డెమోక్రాట్, కమ్యూనిస్టు సానుభూతిపరుడు కావటంచేత అతనితో రాయ్‌కి యాదృచ్ఛికంగా స్నేహం కుదిరినది. రోజూ సాయంత్రం వివిధ వర్గాలకు చెందిన సోషల్‌డెమోక్రాట్సు, కమ్యూనిస్టులు, ఇండిపెండెంట్సు ఆ బ్యాంకి యజమాని యింట్లోచేరి జర్మను రాజకీయాలను గురించి స్వేచ్ఛగా, మనసిచ్చి తర్కించుకొనటం పరిపాటిగా వుండేది. అందులో అప్పుడప్పుడు రాయ్‌కూడా పాల్గొంటూ వుండేవాడు. తరువాత రాయ్ డాక్టరు ఫ్యూక్‌ను కలుసుకొన గలిగాడు. ఆయన ద్వారా బరోడిన్‌ను కూడా కలుసుకొన్నాడు. రాయ్ కొరకే అక్కడ ఆగాడు. బరోడిన్ ద్వారా రాయ్ బెర్లినులోని అనేకమంది కమ్యూనిస్టులతో పరిచయం యేర్పరచుకో గలిగాడు. ఒకనాడు రాయ్ తన హోటలు బాల్కనీమీద నిలబడి వుండగా మరతుపాకులతో సైన్యం నగరం ప్రవేశించటం గమనించాడు. అప్పటికప్పుడే ఆ సైన్యం కీలక స్థానాలను ఆక్రమించటం, 'వీమరు రిపబ్లిక్' ప్రెశిడెంటు ఎబర్టు తన మంత్రివర్గ సభ్యులతో పలాయనం చిత్తగించటం నిముషాలమీద జరిగిపోయినది.

మరునాడే సైనిక ఆధిపత్యానికి వ్యతిరేకంగా జర్మను లేబరు ఫెడరేషను నాయకుడు కారల్ లీజియన్ సార్వత్రిక సమ్మెకు పిలుపు యిచ్చాడు. కమ్యూనిస్టుల రహస్య సమావేశం జరిగినది. అందులో రాయ్‌కూడా పాల్గొన్నాడు. అంతకు మునుపు కమ్యూనిస్టులు కారల్ లీజియన్‌ని విప్లవ వ్యతిరేకిగా విమర్శిస్తూ వుండేవారు. అట్టి వానితో ఎలా చేతులు కలపటం అనే మీమాంస వచ్చినది. చివరకు స్వతంత్ర సోషలిస్టు పార్టీ నాయకులతో కూడా రహస్య సమాలోచనలు జరిపి కారల్ లీజియన్ పిలుపుకు సహకార మివ్వటం జరిగినది. నాలుగు రోజులు బెర్లిన్ నగరం బంద్. దుకాణాలు మూసివేయపడ్డవి. పారిశ్రామిక కేంద్రాలు పనిచేయలేదు. రవాణా సౌకర్యాలన్నీ నిలిపివేయబడ్డవి. పగలు నగరవీధులలో జనసంచారం ఆగిపోయినది. రాత్రిళ్ళు విద్యుత్ సహాయం లేక నగరమంతా గాఢాంధకారంతో మునిగిపోయినది. ఐదవరోజున సైనిక పటాలాలు వచ్చిన త్రోవనే తిరిగి నిశ్శబ్దంగా వెళ్లటం రాయ్ గమనిస్తూనే వున్నాడు.

కార్మికశక్తి బలవత్తరమయిన సైనికశక్తిని తిరోగమింప చేయటం నిజంగా గర్వింపదగిన విషయం. కాని ఆ సంఘటితశక్తి అట్టే కాలం నిలబడలేక

పోయినది. కారల్ లీజియన్ పీమరు రిపబ్లికులోని కొందరు మంత్రులను తొల గించాలని పట్టుబట్టాడు. ఇందుకు సోషలిస్టులు, కమ్యూనిస్టులు మద్దతు యిచ్చి వున్నట్లయితే జర్మనీదేశ చరిత్ర, ఐరోపాఖండ చరిత్ర మరొక విధంగా వుండి వుండేది. కాని అందుకు వారు సహకరించక పోవటంతో, కార్మికవర్గ సంఘాలలో భేదాభిప్రాయాలు పెరుగటంతో పీమరు ప్రభుత్వం పతనమై నాజీపార్టీ అధికారం చేపట్టటానికి సుగమమార్గ మేర్పడినది.

కెయిజరు ప్రభుత్వంలో 111 మంది సోషలిస్టులు పార్లమెంటు సభ్యులుగా వుండేవారు. సోషల్ డెమోక్రాటిక్ పార్టీ జర్మనీలో బలవత్తరమయిన ప్రతి పక్షంగా వుండి రెండవ ఇంటర్నేషనల్‌కు నాయకత్వం వహించినది. కాని పార్టీ నాయకత్వంలో తగిన మేధాసంపత్తి లోపించటం చేత ప్రథమ ప్రపంచయుద్ధంలో సోషల్ డెమోక్రాటిక్ పార్టీలు తమ తమ దేశాల ప్రభుత్వాలను బలపరచటంతో రెండవ ఇంటర్నేషనల్ చిన్నాభిన్నమయినది. దీని ఫలితంగా రష్యా విప్లవానంతరం మూడవ కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ స్థాపనకు అవసర మేర్పడినది.

లెనిన్ యీ సమయంలో జోక్యం కలిగించుకొని 'జాతీయతత్వానికి సోషలిస్టు పూతలు పూయటం' నిశితంగా విమర్శించాడు. మితవాది అయిన విలియమ్ పీక్‌ను తొలగించి ఎర్నెస్టు మేయరు, ఆగస్టు థాల్‌హిమిర్ జర్మను కమ్యూనిస్టు పార్టీ నాయకులుగా ఎన్నుకొనబడ్డారు. నేషనల్ బోల్షివిక్కులు పార్టీ నుంచి బహిష్కరింపబడ్డారు.

# బెర్లిను విప్లవ కమిటీ :

రాయ్ బెర్లినులోవున్న కొద్దికాలంలోనే అచ్చటి సోషలిస్టు, కమ్యూనిస్టు ప్రముఖ నాయకులతో బాగాపరిచయం యేర్పరచుకో గలిగాడు. ఆగస్టు థాల్‌హిమిర్, బ్రాన్‌ప్లర్, విలియమ్ పీక్, ఎర్నెస్టు మేయర్ మొదలైనవారు జర్మనీ కమ్యూనిస్టు పార్టీలో ప్రముఖస్థానం అలంకరించటమే కాకుండా థర్డు ఇంటర్నేషనల్‌లో కూడా పలుకుబడి గల వ్యక్తులు. వీరితో సన్నిహిత సంబంధం కలిగి వారి రహస్య సమావేశాలకు కూడా రాయ్ హాజరు కాగలిగాడు.

భారతదేశంలోని సహాయ నిరాకరణోద్యమం గురించి అడపాదడపా జర్మనీ పత్రికల్లో వార్తలు వస్తూవుండేవి. వాటిని గురించి, భారతదేశ పరిస్థితులను గురించి వారు రాయ్‌ని గుచ్చిగుచ్చి అడుగుతూ వుండేవారు. యదార్థంగా అప్పటి భారతదేశ పరిస్థితులు రాయ్‌కి ఖచ్చితంగా తెలియవు. జర్మనీదేశ పరిస్థితులను గురించి తెలుసుకొనటానికి రాయ్ ఆతురత చూపినప్పుడు, రెండుదేశాల పరిస్థితులలో భేదం వుందని చెప్పినప్పుడు వారికి కొంత ఆశ్చర్యం కలిగినది.

రాయ్ అక్కడ వున్నప్పుడే మధ్య జర్మనీ ప్రాంతంలో సోషల్ డెమోక్రాటిక్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా గెరిల్లా యుద్ధం జరుగుతున్నది. ఆ యుద్ధ నాయకుడయిన మాక్సుహోజ్‌ని కలుసుకొని గెరిల్లా యుద్ధతంత్రాన్ని తెలుసుకొనాలనే ఆసక్తితో ఆ ప్రాంతానికి వెళ్ళివచ్చాడు. డచ్ కమ్యూనిస్టు నాయకులతో పరిచయం కలిగినది. డచ్ వలస రాజ్యమయిన ఇండోనేషియా విద్యార్థులు హాలండులో విద్యాభ్యాసం చేస్తూవుండేవారు. డచ్ కమ్యూనిస్టుల ద్వారా వారితో పరిచయం యేర్పరచుకున్నాడు. తరువాత మాస్కోలో వున్నప్పుడు రాయ్ ప్రత్యేకించి వారి కొరకు డచ్ కమ్యూనిస్టుల ఆహ్వానంమీద హాలండులో రాజకీయ పాఠశాల పెట్టి మార్క్సు, కమ్యూనిస్టు సిద్ధాంతాలు బోధించి వలసరాజ్యంలో కమ్యూనిస్టు పార్టీ అవసరాన్ని గురించి, కార్యాచరణ గురించి ఉపన్యాసాలు యిచ్చాడు.

బెర్లిన్‌లో వుండగానే రాయ్ భారత విప్లవ కమిటీ సభ్యులను గురించి కూడా కొంత సమాచారం తెలుసుకొన గలిగాడు. ఇప్పుడు రాయ్ ఆయుధ సహాయము కొరకు బెర్లిను రాలేదు. కాని ప్రస్తుతం ఆ కమిటీ ఏపరిస్థితుల్లో వున్నదో, సభ్యులెవరో, యేమిచేస్తున్నారో తెలుసుకొనటానికి ప్రయత్నించాడు. ఆ కమిటీలోని సభ్యులలో హరదయాల్, వీరేంద్రనాథ్ చటోపాధ్యాయ, భూపేంద్రనాథ్ దత్తు, మరికొందరిని మినహాయిస్తే తక్కినవారెవరూ ఎప్పుడూ యే విప్లవ కార్యక్రమంలో పాల్గొన్నట్లు కనబడలేదు. జర్మనీ ప్రభుత్వం యీ కమిటీని నామమాత్రంగా యేర్పరచి కొంత ధనం యిచ్చి బ్రిటిషు వ్యతిరేక ప్రచారానికి వుపయోగించు కొన్నట్లు కనబడినది.

వీరేంద్రనాథ్ చటోపాధ్యాయ సరోజినీదేవి సోదరుడు. ఇంగ్లండులో విద్యార్థిగా వుండి టెర్రరిస్టు ముఠాలో సభ్యునిగా వుండేవాడు. ఇందులో వినాయక దామోదర సావర్కారు కూడా సభ్యుడు. కర్జనువైలీ హత్య సందర్భంలో

సావర్కారును అరెస్టుచేసి భారతదేశం తీసుకొని రావటంతో వీరేంద్ర రహస్యంగా ఫ్రాన్సుచేరి యుద్ధం రాగానే జర్మనీచేరి మరికొందరిన్ని కలుపుకొని బ్రిటిషు వ్యతిరేక ప్రచారం ప్రారంభించాడు. జర్మనీలో చదువుచున్న భారత విద్యార్థులను ఆప్రభుత్వం నిర్బంధంలోనికి తీసుకొనే తలంపుతో వుండగా వీరేంద్ర వారు బ్రిటిషు వ్యతిరేక ప్రచారానికి సహకరిస్తే ప్రభుత్వ బారినుండి బయట పడగలరని, పైగా శ్రమ లేకుండా డాక్టరేట్ డిగ్రీలు పొందగలరని సలహా యివ్వటంతో 'ఇండియన్ రివ ల్యూషనరీ కమిటీ' యేర్పడి ఒక మహమ్మదీయ డాక్టరు మహమ్మద్ మాన్సూర్‌ని అధ్యక్షునిగా ఎన్నుకొనటం జరిగినది. టర్కీ జర్మనీతో చేతులు కలపటంచేత మహమ్మదీయున కాస్థానం యివ్వబడినది. పైగా ఈతని భార్య జర్మను జాతీయురాలు.

యుద్ధకాలంలో డాక్టరు మాన్సూర్ కొంతకాలం టర్కీలో వున్నాడు. అమెరికానుంచి, ఐరోపా ఖండంలోని యితర దేశాలనుంచి మరికొంతమంది భారతీయులు జర్మనీవచ్చి యీ కమిటీలో చేరటంతో మాన్సూర్ పలుకుబడి తగ్గినది. తరువాత భార్యతో కలిసి మాస్కో వెళ్ళి కమ్యూనిస్టునని చెప్పుకొనినా మాన్సూర్ మొర ఆలకించినవారు లేరు. కాగా అనుమానంతో నిర్బంధింప బడ్డాడు. అప్పుడు రాయ్ మాస్కోలో వున్నాడు. మాన్సూర్‌భార్య తన భర్తను విడిపించుకొనటానికి రాయ్‌ని అర్థించినది. దేశద్రోహ కార్యకలాపాల్లో జోక్యం వున్నట్లు నేరం మోపబడిన వ్యక్తిని విడుదల చేయించటానికి లెనిన్ కూడా జోక్యం కలిగించుకోజాలని అధికారాలు గల గూఢచారి సంస్థ వుండేది. రాయ్ తీవ్ర ప్రయత్నంచేసి మాన్సూర్‌ను విడుదల చేయించాడు. చివరకు రాయ్‌ని కలుసుకొననివ్వ కుండానే ఆదేశం నుంచి బయటకు పంపటం జరిగినా 1930 వరకు మాన్సూర్ జర్మనీలో వున్నాడు. కనీసం ఒకసారి అయినా రాయ్‌ని అక్కడ కలుసుకొని తన ప్రాణాలు కాపాడి నందులకు తన కృతజ్ఞత ప్రకటించలేదు.

1930 డిశంబరులో రాయ్ భారతదేశం రహస్యంగా ప్రవేశించి 1931 జులైలో నిర్బంధింపబడి కాన్పూరు జైలులో వుంచగా విచారణ ప్రారంభమయినది. ప్రాసిక్యూషన్ సాక్షిగా డాక్టరు మాన్సూర్ కోర్టుకు హాజరయ్యాడు. అంతకు కొన్ని నెలలముందే అతడు ఇండియాకు రావటం, ప్రభుత్వం అలీఘర్ విశ్వవిద్యాలయంలో ఆచార్యునిగా ఉద్యోగం పొందటంజరిగినది. రాయ్ ఎవరో ఎలావుంటాడో అంతకు

ముందెన్నడూ చూడనుకూడాలేదు. "యమ్. యన్. రాయ్ ఇతడే. మాస్కోలో కలుసుకొన్నాను" అని సాక్ష్యం చెప్పాడు. కృతఘ్నుడు.

1915 లో జర్మనీ ఆఫ్ఘనిస్థాన్‌లో ఒక స్వతంత్ర భారత తాత్కాలిక ప్రభుత్వాన్ని యేర్పాటు చేయాలనే సంకల్పంలో వున్నది. ఆ దేశాన్ని బ్రిటిష పలుకుబడి నుంచి వేరు చేయాలని జర్మనీ సంకల్పం. అందుకు ఒక రాజవంశీకుడు అవసరమయ్యాడు. యుద్ధానికి ముందు ఐరోపాఖండ సంచారం చేసి స్విట్జరులాండులో వుంటున్న ఉత్తర ప్రదేశానికి చెందిన రాజా మహేంద్ర ప్రతాపసింగును వీరేంద్ర చటోపాధ్యాయ తీసుకొని రావటం, ఆ తాత్కాలిక ప్రభుత్వాని కతడు అధ్యక్షులుగానూ, ఒక మహమ్మదీయుడు మౌలానా ఒబేదుల్లా ప్రధానమంత్రిగానూ నియమితులు కావటం జరిగినది.

1919 లో రాజా మహేంద్ర ప్రతాపసింగు జర్మనీలోని విప్లవ కమిటీలో చర్చల కొరకు బయలుదేరి ముందుగా మాస్కో వచ్చి లెనిన్‌ను కలుసుకొన్నాడు. ఇది వొక వింతసంఘటన. రాజా మహేంద్ర ప్రతాపసింగు బాల్యం నుంచి తానొక ప్రవక్తననే మూఢవిశ్వాసంలో వున్నాడు. 'ప్రేమ మతము' అనే గ్రంథం కూడా రచించాడు. లెనిన్ కా గ్రంథం కానుకగా యిచ్చి తప్పక పఠించాలని, 'ఆ గ్రంథ రాజంలోని సూత్రాల' కనుగుణంగా నడువకపోతే రష్యా విప్లవం పతనమయ్యే ప్రమాదం వున్నదని,' కనుక పఠించి తన అభిప్రాయం తెలియజేయాలని మరీ మరీ కోరటంతో లెనిన్ అందుకు అంగీకరించి ఆ పుస్తకం చూడటం తటస్థించినది. రెండవసారి సమావేశంలో అతనితో ముక్తసరిగా "ఇంగ్లండు వెళ్లి యీ ప్రచారం చేయటం మంచిది. మాకు భగవంతుని మీద విశ్వాసం లేదు. భగవంతుని మీద భరోసాతో భారతదేశంలో విప్లవం తీసుకొని వస్తే అప్పుడు మీ మాటలు విన గలము" అని చెప్పి పంపిపేసాడు.

వీరేంద్ర తరువాత విప్లవ కమిటీలో హరదయాళ్ ఎన్నదగినవాడు. రాజకీయాల్లో చెప్పుకోతగినంత సమర్థత లేనివాడు. ఆవేశపరుడు. బ్రిటిషుజాతి వ్యతిరేకభావం బాగా జీర్ణించుకొనిన వ్యక్తి. అమెరికాలో వున్నప్పుడు అనార్కిస్టు వర్గంలో వుండేవాడు. ఆయనకు, వీరేంద్రకు పొత్తు కుదరక చివరకు సంఘర్షణకు దారి తీసినది. యుద్ధసమయంలో వీరేంద్ర దాదాపు జర్మనీ ఏజంటుగా రహస్యంగా అనేక తటస్థదేశాలు తిరిగి జర్మనీకి అనుకూల వాతావరణం యేర్పరచటానికి శత

విఫల ప్రయత్నించాడు. మొదట వీరేంద్ర పలుకుబడితోనే విప్లవ కమిటీలో హరదయాల్ సభ్యుడు కాగలిగాడు. కాని భేదాభిప్రాయం రాగానే శత్రువర్గానికి చెందినవానిగా అరెస్టుకు గురి అయ్యాడు.

జర్మనీ పరాజయం పొందగానే హరదయాల్ తప్పించుకొని రహస్యంగా స్వీడన్ పారిపోయాడు. తరువాత బెర్లినులోని తన అనుభవాల గురించి ఒక పుస్తకం వ్రాసాడు. బ్రిటిషు ప్రభుత్వానికి విధేయునిగా ప్రకటించుకొన్నాడు. తరువాత రాజకీయాల నుంచి విరమించుకొని ఒక విశ్వవిద్యాలయంలో ఆచార్యునిగా తన జీవితం గడిపాడు.

చంపకరామన్‌పిళ్లై మరొక ప్రధానమైన వ్యక్తి. 1922 లో రాయ్ మాస్కో నుంచి బెర్లిను రెండవసారి సందర్శించి నప్పుడు ఈయన్ని కలుసుకున్నాడు. అప్పటికే రాజకీయాలకు స్వస్తి చెప్పి ఒక షాపు పెట్టుకొని జీవితం గడుపుచున్నాడు. తిరువాన్కూరు నుంచి క్రైస్తవ మిషనరీ సహాయంతో అనాథగా విద్యాభ్యాసం కొరకు ఇంగ్లండు తీసికొని రాబడ్డాడు. విప్లవభావాలు బొత్తిగాలేని వ్యక్తి అయినా విప్లవ కమిటీలో సభ్యుడు. జర్మనీ సైనికాధికారులతో మంచి పరిచయం సంపాదించ గలిగాడు. బహుశః దీనివలననే వీరేంద్రకు ఈతని మీద ద్వేషం వున్నా హరిదయాల్‌కు పట్టిన గతినుంచి తప్పించుకో గలిగాడు. జర్మను పరాజయంతో అంతకు ముందు కెయిజరు ప్రభుత్వం మీద ఆశలు పెట్టుకొనిన విప్లవ కమిటీ సభ్యుల్లో హెచ్చుమంది తమ ఆశలను రష్యను బోల్షివిజం మీదకు మళ్లించారు.

అందరిలోనూ భూపేంద్రనాథ్‌దత్తు వొక్కడే భారత విప్లవ వుద్యమంలో పాల్గొనిన వ్యక్తి. ఈయన స్వామి వివేకానందుని సోదరుడు. 1907 లో 'జుగాంతర' సంపాదకునిగా అరెస్టు కాబడ్డాడు. విడుదల అనంతరం అమెరికా వెళ్లి ప్రపంచ యుద్ధసమయంలో బెర్లిను చేరాడు. భారతదేశంలోని దత్తు విప్లవ జీవితం రాయ్‌ని ప్రభావితుని చేసి ఆయన మీద ఎనలేని గౌరవాన్ని కలుగచేసినది. కాని రాయ్ బెర్లినులో ఆయనను కలుసుకొనినప్పుడు తన వెనుకటి భావం మార్చుకొనక తప్పినదికాదు. బెర్లినులో విప్లవ కమిటీ సభ్యులలోని వారిలో ఆయనొక్కడే వున్నాడు. రాయ్ కలుసుకొనగానే పెద్ద అధికార హోదాను చూపుతూ మర్యాద మాటటుంచి రాయ్ భారతదేశం వదలినప్పటి నుంచి జరిపిన కార్యక్రమం, జర్మనీ ప్రభుత్వం

నుంచి పొందిన ధన సహాయం గురించి వివరంగా రిపోర్టు రావాలని ఆదేశంగా మాట్లాడాడు. అనవసర సంఘర్షణను దింపటం మంచిది కాదనే తలంపుతో ఆ రిపోర్టు తరువాత యివ్వగలనని సమాధానపరచి రాజకీయాల ప్రసక్తి యెత్తగానే దత్తు ప్రస్తుతం ఆ ప్రపంచంలో వున్నట్లే కనబడక పోవటం రాయ్‌కి ఆశ్చర్యాన్ని కలిగించినది. దత్తు సంభాషణలను బట్టి రాయ్‌కి ఆ కమిటీలోని ఒకరిమీద మరొకరికి ఏ మాత్రం సదభిప్రాయం, విశ్వాసం వున్నట్లు కనబడలేదు.

"డాక్టరు మాన్సూర్ నమ్మదగినవాడు కాదు. అతడు మహమ్మదీయుడు. పిళ్ళైను అంతకంటె నమ్మకూడదు. అతడు జర్మను అధికారులతో మీ విషయం చెప్పవచ్చు. వాళ్ళదగ్గరనుంచి మీరు తీసుకొన్న ధనం సోషలిజానికీ, కమ్యూనిజానికీ, దుబారా ఖర్చుచేస్తున్నారని తెలిస్తే మిమ్మల్ని యిప్పుడే అరెస్టు చేయవచ్చును. వీరేంద్ర బెర్లినులో లేకపోవటం మంచిదనిపించింది." దత్తు సంభాషణలు యీ ధోరణిలో నడచినవి. వీరేంద్రనాథ్ చటోపాధ్యాయను కూడా కలుసుకుంటే ఇంకే విషయాలు బయటకు వస్తవో తెలుసుకోవాలనే కుతూహలం రాయ్‌కి కలిగినది. అతడు స్టాక్‌హోమ్‌లో వున్నాడు. మాస్కో వెళ్ళే త్రోవలో కలుసుకోవాలనుకున్నాడు. కాని అనుకోకుండా రాయ్ ప్రయాణం లెనిన్‌గ్రాడ్ మీదుగా జరిగినది.

## అబానీ ముఖర్జీ:

అనుకున్న ప్రకారం రాయ్ మాస్కో ప్రయాణం జరుగలేదు. బరోడిన్ మాస్కోనుంచి అత్యవసర పిలుపు రావటంచేత అనుకోకుండా బెర్లిను విడిచిపెట్టవలసి వచ్చినది. కొత్త ప్రపంచంలో తనకప్పగించిన కార్యక్రమం విఫలమయినందులకు సంజాయిషీ చెప్పుకొనవలసిన బాధ్యత బరోడిన్‌మీద వున్నది. అందుకు మనసులో కొంత కలతగానే వున్నాడు. బయలుదేరే ముందు రాయ్‌కి సహాయకారిగా మరొక వ్యక్తిని అప్పగించాడు. రష్యాకు పడమర అన్నివైపులా శత్రు సైన్యాలు మొహరించివున్నవి. స్వీడన్ ద్వారా రాయ్ ప్రయాణం చేయటానికి వీలులేదు. విమానం అద్దెకు తీసుకొని అందులో ప్రయాణం చేయాలని

ఆలోచించాడు. అది అంతకంటె ప్రమాద భరితంగా కనబడినది. అవకాశం తక్కువ కనుక బెర్లినులో మరికొంతకాలం వేచివుండ వలసి వచ్చినది.

థర్డు ఇంటర్నేషనల్ మహాసభకు వెళ్ళే ప్రతినిధులు చాలామంది బెర్లిను చేరుకున్నారు. దాదాపు అందరూ అక్కడికి రహస్యంగానే ప్రయాణం చేసారు. ఇప్పుడు మిత్ర రాజ్యాలకు రష్యా శత్రుదేశం కనుక ఆయా దేశాల ప్రతినిధులు బహిరంగంగా ప్రయాణించటానికి వీలులేదు. అదేవిధంగా బెర్లిను నుంచి కూడా మాస్కో రహస్యంగా ప్రయణం చేయవలసి వున్నది. వీరిలో చాలా మందితో రాయ్ పరిచయం చేసుకొని ఆయాదేశాల రాజకీయ పరిణామాలను గురించి తెలుసుకొనటానికి అవకాశం లభించినది. ఇందులో ఒక భారత ప్రతినిధి కూడా వుండటం రాయ్‌కి ఆశ్చర్యాన్ని కలిగించినది. అతడు హాలండు నాయకుడు రట్‌గెల్ నుంచి రాయ్‌కి పరిచయ లేఖనుకూడా తీసుకొని వచ్చాడు. డచ్ ఇండీసునుంచి అచ్చటి స్నేహితులద్వారా హాలండు చేరాడు. తనపేరు డాక్టరు షహీరుగా చెప్పు కున్నాడు.

తరువాత విచారించగా ఆతడు తన అసలుపేరు అబానీముఖర్జీ అని చెప్పాడు. యుద్ధానికి ముందు జర్మనీలో విద్యాభ్యాసం చేస్తున్నాడు. యుద్ధం ప్రారంభ దశలో అమెరికావెళ్ళి, అచ్చటనుండి జపాను చేరుకున్నాడు. రాస్ బిహారి సహాయంతో తాను, మరొకవ్యక్తి గుప్త భారతదేశ ప్రయాణం చేస్తుండగా ఇద్దరూ సింగపూరులో అరెస్టు చేయబడ్డారు. కొంతకాలానికి గుప్త విడుదల అయ్యాడు. కాని ముఖర్జీ అనేక బాధలకు గురిఅయి తరువాత విముక్తిపొంది చైనా నౌకలో జావాచేరి అచ్చటి విప్లవవాదులద్వారా కమ్యూనిజం, రష్యను విప్లవాన్ని గురించి తెలుసుకొని డచ్ నౌకలో హాలండు చేరినట్లు రాయ్‌కి చెప్పాడు.

రాయ్‌కి అతని గతచరిత్ర, సంభాషణతీరు వింటే అనుమానం కలుగక పోలేదు. భారతదేశం చేరకుండా జావా ఎందుకు వెళ్ళినట్లు? అసలు అతడు విడుదల కావటమే ఆశ్చర్యకరమయిన విషయం. భారత విప్లవవాదుల గురించి కొంత రహస్య సమాచారం అధికారులకు అందజేసి వుండవచ్చు. అందుకు సత్కారం అతని విడుదల కావచ్చు. మాతృదేశం వెళ్ళితే ప్రాణాలు దక్కవు. విప్లవకారులు ప్రతీకారచర్య తీసుకుంటారు. కనుక చివరకు యిక్కడకు చేరి వుంటాడనే సంశయం రాయ్‌కి కలిగినది. ఒకవేళ తాను వూహించినది పూర్తిగా

భ్రమలయి అతడు నిజమయిన విప్లవవాది కూడా అయి వుండవచ్చుననే ఆలోచన కూడా రాయ్‌కి కలిగినది. ఆతడు మాస్కో రావాలని మొండిపట్టుదలతో వున్నాడు. 'కమ్యూనిస్టు సిద్ధాంతాలు క్షుణ్ణంగా చెప్పి భారతదేశంలో కమ్యూనిస్టు పార్టీని నిర్మించ టానికి ముఖర్జీని పంపితే ఎలా వుంటుంది? థర్డుకమ్యూనిస్టు ఇంటర్నేషనల్ వలస రాజ్యాలలో కమ్యూనిజం ప్రచారానికి నూతన కార్యక్రమం రూపొందించబోతూ వున్నది. ఆ సందేశాన్ని ముఖర్జీ ద్వారా భారతదేశం పంపవచ్చును. ఈ మధ్యలో యితన్ని గురించి మరికొన్ని వివరాలు సేకరించవచ్చును.' అని రాయ్ అభిప్రాయ పడ్డాడు.

కాని రాయ్ తాను మాస్కో చేరటం ఎలా అనే సందిగ్ధ పరిస్థితిలో వున్నాడు. కాగా తనతోపాటు మరొక వ్యక్తిని కూడా వెంటతీసుకొని వెళ్లటం అసాధ్యంగా కనబడినది. కనుక ముఖర్జీని తిరిగి హాలండు వెళ్లి వాళ్ల ఆదేశం ప్రకారం నడువమని సలహా యిచ్చి పంపాడు. కాని ఆతడు రాయ్‌కి తెలియకుండానే మాస్కో చేరి భారతదేశ ప్రతినిధిగా మహాసభలో పాల్గొనటం రాయ్‌కి ఆశ్చర్య మేసినది. ఇంటర్నేషనల్ పశ్చిమ యూరోపియన్ బ్యూరో ద్వారా ఒక సర్టి ఫికెటును సంపాదించి భారత ప్రతినిధిగా వచ్చినట్లు రాయ్ తరువాత తెలుసుకో గలిగాడు. మహాసభ చర్చలలో ఆతడు పాల్గొనవచ్చు. కాని వోటు చేసే అధికారం లేదు. ఇందుకు ఆతడు "వలస రాజ్యాలకు తగిన ప్రాతినిధ్యం యివ్వలేదు" అని పెద్ద గందరగోళం కూడా చేసాడు.

లెనిన్ అధ్యక్షత క్రింద వలస రాజ్యాల కమిషన్ సమావేశమయినది. ఆయన కార్యదర్శులలో వొకరు లెనిన్‌తో రహస్యంగా మాట్లాడటం, ఆయన వెంటనే లేచి తన స్థానంలో మరొకరిని కూర్చొనబెట్టి ప్రక్కగది లోనికి వెళ్లి రాయ్‌ని పిలువటం జరిగినది. గదిలో మరొక వ్యక్తి కూడా ఆసీనులై వున్నారు. 'కామ్రేడ్ పీటరు' (రహస్య పోలీసుదళ ప్రధానాధికారి) అని లెనిన్ రాయ్‌కి పరిచయం చేసాడు. మొదట రాయ్ కిది అంతుపట్టలేదు. డాక్టరు షహీర్ పేరుతోయున్న భారత ప్రతినిధి ముఖర్జీని గురించి రాయ్ అభిప్రాయం అడిగాడు. రాయ్ నిర్విణ్ణుడై ఆతడు తనకు లోగడ చెప్పిన చరిత్ర ఏకరువు పెట్టాడు. రష్యాలో అతని ప్రవర్తన రాయ్‌కి బొత్తిగా తెలియదు.

పీటరు ఆతనిని అరెస్టు చేయాలనే సంకల్పంలో వున్నాడు. లెనిన్‌గ్రాడ్‌లోనూ, మాస్కోలోనూ ఆతడు బూర్జువావర్గంతో కలిసి తిరుగుచున్నాడు. ఆతని ప్రవర్తన అనుమానంగా వున్నది. లెనిన్ కిది బాధాకరంగా కనబడినది. భారత ప్రతినిధిగా ఒకే ఒక వ్యక్తి రావటం, అతనిని అనుమానించి అరెస్టు చేస్తే మహాసభలో కొంత గందరగోళం జరుగవచ్చును. కనుక లెనిన్ జోక్యం చేసుకొని ప్రస్తుతానికి అరెస్టు ఆపమని పీటరు నాజ్ఞాపించి ఆతని పూర్తి సమాచారం తెలుసుకొనమని రాయ్‌తో చెప్పాడు. పీటరు అయిష్టంగా దీన్ని అంగీకరించి నిఘా వుంచుతానని సమాధానం చెప్పగలిగాడు.

తరువాత రాయ్ ముఖర్జీని ప్రత్యేకంగా కలుసుకొని యదార్థం చెప్పమని కోరాడు. అతడు చెప్పిన మాటలు - "లెనిన్‌గ్రాడ్‌లో యిద్దరు సంపన్న గృహిణులను యాదృచ్ఛికంగా కలుసుకొనటం జరిగినది. విప్లవం గురించి వారి అభిప్రాయం అడిగాను. వారు చాల మర్యాదస్థులుగా కనబడ్డారు. అనేక విషయాలు చెప్పారు. భారతదేశాన్ని గురించి నన్ను అనేక విషయాలు అడిగి తెలుసుకున్నారు. తరువాత లెనిన్‌గ్రాడ్ నుంచి బయలుదేరేముందు వారిని మర్యాదకొరకు కలుసుకొనగా మాస్కోలో కొంతమందిని కలుసుకొనమని చిరునామా లిచ్చారు. ఇచ్చట వారిని కలుసుకొనటం జరిగినది." అని చెప్పాడు. రాయ్ యిదే విషయాన్ని లెనిన్ కెరుక పరచాడు. ఆయన కొంతవరకు సంతృప్తిచెంది "పీటరుతో చెప్పటం అనవసరం. ఆయన పెడర్థాలు తీయవచ్చు" నని రాయ్‌కి సమాధానం చెప్పాడు.

మరుసటి సంవత్సరం జరిగిన మూడవ కాంగ్రెసులో భారతదేశం నుంచి వచ్చిన భారత ప్రతినిధివర్గం ముఖర్జీని నిశితంగా విమర్శించి దూషించినది. రాయ్ మొదట బెర్లినులో ఆతనిని గురించి అనుమానించినది నిజమేనన్నట్లుగా కనబడినది. జపానునుంచి రాస్ బిహారీబోసు భారత విప్లవకారులకు ఒక రహస్య సమాచారం అందచేయమని ముఖర్జీని ప్రత్యేకంగా పంపాడు. ఆతడు సింగపూరు పోలీసుల కిది అందచేసాడు. తత్ఫలితంగా అనేకమంది విప్లవకారులు అరెస్టుకావటం, మరణ శిక్షకు కూడా గురి అయినట్లు చెప్పారు. ఇది నిజంగా తీవ్రమయిన సంఘటనయే. రాయ్ ముఖర్జీని దగ్గరకు తీయటం మంచిదికాదనే భావించాడు. అయితే వారు చెప్పినదంతా నిజంగా భావించి ముఖర్జీని పీటరు కప్పగించటంలో ఔచిత్య మెంత వరకున్నదో సంశయం కలుగటంతో పీటరువరకు యీ విషయాన్ని పోనీయలేదు.

తరువాత అతడు జర్మనీవెళ్ళి అచ్చటనుండి భారతదేశం చేరి కొంత మందిని రహస్యంగా కలుసుకొని తిరిగి భారత ప్రతినిధిగా మాస్కో వచ్చాడు. అదే సమయంలో రాయ్ 'పరివర్తిత భారతదేశం' అనే గ్రంథరచనలో నిమగ్నులయి కొన్ని వివరాల సేకరణకు ముఖర్జీని వినియోగించుకొన్నాడు. చివరకు ముఖర్జీ, అతనిపై నిందారోపణ చేసిన చటోపాధ్యాయ లెనిన్‌గ్రాడ్‌లో ఉపాధ్యాయులుగా తమ అంతిమ జీవితం గడిపారు.

## మాస్కోలో:

లెనిన్ పట్టుదల వలన సోవియటు రష్యా జర్మనీ ప్రభుత్వంతో శాంతి సంధి చేసుకొని జర్మనీలో రాయబార కార్యాలయం స్థాపించటం జరిగినది. కాని రాయబారి రాడెక్ తన విధులకు మించి విప్లవ కార్యక్రమాలు కొనసాగిస్తున్నాడనే కారణంతో జర్మనీ ప్రభుత్వం ఆయనను అరెస్టు చేసినది. తరువాత కొంతకాలం వరకు ఆ కార్యాలయం నామమాత్రంగా పని చేసినది.

1920 మేలో కమ్యూనిస్టు ఇంటర్‌నేషనల్ ప్రథమ కార్యదర్శి యాంజలికా బాల్బనోవా నుంచి ఒక ప్రత్యేక సందేశం ఆ కార్యాలయానికి వచ్చినది. అది ఒక ప్రత్యేక వార్తాహరుని ద్వారా బెర్లినులో వున్న రాయ్‌కి అందచేయబడినది. రాయ్ వెంటనే మాస్కో బయలుదేరి రావాలని ఆ సందేశం. ఆ వచ్చిన వ్యక్తియే రాయ్ ప్రయాణానికి తగిన యేర్పాట్లు చేసాడు. అప్పుడే రష్యానుంచి 'ది సోవియటు' అనే నౌక వచ్చినది. ఆ నౌకలో రాయ్, మరొక వ్యక్తి - ఇద్దరే ప్రయాణించవలసి వున్నది. మిగిలిన ప్రతినిధుల కొరకు ఆ నౌక మళ్ళీ తిరిగివస్తుంది. ఆ నౌకలో రాయ్ ఎస్తోనియన్ రిపబ్లికు రాజధాని అయిన రీవల్ వరకు ప్రయాణం చేసి అక్కడ నుంచి రైలులో లెనిన్‌గ్రాడ్ ప్రయాణం చేయవలసి వున్నది. ఎట్టకేలకు తాను మాస్కో బయలుదేరు చున్నందులకు రాయ్ మిక్కిలి పరవశుడయ్యాడు.

రాయ్‌తో పాటు ప్రయాణం చేయుచున్న వ్యక్తి ఒక ఫ్రెంచి యువతి. ఆమె భర్త రష్యను విప్లవంలో కెరెన్స్కీ ప్రభుత్వ సైన్యాలను, తరువాత రెడ్ఆర్మీని సుసంఘటిత పరచటానికి నియుక్తుడయ్యాడు, ఆ యువతి తన భర్తను కలుసు

కొనాలనే కాంక్షతో వుండటం చేత ఇద్దరి ప్రయాణానికి ఒక ప్రత్యేక నౌకను యేర్పాటు చేసారు. లెనిన్‌గ్రాడ్‌లో రాయ్ అచ్చటి విప్లవ స్థలాలను సందర్శించాలనే కుతూహలం కనబరచాడు. కాని ఆ యువతి 'మదామ్ సెడోల్' తాను వెంటనే మాస్కో చేరటం అవసరమని చెప్పటంతో ఇద్దరూ లెనిన్‌గ్రాడ్‌లో ఆగకుండా ప్రత్యేక రైలులో మాస్కో ప్రయాణం చేసారు.

సోవియటు రష్యా యుద్ధ భీభత్సం నుండి యింకా కోలుకొనలేదు. రైలు మార్గాలు కూడా సరియైన స్థితికి రాలేదు. సాధారణ ప్రయాణీకులకు రైలులో ప్రయాణంచేసే అవకాశం మృగ్యం. కేవలం సైనికులు, ప్రత్యేక అధికారులు పర్మిట్లతో రైళ్లలో ప్రయాణం చేస్తూ వుండేవారు. మాస్కో చేరగానే రాయ్ తాను కలలుకంటున్న స్వర్గభూమిని చేరినట్లు భావించాడు. స్టేషనులో అంతా సైనిక సంచలనం. మదామ్‌సెడోల్ ఒక ప్రత్యేక కారులో తనభర్త దగ్గరకు పంపబడినది. రాయ్‌ని మరొక కారు తీసుకొని వెళ్ళినది.

రాయ్ కారు ఒక పెద్ద బంగళా ముందు ఆగగానే బరోడిన్ స్వాగతం చెప్పి లోపలికి తీసుకొని వెళ్ళాడు. అది జారు ప్రభుత్వకాలంలో ఒక రాజవంశీకుడు నివసించే బంగళా. అతడు పంచదార పరిశ్రమలో అనేక పంచదార ఫ్యాక్టరీలకు యజమానిగా వుండి 'పంచదార రాజు'గా పేరు పొందాడు. ఇప్పుడు అతని ఆస్తి అంతా ప్రభుత్వం వశపరచు కున్నది.

బంగళాక్రింద భాగంలో విదేశాంగశాఖ వైస్‌కమిసార్ కారఖాన్ నివసిస్తు న్నాడు. పై అంతస్థులోని ఒక భాగంలో రాయ్ విడిదికి ఏర్పాటు జరిగినది. ఆ బంగళాకు వెనుకప్రక్కన ఒక చిన్న సెలయేరు ప్రవహిస్తున్నది. ఎదురుగా క్రెమిలిన్ ప్రహరీగోడ వున్నది. భోజనానంతరం బరోడిన్ రాయ్‌ని తన గదికి తీసుకొని వెళ్లాడు. బరోడిన్ ఒక ముఖ్య కార్యంలో నిమగ్నుడయి వున్నాడు. లెనిన్ వ్రాసిన "లెఫ్ట్ కమ్యూనిజం" కరపత్రం ఇంగ్లీషులో తర్జుమా చేస్తున్నాడు. జర్మనీ అనువాదం కొంత అపార్థానికి దారితీసినది. కనుక ఇంగ్లీషు భాషలో అట్టి ప్రమాదం జరుగకుండా వుండటానికి బరోడిన్ ప్రత్యేక శ్రద్ధ తీసుకొనవలసి వచ్చినది. ఆ కరపత్రానికి ఇంగ్లీషులో తగిన నామకరణం చేయటానికి బరోడిన్ కుస్తీ పట్టవలసి వచ్చినది. రష్యను భాషకు యథాతథంగా అయితే 'లెఫ్ట్ కమ్యూని జం - బాలారిష్టము' అని నామకరణం చేయవలసి వుంటుంది. దానివలన మొత్తం

లెఫ్ట్ కమ్యూనిజాన్నే ఖండించినట్లు అపార్థం కలుగవచ్చు. కనుక రాయ్ రష్యను నామకరణానికి తగిన అన్వయం కుదిరేటట్లు వేరే నామకరణం "వామపక్ష కమ్యూనిజం - బాలారిష్టం" అని సూచించాడు. లెనిన్ దీన్ని అంగీకరించాడు. తరువాత అన్ని భాషల తర్జుమాలోనూ ఇదే అనుసరించబడినది.

'రాత్రి పదిగంటలకు రాయ్ కారఖాన్‌తో కలువవలసి వున్నది.' అని బరోడిన్ అన్నప్పుడు రాయ్‌కి ఆశ్చర్యం కలిగినది. ముందుగా ఇక్కడే ఎందుకు చూడకూడదు ? అనే అనుమానం రాయ్‌కి సహజంగా కలిగినది. 'కారఖాన్ పగలు నిద్రపోతూ వుంటాడు. ఆఫీసుకు వెళ్లేముందు ఇంటి దగ్గరే ఆఫీసుపని చూచుకుంటాడు. విదేశాంగశాఖ కార్యాలయము రాత్రిళ్లు పనిచేస్తూ వుంటుంది. కారఖాన్‌తో యిష్టాగోష్టిగా మాట్లాడటానికి అక్కడే కావలసిన సమయం వుంటుంది. అక్కడే కమిసార్ చిచెరిన్‌ను కూడా కలుసుకొనవచ్చును.' అని బరోడిన్ సమాధానం చెప్పాడు.

కారఖాన్ ఆఫీసుకు వెళ్లటానికి క్రింద అంతస్థులో సిద్ధంగా వున్నాడు. రాయ్, బరోడిన్‌లు ఆయనతో కలిసి విదేశాంగశాఖ కార్యాలయానికి వెళ్లారు. అది ఒక పెద్ద రష్యను హోటలులో ఒక ప్రక్క భాగములో వున్నది. కారఖాన్ అచ్చటి రక్షకభటులకు తన అనుమతిపత్రం చూపించి ముందుగా లోపల ప్రవేశించాడు. తరువాత రాయ్, బరోడిన్‌లకు అనుమతి పత్రాలు వచ్చినవి. వారు కూడా లోపల ప్రవేశించారు. యుద్ధవాతావరణం యింకా తొలగలేదు. ప్రత్యేక అధికారులు వినా యితరు లెవరూ ప్రభుత్వ ఆఫీసులలో ప్రవేశించటానికి వీలులేదు.

కారఖాన్ వయస్సు ముప్పయి కంటె ఎక్కువ వుండదు. జన్మతః అమెరికాకు చెందినవాడు. విప్లవానికి ముందు పెట్రొగ్రాడ్‌లో లైబ్రేరియన్‌గా వుంటూ వుండేవాడు. కమిసార్ చిచెరిన్ ఏ పని చేసినా ముందుగా కారఖాన్‌తో సంప్రదిస్తూ వుంటాడు. వివిధ దేశాల్లో రాయబార కార్యాలయాలు తెరచి ఇంటర్నేషనల్ ద్వారా కమ్యూనిస్టు ప్రచారానికి దోహదం కల్గించటం కారఖాన్ ఆశయం. ఆయన ధరించే దుస్తులు, ఆచారాలు ప్రొలిటేరియన్ కంటె బూర్జువావర్గానికి దగ్గరగా వుంటవి. రాడెక్ ఒకసారి కారఖాన్‌ను గురించి 'బాగా బలిసిన రషియన్ గాడిద' అని విమర్శించాడు కూడాను.

చిచెరిన్ అంటే పశ్చిమ కాపిటలిస్టు రాజ్యాలకు సింహస్వప్నం. ఆయన తన కార్యాలయం నుంచి వివిధ దేశాల్లోని సోషలిస్టు, కమ్యూనిస్టు పార్టీలకు "కాపిటలిజాన్ని కూలద్రోయండి, ఇంపీరియలిజాన్ని సమాధి చేయండి" అని పంపే పెద్ద పెద్ద తాఖీదులు, కరపత్రాలు, యితర సాహిత్య ప్రచురణలు ఆ యా ప్రభుత్వాలలో సంచలనం రేకెత్తిస్తూ వుండేవి.

కారఖాన్ తన ఆఫీసు పనిలో నిమగ్నుడయి వున్నాడు. బరోడిన్, రాయ్ ఆయన గదిలో ప్రవేశించగానే ముందువున్న ఆఫీసుఫైళ్లు ప్రక్కకు నెట్టి రాయ్‌ని మర్యాదగా ఆహ్వానించి ఎదురుగావున్న సోఫాలో ఆసీనుని చేసాడు. కారఖాన్ రషియన్ భాషలో బరోడిన్ నుద్దేశించి మాట్లాడగా ఆయన ఇంగ్లీషులో తర్జుమా చేసి రాయ్‌కి వివరించాడు.

"ఆఫ్గనిస్తాన్‌లో ప్రస్తుతం వుంటున్న రాయబారి తిరిగి రావాలనుకుంటున్నాడు. ఆ స్థానంలో బరోడిన్‌ను నియమించటానికి మీ అభిప్రాయ మేమిటి?" రాయ్ వూహించని ప్రశ్న. చకితుడయ్యాడు. ఇందులో తన ప్రమేయ మేమిటో రాయ్‌కి అర్థం కాలేదు.

రాయ్ భారతదేశ విప్లవవాదులతో సన్నిహిత సంబంధం పెట్టుకోవాలనే తలంపులో వున్నట్లు బరోడిన్ ముందుగానే కారఖాన్‌కు తెలియచేసాడు. ప్రస్తుత రాయబారి ఆఫ్గనిస్తాన్‌లోని భారత తాత్కాలిక ప్రభుత్వంతో, విప్లవ వాదులతో యిదివరకే సంబంధాలు పెంచుకొని సరిహద్దుల అవతలి కొండజాతులను బ్రిటిషు ప్రభుత్వానికి వ్యతిరేకంగా రెచ్చగొట్టటానికి పురికొల్పాడు. కాని ఆ తాత్కాలిక ప్రభుత్వం - విప్లవవాదులు ముఠాలుగా తమలో తాము గ్రుద్దులాడు కొనటంతో ఆశించిన ఫలితాలు కలుగటంలేదు. కనుక ఆ రాయబారి స్థానంలో బరోడిన్‌ను నియమించితే వారిని ఒక పంథాలో నడిపించవచ్చునని, కాగా ముందు ముందు యిది రాయ్ కృషికి దోహదకారి కాగలదని కారఖాన్ అభిప్రాయం. కనుక రాయ్ అభిమతం తెలుసుకొనటానికి కారఖాన్ ప్రయత్నించాడు.

మెక్సికోలో వున్నప్పుడే బరోడిన్ రాయ్‌తో భారతదేశంలోని విప్లవవాదులతో క్రమబద్ధమయిన సంబంధాలు కలిగివుండాలని సూచించాడు. రాయ్ మనసులో యిది వున్నది. కాని అందుకు ఒక ప్రణాళిక రూపొందించలేదు.

కారఖాన్ చెప్పినది ఒకవిధంగా ఆలోచించవలసిన విషయమే. కాని వెంటనే రాయ్ తగిన సమాధానం యివ్వలేని స్థితిలో వుండటంచేత ప్రస్తుతాని కా విషయం వాయిదా వేసి మరొకసారి కలుసుకుందా మనుకున్నారు. రాయ్ వీడ్కోలు చెప్పి బయటకు రావాలనే తలంపుతో లేచి నిలబడ్డాడు.

అనుకోకుండా చిచెరిన్ ఆ గదిలో ప్రవేశించటం, కారఖాన్ ఆయన్ని రాయ్‌కి పరిచయం చేయటం జరిగినది. ఆయన్ని గురించి రాయ్ యిదివరకే విన్నాడు. కాని విన్నదానికీ, చూచిన దానికీ తేడా వున్నట్లు భావించాడు. కాపిటలిస్టు ప్రభుత్వాలకు సింహస్వప్నమయిన చిచెరిన్ యితడేనా అని అనుమానించక పోలేదు. చాల నిరాడంబరంగా కనబడ్డాడు. రాయ్‌తో ఎంతో అణకువగా, స్వచ్ఛమయిన యింగ్లీషులో సంభాషణ సాగించాడు.

“మీరు మాదేశం వచ్చినందులకు మా హృదయపూర్వక స్వాగతం. వలస ప్రపంచం అగ్నిజ్వాలలతో నిండియున్నది. విప్లవం తూర్పు దేశాల్లో విస్తరించాలి. ఇందుకు ఆశియాలో రెండవ రంగాన్ని ప్రారంభించాలి.”

రాయ్ చిచెరిన్ మాటలకు నిర్ఘాంతుడయ్యాడు. “అవును. ఆశియాలో రెండవ విప్లవ రంగాన్ని ప్రారంభించటం అవసరమే. మరి ఆశియాఖండం తన విద్యుక్త ధర్మాన్ని నెరవేర్చటానికి సిద్ధంగా వున్నదా?” రాయ్ మనస్సు అనిశ్చితంగానే వున్నది.

“మళ్లీ మనం యీ బృహత్ప్రణాళికను చర్చించటానికి తిరిగి సమావేశమవుదాం” అని చిచెరిన్ సంభాషణ ముగించాడు.

మరునాడు రాయ్ ప్రపంచ విప్లవాన్ని గురించి, ఆశియా, ముఖ్యంగా భారతదేశ విప్లవరంగాన్ని గురించి దీర్ఘంగా ఆలోచించిన పిదప కొన్ని నిర్ణయాలు చేసికొన గలిగాడు.

థర్డ్ ఇంటర్నేషనల్ రెండవ కాంగ్రెస్ మహాసభ పూర్తికాగానే రాయ్ స్వయంగా ఆఫ్గనిస్తాన్ దేశం వెళ్లాలనుకున్నాడు. ‘రాయబారి బిరొడిన్ సహకారంతో అచ్చట విప్లవ కార్యక్రమం ముమ్మరం చేయాలి. ఇందుకు ధనం, ఆయుధ సామగ్రి, ఇతర సాధన సంపత్తి కావాలి. వీటి నాధారం చేసుకొని సరిహద్దు కొండ

జాతుల సహకారంతో బ్రిటిషు ప్రభుత్వం మీద దాడిచేసి కొంత భారత భూభాగాన్ని స్వాధీనపరచుకొనాలి. స్వతంత్ర భారత ప్రభుత్వాన్ని స్థాపించి ముందుకు సాగాలి.'

వైస్-కమిసార్ కారఖాన్ కీ పథకం నచ్చినది. ఈ పథకాన్ని యింకా విపులంగా మిలిటరీ కౌన్సిలులో చర్చించి అంతిమనిర్ణయానికి రావలసి వున్నదని కారఖాన్ అభిప్రాయం వెల్లడించాడు. మిలిటరీ కౌన్సిలు అధ్యక్షులు పడమర యుద్ధ రంగంలో వున్నాడు. ఉపాధ్యక్షులు స్లాన్‌స్కీ మాస్కోలోనే వున్నాడు. ఆయన్ని ఎప్పుడయినా కలుసుకొనవచ్చును. కాని ముందుగా రాయ్ లెనిన్‌తో తన పథకం గురించి చర్చించి ఆయన అభిప్రాయం తెలుసుకోవా లనుకున్నాడు.

ఈ మధ్యలో బరోడిన్ రాయ్‌నే ఆఫ్గనిస్తాన్ రాయబారిగా ఎందుకు వెళ్లగూడదు అనే ప్రశ్న లేవదీశాడు. రషియన్ రిపబ్లిక్ జాతీయ ప్రభుత్వం కాదు. కనుక రాయ్ రాయబారిగా నియమితుడు కావటానికి అభ్యంతరం వుండదు. కాగా భారతీయుడు రష్యను రాయబారి కావటం వలన భారతదేశంలో సోవియటు రష్యా పలుకుబడి కూడా పెరుగవచ్చును. కారఖాన్ యిందుకు తన అనుకూలత వ్యక్త పరిచాడు. కాని ఏమి చేయాలనుకున్నా ముందుగా యీ విషయాలన్నీ లెనిన్‌తో కూలంకషంగా చర్చించటం అవసరం. కాంగ్రెసు మహాసభ కార్యక్రమంలో లెనిన్ నిమగ్నుడయి వున్నాడు. కనుక అవకాశం దొరికినప్పుడు అన్ని విషయాలు లెనిన్‌తో చర్చించటానికి నిర్ణయం గైకొనబడినది.

# కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ :

మరునాడు సాయంత్రం కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ ప్రథమ కార్యదర్శి యాంజలికా బాల్బనోవా రాయ్‌ని కలుసుకొనటానికి టీకి ఆహ్వానించినది. రాయ్‌తో పాటు బరోడిన్‌కూడా వున్నాడు. త్రోవలో రాయ్‌ని ఒక పెద్ద మైదానము అంచులో నిలబడివున్న ఒక చిన్న చర్చి ఆకర్షించినది. అక్టోబరు విప్లవ సమయంలో ఆచర్చికి కొంత విఘాతం కలిగినది. కాని కొంతమంది బోల్షివిక్కులు పూర్తిగా ధ్వంసం చేయటానికి వ్యతిరేకించినందున ఆకట్టడం నిలువ గలిగినది. జారిస్టు కాలంలోని పెద్ద పెద్ద రాజభవనాలు, చర్చీలు విప్లవానంతరం ప్రదర్శనశాలలు,

పాఠశాలలు, ప్రభుత్వ కార్యాలయాలుగా మార్చబడినవి. కాని యీ చర్చి మాత్రం విశాలమైదానంలో ప్రక్కనే చాల చిన్నది కావటంచేత కాబోలు ఎటూ మార్చటానికి వీలులేక అలాగే నిలచిపోయినది. ఆచర్చిని, ఆచుట్టూవున్న పరిసరాలను రాయ్ ఆసక్తితో పరికించాడు. కారులో ఎక్కబోయే సమయంలో ఆ మైదానం 'అంతర్జాతీయ గీతం' తో ప్రతిధ్వనించినది. ఆ గీతాలాపన ఎటునుంచి వస్తుందా అని రాయ్ చుట్టూ చూడసాగాడు. బరోడిన్ క్రెమిలిన్ టవరుమీద వున్న గడియారాన్ని చూపించాడు. ఆగడియారంలో నుంచి ధ్వనిరావటం రాయ్‌కి ఆశ్చర్యం కలిగించినది. అది చుట్టుప్రక్కల భవనాలనుంచి ప్రతిధ్వనిస్తూ వింత సంగీతం వినబడసాగినది.

జారు ప్రభుత్వకాలంలో ఆగడియారం జాతీయ గీతాన్ని ఆలాపన చేస్తూ వుండేది. విప్లవానంతరం అంతర్జాతీయ గీతాన్ని ఆలాపన చేయసాగినది. రెండవ ప్రపంచ యుద్ధకాలంలో రాయ్ డెహ్రాడూన్‌లో తన నివాస భవనమయిన 13. మోహినీరోడ్డులో వున్నప్పుడు విధిగా సాయంత్ర సమయంలో ఆ'అంతర్జాతీయ గీతం' వినటానికి మాస్కో-స్టేషను పెట్టుకొని రేడియోదగ్గర కూర్చుంటూ వుండే వారు. జర్మనీ సైన్యాలు లెనిన్‌గ్రాడ్, స్టాలిన్‌గ్రాడ్ పట్టణాలను చుట్టుముట్టినా ఆగీతం విన్నంతసేపూ రాయ్ అంతిమవిజయం సోవియటు రష్యాదే అనే గాఢ విశ్వాసంలో వుండేవాడు. అకస్మాత్తుగా ఒకరోజు సాయంత్రం ఆగీతం వినబడ లేదు. రాయ్ నిర్విణ్ణుడయ్యాడు. మనసు పరిపరివిధాల పోసాగినది. మరునాడు సాయంత్రం మళ్ళీ విన్నారు. అంతర్జాతీయ గీతాలాపనకు మారుగా రషియన్ జాతీయగీతం వినబడినది. విభ్రాంతుడయ్యాడు. అది 1942 సంవత్సరం. ఇరవై రెండు సంవత్సరాలక్రితం రెడ్‌స్క్వేర్‌లో స్వయంగా నిలబడి ఆ ఇంటర్నేషనల్ గీతాన్ని ఆలకించి ముగ్ధుడయిన రాయ్‌కి నేడు ఆగీతం వినబడక పోవటం పైగా ఆస్థానంలో జాతీయగీతం ప్రవేశించటం వింతగా కనబడినది. 'సోవియటు రష్యా అంతర్జాతీయ తత్వాన్ని జారవిడిచినది. విప్లవ పంథా విడనాడినది' అని విచారించాడు రాయ్.

రాయ్, బరోడిన్‌లు బాల్బనోవా యింటికి చేరారు. ఆమె వొంటరిగా వారి రాక కొరకు ఎదురు చూస్తూ వున్నది. ఆలస్యమయినందులకు రాయ్ విచారం వ్యక్త పరిచాడు. ఆమె ఆలస్యానికి ఏమీ బాధ పడినట్లుగా కనబడలేదు. రష్యాలో టీ కొరకు

ప్రత్యేక సమయం ఏమీ వుండదు. మంచినీరు సేవించినట్లుగా అవసరమయినప్పుడు టీ త్రాగటానికి సిద్ధంగా వుంటుందని రాయ్ తరువాత తెలుసుకున్నాడు.

ఆమె ఇటలీ దేశస్థురాలు. ఇంగ్లీషు చక్కగా మాట్లాడగలదు. అనేక సంవత్సరాలు లెనిన్‌తో కలసి ప్రవాసం అనుభవించినది. ఇటలీ సోషలిస్టు పార్టీలో ఆమెకు మితిమీరిన గౌరవస్థాన మున్నది. అధికారకాంక్ష లేదు. నిస్వార్థపరురాలు. విప్లవానంతరం పార్టీ నాయకులలో అధికారం కొరకు జరిగిన కుమ్ములాటలు, రాజకీయాల నుంచి ఆమె విరక్తి చెంది దూరం కావటానికి దారితీసినవి. కొలది కాలంలోనే ఆమె రాజకీయాలు విరమించి లెనిన్ మరణం వరకు స్టాక్‌హోమ్‌లో గడపినది. అధికార రాజకీయాలు, పార్టీ నాయకుల విభేదాలు, సోషలిస్టు పార్టీలను చీల్చటానికి కమ్యూనిస్టులు జర్మనీ, ఫ్రాన్సు, ఇటలీ దేశాల్లో జరిపిన కుట్రలు, వారి నిరంకుశత్వము ఆమెకు గిట్టలేదు. 'లెనిన్‌తోనే బోల్షివిజమ్ కూడా అస్తమించినదని' ఆమె వాపోయినది. తరువాత తన వెనుకటి సోషలిస్టు భావాలకు మళ్లీ 'ఆత్మకథ'ను వ్రాసి ప్రచురించటానికి క్రొత్త ప్రపంచం వెళ్లినది.

టీ సేవిస్తూ ఒకరి నొకరు తెలుసుకొనటానికి మర్యాద సంభాషణలు సాగినవి. వీడ్కోలు సమయంలో బాల్బనోవా రాయ్‌ని మరునాడు తనను కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ కార్యాలయంలో కలుసుకొనమని అభ్యర్థించినది. లెనిన్ వ్రాసిన ఒక చిత్తు ప్రముఖ ముసాయిదా పత్రం ఆమె అధీనములో వున్నది. రాయ్ మాస్కో చేరగానే ఆయనకు అందించమని లెనిన్ ఆమెకు పంపాడు. ఆపత్రం జాతీయ వలస రాజ్యాలను గురించి వ్రాసిన సిద్ధాంతం. రెండవ కాంగ్రెసు మహాసభలో చర్చించి ఆమోదించవలసి యున్నది. లెనిన్ రషియన్ భాషలో వ్రాయగా బరోడిన్ ఇంగ్లీషులో తర్జుమా చేసాడు. ఈ విషయం బరోడిన్ రాయ్‌కి చెప్పకుండా రహస్యంగానే వుంచాడు. 'ప్రతిదీ రహస్యంగా వుంచటం బోల్షివిక్కు సూత్రం'. కాని యీసూత్రం కొంతమందికి అనేక కష్టనష్టాలు కలిగించినట్లు రాయ్ తరువాత తెలుసుకొన గలిగాడు.

ఆ రోజుల్లో ప్రభుత్వాధినేతలకు, అధికారులకు, ప్రజానాయకులకు స్వంతకార్లు అనేవి లేవు. మాస్కోలో అన్నికార్లు పట్టణ సోవియటు అధీనంలో వుండి అవసరమైన వారికి పంపబడుతూ వుండేవి. ప్రభుత్వ అతిథిగా రాయ్‌కి ఒక

కారు ప్రత్యేకించ బడినది. రాయ్ ఒక చిన్నకారు - ఫియట్‌ను ఎన్నుకొన్నాడు. అది అందంగా లేకపోయినా అవసరానికి చక్కగా పుపయోగించినది.

క్రెమిలిన్‌కు చాల దూరంలో, నగరానికి బయట ఒక ప్రయివేటు భవనంలో కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ కార్యాలయ మున్నది. అక్కడకు ఎన్నో సన్నపాటి గొందులగుండా వెళ్ళవలసి వుంటుంది. ఆ భవనం కూడా కొంత చరిత్రను కలిగియున్నది. ఒకప్పుడది ఒక ధనికుడు, పెద్ద వ్యాపారస్థుని భవనం. విప్లవానంతరం జర్మనీ రాయబార కార్యాలయం కొంతకాలం అందులో వున్నది. రష్యా జర్మనీతో చేసుకొనిన 'శాంతిసంధి' సోషలిస్టు రివల్యూషనరీ పార్టీకి గిట్టలేదు. అప్పటి జర్మను రాయబారి మిర్‌బ్యాక్ నియంతగా వ్యవహరించటంతో ఆతడు కార్యాలయంలోని తన గదిలో హత్య చేయబడ్డాడు. ఆ కారణంగా జర్మనీ తన కార్యాలయాన్ని ఎత్తివేసినది. అదేభవనంలో కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ కార్యాలయం తెరువబడినది. మిర్‌బ్యాక్ ఆఫీసుగది ఒక మ్యూజియంగా తయారైనది. ఎప్పుడూ ఆగది మూయబడే వుంటుంది. ఎవరైనా ప్రముఖవ్యక్తులు వచ్చినప్పుడు చూడాలనుకుంటే తెరువబడుతుంది. ఆ గదిలోని తివాచీమీద మిర్‌బ్యాకు హత్యకు సంబంధించిన నెత్తురు మరకలు విశదంగా చూపరులకు కనబడుతూ వుంటవి.

రాయ్ బాల్బనోవా సూచన ప్రకారం మరునాడు తన ఫియట్ కారులో ఎత్తుపల్లాలలో సందుగొందుల గుండా కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ కార్యాలయం చేరి గేటుముందు దిగగానే గేటు తలుపులు తెరచుకొని సైనికాధికారులు మరతుపాకులతో ముందుకు రావటంతో అయోమయస్థితిలో పడ్డాడు. వెనుకనే మరొక కారువచ్చి ఆగినది. అందులోని వ్యక్తి దిగుతూనే "కామ్రేడ్సు ! తుపాకులు పేల్చవద్దు". అని నవ్వుతూ రాయ్ దగ్గరకు వచ్చాడు. అతడు రాడెక్. రాయ్ భుజం తట్టుతూ 'పర్మిట్ కార్డు' పంపలేదా ! అని అడగటం రాయ్ లేదని తలవూపటం జరిగినది. 'యాంజలికా బద్ధకస్తురాలు' అని తనతోబాటు రాయ్‌ని లోపలికి తీసుకొని వెళ్ళి ప్రధాన కార్యదర్శి ఆఫీసుగది చూపించి రాడెక్ వేరేపని వున్నదని పైఅంతస్థుకి వెళ్లాడు.

ప్రధాన కార్యదర్శి గదికి ఎదురుగానే మిర్‌బ్యాకును హత్యచేసిన గది మూసివేయబడి వున్నది. రాయ్ లోపలికి సరాసరివెళ్ళి బాల్బనోవాకు యెదురుగా వున్న సోఫాలో ఆసీనుడయ్యాడు. క్రిందటిరోజున ఆమె ఎదురుగావచ్చి రాయ్‌ని

మర్యాదగా ఆహ్వానించి అతిచనువుగా మాట్లాడినది. కాని యీరోజున తన రాకను గమనించినట్లే లేదు. ముందు టేబిలుమీదవున్న కాగితాలు చూసుకుంటూ మధ్యలో చిరునవ్వుతో కనబడినది. తరువాత ఫోను యెత్తి క్రెమిలిన్‌కు యివ్వమని అడిగి రషియన్ భాషలో మాట్లాడుతూ రాయ్‌పేరు వుదహరించినది. టెలిఫోను రిసీవరు దించి రాయ్‌కి క్షమాపణ చెప్పుకుంటూ "ఇప్పుడే ఇటలీనుంచి వచ్చిన రిపోర్టు చూస్తున్నాను. చివరకు ఇటలీ సోషలిస్టు పార్టీలో హెచ్చుమంది బోల్షివిజానికి అనుకూలురై ప్రతినిధులను పంపటానికి తీర్మానించుకున్నారు. అదే విషయం లెనిన్‌తో చెప్పుచున్నాను" అని సంభాషణ సాగించినది. రాయ్ మౌనంగా చెవులు అప్పగించి వింటున్నాడు. అకస్మాత్తుగా ఆ సంభాషణ ముగించి రాయ్‌తో "ఒక గంటలో మీరు లెనిన్‌ని కలుసుకొనవలసి వున్నది. మీరు ఇక్కడే వున్నట్లు లెనిన్‌కి ఫోనులోచెప్పగానే ఆయన వెంటనే కలుసుకొనాలనే ఆసక్తిని కనబరచాడు. మీరు లెనిన్ పంపిన యీ ముసాయిదా ప్రతిని చూడండి" అని లెనిన్ తయారు చేసిన వలస రాజ్యప్రణాళికను రాయ్ కిచ్చినది.

రాయ్ తటపటాయింపును చూచి విద్యార్థిని ఉపాధ్యాయుడు శాసించినట్లుగా "ఇదిగో దీనిని మీరు ఒక గంటలోగా చదివి లెనిన్ దగ్గరకు వెళ్లాలి.... మీరు యువకులు. ఈ అవకాశాన్ని గర్వకారణంగా భావించాలి. కాని మెదడు మాత్రం పోగొట్టుకొనవద్దు....మీ అదృష్టానికి నా శుభాకాంక్షలు" అని ఒక ప్రక్క శాసిస్తూ మరో ప్రక్క దీవించినది.

రాయ్ ఆ ప్రణాళికను అందుకున్నాడు. పడమప్రక్క ఎర్రసిరాతో వున్న మాటను గమనించాడు. "కామ్రేడ్ రాయ్ పరిశీలన, సలహా కొరకు వి. ఐ. లెనిన్" అని వున్నది.

రాయ్ నిజంగా తన కిది గర్వకారణంగానే భావించాడు. ప్రపంచ విప్లవాధినేత లెనిన్ స్వయంగా తయారుచేసిన ప్రణాళికను గురించి తన అభిప్రాయం అడగటం నిజంగా రాయ్ గర్వించదగిన సంఘటనయే. చిత్రపటాలలో, ఫొటోలలో లెనిన్ ప్రతిబింబాన్ని చూచి రాయ్ లెనిన్ గురించి అదివరకు తన మనసులో కొన్ని భావాలు చిత్రించుకున్నాడు. ఇప్పుడు ఆ మహావ్యక్తి, మేధావి, విప్లవాధినేతను ముఖాముఖి కలుసుకొని ఆయన ప్రణాళికను గురించి తన అభిప్రాయాలు వ్యక్తం చేయటానికి ఒక ప్రత్యేక హోదాలో వెళ్లుచున్నాడు.

రాయ్ గదిలో ఒక ప్రక్క కూర్చొని లెనిన్ ప్రణాళికను పరిశీలించ ప్రారంభించాడు. మహానియంతగా పరిగణింపబడుచున్న లెనిన్ పరుల అభిప్రాయం కొరకు సహనభావనలో వుండటం రాయ్‌కి ఆశ్చర్యం కలిగించినది. బాల్బనోవా కార్యదర్శి దగ్గరకు వచ్చి అనుకున్నసమయం సమీపించినట్లు గుర్తు చేసాడు. 'ప్రస్తుత సమావేశం మామూలు సమావేశం. తరువాత నెమ్మదిగా మీరు మీ అభిప్రాయం వ్యక్తం చేయవచ్చును,' అని బాల్బనోవా అందుకొన్నది. కార్యదర్శి వెంటరా రాయ్ క్రెమిలిన్‌కు బయలుదేరాడు.

క్రెమిలిన్ చేరగానే వెంటవచ్చిన బాల్బనోవా కార్యదర్శి అచ్చటి గార్డుకు ఒక కార్డు చూపాడు. కొలది సమయానికే ఒక అధికారి వచ్చి రాయ్‌ని మర్యాద లాంఛనాలతో లోపలకు తీసుకొని వెళ్లాడు. మొదటి అంతస్థు మెట్ల దగ్గరకు రాగానే కాపలా వున్న సైనికులు అభివందనము చేసి ప్రక్కకు తప్పుకున్నారు. ప్రతిచోటా గౌరవ మర్యాదలను మించి సైనిక బందోబస్తు కనబడినది. కామ్రేడ్ లెనిన్‌ని చూడబోతున్నాననే ఉద్వేగంతో జారు ప్రభుత్వానికి చెందిన ఆ విశాల క్రెమిలిన్ భవనాల సోయగాన్ని, కళానైపుణ్యాన్ని చూపే ప్రయత్నం కూడా చేయకుండానే ముందుకు సాగిపోయాడు.

# లెనిన్‌తో సమాగమం:

లెనిన్ ఆఫీసు గదికి ముందు విశాలమయిన హాలులో ఆయన సెక్రటేరియట్ పని చేస్తూ వుంటుంది. ఒక స్త్రీ-మేరియా మానేజరు. ఏ మాత్రం శబ్దం వినబడరాదు. ఎవరి పనులలో వారు నిమగ్నులయి వుంటారు. ఏదైనా చెప్పవలసి వచ్చినప్పుడు మేరియా అవసరమైన వ్యక్తి దగ్గరకు వెళ్ళి నెమ్మదిగా ఇతరులకు వినబడనంతటి లోస్వరంతో ఆవ్యక్తి చెవులో చెప్పివస్తుంది. తన చూపులలో, చేతలలో ఆ సెక్రటేరియట్ వుద్యోగస్తు లందరిమీద, చివరకు లెనిన్ మీద కూడా మేరియా అధికారం చలాయిస్తూ వుంటుందా ! అనిపిస్తుంది.

లెనిన్‌తో కలుసుకొనటానికి వచ్చే వ్యక్తులకు ఆమెయే సమయం నిర్ణయిస్తుంది. 9, 13, 17 నిముషాలకు మించి ఎంత ప్రముఖవ్యక్తి కయినా

హెచ్చు సమయం లభించదు. ఏమాత్రం-ఒక క్షణకాలంకూడా మించినా మేరియా తన టేబిలుమీద స్విచ్ నొక్కుతుంది. లోపల లెనిన్ టేబిలుమీద ఒక చిన్న బల్బు వెలుగుతుంది. అది హెచ్చరికగా భావించాలి. అంతే! లెనిన్‌తో మాట్లాడుచున్న వ్యక్తి బయటకు రావటం, మరొకవ్యక్తి లోపల ప్రవేశించటం జరుగుతుంది. బయట ఎవరూ లేకపోతే మేరియా తానే ఏదో ఒక ఫైలు తీసుకొని లోపల ప్రవేశిస్తుంది. లెనిన్‌కూడా తనను చూడటానికి వచ్చిన వ్యక్తులను ఒకక్షణం కూడా వృధాగా కూర్చోనపెట్టడు. సమయం వృధాకావటం లెనిన్‌కి ఏమాత్రం గిట్టదు.

రాయ్ విజిటర్సు గదిలో ప్రవేశించాడు. మేరియా గోడగడియారం వంక చూచి ప్రక్కనున్న లెనిన్ గదితలుపు తెరచి లోపలికి వెళ్లవచ్చు నన్నట్లుగా సౌంజ్ఞ చేసినది. రాయ్ కాలు ముందుకు సాగలేదు. మహానాయకునితో సమాగమం. ఎలా సంచరించాలి ? ఏవిధంగా సంభాషణ చేయాలి ? అనే అవ్యక్తభావంతో లోపల ప్రవేశించాడు. రాయ్ లోపల అడుగుపెట్టటమే తడవు, కుర్చీలో ఆసీనులయి వున్న లెనిన్ లేచి ముందువున్న టేబిలు తప్పుకొని ప్రక్కగా రాయ్ దగ్గరకు ఎదురొచ్చి చేయిచాచి ఎగాదిగా చూస్తూ "మీరు యువకులా ! మిమ్మల్ని ప్రాక్‌దేశానికి చెందిన, వయసుమీరిన తెల్లని గడ్డంగల జ్ఞానిగా వూహించుకున్నాను" అని ఆప్యాయంగా కరచాలనం చేసాడు. ఈ అనూహ్య వాత్సల్యతకు రాయ్ దిగ్భ్రాంతు డయినా స్థిమితుడు కాగలిగాడు. కుమారుడు తండ్రిని, శిష్యుడు గురువును చేరినంత సన్నిహితభావం యేర్పడినది. అప్పుడు రాయ్ 33 సంవత్సరాల వయస్సులో వున్నాడు.

వెనుకకు తిరిగి తన కుర్చీలో ఆసీనులయ్యేలోగా రాయ్ లెనిన్ ఆకారాన్ని కొంత పరిశీలించగలిగాడు. అంత పొట్టికాదు. 5 అడుగులకు మించిన ఎత్తు. శరీరానికి మించిన తలకాయ. నిరాడంబరాన్ని సూచించే దుస్తులు. లెనిన్ సంభాషణ అంతకంటె మృదువుగా వున్నది. "ఈ వ్యక్తియేనా ప్రపంచ విప్లవాధినేత, ప్రోలిటేరియన్ నియంత" అని రాయ్ తనలో తాను ఆశ్చర్యచకితుడయ్యాడు.

రాయ్‌ని తన ముందు కుర్చీలో ఆసీనునికమ్మని తరువాత లెనిన్ తన కుర్చీలో ఆసీనుడయ్యాడు. ఒక మహామేధావి తన నింత మర్యాద చేయటం రాయ్‌కి వింతగానే తోచినది. బాల్బనోవా తనను సాగనంపుతూ చేసిన హెచ్చరిక తన చెవులలో యింకా ప్రతిధ్వనిస్తూనే వున్నది. రాయ్‌ని గురించి, మెక్సికోలో రాయ్ నాయకత్వం, పార్టీ నిర్మాణం, ప్రభుత్వంలో పలుకుబడిని గురించి బరోడిన్

లెనిన్‌కు యిదివరకే వివరంగా తెలియచేయటం జరిగినది. రాయ్ నుంచి యింకా విషయాలు తెలుసుకోవాలనే ఆసక్తి లెనిన్ కనబరిచాడు. లాటిన్ అమెరికను దేశాల్లో పరిస్థితులు పరిపక్వం చెందటానికి ఇంకా కొంతకాలం పట్టవచ్చును. అమెరికా సామ్రాజ్యవాదజోక్యాన్ని ప్రతిఘటించవలసి వున్నది. కనుక ముందు పాతప్రపంచములో అణగద్రొక్కబడుచున్న ప్రజానీకాన్ని సంఘటితపరచి బల వత్తరమయిన విప్లవ వుద్యమాన్ని పెంపొందించవలసిన అవసరం ఎంతయినా వున్నది. లెనిన్ ప్రణాళిక ఇందుకొరకే సిద్ధం చేయబడినది. రాయ్ మెక్సికోలో బయలుదేరినప్పటినుంచీ ఇదే ఆలోచనలో వున్నాడు.

లెనిన్ తాను సిద్ధం చేసిన 'ముసాయిదా ప్రణాళిక'ను గురించి హెచ్చ రిస్తూ 'మీరు పరిశీలించారా ?' అని రాయ్‌ని ప్రశ్నించాడు.

'లేదు. ఇప్పుడే అది నా కందినది. త్వరలో చూడగలను' అని నమ్ర భావంతో సమాధానం చెప్పాడు.

'అయితే మళ్లీ త్వరలో కలుసుకొని ఆ విషయం చర్చిద్దాం. వలస రాజ్యాల స్థితిగతులు నాకు క్షుణ్ణంగా తెలియవు. మీ సహకారంతో ఆ ప్రణాళికను సమగ్రంగా చర్చించి సుస్పష్ట స్వరూపంయిచ్చి వలసరాజ్యాలలో విప్లవ వుద్యమానికి ఆశాజ్యోతిని సమకూర్చటమే నా అభిమతం' అని లెనిన్ వెల్లడించాడు.

రాయ్ కూడా తాను మార్క్సిజాన్ని తెలుసుకొనినంతలో వలస రాజ్యాల చరిత్రకు, పరిస్థితులకు అనుకూలంగా ఒక క్రమబద్ధమయిన పంథా కనుగొనాలనే పట్టుదలతో వున్నాడు.

లెనిన్ టేబిలుమీద వున్న చిన్నబల్బు వెలిగినది. 'ఇది మేరియా ఆజ్ఞ. ఇంతటితో ప్రస్తుతానికి మన సమావేశం ముగిద్దాం. తరువాత మళ్లీ కలుసుకుందాం' అని చిరునగవు ప్రకటించటం, రాయ్ వీడ్కోలుగా తన కుర్చీనుంచి లేవటం తటస్థించినది. లెనిన్ తాను కూడా కుర్చీనుంచి లేచి రాయ్ దగ్గరకు వచ్చి మర్యాద సూచకంగా కరచాలనం చేసి తలుపు దగ్గరకు తీసుకొనివచ్చాడు. తలుపు ముందుగానే తెరచుకొని లోపల మరో వ్యక్తి చంకలో పెద్ద తోలుసంచి ధరించి ప్రవేశించాడు. లెనిన్ ఆయనను రాయ్‌కి పరిచయం చేసాడు. ఆయన కామ్రేడ్ జినోవీవ్. రాయ్‌తో సాదరపూర్వకంగా కరచాలనం చేసి మర్యాదగా ఒకటి రెండు మాటల తరువాత

'మళ్లీ కలుసుకుందాం' అని సంభాషణ ముగించాడు. ఆయన వెనుకనే ద్వారం దగ్గర మూడు పెద్ద పెట్టెలతో ఒక వ్యక్తి కాపలా కాస్తున్నట్లు నిలబడి వున్నాడు. 'జినోవీవ్ అధిష్ఠించిన మూడు వున్నత పదవులలో ఒక దానికి సంబంధించిన ముఖ్య పత్రాలు వాటిలో వున్నవని' రాయ్ తరువాత గ్రహించగలిగాడు.

కామ్రేడ్ జినోవీవ్ మాస్కోనగర సోవియటు అధ్యక్షులు, కమ్యూనిస్టు పార్టీ పొలిట్ బ్యూరో సభ్యులు, కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ కార్యవర్గానికి అధ్యక్షులు. కాబట్టి లెనిన్ తరువాత సాధారణంగా జినోవీవ్ రెండవనాయకునిగా ఎన్నబడుతూ వచ్చాడు.

# మే దినోత్సవం:

1920 మొదట్లో దాదాపు ప్రపంచంలోని అన్ని రహదార్లు మాస్కో చేరుచున్నట్లుగానే కనపడ్డవి. థర్డ్ ఇంటర్నేషనల్ ద్వితీయ కాంగ్రెసు మహాసభకు ప్రపంచంలోని దాదాపు అన్ని దేశాలనుంచి ప్రతినిధులు వచ్చారు. ఇందులో కొందరు బాహాటంగా, మరికొందరు రహస్యంగా మాస్కో చేరారు. ప్రథమ ప్రపంచయుద్ధం పరిసమాప్తమయినా రష్యా అంతర్యుద్ధంతోనూ, మిత్రరాజ్యాల దిగ్బంధంతోనూ అసాధారణ స్థితిలో వున్నది. రష్యాకు పడమటి దేశాలనుంచి వచ్చే ప్రతినిధులు జర్మనీనుంచి రహస్యంగా లెనిన్‌గ్రాడ్ చేరాలి. తూర్పున జపాను సైన్యం సైబీరియా వరకు ఆక్రమించి వుండటంచేత తూర్పుదేశాలనుంచి కూడా ప్రతినిధులు బాహాటంగా రావటానికి వీలులేదు. అయినా ప్రపంచ విప్లవానికి ఆశాజ్యోతి అయిన సోవియట్ రష్యాను సందర్శించాలనే కుతూహలం, పట్టుదలతో, ప్రోలిటేరియన్ నియంతృత్వ రాజ్యానికి యాత్రికులుగా వివిధ ఖండాలలోని వివిధ దేశాలనుంచి ప్రతినిధులు రాగలిగారు. వీరందరికీ నూతనంగా నిర్మించబడిన ఒక మూడంతస్తుల భవనంలో ప్రత్యేకంగా వసతులు యేర్పరచబడ్డవి. రాయ్‌కి అదివరకే ప్రభుత్వ అతిథిగా మాస్కోనది ప్రక్కనవున్న 'షుగర్‌కింగ్‌ప్యాలెసు'లో వసతి వున్నా కాంగ్రెసు మహాసభ ప్రతినిధిగా యీ భవనంలోకూడా ఒక గది ప్రత్యేకించ బడినది. రాయ్ తరచుగా అక్కడేవుంటూ వివిధ దేశాలనుంచి వచ్చిన ప్రతినిధులతో పరిచయం, స్నేహం పెంపొందించుకో గలిగాడు.

ప్రపంచ యుద్ధంలో అమెరికా ప్రెసిడెంటు విల్సను 'పరాధీన దేశాలకు స్వయం నిర్ణయహక్కు' ఇవ్వబడుతుందని ప్రకటించాడు. కాని ఆ సూత్రాన్ని ఆచరణలో పెట్టగలిగినది లెనిన్ మాత్రమే. యుద్ధానికి ముందు పోలండు, బాల్టిక్ దేశాలు జారు ప్రభుత్వ పరిపాలనలో వుండేవి. అవి స్వయం నిర్ణయ సూత్రంక్రింద స్వతంత్ర దేశాలుగా ప్రకటించబడినవి. కాని అచ్చటి ప్రభుత్వాలు కాపిటలిస్టు దేశాలకు అనుకూలంగా మారి తమ దేశాల్లోని అభ్యుదయగాములైన సోషలిస్టు, కమ్యూనిస్టు పార్టీలను నిషేధించి దమనచర్యలకు దిగటంతో అనేకమంది ప్రముఖ నాయకులు రష్యాలో ప్రవాసం అనుభవించ సాగారు.

వీరిలో చాలామందితో రాయ్‌కి బాగా పరిచయ మేర్పడినది. రాయ్ వీరికి ఒకవిధంగా అభిమాన పాత్రుడు కాగలిగాడు. లెనిన్ సిద్ధాంతం ప్రకారం జాతీయభావం - (బూర్జువా ప్రజాస్వామిక విప్లవం) - విప్లవాత్మక చర్యగా భావించ బడుచున్నది. ఒకవిధంగా యిది విప్లవాత్మకం అయినా సక్రమమయిన విప్లవ నాయకత్వం, కార్యక్రమం లోపించినప్పుడు జాతీయభావం వెర్రితలలు వేయక తప్పదని రాయ్ అభిప్రాయం. స్వయం నిర్ణయహక్కు పొందిన పోలండు, బాల్టిక్ దేశాలలో యిదే జరిగినది. కనుక ప్రవాసం అనుభవించే సోషలిస్టులు, కమ్యూనిస్టులు రాయ్‌ని సిసలయిన కమ్యూనిస్టుగా ప్రస్తుతించుచూ అభిమానిస్తూ వుండేవారు. ప్రతినిధులుగా వచ్చిన వారిలో ఇటలీ, జర్మనీ, ఫ్రెంచి దేశాల నుంచి వచ్చిన వారెక్కువమంది. అనార్కిస్టు, సిండికలిస్టు, సోషలిస్టు, కమ్యూనిస్టు మొదలైన పార్టీలు విరివిగా వుండటంచేత అన్ని పార్టీలనుంచి పోటీగా ప్రతినిధులు వచ్చారు.

1920 మే 1వ తేదీన మే దినోత్సవ సందర్భంగా బ్రహ్మాండమయిన వూరేగింపు జరిగినది. రష్యా విప్లవ విజయసూచకంగా సైనికులు, పారిశ్రామిక వర్గం, వ్యవసాయ శ్రామికులు మైళ్లతరబడి వూరేగింపు జరిపి మహాసముద్రంలాగా లక్షలకొలది క్రెమిలిన్ ముఖద్వారం ముందు రెడ్‌స్క్వేర్‌లో సమావేశం కావటం చారిత్రక ఘట్టంగా చిత్రించవచ్చును. ఉదయం కేవలం పార్టీనాయకులు, కాంగ్రెసు మహాసభకు విచ్చేసిన ప్రతినిధులు వందన స్వీకారం చేయటంతో కార్యక్రమం నిరాడంబరంగా ముగిసినది. సాయంత్రం బహిరంగసభ. ఇసుకవేసినా రాలని జనంతో మాస్కో నగరమంతా క్రిక్కిరిసి పోయినది.

ప్రత్యేకంగా అలంకరించిన వేదికను లెనిన్, యితర ప్రముఖ నాయకులు అలంకరించారు. ట్రాట్స్కీ, స్టాలిన్ యుద్ధరంగంలో వుండటంచేత వారిని మినహాయించి మిగిలిన వారందరూ వున్నారు. మాస్కో నగర సోవియటు అధ్యక్షులు కావటంచేత జినోవీవ్ ఆ సభకు అధ్యక్షత వహించవలసి వున్నది. ప్రతిసమావేశానికి ఆలస్యంగా రావటం ఆయనకు అలవాటు. అదేవిధంగా ఒక గంట ఆలస్యంగా వచ్చి క్షమాపణ చెప్పుకొని తన ఉపన్యాసం ప్రారంభించాడు. ఆకాలంలో లౌడు స్పీకరు ఏర్పాట్లు లేవు. అయినా ఎలుగెత్తి తన కంఠధ్వనితో సభికులను రంజింపచేసి హర్షధ్వానాల మధ్య ఉపన్యాసం ముగిస్తూ తరువాత కామ్రేడ్ రాయ్ ఉపన్యసిస్తాడని తన అధ్యక్షస్థానం అలంకరించాడు. అప్పటి ఆచారం ప్రకారం ఒక ఉపన్యాసకుడు తన ఉపన్యాసం ముగిస్తూ తన తరువాత ఉపన్యాసకుని పేరు సూచించటం పరిపాటి.

రాయ్‌కి చెమటలు పోసినంత పని జరిగినది. తనకు ముందుగా తెలిసి వుంటే కొంత ఆలోచించుకొనటానికి సమయం లభించేది. ఉపన్యాసానికి సిద్ధపడి వుండేవాడు. కాగా యింతవరకు పార్టీ సమావేశాల్లో, చర్చలలో, చిన్న చిన్న మీటింగులలో మినహాయించి ఇంత బ్రహ్మాండమయిన బహిరంగ సభలో వుపన్యసించి యుండలేదు. టెర్రరిస్టుగా ఎక్కడో ఒక మారుమూలలో రహస్యంగా ఒక అరడజనుమంది కూర్చొని మాతృదేశ విముక్తికి కార్యక్రమం నిర్ణయించటంతో తన జీవితం ప్రారంభించాడు. ఆయుధ సంపత్తి కొరకు చాల దేశాలు పర్యటించాడు. అమెరికా దేశంలో కూడా బహిరంగంగా తిరుగలేదు. మెక్సికోలో పార్టీ నిర్మాణం, ప్రభుత్వంతో మంతనాలు, కరపత్రాలు అచ్చువేయటం, పత్రికా సంపాదకునిగా కృషి చేయటం వినా బహిరంగ సమావేశాల్లో ఉపన్యాసాలు యిచ్చే అవసరం కనబడలేదు.

కామ్రేడ్ జినోవీవ్ పిలుపు ఒక మహారథికుని ఆజ్ఞగా రాయ్ మనసులో ప్రతిధ్వనించినది. అంతకంటె మిన్నగా తనముందువున్న అశేష జనసందోహం, ప్రజావాహిని రాయ్‌కి ఉత్సాహాన్ని, ఉద్రేకాన్ని కలిగించినవి. వేదికపై నిలబడి ఆవేశపూరితుడై, ఎలుగెత్తి నాలుగు ప్రక్కల ప్రతిధ్వనించేటట్లు పెద్ద కంఠస్వరంతో ఇంగ్లీషులో ఉపన్యసించాడు. వలసరాజ్యాలలో కమ్యూనిస్టులు అనుసరించవలసిన విధానం గురించి ముఖ్యంగా రాయ్ ఉపన్యాసం నడిచినది. తనముందు ఇంగ్లీషు

తెలసిన సభికులు హర్షధ్వానాలు చేయటం, అవి మొత్తం ప్రజానీకం అందుకొనటం జరిగినది. ఉపన్యాసానంతరం 'అంత పెద్దగళంతో అంత బ్రహ్మాండమయిన సభలో అందరికీ వినబడేటట్లు పుపన్యసించ గలిగినవాడు ట్రాట్స్కి- పొక్కడే'నని రాయ్‌ని అనేకమంది అభినందించారు.

## రెండవ కాంగ్రెసు మహాసభ :

రెండవ కాంగ్రెసు మహాసభకు విపుల సన్నాహాలు చేయబడ సాగినవి. మధ్యమధ్య వివిధదేశాల నుంచి మహాసభకు వచ్చిన ప్రతినిధుల కాలక్షేపం కొరకు మాస్కో నగరం చుట్టుప్రక్కల నున్న చరిత్రాత్మక ఘట్టాలను వారికి చూపుతూ, వారికొరకు సంగీత, నృత్య, వినోద కార్యక్రమాలు జరుపబడుతూ వచ్చినవి. మహాసభ సమయం దగ్గరకు రా సాగినది. ప్రతినిధులు అందులో చర్చించ వలసిన అంశాలను గురించి ఆలోచించసాగారు. కాని ఒకేదేశంనుంచి వచ్చిన ప్రతినిధులలో విభిన్న పార్టీలకు చెందిన వారున్నారు. వారు తమ తమ దేశాల్లో అనుసరించదగు విధానాలను, విప్లవ కార్యక్రమాలను గురించి విభిన్న మార్గాలు సూచించ సాగారు. మహాసభలో అందరికీ ఆమోదయోగ్యమయిన కార్యక్రమంలో భేదాభిప్రాయాలు పొడసూపినవి.

అంతర్జాతీయంగా, ముఖ్యంగా వలసదేశాలలో అనుసరించవలసిన పార్టీ నిర్మాణం, కార్యక్రమం గురించి లెనిన్ సిద్ధపరచిన ప్రణాళికను చర్చించి, వివిధ దేశాల ప్రతినిధుల అభిప్రాయాలను సేకరించి ఆ ప్రణాళికకు అందరి ఆమోదంతో ఒక సుస్పష్టరూపం కలిగించాలనే దృష్టితోనే లెనిన్ రెండవ కాంగ్రెసు మహాసభను యేర్పాటు చేయటం జరిగినది. కాని ఎవరూ దీని ప్రాముఖ్యతను గుర్తించినట్లు లేదు. పాశ్చాత్య దేశాలు, అమెరికా మినహాయించి మిగిలిన ప్రపంచంలో సమస్య లున్నట్లే వారు భావించటంలేదు. తమను లెనిన్ ఆహ్వానించినది కేవలం మర్యాద కొరకే నన్నట్లు వారు భావించసాగారు. రష్యావిప్లవం, వర్సైల్సు సంధితో అన్ని సమస్యలు తీరినట్లుగానే వారు భావించారు. రష్యాదేశం, రష్యా అధినేత లెనిన్ చెప్పినది వేదవాక్యంగా పరిగణించటమే వారివిధి. ఇదే భావం రానురాను ప్రబలి తక్కిన కమ్యూనిస్టు రాజ్యాలు చాలకాలం రష్యాను గ్రుడ్డిగా అనుసరించినవి.

బ్రిటిషు ప్రతినిధులు కొంతవరకు వలస రాజ్యాల స్థితిగతుల మీద శ్రద్ధ చూపారు. బ్రిటిషు ప్రతినిధివర్గ నాయకుడు టామ్‌క్వెల్‌్క లెనిన్ సిద్ధాంతంలోని అంతరార్థాన్ని గ్రహించగలిగాడు. కాపిటలిస్టు దేశాల్లోని 'శ్వేతజాతీయుని బరువు' ప్రపంచ శ్రామికవర్గం మీద పడినట్లు తెలుసుకొన్నాడు. వలస రాజ్యాలలోని ప్రతినిధులతో ఇష్టాగోష్ఠి సంభాషణలు ప్రారంభించాడు. కాని వారినుంచి ఆయనకు ఆశించినంతగా సహకారం రాలేదు. కాని రాయ్, టామ్‌క్వెల్‌్క యీ సంభాషణల వలన బాగా సన్నిహితులయ్యారు. తరువాత డచ్, అమెరికా ప్రతినిధులు కూడా వీరి అభిప్రాయాలతో ఏకీభవించటంతో వీరి వర్గం పెరిగినది.

కాంగ్రెసు మహాసభకు ముందుగా లెనిన్‌గ్రాడ్‌లో ప్రారంభోత్సవం జరిపి తరువాత ఎజండా నంతటినీ మాస్కోలో చర్చించాలని నిర్ణయం గైకొన బడినది. ప్రపంచ విప్లవానికి లెనిన్‌గ్రాడ్ ప్రథమస్థానం. అక్కడే లెనిన్ నాయకత్వం క్రింద 1917 నవంబరు 7 న సోవియటు ప్రభుత్వ స్థాపన జరిగినది. కనుక ఆ చరిత్రాత్మక చిహ్నమయిన లెనిన్‌గ్రాడ్‌లో మహాసభ ప్రారంభోత్సవం జరుపాలని నిశ్చయించుకున్నారు.

ప్రత్యేకంగా యేర్పాటు చేయబడిన మూడు రైలు బండ్లలో ప్రతినిధు లందరూ మాస్కోనుంచి లెనిన్‌గ్రాడ్ బయలుదేరటం చారిత్రక ఘట్టంగా అభివర్ణించ వచ్చును. మాస్కో నగరవాసులు మక్కువతో శుభాకాంక్షలు ప్రకటించటం, లెనిన్‌గ్రాడ్ వాసులు స్టేషనుకు ఎదురొచ్చి వీరోచిత మర్యాదలతో అభినందించి ఆహ్వానించటం మరపురాని ఘట్టం. ప్రపంచ విప్లవం నిజంగా కనుచూపుమేరలోనే వున్నట్లు అందరూ భావించారు. బ్రహ్మాండమయిన వూరేగింపుతో, మేనులువ్వొంగు మేళ, తాళాలతో నగరవాసులు ముందు నడువ, ప్రతినిధులు నగరమంతా తిరిగి 'రాజభవనం' ప్రవేశించారు. (బోల్షివిక్కులు లెనిన్ నాయకత్వం క్రింద ప్రథమంగా తమ జెండా ఎత్తినది యీ రాజభవనంలోనే.)

'రాజభవన' ప్రవేశానికి ముందు వివిధ నాయకులను వర్గాలుగా విభజించి ఫోటోలు తీయటం జరిగినది. కామ్రేడ్ లెనిన్ ఒకప్రక్క రాయ్, జినోవీవ్, బుఖారిన్‌లను, మరోప్రక్క రాడెక్, గోర్కీ ప్రభృతులను నిలబెట్టుకొని ఫోటో తీయించుకొనటం గమనార్హం. థర్డు కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌లో ఈ ఫోటో

చరిత్రాత్మకంగా కొంతకాలం ప్రాముఖ్యతను కలిగి వున్నది. ఆ కాలంలో వివిధ దేశాల కమ్యూనిస్టులు తమ కార్యాలయాల్లో అదృశ్యప్రాయంగా యీ ఫోటో అలంకరించుకున్నారు కూడాను.

ఆ రాత్రికే లెనిన్ కొంతమంది రష్యన్ నాయకులతో కలిసి తిరిగి మాస్కో వచ్చాడు. ప్రతినిధులు మరునాడు కూడా అక్కడ వుండి నగరంలోని చారిత్రక ఘట్టాలు సందర్శించారు. సాయంత్రం బ్రహ్మాండమయిన బహిరంగ సభ జరిగినది. మే దినోత్సవంలో మాదిరిగానే మొదట జినోవీవ్, తరువాత రాయ్ వుపన్యసించి సభికుల మన్ననలు పొందకలిగారు.

రాయ్ లెనిన్‌గ్రాడ్‌లో అమెరికను కమ్యూనిస్టు నాయకుడు జాన్‌రీడ్ ను ('ప్రపంచాన్ని ఉర్రూతలూగించిన పది దినాలు' గ్రంథకర్త) కలుసుకొన్నాడు. ఆయన భార్య మాస్కోలో జర్నలిస్టుగా వుంటున్నది. ఆమెతో రాయ్‌కి మాస్కోలో అదివరకే పరిచయ మేర్పడినది. రాయ్‌ని గురించి, మెక్సికోలో రాయ్ చరిత్రను గురించి జాన్‌రీడ్ అదివరకే కొంత తెలుసుకొని వుండటంచేత యిద్దరూ ఒకరిపై నొకరు ఆదరభావం చూపుకొనగలిగారు.

ప్రతినిధులందరూ మాస్కో చేరారు. కాంగ్రెసు మహాసభ రంగం లెనిన్ గ్రాడ్ నుంచి మాస్కోకు మారినది. ఇది కమ్యూనిస్టు విప్లవ వుద్యమ చరిత్రలో మలుపురాయిని సూచించగల ప్రధాన ఘట్టం. లెనిన్ సిద్ధాంతాన్ని, సిద్ధపరచిన ప్రణాళికను దీర్ఘంగా చర్చించవలసి వున్నది. చర్చల అనంతరం అందరికీ అంగీకారయోగ్యమయిన తీర్మానాన్ని మహాసభలో ఆమోదించవలసి వున్నది. వలస రాజ్యాలయిన తూర్పు దేశాల్లో విప్లవ వుద్యమాలను బలపరచటానికి తగిన కార్యక్రమం రూపొందించవలసి వున్నది. అందుకు అవసరమయిన సాధన సంపత్తిని చేకూర్చవలసి వున్నది.

కారల్‌మార్క్స్ సిద్ధాంతం, అంచనాప్రకారం ముందుగా పారిశ్రామికంగా అభివృద్ధిచెందిన ఇంగ్లండు, జర్మనీదేశాల్లో 'కార్మిక నియంతృత్వం' రావలసి వున్నది. అది జరుగలేదు. ఇందుకు అనేక కారణాలుండ వచ్చును. కాని ప్రధానంగా యిచ్చట ఒక కారణం వుదహరించటం అవసరం. వలస రాజ్యాల విస్తరణతో కాపిటలిస్టు దేశాలు అంతులేని ఆర్థిక లాభాలను గడించసాగినవి,

మాతృదేశాలలోని శ్రామికవర్గాలను అదుపులో వుంచటానికి, తమ సామ్రాజ్య విస్తరణ సాగించటానికి కాపిటలిస్టులు తాము గడించే లాభాలలో కొంత శాతం తమ మాతృదేశ శ్రామికవర్గ ఆర్థిక పరిస్థితులను మెరుగుపరచటానికి వెచ్చించసాగారు. వారి వేతనాలు పెంచబడ్డవి. వసతి గృహాలు నిర్మించ బడ్డవి. ఆరోగ్యసూత్రాలు కట్టుదిట్టం చేయబడ్డవి. పనిగంటలు, విరామకాలం క్రమబద్ధం చేయబడ్డవి. వీనివలన కాపిటలిస్టులు పోగొట్టుకొనేది అతిస్వల్పమే. అయినా యీ విధానం వలన పరిశ్రమలు కుంటుబడకుండా అదనపు లాభాలను గడించ సాగారు.

దీని ఫలితంగా కాపిటలిస్టు దేశాల్లో విప్లవ వుద్యమం సన్నగిల్ల సాగినది. శ్రామికవర్గ నాయకత్వంలో మితవాద, అతివాద ధోరణులు ప్రబల సాగినవి. లెనిన్ వలసరాజ్యాల విముక్తికి మాతృదేశాల్లో శ్రామిక వుద్యమాన్ని లేవదీయాలంటే సోషల్ డెమోక్రాట్స్ వలసరాజ్యాలు 'సర్వస్వతంత్ర దేశాలు' కావటం కంటె ఆయా సామ్రాజ్యదేశాల్లో 'స్వయం - నిర్ణయహక్కు' కలిగిన దేశాలుగా వుండటం మంచిదనే వాదన సాగించారు. సెకండు ఇంటర్నేషనలు సంస్కరణ వాదంగా, అభివృద్ధి నిరోధకంగా, విప్లవ వ్యతిరేకంగా చిత్రింపబడి లెనిన్ నాయకత్వం క్రింద తీవ్రవాదులు, బోల్షివిక్కులు థర్డు ఇంటర్నేషనల్ స్థాపించటం జరిగినది.

లెనిన్ రూపొందించిన జాతీయ, వలసరాజ్యాల సిద్ధాంతం ఆయన అంత వరకూ సమర్థిస్తూ వచ్చిన అంశాలమీదనే ఆధారపడి వున్నది. 'వలస రాజ్యాల విముక్తి జరుగాలంటే ముందు ఐరోపా ఖండంలోని మాతృదేశాలలో వుద్యమం లేవదీయాలి'. కాని ఆచరణలో యిది ఫలప్రదం కాగాపోగా భగ్నమయినది. 'వలసరాజ్య విస్తరణతో సామ్రాజ్యవాదులు విపరీతమయిన లాభాలు గడిస్తూ అందులో కొలది శాతం శ్రామికులకొరకు వెచ్చిస్తూ వారిని విప్లవ వ్యతిరేకవర్గంగా మార్చగలుగు చున్నారు. కనుక వలసరాజ్య విస్తరణను అరికట్టటమే కాకుండా వలసరాజ్య తత్వాన్నే నాశనం చేయాలి, అనే సిద్ధాంతాన్ని లెనిన్ లేవదీసాడు. విప్లవరంగం ఐరోపాఖండం నుంచి ఆసియా, ఆఫ్రికా ఖండాలకు మారినది. 'ప్రపంచ విప్లవం విజయవంతం కావాలంటే వలస దేశాలలో జరిగే జాతీయ వుద్యమాలను అన్నివిధాల బలపరచాలి' అని నూతన దృక్పథంతో లెనిన్ తన జాతీయ, వలసరాజ్యాల సిద్ధాంతాన్ని రూపొందించాడు. ఐరోపాఖండ కాపిటలిస్టు దేశాలను ఆశియా, ఆఫ్రికాఖండ వలస రాజ్యాల్లో జయించాలని లెనిన్ ఆదర్శం.

రెండవ కాంగ్రెసు మహాసభలో లెనిన్ తన సిద్ధాంతాన్ని ప్రవేశపెట్టుచూ సోషలిస్టు సెకండు ఇంటర్నేషనల్ ఆసియా, ఆఫ్రికా ఖండాల ప్రాముఖ్యతను గుర్తించ నందున అది అంతర్జాతీయ సంస్థ కాదని థర్డు ఇంటర్నేషనల్ వలస రాజ్యాలను గుర్తించటంతో దీనికి అంతర్జాతీయ ప్రాముఖ్యత వచ్చినదని ఉదహరించాడు.

19 వ శతాబ్దంలో మార్క్సు, ఏంగిల్సు హంగేరీ, పోలండు సామ్రాజ్య దేశాలలో 'స్వయంనిర్ణయ హక్కు' కొరకు పోరాడే ఉద్యమాలను బలపరిచారు. లెనిన్ అదే సూత్రాన్ని సమర్థిస్తూ విప్లవానంతరం జారు సామ్రాజ్యం క్రింద వున్న పోలండు, బాల్టిక్ దేశాలను స్వతంత్ర దేశాలుగా ప్రకటించాడు. కాని అచ్చట బూర్జువా నాయకత్వం క్రింద నున్న ప్రభుత్వాలు కాపిటలిస్టు దేశాలతో పొత్తు కలిపి శ్రామికవర్గ వుద్యమాలను, సోషలిస్టు - కమ్యూనిస్టు పార్టీలను అణచివేసినవి. కనుక విప్లవ వుద్యమాన్ని వలస రాజ్యాల్లో విస్తరింప చేయటం తప్పనిసరి అయినట్లు భావించబడినది.

సిద్ధాంతరీత్యా యిది సక్రమంగానే వున్నది. మాతృదేశాల్లోని మితవాదు లయిన సోషల్ డెమోక్రాటిక్ నాయకుల వాదాన్ని ఇది బలహీనపరుస్తుంది. ట్రేడ్ యూనియన్ వుద్యమంలోని 'అరిస్టోక్రాటిక్' తత్వాన్ని పసుమ్మచేస్తుంది. శ్రామిక వుద్యమం తీవ్రవాదుల కార్యక్రమాన్ని చేపట్టుతుంది. కాని రాయ్‌కి వున్న సందేహాలు అలాగే మిగిలి పోయినవి.

"సెకండు ఇంటర్నేషనల్ ఆమోదించిన తీర్మానాలు చిత్తశుద్ధితో చేసినవే. కాని వాటిని అమలు జరపటానికి, ఆచరణలో పెట్టటానికి తగిన సాధన సంపత్తి అప్పుడు లేదు. ఇప్పుడు రష్యాలాంటి ఒక పెద్ద దేశంలో కార్మిక ప్రభుత్వ మున్నది. ఇది ప్రపంచ విప్లవానికి ఆశాజ్యోతి. యూరోపు ఖండంలోని పారిశ్రామి కంగా అభివృద్ధి చెందిన వివిధ దేశాల్లో శ్రామికవర్గం కూడా సుసంఘటితమయి బలవత్తరమయిన శక్తిగా రూపొందినది. సోవియటు రష్యా సహకారం, అండ దండలతో శ్రామికవర్గం ప్రజా వుద్యమానికి 'నాయకత్వం వహించి' తమ తమ సామ్రాజ్య ప్రభుత్వాలను కూలద్రోసి అధికారం చేపట్టవచ్చును. కాని వలస

రాజ్యాల్లో అలాంటి సుసంఘటిత శ్రామిక పార్టీలు లేవు. అట్టి పరిస్థితుల్లో కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ జాతీయ విమోచన వుద్యమాలను ఏ విధంగా పెంపొందించ గలుగుతుంది ?

"బూర్జువా నాయకత్వం క్రింద జరిగే జాతీయ వుద్యమాలు విప్లవాన్ని భగ్నం చేయగలవు. అధికారం చేపట్టేవరకు ప్రజానీకాన్ని అండగా వుపయోగించుకొంటుంది. అధికారం చేపట్టగానే తమ స్వార్థం కొరకు ప్రజావుద్యమాన్ని బలి చేస్తుంది. ఐరోపాఖండంలో, ముఖ్యంగా పోలండు, బాల్టిక్ దేశాల్లో యిదే జరిగినది. వలస రాజ్యాలలోకూడా దీనికి ప్రతిగా ఎందుకు జరుగుతుంది ? వలస రాజ్యాలలో బూర్జువా ప్రజాస్వామిక విప్లవ ఆవశ్యకత వున్నది. అందుకు బూర్జువా వర్గం నాయకత్వం వహించి తమ ఆశయాన్ని ఫలింపచేయటానికి ప్రజాసామాన్యాన్ని కూడగట్టుతుంది. కాని అచ్చటి శ్రామికవర్గం బలహీనంగా వుండటంచేత తమ స్వప్రయోజనాల్ని తేలిగ్గా ఫలప్రదం చేసుకొన కలుగుతుంది."

రాయ్ లెనిన్‌ని ఇదే ప్రశ్నించాడు. వలస రాజ్యాలలోని ప్రజల సామాజిక, ఆర్థిక పరిస్థితులను లెనిన్ లోతుకుదిగి క్షుణ్ణంగా పరిశీలించలేదు. కనుకనే తన ప్రణాళిక "కామ్రేడ్ రాయ్ పరిశీలనకు, సలహా నిమిత్తం" ఆయనకు అందచేయబడ్డది. వారి మొదటి సమావేశంలోనే లెనిన్ వలసరాజ్యాల స్థితిగతులు తనకు పూర్తిగా తెలియవని అంగీకరిస్తూ రాయ్ అభిప్రాయాలను కోరటం జరిగినది.

"సామ్రాజ్యవాదం వలసరాజ్యాల అభివృద్ధిని నిరోధించి అచ్చటి సమాజాన్ని జమిందారీ (ఫ్యూడల్) యుగంలోనే అట్టిపెట్టటానికి ప్రయత్నిస్తుంది. దీనివలన అచ్చట కాపిటలిజం అభివృద్ధి చెందదు. బూర్జువా వర్గానికిది కంటగింపు. కనుక చరిత్రాత్మకంగా జాతీయ విమోచన వుద్యమం బూర్జువా ప్రజాస్వామిక విప్లవంగా రూపొందాలి. ప్రోలిటేరియన్ విప్లవానికి ముందు ఇది జరుగవలసి వున్నది. కనుక వలసరాజ్యాల్లో కమ్యూనిస్టులు జాతీయ బూర్జువా నాయకత్వం క్రింద జరిగే పోరాటాన్ని బలపరచటం తమ కర్తవ్యంగా భావించాలి. అంతవరకు బూర్జువావర్గం విప్లవాత్మకంగానే కృషి చేస్తుంది." ఇది లెనిన్ వాదం.

"వలస రాజ్యాలు, ముఖ్యంగా భారతదేశం వంటి అభివృద్ధి చెందుతున్న దేశాల్లో బూర్జువా ప్రజాస్వామిక విప్లవానికి వుద్యమ పోరాటాలు జరుగుచున్నవి.

ఈ జాతీయ విమోచన పోరాటంలో నాయకత్వం విప్లవానికి వ్యతిరేకం. బూర్జువా వర్గం కేవలం తమ హక్కుల కొరకు యీ పోరాటంలో భాగస్వామిని అయినది. తమ పెట్టుబడులకు కావలసిన సహకారం, రక్షణ లభించగానే విదేశీ పెట్టుబడిదారీ వర్గంతో కలిసి ప్రజా పుద్యమాన్ని అణచటానికి ప్రయత్నిస్తుంది....అధికార బదలాయింపులో తానే అధికారం చేపట్టి జాతీయ విమోచన పుద్యమ ఆశయాన్ని భగ్నం చేస్తుంది." ఇది రాయ్ ప్రతివాదం.

భారతదేశంలోని కాంగ్రెసు పుద్యమానికి గాంధీ నాయకత్వంలో వీరిద్దరికీ భేదాభిప్రాయాలు వచ్చినవి. ప్రజా పుద్యమ నాయకుడుగా మహాత్మాగాంధీ లెనిన్ దృష్టిలో విప్లవవాది. రాజకీయంగా ప్రజానీకాన్ని సంఘటిత పరచటంలో గాంధీ విప్లవవాది కావచ్చును. కాని మతపరంగా, సాంస్కృతికంగా పున్న సామాజిక వ్యవస్థను, ఆర్థిక వ్యవస్థను తొలగించి నూతన సమాజాన్ని నిర్మించటానికి గాంధీ వ్యతిరేకుడు. సామాజిక, ఆర్థిక పునర్వ్యవస్తీకరణ జరుగనిదే విప్లవ ఆశయం ఫలించదు. కనుక గాంధీ విప్లవ వ్యతిరేకి అని రాయ్ అభిప్రాయం.

లెనిన్ జాతీయ, వలసరాజ్యాల సిద్ధాంతాన్ని ప్రధానంగా మూడు భాగాలుగా విభజించవచ్చు. (1) జాతీయ పెట్టుబడిదారీ వర్గాన్ని కూలద్రోయటానికి ముందు సామ్రాజ్య తత్వాన్ని అరికట్టాలి. (2) ఆసియా, ఆఫ్రికాఖండ వలసదేశాల్లో దేశీయ బూర్జువావర్గ నాయకత్వం క్రింద జరుగుచున్న జాతీయ విమోచన పుద్యమాలు బహిర్గతంగా అవసరాన్నిబట్టి శీఘ్రగమనం కొరకు విప్లవ పూరితంగా భావించాలి. (3) ప్రధానమయిన వలసతత్వ విధానాన్ని నాశనం చేయటానికి గాను యీ జాతీయ విమోచన పుద్యమాలకు 'తాత్కాలికంగా' అన్ని విధాల సహకరించాలని ఆయా వలసదేశాల కమ్యూనిస్టులకు విజ్ఞప్తి చేయటం.

లెనిన్ తన సిద్ధాంతంలో సూచించిన యీ ప్రధాన ప్రాతిపదికలకు పత్తాసిగా సిద్ధాంతప్రారంభంలోనే 'సోవియటు రష్యా నాయకత్వంక్రింద కాపిటలిస్టు దేశాల్లోని ప్రోలిటేరియన్ కార్మికవర్గం, వలస దేశాల్లోని శ్రామికవర్గం ఏకమయి బూర్జువా పెట్టుబడిదారీ విధానాన్ని, ఫ్యూడల్ విధానాన్ని ఒకేసారి కూలద్రోయటానికి కలసి కట్టుగా విప్లవ పోరాటాన్ని జరుపాలని' హెచ్చరిస్తూ అందుకు రష్యా అన్నివిధాల సహాయం చేయటానికి కృతనిశ్చయంతో పుందని సూచించాడు.

సిద్ధాంతరీత్యా లెనిన్ వాదన చాల సబబు గానే వున్నది. ఆచరణలో రాయ్ సందేహం వెలిబుచ్చాడు. స్వతంత్రదేశాలయిన కాపిటలిస్టు దేశాల్లోని కమ్యూనిష్టులు సోవియటు రష్యానుంచి రాయబార కార్యాలయాల ద్వారా, ఇతరత్రా ఆర్థిక సహాయాన్ని, ప్రచార సాధన సంపత్తిని పొందటానికి అనేక అవకాశాలున్నవి. కాని వలస రాజ్యాలకు అట్టి అవకాశంలేదు. అట్టి పరిస్థితుల్లో వలస రాజ్యాల్లోని జాతీయ విమోచన వుద్యమాలను కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ తాను ఆశించే ప్రపంచ శ్రామిక విప్లవ అంతర్భాగంగా ఎలా అభివృద్ధి చేయగలదు? దీనికంటె ప్రధానమయిన మరొక సందేహంకూడా రాయ్ వెలిబుచ్చాడు.

వలస రాజ్యాలన్నింటినీ ఒకే విధంగా పరిగణించటానికి వీల్లేదు. ముఖ్యంగా 'అభివృద్ధి చెందుతున్న వలసరాజ్య' మయిన భారతదేశంలోని బూర్జువా వ్యవస్థను, సాంస్కృతికంగా, ఆర్థికంగా అభివృద్ధి చెందని వలస రాజ్యాల్లోని జమీందారీ వ్యవస్థతో పోల్చటానికి వీలులేదు. కాగా బూర్జువా ప్రజాస్వామిక విప్లవం లెనిన్ ఆశించిన విధంగా భారతదేశంలో గాంధీ నాయకత్వం క్రింద ఫలప్రదం కాజాలదు. పైగా సమాజాభివృద్ధికి దోహదకారి కావటానికి మారుగా సాంస్కృతికంగా, మతపరంగా చరిత్రను వెనుకకు నెట్టే అభివృద్ధి నిరోధక వ్యవస్థకు దారితీస్తుంది అని రాయ్ బాహాటంగా వెల్లడించాడు. దీనిని నిరోధించి విప్లవం సక్రమ పంథాలో నడపటానికి రైతులు, కార్మికులతో కూడిన కమ్యూనిస్టు పార్టీని స్థాపించటం అవసరం. సమాజ మార్పులకు దేశీయ బూర్జువావర్గం భయపడి సామ్రాజ్యవాదులతో రాజీపడి తమ వర్గప్రయోజనాలకు ప్రయత్నిస్తుంది. అట్టి పరిస్థితుల్లో వుద్యమ నాయకత్వం చేపట్టటానికి సిద్ధంగా వుండగల బలాన్ని కమ్యూనిస్టుపార్టీ పొందగల స్థితిలో వుండాలి. అందుకు కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ అవసరమయిన సాధన సంపత్తిని అందచేయాలి అని రాయ్ వాదించాడు.

తన వాదనకు మద్దతుగా రాయ్ ప్లెఖనోవ్‌ని ఆధారంగా చూపించాడు. ప్లెఖనోవ్ లెనిన్‌కి రాజకీయ గురువు. మార్క్సిజం ఆయన దగ్గరే నేర్చుకున్నాడు. 19 వ శతాబ్ది అంతంలో రష్యాలో జరిగిన ప్రజా వుద్యమాన్ని - (పాపులిస్టు, సోషలిస్టు వుద్యమం) - భారత జాతీయ వుద్యమంతో పోల్చి చూపించాడు. రాజకీయ అధికారం కొరకు యీ వుద్యమం బయలుదేరినది. కాని సామాజికంగా పాశ్చాత్య పెట్టుబడిదారీ పద్ధతిని తీవ్రంగా నిరసించటమే కాకుండా బూజుపట్టిన తమ సామాజిక

వ్యవస్థను పునరుద్ధరించటానికి తీవ్రప్రచారం కూడా జరిగినది. ప్లెఖనోవ్ దీన్ని రాజకీయంగా విప్లవాత్మకం గానూ, సామాజికంగా విప్లవ ప్రత్యాఘాతం గానూ అభివర్ణించాడు.

లెనిన్ తన పట్టుదలను సడలించుకొనక తప్పలేదు. రాయ్‌ని ప్రత్యామ్నాయ సిద్ధాంతం రూపొందించమని కోరాడు. అంతవరకు చర్చలు వారిద్దరి మధ్యనే జరుగుతూ వచ్చినవి. ఇప్పుడు బహిరంగంగా ప్రత్యామ్నాయ సిద్ధాంతం రూపొందించటం అంత తేలికైన విషయంకాదు. ప్రతినిధులలో అప్పటికే గుసగుసలు బయలు దేరినవి. ప్రపంచ విప్లవ నాయకుని ఒక భారత యువకుడు సాహసించి ఎదురు ప్రశ్నలు వేయటం వారికి నిజంగా ఆశ్చర్యంగానే కనబడినది. కాని లెనిన్ నియంతకాదు. ఎదుటివారి అభిప్రాయాలు తెలుసుకొనటంలో చాల ఉదారంగానూ, సహనంగానూ వ్యవహరించగల సరళస్వభావుడు. మొదట్లో రాయ్ అభిప్రాయాలను తేలిగ్గా చూచినా రాయ్ చూపిన ఆధారాలను కాదనలేక పోయాడు. 'నిజంగా యిది నా జీవితంలో మరపురాని, అమూల్యమయిన ఘట్టం' అని రాయ్ భావించాడు.

రాయ్ అభిప్రాయాలకు సముచితస్థానం, విలువ వున్నవని లెనిన్ గ్రహించాడు. 'వలసరాజ్య కమిషన్‌లో మన యిద్దరి సిద్ధాంతాలను కూలంకషంగా చర్చించి మహాసభలో అంగీకరింప చేయటానికి సిఫారసు చేయగలనని' లెనిన్ చెప్పటం రాయ్‌ని ఆశ్చర్య చకితుని చేసినది. రాయ్ తన సిద్ధాంతం తయారు చేయటానికి సిద్ధపడ్డాడు. అయితే అది ప్రత్యామ్నాయం కాకుండా అనుబంధ సిద్ధాంతంగా మహాసభలో ప్రవేశపెట్టాలని లెనిన్‌ని అభ్యర్థించాడు.

"మనం నూతన సిద్ధాంతాన్ని ప్రవేశపెట్ట బోవుచున్నాము. అనుభవపూర్వకంగా యదార్థ స్థితిగతులు తేలేవరకు అంతిమ నిర్ణయం చేయకుండా వుందాము" అని లెనిన్ సమాధానం యివ్వటంతో వారి చర్చలు పూర్తి అయినవి.

రాయ్ తన సిద్ధాంతం పూర్తిచేసి రెండు కాపీలు టైపుచేయించి ఒకటి లెనిన్ కందచేసాడు. లెనిన్ ప్రత్యేక శ్రద్ధతీసుకొని పరిశీలించి తన సంతృప్తిని ప్రకటించాడు. రాయ్ అంగీకారంతో అక్కడక్కడ కొలది మార్పులు కూడా చేసాడు. వలసరాజ్యాల కమిషన్‌లో ఇద్దరి సిద్ధాంతాలు ప్రవేశపెట్టినప్పుడు ఆసక్తి

దాయకమయిన కొంత చర్చ జరిగినా స్నీవ్‌లీట్ మినహాయించి మిగిలిన ప్రతినిధులు లెనిన్ మర్యాద కొరకు రాయ్ సిద్ధాంతాన్ని ప్రవేశ పెట్టుచున్నాడని, అంతకంటే దానికి ప్రత్యేకమయిన స్థానమేమీ లేదనే అభిప్రాయంలో వున్నారు.

స్నీవ్‌లీట్ డచ్ ప్రతినిధి. డచ్ దేశస్థుడయినా డచ్ వలస రాజ్యమయిన ఇండోనేషియాలో అనేక సంవత్సరాలుండి కార్మికసంఘాలు స్థాపించి, సోషలిస్టు పార్టీని నిర్మించి, వలస రాజ్యాల స్థితిగతులను అనుభవపూర్వకంగా బాగా తెలుసుకొని వుండటంచేత రాయ్ సిద్ధాంతాన్ని అర్థం చేసుకొని సమర్థించాడు. మరో ప్రతినిధి జార్గి సఫరోవ్ టర్కీస్తాన్‌కు చెందినవాడు. ముస్లిము దేశాల జాతీయ వుద్యమాల్లో పాల్గొనిన వ్యక్తి. యీ చర్చలో పాల్గొని రాయ్‌ని సమర్థించాడు. లెనిన్ యీ రెండు సిద్ధాంతాలను సమన్వయ పరచి సమస్యా పరిష్కారానికి సరియైన మార్గాన్ని అన్వేషించాలని కమిషన్‌ను కోరటం జరిగినది. ఆ కమిషన్‌కు రాయ్‌ని ఉపాధ్యక్షునిగా ఎన్నుకొనాలనే ప్రతిపాదన వచ్చినది. కాని రాయ్ అందుకు అంగీకరించక పోవటంతో స్నీవ్‌లీట్‌ను ఎన్నుకొనటం జరిగినది.

వలస రాజ్యాల కమిషన్‌లో జరిగిన చర్చలను, అధ్యక్షుని హోదాలో లెనిన్ మహాసభ సర్వప్రతినిధి సభకు అందజేసి రెండు సిద్ధాంతాలు అంగీకరించటానికి సిఫారసు చేసాడు. అక్కడ కాంగ్రెసు సర్వప్రతినిధి సభలో జాతీయ, వలస రాజ్యాల తీర్మానం ఎజండాలో ప్రథమ అంశంగా తీసికొనబడినది. లెనిన్ ఉపన్యాసానంతరం డచ్ ప్రతినిధి స్నీవ్‌లీట్ తన దీర్ఘోపన్యాసంలో తన దేశ ప్రభుత్వం ఇండోనేషియా వలస ప్రాంతంలో జరుపుచున్న దమననీతిని గురించి ఘాటుగా విమర్శించాడు. ఐరోపాఖండ ప్రతినిధులు ఎవరూ యీ తీర్మానం మీద మాట్లాడలేదు. కొంతమందికి యీ విషయంలో ఆసక్తిలేదు. మరి కొంతమందికి వలస ప్రాంతాల స్థితిగతులు తెలియవు. మిగిలినవారు లెనిన్ మాట్లాడిన తరువాత వేరే చెప్పవలసినదేమీ లేదనే భావంతో మూకీభావం వహించారు. మహాసభ అన్ని అంశాల మీద 1920 జూలై 19 నుంచి ఆగస్టు 7 వరకు చర్చలు కొనసాగించి తీర్మానాలు చేసినది.

ఎజెండాలో చివరి అంశం (కాంగ్రెసు మహాసభకు) 41 మంది సభ్యులు గల ఒక కార్యనిర్వాహకవర్గాన్ని ఎన్నుకొనటం. ఆసియాఖండ దేశాల్లో అంతవరకు కమ్యూనిస్టు పార్టీలు లేకపోవటంచేత రెండుస్థానాలే ప్రత్యేకించబడి - ఒకటి రాయ్‌కి

మరొకటి పర్షియన్ ప్రతినిధి సుల్తాన్ జేడ్‌కు యివ్వబడ్డవి. కాని రాయ్ మహాసభ అనంతరం మాస్కో విడిచి వెళ్లిపోవాలనే దృష్టితో, తిరిగివచ్చే పరిస్థితులు లేవనే తలంపుతో తన సభ్యత్వాన్ని అంగీకరించక కొరియా ప్రతినిధి పాక్‌కు యివ్వమని సలహా యివ్వటంతో పాక్‌ని సభ్యునిగా ఎన్నుకొనటం జరిగినది.

ఈ కార్యనిర్వాహక వర్గం ఐదుమంది సభ్యులుగల ఒక ఉపసంఘాన్ని - బ్యూరో పేరుతో ఎన్నుకొన్నది. ఈ ఉపసంఘమే మామూలుగా అన్ని పరిస్థితులను పరిశీలించుతూ అవసరమైన కార్యాచరణను నిర్ణయించగల శాశ్వత సంఘంగా రూపొంది సమావేశమవుతూ వచ్చినది. ఆశియాఖండంలో విప్లవ కార్యక్రమాన్ని సిద్ధపరచటాన్ని యీ ఉపసంఘం ప్రధానాంశంగా తీసికొన్నది. కార్యనిర్వాహక వర్గంలో రాయ్ సభ్యునిగా లేకపోయినా ఆశియాఖండ దేశాల స్థితిగతుల మీద అథారిటీగా ఉన్నతాధికారం గల యీ ఉపసంఘ సభ్యునిగా రాయ్‌నికూడ కో - ఆప్టు చేసికొనటం జరిగినది.

ఈ ఉపసంఘం సమావేశమయి రెండు తీర్మానాలు ఆమోదించినది.

(1) తూర్పు దేశాలలోని పీడితవర్గాల మహాసభను త్వరలో 'బకు' లో జరపాలి.

(2) తాష్కెంటులో కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌కు సంబంధించి 'మధ్య ఆసియా బ్యూరో' ను స్థాపించాలి.

బహుళ ప్రచారంచేసి ఎంతో హుందాగా ఆ మహాసభను జయప్రదంచేయ గలిగితే దానివలన ప్రజలలో పుత్సాహం, కమ్యూనిస్టుపార్టీ ప్రచారంతోపాటు సామ్రాజ్యవాదుల్లో కొంత భీతావహం కూడా కలుగుతుందని జినోవీవ్, ఇతర రషియన్ నాయకులు అభిప్రాయ పడ్డారు. కేవలం ఆర్భాటంతో విప్లవం రాదని, అందుకొరకు శక్తినంతను కేంద్రీకరించి కాలం వృధాచేయటం మంచిది కాదని రాయ్ వ్యతిరేకించగా సమాధాన పరచటానికి రషియన్ నాయకులు ప్రయత్నించారు. బరోడిన్ 'బోల్షివిక్కుల క్రమశిక్షణ'ను గుర్తుచేసి చమత్కరించాడు.

రాయ్ మొదటిదానికంటె రెండవ తీర్మానాన్నే ముఖ్యంగా భావించాడు. అన్ని హంగులతో తాష్కెంటులో కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌కు అనుబంధంగా ఒక కార్యాలయాన్ని స్థాపించి ఆసియా ఖండంలో విప్లవజ్యోతిని వెలిగించి సర్వ

సన్నాహాలు జరుపాలని రాయ్ అభిమతం. ఉపసంఘంలో రాయ్‌తోబాటు మరో యిద్దరిని ఒక ప్రత్యేక సంఘంగా యేర్పాటుచేసి అక్కడికి పంపాలని తీర్మానించబడినది. ఒకరు సొకోల్‌నికోవ్ - మధ్యఆశియాలో రెడ్ ఆర్మీకమాండర్; రెండవ వారు సఫరోవ్ - లెనిన్ అంతరంగికుడు, బోల్షివిక్ పార్టీ కేంద్రసంఘ సభ్యుడు. ఈయన అంతర్యుద్ధ కాలంలో 'ప్రచార స్పెషల్ ట్రెయిను'కు సర్వాధిపతిగా వుండి దేశం నలుమూలల పర్యటించి కరపత్రాలు, సినిమాలు, ఎగ్జిబిషనులద్వారా ప్రజలను సమీకరించి పార్టీకి అండగా కేంద్రీకరించటంలో కృతకృత్యుడైనాడు. వీరితోబాటు మరికొందరిని కూడా తాష్కెంటు పంపటానికి నిశ్చయింప బడినది. ఇందులో పీటరు - రషియన్ గూఢచారిదళ ప్రధానాధికారి; కాగనోవిచ్ - పౌరపరిపాలనాధికారి; రహిమ్‌బేవ్ - సోవియటు టర్కిస్తాన్ కేంద్ర కార్యనిర్వాహక సమితి అధ్యక్షుడు మొదలైన వారున్నారు.

# పరివర్తిత (మారుచున్న) భారతదేశం :

లెనిన్ మొదటినుంచీ భారతదేశ రాజకీయాలను శ్రద్ధగా పరికిస్తూనే వచ్చాడు. అంతవరకు మితవాద ధోరణిలో నడుస్తున్న భారత రాజకీయాలు బెంగాలు విభజనతో తీవ్రరూపం దాల్చినవి. 'లాల్, పాల్, బాల్' నాయకత్వంలో కాంగ్రెసు తీవ్ర జాతీయ పార్టీగా సమీకరించుకో గలిగినది. 1908 లో బ్రిటిషు ప్రభుత్వం బాలగంగాధరతిలక్‌ను యావజ్జీవ ఖైదీగా బర్మాదేశం (అప్పుడు బర్మాదేశం బ్రిటిషు పరిపాలనలో వున్నది) పంపినది. ఇందుకు తీవ్రనిరసనగా తిలక్‌ను విడుదల చేయాలని బొంబాయి నగరంలో వివిధ రకాలకు చెందిన మేధావులు, మధ్యతరగతి ప్రజలు, శ్రామికులు పెద్దగా ప్రదర్శనలు జరిపారు. దీనిని గురించి 1908 లో లెనిన్ ఒక వ్యాసం కూడా ప్రకటించాడు.

"భారత ప్రజలు తమ రాజకీయ నాయకులకు, మేధావులయిన రచయితలకు అండగా నిలబడసాగారు. బ్రిటిషు నక్కలు భారత ప్రజాస్వామ్యవాది అయిన తిలక్‌కు విధించిన శిక్ష మహాదారుణమైనది. ధనికుల తొత్తుల యీ దారుణచర్యకు బొంబాయి నగరంలో ప్రతి వీధిలోనూ ప్రదర్శనలు జరుగుచున్నవి. శ్రామికులు

సమ్మె చేస్తున్నారు. భారతదేశంలోని ప్రోలిటేరియన్ వర్గం రాజకీయంగా బాగా చైతన్యం పొంది ప్రజా వుద్యమానికి ముందు నిలబడుతుంది. కనుక రష్యాలో జారు ప్రభుత్వం మాదిరి అక్కడ బ్రిటిషు ప్రభుత్వం కూడా కొద్ది కాలంలో పతనం చెందక తప్పదు."

1919–20 సంవత్సరాలలో జాతీయ కాంగ్రెసు గాంధీ నాయకత్వం క్రింద సహాయ నిరాకరణోద్యమం తీవ్రదశలో వున్నది. రషియన్ కాంగ్రెసుకు సంబంధించిన తూర్పు రాజ్యాల ప్రజా సంఘంలో 22–11–1919 న లెనిన్ మాట్లాడుతూ "తూర్పు దేశాల ప్రజలు కార్యాచరణకు సిద్ధపడుతున్నారు. నూతన సమాజ నిర్మాణావశ్యకతను ప్రతిదేశం గుర్తిస్తున్నది.....దీనికి సామ్రాజ్యవాద యుద్ధం (1914–18), రష్యా విప్లవం కారణభూతాలుగా సూచించవచ్చును." అని చెప్పాడు.

1921 లో మరొక సమావేశంలో మాట్లాడుతూ "అభివృద్ధి చెందుచున్న, అభివృద్ధి చెందని వలస రాజ్యాలన్నీ సామ్రాజ్యతత్వాన్ని నాశనం చేయటానికి ప్రపంచ రాజకీయాలలో ప్రముఖ పాత్రను వహించే పరిస్థితికి వచ్చినవి. ఇందులో బ్రిటిషు యిండియా అగ్రస్థానంలో వున్నది. పారిశ్రామిక కేంద్రాలలో, రైల్వే కేంద్రాలలో కార్మికవర్గం పెరగటంతోబాటు విప్లవ చైతన్యం కూడా హెచ్చు స్థాయికి వచ్చినది. బ్రిటిషు దమననీతి, హత్యాకాండలు (అమృతసర్) కూడా ఇందుకు మరొక కారణం." అని చెప్పాడు. 1922 మే నెలలో ఒక వ్యాసంలో భారతదేశాన్ని గురించి "ప్రజానీకంలో హెచ్చుమంది చైతన్యవంతులై రాజకీయ వుద్యమాన్ని సాగిస్తున్నారు. దీన్ని బలవత్తరమయిన యేశక్తి (బ్రిటిషు ప్రభుత్వం) కూడా నిరోధించ జాలదు." అని వ్రాసాడు.

లెనిన్‌కి గాంధీ నాయకత్వాన్ని గురించి అదివరకు ఒక విధమయిన అభిప్రాయం వుండేది. గాంధీని విప్లవవాదిగా, ప్రజా వుద్యమ నాయకుడుగా భావించాడు. కాని రాయ్ దీనిని ప్రతిఘటించి మత సంస్కర్తగా, హైందవ మతోద్ధారకునిగా, విప్లవ వ్యతిరేకునిగా వర్ణించి లెనిన్ వలసరాజ్యాల సిద్ధాంతాన్ని వ్యతిరేకించి కొన్ని ప్రతిపాదనలు చేసాడు. వలసరాజ్యాల్లో జరుగవలసిన బూర్జువా ప్రజాస్వామిక విప్లవం, నాయకత్వం మీద రాయ్‌తో జరిపిన చర్చల ఫలితంగా లెనిన్‌కు అదివరకు తనకున్న అభిప్రాయాలలో కొంత సడలింపు జరిగినది.

కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ రెండవ కాంగ్రెసులో లెనిన్ అంగీకారంతో లెనిన్ సిద్ధాంతానికి అనుబంధంగా జోడింపబడిన రాయ్ ప్రతిపాదనలను గురించి వివరంగా అన్ని ఆధారాలతో రిపోర్టు తయారు చేయమని లెనిన్ కోరటంతో రాయ్ అందుకు పూనుకొని తన వాదనను సమర్థించుకొనటానికి చేసిన ప్రయత్నం, ముందు ఒక రిపోర్టుగాను తరువాత ఆయన సలహా ననుసరించిరి, ఒక గ్రంథ రూపంలో వెలువడినది. ఇదియే 'పరివర్తిత భారతదేశం' (ఇండియా ఇన్ ట్రాన్సిషన్.)

ఏభై సంవత్సరాల క్రితం అప్పటి భారతదేశ రాజకీయాలను, ఆర్థిక పరిస్థితులను, సాంఘిక జీవనాన్ని, వర్గ సంబంధాలను విపులంగా చిత్రించి వాటికి అనుకూలమయిన విప్లవ కార్యక్రమాన్ని రూపొందించటమే ఈ గ్రంథ ఆశయం. అర్ధ శతాబ్దం దాటినా నేటికీ భారత రాజకీయాల్లో యీ గ్రంథరాజానికి ప్రముఖస్థానం వున్నది. కనుక భారతదేశ విప్లవాన్ని గురించి రాయ్ కున్న అప్పటి అభిప్రాయాలను పాఠకులు వివరంగా తెలుసుకొనగలరనే తలంపుతో 'పరివర్తిత భారతదేశం' లోని కొన్ని ప్రధానాంశాలను యిక్కడ క్లుప్తంగా పొందుపరచటం జరిగినది.

"బోల్షివిక్కు నాయకులలో సర్వసాధారణంగా ప్రచారంలో వున్న 'భారతదేశం జమీందారీ (ఫ్యూడల్) వ్యవస్థలో వున్నది' అనే భావం సరియైనది కాదు. కనుక జాతీయ బూర్జువావర్గం విప్లవ పూరితమని భావించటం పొరపాటు. చిచెరిన్ నన్నీ రిపోర్టును వ్రాయమని అడిగాడు. కాని ప్రధానంగా నా ప్రతిపాదనల గురించే లెనిన్‌ని వొప్పించటానికే నేను దీనిని తయారుచేసాను. వలసతత్వ ఆర్థిక విధానం జమీందారీ వ్యవస్థను నిలబెట్టటానికి ప్రయత్నించినా దేశీయ పెట్టుబడిదారీ వర్గ అభివృద్ధిని ఆటంకపరచలేదు. పైపెచ్చు దేశీయ బూర్జువావర్గం తమ హక్కుల కొరకు, అధికారం కొరకు పెనగులాడటం జరుగుచున్నది. కాని స్థిరపడి వున్న సాంఘిక వ్యవస్థలోనే యీ బూర్జువావర్గ శ్రేయస్సు ముడివడి వుండటంచేత 'దాని నాశనం కొరకు' విప్లవానికి నాయకత్వం వహించగల స్థితిలో వుండజాలదు....ఈ రిపోర్టును జాగ్రత్తగా పరిశీలించిన తదుపరి లెనిన్ 'యదార్థ పరిస్థితులకు ఇచ్చ వచ్చిన అర్థం చెప్పి తారుమారు చేయవద్దని' నన్ను హెచ్చరించి 'ప్రస్తుత భారత దేశ సామాజిక చరిత్రను యథాతథంగా చిత్రించి విప్లవానికి అనుసరించదగు సుస్పష్ట కార్యక్రమాన్ని గ్రంథరూపంలో విపులీకరించ'మని కోరటంతో నేనీ ప్రయత్నానికి పూనుకొన్నాను." అని రాయ్ యీ గ్రంథ పరిచయ వాక్యాలలో వెల్లడించాడు.

భారతదేశం పెట్టుబడిదారీ వ్యవస్థను చెందిన దేశం కాదు. సామ్రాజ్య దేశమయిన బ్రిటిషు ప్రభుత్వం తన అవసరానికి సృష్టించిన, అదివరకు వున్న జమీందారీ (ఫ్యూడల్) వ్యవస్థను రాయ్ యథాతథంగా తన యీ గ్రంథంలో అంగీకరించాడు. కాని దేశం యుద్ధ కారణంగా, పారిశ్రామికంగా అభివృద్ధి చెంది పెట్టుబడిదారీ వ్యవస్థకు చేరువలో వున్నది. పూర్తిగా ఫ్యూడల్ వ్యవస్థలోనూ లేదు, పూర్తిగా పెట్టుబడిదారీ వ్యవస్థను చేరనూలేదు. కనుక 'పరివర్తిత భారత దేశం'గా యీ గ్రంథానికి నామకరణం చేయబడ్డది.

"భారతదేశంలో జాతీయ విమోచన వుద్యమానికి విప్లవ శక్తులు సంఘటితమైనవి. గాంధీ నాయకత్వం క్రింద బూర్జువా ప్రజాస్వామిక విప్లవం విజయవంతం కాగలదు" అనే గాఢ విశ్వాసంతో కమ్యూనిస్టు యింటర్నేషనల్ వున్నది. కమ్యూనిస్టులు యీ వుద్యమాన్ని బలపరచాలనే దృష్టితోనే లెనిన్ తన సిద్ధాంతాన్ని రూపొందించాడు. రాయ్ దీన్ని ప్రతిఘటించి క్రొత్త ప్రతిపాదనలను సూచించాడు. లెనిన్ సలహామీద అవి మొదట ఒక రిపోర్టు రూపంలోనూ, తరు వాత ఒక గ్రంథంగానూ పరిణతి చెందినవి.

17, 18 శతాబ్దాలలో ఐరోపాఖండ దేశాలలో జరిగిన బూర్జువా విప్లవాలకు, భారతదేశ విప్లవానికి పరిస్థితుల ననుసరించి భేదం వున్నది. అచ్చట చరిత్రగమనం ప్రకారం, మార్క్సిస్టు సిద్ధాంతరీత్యా పెట్టుబడిదారీ వర్గం జమీందారీ విధానాన్ని బూర్జువా విప్లవం ద్వారా కూలద్రోసి అధికారం చేపట్టి పారిశ్రామిక అభివృద్ధికి కృషి చేసినందువలన కాపిటలిజం పెరిగినది. ప్రతిగా కార్మికవర్గం కూడా బలపడసాగినది.

భారతదేశ రాజకీయ, ఆర్థిక, సాంఘిక పరిస్థితులు వేరుగా వున్నవి. పరాయి ప్రభుత్వం అధికారంలో వున్నది. ప్రపంచ యుద్ధానికి పూర్వం, యుద్ధం తరువాత విదేశీ పెట్టుబడిదారులతోపాటు దేశీయ పెట్టుబడిదారీ వర్గం కూడా పెరిగినది. సామాజిక వ్యవస్థ జమీందారీ, పెట్టుబడిదారీ విధానాలతో కలగా పులగంగా మిళితమై వున్నది. దేశీయ పెట్టుబడిదారులు తమ పరిశ్రమలను యింకా పెంచు కొనాలనే ప్రయత్నంలో వున్నారు. దీనికి బ్రిటిషు ప్రభుత్వం అవరోధాలు కల్గించటంచేత వారు ఆందోళన సాగించారు. వారి ఆందోళన కేవలం వారి పరిశ్రమలను పెంచుకొనటానికే పరిమితమై యున్నది. దేశంలో ప్రబలియున్న

తీవ్రఅసంతృప్తిని, విప్లవజ్వాలను బ్రిటిషు ప్రభుత్వం గుర్తించక పోలేదు. కనుక పైవర్గాలయిన పెట్టుబడిదారులు, జమీందారులకు కొన్ని రక్షణలు కల్పించి వారి సహాయంతో విప్లవశక్తులను అణచటానికి బ్రిటిషు ప్రభుత్వం పూనుకొనటం, అందుకు ఆ వర్గాలు సహకరించటం సహజంగా జరుగగలదు. విప్లవశక్తులు పురోగమిస్తే దేశీయ కాపిటలిజానికి కూడా ప్రమాదమే. కనుక తమ రక్షణకు, అవసరమయిన హక్కులు వారు పొందటానికి మాత్రమే పోరాటంలో నాయకత్వం వహించి తమ ఆశయం నెరవేరగానే విదేశీ ప్రభుత్వంతో చేతులు కలిపి తమ తమ హక్కుల కొరకు పోరాటం సాగించే రైతు, కార్మిక వుద్యమాల్ని అణచివేయటానికి దేశీయ పెట్టుబడిదారీ వర్గం విధిగా పూనుకుంటుంది. కనుక భారతదేశ ప్రజా వుద్యమంలో నాయకత్వ విషయంలో తగు జాగ్రత్త తీసుకొని వ్యవహరించవలసి వున్నది.

తీవ్రజాతీయ వాదులనుకున్న 'పాల్, బాల్, లాల్' నాయకుల అభిప్రాయాలు చరిత్రగమనాన్ని ప్రతిబింబింప చేసేవిగా లేవు. ప్రజా వుద్యమానికి సక్రమమయిన మార్గం, నాయకత్వం చూపలేక పరాజయం పొందక తప్పలేదు. పాశ్చాత్య సంస్కృతితో సన్నిహిత సంబంధం కలిగిన బిపిన్ చంద్రపాల్ మితవాదుల నుంచి విడివడి ముందుకు రాగలిగినా చివరకు మితవాదులను మించి మితవాదిగా మారటం విచారకరం. 1908 లో పాల్ లండను వలస వెళ్లాడు. వెళ్లే ముందు మితవాదులను తీవ్రంగా విమర్శించాడు. కాని 1912 లో లండను నుంచి తిరిగి వచ్చేటప్పుడు "సంపూర్ణ స్వరాజ్యము లేక బ్రిటిషు సామ్రాజ్యంలో స్వయం నిర్ణయ హక్కు; ఇందులో ఏదో వొకటి కోరుకొనటానికి నాకు భగవంతుడు అవకాశం యిస్తే నేను యేమాత్రం సందేహం లేకుండా రెండవ దానినే కోరుకుంటాను." అని తన అభిప్రాయం వ్యక్తం చేసాడు.

తీవ్రవాదిగా వున్న బాలగంగాధర్ తిలక్ అస్తమించిన హైందవ సామ్రాజ్యాన్ని (శివాజీ రాజ్యం) తిరిగి పునరుద్ధరించాలనే ప్రచారం సాగించాడు. 1908 లో 'దేశ విద్రోహ చర్యల'కు యావజ్జీవ ఖైదీగా బర్మా పంపబడి 1914 లో జైలునుంచి విడుదలఅయి రాగానే బ్రిటిషు యుద్ధ అనుకూల ప్రచారం సాగించాడు.

లాలా లజపతిరాయ్ కూడా కేవలం తన ప్రచారం బ్రిటిషు ప్రభుత్వాన్ని కూలద్రోయటానికే నన్నట్లుగా పరిమితు డయ్యాడు. నూటికి తొంభైదాకా వున్న

రైతులు, కార్మికులకు కావలసిన పంథా చూపక పోగా దేశీయ బూర్జువా వర్గానికి అనుకూల ప్రచారంచేసాడు. "పరాయివాడికంటె స్వంత సోదరునిచే తన్నించు కొనటం మంచిది" అనే భావం కనబరచాడు.

భారత ప్రజానీకం నిత్య దారిద్ర్యంతో, బ్రిటిషు ప్రభుత్వంమీద వల్ల మాలిన కసితో తీవ్ర అసంతృప్తిని వ్యక్తంచేస్తున్న కాలంలో సక్రమ పంథాను చూపించగల విప్లవ నాయకత్వం భారతదేశ రాజకీయరంగంలో లోపించినది. ఈ అసంతృప్తిని అనిబిసెంటు 'హోమ్‌రూల్' పేరుతో పక్రమార్గం పట్టించి కొంత వరకు కృతకృత్యురా లయినది. ఆమె సూచించిన 'హోమ్‌రూల్' మితవాదులకు, పెట్టుబడిదారులకు అంగీకారయోగ్య మయినది. బ్రిటిషు సామ్రాజ్యం క్రింద 'స్వయం నిర్ణయ హక్కు' కలిగివుండటమే యీ 'హోమ్‌రూల్' అంతరార్థము. 1917 లో ఆమె జాతీయ కాంగ్రెసు అధ్యక్ష పీఠాన్ని అలంకరించటానికి ఆమె ప్రబోధించిన యీ 'హోమ్‌రూల్' ముఖ్యకారణం. కొద్దికాలం కాంగ్రెసుకు నాయకత్వం కూడా వహించినది.

అనిబిసెంటు తరువాత జాతీయ కాంగ్రెసు నాయకత్వం గాంధీ చేపట్టాడు. యుద్ధ సమయంలోనే 1915 లో గాంధీ దక్షిణ ఆఫ్రికానుంచి భారతదేశం తిరిగి వచ్చినా అంతవరకు రాజకీయ రంగంలో పూర్తిగా ప్రవేశించలేదు. మొదట యుద్ధానికి సహాయభూతంగా అంబులెన్సు విభాగంలో సభ్యునిగా చేరాడు. దక్షిణ ఆఫ్రికాలో కూడ బోయరు యుద్ధంలో గాంధీ యిదే పాత్రను నిర్వహించాడు.

ప్రజలలో వ్యాపించిన తీవ్ర అసంతృప్తిని గాంధీ బాగా అర్థంచేసుకో గలిగాడు. 'సహాయ నిరాకరణ' పేరుతో సత్యాగ్రహ వుద్యమం ప్రారంభించాడు. విదేశీ వస్తు, వస్త్ర బహిష్కరణ, స్వదేశీ వస్తువుల ఆదరణ, ఖద్దరుధారణ, పన్నుల నిరాకరణ, కోర్టులు, విద్యా సంస్థల బహిష్కరణ మొదలైన సూత్రాలతో శాసనోల్లంఘనం ప్రారంభమయినది. ఉద్యమం తీవ్రరూపం దాల్చినది. పరిపాలనా వ్యవస్థ స్తంభించినది. దేశం నలుమూలలా ప్రజలు వెల్లువలై ముందుకు రా సాగారు. రైతులు శిస్తులు చెల్లించటానికి నిరాకరించారు. కార్మికులు సమ్మెలు ప్రారంభించారు. ఫ్యాక్టరీలు, రైళ్లు నడవటానికి అంతరాయం యేర్పడ్డది. దేశం మొత్తం ఏకోన్ముఖంగా గాంధీ నాయకత్వం క్రింద ముందుకు నడువటానికి నడుముకట్టినది.

ఈ వుద్యమం యే మాత్రం ముందుకు సాగినా బ్రిటిషు ప్రభుత్వ పునాదులే కాదు; బూజుపట్టిన భారత సామాజిక పునాదులే కదలి, పురాతన హైందవ వ్యవస్థ బదా బదలు కాక తప్పదు. గాంధీ గ్రహించాడు. తన నాయకత్వం, తాను వూహించిన ప్రజా వుద్యమం హైందవ వ్యవస్థను మార్చి నూతన సమాజ వ్యవస్థను నిర్మించటం కాదు. వర్ణ వ్యవస్థను చక్కబరచి హైందవ మతాన్ని పునరుద్ధరించటమే గాంధీ మూల సిద్ధాంతం. పర ప్రభుత్వం కంటె పాశ్చాత్య నాగరికతకు గాంధీ బద్ధ విరోధి.

ఆ మహోద్యమం విశ్వరూపం ధరించినది. అగ్ని కణాలుగా విప్లవ జ్వాలలు విజృంభించినవి. బ్రిటిషు ప్రభుత్వంతో అంతిమ పోరాటం ఆసన్నమయినది. ఆవేశంతో కూడిన ప్రజా వుద్యమంలో అచ్చటచ్చటా అరాచకచర్యలు, విధ్వంసక చర్యలు జరుగక మానవు. అమృత మధనంలో విషం వుద్భవించినది. కాని ఆ మధనం ఆగలేదు. కాని యిక్కడ గాంధీ 'హింసాతత్వం విజృంభించుచున్నది' అనే నెపంతో ఆ మహోద్యమాన్ని, ప్రజా పోరాటాన్ని ఆపివేస్తున్నట్లు తన వుద్యమ రథానికి 'సడెన్ బ్రేక్' వేసాడు. ఇది నిజంగా భారతదేశ స్వాతంత్ర్య పోరాటంలో ఒక శోచనీయ మయిన ఘట్టంగా భావించవలసి వున్నది.

రాజకీయ నాయకునిగా గణుతి కెక్కిన గాంధీ హిందూ సంస్కృతిని, హిందూ సమాజాన్ని చెక్కుచెదరని స్థితిలో వుంచాలనే సంకల్పంతో వున్నాడు. పారిశ్రామిక విప్లవాన్ని ఎదిరించి రాట్నం ప్రవేశపెట్టాడు. కుటీర పరిశ్రమలనే ప్రోత్సహించాడు. కలవారిని లేనివారు ఎదిరించరాదని, కలవారు వారికి ధర్మకర్తలుగా వుండాలని బోధించసాగాడు. ఇది ప్రవాహానికి ఎదురీదటం, విప్లవాన్ని అరికట్టటం. ఇంతకంటె విడ్డూరమయినది గాంధీ నాయకత్వాన్ని, గాంధీ సిద్ధాంతాలను దేశీయ పెట్టుబడిదారులు పూర్తిగా బలపరచటం.

ప్రజలను గాంధీ మోసపుచ్చుతున్నాడని గాని లేక గాంధీ చిత్తశుద్ధితో తన కార్యక్రమాన్ని సాగించటం లేదని గాని శంకించటానికి వీల్లేదు. ఆయన తన విధ్యుక్త ధర్మాన్ని అక్షరాల పాటించటానికే పూనుకున్నాడు. అందుకు అన్ని విధాల కృషి సాగిస్తూనే వున్నాడు. అయితే మరి గాంధీ నాయకత్వాన్ని ఎదుర్కొనటం ఎందుకు? అసలు గాంధీ మూలసిద్ధాంతాల లోనే యీ లోపం వున్నది. క్రుళ్లి కృశించిపోయిన పాత వ్యవస్థతో బాధలు పడలేక సమాజం నూతన వ్యవస్థకు

అస్త్రులు చాచుతుంది. గాంధీ సిద్ధాంతాలు అందుకు వ్యతిరేకం. పాత వ్యవస్థనే కట్టు దిట్టంగా నిలపాలని ప్రయత్నం. నూతన వ్యవస్థలో బాధలులేవా అనే ప్రశ్న వస్తుంది. ఉంటవి. కాని వాటిని తగ్గించుకుంటూ ముందుకు సాగిపోవటమే సమాజ లక్ష్యం. ఈ గమనం అంతులేనిది. అనాదినుంచి చరిత్ర దీనిని ఋజువు చేస్తూనే వున్నది.

ప్రస్తుత జమీందారీ వ్యవస్థలో జనసామాన్యం పడరాని యిబ్బందులకు గురి అయి చాలీచాలని తిండి, గుడ్డ, తదితర అసమగ్ర వసతులతో క్రుంగి, కృశించటం పరిపాటిగా వున్నది. దీనికి పరాయి ప్రభుత్వ మొక్కటే కారణంకాదు. సాంఘిక అన్యాయాలు, ఆర్థిక అసమానతలు కూడా యిందుకు కారణం. పరాయి పెత్తనం పోయి దేశీయ పెట్టుబడిదారుల, జమీందారుల పెత్తనం వచ్చినంత మాత్రంచేత రాజకీయ స్వాతంత్ర్యం పొందగలిగామనే తృప్తి మినహాయించి, జన సామాన్యానికి వొరిగేది ఏమీ వుండదు. ఉన్న ఆర్థిక వ్యవస్థను రూపురేఖలు లేకుండా సమూలంగా నిర్మూలించి ప్రజలు ఆర్థికంగా మెరుగుపడటానికి నూతన వ్యవస్థను నిర్మించాలి. కనుక మనం సాధించబోయే స్వరాజ్య సమగ్ర స్వరూపాన్ని ప్రజలకు కళ్లకు కనబడేటట్లు, మనస్సుకు హత్తుకునేటట్లు స్పష్టంగా చూపాలి. జమీందారుల, పెట్టుబడిదారుల ప్రయోజనాలు, రక్షణలు, హక్కులు సామాన్య ప్రజానీకానికి ఉరిత్రాడులు. ఒకరి ప్రయోజనాలు మరొకరి నాశనానికి కారణహేతువులు. కనుక సమాజం మొత్తం అభివృద్ధి చెందటానికి అనువయిన కార్యక్రమం చేపట్టవలసి వున్నది. ఇట్టి కార్యక్రమం గాంధీ సిద్ధాంతాలకు వ్యతిరేకం.

ఆధునిక యంత్రాగారాల్లో ఉత్పత్తి అయ్యే వస్త్రాలు, యితర వస్తువులతో రాట్నం మీద వడికే నూలు, కుటీర పరిశ్రమలలో తయారయిన వస్తువులు ఏ పరిస్థితులలోనూ పోటీకి నిలబడజాలవు. చేతి పరిశ్రమల ద్వారా జన సామాన్యం అంతా తమ భృతికి, కుటుంబ పోషణకు సరిపడిన సంపాదన చేయగల స్థితిలోలేదు. దీనితో దేశీయ పెట్టుబడిదారీ విధానం ఆగనూ ఆగదు. ముప్ఫయికోట్ల భారతీయులకు కావలసిన వస్త్రోత్పత్తి కేవలం కుటీర పరిశ్రమలతో సరిపుచ్చా లనుకోవటం హాస్యాస్పదం. ఇది చరిత్రగమనాన్ని అరికట్టాలనే ప్రయత్నం. కాని యే మహ నీయుడు ఆపజాలడు. పారిశ్రామిక విప్లవం భారతజాతి అభివృద్ధికి ప్రథమ సోపానంగా గుర్తించాలి. ప్రజల అవసరాలను గుర్తించి వాటిని తీర్చుటకు క్రమబద్ధ మయిన పంథా చూపగల నాయకుడే ప్రజా నాయకుడు కాగలడు.

నిస్తేజమై, నిద్రాణంలో వున్న జన సామాన్యాన్ని మేల్కొలిపి చైతన్య వంతం చేయటం వొకవంతు, వారిని సక్రమ పంథాలో నడిపి గమ్యస్థాన లక్ష్యాన్ని చేర్చటం మరొకవంతు. గాంధీ మొదటి అంశాన్ని సాధించగలిగాడు. కాని ఆయన పంథా ప్రజానీకానికి సాంఘికంగా, ఆర్థికంగా తిరోగమనం సూచిస్తున్నది. జమీందారీ విధానం తన పాత్రను నిర్వహించి శల్యావశిష్టమై నిరుపయోగం కావటం చేత, మిగిలిన ప్రపంచం పారిశ్రామిక యుగంలో పురోగమనం సాగించగా, గాంధీ యింకా అదే యుగంలో వుండి, అదే వ్యవస్థను పునరుద్ధరించాలనటం విప్లవలక్షణం కాదు, విప్లవాన్ని అరికట్టటం.

రాయ్ 'పరివర్తిత భారతదేశంలో' అప్పటి భారతదేశ సామాజిక, ఆర్థిక పరిస్థితులను కూలంకషంగా చర్చించి అందుకు భిన్నమయిన, అభివృద్ధిదాయక మయిన సంఘ నిర్మాణానికి గాంధీ సిద్ధాంతాలు వ్యతిరేకం కనుక గాంధీ నాయకత్వం పనికిరాదని, రైతులు, కార్మికులు, మధ్యతరగతి వర్గాలకు ఎక్కువ ప్రయోజనం కూర్చగల విప్లవ నాయకత్వం కావాలని సూచించాడు.

ఉన్న సమాజ పరిస్థితులను గురించి ప్రజలకు వివరంగా చెప్పాలి. నూతన సమాజ నిర్మాణంవలన కలుగబోవు ప్రయోజనాలు అద్దం లోని ప్రతిబింబంలాగా వారికి సుస్పష్టంగా గోచరించాలి. రాజకీయంగా వారిని చైతన్యవంతులు చేసి అట్టి సమాజ నిర్మాణానికి ఆయత్తపరచ గలిగినప్పుడు ప్రజలు వేలు, లక్షలు, కోట్ల సంఖ్యలో నడుము బిగించి ముందుకు రాగలరు.

"స్వరాజ్యం - స్వాతంత్ర్యం పొందటానికి ప్రజలలో అణగారి వున్న చేతనావస్థను, శక్తిని, దృఢ సంకల్పాన్ని మేల్కొలిపి సక్రమ పంథాను చూపటం మన విద్యుక్త ధర్మంగా భావించాలి. మిగిలిన కార్యాన్ని వారే సాధించుకొనగలరు. ప్రస్తుత సామాజిక వ్యవస్థవలన ప్రజలలో వున్న అసంతృప్తిని ప్రకోపింపచేయటం మన బాధ్యతగా గ్రహించాలి. ఎచ్చట యే విధమయిన సాంఘిక అన్యాయం జరుగు చున్నా వ్రేలుపెట్టి వారికి చూపించాలి. స్వరాజ్యం వస్తే ఏం జరుగుతుందో, ఏమి చేయాలో వారికి అర్థం అయ్యే భాషలో వివరంగా చెప్పాలి. 'పరాయి ప్రభుత్వం నశించాలి', 'అన్ని పీడనలు నశించాలి', 'రైతుకు భూమి - కార్మికునికి తిండి' అనే నినాదాలతో ప్రజా పుద్యమానికి నాయకత్వం వహించాలి."

ఇందుకు రాయ్ ఒక కార్యక్రమం కూడా సూచించాడు.

1. జాతీయ ప్రభుత్వం మైనారిటీ వెళ్ళిన భారత ప్రజల అందరి వోటింగు అధికారంతో యేర్పడాలి.

2. ఉత్పత్తి, పంపకం, మార్పిడికి సంబంధించిన ప్రధానమయిన సాధనాలు— భూమి, గనులు, ఫ్యాక్టరీలు, రైల్వేలు, నదులు, కాలువలు మొదలైనవన్నీ ప్రజాస్వామ్య ప్రభుత్వ అధీనంలోనే వుండి ఆ యా శాఖల్లో నియముతు లయిన శ్రామికుల అజమాయిషీతో నిర్వహింప బడేటట్లు వుండాలి.

3. జమీందారీ విధానం రద్దుకావాలి. భూమిమీద అధికారం ప్రభుత్వానికే వుండాలి. స్వంత సేద్యం చేసుకొనే వారికే ప్రభుత్వం భూమిని పంచిపెట్టాలి.

ఇందువలన సమాజంలో ఎవరయితే కృషి చేయగలరో వారే ఆ కృషి ఫలితాలను అనుభవించగలరు. కాగా ఒకరు మరొకరిని దోచుకునే విధానం అంత రిస్తుంది. గ్రామాలలో, పట్టణాలలో రైతు-కార్మిక సంఘాలను యేర్పరచాలి. ఆ యా సంఘాల అభిప్రాయాలు, సలహాల ప్రకారం ప్రభుత్వం తన విధులను నెరవేరుస్తూ వారి అభిమతం ప్రకారం శాసన నిర్మాణాలు చేస్తూ వుండాలి. దీనివలన ప్రజలకు, ప్రభుత్వానికి దగ్గర సంబంధ మేర్పడుతుంది. ప్రజల పైనందిన అవసరాలు తెలుసుకొని వాటికి ప్రజల అండదండలతో పరిష్కారమార్గం కనుగొని, సాధించటానికి ప్రభుత్వానికి బలం చేకూరుతుంది. నూతన సమాజ నిర్మాణాని కిది సుగమము, సులభమైన మార్గం.

ఏభై సంవత్సరాల క్రితం నవభారత సమాజ నిర్మాణానికి యమ్. యన్. రాయ్ సూచించిన బృహత్తర పథకం యిది. కార్యక్రమంలో అప్పటికీ, యిప్పటికీ కొద్ది తేడాలు వుండవచ్చును. కాని మనం కోరదగిన, చేరవలసిన గమ్యస్థానం మాత్రం అదే.

* * * *

ఈ పుస్తకాన్ని గురించి రాయ్ అనేకమంది రషియన్, పాశ్చాత్య నాయకుల ప్రశంసలకు పాత్రుడయ్యాడు. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ అధ్యక్షులు జినోవీవ్ "కామ్రేడ్ రాయ్ తన యీ ప్రయత్నంలో అమూల్యమయిన విలువను

పొందగలిగాడు" అని, ప్రధాన కార్యదర్శి కారల్ రాడెక్ "కామ్రేడ్ రాయ్ మార్క్సిస్టు దృక్పథంలో రొలిగా భారతదేశ పరిస్థితులను అన్ని రంగాలలో చక్కగా వర్ణించ గలిగాడు" అని ప్రస్తుతించారు.

ఈ గ్రంథం కమ్యూనిస్టు ఇంటర్‌నేషనల్ మూడవ, నాల్గవ కాంగ్రెసు మహాసభల మధ్యకాలంలో 1921 సెప్టెంబరు 1922 మార్చి నెలల మధ్య పూర్తి చేయబడ్డది. బ్రిటిషు ప్రభుత్వ పారిశ్రామిక విధానంలోని అభివృద్ధి సూచికలు, పట్టికలు అబానీముఖర్జీ సహకారంతో తయారు చేయబడ్డవి. దాదాపు రషియన్ భాషతోపాటు అన్ని పాశ్చాత్య భాషలలో అనువదించబడ్డది. జర్మనీ భాషలో ఒక్క సంవత్సరంలోనే లక్షప్రతులు ఖర్చు అయినవి. ఇంగ్లీషు ప్రతులు కొన్ని రహస్యంగా భారతదేశం కూడా పంపబడ్డవి.

# యన్వరు పాషా :

టర్కీ పరాజయం పొంది మిత్ర రాజ్యాల అధీనంలోనికి వచ్చినది. ఆ దేశ పాలకులయిన తలాత్‌పాషా, యన్వర్ పాషా, జమాల్ పాషాలు తమ దేశంలోని ఆర్మీనియన్ జాతిని సమూలంగా నాశనంచేసారు. ఈ హత్యాకాండకు అమెరికా, తక్కిన క్రైస్తవ ప్రపంచమంతా వీరిని క్రూర రాక్షసులుగా వర్ణించి టర్కీని నిశితంగా విమర్శించటంచేత వీరికి ఐరోపాఖండంలో తల దాచుకొనటానికి ఎక్కడా ఆశ్రయం లభించలేదు. పరాజయం పొందిన తోటి జర్మనీలో కూడా వీరికి ఆశ్రయం యివ్వగల పరిస్థితులు లోపించినవి. చివరకు రష్యా ఆశ్రయం పొంది ఆదేశ సహాయంతో తిరిగి తమ అధికారం సంపాదించుకొనాలనే ఆలోచన వీరికి కలిగినది.

తలాత్‌పాషా సైనికంగా తిరిగి జర్మనీ పుంజుకొనగలదనే నమ్మకంలో వున్నాడు. రష్యా విప్లవ ప్రభుత్వం తమకు సహాయం చేస్తుందనే విశ్వాసంలేదు. కనుక రష్యా వెళ్లాలనే ప్రయత్నం మానుకున్నాడు. యన్వర్‌భాషా రాజకీయ పరిజ్ఞానం కలవాడు. తాము తిరిగి అధికారం హస్తగతం చేసుకొనాలనే తాపత్రయంలో వున్నా పైకిమాత్రం 'మిత్ర రాజ్యాలనుంచి ముస్లిము దేశాలను

విముక్తి చేసి రష్యాలో మాదిరిగా విప్లవ ప్రభుత్వాలు స్థాపించటం తమ అభిమతంగా' ప్రకటించి రష్యను నాయకులతో మంతనాలు ప్రారంభించాడు. కొంతమంది రషియను అధికారులు దానిని విశ్వసించకపోలేదు. ఏ కొలదిమందో మినహాయించి మిగిలిన రషియన్లు భారతదేశం కూడా ముస్లిము దేశమనే భ్రమలో కూడా వున్నారు.

జర్మనీ సైనిక విమానంలో యన్వర్‌పాషా, జమాల్‌పాషాలు రహస్యంగా మాస్కో చేర్చబడ్డారు. ప్రభుత్వ అతిథులుగా రాయ్ నివసిస్తున్న 'షుగర్ కింగ్ ప్యాలెస్' ప్రాంగణంలోనే ఆయన భవనానికి ఎదురుగా వున్న రెండు భవనాలలో వారికి విడివిడిగా వసతులు యేర్పాటు చేయబడ్డవి. రోజులు, వారాలు గడచిపోతున్నవి. వీరిని గురించి ఎవరూ శ్రద్ధతీసికొన్నట్లు కనబడలేదు. విదేశాంగ శాఖ వైస్-కమిసార్ రోజూ తన నివాసంనుంచి బయటకు వచ్చి వాటి ప్రక్కగానే ఆఫీసుకు వెళ్లుతూ వుంటాడు. కాని ఎప్పుడూ వారిని పలుకరించటంగాని, చూడటం గాని జరుగలేదు. యన్వరుపాషా తాను 'రాజు'ననే భావంతో హుందాతనం చూపాలనే తత్వంతో తన జవాన్లతో, సిబ్బందితో ఎప్పుడూ మాట్లాడినట్లు కూడా కనబడేవాడు కాదు. జమాల్‌పాషా తత్వం వేరు. రోజూ సరదాగా వాళ్ళతో మాట్లాడుతూ కాలం గడుపుతూ వుండేవాడు. ఇదంతా రోజూ రాయ్ తన గదిలో వుండి వీక్షిస్తూ వుండేవాడు.

వీరి క్రింద సైనికాధికారిగ వున్న కెమాల్‌పాషా కూడా రష్యా ప్రభుత్వ సహాయం అర్థించాడు. కెమాల్‌పాషా వీరికంటె అభ్యుదయగామి కావటంచేత ఆయనకు సహాయం చేయటానికి నిశ్చయించుకొన్నది. వీరిని రష్యా ప్రభుత్వం దూరంగా అట్టిపెట్టి చిన్నచూపు చూడటానికి యిది కూడా కొంతకారణం కావచ్చు. వీరు ప్రభుత్వాధినేతలమనే బింకంతో బెట్టుగా కాలం వెళ్లబుచ్చుతున్నారు. రష్యా ప్రభుత్వం తనంతటతాను మంతనాలకు ఆహ్వానించి నప్పుడే వెళ్లాలనుకున్నారేమో, ముందుగా తాము చొరవ తీసుకొనాలనే ప్రయత్నం వారిలో కనబడలేదు.

రాయ్, బరోడిన్‌లకు వీరి ప్రవర్తన చాల వింతగా కనబడ సాగినది. ఒకనాడు రాయ్ తనంతటతాను చొరవ కల్పించుకొని యన్వర్ పాషాను కలుసుకొనటానికి కబురు పంపాడు. అందుకు యన్వర్ పాషా తన హర్షాన్ని ప్రకటించి రాయ్, బరోడిన్‌లను టీకి ఆహ్వానించాడు. టీ సేవించినంతసేపూ యేవో వింత

కబుర్లు చెప్పి చివరకు పీడోక్కులు చెప్పటం పినా తన అంతరంగాన్ని బయటపెట్టక నిగూఢంగా వుంచటం రాయ్, బరోడిన్‌లకు మరీ ఆశ్చర్యాన్ని కలిగించినది.

మరునాడే అనుకోకుండా జమాల్ పాషా నుంచి ఆహ్వానం వచ్చినది. రాయ్, బరోడిన్ లిద్దరూ వెళ్లారు. ఆయన ప్రవర్తన వేరుగా కనబడినది. తమ దేశ రాజకీయాలతోబాటు చనువుగా అనేక విషయాలను గురించి మర్యాదగా మాట్లాడాడు. తన దేశం నుంచి ప్రత్యేకంగా తెప్పించుకొనిన విలువగల సిగరెట్లను స్వయంగా రాయ్, బరోడిన్‌లకు అందించాడు. రాయ్ అగ్గిపుల్ల వెలిగించి ముందుగా వారిద్దరి సిగరెట్లు ముట్టించాడు. అదే అగ్గిపుల్లతో రాయ్ తన నోటిలోని సిగరెట్టు ముట్టించుకొనబోగా వెంటనే జమాల్ పాషా వారించాడు. "అగ్గిపుల్లను మూడుసార్లు వుపయోగించగూడదు. మూడవ వ్యక్తికి యిది ప్రమాదాన్ని కలిగిస్తుంది" అని అనటంతో రాయ్, బరోడిన్ లిద్దరూ నివ్వెరపోయారు.

యన్వర్ పాషా మాస్కోలో తిష్టవేయటం బోల్షివిక్కులకు ఒక సమస్యగా పరిణమించినది. ఆయనంటే ఎవరికీ నమ్మకంలేదు. అయితే వట్టి చేతులతో పంపితే ప్రమాదానికి దారితీయవచ్చును. సోవియటురష్యాకు వ్యతిరేకంగా ముస్లిము దేశాలలో ప్రచారం సాగిస్తాడు. ఆయనకు అక్కడ పలుకుబడి వున్నది. ముస్లిము రాష్ట్రాలను వ్యతిరేకం చేసుకొనటం రష్యా అభిమతం కాదు. కనుక 'ఏమి చేద్దామా ?' అనే ఆలోచనలో ప్రభుత్వం యన్వర్ పాషాను చాలకాలం మాస్కోలో అట్టిపెట్టినది.

రాయ్ తన విప్లవ పథకం గురించి, కాబూలు వెళ్లవలసిన అవసరం గురించి చిచెరిన్, కారఖాన్‌లతో అనేక పర్యాయాలు చర్చించాడు. యన్వర్ పాషాను కాబూలు తీసుకొని వెళ్లి ఆయన పలుకుబడితో ఆఫ్గనిస్తాన్ రాజు అమానుల్లాను అనుకూలపరచుకొని సరిహద్దు కొండజాతులను రెచ్చగొట్టటానికి అక్కడ ఒక కేంద్రం స్థాపించాలనే ఆలోచన వున్నది రాయ్‌కి.

చిచెరిన్ యన్వర్ పాషాను ఆహ్వానించాడు. కాని ఆ సమావేశంలో రాయ్ కూడా పాల్గొనటం యన్వర్ పాషాను చకితపరచినది. అయితే రాయ్‌ని ఎరుగనట్లుగా నటించాడు. చిచెరిన్ ఆ పరిస్థితిని గ్రహించి ఆయనకు రాయ్‌ని పరిచయంచేస్తూ 'కాబూలుకు రాయబారిగా వెళ్లబోవుచున్నాడు' అని చెప్పగానే యన్వర్ పాషా నిర్ఘాంతపడయ్యాడు. వెంటనే తెప్పరిల్లుకొని 'రాయ్ అందుకు తగిన వ్యక్తి. బ్రిటిష

విదేశాంగ కార్యదర్శి లార్డు కర్జన్ కిది చెంపదెబ్బ' అని రాయ్‌ని అభినందించాడు. చిచెరిన్ ఆ విషయం అంతటితో ఆపి "మీరు కూడా కాబూలు వెళ్లే ప్రయత్నంలో వున్నారు. కనుక మీ కార్యక్రమంగురించి కామ్రేడ్ రాయ్‌తో వివరంగా మాట్లాడ వచ్చును." అని యన్వర్ పాషాను హెచ్చరించాడు.

"మన మిద్దరం ఒకేచోట, ఒకే ప్రాంగణంలో వున్నాము. కనుక తీరిగ్గా అన్ని వ్యవహారాలు మాట్లాడుకొనవచ్చును" అని రాయ్ యన్వర్ పాషాకు సూచించటంతో ఆ సమావేశం అప్పటికి ముగిసినది. యన్వర్ పాషాకు అంతవరకు తానొక రాజ్యాధినేతగా రాయ్ ఒక సామాన్య వ్యక్తిగా దురభిమానం వుండేది. ఈ సమావేశంతో ఆయన దృష్టి మారినది. రాయ్ మర్యాదగా 'తప్పక కలుసుకుందాము' అని సమాధానం చెప్పాడు. చిచెరిన్ వారిద్దరినీ బయటకు పంపుతూ ఏకాంతంగా రాయ్‌తో 'నా పని పూర్తి అయినది. ఇక మిగిలినది మీరు పూర్తిచేయాలి' అని హెచ్చరిక చేసి పంపాడు.

మరునాడు ఉదయమే రాయ్‌ని యన్వర్ పాషా విందు భోజనానికి ఆహ్వానించాడు. ఇద్దరూ తమ భావి కార్యక్రమం గురించి చర్చించుకున్నారు.

"నా మాస్కో యాత్ర ఫలించినది. ఇక యుద్ధరంగానికి బయలుదేరటమే తరువాయి."

'ఎక్కడకు ?' అని రాయ్ ప్రశ్నించాడు.

"బ్రిటిషు సామ్రాజ్యవాదంతో ఏకాకిగా పోరాడుచున్న కెమాల్ పాషాకు అన్ని విధాల సహాయం చేయవలసి వున్నది. ఇందుకు శత్రువును మరొకచోట యుద్ధరంగంలో దించాలి. భారతదేశం యిందుకు అన్నివిధాల తగిన రంగం" అని యన్వర్ పాషా సమాధానం చెప్పాడు.

"అవును. భారతదేశం యిందుకు తగిన రంగమే. కాని రాజు అమానుల్లా మనకు కావలసిన సహకారం అందించటానికి ఎంతవరకు ముందుకు వస్తాడనేదే నా అనుమానం" అని రాయ్ సందేహం వెల్లడించాడు.

"ఈ విషయం గురించి ఇచ్చటి ఆఫ్గనిస్తాన్ రాయబారితో రహస్య మంతనాలు జరుపుచున్నాను. రష్యా తమకు తగిన సహాయం చేస్తే బ్రిటిషు ప్రభుత్వానికి వ్యతిరేకంగా స్థావరం యేర్పరచుకొనటానికి అమానుల్లా అంగీక

రిస్తాడు. కాని జొత్తిగా రాజు అమానుల్లా మీద ఆధారపడి వుండటం మంచిదికాదు. దానితో బాటు తూర్పు టర్కీస్తాన్‌లో మరొక స్థావరం కూడా యేర్పాటు చేసుకొని అచ్చటనుండి ఇండియామీద దండయాత్ర చేయాలి. ఇందులో రష్యాకు ప్రత్యక్షంగా జోక్యం వున్నట్లు ఏ మాత్రం కనబడకూడదు. బ్రిటిషు ప్రభుత్వం బోల్షివిక్కులకు వ్యతిరేకంగా ముస్లిము రాష్ట్రాలలో ప్రచారం సాగిస్తుంది. అప్పుడు మన పథకం భగ్నం కావచ్చు. కనుక ఆసియావాసులు ఆసియా దేశాల స్వతంత్ర పోరాటం జరుపుచున్నట్లు కనబడాలి. రష్యా సహాయం చాల రహస్యంగా వుండాలి."

రాయ్ కూడా కొంతకాలం నుంచి దీనిని తీవ్రంగా ఆలోచిస్తూనే వున్నాడు. కాని వారి ఆశయాలు, గమ్యస్థానం వేరు వేరుగా వున్నవి. ఒకరు ఆసియాదేశాలకు, ఆసియా ప్రజలకు స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలు కలిగించాలనే దృఢసంకల్పంతో వున్నారు. మరొకరు రాజుగా, ముస్లిము రాజుగా, ముస్లిము సామ్రాజ్యాధినేతగా కలలు కనసాగారు. రష్యా సహాయంతో రష్యాకు వ్యతిరేకమయిన ముస్లిము సామ్రాజ్యాన్ని స్థాపించాలనే కుతంత్రంలో వున్నాడు యన్వర్ పాషా.

యన్వర్ పాషా కుట్రను, కుబుద్ధిని రాయ్ పసిగట్టాడు. భారతదేశంలో విప్లవ కార్యక్రమం ఉధృతం చేయటానికి ఆఫ్గనిస్తాన్‌ను కేంద్రంగా యేర్పరచు కొనటం అవసరమే. యుద్ధ సమయంలో బ్రిటిషు పలుకుబడినుంచి ఆఫ్గనిస్తాన్‌ను విడగొట్టటానికి విప్లవ ప్రభుత్వం ఆ దేశానికి కొంత సహాయం చేసినది. ఈ ఆసరాతో అమానుల్లా మరికొంత సహాయంకొరకు ప్రాకులాడవచ్చును. దీనిని అవకాశంగా తీసుకొని యన్వర్ పాషా అమానుల్లా రాయబారితో తన ఆశయ సఫలీకృతంకొరకు మంతనాలు సాగించి వుంటాడు. కనుక యన్వరు పాషా ప్లాను భగ్నం చేయవలసిన అవసరం రాయ్ గుర్తించాడు. కనీసం కొంతకాలం వాయిదా వేస్తే యన్వరు పాషా అసలు రంగు బయట పడగలదని భావించాడు.

"మీ పథకం మంచిదే. కాని యింకా విపులంగా, సావకాశంగా ఆలోచించాలి. తరువాత దీనికి సైనికాధికారుల ఆమోదంకూడా పొందవలసి వుంటుంది.... ఈ మధ్యలో నేను తాష్కెంటు కూడా వెళ్లవలసిన పని వున్నది." అని రాయ్ యన్వరు పాషా ప్లానుకు ఫుల్‌స్టాప్ పెట్టాడు.

రాయ్ తాను యన్వరు పాషాతో జరిపిన సంభాషణ వివరాలన్నీ చిచెరిన్, కారఖాన్‌లకు వివరంగా తెలియజేసాడు. యన్వరు పాషాను తూర్పుటర్కీస్తాన్‌కు వెళ్లనివ్వటమే మంచిదనే అభిప్రాయం చిచెరన్ వ్యక్తపరచాడు.

"యన్వరు పాషా అక్కడ ప్రస్తుతం చేయగలిగిన దేమీలేదు. చెకా (రహస్య పోలీసుదళం) నిఘా అయనమీద వుండనే వుంటుంది. ఒకవేళ కాబూలు వెళ్లితే అమానుల్లాను మనకు వ్యతిరేకంగా మార్చవచ్చును. ఆధునిక దృక్పథంగల అమానుల్లా లొంగకపోతే అచ్చటి ముల్లాలను కూడగట్టి వ్యతిరేక ప్రచారం సాగించ వచ్చును."

ముగ్గురూ దీర్ఘంగా ఆలోచించినమీదట ఏది చేయాలనుకున్నా ముందు లెనిన్‌కి తెలియపరచి ఆయన సలహా ప్రకారం చేయటం మంచిదని నిర్ణయించు కున్నారు. తరువాత రెండురోజులకే ఆఫ్గన్ రాయబారి రాయ్‌ని విందుకు ఆహ్వా నించాడు. అప్పటివరకూ వున్న రాయబారి బెర్లిను మారి నూతన రాయబారి రావటం ఇందుకు కారణంగా చూపెట్టబడినది. అయితే రష్యను విదేశాంగశాఖకు చెందిన అధికారు లెవ్వరూ ఆహ్వానింపబడలేదు. ఆహ్వానితుడయిన యన్వరు పాషా రాయ్‌ని ప్రక్కకు పిలిచి "మనం స్వేచ్ఛగా మాట్లాడు కొనటానికి ఇలా చేయవలసివచ్చిన" దని సమర్ధించాడు.

విందు సందర్భంలో యన్వరు పాషా రాయ్‌ని గురించి వ్యంగ్యధోరణిలో అతిగా పొగడ సాగాడు. 'రాయ్ క్రొత్తగా బోల్షివిక్కు అయినా స్వంత భావాలు, ఆదర్శాలు కల వ్యక్తి....ఈ బెబ్బులి తన రంగు మచ్చలను ఎప్పుడూ మార్చు కొనదు" అని పెద్దగా నవ్వగా, మిగిలినవారు శృతి కలిపారు.

అందుకు తగిన సమాధానం చెప్పటమే మంచిదనుకున్నాడు రాయ్. "నా రాజకీయ సిద్ధాంతం ఎలాంటిదయినా నా మాతృదేశంతో పాటు అన్ని పరాధీన దేశాల విముక్తి కొరకు పాటుబడటమే నా పరమావధి....ఇందుకు వీరజాతికి చెంది స్వాతంత్ర్యప్రియులయిన ఆఫ్గన్ రాజు, జాతీయుల సహకారం లభిస్తున్నందులకు నా హృదయపూర్వక అభివందనలు...." అని ఎత్తిపొడిచి మాటల ధోరణిలో "ఆసియావాసికి బోల్షివిక్కు అయినా, సామ్రాజ్యవాది అయినా శ్వేతజాతీయుడు వొక్కటిగానే కనబడతాడు. అతనితో నిష్కల్మషంగా ప్రవర్తించలేదు" అని యన్వర్ పాషా నుద్దేశించి సమాధానం చెప్పాడు.

చివరకు ఒకరి అభిప్రాయాలు ఒకరు స్వేచ్ఛగా వెలిబుచ్చుకొనిన తరువాత తేలిన సారాంశం - యన్వరు పాషా ఒక రహస్య సమావేశం కొరకు వెంటనే తాష్కెంటు చేరవలసి వున్నది. ఇందుకు రాయ్ రషియన్ అధికారులతో

తన పలుకుబడిని వుపయోగించి యన్వరు పాషా ప్రయాణం ఎట్టి అనుమానాలకు తావు లేకుండా కావలసిన యేర్పాట్లు చేసి నిరపాయంగా తాష్కెంటు చేరేటట్లు చూడాలి. ఇది మరొక కుట్ర. రాయ్ తన విధిని తాను నెరవేర్చగలనని చెప్పాడు.

మరుసటి దినమే రాయ్ లెనిన్‌ని కలుసుకొన్నాడు. యన్వర్ పాషా కుట్రాలోచనలకు లెనిన్ చికాకుపడ్డాడు. "యన్వర్ పాషా తాను రష్యను ప్రభుత్వాన్ని మోసగించగలననే భ్రమలో వున్నాడు. తాష్కెంటు వెళ్లినా ప్రమాదం లేదు. అక్కడ సొకోలేనికొవ్, సఫరొవ్‌లు వుండనే వున్నారు. త్వరలో నేను కూడా అక్కడికి వెళ్లబోవుచున్నాను. మేము ముగ్గురం కలిసి యీ వ్యవహారం చక్క దిద్దుకోగలమని" చెప్పి రాయ్ లెనిన్‌తో యన్వరు పాషా విషయాన్ని లోతుగా తరచలేదు.

"మీ పథకాన్ని గురించి లెనిన్‌తో చర్చించాను. ఆయన మీ సాహసానికి ఎంతో మెచ్చుకున్నాడు." అని రాయ్ యన్వరు పాషాతో చెప్పినప్పుడు యన్వరు పాషా హర్షానికి అంతులేదు. తిరిగి ముస్లిము సామ్రాజ్యాన్ని స్థాపించి అధినేతను కాబోతున్నాననే ఆశతో, రాయ్ యుద్ధానికి అవసరమయిన ఆయుధసామగ్రిని, ఇతర సాధన సంపత్తిని తీసుకొని రాగలడనే నమ్మకంతో యన్వరు పాషా యుద్ధవిజేతగా తాష్కెంటు బయలుదేరాడు.



## వాయువ్య సరిహద్దులో విప్లవ కేంద్రం

భారతదేశంలోని గాంధీ మహాత్ముని సహాయ నిరాకరణోద్యమంతో ముస్లిము రాజ్యాలలోని యన్వరు పాషా వుద్యమాన్ని పోల్చవచ్చును. జాతీయ విమోచన పోరాటంలో వీరు అభ్యుదయ గాములు. సాంఘిక విప్లవంలో అభ్యుదయ నిరోధకులు. యన్వర్ పాషా బ్రిటిషు సామ్రాజ్య వ్యతిరేకి. ముస్లిము సామ్రాజ్య స్థాపనకు దీక్ష వహించాడు. కాని ముస్లిము ప్రజానీకాన్ని అభ్యుదయ మార్గంలో ముందుకు సాగనివ్వలేదు. బోల్షివిక్కులు లోతుకు దిగి యీ విషయం గమనించక 'బ్రిటిషు సామ్రాజ్యవాద శత్రువు'ను తమ మిత్రునిగా భావించారు.

జాతీయ, వలస రాజ్యాల విమోచన ఉద్యమంలో రాయ్ యీ విషయం లోనే లెనిన్‌ని ప్రతిఘటించాడు. యన్వరు పాషా రాజకీయాలను గుణపాఠంగా తీసుకొని ఆసియాలోని తక్కిన దేశాల విప్లవ కార్యక్రమం రూపొందించుకొనవలసి వున్నది. ఈ దేశాల్లో ప్రోలిటేరియన్ విప్లవాలకు అనువుగా కాపిటలిజమ్ పెరుగ లేదు. బూర్జువా విప్లవాలకు సరియైన పునాదిని నిర్మించవలసిన అవసరం వున్నది.

వలస రాజ్యాల్లో ముఖ్యంగా అభివృద్ధి చెందుతున్న దేశాల్లో జాతీయ విమోచన పోరాటంలో దేశీయ బూర్జువావర్గం విప్లవ దృక్పథం గల నాయకత్వం వహించదనే సిద్ధాంతాన్ని రాయ్ మొదటినుంచి బలపరుస్తూ వచ్చాడు. భారతదేశాన్నే యిందుకు ఉదాహరణగా చూపించి యిచ్చటి బూర్జువా వర్గం విదేశీ పెట్టుబడిదారీ వర్గంతో చేతులు కలిపి చిన్న వాటాదారు (జూనియర్ పార్టనరు)గా ప్రజలను దోచుకొనటానికి వెనుదీయదు అని నిరూపించాడు. ముస్లిము రాజ్యాలలోని జమీందారులు, మతప్రవక్తలు కూడా సహజంగా దీనికి భిన్నంగా ప్రవర్తించరు. యన్వరు పాషా యే యిందుకు తార్కాణం అని భావించ గలిగాడు.

ఐరోపాఖండంలో జమీందారీ బానిసత్వానికి ఎదురుతిరిగిన రైతు వుద్యమాలకు నాయకత్వం వహించిన మతాధికారులు ప్రజాస్వామిక విప్లవం పేరుతో పెట్టుబడిదారీ వ్యవస్థకు తోడ్పడ్డారు. మార్క్సిజం ప్రకారం అది చరిత్రాత్మక సంఘటన. అదేవిధంగా ప్రోలిటేరియన్ విప్లవంకూడా సహజ 'చరిత్ర గమనం'గా కారల్ మార్క్సు సిద్ధాంతీకరించాడు. కనుక ఆసియా ఖండంలో కూడా మతాధికారులు బూర్జువా ప్రజాస్వామిక విప్లవానికి తోడ్పడగలరని మార్క్సిస్టుల విశ్వాసం.

మార్క్సిజాన్ని క్షుణ్ణంగా అధ్యయనంచేసి జీర్ణించుకొని, ఐరోపా, ఆసియా ఖండాల సామాజిక, ఆర్థిక పరిస్థితులను అవగాహన చేసుకొనగలిగిన రాయ్‌కి మార్క్సు సిద్ధాంతీకరించిన 'చరిత్ర గమనం'లో సంశయ మేర్పడినది. కాపిటలిస్టు వ్యవస్థకు పోరాడే బూర్జువావర్గం ప్రజాస్వామిక విప్లవానికి నాయకత్వం వహించి ఆ విప్లవం ఫలప్రదం కాకుండా భగ్నం చేయటానికి సామ్రాజ్యవాదులతో పొత్తు కుదుర్చుకుంటుంది. కనుక భారతదేశంలో జరుగవలసిన బూర్జువా ప్రజాస్వామిక విప్లవానికి బూర్జువా వర్గం విప్లవ పాత్రను నిర్వహించదు. రైతులు-కార్మికులు వున్న ప్రజా వుద్యమాన్ని శ్రామిక నాయకత్వం క్రింద సంఘటిత పరచాలి. దేశీయ బూర్జువావర్గం బ్రిటిషు సామ్రాజ్యవాదులతో రాజీపడి జాతీయ వుద్యమాన్ని

నాశనంచేసే ప్రమాదం వుందని రాయ్ చిచెరిన్‌తో వాదించినప్పుడు ఆయన రాయ్‌ని 'నిరాశావాదిగా' పరిణిస్తూ 'చరిత్ర గమనం' ఎవరూ అడ్డగించలేరని అన్నాడు. కాని లెనిన్ రాయ్ అభిప్రాయాలను పూర్తిగా త్రోసిపేయలేదు. 'భారతదేశంతోపాటు, యితర వలస రాజ్యాల్లోకూడా అనుభవపూర్వకంగా ఒక నిర్ణీత కార్యక్రమం చేపట్ట వలసి వుంటుం'దని రాయ్ ప్రతిపాదనలకు తగిన స్థానం యిచ్చాడు.

దూరంగా వుండి ఒక కార్యక్రమాన్ని రూపొందించి దానిని వలస రాజ్యాల వుద్యమాలు ఆచరించాలని తీర్మానించినందువలన ప్రయోజనం శూన్యం. ఆ కార్యక్రమాన్ని ఆచరణలో పెట్టగల పార్టీని, నాయకత్వాన్ని వలస రాజ్యాలలో నిర్మించాలి. భారతదేశంలోకూడా దీని అవసరం వున్నది. కనుక దీనికి నాందిగా భారతదేశ సరిహద్దులలో ముందుగా ఒక కేంద్రాన్ని యేర్పరచి భారతదేశంలోని విప్లవభావాలు కల పలుకుబడి గల వ్యక్తులతో సన్నిహిత సంబంధం పెట్టుకొని 'ప్రజాపార్టీ'ని స్థాపించటానికి తీవ్ర కృషి జరుపవలసి వున్నది. గాంధీనాయకత్వం క్రింద 'సహాయనిరాకరణ' పేరుతో వున్న 'వ్యతిరేక నినాదాల' స్థానంలో ప్రజలకు అవసరమయిన, అనుకూలమయిన 'నినాదాలు' ప్రవేశపెట్టి వారిని జాతీయపోరాటానికి సంఘటితపరచాలి. 'విప్లవపార్టీ తన గమ్యస్థానం చేరటానికి స్పష్టమయిన విప్లవ కార్యక్రమం చేపట్టాలి' అని లెనిన్ బోధించాడు. భారతదేశంలో యీ రెండు పనులు చేయవలసి వున్నదని రాయ్ నిశ్చయించుకున్నాడు.

గాంధీ 'సహాయ నిరాకరణ' వుద్యమంలో రాయ్‌కి బొత్తిగా విశ్వాసం లేదు. విప్లవం ఫలప్రదం కావాలంటే అనేక కష్టనష్టాలకు, త్యాగాలకు సిద్ధపడ వలసి వున్నది. అది కనుచూపుమేరలో లేకపోయినా దీర్ఘకాల ప్రణాళికతో కార్య సాధనకు పూనుకుంటే విజయం తప్పక లభిస్తుంది. మెక్సికోలో అనుభవ పూర్వకంగా రాయ్ దీనిని తెలుసుకోగలిగాడు. కనుక కాబూలును కేంద్రంగా పెట్టుకొని భారతదేశంలోని విప్లవ శక్తులను సమీకరించాలనే ధృఢసంకల్పానికి వచ్చాడు.

రాయ్ రష్యా రాయబారిగా ఆఫ్గనిస్తాన్ వెళ్లే ప్రతిపాదన విరమించుకొనబడినది. రాయ్ తమ దేశ రాయబారిగా వస్తే బ్రిటను, ఆఫ్గన్ సంబంధాలలో కొంత వ్యతిరేకత పొడసూపగలదనే భావం ఆఫ్గన్ ప్రభుత్వం వెల్లడించటంతో రాయ్‌ని సంప్రదించిన మీదట యీ నిర్ణయం తీసికొనబడినది. చివరి నిముషంలో బఖోడిన్ కూడా రాయబారిగా వెళ్లటానికి యిష్టపడలేదు. కొన్ని కారణాల వలన

ఆయన మాస్కోలో వుండవలసి వచ్చినది. బాల్టిక్ సముద్రంలో నౌకా కమాండరుగా వున్న రస్కాల్‌నికోల్ ఆఫ్గన్ రాయబారిగా నియమించబడ్డాడు. ఈయన భారత దేశ పరిస్థితులను గురించి, రాయ్ ప్రణాళిక గురించి ఉత్సాహం కనబరచిన వ్యక్తులలో వొకరు. కనుక కాబూలులో వొక కేంద్రాన్ని స్థాపించి భారత విప్లవానికి అవసరమయిన సహకారం అందచేయాలనే తలంపుతో వున్నాడు. ఆయన భార్య లారిస్సా కూడ విప్లవకాలంలో ప్రముఖపాత్ర వహించి భర్తను మించిన బోల్షివిక్కుగా పేరెన్నిక గన్నది. మంచి చాకచక్యం గల వనిత. నాట్యంలో మంచి ప్రవేశమున్నది. అవసరమయితే రాజు అమానుల్లాను తన నాట్యం ద్వారా వశపరచుకొని తమ సంకల్పం నెరవేర్చుకొనగల తెలివితేటలు గల యువతి. కనుక నికోల్‌ని రాయబారిగా పంపటం జరిగినది.

రాయ్ తన 'విప్లవ ప్రణాళిక'ను గురించి లెనిన్‌తో చర్చించి ఆయన అభిప్రాయం, అనుమతిని కోరగా లెనిన్ ప్రత్యేక శ్రద్ధతో రాయ్ ప్రణాళికను పరిశీలించి "ఏ విధంగా నయినా బ్రిటిషు ప్రభుత్వాన్ని కూలద్రోయటం విప్లవ ఘట్టంగా పరిణమించగలదు. తరువాత విషయం ముందుగా ఆలోచించనక్కర్లేదు" అని తన అంగీకారం ప్రకటించాడు.

తరువాత ఏమి జరిగినా బ్రిటిషు ప్రభుత్వాన్ని కూలద్రోయటం నిజంగా విప్లవ సంఘటనయే. ఆ ప్రభావం ఆసియాలోని మిగిలిన వలస రాజ్యాలమీద పడక తప్పదు. దీనివలన ఇంగ్లాండులోనే విప్లవం రావచ్చును. కనుక వాయువ్య సరిహద్దు ప్రాంతంలోని కొండజాతులను సమీకరించి, ఆయుధ సామగ్రిని అందచేసి భారత దేశంమీద దండయాత్రకు పురికొల్పటం, అదేసమయంలో భారత ప్రజలను తిరుగుబాటుకు సమాయత్తపరచటం ఏకకాలంలో జరుగవలసి వున్నది. ఇందుకు ఆఫ్గన్ రాజు అమానుల్లా సహకారం పొందటం ప్రథమ కర్తవ్యం.

రాజు అమానుల్లా విప్లవవాది కాదు. బ్రిటిషు వ్యతిరేకి. అంతమాత్రంచేత రష్యాకు అనుకూలుడు అని చెప్పటానికి వీలులేదు. అవకాశవాది. బేరానికిదిగి ఎటు లాభంగా కనబడితే అటు మొగ్గే స్వభావం కలవాడు. ఈ పోటీలో బ్రిటిషు ప్రభుత్వాన్ని అధిగమించగల శక్తి ప్రస్తుతం రష్యా ప్రభుత్వానికిలేదు. కనుక రాజు అమానూల్లా అటే మొగ్గు చూపవచ్చు. "సాధారణంగా వలస రాజ్యాలలో ముఖ్యంగా భారతదేశంలో యీ పోటీ ఏర్పడినప్పుడు జాతీయ బూర్జువా వర్గీయులు

సహజంగా బ్రిటిషు ఇంపీరియలిజంతో రాజీ పడటానికి సిద్ధపడతారు కాని సోవియటు బోల్షివిజమ్ దగ్గరకైనా రారుగదా !" అని రాయ్ తన అభిప్రాయం వెల్లడించినప్పుడు లెనిన్ నవ్వి "అవును, నిజమే. కాని ముందుగా మనం భ్రమతో వుంటే ఏ పనీ చేయలేము. విప్లవవాది తన కార్య సిద్ధికొరకు ప్రతి విషయాన్ని తరచి ప్రయత్నించి చూడాలి. ఆఫ్గనిస్తాన్ మన కార్యసిద్ధికి ఎంతవరకు వుపకరించగలదో ప్రయత్నించి చూడటం మంచిది." అని తన అభిప్రాయం వ్యక్తపరిచాడు. వెంటనే రాయ్ పార్టీ 'పొలిట్ బ్యూరో,' 'విప్లవ సైనిక కౌన్సిలు' అనుమతిని పొందటానికి తన ప్రణాళికను అన్ని వివరాలతో సంసిద్ధపరచటానికి పూనుకున్నాడు.

## విప్లవ ప్రణాళిక - తాష్కెంటు ప్రయాణం :

కేవలం భారత వాయువ్య సరిహద్దుల ప్రాంతాల కొండజాతులకు ఆయుధ సామగ్రిని అందచేసి బ్రిటిషు ప్రభుత్వం మీద దండయాత్ర చేయించటం రాయ్ పథకంలో మూలసూత్రం కాదు. అలా చేయటం చాల సులభమయిన పనే. కాని దానివలన జరిగే ఫలితం ? ఐరోపా ఖండంలో యుద్ధం పరిసమాప్తమయినది. బ్రిటిషు ప్రభుత్వం తన సైన్యాలను వాయువ్య సరిహద్దులకు పంపగల అవకాశం వున్నది. కనుక అచ్చట పోరాటం స్వాతంత్ర్య పథంలో అధిగమించటానికి ఎంతవరకు వుపకరిస్తుంది అనే విషయం రాయ్ తీవ్రంగా ఆలోచించసాగాడు.

ఒకవేళ రష్యా సహాయంతో సరిహద్దు ప్రాంతాల కొండజాతులకు ఆయుధ సామగ్రిని అందించి వారిని దండయాత్రకు పురికొల్పితే ఆ అవకాశాన్ని పురస్కరించుకొని వారు భారతదేశంలోని గ్రామాలను, నగరాలను దోపిడీ చేయవచ్చు. దేశంలో భయాందోళనలు ప్రబలి మహమ్మదీయులు తిరిగి దండయాత్రకు పాల్పడ్డారనే అపోహలు హిందువులలో ప్రబలి తమ రక్షణకొరకు బ్రిటిషు ప్రభుత్వాన్ని అర్థించవచ్చును. దీనివలన అంతవరకు బ్రిటిషు ప్రభుత్వంమీద వున్న అసూయ, ద్వేషాలు అంతరించగలవు. కాగా దేశంలో మత కలహాలు చెలరేగే అవకాశం కూడా లేకపోలేదు. వాటిని దూరదృష్టితో చూడగల నాయకత్వం, వుద్యమాన్ని సక్రమ పంథాలో నడుపగల నాయకత్వం లేనప్పుడు దేశం అరాచకానికి దిగటం తప్పదు.

కనుక రాయ్ యీ ప్రమాదాలను దృష్టిలో పెట్టుకొని తన ప్రణాళికను రూపొందించవలసిన అవసరమున్నది. మరొక ప్రధాన సంఘటన కూడా రాయ్ మనసునందుంచుకొనవలసిన అవసరమేర్పడ్డది. అది ఖిలాఫత్ వుద్యమం—దాని కారణంగా వేలకొలది మహమ్మదీయ యువకులు, విద్యావంతులు టర్కీలో కెమాల్ పాషా సైన్యంలో చేరటానికి భారతదేశంనుంచి ప్రయాణం కట్టారు. అది మత సంబంధమయిన వుద్యమం. "మహమ్మదీయ మతానికి తీరని ప్రమాదం యేర్పడినది. మత రక్షణకు మహమ్మదీయులు ఏకం కావాలి" అని యుద్ధ సమయంలో టర్కీలోని సుల్తానులతో కూడిన ఖిలాఫత్ సంస్థ అన్ని దేశాల మహమ్మదీయులకు పిలుపు యిచ్చినది. టర్కీ పరాజయంతో ఆ సుల్తానుల అధికారంతోబాటు ఖిలాఫత్ సంస్థ కూడా రద్దుఅయినది. కెమాల్‌పాషా ఆశయం పదవీచ్యుతులయిన సుల్తానులను నిలబెట్టి తిరిగి ముస్లిము సామ్రాజ్యాన్ని, ఖిలాఫత్ సంస్థను రక్షించటంకాదు. కాని మతంలో మూఢ విశ్వాసంకల మహమ్మదీయులు టర్కీ ప్రయాణం మానలేదు. టర్కీ వెళ్ళినందువలన వారు చేయగలిగినదేమీ లేదు. వారి ఆశయం ఖిలాఫత్‌ను రక్షించటం. అది అప్పటికే అంతరించిపోయినది. కనుక విద్యావంతులయిన మహమ్మదీయులకు తగిన శిక్షణ, రాజకీయ పరిజ్ఞానం కలిగించి భారతదేశ విమోచన వుద్యమానికి సైనికులుగా తర్ఫీదుచేయాలనే సంకల్పం రాయ్‌కి కలిగి దానిని కూడా తన ప్రణాళికలో ఒక భాగంగా రూపొందించాడు.

రాయ్ ప్రణాళికలో ముఖ్యాంశాలు :- అఫ్‌గనిస్తాన్‌లో ఒక కేంద్ర కార్యాలయాన్ని స్థాపించి, విద్యావంతులయిన భారత యువకుల్ని సమీకరించి, సైనిక శిక్షణతోబాటు విప్లవ రాజకీయాలు బోధించి, విమోచన సైన్యాన్ని నిర్మించటం, ఈ సైన్యం అగ్రగామిగా సరిహద్దుల కొండజాతుల సహాయంతో దండయాత్ర జరిపి భారత దేశంలోని కొన్ని ప్రాంతాలను స్వాధీనం చేసుకొని విప్లవ ప్రభుత్వం స్థాపించటం, ఆ ప్రభుత్వం అచ్చటి ప్రజలకు అవసరమయిన ఆర్థిక, సాంఘిక న్యాయం కలుగచేయ గలమని ప్రకటించటం, అదేవిధంగా యావద్భారత దేశంలో నూతన వ్యవస్థ నిర్మింపబడగలదని ప్రకటించి స్వాధీనమయిన ప్రాంతాల ప్రజల అవసరాలను ముందుగా తీర్చి, వారి విశ్వాసాన్ని పొంది ఆయుధసామగ్రి నిచ్చి, ప్రజా సైన్యాన్ని పెంపొందించటం, విప్లవ ప్రభుత్వం తన కార్యక్రమాన్ని ఆచరణలో పెట్టుచూ ముందుకు సాగిపోవటం, క్రమేపి మొత్తం భారతదేశాన్ని పరాధీనత నుంచి విముక్తి కావించటం.

విప్లవ ప్రభుత్వం స్వతంత్ర భారతదేశ సమగ్ర రూపాన్ని ప్రజలకు స్పష్టంగా వివరించి, ఆచరణకు పూనుకుంటే ప్రజలే ముందుకు వచ్చి విమోచన వుద్యమాన్ని బలపరచగలరని జమీందారుల, పెట్టుబడిదారుల కుతంత్రాలు, కుట్రలు సాగనివ్వరని వెల్లువగా వున్న ప్రజా వుద్యమాన్ని, ప్రజా సైన్యాన్ని బ్రిటిషు ప్రభుత్వం కూడా అడ్డగించ జాలదని రాయ్ విశ్వాసం.

ఈ ప్రణాళికకు ఎక్కువ సంఖ్యలో అన్నిరకాల ఆయుధాలు, ఆయుధ సామగ్రి, అందుకు సంబంధించిన యితర సాధన సంపత్తులు, హెచ్చు మొత్తంలో ధనం, సైనిక శిక్షణకు తగిన సిబ్బంది అవసరం. ధన సహాయానికి కమ్యూనిస్టు పార్టీ సిఫారసు చేయటం, పీపుల్సు కమిసార్ అంగీకరించటం జరిగిపోయినది. అంతర్యుద్ధం వలన ఆయుధ భాండాగారాలు వట్టిపోయినవి. ఆయుధసామగ్రి కొరకు రాయ్ కొంతకాలం మాస్కోలో ఆగవలసి వచ్చినది. మిలిటరీ కౌన్సిలు అధ్యక్షులు మాస్కోలో లేడు. ముందుగా ఆయన అనుమతి పొందటం అవసరం. అయినా ఉపాధ్యక్షులు స్వతంత్రించి నిర్ణయం తీసుకొని రాయ్ ప్రణాళిక ప్రకారం కావలసిన ఆయుధ సంపత్తిని సిద్ధంచేసి పెట్టాడు. రష్యా విప్లవ (అక్టోబరు) దినోత్సవం జరిగిన తదుపరి రాయ్, రాయ్ అనుచరవర్గ ప్రయాణానికి ఒక తేది నిర్ణయింప బడినది.

తాష్కెంటు మాస్కోకు రెండువేలమైళ్ల దూరంలో వున్నది. అంతర్యుద్ధ కాలంలో గత సంవత్సరం వరకు ఆ మధ్యలో హెచ్చు ప్రాంతం శత్రువుల స్వాధీనంలో వున్నది. అది దాదాపు నిర్జన ప్రాంతంగా కొండలు, గుట్టలు, అడవులతో నిండివున్నది. రైలుస్టేషనులు కూడా వందమైళ్లకు మధ్యలో లేవు. ప్రయాణం అతి ప్రమాదకరమైనది. దొంగలు, దోపిడిగాండ్రు ప్రయాణీకులను విచ్చలవిడిగా కొల్లగొట్టుతూ వున్నారు.

రాయ్, ఆయన అనుచర బృందానికి రెండు ప్రత్యేక రైలుబండ్లు నిర్దేశింప బడినవి. మొదటి బండిలో ఒక్కొక్కటి ముప్పయి టన్నులు బరువుమోసే ఇరవైయేడు వ్యాగన్లు అమర్చబడినవి. వాటిల్లో పిస్తోళ్లు, రైఫిల్సు, మరతుపాకులు, మందుసామగ్రి, సైనిక పరికరాలు, ట్రాన్సుమీటర్లు, వైర్‌లెస్ సామగ్రి, డేరాలు మొదలైనవి నింపబడ్డవి. దానికి రక్షణగా రెండు సైనిక పటాలాలు. నాయకుడు జాన్. ఈయన విప్లవ సమయంలో అమెరికాలో శక్తివంతమయిన కార్మిక

సంఘానికి నాయకునిగా వుండి విప్లవానంతరం రష్యా వచ్చి అంతర్యుద్ధంలో ప్రముఖపాత్ర వహించాడు. దాదాపు ఏడుఅడుగుల ఎత్తు గలిగి అందుకు తగిన వడ్డూ, లావూ వున్న వ్యక్తి. ఆజానుబాహుడు. జైంట్ అని అందరూ పిలుస్తూ వుండేవారు.

రెండవ బండిలోని రెండు వ్యాగన్లు బంగారు నాణాలు, వెండి నాణాలు, కరెన్సీ నోట్లతో నింపబడ్డవి. పది వ్యాగన్లలో విమానాలకు సంబంధించిన విడి భాగాలు, ఒక విమానదళానికి సరిపోయే పరికరాలు, ఏడు వ్యాగన్లలో విమాన దళానికి, సైనిక స్కూలుకు సంబంధించి తర్ఫీదునిచ్చే సిబ్బంది, రాయ్‌కి ప్రత్యేకించి ఒక సెలూన్ ఏర్పాటుచేయబడ్డవి. అధికారం గలిగి ప్రత్యేక హోదా గలవారికి మాత్రమే యిట్టి సెలూన్ ఏర్పాటు చేయబడుతుంది. ఆ బండికి ఒక విమాన దళ ఆఫీసరు కమాండరుగా నియమించబడ్డాడు. ఆయన ఏమి చేయాలనుకున్నా ముందు రాయ్‌నుంచి అనుమతి పొందవలసియున్నది. ఆ రైలుబండికి ప్రత్యేక రక్షణ బందోబస్తులు చేయబడ్డవి. రాయ్ ప్రయాణంచేసే సెలూనుకు, బంగారు వెండి నాణాలు, విమాన సామగ్రి వున్న వ్యాగన్లకు మరతుపాకులు అమర్చబడ్డవి.

ఈ బృందం వారం రోజుల్లో తాష్కెంటు చేరాలి. అలా చేరని పక్షంలో రెండవవైపునుంచి అదనపు సహాయకదళాలను పంపాలి. ప్రమాదభరితమయిన ప్రయాణంకనుక ముందుగా అట్టి యేర్పాట్లు చేయబడినవి. రాయ్ తన అనుచర బృందంతో అతి జాగ్రత్తగా 2000 మైళ్ళు ప్రయాణంచేసి, మధ్యలో దోపిడీ గాంౘ్రడను, బందిపోటు దొంగలను అధిగమించి ఏడవరోజున నిర్ణీతకాలానికి తాష్కెంటు చేరగలిగాడు. రాయ్ అగమనంకొరకు ఎదురుచూస్తున్న సొకోల్‌నికావ్ (రష్యా సైన్యానికి సెంట్రల్ ఆసియా కమాండరు) వారిని సాదరపూర్వకంగా ఆహ్వానించి ఆ వ్యాగన్లలో వున్న సామగ్రినంతటినీ తన స్వాధీనంలోనికి తీసుకున్నాడు.

## మధ్య ఆసియా :

రాయ్ గమ్యస్థానానికి తాష్కెంటు మొదటి మజిలీ మాత్రమే. తాష్కెంటులో విమోచన సైనికదళాన్ని, శిక్షణ యిచ్చి సిద్ధం చేయవలసి వున్నది.

తరువాత కాబూలును కేంద్రంగా యేర్పరచుకొని అచ్చటినుంచి విమోచన సైన్యాన్ని భారత సరిహద్దులకు పంపి కొండజాతుల సహకారంతో విమోచన వుద్యమాన్ని నడపాలి. దీనికి ముందుగా ఆఫ్గన్ ప్రభుత్వ అనుమతి పొందాలి. కాని యన్వర్ పాషా దీన్ని భగ్నం చేసే ప్రమాదం వున్నది.

రాయ్‌కి తాష్కెంటులో మరొక బాధ్యత కూడా వున్నది. టర్కిస్తాన్ కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ బ్యూరో సభ్యునిగా మధ్య ఆసియా రాష్ట్రాలలో కొత్తగా ఏర్పడిన విప్లవ ప్రభుత్వాన్ని కట్టుదిట్టం చేసి బలవత్తరం చేయవలసియున్నది. టర్కిస్తాన్ కార్యాలయానికి ఒక భవనం, ప్రత్యేకంగా రాయ్‌కి మరొక భవనం యేర్పాట్లు చేయబడ్డవి. తాష్కెంటు జారు ప్రభుత్వ కాలంలో దక్షిణ ప్రాంతాలకు రాజధానిగా వుండేది. ప్రాక్ పశ్చిమ సంస్కృతుల కలయికగా ఆ నగరం అభివృద్ధి చెందినది. బాగా జనాభా గల పట్టణం కూడాను. కాని విప్లవకాలంలో జారు ప్రభుత్వ అధికారులు ఆ నగరాన్ని దాదాపు భస్మీపటలం చేసారు. తరువాత మరమ్మతులు జరుగలేదు. నీటి సప్లయి, కరెంటు సప్లయిలు లేవు. రేషన్ ద్వారా అన్నివస్తులు కొనుగోలు చేసుకొనవలసి యున్నది. వేసవిలో విపరీతమయిన ఎండలు, చలికాలంలో విపరీతమయిన చలి గల ప్రదేశం.

ప్రస్తుత కమ్యూనిస్టు ప్రధాన కార్యాలయ భవనంలో అంతకుముందు జారు ప్రభుత్వ కాలంలో ఇంపీరియల్ బ్యాంకు వుండేది. ప్రభుత్వ ఖజానాతోపాటు ప్రభుత్వాధికారులు, ధనికులు తమ నగలు, నాణ్యాలు, విలువగల వస్తువులను ఆ బ్యాంకులో దాచుకుంటూ వుండేవారు. విప్లవ సైన్యం ముందుగా జాగ్రత్తపడి బ్యాంకును వశపరచుకొనటం చేత ఆ భవనం ధ్వంసం చేయటానికి వీలులేక పోవటమే కాకుండా అందులోని ఖజానా, బంగారం, యితర వస్తువులన్నీ విప్లవ ప్రభుత్వం స్వాధీనం చేసుకొన గలిగినది. అవి అన్నీ సీలుచేసి ప్రత్యేక రక్షణలో వుంచబడ్డవి. రాయ్ తాష్కెంటు చేరిన తరువాత ఆ రక్షణ అధికార బాధ్యత ఆయనకు అప్పగించబడినది.

రాయ్ కొరకు ప్రత్యేకించబడిన భవనం కూడా విశాలమయిన బంగళా. జారు ప్రభుత్వకాలంలో బొఖారా ప్రభుత్వ ప్రతినిధి నివసిస్తూ వుండేవాడు. అచ్చటి గదులలో పరుచబడిన తివాచీలు అమూల్యమైనవి. విప్లవకాలంలో యీ భవనం కూడా ధ్వంసంచేయబడ్డది. విద్యుచ్ఛక్తి, నీటిసరఫరాలు తుంటుబడ్డవి. విలువయిన

ఫర్నిచర్ అంతా దెబ్బతిన్నది. త్వరలో అన్నీ బాగుచేయించబడ్డవి. అవసరమయిన వసతులన్నీ కల్పించబడ్డవి.

రాయ్ తాష్కెంటు చేరిన తరువాత ప్రధానంగా విమోచన దళాన్ని సిద్ధపరచే కార్యక్రమంలో నిమగ్నుడయ్యాడు. మధ్యఆశియాలో భారత వ్యాపారస్థులు, ముఖ్యంగా సింధుదేశస్థులు స్థిరపడిపోయారు. విప్లవకారణంగా, తరువాత అంతర్యుద్ధకారణంగా వారి వ్యాపారం చాలవరకు దెబ్బతిన్నది. ఆఫ్గన్ సరిహద్దులలో బ్రిటిషు సైనికులు గస్తీవుండటం వలన భారతదేశంతో వారి వ్యాపారం పునరుద్ధరించుకొనటానికి వీలులేకపోయినది. వారు సహాయంకొరకు రాయ్‌ని కలుసుకొనసాగారు. వారిలో బ్రిటిషు వ్యతిరేకభావం పురికొల్పి విమోచనదళానికి వారి సహాయంకొరకు రాయ్ ప్రయత్నించాడు. మొదట వారు కొంత ఉత్సాహం, అంగీకారం ప్రకటించినా కేవలం వ్యాపారదృష్టి కలవారు కనుక రాయ్ ఆశించి నంతగా వారు వుపయోగపడక పోగా తిరిగి భారతదేశం వెళ్లాలనే సంకల్పానికి వచ్చారు. సరిహద్దులలోని బ్రిటిషు సైనిక కేంద్రాలను తప్పించుకొని వారు భారత దేశం ప్రవేశించగల అవకాశంలేదు. కనుక కొంతకాలం వోపికపట్టి అక్కడే వుండ మని రాయ్ సలహా యిచ్చినా వారు వెళ్లటానికే కృతనిశ్చయు లయ్యారు. యన్వర్ పాషా తన ఏజంట్ల ద్వారా బ్రిటిషు ప్రభుత్వంతో లాలూచిపడి రాయ్ రహస్య కార్యక్రమాలను, సంచారాన్ని తెలియచేయసాగాడు. దీని ఫలితంగా బ్రిటిషు సైని కులు రాయ్‌ని పట్టుకొనటానికి ప్రయత్నాలు కూడా జరిగినవి. బ్రిటిషు సైన్యంనుంచి బయటకు వచ్చి ఖిలాఫత్ వుద్యమంలో చేరటానికి వుద్యుక్తులయిన పఠానులను రాయ్ రహస్యంగా కలుసుకొని విమోచనదళంలో చేరటానికి ప్రోత్సహించాడు. అందులో కొంతమందిని విమోచనదళంలో చేర్చి భారత విమోచన సైన్యానికి ప్రారంభోత్సవం చేసాడు.

రష్యా అంతర్యుద్ధంలో గెరిల్లా యుద్ధ తంత్రంలో ఆరితేరిన రష్యను సైనికాధికారులు యీ విమోచన సైన్యానికి మొదట నాయకులుగా వుండి శిక్షణ విచ్చారు. తరువాత భారతీయులే అధిపతులయి శిక్షణ నివ్వగలిగారు. బ్రిటిషు సైన్యంలో కేవలం సాధారణ సైనికులు యిక్కడ అధిపతులు కావటంతో సైని కంగా విమోచన సైన్యం ఉన్నతస్థాయిని పెంచుకొన గలిగినది. బ్రిటిషు సైనికుల నుండి విడివడి విరివిగా భారత సైనికులు యీ విమోచన సైన్యంలో చేరసాగారు. కొద్దికాలంలోనే యీ బృందం పెద్ద సైన్యంగా రూపొంది రెడ్ ఆర్మీకి 'అలగ్జి

ఫోర్సు'గా తయారయినది. బ్రిటిషు ఇండియా సైన్యం దీని దాడులకు తట్టుకొనలేక పర్షియన్ రాష్ట్రమయిన ఖొరాసాన్ నుంచి ఉపసంహరించు కొన్నది.

మధ్య ఆసియాలో విప్లవ ప్రతిఘటన ఉద్యమం తలయెత్తసాగినది. దీనికి బ్రిటిషు, ఆఫ్గన్ ప్రభుత్వాల సహకారాలు కుట్రలు విరివిగా వున్నవి. యన్వర్ పాషా కూడా యిందుకు కొంత కారణభూతుడు. తన ఏజంట్లను ఆఫ్గన్ రాజు దగ్గరకు పంపి తూర్పు టర్కిస్తాన్‌లో బలవత్తరమయిన సైన్యాన్ని కేంద్రీకరించి ముస్లిము రాజ్యం స్థాపించబోతున్నాననే నమ్మకం కలిగించాడు. బ్రిటిషు ప్రభుత్వం అమానుల్లాను విశ్వసించటంలేదు. కనుక అటు బోల్షివిజం లేక యిటు యన్వరు పాషా వైపునకు అమానుల్లా మ్రొగ్గు చూపవలసిన సమయం ఆసన్నమయినది. కాని యన్వరు పాషా సలహా ననుసరించి 'ఇస్లాము మతాన్ని' రక్షించటానికి బ్రిటిషు ప్రభుత్వంతో రాజీపడటానికి నిశ్చయించుకున్నాడు.

బోల్షివిక్కులకు యీ కుట్ర రహస్యాలన్నీ తెలుసు. బొఖారా అమీరును దించగల శక్తి వారికి వున్నది. యన్వరు పాషా గాలిమేడలు వినా అక్కడ బ్రిటిషు ప్రభుత్వం ప్రత్యక్షంగా జోక్యం కలిగించుకొనగల స్థితిలో లేదు. అయినా మధ్య ఆసియాలో రాజకీయ అధికారం హస్తగతం చేసుకొనటానికి బోల్షివిక్కులు ముందుకు రావటంలేదు. ఇందుకు వేరే కారణ మున్నది. యన్వరు పాషా వంటి విప్లవ వ్యతిరేక నాయకుల పలుకుబడి నుంచి ముస్లిము రాజ్యాలను తప్పించగలిగితే అవి బ్రిటిషు వ్యతిరేక వుద్యమానికి మూలస్తంభాలు కాగలవనే విశ్వాసం వారికున్నది. బొఖారా ముస్లిము సంస్కృతికి ప్రధాన కేంద్రము. అయినా అచ్చటి ప్రజలు అమీరును దించి రిపబ్లికు ప్రభుత్వాన్ని స్థాపించటానికి అనుకూలంగానే వున్నారు. కాని ఆ మార్పు వలన మిగిలిన ముస్లిము రాజ్యాలలో తమమీద వ్యతిరేక భావం ప్రబలుతుందని బోల్షివిక్కుల అనుమానం.

ఈ విషయాలన్నీ కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ టర్కి బ్యూరోలో వివరంగా చర్చించబడ్డవి. ఏదో ఒకటి నిర్ణయించకుండా దీర్ఘకాలం వేచివుండటం, 'పాన్ ఇస్లామిజా'న్ని విప్లవశక్తిగా భావించటం ప్రమాదభరితమని రాయ్ హెచ్చరించాడు. విప్లవ వ్యతిరేకశక్తులను త్వరలో తొలగించక పోయినచో అవి కొలది కాలంలోనే మధ్య ఆసియాలో విజృంభించగల ప్రమాదం వున్నది. కాని మిగిలిన సభ్యులు రాయ్ అభిప్రాయంతో ఏకీభవించలేదు. వారు 'క్రమశిక్షణకు' లోబడిన

వారు. స్వతంత్రించి ఏ పని చేయటానికి ముందుకు రాలేరు. 'పాన్ ఇస్లామిజమ్' విప్లవ పుద్యమమని బోల్షివిక్కుల విశ్వాసం. రాయ్ యీ విషయం గురించి లెనిన్‌తో చర్చించినప్పుడు ఆయన కొంతవరకు తన విశ్వాసంలో సడలింపు కనబరచాడు. కాని మాస్కో నుంచి అధికార పూర్వకమయిన ఆదేశాలు రానందున మిగిలిన సభ్యులు రాయ్‌ని బలపరచలేక పోయారు.

తరువాత రాయ్ స్థానిక కమ్యూనిస్టు నాయకులను ఆహ్వానించి వారితో చర్చించగా తన వాదానికి కొంత అనుకూలత కనబడినది. బొఖారా, అఫ్గన్ ప్రభుత్వాల ధోరణి తెలుసుకొనే ప్రయత్నం చేయాలని తీర్మానించబడ్డది. ఇందుకు కొన్ని పద్ధతులు అవలంబించబడ్డవి. భారతీయ ముస్లిములు రష్యా వెళ్లటానికి బయలుదేరినప్పుడు మార్గమధ్యంలో టర్కో కొండజాతులు వారిని బంధించారు. వారిని విడిపించటానికి రెడ్‌ఆర్మీని పంపటానికి బొఖారా ప్రభుత్వ అనుమతిని పొందాలి. యీ సైన్యం బొఖారా రాష్ట్రం ద్వారా అఫ్గన్ సరిహద్దుల వరకు చేరవలసి వున్నది. తరువాత ఆ సైన్యాన్ని అఫ్గన్ రాజ్యం నుంచి భారత సరిహద్దులకు పంపవలసి యున్నది. కనుక ముందుగా బొఖారా, అఫ్గన్ ప్రభుత్వాల వైఖరిని పరీక్షించాలని రాయ్ నిశ్చయించుకున్నాడు. తాష్కెంటులోని అఫ్గన్ రాయబారిని యన్వర్ పాషా సమక్షంలో, భారతదేశ సరిహద్దులలో విమోచనదళ సైనిక కేంద్రాన్ని స్థాపించటానికి అఫ్గన్ ప్రభుత్వం నుంచి ఏదైనా సమాచారం అందినదేమో తెలుసుకొనటం అవసరంగా భావించాడు.

అఫ్గన్ రాయబారి, యన్వరు పాషా, ఇతర ప్రముఖులను రాయ్ విందుకు ఆహ్వానించాడు. విందు సందర్భంలో రాయ్ ప్రణాళిక చర్చకు వచ్చినది. యన్వరు పాషా అన్ని విషయాలు మాట్లాడటానికి కాబూలు వెళ్లబోవుచున్నట్లు చెప్పాడు. రాయబారి తన ప్రభుత్వంనుంచి ఆదేశాలు అందినట్లు అంగీకరించాడు. అయితే రాయ్ వెంట పంపవలసిన సైనిక ఆయుధ సామగ్రిఅంతా తన రాయబార కార్యాలయంలోనే పదిలపరచబడి అవసరమైనప్పుడు సరిహద్దు ప్రాంతాల్లో రాయ్‌కి అప్పగించబడుతుందని చెప్పాడు. ఇందులోని నిగూఢ రహస్యం రాయ్ గ్రహించక పోలేదు. "అఫ్గన్ ప్రాంతంనుంచి భారత సరిహద్దులకు బహిరంగంగా ఆయుధాలు పంపటానికి అనుమతియిస్తే అఫ్గన్-బ్రిటిషు ఇండియా ప్రభుత్వ సంబంధాలు బెడిసి పోవచ్చును. ఇది రహస్యంగా చక్కపెట్టవలసిన కార్యం" అని

రాయబారి చెప్పిన సమాధానం పైకి సబబుగానే వున్నది. కాని రాయ్ తన ఆయుధ సామగ్రిసంతను ముందుగా వారికి అప్పగించి వారి దయాదాక్షిణ్యాలకు దాసోహం అనాలి. తరువాత వారు వాటిని తిరిగి తనకు అప్పగిస్తారనే నమ్మకంకూడా లేదు. ఆయుధాలు లేకుండా భారత సరిహద్దులలో రాయ్ చేయచలిగినదేమీ వుండదు. ఆ సమయంలో రాయబారిని తరచినందువలన ప్రయోజనంలేదు. దానివలన ఆఫ్గన్ ప్రభుత్వాన్ని శంకించినట్లు కనబడవచ్చు. కనుక ప్రస్తుతానికి ఒకరినొకరు అభినందించుకొని వీడ్కోలు చెప్పటంతో ఆ విందు ముగిసినది. ఆఫ్గన్‌స్తాన్ వెళ్లి భారత సరిహద్దులలో విమోచనదళ కేంద్రాన్ని స్థాపించటం రాయ్‌కి గాలిమేడగా కనబడ సాగినది.

రాయ్ వూహించిన దానికంటె పరిస్థితులు వేగంగా మారసాగినవి. బొఖారా అమీరు తన రాజధాని నగరంనుంచి అదృశ్యుడయ్యాడు. యన్వరు పాషా కనబడటంలేదు. ఎక్కడికి వెళ్లాడో ఎవరికీ తెలియదు. ఆఫ్గన్ రాజ్యంనుంచి భారత విప్లవ వాదులను వెళ్లగొట్టుచున్నట్లు వార్తలు వచ్చినవి. ఈ విప్లవవాదులు మూడవ ఆఫ్గను యుద్ధంలో కొండజాతులను రెచ్చగొట్టటానికి వచ్చారు. అప్పటి నుంచి తిరిగి స్వదేశం చేరటానికి వీలులేక కాబూలులోనే వుండిపోయారు. అందులో కొంతమంది 1916 లో స్థాపించబడిన రాజామహేంద్ర ప్రతాప్ తాత్కాలిక ప్రభుత్వంలో చేరారు. కాబూలు ఢిల్లీతో సత్సంబంధాలు యేర్పరచుకొనాలనే తలంపుతో వారికి గడువుపెట్టి ఆ గడువులో తమ దేశం విడిచి బయటకు వెళ్లాలని ఆదేశించినది.

ఈ మార్పులు విప్లవ ప్రతిఘటన శక్తుల విజృంభణకు నాందిగా కనబడవి. దీనిని ప్రతిగా రెడ్ ఆర్మీ బొఖారా ప్రవేశించి విప్లవ ప్రభుత్వాన్ని స్థాపించినది. ఆ ప్రభుత్వ అధినేత అమీర్, యన్వర్ పాషాలు అజ్ఞాతవాసులై కొండ ప్రాంతమయిన ఫర్గనా చేరి బ్రిటిషు అధికారులతో లాలూచిపడి వారి సహాయంతో విప్లవ వ్యతిరేక ప్రభుత్వాన్ని స్థాపించటానికి పూనుకున్నట్లు. ఇందులో కాబూలుకు కూడా పాత్ర వున్నట్లు విశదమైనది.

బొఖారా పడమటి ప్రాంతమంతా తేలికగా ఎర్రసైన్యం అధీనంలోనికి వచ్చినది. ఫర్గనా ప్రాంతం వశపరచుకొనటంలో కొంత సైనిక చర్య అవసరమయినది. ఈ ప్రాంతం ఆఫ్గన్ సరిహద్దులలో దాదాపు రెండువందల మైళ్లవరకు

వ్యాపించివున్నది. ఎర్రసైన్యం రెండు భాగాలుగా ఒకటి తూర్పు, రెండవది దక్షి ణంగా విజృంభించి కొండజాతుల ఎదురు దాడులను భగ్నంచేసి, 'ప్రపంచకప్పు' అయిన పామీరు మైదానంలో ఎర్ర పతాకాన్ని ఎగురవేసినది. ఈ సైనిక చర్యలో రాయ్ కూడా వున్నాడు. 'ప్రపంచకప్పు' మీద నిలబడి సుమార ప్రదేశాన్ని చూడగల 'బైనాక్యులర్సు'తో ఆశాజనకంగా వాయువ్య సరిహద్దులనుండి భారతదేశం వంక ఒకసారి తేరిపారచూచాడు.

యుద్ధరంగంలో యన్వర్ పాషా శవం కనుగొనబడినది. బ్రిటిషు సైని కాధికారి దుస్తులు ధరించివున్నాడు. ఆయన అనుచరుడు జమాల్ పాషా అదివరకే ఒక ఆర్మీనియను యువకునిచే హత్య కావించబడ్డాడు.

# బొఖారాలో విప్లవ ప్రభుత్వం :

బొఖారా జారిస్టు సామ్రాజ్యంలో ఒక అంతర్భాగంగా వుండేది. విప్లవా నంతరం ఆ రాష్ట్రానికి స్వతంత్ర ప్రతిపత్తి యివ్వబడినది. ఇందుకు మధ్యఆసియా లోని ముస్లిము రాజ్యాలు హర్షం ప్రకటించి సోవియట్ రష్యామీద ఆదరాభిమానాలు చూపసాగినవి. బొఖారాలో విప్లవ ప్రతిఘటన శక్తులు పుంజుకొంటున్నా వాటిని అరికట్టి రిపబ్లిక్కు ప్రభుత్వాన్ని నెలకొల్పటానికి రష్యనులు ముందుకు రాకపోవ టానికి ప్రధాన కారణం దానివలన ముస్లిము రాజ్యాలలో రష్యా వ్యతిరేకభావం పెరుగుతుందనే భయ, సందేహాలు వారికి వున్నవి.

సామాజికంగా బొఖారా బాగా వెనుకబడిన దేశం. పారిశ్రామిక అభివృద్ధి బొత్తిగాలేదు. కనుక శ్రామికవర్గం అసలేలేదు. కర్షకులు కూడా ఆర్థికంగా చాల వెనుకబడిన స్థితిలో వున్నారు. వీటికితోడు మూఢ విశ్వాసాలు, మత ప్రాబల్యం హెచ్చుగా వున్నవి. బొఖారా, మరికొన్ని నగరాలు వినా అక్కడ చెప్పుకోదగిన వాణిజ్యంగాని, వ్యాపార వర్గంగాని లేదు. ఇట్టి పరిస్థితులలో అక్కడ విప్లవ బీజాలు నాటాలంటే యీ కొలది మంది వర్తకుల నుంచే ఎన్నుకొని వారికి తగిన రాజకీయ పరిజ్ఞానం కలిగించవలసి వున్నది.

బ్రిటను, ఆఫ్గను ప్రభుత్వాల సహకారం, కుతంత్రాలతో మధ్య ఆసియాలోని విప్లవ వ్యతిరేకశక్తులు కేంద్రీకరింపబడసాగినవి. అంతర్గత వ్యవహా

రాల్లో జోక్యం చేసుకుంటే ముస్లిము రాజ్యాలు తమకు దూరం కావచ్చుననే సందేహంతో రష్యను కమ్యూనిస్టుపార్టీ ముందుకు రావటానికి వెనుకాడుచున్నది. కాని పరిస్థితులు యిలా సాగనిస్తే మధ్య ఆసియా మొత్తం విప్లవ వ్యతిరేక ప్రభావానికి గురి కావచ్చును. విప్లవ వ్యతిరేకశక్తులు విజయం పొందగలిగితే జమీందారులూ, మత ప్రవక్తలూ పలుకుబడిలో వుంటారు. సామాన్య ప్రజానీకం దోపిడీకి గురికాక తప్పదు. ఈ విషయాలన్నీ రాయ్ కమ్యూనిస్టుపార్టీ దృష్టికి తీసుకొనివచ్చాడు. బొఖారాను వశపరచుకొని రిపబ్లిక్ ప్రభుత్వం స్థాపించటంలో అచ్చటి ప్రజలు పొందే ప్రయోజనాలను గురించి మిగిలిన ముస్లిము రాజ్యాల ప్రజలకు వివరంగా చెప్పాలని, బొఖారా అమీరును తొలగించటం అచ్చటి ప్రజల మేలుకొరకేనని ముస్లిము రాజ్యాలకు స్పష్టం చేయాలని చెప్పాడు. అదేకాలంలో బొఖారానుంచి అమీర్ తన పరివారంతో, రహస్యంగా రాజధాని నగరం విడిచి వెళ్లాడు. అమీరును, ఆయన సిబ్బందిని వెదకి బంధించటం తేలిక. కాని దానివలన ముస్లిము ప్రజలలో వ్యతిరేకత పెరుగటంవినా వేరే ప్రయోజనంలేదు. అమీరు ముస్లిము ప్రవక్తగా పలుకుబడిలో వున్నాడు. కనుక ఆ పని చేయటం మంచిదిగా భావించబడలేదు.

కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ టర్కీ బ్యూరో ఆధ్వర్యంలో తాష్కెంటులో బొఖారా విప్లవ సమితి స్థాపించబడినది. బొఖారాలో పబ్లికు ప్రభుత్వ మేర్పడితే కర్షకులు, వర్తకులు, సామాన్య ప్రజానీకం పొందగల ప్రయోజనాలు, హక్కులను గురించి యీ విప్లవసమితి విరివిగా ప్రచారంచేసినది. మధ్య ఆసియాలో వున్న ప్రభుత్వాన్ని బ్రిటను, ఆఫ్గన్ ప్రభుత్వాలు కుట్రచేసి కూలద్రోస్తే తిరిగి జమీందారులు అధికారం చేపట్టి కర్షకులకు పంచిపెట్టిన భూమిని తిరిగి వశపరచుకొనగలరనే హెచ్చరికచేసి యిందులో ఏది కావాలో తేల్చుకొనమని ప్రజలను కోరటం జరిగినది. ఫ్రెంచి విప్లవ అనుభవాల ఆధారంతో రాయ్, మిగిలిన కమ్యూనిస్టు నాయకులు 'విప్లవసమితి' ద్వారా మత ప్రవక్తలు, జమీందారుల నుంచి మిగిలిన వర్గాలను విడగొట్టి సమీకరించటానికి ప్రయత్నించారు. ఈ సమయంలో రాయ్ కురాన్, ఇతర మత గ్రంథాలను క్షుణ్ణంగా అభ్యసించి ఇస్లాము మత వ్యతిరేక ప్రచారం జరుగకుండా మత సూత్రాల కనుకూలంగా విప్లవ సంస్కరణలు చేయటానికి కార్యక్రమం రూపొందించాడు.

బొఖారా అమీరు తన అనుచరవర్గంతో అంతర్ధానం కావటంతో ప్రభుత్వ యంత్రాంగం కూడా స్తంభించిపోయినది. పరిస్థితు లలా కొనసాగనివ్వటం

మంచిదికాదని రాయ్ భావించాడు. వెంటనే టర్కిస్తాన్ రిపబ్లిక్ ప్రభుత్వం కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ టర్కీ బ్యూరో జాయంటు సమావేశం యేర్పరచి బొఖారా విప్లవ సమితి బొఖారా వెళ్లి అచ్చటి ప్రజాప్రతినిధులతో సంప్రదించి నూతన ప్రభుత్వాన్ని స్థాపించాలనే తీర్మానం ఆమోదింపచేసాడు. రాయ్ ఆ విప్లవ సమితి వెంట బొఖారా వెళ్లి నూతన ప్రభుత్వ సలహాదారునిగా కొంతకాల వుండాలని, ప్రతిఘటనను ఎదుర్కొని శాంతిని నెలకొల్పటానికి కొంత సైన్యంకూడా వెళ్లాలని తీర్మానాలు జరిగినవి.

సైన్యం వెంటరా విప్లవసమితి సభ్యులతో రాయ్ బొఖారా ప్రవేశించాడు. విప్లవ సమితి ద్వారా 'ప్రజా ప్రభుత్వ స్థాపనకు ప్రతినిధుల సమావేశం జరుగుతుంది. కనుక ప్రజలు తమ ప్రతినిధులను పంపాలని' అన్ని ప్రాంతాలలో ప్రకటనలు చేయిబడ్డవి. వివిధ సంఘాలకు ఆహ్వానాలు అందజేయబడ్డవి. ప్రతినిధుల సమావేశం జరిపి తాత్కాలిక ప్రభుత్వం నెలకొల్పబడినది. 'జమీందారుల భూములను ప్రభుత్వం వశపరచుకొని రైతులకు పంచిపెట్టుతుంది. అమీర్ స్వంత ఆస్తులను స్వాధీనం చేసికొని జాతీయ ఆస్తిగా పరిగణించుతుంది' అని తాత్కాలిక ప్రభుత్వం ప్రకటించినది.

ప్రతినిధుల సమావేశంలో జరిగిన ఒక ప్రత్యేక సంఘటన ఇచ్చట ఉదహరించటం అవసరం. కొంతమంది మతప్రచారకులు కూడా ప్రతినిధులుగా సమావేశంలో పాల్గొన్నారు. సమావేశంలో వారినుంచి వ్యతిరేకత కనబడలేదు. అయితే 'బోల్షివిక్కులు నాస్తికులని, తమ మతం సర్వనాశనం చేయబడుతుందని' గుసగుసలు బయలుదేరినవి. వారి అనుమానాలకు నివృత్తిచేసి నూతన ప్రభుత్వాన్ని ఏకగ్రీవంగా ఎన్నుకొనవలసిన అవసరం కనబడినది. విప్లవ సమితి అధ్యక్షులు ఫజుల్లా ఖాజీల్ అల్లామీద ప్రమాణంచేసి 'అలాంటి భయ, ఆందోళనకు ఆస్కారం లేదు. ప్రజల న్యాయమైన హక్కులకొరకు ప్రభుత్వం కృషి చేస్తుందని, ఇందులో రష్యా జోక్యం ఏమాత్ర ముండదని" బాహాటంగా ప్రకటించిన మీదట హర్షధ్వానాలతో ఏకగ్రీవంగా నూతన ప్రభుత్వ ఎన్నిక జరిగిపోయినది.

యాదృచ్ఛికంగా అదే సమయంలో ప్రక్కనున్న మసీదులో ప్రార్థనలు జరుగబోవుచున్నవి. ఇమామ్‌వచ్చి సమావేశంలోని ప్రతినిధులను ఆహ్వానించటంతో మళ్లీ గుసగుసలు సాగినవి. నూతన ప్రభుత్వ ఆదర్శం ప్రకారం ప్రార్థనలకు వెళ్ల

వచ్చునా, లేదా అనే మీమాంస బయలుదేరినది. రాయ్ యీ పరిస్థితులను గమనించి ఒకటి రెండు మాటలు చెప్పాలనే తలంపుతో అధ్యక్షుని అనుమతి కోరాడు. అధ్యక్షుడు ఫజుల్లా రాయ్‌ని ప్రతినిధులకు పరిచయంచేస్తూ 'భారత మిత్రుడు, యీ సమావేశానికి కారణభూతుడు' అయిన రాయ్ వుపన్యసించబోతున్నాడనగానే ప్రతినిధులు పెద్దపెట్టున హర్షధ్వానాలతో రాయ్‌ని అభినందించారు.

రాయ్ వేదిక ముందుకు వచ్చి తాను వుపన్యాసం చేయటంలేదని, కేవలం ఒక మాట చెప్పటానికే వచ్చానని సభ్యులనుద్దేశించి "ఈ సమావేశ ఆదర్శం కేవలం బీదలను రక్షించి వారి హక్కులను కాపాడటం. కనుక మతంతో ఏ విధమయిన భేదాభిప్రాయాలు లేవు. సభ కొంతసేపు నిలుపు చేయబడుతుంది. మీరందరూ ప్రార్థనలకు వెళ్ళిరావచ్చు .... నేను ముసల్మానును కాను. కనుక నన్ను ప్రార్థనకు రమ్మని బలవంతం చేయకండి" అని చెప్పగానే వారందరూ ప్రభుత్వం మీద సంతృప్తి ప్రకటించి ప్రార్థనలకు వెళ్ళారు.

విప్లవ ప్రభుత్వం మీద ప్రజలకు విశ్వాసం కలిగినది. ఫజుల్లా ప్రభుత్వానికి అధ్యక్షునిగా ఎన్నుకొనబడ్డాడు. ప్రత్యేకించి ఒక 'ప్రజాసమితి'ని ఎన్నుకొని ప్రజాసమితికి ప్రభుత్వం బాధ్యత వహించాలని తీర్మానం అంగీకరించ బడ్డది.

రిపబ్లికన్ ప్రభుత్వ స్థాపన శాంతియుతంగా జరిగినది. కర్షకులు, వర్తకులు తమ తమ వ్యవసాయ, వర్తక పనులు మామూలుగా జరుపుకొన సాగారు. కాని అమీరు అంతఃపురాన్ని చక్క పెట్టటం, సంస్కరించటం ఒక సమస్యగా పరిణమించినది. ఇస్లాము ఆచార ప్రకారం ఒక పురుషుడు నలుగురు స్త్రీలతో జీవిత సంబంధం పెట్టుకొనవచ్చును. అమీరు నాలుగు వందల స్త్రీలను అంతఃపురంలో వుంచి విలాసాలకు, వినోదాలకు, వారి జీవనభృతికి ప్రజాధనాన్ని విపరీతంగా వెచ్చించటం జరిగినది. వారిని విముక్తి చేసి తమ యిచ్చవచ్చిన చోటుకు వెళ్ళవచ్చునని ఆదేశాలు పంపినా జైలు వంటి తమ గృహాలనుంచి వారు బయటకు రావటానికి అంగీకరించలేదు. వారు అనుభవించే విలాసాల దాస్య వృత్తిని వారు స్వర్గతుల్యంగా భావించారు.

రాయ్ సలహా ననుసరించి రిపబ్లికన్ ప్రభుత్వం "మీరందరూ స్వతంత్రులు, బయట ప్రపంచానికి వచ్చి సంఘంలో చేరవచ్చును. మళ్లీ వివాహాలు జరుపుకొనవచ్చును. సైనికులు వీరితో వివాహ సంబంధాలు జరుపుకుంటే జీవన

భృతికి కొంత ధనసహాయం, భూమికూడా యివ్వబడుతుందని' ప్రకటించినది. అప్పటికీ వారు అంతఃపురంనుంచి బయటకు రాలేదు.

చివరకు సైనికులకు అంతఃపుర ప్రవేశం కలిగించి బలవంతంగాకాక యిష్టపూరితంగా యిష్టపడిన వనితలను పెండ్లి చేసుకొనవచ్చునని ఆదేశించ బడినది. యువకులయిన సైనికులను చూచి తమ జీవితం ఆనందదాయకం కాగలదనే విశ్వాసంతో ఆ అంతఃపుర స్త్రీ లందరూ బయటకు వచ్చారు. ఆ సైనికులలో కొందరు రషియన్లు కూడా వున్నారు.

రాయ్‌కి అమీరు ప్రసాదం చూడాలనే కుతూహలం కలిగినది. కొంత మంది అనుచరులతో ప్రసాదం ప్రవేశించాడు. బయటకు కనబడినంత సుందరంగా లోపలలేదు. అంతఃపుర స్త్రీలు నివసించే గదులు గుహలుగావున్నవి, ప్రవేశద్వారం వినా వేరే కిటికీలు కూడా లేవు. అయితే ఆ గదులుమాత్రం అమూల్యమయిన తివాచీలు పరచబడి అనేకమయిన విలాస వస్తువులతో నిండియున్నవి. గోడల వంకెలు వెలలేని రంగురంగుల, రకరకాల సిల్కు వస్త్రాలతో నింపబడ్డవి. అందులో ఒకటి ఇంద్రధనుస్సులాగా అన్ని రంగులతో జరీతో నేయబడిన సిల్కు వస్త్రం రాయ్‌ని ఆకర్షించినది. ఇది గ్రహించిన ఫజుల్లా ఆ వస్త్రాన్ని తీసి రాయ్ వంటిమీద కప్పుతూ "మా రిపబ్లిక్ ప్రభుత్వం మీ సేవను గుర్తించి మీకిది బహుమతిగా యిస్తున్నది. స్వీకరించండి" అని రాయ్‌ని అభ్యర్థించాడు.

ప్రసాదం బయట అనేక వేలమంది గుమిగూడి వున్నారు. అంతఃపుర వనితలు వరుసగా తమ యిచ్చవచ్చిన సైనికుని వెంట కలసి బయటకు రావటం వారు వినోదంగా చూడసాగారు. అదే విధంగా ప్రభుత్వ సభ్యులు, వారి సలహాదారుడయిన రాయ్ కూడా సుందర వనితతో బయటకు రాగలరని వారు ఆశించారు. కాని వారికి అంతకంటే ఫజుల్లా వెంట రాయ్ సిల్కు వస్త్రాన్ని ఒంటినిండా కప్పుకొని బయటకు రావటం వినోద దాయకంగా కనబడినది. ఫజుల్లా ప్రజల సమ్మతిని కూడా పొందాలని కాబోలు ఆ జన సమూహాన్ని ఉద్దేశించి "మనలను దాస్యం నుంచి విముక్తి చేసి రిపబ్లిక్ ప్రభుత్వ స్థాపనకు అన్ని విధాల తోడ్పడిన భారత కామ్రేడ్‌కు మీ అనుమతితో యీ బహుమానం సమర్పించ బడుతుందని" చెప్పాడు.

అందుకు సమాధానంగా రాయ్ "నేను యీ బహుమానాన్ని రాజులు ధరించే అమూల్య వస్త్రంగా స్వీకరించటం లేదు. మీ ఆదరాభిమానాలకు చిహ్నంగా మాత్రమే స్వీకరిస్తున్నా'నని చెప్పాడు.

# సైనిక పాఠశాల:

ఖిలాఫత్ వుద్యమ సందర్భంలో భారతదేశం నుంచి అనేక వేలమంది మహమ్మదీయ యువకులు, విద్యావంతులు టర్కీ దేశం బయలుదేరినట్లు లోగడ చెప్పబడినది. వీరు ఆఫ్గనిస్తాన్, పర్షియన్ దేశాలనుంచి ప్రయాణం చేయవలసి వున్నది. ఈ 'స్వాతంత్ర్య యోధులకు' సహాయం చేస్తానని, తమ దేశంతో వుంచే భూములు కూడా యిస్తానని ఆఫ్గన్ ప్రభుత్వం ప్రకటించినది. అదే విధంగా రష్యను కమ్యూనిస్టు పార్టీ కూడా 'ఆసియా వాసులు మాకు మిత్రులు, వారికి తగిన సహాయం మేము చేయగలము' అని ప్రకటించినది. ఖిలాఫత్ వుద్యమం అంతరించటం వలన, ప్రయాణ బాధలకు గురి అయిన భారత ముస్లిములు కొందరు అవకాశం వున్న చోట స్థిరపడటానికి నిశ్చయించుకున్నారు. కమ్యూనిస్టు పార్టీ వాగ్దానాన్ని పురస్కరించుకొని కొంతమంది వివరాలు, యదార్థ విషయాలు తెలుసుకొనటానికి కాబూలులోని రష్యను రాయబార కార్యాలయాన్ని సందర్శించారు. అది ఆఫ్గన్ ప్రభుత్వానికి కోపకారణమయి తన వాగ్దానానికి భిన్నంగా వారిని బంధించి నిర్బంధ శిబిరాలకు పంప సాగినది. కొంతమంది ఎదురుతిరిగి, మరి కొంతమంధి తప్పించుకొని బొఖారా ప్రవేశించి నేరుగా రష్యా వెళ్ళటానికి ప్రయత్నించారు. కాని వారి దురదృష్టం వలన బొఖారా కొండ జాతులు వారిని బంధించి, తిండి పెట్టక చలిలో బహిర్ప్రదేశంలో వుంచటంచేత వారు అనేక అవస్థలకు గురికావలసి వచ్చినది.

రాయ్ బొఖారాలో వున్నప్పుడు ఈ సంఘటనలు తెలుసుకొని రష్యను కమాండరుతో మాట్లాడి కొంతమంది సైనికులను పంపి కొండజాతుల నుంచి వారిని విడిపించి బొఖారా చేర్పించాడు. ఈ ముఠాలో డెబ్బైమంది వున్నారు. బాధలకు గురి కావటంచేత మరణావస్థలో వున్న వారికి అన్ని సదుపాయాలు కల్పించాడు. టర్కీలో ఖిలాఫత్ వుద్యమం అంతరించినా మతోన్మాదంతో వారు టర్కీ వెళ్ళాలని పట్టుబట్టారు. రాయ్ వారిని సమాధాన పరచటానికి విశ్వ ప్రయత్నం చేయవలసి వచ్చినది.

"టర్కీలో కెమాల్ పాషాకు తగినంత సైన్యం వున్నది. మీరు వెళ్ళి అక్కడ చేయగలిగిన దేమీ లేదు. మీకు సైనిక శిక్షణ, రాజకీయ శిక్షణ యివ్వబడు

తుంది. బ్రిటిషు ప్రభుత్వం మీద తిరుగుబాటు చేసి మాతృదేశ విముక్తికి నడుము కట్టండి'' అని బోధించాడు.

ఆ వర్గంలోని ఏభై మంది రాయ్ అభిప్రాయంతో యేకీభవించారు. మిగిలినవారు టర్కీ వెళ్ళటానికి ఏర్పాట్లుచేసి ఏబై మందిని రాయ్ తనవెంట తాష్కెంటు తీసుకొని వెళ్లాడు. ఇందులో ఒక హిందువు కూడా వుండటం రాయ్‌కి ఆశ్చర్యం కలిగినది. అతని రాకను గురించి రాయ్ గ్రుచ్చిగ్రుచ్చి అడిగినా తగిన సమాధానం చెప్పలేదు. ఎన్నిసార్లు అడిగినా ఒకే ఒక సమాధానం "నేను ఒక ప్రత్యేక కార్యక్రమంమీద వచ్చాను. మాస్కో వెళ్లి లెనిన్‌ను కలుసుకొనాలి" అని అంటూ వుండేవాడు. చివరకు అతనిని రాయ్ మాస్కో పంపాడు.

తాష్కెంటులో రాయ్ ఒక సైనిక పాఠశాలను స్థాపించాడు. మాస్కో నుంచి తనవెంట తీసుకొనివచ్చిన సైనికాధికారులు, అమెరికా జాతీయుడు జాన్ కూడా అధ్యాపకులుగా వుండి అనేకమందికి సైనిక శిక్షణ నిచ్చారు. రాయ్ కొంత మంది కమ్యూనిస్టులతో కలిసి వారిలో తగిన రాజకీయ పరిజ్ఞానం, విప్లవభావాలు కలిగించాడు. దీని ఫలితంగా కొంతమందికి కమ్యూనిస్టు సిద్ధాంతాల్లో విశ్వాసం కలిగినది. తరువాత వారి కోరిక ననుసరించియే భారత కమ్యూనిస్టుపార్టీ పేరుతో తాష్కెంటులో ఒక తాత్కాలిక కమ్యూనిస్టుపార్టీని స్థాపించాడు.

మాస్కో పంపబడిన హిందూ యువకుడు లెనిన్‌ని కలుసుకొనలేదు. రాయ్ మాస్కో వెళ్లినప్పుడు అతనిని కలుసుకొనటం జరిగినది. 'అతని రాక యదార్థాన్ని చెప్పితే లెనిన్‌తో సమావేశం యేర్పాటు చేయగలనని" రాయ్ చెప్పినప్పుడు "భారతదేశంలోని కొంతమంది నాయకులు సాయుధ తిరుగుబాటుకు ఆయుధ సహాయంకొరకు లెనిన్ దగ్గరకు పంపినట్లుగా" చెప్పగా రాయ్ విశ్వసించలేదు. ఆతడు చెప్పిన నాయకులు సాయుధ తిరుగుబాటుకు వ్యతిరేకులు. కనుక లెనిన్‌తో ఆ యువకుని సమావేశానికి రాయ్ సహాయపడలేదు. చివరకు ఆతడు మతి భ్రమించి రైలుక్రిందబడి ఆత్మహత్య చేసుకున్నాడు.

భారత సైనిక పాఠశాల ప్రారంభోత్సవానికి టర్కిస్తాన్ ప్రభుత్వ అధికారులు, రష్యను కమ్యూనిస్టు నాయకులు కూడా పాల్గొనటంతో దానికి ఒక ప్రత్యేకత వున్నట్లుగా అందరూ భావించారు. సైనిక శిక్షణను రహస్యంగా జరిపి భారత విప్లవకారులను, విమోచన సైన్యాన్ని సంఘటిత పరచటం రాయ్ అభిమతం.

కాని కొన్ని కారణాలవలన, కొందరి సలహా ననుసరించి రాయ్ యీ పాఠశాలకు బహిరంగ ప్రచారనిమిత్తం ప్రముఖులను ఆహ్వానించి ప్రారంభోత్సవం చేయటం జరిగినది. ప్రారంభంలో యీ పాఠశాల కొంతవరకు సత్ఫలితాలను చేకూర్చినా ఎక్కువకాలం కొనసాగటానికి వీలులేక మూసివేయవలసి వచ్చినది.

ఈ కాలంలో రష్యా, ఇంగ్లండు దేశాల మధ్య వాణిజ్య సంబంధాలు నెలకొల్పుకొనటానికి ప్రయత్నాలు జరుగుచున్నవి. ఆదర్శాలు వేరయినా ఉభయ దేశాలకు లాభదాయకం కావటంచేత ఉభయ ప్రభుత్వాలు వాణిజ్య ఒప్పందాలు కుదుర్చుకొనాలనే సంకల్పంలో వున్నవి. ఇంగ్లండు ప్రభుత్వ విదేశాంగ సెక్రెటరీ లార్డు కర్జన్‌కే మిలిటరీ పాఠశాల సింహస్వప్నంగా కనబడినది. ఆయన భారత దేశంలో వైస్‌రాయ్ వున్నప్పటినుంచీ మధ్య ఆసియాలో (అప్పుడు జారు సామ్రాజ్యం క్రింద వున్నది) రష్యనుల పలుకుబడిని అరికట్టాలనే తలంపులో వున్నాడు. విప్లవానంతరం ముస్లిము రాజ్యాలు స్వతంత్ర ప్రతిపత్తిని కలిగి బోల్షివిక్కుల సానుభూతిని పొందటం ఆయనకు తలనొప్పి కలిగించినది. "భారత సైనిక పాఠశాలను స్థాపించి ఇంగ్లండు మీద యుద్ధానికి సన్నద్ధమవుచున్న రష్యాతో వాణిజ్య ఒప్పందం కుదుర్చుకొనే అవకాశం లేదు" అని లార్డు కర్జను అసమ్మతి పత్రాన్ని పంపాడు. రష్యా ప్రభుత్వం వాణిజ్య వొప్పందం జరగటం అవసరంగా భావించి సైనిక పాఠశాలను మూసివేయించినది.

కొద్దికాలం పనిచేసినా యీ సైనిక పాఠశాలలో అనేకమంది యువకులకు సైనిక శిక్షణ యివ్వబడినది. వూహించిన దానికంటె విశేష ప్రజ్ఞను చూపి చాలమంది, రష్యను సైనికాధికారుల మన్ననలు పొందగలిగారు. కొంతమంది వైమానిక శిక్షణ కూడా పొంది తరువాత రష్యను వైమానికదళంలో నాయకులుగా కీర్తి, ప్రతిష్టలు పొందగలిగారు. సైనిక శిక్షణ జరుగుచున్న కాలంలో ఒకనాడు ఒక వ్యక్తి రాయ్ దగ్గరకు ఏకాంతంగావచ్చి 'భారత సరిహద్దుల నుంచి ఒక పఠాను వచ్చి మిమ్మల్ని కలుసుకొనాలనే తలంపులో వున్నాడని,' 'ఇండియా భవనం'లో వున్నాడని చెప్పగా రాయ్‌కి ఆశ్చర్యం కలిగినది. 'ఇండియా భవనం' భారత యువకుల వసతిభవనం. రాయ్ అనుమతి లేకుండా, రాయ్‌కు తెలియకుండా అందులో ఎవరూ ప్రవేశించరాదు. రాయ్ ఆ వ్యక్తిని తన బంగళాకు ఆహ్వానించకుండా సరాసరి 'ఇండియా భవనం' వెళ్లి కలుసుకున్నాడు.

"నేనొక విప్లవవాదిని. సరిహద్దు కొండ జాతులతో బాగా సంబంధ మున్నది. సాయుధ తిరుగుబాటుకు ఆయుధాలు, ధన సహాయం కావాలి" అని ఆ పఠాను రాయ్‌ని అడిగాడు. రాయ్ ఆ వ్యక్తి నిజాయితీని కనుగొనటానికి అనేక విధాల ప్రయత్నించాడు.

ఆ కాలంలో భారత తాత్కాలిక ప్రభుత్వానికి ఒబేదుల్లా అనే మత ప్రచారకుడు అధ్యక్షునిగా వున్నాడు. ఒబేదుల్లాను గురించి, ఆయన ప్రభుత్వ అనుచరుల గురించి రాయ్ ప్రశ్నించాడు. ఆ పఠాను నుంచి సరియైన సమాధానం రాలేదు. "ఆయుధ సామగ్రిని భారత సరిహద్దులకు ఎలా చేరవేయటం? ఆఫ్గను ప్రభుత్వం తన దేశం నుంచి వెళ్ళటానికి అనుమతి నివ్వటానికి వెనుకాడుచున్నది" అని రాయ్ ప్రశ్నించినప్పుడు "ఆఫ్గను రాయబారి ద్వారా నేనీ కార్యం సాధించగలను. ఆఫ్గన్ వర్తకుల ద్వారా సరిహద్దు కొండ జాతులకు ధన సహాయం అందేటట్లు చేయగలను" అని ఆ పఠాను చెప్పటం రాయ్‌కి నమ్మదగినదిగా కనబడక తరువాత తిరిగి కలుసుకుందామని చెప్పి తన బంగళాకు వచ్చాడు.

రష్యను గూఢచారి దళాధిపతి పీటరు తాష్కెంటులో వున్నాడు. ఆయనతో రాయ్ పఠాను ఆగమనం, చర్యల గురించి చర్చించాడు. మరునాడే పీటరు రాయ్‌తో "ఆ పఠాను మౌలానా పేరుగల బ్రిటిషు గూఢచారి. ఆతని చర్యలను గమనించటానికి కొంతమంది గూఢచారులను నియమించినట్లు''గా చెప్పాడు. అదే సమయంలో ఒబేదుల్లా ప్రభుత్వంలోని యిద్దరు కమ్యూనిస్టులను ఆఫ్గను ప్రభుత్వం బహిష్కరించటంతో వారు తాష్కెంటు వచ్చారు. రాయ్ వారి ద్వారా మౌలానా విషయం ప్రశ్నించినప్పుడు వారు తమకు తెలియదని చెప్పారు. పఠాను తన రహస్యం బయట పడినట్లుగా భావించి 'ఇండియా భవనం' నుంచి మకాము ఎత్తివేసి బయట వొక మిత్రుని యింటికి చేరాడు. ఆతడు తరచుగా బయట తిరుగుతూ, భారత వర్తకులతో కలసి మెలసి వుండటం చూచి ఒకనాడు రషియన్ గూఢచారులు ఆతనిని పట్టుకొని సోదాచేసారు. ఆతని దగ్గర భారత కరెన్సీ, అనుమాన పత్రాలు దొరికినవి. వెంటనే బంధించారు. 'ఇండియా భవనం'లో కూడా కొంతమందిని సోదా చేయగా వారి దగ్గర కూడా మౌలానా యిచ్చిన కరెన్సీ దొరికినది.

''మౌలానాకు మరణదండన విధించబడ్డది. అది పూర్తి చేసే బాధ్యత సివిలు అధికారులకు అప్పగించబడినది'' అని పీటరు రాయ్‌కి వర్తమానం పంపాడు.

ప్రచారక రైలుబండిలో విప్లవ సందేశాలను మధ్య ఆసియాకు తీసుకొని వచ్చిన మాల్టావ్ టర్కీస్తాన్ కమీషన్ కార్యదర్శిగా వున్నాడు. ఈ బాధ్యత ఆయనకు అప్పగించ బడినది. ఇది రహస్యంగా జరుగవలసి వున్నది. మాల్టావ్ మరణశిక్షను వెంటనే అమలులో పెట్టలేదు. రాయ్‌కి ఫిర్యాదులు వచ్చినవి.

''మాల్టావ్‌ను పిలిచి కారణ మడుగగా 'ఇండియన్ కామ్రేడ్‌కు మరణ దండన విధించటం యుక్తమా' అని ఆలోచిస్తున్నానని'' సమాధానం చెప్పాడు.

"అతడు కామ్రేడ్ కాదు. పైగా శత్రువుల ఏజంటు, గూఢచారి. విప్లవ న్యాయ్య సూత్రాల ప్రకారం అతడు శిక్షను అనుభవించి తీరాలి'' అని రాయ్ మాల్టావ్‌ను ఆదేశించాడు. మరునాడే ఎవరికి తెలియకుండా రహస్యంగా మౌలానా ఉరికంబం ఎక్కించ బడ్డాడు.

మౌలానా కృషి ఫలితంగా 'ఇండియా భవనం'లో మరికొందరు విద్రోహ చర్యలకు పూనుకొనుచున్నట్లు సమాచారం అందినదని, వారిని కూడా బంధించబోతున్నట్లు పీటరు రాయ్‌కి తెలియజేసాడు. కాని ఇంతటితో యీ ఘట్టాన్ని ముగించటం మంచిదని రాయ్ చెప్పగా పీటరు తరువాత ఎవరినీ బంధించలేదు.

# బెర్లిన్ విప్లవ సమితి :

రాయ్ తిరిగి మాస్కో ప్రమాణ సన్నద్ధంలో వున్నాడు. అనుకోకుండా అబానీ ముఖర్జీ తాష్కెంటు రావటం రాయ్‌కి ఆశ్చర్యం, అనుమానం కూడా కలుగ చేసినవి. తాను వస్తున్నట్లుగా ముఖర్జీ ముందుగా కబురు కూడా చేయలేదు. బకు కాంగ్రెసు తరువాత పశ్చిమ ఐరోపా దేశాలకు వెళ్లి హాలండులో ఒక కార్యస్థానం యేర్పరచి భారత నావికులద్వారా విప్లవకారులతో సంబంధాలు పెట్టుకొనటానికి ప్రయత్నించమని రాయ్ ముఖర్జీని తాష్కెంటు బయలు దేరేముందు ఆదేశించి వచ్చాడు. కొద్దికాలంలో మాస్కోలో కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ మూడవ కాంగ్రెసు మహాసభలు జరుగబోవుచున్నవి. ఇట్టి పరిస్థితుల్లో ముఖర్జీ మాస్కో విడచి తాష్కెంటు రావటం రాయ్‌కి మరీ అనుమానాస్పదంగా కనబడినది. ముఖర్జీ సమాధానం రాయ్‌ని తృప్తిపరచలేదు.

సైనిక పాఠశాల బాధ్యతను అప్పగించి కార్య నిమగ్నుని చేయటం మంచిదని రాయ్ భావించాడు. అందుకు ముఖర్జీ వెంటనే అంగీకరించాడు. అబానీ ఆగమనం పీటరుకు తలనొప్పి కలిగించినది. గత చరిత్రనుబట్టి ముఖర్జీమీద పీటరు కున్న వ్యతిరేకభావం ఆయనలో ఇంకా తగ్గలేదు. రాయ్ జోక్యం చేసుకొనక పోయినట్లయితే చాలకాలం క్రిందటే పీటరు కబంధహస్తాలలో ముఖర్జీ నామరూపాలు లేకుండా నలిగిపోయి వుండేవాడు. ఇందుకు లెనిన్ కూడా కొంత సహాయపడ్డాడు. వ్యక్తిగతంగా అతని విప్లవచరిత్ర తెలియకపోయినా అబానీ మంచి కార్యకర్త అనే భావం, భారత కమ్యూనిస్టుపార్టీ అభివృద్ధికి అతడు అవిరళ కృషి సాగించగలడు అనే విశ్వాసం రాయ్‌కి కలుగుటచే ముఖర్జీని గురించి తిరిగి పీటరు ప్రశ్నించినప్పుడు "ఫరవాలేదు. నమ్మకంగా పనిచేస్తాడు" అని చెప్పటంతో పీటరు ఇక తనకు సంబంధంలేనట్టుగా ముఖర్జీ విషయం ఎత్తలేదు. రాయ్ మాస్కో వెళ్ళిన తరువాతనే అబానీ ముఖర్జీ కాంగ్రెసు మహాసభను విడచి తాష్కెంటు ఎందుకు వచ్చాడో యదార్థం తెలుసుకొనగలిగాడు.

రాయ్ మాస్కో చేరేటప్పటికి కొంతమంది బెర్లిను ఇండియన్ విప్లవ సమితి సభ్యులు మాస్కో వచ్చారు. అమెరికాలో లాలాలజపతిరాయ్‌కి కార్యదర్శిగా వున్న అన్నీస్ స్మెడ్‌లీ కూడా ఆ వర్గంలో వున్నది. ఆమెతో రాయ్‌కి అమెరికాలో వున్నప్పుడు పరిచయమున్నది. మిగిలిన వారు క్రొత్తవారు. రాయ్ మెక్సికో నుంచి మాస్కో వచ్చేటప్పుడు బెర్లిన్‌లో కొంతమంది విప్లవ వాదులను చూచాడు. వారెవరూ యీ వర్గంలో లేరు. అయినా బెర్లిన్ నుంచి వచ్చిన వారిని కలుసుకొనటానికి రాయ్ ప్రయత్నించాడు. అందుకు వారు సుముఖంగా కనబడ లేదు. ఇది రాయ్‌కి ఆశ్చర్యం కలిగించినది. అందులో నళినీగుప్త పేరు గల ఒక విప్లవవాది కూడా వున్నాడు. మిగిలిన వారెవరూ భారతదేశ విప్లవ వాదులతో సంబంధం పెట్టుకొని విప్లవ చరిత్రను గమనించినట్లు లేదు. నళినీ రహస్యంగా ఐరోపా ఖండం నుంచి రెండుసార్లు భారతదేశం ప్రవేశించి భారత విప్లవకారులతో సంబంధాలు పెట్టుకొనటానికి ప్రయత్నించాడు. భారతదేశ విప్లవవాదుల ద్వారా రాయ్ గత చరిత్రను తెలుసుకొన్నాడు. కాగా 'రాయ్‌ని కలుసుకొన వలసినదిగ' వారు నళినీని కోరటం కూడా జరిగినది. ఈ కారణాల వలన నళినీ రాయ్‌కి సన్నిహితుడయ్యాడు.

బెర్లిను విప్లవ సమితి సభ్యులు తామే భారతదేశానికి తగిన ప్రాతినిధ్యం వహిస్తున్నట్లు చెప్పసాగారు. అందుకు రాయ్ అభ్యంతరం చెప్పలేదు. భారతదేశ

ప్రతినిధిగా తాను రాలేదని కూడా చెప్పాడు. తాష్కెంటులో భారత కమ్యూనిస్టు పార్టీ స్థాపనకు వారు అభ్యంతరం చెప్పారు. అందుకు తాను బాధ్యుడను కానని, అచ్చటి విప్లవవాదుల పట్టుదల మీదనే కమ్యూనిస్టు పార్టీ స్థాపించ బడినదని రాయ్ సమాధానం చెప్పాడు. వారు తమ కార్యాలయాన్ని బెర్లిను నుంచి మాస్కోకు మార్చాలనే తలంపులో వున్నారు. అందుకు రాయ్ వ్యతిరేకత చూపలేదు. వారి ఆధ్వర్యం క్రింద, వారు చెప్పినట్లు కృషి సాగించటానికి ఆపక్తి కనబరచాడు. ఇంత జరిగినా వారు రాయ్‌తో కలుసుకొనటానికి, ముఖాముఖి చర్చలు జరపటానికి నిరాకరించారు. వారితో దూరంగా వుండటమే మంచిదని భావించి రాయ్ వారి కార్య కలాపాల్లో జోక్యం కలిగించుకొన లేదు.

ఆ సభ్యులు మొదట చిచెరిన్‌ను కలుసుకున్నారు. చిచెరిన్ ప్రస్తుతం రాజకీయంగా అవసరమయిన పలుకుబడిలో లేడు. పైగా మధ్య ఆసియాలో భారత విప్లవవాదుల సంచలనం గురించి అసమ్మతి సూచకంగా బ్రిటిషు ప్రభుత్వం పంపిన పత్రం ఆయన దగ్గరే వున్నది. మర్యాద సూచకంగా వారిని ఆహ్వానించి, ఆదరించినా వారు కోరిన వాగ్దానాలు నెరవేరలేదు. వారు నిస్పృహ చెందారు. లెనిన్‌ను చూడాలని నిశ్చయించుకొన్నారు. ఇదంతా వారు రహస్యంగా జరుపుకొన్న చర్యలు. వారి ప్రయత్నాలు రాయ్‌కి తెలియకుండా జరగాలని వారి కోరిక. రాయ్‌కి ముందుగా తెలిస్తే రష్యను నాయకులతో కలుసుకొనటానికి అడ్డుపుడకలు వేస్తాడని వారి భయం.

లెనిన్ సరాసరి ఫోనుచేసి రాయ్‌ని పిలిపించుకొని 'బెర్లిన్ విప్లవ సమితి' సభ్యులను గురించి ప్రశ్నించాడు. వారితో ముఖాముఖి తాను మాట్లాడవలసిన అవసరం వుండదని, ఒకవేళ భారతదేశంలోని విప్లవ కార్యక్రమం గురించి వారు చర్చించాలనుకుంటే కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌తో చర్చించవచ్చునని వారితో చెప్పమన్నట్లుగా రాయ్‌కి చెప్పాడు. 'వారు నాతో ముఖాముఖి మాట్లాడటానికే యిచ్చగించటంలేదని' రాయ్ అన్నప్పుడు లెనిన్ ఆశ్చర్యంగా రాయ్ వంక చూసాడు. చివరకు రాయ్ సలహా ననుసరించి వారిలో ముగ్గురిని ప్రతినిధివర్గంగా కలుసుకొనటానికి లెనిన్ అంగీకరించాడు.

ఆ మొత్తం సభ్యుల సంఖ్య పదునాలుగు. ఎవరికివారే ఆ ముగ్గురు ప్రతినిధివర్గంలో వుండాలని తహతహ లాడారు. తర్జన, భర్జనలు జరిగినవి. చివరకు ఇద్దరు బెంగాలీలు (వీరేంద్రనాథ్ చటోపాధ్యాయ, భూపేంద్రనాథ్ దత్తు) ఒక బెంగాలేతరుడు ప్రతినిధివర్గంగా లెనిన్‌తో సమావేశం జరిపి రెండవ కాంగ్రెసు మహా

సభలో రాయ్ సూచించిన సిద్ధాంతానికి ప్రతిగా మరొక సిద్ధాంత పత్రాన్ని లెనిన్‌కు అందచేసి తామే భారతదేశ విప్లవ సమితికి సిసలైన ప్రతినిధులమనే వాదాన్ని బలపరచుకొనటానికి ప్రయత్నించారు. లెనిన్ వారి వాదాన్ని సహనంతో ఆలకించాడు.

"ఇతర దేశాల్లో విప్లవ కార్యక్రమాలు కొనసాగించటాన్ని సోవియటు ప్రభుత్వం సరాసరి జోక్యం కలిగించుకొనదు. మీరు కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ ప్రధాన కార్యదర్శితో యీ విషయాలు చర్చించి ఒక నిర్ణయానికి రావటం మంచిది" అని లెనిన్ వారికి సలహా యిచ్చి పంపించాడు. వారు వూహించినదానికి వ్యతిరేకంగా జరిగినది. నిరాశతో బయటకు వచ్చారు. ఆ ప్రతినిధివర్గంలోని ఒకరు "అసలు రష్యానుంచి సహాయం కోరటమేతప్పు. ప్రస్తుతం రష్యా బ్రిటిషు సామ్రాజ్యవాదంతో రాజీ బేరాలకు దిగేస్థితిలో పడ్డది" అని తీవ్ర ఆరోపణ కూడా చేసారు.

తరువాత వీరు కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ ప్రధాన కార్యదర్శి రాడెక్‌ను కూడా కలుసుకొన్నారు. అదే సమయంలో కమ్యూనిస్టు కార్యాలయంలో మరొక గదిలో రాయ్ వున్నాడని రాడెక్ తెలుసుకొని ఫోనులో భారత ప్రతినిధుల రాకను గురించి తెలియపరచి రమ్మని ఆహ్వానించాడు. రాయ్ ప్రతినిధి వర్గంతో పాటు చర్చలలో పాల్గొనటానికి తన అసమ్మతిని తెలియపరచి 'చర్చల ధోరణిలో మీరు కారణం తెలుసుకొనగలరు' అని సమాధాన మిచ్చాడు.

''రెండవ కాంగ్రెసు మహాసభ తీర్మానం ప్రకారం కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ తన కార్యక్రమాన్ని ఆచరణలో పెట్టుతుంది. ఒకవేళ మీరు ఆ తీర్మానాన్ని అంగీకరించకపోతే త్వరలో మూడవ కాంగ్రెసు మహాసభ జరుగనున్నది. కనుక మీ అభిప్రాయాలు అందులో ప్రకటించవచ్చును. మీరు ప్రేక్షకులుగానే అందులో పాల్గొనటానికి అవకాశం వున్నది. మీకు ప్రతినిధులుగా పాల్గొనే హక్కు లేదు. అయినా మీ సిద్ధాంతాలు అందజేస్తే వాటిని నేను మహాసభలో చర్చించటానికి సిఫారసు చేయగలను" అని రాడెక్ ప్రతినిధి వర్గానికి తెలియజేసాడు.

వారు అందుకు తృప్తిచెందలేదు. "మేము మాస్కోలో వుండి మా కాలం వృథా చేయజాలము. మా విప్లవ కార్యక్రమం సాగించటానికి తిరిగి వెంటనే బయలుదేరి వెళ్ళాలి. అందుకు అవసరమయిన ధన సహాయం చేయాలి'' అని వారు తమ ఆత్రుతను వ్యక్త పరచారు.



"తూర్పు దేశాల్లో విప్లవ కార్యక్రమం కొనసాగించటానికి కమ్యూనిస్టు ఇంటర్‌నేషనల్ మధ్య ఆసియాలో ఒక బ్యూరోను స్థాపించినది. మీరు చేపట్టే కార్యక్రమం గురించి ముందుగా ఆ బ్యూరోను సంప్రదించాలి. అందులో సభ్యుడయిన కామ్రేడ్ రాయ్ ప్రస్తుతం మాస్కోలో వున్నాడు. మీరు ఆయనను కలుసుకొని మీ కార్యక్రమం గురించి చర్చించటం మంచిది" అని వారికి సలహా యిచ్చాడు.

లెనిన్‌తో జరిపిన సమాగమంకంటే యిది వారి దృష్టిలో తీవ్ర అధిక్షేపణగా కనబడినది. వారి అసంతృప్తిని రాడెక్ గ్రహించాడు. చివరకు వారిని తృప్తి పరచాలనే దృష్టితో కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ కార్యవర్గంనుంచి ఒక ఉపసంఘాన్ని యేర్పరచి ఆ ఉపసంఘంద్వారా వారి వాదాన్ని పరిశీలించి అవసరమయితే అన్ని వ్యవహారాలు చక్కపెట్టటానికి ప్రయత్నించగలనని రాడెక్ వారికి హామీ యిచ్చాడు.

రాడెక్ సమాధానం కొంతమందిని తృప్తిపరచలేదు. వారు మాస్కోనుంచి వెళ్లిపోయారు. చటోపాధ్యాయ, అగ్నిస్‌స్మెడ్‌లీ, దత్తు, లుహానీ, నళినీ గుప్త, మరొకరిద్దరు మాస్కోలో ఆగిపోయారు. వారి వాదాన్ని విని భారతదేశ పరిస్థితుల గురించి పరిశీలించటానికి జర్మను కమ్యూనిస్టు నాయకుడు ఆగస్టు థాల్‌హిమిర్, బ్రిటిషు కమ్యూనిస్టునాయకుడు టామ్‌క్వెల్చ్, మైకేల్ బరోడిన్‌తో ఉపసంఘం యేర్పాటు చేయబడినది. వారి ముందు లుహానీ తమవాదాన్ని చక్కగా బలపరచుతున్నాడు. "రాయ్‌తో కలిసి కృషిచేయటానికి మీకేమైనా అభ్యంతరమా ?" అని థాల్‌హిమిర్ వారిని ప్రశ్నించాడు.

రాయ్ అభిప్రాయం అడిగినప్పుడు "నేను భారతదేశ ప్రతినిధిగా చెప్పుకొనటంలేదు. అయినా వారితో కలసి పనిచేయటానికి నాకేమీ అభ్యంతరం లేదు. వారిచ్చిన కార్యక్రమాన్ని వారి ఆధ్వర్యంలోనే వుండి సంతోషంగా నెరవేర్చటానికి సిద్ధంగా వున్నానని" చెప్పాడు.

"మాకు కామ్రేడ్ రాయ్‌నిగురించి ఏమాత్రం వ్యతిరేక భావంలేదు. కాని భారతదేశంలో అనేక విప్లవవాదుల ఉరిశిక్షలకు, కారాగారవాస శిక్షలకు కారణభూతుడయిన బ్రిటిషు గూఢచారితో రాయ్‌కి పొత్తు వున్నంతకాలం మేము కలసి పనిచేసే అవకాశం లేదు" అని చటోపాధ్యాయ అనటంతో ఉపసంఘం

"తూర్పు దేశాల్లో విప్లవ కార్యక్రమం కొనసాగించటానికి కమ్యూనిస్టు ఇంటర్‌నేషనల్ మధ్య ఆసియాలో ఒక బ్యూరోను స్థాపించినది. మీరు చేపట్టే కార్యక్రమం గురించి ముందుగా ఆ బ్యూరోను సంప్రదించాలి. అందులో సభ్యుడయిన కామ్రేడ్ రాయ్ ప్రస్తుతం మాస్కోలో వున్నాడు. మీరు ఆయనను కలుసుకొని మీ కార్యక్రమం గురించి చర్చించటం మంచిది" అని వారికి సలహా యిచ్చాడు.

లెనిన్‌తో జరిపిన సమాగమంకంటే యిది వారి దృష్టిలో తీవ్ర అధిక్షేపణగా కనబడినది. వారి అసంతృప్తిని రాడెక్ గ్రహించాడు. చివరకు వారిని తృప్తి పరచాలనే దృష్టితో కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ కార్యవర్గంనుంచి ఒక ఉపసంఘాన్ని యేర్పరచి ఆ ఉపసంఘంద్వారా వారి వాదాన్ని పరిశీలించి అవసరమయితే అన్ని వ్యవహారాలు చక్కపెట్టటానికి ప్రయత్నించగలనని రాడెక్ వారికి హామీ యిచ్చాడు.

రాడెక్ సమాధానం కొంతమందిని తృప్తిపరచలేదు. వారు మాస్కోనుంచి వెళ్లిపోయారు. చటోపాధ్యాయ, అగ్నీస్‌స్మెడ్‌లీ, దత్తు, లుహానీ, నళినీగుప్త, మరొకరిద్దరు మాస్కోలో ఆగిపోయారు. వారి వాదాన్ని విని భారతదేశ పరిస్థితుల గురించి పరిశీలించటానికి జర్మను కమ్యూనిస్టు నాయకుడు ఆగస్టు థాల్‌హీమిర్, బ్రిటిషు కమ్యూనిస్టునాయకుడు టామ్‌క్వెల్చ్, మైకేల్ బరోడిన్‌తో ఉపసంఘం యేర్పాటు చేయబడినది. వారి ముందు లుహానీ తమవాదాన్ని చక్కగా బలపరచుతున్నాడు. "రాయ్‌తో కలిసి కృషిచేయటానికి మీకేమైనా అభ్యంతరమా?" అని థాల్‌హీమిర్ వారిని ప్రశ్నించాడు.

రాయ్ అభిప్రాయం అడిగినప్పుడు "నేను భారతదేశ ప్రతినిధిగా చెప్పుకొనటంలేదు. అయినా వారితో కలసి పనిచేయటానికి నాకేమీ అభ్యంతరం లేదు. వారిచ్చిన కార్యక్రమాన్ని వారి ఆధ్వర్యంలోనే వుండి సంతోషంగా నెరవేర్చటానికి సిద్ధంగా వున్నానని" చెప్పాడు.

"మాకు కామ్రేడ్ రాయ్‌నిగురించి ఏమాత్రం వ్యతిరేక భావంలేదు. కాని భారతదేశంలో అనేక విప్లవవాదుల ఉరిశిక్షలకు, కారాగారవాస శిక్షలకు కారణభూతుడయిన బ్రిటిషు గూఢచారితో రాయ్‌కి పొత్తు వున్నంతకాలం మేము కలసి పనిచేసే అవకాశం లేదు" అని చటోపాధ్యాయ అనటంతో ఉపసంఘం

నిశ్చేరపోయినది. బరోడిన్ ఆ గూఢచారిని గురించి వివరంగా బయటపెట్టమని చటోపాధ్యాయను కోరాడు.

"ఆ గూఢచారి అబానీముఖర్జీ. 1916లో జపానునుంచి భారతదేశ ప్రయాణంలో సింగపూరులో బ్రిటిషు అధికారులచే బంధింపబడ్డాడు. నిర్బంధం నుంచి తప్పించుకొన్నట్లు చెప్పుచున్నాడు. అది అబద్ధం. పోలీసులకు విప్లవ రహస్యాలు చెప్పి బయటపడ్డాడు. దాని ఫలితంగా అనేక మంది పట్టుబడ్డారు. మరణ శిక్షలకు గురి అయ్యారు. ఇంకా అనేక మంది కారాగారవాస శిక్షలు అనుభవిస్తున్నారు."

రాయ్ తన సమాధానంలో ఏ పరిస్థితుల్లో ముఖర్జీతో తనకు పరిచయమయినదో వివరించాడు. "ముఖర్జీ మీద నాకూ కొంత వరకు అనుమానం వున్నది. కాని ఆయన మీద ఆరోపింపబడిన నేరం రుజువు అయ్యేవరకు కేవలం అనుమానంతో ఆయనను శిక్షించటం మంచిది కాదనే అభిప్రాయంలో వున్నాను." అని సమర్థించుకున్నాడు.

ఆ చర్చ ధోరణి మార్చటానికి ధాల్‌హిమిర్ "రాజకీయంగా రాయ్‌తో మీకు అభిప్రాయ భేదాలు వున్నవా?" అని ప్రశ్నించాడు.

తాష్కెంటులో స్థాపించిన భారత కమ్యూనిస్టు పార్టీ విషయమెత్తి "రాయ్‌తో కలిసి పనిచేయాలంటే ముందు దానిని రద్దుచేయాలి" అని పట్టుపట్టారు. రాయ్ అందులో తన ప్రమేయం కాని ప్రోద్బలం కాని లేదని, దానికి తాను వ్యతిరేకుడనేనని అచ్చటి భారత విప్లవకారుల పట్టుదలతోనే అది స్థాపించబడినదని ఒకవేళ అది రద్దు చేయవలెననినా అచ్చటి వారు దానిని రద్దుచేయక పోవచ్చునని ఎంత చెప్పినా వారు వినే పరిస్థితుల్లో కనబడలేదు.

"ఆ పార్టీని రద్దుపరచాలి. అందులో రాజీ ప్రశక్తి లేదు. మా కోర్కెలు నెరవేర్చకపోతే మేము యిప్పుడే మాస్కో విడిచి వెళ్ళిపోగలము" అని చటోపాధ్యాయ తుది హెచ్చరిక చేశాడు.

బెర్లిన్ విప్లవ సమితి సభ్యులు తన యెడల శత్రుభావం వహించి నిశితంగా, క్రూరంగా విమర్శించటం రాయ్‌కి తీరని మనోవ్యథ కలిగించినది. వారు అలా ప్రవర్తించటానికి కారణం అన్నీస్మెడ్లీ అని రాయ్ అనుమానం.

అమెరికాలో లాలా లజపతిరాయ్‌కి ఆమె కొంత కాలం కార్యదర్శిగా వున్నది. రాయ్ అమెరికాలో వున్నప్పుడు ఆమెతో బాగానే పరిచయ మున్నది. ఆమె ఒక రకమయిన మనస్తత్వం కలిగి తమాషాగా సంచరిస్తూ వుండేది. విప్లవ కార్యక్రమం కంటె విప్లవవాదుల సహచర్యం, మక్కువ కొరకు ఆరాటపడుతూ వుండేది. లజపతిరాయ్ వృద్ధుడు కావటంచేత కొలది కాలానికే తన కార్యదర్శి పదవి వదలుకొని తనకంటె వయస్సులో చిన్నవాడైన వేరొక విప్లవకారుని సాంగత్య మభిలషించినది. రాయ్ మెక్సికో వెళ్ళిన కొంతకాలానికి ఆ యువకుడు కూడా మెక్సికో ప్రవేశించాడు. ఆతడు కేవలం జాతీయవాది. రాయ్ సోషలిస్టు కార్యక్రమం ఆయనకు నచ్చలేదు. రాయ్‌ని తిరిగి అమెరికా వెళ్ళుదామని బలవంతం చేయసాగాడు. రాయ్ మెక్సికో లోనే వుండి కొంత అనుభవం గడించమని ఆ యువకునికి నచ్చచెప్పటానికి ప్రయత్నించినా ప్రయోజనం లేకపోయింది. అమెరికా వెళ్ళి అక్కడే తన కృషిని కొన సాగిస్తానని రాయ్ దగ్గర కొంత ధనంకూడా తీసుకొని వచ్చాడు.

అమెరికాలో స్మెడ్‌లీతో కలసి 'భారత విప్లవవాదుల స్నేహ సమితి' అనే పేరుతో ఒక సంఘాన్ని స్థాపించాడు. అమెరికా ప్రభుత్వం వీరిద్దరినీ బంధించి జైలులో పెట్టగా 'న్యాయ విచారణ'కు ధనసహాయం చేయమని పదేపదే రాయ్‌కి వుత్తరాలు వ్రాసినా ఆ యువకుని భావాలతో యేకీభవించని వాడగుటచే రాయ్ వారిని ఖాతరు చేయలేదు. అప్పటినుంచీ స్మెడ్‌లీ రాయ్‌మీద శత్రుత్వం వహించినది, తరువాత ఆ యువకుడు స్మెడ్‌లీని త్రోసిపేసి మరొక యువతిని పెండ్లిచేసుకొనటంతో ఆమె యుద్ధానంతరం బెర్లిను వచ్చి విప్లవకారులతో సంబంధాలు యేర్పరచుకొని చటోపాధ్యాయను సన్నిహితుని చేసుకొనగలిగినది. రాయ్‌ను గురించి చటోపాధ్యాయకు వ్యక్తిగతంగా వ్యతిరేక భావంలేదు. మాస్కో వచ్చినప్పుడు ముందుగా రాయ్‌ని కలుసుకొనటానికి ప్రయత్నించాడు. కాని స్మెడ్‌లీ పడనివ్వలేదు. చటోపాధ్యాయ మనస్సును విషపూరితం చేసినది.

బెర్లిన్ విప్లవ సమితి సభ్యులు మూడవ కాంగ్రెసు మహాసభ కొరకు ప్రత్యేకించి రాలేదు. ఆ తరుణంలో రావటంచేత విదేశీ అతిధులకు ఏర్పాటు చేయబడిన 'హోటలు లక్స్'లో వారికి కూడా వసతి కల్పించబడినది. అప్పటికి ప్రతినిధులు అంతగా రాలేదు. వచ్చినవారు కాంగ్రెసు మహాసభలో రాబోవు తీర్మానాలనుగురించి తర్జన, భర్జనలు జరుపుతూవుంటే వీరు వరండాల్లో పచార్లుచేస్తూ వుండేవారు. తమకూ ఒక కార్యక్రమం వున్నట్లు కనబడలేదు. వచ్చిన ప్రతినిధులతో

కేవలం బ్రిటిషు సామ్రాజ్య తత్వాన్ని గురించి మాట్లాడుతూ తిట్టిపోయటం వీరు ఒక కార్యక్రమంగా పెట్టుకున్నారు. అచ్చటకు వచ్చిన ప్రతినిధులందరూ సామ్రాజ్య వాద వ్యతిరేకులే. కాని సామ్రాజ్యవాదాన్ని ఆడిపోసుకుంటూ కాలం గడపటంవలన ప్రయోజనం శూన్యం. భారత ప్రతినిధుల ప్రవర్తన వారికి వింతగా కనబడినది. కార్యశూరులుగా కనబడలేదు.

మూడవ కాంగ్రెసు మహాసభల సమయంలో లుహానీ, నళినీగుప్త - యిద్దరే మిగిలియున్నారు. లుహానీ బెర్లిన్ విప్లవసమితి కార్యక్రమాన్ని, సిద్ధాంతాలను స్పష్టంగా, సమర్ధవంతంగా మహాసభలో చిత్రించగలడనే విశ్వాసంతో ఆయనను అట్టిపెట్టి మిగిలినవారు మాస్కో విడిచి వెళ్లిపోయారు. నళినీగుప్త భారతదేశం వెళ్లాలనే దృష్టితో రాయ్‌ని సంప్రదించి సలహాలు పొందటానికి వున్నాడు.

ఈ సమయంలోనే కాబూలు ప్రభుత్వం అచ్చటి భారత తాత్కాలిక ప్రభుత్వ సభ్యులను దేశం విడిచి వెళ్లాలని ఆజ్ఞాపించినది. రష్యను ప్రభుత్వ అనుమతితో ఒబేదుల్లా, మరికొందరు విప్లవవాదులు మాస్కో చేరారు. ఒకరిద్దరు మినహా అందరూ మహమ్మదీయులే. ఒబేదుల్లా తన ప్రభుత్వ కార్యాలయాన్ని మక్కాకు మార్చి భారతదేశంనుంచి మక్కాకువచ్చే యాత్రికులద్వారా భారత దేశంతో సంబంధాలు పెట్టుకొనాలనే ఆలోచనలో వున్నాడు.

తాత్కాలిక భారత ప్రభుత్వ ప్రతినిధులతోపాటు రష్యను రాయబారి, ఆయన భార్యను కూడా ఆఫ్గను ప్రభుత్వం ఖాళీచేసి స్వదేశం వెళ్లిపోవాలని ఆదేశించినది. వీరు కాబూలు వచ్చినప్పటినుంచి రాజు అమానుల్లా అభిమాన పాత్రులయి బాగా సన్నిహితులు కాగలిగారు. అంతఃపురంలో జరిగే ప్రతి కార్య క్రమానికీ వీరు కూడా పాల్గొనే చనువు సంపాదించగలిగారు. రాయబారి భార్య చేసే నాట్య సభలకు ఘోషా నుంచి బయటకువచ్చి బీగము రాణి కూడా పాల్గొనటం కద్దు. రాయబారిని అమానుల్లా తన ఆంతరంగికునిగా భావిస్తూ వుండేవాడు. ఒక విందు సందర్భంలో అమానుల్లాతో రాయబారి బోల్షివిజం గురించి మాట్లాడుతూ 'రాజుగారు బోల్షివిజం అంటే భయపడుచున్నారవి' హాస్య ధోరణిలో అమానుల్లాను హెచ్చ రించగా "ఎందుకు భయం ? నేనూ బోల్షివిక్కునే....రాజ్యంకొరకు నా తండ్రిని చంపాను." అని రహస్యంగా రాయబారి చెవిలో వూదాడు.

విప్లవానంతరం ఆర్థిక సహాయం పొంది సోవియటు ప్రభుత్వ అండ దండలు సంపాదించిన ఆఫ్గన్ ప్రభుత్వ ప్రస్తుతచర్య రాయ్‌కి విశ్రాంతి కల్గించినది. కాబూలు మీద కొంత నమ్మకంతో తాష్కెంటు వెళ్ళేముందు రాయ్ భారత సరిహద్దులకు ఆయుధాలు చేరవేసే ప్రయత్నంలో లెనిన్‌తో దీర్ఘంగా చర్చించాడు. అప్పుడే లెనిన్ కాబూలును గురించి కొంత సందేహం వెల్లడించాడు కూడాను.

"మనం కాబూలుకు విరివిగా ఆర్థిక సహాయం చేస్తున్నాము. పైగా బ్రిటిష ప్రభుత్వం, కాబూలు ప్రభుత్వం ఒండొరులు శత్రుధోరణిలో వున్నవి" అని రాయ్ చెప్పినప్పుడు లెనిన్ నవ్వుతూ "బ్రిటిష ప్రభుత్వం కాబూలును వెండి, బంగారాలతో కొనివేయగలదు. కావలసినన్ని వలస రాజ్యాలు వున్నవి. ఖనిజాలు త్రవ్వుకొని తెస్తుంది. మరి మనకేవీ ?" అని సమాధానం చెప్పినప్పుడు రాయ్‌కి లెనిన్ నిరాశావాదిగా కనుపించాడు. చరిత్ర లెనిన్ దూరదృష్టిని రుజువు చేసినది.

# లెఫ్ట్ కమ్యూనిజం:

బెర్లిను విప్లవ సమితి సభ్యుల ప్రవర్తన రాయ్ మనస్సును చికాకు పరచటమే కాకుండా ఆయన మూడవ కాంగ్రెసులో రూపొందించ వలసిన కార్యక్రమాని క్కూడా కొంత అంతరాయం కల్గించినది.

విప్లవానంతరం రష్యా ఆర్థికవ్యవస్థ బాగా తారుమారు చెందినది. ప్రభుత్వం అంతర్యుద్ధాన్ని విజయవంతంగా అణచగలిగినా దేశం అరాచకస్థితిలోనే వున్నది. భూమి జాతీయం చేయబడినది. రైతులు పొలాలు ఆక్రమించుకొన్నారు. పెద్ద భూస్వాములు తమ పంటలు, పశువులను నాశనం చేశారు. వ్యవసాయం ప్రధానంగా వున్న రష్యా వ్యవస్థ బాగా దెబ్బతిన్నది. పారిశ్రామిక కేంద్రాలు జాతీయం చేయబడలేదు. అయినా కార్మికులు ఫ్యాక్టరీలను బలవంతంగా వశపరచుకొని తమ పెత్తనం చలాయించ సాగారు. జీవితావసర వస్తువుల ఉత్పత్తి తగ్గినది. దరలు విపరీతంగా పెరిగినవి. ఉత్పత్తి అయిన వస్తువులు మార్కెట్‌కు సరిగ్గా రావటంలేదు. కరువు పరిస్థితు లేర్పడ్డవి.

లెనిన్ ప్రజలలో విశ్వాసం కలిగించి ఉత్పత్తిని పెంచటానికి నూతన ఆర్థిక విధానం ప్రవేశపెట్టాలనే తలంపులో వున్నాడు. ఇది ట్రాట్స్కీకి నచ్చలేదు. ఆయన 'యుద్ధవీరుని'గా పొందిన పలుకుబడితో 'ప్రపంచ విప్లవం' సాగాలని, దానికి నాందిగా సైనికశక్తిని బాగా పెంచాలనే పట్టుదలతో జారు ప్రభుత్వం క్రింద పనిచేసిన సైనికాధికారులను 'ఎర్రసైన్యం'లో చేర్చుకొనసాగాడు. దేశం మొత్తం 'మిలిటరీ నియంతృత్వ పరిపాలన' జరపాలని ట్రాట్స్కీ ఆశయం. అరాచక వాదుల అణచివేతకు సైనికులను వినియోగించాడు.

బుఖారిన్ నాయకత్వం క్రింద 'లెఫ్ట్ కమ్యూనిస్టులు' ట్రాట్స్కీ చర్యలు ప్రతిఘటించారు. "కార్మిక-కర్షక ప్రభుత్వానికి మారుగా కేంద్రీకృతమయిన మిలిటరీ నియంతృత్వం పనికిరాదు. గెరిల్లా యుద్ధ తంత్రంతో దేశాన్ని రక్షించిన వారి స్వాతంత్ర్యం 'క్రమశిక్షణ' పేరుతో అణచబడటం క్షమించరానిది. జారు ప్రభుత్వ సైనికాధికారులకు ఎర్రసైన్యంలో వుద్యోగాలివ్వటం స్వాతంత్ర్య ఆశయానికే విరుద్ధం" అని ఎదురు తిరిగారు.

రాయ్ 'లెఫ్ట్ కమ్యూనిజము' వైపు మొగ్గుచూపించాడు. అందుకు అనుకూలంగా బహిరంగంగా అనేక సమావేశాలు, సభలలో వుపన్యసించాడు. అప్పటి సోవియటు రష్యా సమస్యలకు కొన్ని పరిష్కార మార్గాలు సూచించాడు. అవి ప్రజామోదం పొందసాగినవి. వివిధ ప్రాంతాలనుంచి బహిరంగ సభలలో వుపన్యసించవలసినదని పరంపరగా ఆహ్వానాలు రాసాగినవి. రాయ్ పలుకుబడి పెరిగినది. ఆయనమీద వున్న అభిమానంచేత మాస్కో సోవియటుకు రెండు నియోజకవర్గాల నుంచి రాయ్‌ని సభ్యునిగా ఎన్నుకొన్నారు.

అనేక పార్టీ సమావేశాల్లో, చర్చలలో కూడా రాయ్ పాల్గొని తన అభిప్రాయాలను వెల్లడించి వారిని వొప్పించగలిగాడు. లెఫ్ట్ కమ్యూనిస్టులకు అభిమానపాత్రుడు, ఆ వుద్యమ నాయకుడు అయిన బుఖారిన్‌కు సన్నిహితుడు కాగలిగాడు. బుఖారిన్ సోవియటు నాయకులందరిలో వయస్సులో చిన్నవాడు. కాని సిద్ధాంతాలమీద లెనిన్ తరువాత లెనిన్ అంతటివానిగా పేరెన్నిక గలవాడు. లెనిన్ 'లెఫ్ట్ కమ్యూనిజాన్ని' బాహాటంగా సమర్థించకపోయినా బుఖారిన్, రాయ్ అభిప్రాయాలకు తగిన విలువ నిస్తూ వివాదాస్పదమయిన కొన్ని విషయాలలో వీరిద్దరితో వ్యక్తిగత మంతనాలు జరుపుతూవుండేవాడు. ఒకసారి లెనిన్ బాహాటంగానే లెఫ్ట్

కమ్యూనిజాన్ని సమర్థించి పార్టీకి మించిన సైనికశక్తిని పెంపొందించి దేశం మొత్తం మానవశక్తిని సైనిక నియంతృత్వ పరిపాలనకు కుదువపెట్టాలనే ట్రాట్స్కీ వాదాన్ని నిరసించటం కూడా జరిగినది.

లెనిన్ తరువాత వారసులుగా ట్రాట్స్కీ, బుఖారిన్, లెనిన్‌తో బాటు ప్రవాస మనుభవించిన జినోవీవ్ పేరులు వినబడుతూవుండేవి. కాని లెనిన్‌తో జరుపు ఆంతరంగిక చర్చల వలన లెనిన్ స్టాలిన్ వైపు మొగ్గు చూపుచున్నట్లు రాయ్ గ్రహించగలిగాడు. ట్రాట్స్కీ స్టాలిన్‌లమధ్య పోరాటం ప్రారంభమయినది. ఒకరు మిలటరీ నియంతృత్వం కావాలంటే రెండవవారు పార్టీ నియంతృత్వం కావాలని వాదించ సాగారు. లెనిన్‌కి స్టాలిన్‌మీద పూర్తి విశ్వాసం వున్నదని గ్రహించటంతో రాయ్ కూడా వ్యక్తిగతంగా స్టాలిన్‌తో స్నేహ సంబంధాలు పెంచుకొనటానికి ప్రయత్నించాడు.

ఈ అవకాశం రాయ్‌కి త్వరలోనే కలిగినది. మూడవ కాంగ్రెసు మహా సభకు, కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ టర్కో-బ్యూరో నివేదికను సిద్ధపరచే బాధ్యత రాయ్ మీద వున్నది. నివేదికకు ప్రాతిపదికగా కొన్ని ముఖ్యాంశాలు తయారు చేసి వాటిని లెనిన్‌కు చూపించి వాటిని గురించి యిద్దరు చర్చించుకున్నారు. వలస రాజ్యాలలోని విమోచన వుద్యమాలను గురించి రెండవ కాంగ్రెసు మహాసభలో వారిద్దరి మధ్య పొడసూపిన భేదాభిప్రాయాలు కొంతవరకు తగ్గినా భారతదేశ విధానంలో అలాగే నిలచిపోయినై. సత్యాగ్రహ నాయకునిగా గాంధీపేరు రష్యాలో బాగా ప్రచారంలో వున్నది. విప్లవవాదిగా పరిగణించబడ్డాడు. రాజకీయంగా తాత్కాలికంగా గాంధి విప్లవవాదిగా కనబడినా సిద్ధాంతరీత్యా, సాంఘికంగా అభివృద్ధి నిరోధకుడని వాదించటం, అనుభవ పూర్వకంగా ఆ విషయం తేల్చుకొన వచ్చునని లెనిన్ రాయ్‌ని సమాధాన పరచటం లోగడ జరిగినది.

చర్చల అనంతరం రాయ్ సూచించిన నివేదికలో మరికొన్ని అంశాలు చేర్చమని లెనిన్ సలహా యిచ్చాడు. జాతీయ రాజ్యాల కమిషనర్‌గా వున్న స్టాలిన్ అనుమతిని పొందటం అవసరం కనుక స్టాలిన్‌తో సంప్రదించమని రాయ్‌ని ఆదేశించాడు. రాయ్ స్టాలిన్‌ను కలుసుకొన్నాడు. స్టాలిన్ పార్టీకి ప్రధాన కార్యదర్శి అయిన తరువాత మరొకసారి కూడా ఇద్దరూ కలుసుకొనటం జరిగినది.

# నూతన ఆర్థిక విధానం:

లెనిన్ 'నూతన ఆర్థిక విధానాన్ని' అమలు జరపాలనే ఆతురతలో వున్నాడు. కర్షకులకు ప్రభుత్వం భూములను పంచిపెట్టినది. కాని పండించే పంటలలో మిగులుభాగము ప్రభుత్వం బలవంతంగా తీసికొంటుంది. విప్లవ ప్రజల కిచ్చిన హామీలు జరుగక పోగా వ్యతిరేక ఫలితాలకు దారితీయ సాగినవి. ప్రజలలో అసంతృప్తి, ఆందోళన ప్రబల సాగినవి.

'నూతన ఆర్థిక విధానం' ప్రకారం- "రైతులకు తాము పండించే పంటల మీద పూర్తి అధికారం వుంటుంది. మిగులు వుత్పత్తిని వారు మార్కెట్టులో స్వేచ్ఛగా అమ్ముకొనవచ్చును. ఉత్పత్తిని కొనుగోలు చేయటానికి స్వేచ్ఛా వ్యాపారాన్ని అనుమతించాలి. వ్యాపారం లాభసాటి అయినప్పుడే వర్తకులు ముందుకు రాగలరు. కనుక లాభార్జనకు వర్తకులను ఆంక్షలకు గురి చేయకూడదు. కట్టుదిట్టాలు కొంతవరకు సడలించ వలసిన అవసరమున్నది."

సిసలైన మార్క్సిస్టుల కిది తలవంపుగా కనబడినది. తిరిగి కాపిటలిజం వైపుకు దీనిని తిరోగమనంగా భావించారు. ఎన్నో త్యాగాలు చేసి ప్రాణాలు అర్పించి సంపాదించుకొనిన విప్లవ ఆదర్శం వమ్ము కావటం వారికి యిష్టంలేదు. రాయ్ మొదట యిదే దృష్టితో ఆలోచించి లెనిన్ అపమార్గంలో నడచుచున్నట్లు భావించాడు. లెనిన్ ఏకాకిగా పార్టీ కార్యవర్గ సమావేశంలో, కార్యకర్తల సమావేశాల్లో తన సిద్ధాంతాన్ని, 'నూతన ఆర్థిక విధానాన్ని' విశేష ప్రజ్ఞతో సమర్థించి వారిని వొప్పించటానికి విశ్వ ప్రయత్నం చేయవలసి వచ్చినది.

కారల్ మార్క్స్ తన రచనలలో ఎక్కడా విప్లవం రాగానే ఏమి చేయాలో ఒక్కమాట కూడా చెప్పియుండలేదు. విప్లవానంతరం అప్పటి పరిస్థితుల కనుకూలంగా స్వతంత్రించి ఆలోచించి అనుకూల కార్యక్రమాన్ని నిర్ణయించుకొనవలసి వున్నది. లెనిన్ దీనినే విపులీకరించాడు.

"విప్లవం సాధించాము. విప్లవాన్ని విజయవంతం చేయటానికే యీ ఆర్థికవిధానం చేపట్టవలసిన అవసరం వున్నది. రష్యాదేశం ముఖ్యంగా వ్యవసాయ

ఆర్థిక విధానంమీద ఆధారపడి వున్నది. ప్రోలిటేరియన్ నియంతృత్వం కావాలని మన ఆశయం. మరి ప్రోలిటేరియన్ వర్గం రష్యాలో లేదు. వారిని సృష్టించటానికి రష్యా పారిశ్రామికంగా బాగా అభివృద్ధి చెందాలి. అందుకు కనీసం పది, పదిహేను సంవత్సరాలయినా పట్టవచ్చును. ఈ మధ్యకాలంలో ఏమిచేయాలి? రైతులకు వారు పండించినది వారికి దక్కనీయకపోతే వుత్పత్తి తగ్గుతుంది. అరాచకం ప్రబలుతుంది. విప్లవ ప్రతిఘటన శక్తులకు అవకాశం దొరుకుతుంది. రైతులను తమ వైపుకు త్రిప్పుకొని విప్లవాన్ని నాశనం చేయటానికి ఆ శక్తులు ప్రయత్నించ గలవు. ఆ ప్రమాదం తప్పించటానికి, విప్లవశక్తులను సంఘటిత పరచటానికి యీ 'నూతన ఆర్థికవిధానం' అవసరం." అని తన సహజ గంభీర వాక్కులో లెనిన్ మాట్లాడాడు.

ట్రాట్స్కీ దీనికి భిన్నంగా సైనిక నియంతృత్వం కొనసాగాలని, ప్రపంచ విప్లవాని కిది ఆటంకమని వాదించాడు. రాయ్ కూడా లెనిన్ వాదాన్ని కొంతవరకు వ్యతిరేకించాడు. దీనివలన మొదట్లో ట్రాట్స్కీ రాయ్‌ని తన అభిప్రాయాలతో ఏకీభవించినట్లుగా వూహించుకున్నాడు.

మూడవ కాంగ్రెసు మహాసభలో 'నూతన ఆర్థిక విధానం' ప్రధానాంశంగా ఎజండాలో చేర్చబడినది. పార్టీ కార్యవర్గంలో ప్రముఖంగా ప్రతిఘటించిన ట్రాట్స్కీ మహాసభలో నూతన ఆర్థిక విధానాన్ని సమర్ధిస్తూ బ్రహ్మాండమయిన వుపన్యాసం చేసాడు. తన వుపన్యాసాన్ని ఏకధాటిగా రష్యను, జర్మనీ, ఫ్రెంచి భాషల్లో తొమ్మిది గంటలసేపు కొనసాగించటం చరిత్ర ప్రసిద్ధం. ప్రతినిధులు విసుగు, విరామం లేకుండా చెవు లప్పగించి విన్నారు. మహాసభ ఏకగ్రీవంగా నూతన ఆర్థిక విధానాన్ని ఆమోదించినది. లెనిన్ ప్రజ్ఞ పరాకాష్టకు చేరినది.

కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ ఆమోదించిన తీర్మానాన్ని ఆచరణలో పెట్టవలసిన బాధ్యత సోవియటు ప్రభుత్వంమీద వున్నది. కనుక అనుమతికొరకు ప్రత్యేకించి సోవియట్ల ప్రతినిధుల సభ జరిగినది. అందులో ట్రాట్స్కీ ఒక వంక నూతన ఆర్థిక విధానం సమర్థిస్తూ మరొకవంక కొన్ని సందేహాలు వెలుబుచ్చటం లెనిన్ గమనిస్తూనే వున్నాడు. "యుద్ధానంతరం కూడా సామ్రాజ్యవాదం 'నిలద్రొక్కుకొన గలిగినది' కనుక ప్రోలిటేరియన్ వర్గం తన శక్తిని పెంపొందించు

కుంటూ కాపిటలిస్టు దేశాల్లో రాగల మరొక ప్రపంచ సంఘర్షణకు వేచి వుండా"లని ట్రాట్స్కీ హెచ్చరించాడు.

రాయ్ ట్రాట్స్కీవాదాన్ని ఎదుర్కొని బ్రిటిషు కాపిటలిజం పతనావస్థలో వుందని సోదాహరణంగా నిరూపించాడు. ఎవరిమాట లెక్కచేయని ట్రాట్స్కీ రాయ్ వుపన్యాసం ప్రత్యేక శ్రద్ధతో విన్నాడు. తరువాత రాయ్‌ని తన గదికి ఆహ్వానించి బ్రిటిషు సామ్రాజ్య స్థితిగతుల గురించి చర్చించి తాను ప్రతినిధుల సభలో యిచ్చిన నివేదికకు సవరణగా చేర్చుకొన్నాడు. ట్రాట్స్కీ ఇంగ్లండు, అమెరికా దేశాలు తమ మార్కెట్టుల కొరకు యుద్ధానికి దిగక తప్పదనే విశ్వాసంలో వున్నాడు. కాని రాయ్ "ఇంగ్లండు ప్రపంచ మార్కెటులో దిగజారి పోవుచున్నది. అమెరికాతో సంఘర్షణకు మారుగా రాజీ పద్ధతులతో 'జూనియర్ పార్టనర్'గా ప్రపంచ కాపిటలిజాన్ని సుస్థిరం చేయటానికి ప్రయత్నిస్తుంది" అని చెప్పాడు. ఆచరణలో తరువాత కాపిటలిస్టు దేశాలు అవకాశం వున్నంత వరకూ తమలో తాము సంఘర్షణకు దిగని విధంగా విదేశాంగ విధానాలు మలచుకుంటూ వచ్చినవి. ట్రాట్స్కీ తరువాత బ్రిటిషు సామ్రాజ్యవాదాన్ని గురించి 'ఇంగ్లండు అంతరించు తుందా' అనే పుస్తకం కూడా రచించాడు.

తన వాదాన్ని విపులీకరిస్తూ బ్రిటిషు కమ్యూనిస్టుపార్టీ నాయకుడు హ్యూ రత్‌బోన్ సహకారంతో రాయ్ 'బ్రిటిషు సామ్రాజ్య దుస్థితి-పతనం' అనే గ్రంథం రచించాడు. దీని వ్రాతప్రతిని 1930 లో రాయ్ భారతదేశం బయలుదేరే ముందు జర్మనీలోని ఒక ప్రముఖ కమ్యూనిస్టు పబ్లిషరుకు యిచ్చాడు. హిట్లరు అధికారం చేపట్టి కమ్యూనిస్టుపార్టీని నిషేధిస్తూ పార్టీ ఆఫీసులమీద దండయాత్ర సలిపి వారి ఆస్తులన్నీ నాశనం చేయించాడు. వాటితోపాటు యీ గ్రంథం కూడా నాశనమయినది.

'నూతన ఆర్థిక విధానం'వలన సోవియటు రష్యా చరిత్రయే మారిపోయినది. స్టాలిన్ దానిని రద్దు చేయకుండా సహకార పద్ధతిలో కొనసాగనిచ్చి నట్లయితే రష్యా, మార్క్సిజం సూచించిన కమ్యూనిజం, కార్మిక నియంతృత్వ పథంలో కాకుండా ప్రజాస్వామిక పంథాలో ప్రపంచ ప్రజాస్వామిక దేశాలకు మార్గదర్శకంగా వుండి ప్రపంచ చరిత్రను మరొక విధంగా మలచి వుండేది.

# విప్లవ విద్యాలయము

మూడవ కాంగ్రెసు మహాసభ (1921 జూన్ 22-జూలై 12) అనంతరం టర్కో-బ్యూరోను రద్దుచేసి ఆ స్థానంలో మొత్తం వలస రాజ్యాల వుద్యమాలను సక్రమ పంథాలో నడుపటానికి మాస్కోలో మరొక కేంద్ర కార్యాలయం స్థాపించటానికి నిర్ణయించబడినది. ఆ కార్యాలయ బాధ్యతను వహించమని రాయ్‌ని కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ కోరినది. కాని అందుకు రాయ్ అంగీకరించలేదు. రాయ్ మధ్య ఆసియాలో చేపట్టిన బాధ్యత కొంతవరకు తృప్తి కలిగించినా వూహించినంత అభివృద్ధికి రాలేదు. ఆఫ్గన్ రాజ్యంనుంచి భారత సరిహద్దులకు ఆయుధాలు, ఆయుధసామగ్రి చేరవేసి సాయుధ తిరుగుబాటుకు తలపెట్టిన పథకం కూడా కార్యరూపాన్ని ధరించలేదు. కనుక పశ్చిమ ఐరోపా రాజ్యాలకు వెళ్ళి అచ్చట నుండి భారతదేశంతో సంబంధాలు పెంచుకోవాలనే తలంపులో రాయ్ వున్నాడు. కనుక కేంద్ర కార్యాలయ బాధ్యతను వహించటానికి టర్కిస్తాన్‌లో తనకు అనుచరుడుగా వున్న సఫరావ్ పేరును సిఫారసు చేసాడు.

రాయ్ పశ్చిమ ఐరోపాఖండం వెళ్ళేముందు తాష్కెంటు వెళ్ళటం అవసరంగా భావించాడు. అచ్చటి బ్యూరో కార్యాలయం, సైనిక పాఠశాలను మూసి వేయటమే కాకుండా సైనిక శిక్షణ పొందుచున్న భారత విప్లవవాదుల భవిష్యత్తును గురించి కూడా నిర్ణయం గైకొనవలసి వున్నది. వారిలో అందరూ ఆశించినంతగా విప్లవకారులు కాకపోయినా కొందరు వుపకరించగలరనే ఆశ రాయ్‌కున్నది. వారికి మరికొంత విప్లవ రాజకీయ పరిజ్ఞానం కలిగించితే భారతదేశంలో కమ్యూనిస్టుపార్టీని స్థాపించి, విప్లవ నాయకత్వం వహించగలరు.కనుక మాస్కోలో విప్లవ రాజకీయ పాఠశాలను ప్రారంభించి వారికి, వారితోబాటు ఆసియాఖండంలోని ఇతర దేశాల విప్లవవాదులకు విప్లవ రాజకీయాల్లో శిక్షణ నివ్వటం అవసరంగా భావించాడు.

ఈ విషయం గురించి రాయ్ లెనిన్‌తో చర్చించాడు. లెనిన్ వుత్సాహం, సమ్మతి ప్రకటించి స్టాలిన్‌తో విపులంగా చర్చించి ఒక నిర్ణయానికి రావటం మంచిదని సలహా యిచ్చాడు. రష్యన్ కమ్యూనిస్టుపార్టీలో వలస రాజ్యాల కమ్యూనిస్టు

పంథాను గురించి స్టాలిన్ అభిప్రాయం అప్పుడు అంతిమ నిర్ణయంగా తీసికొనబడుతూ వుండేది. కనుక స్టాలిన్‌ను కలుసుకొనటం అవసరంగా భావించి లెనిన్ సలహా యిచ్చాడు. స్టాలిన్ అంతర్యుద్ధంలో పాల్గొని విశ్రాంతిలేక జబ్బుపడి మరణావస్థలో వున్నాడు. ఆయనకు విశ్రాంతి అవసరం. అట్టి పరిస్థితులలో స్టాలిన్‌తో రాజకీయాలు చర్చించటం రాయ్ మర్యాదగా భావించలేదు. విదేశ వ్యవహారాల కమిసార్ చిచెరిన్‌తో సంప్రదించమని లెనిన్ సలహా యిచ్చాడు. చిచెరిన్ రాయ్ అభిప్రాయాలతో ఏకీభవించి మాస్కోలో విప్లవ శిక్షణ కేంద్రాన్ని స్థాపించటానికి తన అంగీకారం ప్రకటించాడు.

టర్కిస్తాన్, ఆ చుట్టుప్రక్కల దేశాల్లో కమ్యూనిస్టులు, విప్లవవాదులకు ఏమీ అపోహలు కలుగని విధంగా మాస్కోలో వేరే కేంద్ర కార్యాలయం తెరువబడుతుందని చెప్పి అచ్చటి బ్యూరో మూసివేయబడినది. కాని సైనిక పాఠశాలను మూయటంలో కొంత యిబ్బంది కనబడినది. మాస్కోలో వెంటనే విప్లవ శిక్షణాలయం ప్రారంభించబడుతుందని, వారిని అక్కడకు తీసికొని వెళ్ళటం జరుగుతుందని చెప్పినప్పుడు వారిలో కొంతమంది సుముఖత వ్యక్తపరచారు. కమ్యూనిస్టు భావాలు కల ఇరవై ఇద్దరిని రాయ్ ఎన్నిక చేశాడు. మిగిలిన వారిలో కొంతమంది తాష్కెంటులోనే స్థిరపడ దలిచారు. కొంతమంది స్వదేశం వెళ్లాలనే ప్రయత్నంలో వున్నారు. వారికి వూహించిన దానికంటె వారి జీవన భృతికి, ప్రయాణ ఖర్చులకు మిను మిక్కిలిగా రాయ్ ధన సహాయం చేయటంవలన వారు తృప్తి చెందారు.

సంవత్సరంన్నర క్రితం అనేక ఆశయాలతో రాయ్ మాస్కో విడచిపెట్టి తాష్కెంటు ప్రవేశించాడు. మధ్య ఆసియాలో రాయ్ పొందిన అనుభవాలు చాల విలువ కలిగినవే. కాని మాతృదేశ విముక్తికి ఏమీ చేయజాలకపోయాడు. అయినా రాయ్ నిరాశ చెందలేదు. రష్యను విప్లవంలో సమాజాభివృద్ధికి పాల్గొని తన పాత్రను నిర్వహించగలిగినందులకు సంతృప్తిని పొందగలిగాడు. మధ్యఆసియాలోని విభిన్న దృక్పథం కల భారతీయుల సంపర్కంవలన అంతకుముందు రాయ్ కున్న అభిప్రాయాలలో పూర్తి మార్పు వచ్చినది. విప్లవం జయప్రదం కావటానికి ముందుగా చేయవలసిన కృషి చాలావున్నది. కేవలం ఆయుధ సామగ్రి, ధనరాసుల వలననే విప్లవం రాదు. ముందుగా విప్లవ సైన్యంలో రాజకీయ చైతన్యం కలిగించాలి. ప్రజల భావాలను కూడా పూర్తిగా మార్చాలి.

1915లో రాయ్ మాతృదేశ విముక్తి కొరకు కంకణం ధరించి భారత దేశం విడచిపెట్టాడు. ప్రపంచం చుట్టూ పరిభ్రమించి చివరకు మాతృదేశ దరి దాపులకు చేరగలిగాడు. ఎందుకొరకు రాయ్ మాతృదేశాన్ని విడచి వచ్చాడో ఆ ఆయుధసామగ్రి, సైనిక సంపత్తి, ధనరాసులు ఇప్పుడు రాయ్ అధీనంలో వున్నవి. కాని వాటిని సద్వినియోగ పరచగల విమోచనదళం, ప్రజాబలం లేదు. వాటిని భారతదేశ సరిహద్దులకు చేర్చగలిగినా స్వీకరించగల విమోచన దళం, విప్లవకారులు లేరు. స్వీకరించినా సరిగా వుపయోగించ బడుననే నమ్మకం లేదు. శత్రువులు వశపరచు కొనవచ్చును కూడా. కనుక రాయ్ తన గత చరిత్రను మరచి నూతన పంథా చేపట్టటానికి స్థిర సంకల్పుడయ్యాడు. ఇందుకు మాస్కోలో విప్లవ రాజకీయ కేంద్రం స్థాపించి ముందుగా స్థిరచిత్తులయిన కొంతమంది ఆసియాఖండ వాసులను విప్లవ చైతన్యులను చేసి సమర్థవంతమయిన, దూరదృష్టిగల నాయకత్వం నిర్మించటం ప్రధాన కర్తవ్యంగా భావించాడు.

* * * * *

స్టాలిన్ కమ్యూనిస్టుపార్టీలోగాని, ప్రవాస వర్గంలోగాని మొదట ప్రసిద్ధి గాంచిన నాయకునిగా రాణించలేదు. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌లో స్టాలిన్ గురించి తేలిగ్గా, హేళనగా మాట్లాడటం రాయ్ అనేక పర్యాయాలు వినటంతో ఆయనకు తెలియకుండా ఆయనలో స్టాలిన్ మీద సహజంగా మొదట్లో కొంత వ్యతిరేక భావం కలుగసాగినది. కాని అంతర్యుద్ధంలో స్టాలిన్ పేరు, ప్రతిష్ఠలు బయటకు వచ్చినవి. వీరోచితంగా పోరాడి జార్జినా నగరాన్ని కాపాడ గలిగాడు. అందుకు కృతజ్ఞతగా ఆ నగరానికి 'స్టాలిన్‌గ్రాడ్' నామకరణం చేయబడ్డది. ఏది ఎలావున్నా స్టాలిన్‌ను చూడాలనే ఆసక్తి రాయ్‌కి కలిగినది. లెనిన్ సలహా యిచ్చిన ప్రకారం రాజకీయ చర్చలు జరుపటానికి కాదు. జబ్బు స్థితిలో వుండి స్టాలిన్ యింకా మంచం మీదనే వున్నాడు. మర్యాదగా చూచి వద్దామని రాయ్ అభిలషించాడు.

అప్పటికి రాయ్‌కి రష్యనుభాష సరిగా తెలియదు. వెంట బరోడిన్ రాగా ఇద్దరూ కలసి వెళ్ళారు. స్టాలిన్ మంచం ప్రక్కనే వున్న 'ఈజీఛైర్'లో కూర్చొని టెలిఫోనులో నెమ్మదిగా మాట్లాడుచున్నాడు. కార్యదర్శి వెంటనే వచ్చి దానిని అందు కున్నాడు. స్టాలిన్ మెల్లగా వెనుకకు వాలుచున్నాడు. రాయ్ యిది గమనిస్తూనే

లోపల ప్రవేశించాడు. బరోడిన్ రాయ్‌ని పరిచయం చేయగానే కరచాలనం చేయటం కార్యదర్శి దూరంగా వున్న కుర్చీని దగ్గరకు తీసుకొని వచ్చి కూర్చొన పెట్టటం జరిగినది.

రాయ్ స్టాలిన్ ఆరోగ్యస్థితిని గురించి తెలుసుకొనటానికి నోరు ఎత్తక మునుపే స్టాలిన్ "మీకు పాన్-ఇస్లామిజమ్ లో విప్లవ భావాలు కనబడలేదా" అని రాయ్‌ని ప్రశ్నించటం రాయ్‌కి ఆశ్చర్యం కలిగించినది. 'మీ ఆరోగ్య పరిస్థితులు తెలుసుకొనటానికి వచ్చాను. రాజకీయాలు చర్చించటానికి కాదు.' అని సమాధానం చెప్పి 'ఈ విషయం మీరెలా తెలుసుకున్నారు' అని అడిగినప్పుడు కామ్రేడ్ లెనిన్ ద్వారా అని స్టాలిన్ ప్రత్యుత్తర మిచ్చాడు.

రాయ్ మధ్య ఆసియానుంచి మాస్కో చేరగానే అచ్చటి ఖిలాఫత్ వుద్యమం, పాన్ ఇస్లామిజమ్ గురించి చర్చించి తన అభిప్రాయాలు లెనిన్‌కు తెలియజేసాడు. లెనిన్ అదేవిషయం స్టాలిన్‌తో కూడా చర్చించమని రాయ్‌ని కోరటం జరిగినది. తనకంటె ముందుగానే లెనిన్ తన అభిప్రాయాలను స్టాలిన్‌కు అందచేసినట్లు రాయ్ గ్రహించాడు. వారిద్దరిమధ్య లోతుగా చర్చ జరుగలేదు. స్టాలిన్ ఆరోగ్య పరిస్థితులను తెలుసుకొని రాయ్ బయటకు రావాలనే తలంపుతో లేచి నిలబడ్డాడు. స్టాలిన్ వీడ్కోలు సూచకంగా తిరిగి కరచాలనంచేసి 'ఆపరేషన్ అయిన తరువాత మరొకసారి కలుసుకుందాం' అని చెప్పాడు. ఆ మరుసటిదినమే స్టాలిన్‌కు కడుపులో ఆపరేషన్ చేయవలసినరోజు.

ఈ సమాగమం జరిగిన కొద్దిరోజులకే రాయ్ తిరిగి తాష్కెంటు వెళ్లి అచ్చటి వ్యవహారాలన్నీ సర్దుకొని మళ్లీ మాస్కో వచ్చాడు. 1921 చివరిలో వలస రాజ్యాల కమ్యూనిస్టులకొరకు విప్లవ విద్యాలయ స్థాపన విషయంలో రెండవసారి స్టాలిన్‌ను కలుసుకొన్నాడు. అప్పటికి స్టాలిన్ ప్రతిష్ట పార్టీలోనూ, ప్రభుత్వంలోనూ 'మూడుపూవులూ ఆరుకాయలు'గా వున్నది. స్టాలిన్ ఆరోగ్యం బాగా కుదటబడినది, మిలిటరీ యూనిఫారంలో రాయ్‌ని సంతోషంగా కరచాలనం చేసి అభినందించాడు.

రాయ్ తన రాక అవసరాన్ని గురించి బయల్పరచక ముందే "అన్ని విషయాలు నాకు లెనిన్ తెలియబరచాడు. ఇచ్చట విప్లవ ట్రెయినింగు కేంద్రం స్థాపించటం ఎంతైనా అవసరం. రష్యాతోబాటు యితర వలస రాజ్యాలనుంచి విప్లవకారులను ఆహ్వానించి వారికి అవసరమయిన శిక్షణ నిచ్చి ప్రతి దేశంలోనూ

విప్లవాభివృద్ధికి తగిన నాయకత్వం సృష్టించాలి" అని రాయ్ అభిప్రాయాలకు బలం చేకూరుస్తూ మాట్లాడాడు. ఆ విప్లవ విద్యాలయ ప్రారంభోత్సవ సమయంలో స్టాలిన్ వెల్లడించిన అభిప్రాయాలు రాయ్‌ని విశేషంగా ఆకర్షించినవి. తాను ఏ ఆశయంతో విప్లవ విద్యాలయ అవసరాన్ని గుర్తించాడో అదే ఆశయాన్ని స్టాలిన్ తన వుపన్యాసంలో ప్రముఖంగా వెల్లడించాడు. మధ్య ఆసియాలో 'పాన్ ఇస్లామిజమ్' విప్లవ తత్వాన్ని గురించి రాయ్ శంకించిన దానికి మద్దతుగా తన అభిప్రాయం ప్రకటించటమే కాకుండా లెనిన్ కూడా అదే అభిప్రాయంలో వున్నట్లు స్టాలిన్ వ్యక్తం చేసాడు.

"మన ఆదర్శం ముఖ్యంగా మధ్య ఆసియా, తూర్పు ఆసియా దేశాల్లో విప్లవాన్ని జయప్రదం చేయటం. కనుక విప్లవశక్తులను పెంపొందించి విస్తరింప చేయాలి. ఇందుకు విప్లవ నాయకత్వం అవసరం. అట్టి నాయకత్వాలు సృష్టించటానికే యీ విప్లవ విద్యాలయం నెలకొల్పబడుతుంది'' అని స్టాలిన్ తన ప్రారంభోపన్యాసంలో బహిర్గతం చేసాడు.

ఇదే అంశంమీద రెండవ కాంగ్రెసులో రాయ్ లెనిన్‌తో ఘర్షణకు దిగాడు. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ వలస రాజ్యాలలో విప్లవాభివృద్ధికి తీవ్రకృషి చేయాలని తీర్మానించింది. ''తీర్మానం బాగానే వున్నది. కాని ఆ కార్యక్రమం ఆచరణలో పెట్టగల పార్టీలను ముందుగా అచ్చట సృష్టించాలని'' రాయ్ వాదించాడు. ఇప్పటికైనా కమ్యూనిస్టు నాయకులు తన వాదాన్ని అంగీకరించినందులకు రాయ్ మిక్కిలి హర్షించాడు.

ఆ విద్యాలయానికి 'స్టాలిన్ కార్మిక, కర్షక విశ్వవిద్యాలయం' అని నామకరణం చేయబడ్డది. స్టాలిన్ అంతర్యుద్ధంలో సాధించిన విజయాలకు చిహ్నంగా, వలస రాజ్యాల స్థితిగతులను క్షుణ్ణంగా అర్థం చేసికొనిన అధినేతగా ఆయన పేరు జోడించబడినది. 'కార్మిక-కర్షక' నామాలు చేర్చటంలో కూడా ప్రత్యేకత వున్నది. సామ్రాజ్య వ్యతిరేక పోరాటంలో దేశీయ బూర్జువావర్గం మార్క్సిజం ప్రకారం నాయకత్వం వహించి ప్రజాస్వామిక విప్లవం స్థాపించగలదు. కాని వర్గ సంఘర్షణను అణచటానికి కార్మిక-కర్షక హక్కులను భగ్నం చేయటానికి సామ్రాజ్యవాదంతో పొత్తు కుదుర్చుకొని తమ అధికారం సుస్థిరం చేసుకొనటానికి ప్రయత్నిస్తుంది. సాంఘిక న్యాయం, సాంఘిక విప్లవాన్ని ప్రతిఘటిస్తుంది. కనుక కార్మిక-కర్షకులకు

చైతన్యవంతులు చేసి కమ్యూనిస్టు నాయకత్వం క్రింద సంఘటిత పరచి అంతిమ పోరాటానికి, ప్రజా ప్రభుత్వ స్థాపనకు తీవ్రకృషి జరుపవలసి యున్నది. ఈ ఆశయం తోనే యీ విశ్వవిద్యాలయం ప్రారంభించ బడినది.

రానురాను రాయ్ అభిప్రాయాలతో రష్యను కమ్యూనిస్టుపార్టీ ఉన్నత నాయకులు ఏకీభవించ సాగారు. 1922లో నవంబరు 5 నుంచి డిశంబరు 5 వరకు జరిగిన నాల్గవ కాంగ్రెసు మహాసభ రాయ్ సిద్ధాంతాలను పూర్తిగా అంగీకరించినది. రష్యను నాయకులకు రాయ్ మీద ఆదరాభిమానాలు పెరుగసాగినవి. 1929లో రాయ్ కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌తో తెగతెంపులు చేసుకునే వరకు స్టాలిన్ అనుచర వర్గంలో ఒక ప్రముఖునిగా (స్టాలిన్ అభిమాన యువకుడు) పరిగణించబడ్డాడు.

## సహాయ నిరాకరణోద్యమం:

భారతదేశంలో గాంధి నాయకత్వం క్రింద జాతీయ విమోచన వుద్యమ పోరాటం జరుగుచున్నదని రష్యాలో కొన్ని వార్తలు, ప్రచురణలు వినా ఆ వుద్యమ వివరాలు, మంచిచెడ్డలగురించి ఎవరికీ తెలియదు. రష్యాతో భారతదేశానికి బొత్తిగా సంబంధాలు లేకపోవటమే యిందుకు కారణం. తమకు తెలిసినంతవరకు గోరంతలు కొండంతలుగా వర్ణించి రష్యనులు 'ప్రపంచ విప్లవం' సాగిపోతుందనే భ్రమలో చిత్ర విచిత్ర కథలు చెప్పుకుంటూ వుండేవారు. రాయ్ భారతీయునిగా మొదట అలాంటి కట్టుకథలు కొన్ని వారికి చెప్పిన సంఘటనలు కూడా లేకపోలేదు.

అంతర్జాతీయ తంతి-తపాలశాఖ యూనియన్ సమావేశాలకు బరోడిన్ రష్యను ప్రతినిధిగా స్పెయిను వెళ్లాడు. బ్రిటిషు ప్రభుత్వం ద్వారా భారతదేశానికి ఐరోపాఖండంతో సంబంధాలు వున్నవి. భారతదేశంనుంచి వచ్చే వార్తాపత్రికలు-పుస్తకాలు మొదలైనవాటిమీద నిషేధంలేదు. స్పెయిను నుంచి తిరిగివచ్చేటప్పుడు బరోడిన్ రాయ్‌కు కానుకగా భారత దినపత్రికలు, వారపత్రికలు, మాసపత్రికలు, పాతవి, క్రొత్తవి అన్నీ కలిపి మరికొంత సాహిత్యంతో ఒక పెద్దమూట తీసుకొని వచ్చాడు. భారతదేశ వాస్తవిక పరిస్థితులను తెలుసుకొనాలనే ఆతురతలో వున్న రాయ్ అది అమూల్యమయిన కానుకగానే భావించాడు.

తాపీగా అన్ని పత్రికలు చూచాడు. నాగపూరు కాంగ్రెసు మహాసభ సహాయ నిరాకరణోద్యమం ప్రారంభించాలని తీర్మానించినది. ప్రత్యేకంగా జరుప బడిన కలకత్తా మహాసభ దీనిని బలపరచినది. గాంధీ నాయకత్వంక్రింద సహాయ నిరాకరణోద్యమం ప్రారంభమయినది. ప్రభుత్వంతో ఏ విధంగానూ సహకరించ కూడదని గాంధీ పిలుపు నిచ్చాడు. ఉద్యోగులు రాజీనామాలిచ్చి ప్రభుత్వ కార్యాల యాలకు వెళ్లటం మానుకున్నారు. విద్యార్థులు పాఠశాలలకు వెళ్లటంలేదు. న్యాయవాదులు కోర్టులు బహిష్కరించారు. కర్షకులు శిస్తులు చెల్లించటానికి నిరాక రించారు. కార్మికులు సమ్మెలు ప్రారంభించారు.

సహాయ నిరాకరణ వుద్యమం బ్రహ్మాండ రూపాన్ని ధరించినది. ఎచ్చట చూచినా ప్రజావెల్లువ, ప్రభుత్వ వ్యతిరేక ప్రదర్శనలు. అంతవరకు మిత వాదులు కొన్ని రాజకీయ హక్కులను పొందాలనే తాపత్రయంతో కేవలం దరఖాస్తులు, మహజర్లతో ప్రభుత్వాన్ని ప్రార్థిస్తూ వుండేవారు. దాని వలన ప్రభుత్వం కదలలేదు, మెదలలేదు. ప్రజలలో చైతన్యం, వ్యతిరేకత అంతకంటె లేదు. సహాయ నిరాకరణోద్యమం ప్రజల మనస్సుకు హత్తుకొని పోయినది. దేశంలో ఎటు చూచినా ప్రజలు బ్రహ్మరథం పట్టినట్లు ముందుకు రాసాగారు.

అయితే యీ వుద్యమం దేనికి ? ఎందుకు ప్రారంభించినట్లు ? గమ్య స్థానమేమిటి ? అనే ప్రశ్నలకు సరియైన సమాధానం రాయ్‌కి కనబడలేదు. కేవలం బ్రిటిషు ప్రభుత్వాన్ని, పాలనా యంత్రాంగాన్ని స్థంభింప చేయటమే ప్రధాన కారణంగా కనబడినది. అది సాధించవచ్చును. మరి తరువాత చేయవలసిన కార్య మేమిటి ? అందుకు సరియైన మార్గం, కార్యక్రమం గాంధీ ప్రారంభించిన సహాయ నిరాకరణోద్యమం చూపలేదు. గాంధీ సిద్ధాంతం ప్రకారం కర్షకులకు జమీందారులు, కార్మికులకు పెట్టుబడిదారులు ధర్మకర్తలు. 'సత్య-అహింస'ల ద్వారా వారి మనసును మార్చి పరివర్తనం కలిగించాలి. హింసా చర్యలు ఏ మాత్రం పనికిరావు.

ప్రజా వుద్యమం వెల్లివిరిసి మహోధృతంగా ముందుకు సాగుచున్నప్పుడు సంతృప్తి చెందని ప్రజలు అచ్చటచ్చట కొన్ని అవాంఛనీయ హింసా చర్యలకు పూనుకొనవచ్చు. కాని అంతమాత్రం చేత ఆ మహోద్యమం అవాంఛనీయం కాజాలదు. అట్టి హింసాచర్యలను గాంధీ నిరసించాడు. అంతవరకు మంచిదే. కాని ఆ వుద్యమాన్నే ఆపటానికి ప్రయత్నించాడు. ఆపివేశాడు కూడాను. రైతులు శిస్తులు

చెల్లించమని, కార్మికులు సమ్మెలు విరమించమని ప్రబోధించాడు. పారిశ్రామిక కేంద్రమయిన అహమ్మదాబాదులో కార్మికులు బ్రహ్మాండమయిన సమ్మె సాగించారు. గాంధీ ఢిల్లీ నుంచి అహమ్మదాబాదు పరుగెత్తుకొని వెళ్ళి సమ్మెను విరమింప చేయటానికి విశ్వప్రయత్నం చేసాడు.

కేవలం వ్యతిరేక కార్యక్రమంతో ఏ వుద్యమం కూడా హెచ్చుకాలం నిలువలేదు. ఉద్యోగ విరమణ చేసినవారిలో హెచ్చుమంది మధ్య తరగతికి చెందిన వారు. తమ కుటుంబ జీవనానికి వారికి అదే ముఖ్యాధారం. వేరే ఆధారం దొరకనప్పుడు వారు తిరిగి పోగొట్టుకొన్న తమ ఉద్యోగాలకు ఎగబడక తప్పదు. వారు మనోధైర్యంతో కొంతకాలం నిలబడ గలిగినా దేశంలో అనేక లక్షలమంది నిరుద్యోగు లున్నారు. వారి ద్వారా ప్రభుత్వం తన పరిపాలనా యంత్రాంగాన్ని సాఫీగా నడుపుకొన గలదు. ఉద్యమం విఫలం కాక తప్పదు.

ఉద్యమం విజయవంతం కావాలంటే వుద్యమ ఫలితాలు వారికి గోచరించాలి. ఆర్థికంగా, రాజకీయంగా వారు పొందగలిగే హక్కులు వారికి సుస్పష్టం కావాలి. వారి గమ్యస్థానం వారికి తేటతెల్లం కావాలి. ఇందుకు అనుసరించవలసిన, అనుకూల కార్యక్రమం రూపొందించాలి. భారతదేశానికి కావలసినది ప్రజాస్వామ్య విప్లవం. కనుక యీ విప్లవ కార్యక్రమాన్ని చేపట్టవలసిన బాధ్యతను నాయకత్వం చేపట్టాలి. గాంధీ నాయకత్వం కేవలం సహాయ నిరాకరణ-వ్యతిరేక కార్యక్రమం వరకే చేపట్టినది. ప్రజలకు అవసరమయిన అనుకూల కార్యక్రమం అందులో లేదు. కనుక వుద్యమం విఫలంకాక తప్పదని రాయ్ భావించాడు. అలాగే జరిగినది.

అహమ్మదాబాదులో జాతీయ కాంగ్రెసు మహాసభ జరుగనున్నది. ఆ మహాసభకు సి. ఆర్. దాస్ అధ్యక్షునిగా ఎన్నుకొనబడ్డాడు. దాస్ తీవ్రవాది అని, గాంధీ నాయకత్వంలో విశ్వాసం లేనివాడని ప్రచారం వున్నది. రాయ్ రాజకీయ ఆర్థిక సూత్రాలకు ప్రాముఖ్యతయిచ్చి ఒక కార్యక్రమం రూపొందించి లెనిన్, స్టాలిన్‌లకు చూపగా వారు తమ సమ్మతిని ప్రకటించారు. స్టాలిన్ ఆ కార్యక్రమంలో ఒక సవరణ కూడా చేశాడు. 'వడ్డీ వ్యాపారస్థులు రైతులను పీల్చి పిప్పిచేస్తున్నారు. కనుక వడ్డీవ్యాపారం సమూలంగా నాశనం చేయాలి' అని రాయ్ కార్యక్రమంలో ఒక అంశం వున్నది.

"భారతదేశం అతి పేదదేశం. రైతులకు వేరే పరపతి సౌకర్యాలు లేనప్పుడు ఆ వున్న అవకాశం కూడా లేకుండాచేస్తే వారు తమ వ్యవసాయ ఖర్చులకు పేరే పెట్టుబడులు ఎలా సమకూర్చుకో గలుగుతారు? బంగారు గ్రుడ్లను పెట్టే బాతును చంపటం కాదా?" అని చమత్కరించాడు. స్టాలిను సలహామీద వడ్డీవ్యాపారాన్ని కంట్రోలు చేయాలని ఆరు శాతంకంటె హెచ్చు వడ్డీ వుండగూడదనే అంశాన్ని రాయ్ చేర్చాడు.

తన కార్యక్రమాన్ని రాయ్ ఒక కరపత్రరూపంలో అచ్చు వేయించాడు. అయితే ఆ కరపత్రాలను భారతదేశం పంపటం ఆయనకు ఒక పెద్ద సమస్యగా పరిణమించినది. చివరకు ఆ బాధ్యత నళినీగుప్తకు అప్పగించబడినది. నళినీగుప్త రహస్యంగా భారతదేశం చేరి వాటిని అహమ్మదాబాద్ కాంగ్రెసు ప్రతినిధులకు అందచేశాడు. భారతదేశంలోని అనేక భాషల్లో యీ కరపత్రం ముద్రితమయి పంచ బడినది. కాంగ్రెసు ప్రతినిధులతోబాటు వివిధ వర్గాలకు చెందిన మధ్య తరగతి ప్రజలు, మేధావులు కూడా ఆ కార్యక్రమానికి తమ సుముఖతను, వుత్సాహాన్ని ప్రకటించినట్లు తిరిగివచ్చిన తరువాత నళినీగుప్త రాయ్‌కు తెలియచేశాడు. దురదృష్ట వశాత్తు బ్రిటిషు ప్రభుత్వం కాంగ్రెసు మహాసభకు ముందుగానే సి. ఆర్. దాస్‌ను బంధించి కారాగార వాసుని చేసింది.

కాంగ్రెసు మహాసభలో ఒక ప్రతినిధి రాయ్ సూచించిన కార్యక్రమంతో 'సంపూర్ణ స్వాతంత్ర్య' తీర్మానం ప్రవేశ పెట్టటానికి ప్రయత్నించాడు. గాంధే యుల ఆదర్శం డొమినియను ప్రతిపత్తి కనుక ఆ తీర్మానం త్రోసివేయబడినది. అయినా రానురాను జాతీయ కాంగ్రెసులో సంపూర్ణ స్వాతంత్ర్యశక్తులు బలం చేకూర్చుకుంటూ 1929 లో నెహ్రూ అధ్యక్షతక్రింద లాహోరులో జరిగిన కాంగ్రెసు మహాసభ సంపూర్ణ స్వరాజ్యం తమ అంతిమధ్యేయంగా తీర్మానించినది.

అహమ్మదాబాదు కాంగ్రెసు మహాసభకు బూర్జువా ప్రజాస్వామిక విప్లవం, కార్యక్రమం గురించి విపులీకరిస్తూ కరపత్రం పంపుకాలంలో రాయ్ భారతదేశ చరిత్ర రచనను గురించి కూడా దీర్ఘంగా ఆలోచించసాగాడు. అయితే రష్యాలో తనకు కావలసిన చరిత్ర రచనకు సంబంధించిన ఆధారాలు లభ్యంకాలేదు. కేవలం బ్రిటిషు ప్రభుత్వ ప్రచురణలమీదనే ఆధారపడవలసి వున్నది. 1921 లో భారతదేశ జనాభా లెక్కలు కూడా పూర్తిఅయినవి. ఇంగ్లండు వెళ్లిన రష్యా వాణిజ్య

ప్రతినిధివర్గం ద్వారా భారతదేశం గురించి బ్రిటిషు ప్రభుత్వ ప్రచురణలు, రిపోర్టులు అనేకం తెప్పించాడు. వీటి ఆధారంతో భారతదేశ వర్గ సంబంధాలు, సామాజిక పరిస్థితులు, జాతీయ ఆర్థిక విధానంమీద ఒక సమగ్ర నివేదికను తయారు చేశాడు.

లెనిను, స్టాలిను, ఇతర రష్యను నాయకులు యీ నివేదికను పరిశీలించి తమ సంతృప్తిని ప్రకటించి యింకా దీర్ఘంగా, విపులంగా గ్రంథరూపంలో విశదీకరించమని రాయ్‌ని ప్రోత్సహించినందువలన మరికొన్ని వివరాలు సేకరించి రాయ్ 'పరివర్తిత ఇండియా' పేరుతో ఉద్గ్రంథాన్ని రచించాడు. మొదటి ప్రకరణలో పారిశ్రామిక అభివృద్ధిని, బూర్జువా వర్గ పాత్రను గురించి చర్చిస్తూ అందుకు సంబంధించిన అభివృద్ధి పట్టికలు, సూచికలు యివ్వబడినవి. అబానీముఖర్జీ మాస్కోలో ఇతర వ్యాపకాలు లేక కాలం వృథా పుచ్చుచుండటంచేత రాయ్ బ్రిటిషు ప్రభుత్వ నివేదికలను పరిశీలించి పట్టికలను తయారుచేయు బాధ్యత అబానీ కప్పగించాడు. భారతదేశం పారిశ్రామికంగా బాగా అభివృద్ధిచెంది విప్లవానికి సిద్ధంగా వున్నదని చూపాలనే భావంతో అబానీ పారిశ్రామిక అభివృద్ధి పట్టికలను అతిగా చూపించాడు. బ్రిటిషు ప్రభుత్వ నివేదికలు సరిగా లభించని కారణం కూడా వొకటి కావచ్చును. గ్రంథ ప్రచురణ త్వరగా జరగాలనే ఆతురతతో రాయ్ ఆ ప్రకరణ ముద్రణకు ముందు విశదంగా పరిశీలించలేదు.

కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ పబ్లికేషను డిపార్టుమెంటు మొదట యీపుస్తకాన్ని రష్యనుభాషలో ముద్రించినది. తరువాత ఇతర పాశ్చాత్య భాషలలోకూడా అనువదించబడి విశేష ప్రాముఖ్యతను పొందగలిగినది. మార్క్సిస్టు దృక్పథంతో భారతదేశచరిత్ర లిఖింపబడిన తొలి గ్రంథంగా పాశ్చాత్యులు వర్ణించారు. జర్మనీ భాషలో లక్ష ప్రతులు అచ్చు వేయబడినవి. ఇంగ్లీషు ప్రతులు అనేకం రహస్యంగా భారతదేశం పంపబడినవి. రాజకీయవాదులు, ఉపాధ్యాయులు, విద్యార్థులు పఠించారు. ఈ గ్రంథం అనేక గ్రంథాలయాలను అలంకరించినది. ప్రభుత్వం నిషేధించి యీ గ్రంథ ప్రచారాన్ని అరికట్టినది. (ఈ పుస్తకంలోని విషయాలను విశదీకరిస్తూ క్లుప్తంగా ఇదివరకే ఒక ప్రకరణ వ్రాయబడినది).

రెండవ కాంగ్రెసు మహాసభలో వలస రాజ్యాలలోని జాతీయ విమోచన ఉద్యమ కార్యక్రమంమీద లెనిన్‌తో రాయ్ భేదించాడు. భారతదేశ జాతీయ వుద్యమం గాంధీ నాయకత్వంక్రింద విప్లవయుతం కాదని, సంస్కరణవాదం అని సోదాహరణంగా

నిరూపించాడు. వలస రాజ్యాలలో విప్లవశక్తులు బూర్జువా ప్రజాస్వామిక విప్లవానికి బూర్జువావర్గ నాయకత్వాన్ని బలపరచటమే 'ప్రధాన ఆదర్శం'గా పెట్టుకొనకుండా అవసరానికి తాత్కాలిక వొప్పందంగా భావించి స్వతంత్రంగా కమ్యూనిస్టు పార్టీలను స్థాపించి విప్లవ చైతన్యం ద్వారా విప్లవ నాయకత్వాన్ని సృష్టించి వర్గ సంఘర్షణ ద్వారా కార్మిక - కర్షక - మధ్యతరగతి ప్రజానీకాన్ని యీ నాయకత్వం క్రిందకు తీసుకొనిరావటం సరియైన మార్గమని రాయ్ వాదించాడు. విదేశీ ప్రభుత్వంతోపాటు దేశీయ పెట్టుబడిదారీ వర్గంకూడా ప్రజావుద్యమాలకు భయపడి ప్రజావుద్యమాన్ని అణచటానికి పరప్రభుత్వంతో చేతులు కలుపుతుంది. రాజీపడి విదేశీ పెట్టుబడిదారీ తత్వంలో భాగస్వామి కావటానికి అంగీకరిస్తుంది. విప్లవాన్ని నాశనం చేయటానికి వెనుకాడదు. కనుక కార్మిక-కర్షకులను యీ ప్రమాదంనుంచి తప్పించి ముందుకు తీసుకొని వెళ్ళటానికి విప్లవ నాయకత్వం గల విప్లవ పార్టీ అవసరం.

ఈ భేదాభిప్రాయాలు తరువాత రష్యాలో స్టాలిను - ట్రాట్స్కీల మధ్య చైనా విప్లవంలో రాయ్ - మైకేల్ బరోడినుల మధ్య పొడ చూపినవి. రషియను నాయకులమధ్య విభేదాల వలన ఐరోపాఖండంలోని సోషలిస్టుపార్టీలకు, వలస రాజ్యాలలోని జాతీయ వుద్యమాలకు కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ సక్రమ పంథాలను సక్రమ కార్యక్రమాలను చూపలేక పోయినది. తరువాత జాతీయ ప్రభుత్వ దృక్పథాలను అంచనా వేయటంలో రష్యా - చైనా పార్టీలు తీవ్ర తప్పిదాలకు కారణభూతమైనవి. అదేవిధంగా రాను, రాను ప్రతిదేశంలోనూ కమ్యూనిస్టుపార్టీలు మితవాద - అతివాద - ఉగ్రవాద పార్టీలుగా ముక్కలు, చెక్కలు ఐపోయినవి.

## ఇండియాలో కమ్యూనిస్టు వుద్యమం :

రాయ్ మాస్కోలో వున్నా ఆలోచన అంతా భారతదేశం మీదనే వున్నది. సహాయ నిరాకరణ వుద్యమంతో, సంస్కరణతత్వంతో మాతృదేశ విముక్తి జరుగదని, విప్లవ నాయకత్వం సృష్టించాలని రాయ్ సంకల్పం. సోవియటు యూనియన్ ద్వారా భారతదేశంతో సంబంధాలు పెట్టుకొనటం తేలికయిన విషయం కాదు. రష్యా నుంచి విప్లవ కార్యక్రమం గురించి సందేశాలు, సాహిత్యం పంపటం,

అవసరమయిన ధన సహాయం చేయటం చాల చిక్కు సమస్యగా పరిణమించినది. కనుక పశ్చిమ ఐరోపాఖండం నుంచి మాతృదేశంతో సంబంధాలు కలిగించుకొనటం వుత్తమంగా భావించాడు.

మూడవ కాంగ్రెసు మహాసభ అనంతరం బెర్లిను వచ్చి అప్పటి నుంచి భారతదేశంతో సంబంధాలు యేర్పరచుకొనటానికి ప్రయత్నించాడు. బెర్లిన్ చేరగానే 1922 మే 15 న 'వాన్‌గార్డు' అనే పేరుతో ఒక పత్రిక ప్రారంభించాడు. అందులో ముఖ్యంగా భారతదేశ స్వాతంత్ర్య సముపార్జనకు అవసరమయిన వ్యాసాలు ప్రచురింపబడుతూ వుండేవి. ఆ సంవత్సరాంతంలోగా మూడు గ్రంథాలు కూడా రచించాడు. (1) పరివర్తిత భారతదేశం, (2) భారతదేశ సమస్యలు - పరిష్కార మార్గం, (3) మనకు ఏమి కావాలి ? రాయ్ తన రచనలు, 'వాన్‌గార్డు' ప్రతులు, యితర విప్లవ సాహిత్యం కోకొల్లలుగా భారతదేశంలోని వివిధ ప్రాంతాలకు రహస్యంగా పంపసాగాడు. రష్యాలో వున్నప్పుడు మధ్య ఆసియాద్వారా ఉత్తర భారత దేశంతో కొన్ని సంబంధాలు పెట్టుకొనగలిగాడు. కాని మిగిలిన భారత ప్రాంతాలు, ముఖ్యంగా బెంగాలు అనుచరులతో సంబంధాలు కల్గించుకొనటానికి రాయ్‌కి ఏ మాత్రం అవకాశం లభించలేదు. బెర్లిను వచ్చిన తరువాత మొత్తం భారతదేశం లోని ప్రముఖ విప్లవవాదులతో, కార్మిక నాయకులతో, జాతీయ కాంగ్రెసులోని సి. ఆర్. దాస్ వర్గంతో, ముఖ్యపత్రికలు, రచయితలతో సంబంధాలు పెట్టుకొనటంతో కొంతవరకు కృతకృత్యుడు కాగలిగాడు. బెర్లినులో 'లేబరు ఇన్‌ఫర్మేషను బ్యూరో' స్థాపించాడు. దాని ద్వారా ఐరోపా ఖండంలోని కార్మిక సంస్థలతో భారత కార్మిక సంఘాలకు సంబంధం ఏర్పరచాడు.

రాయ్ కృషి ఫలితంగా 1922 సంవత్సరం చివరిలో భారతదేశంలోని ముఖ్యనగరాల్లో కమ్యూనిస్టు గ్రూపులు ఏర్పడినవి. బొంబాయిలో యస్. ఎ. డాంగే, కలకత్తాలో ముజఫర్ అహమ్మద్, మద్రాసులో సింగరవేలు చెట్టియార్, లాహోరులో గులామ్ హుస్సేన్, ఉత్తరప్రదేశ్‌లో షౌకత్ ఉస్మానీ నాయకత్వాల క్రింద కమ్యూనిస్టు కార్యక్రమాలు ప్రారంభించబడ్డవి. ప్రప్రథమంగా బొంబే, కలకత్తా ప్రాంతాలలో కమ్యూనిస్టులు కార్మిక సంస్థలలో కృషి ప్రారంభించారు. వీటికి అవసరమయిన ధన సహాయం రాయ్ తాను స్వయంగా లేక కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ ద్వారా పంపుతూ వుండేవాడు.

కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ నాల్గవ కాంగ్రెసు మహాసభ 1922 నవంబరులో జరిగినది. భారత జాతీయ నాయకుల సంస్కరణ వాదం, అభివృద్ధి నిరోధక శక్తులను గురించి మహాసభలో చర్చింపబడ్డవి. రాయ్ వలస రాజ్యాలను మూడు తరగతులుగా విభజించాడు. (1) పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి చెందుతూ వర్గ చైతన్యం కల దేశాలు. (2) పెట్టుబడిదారీ వ్యవస్థ బాల్యదశలోనే వుండి జమీందారీ (ఫ్యూడల్) విధానం ప్రాబల్యం కలిగి వున్న దేశాలు. (3) జమీందారీ విధానం కూడా సరిగా అభివృద్ధి చెందక బాగా వెనుకబడి వున్న దేశాలు. భారతదేశం మొదటి తరగతికి చెందిన వలస రాజ్యం. కనుక జాతీయ విమోచన పోరాటంలో బ్రిటిషు ప్రభుత్వాన్ని కూలద్రోయటానికి మొదట్లో బూర్జువావర్గంతో కలసి సంయుక్త పోరాటం జరిపినా తదుపరి క్రింది వర్గాల హక్కుల రక్షణకు వర్గ విభజన, వర్గ సంఘర్షణ, వర్గ పోరాటం జరుగవలసి వున్నది. కాబట్టి కార్మిక - కర్షక - మధ్య తరగతి వర్గాలకు విప్లవ చైతన్యం, విప్లవభావాలు కలిగించి అంతిమ పోరాటానికి ఆ వర్గాలకు విప్లవ నాయకత్వం చేపట్టగల స్తోమతు కలిగించవలసిన అవసరం వుందని రాయ్ స్పష్టీకరించాడు.

ఈ మహాసభలో 'తూర్పుప్రాంతాల వలస రాజ్యాల కమీషన్' సూచించిన సిద్ధాంతం ఏకగ్రీవంగా ఆమోదించబడినది. ఇందులో రాయ్ కూడా సభ్యునిగా వున్నాడు. దీని ప్రకారం వలస రాజ్యాలలోని కమ్యూనిస్టు పార్టీలు, కార్యకర్తలు ద్వంద్వ కార్యక్రమం చేపట్టవలసి వున్నది. (1) బూర్జువా ప్రజాస్వామిక విప్లవానికి అవసరమయిన రాజకీయ స్వాతంత్ర్యం పొందగల కార్యక్రమం (2) కార్మిక - కర్షకులకు జాతీయ ప్రజాస్వామిక వుద్యమంలో పై, క్రింది వర్గాల వైరుధ్యాలను విశదపరచి వారిని తమ వర్గ శ్రేయస్సుకు, హక్కుల రక్షణకు సంఘటితపరచటం. ఈ సిద్ధాంతం 'వలస రాజ్యాలలోని కమ్యూనిస్టు పార్టీలు జాతీయ విమోచన పోరాటాల్లో విప్లవ వ్యతిరేకశక్తుల అడుగుజాడల్లో అయినదానికీ, కానిదానికీ గ్రుడ్డిగా అనుసరించకుండా తమ స్వతంత్ర ప్రతిపత్తిని నిలబెట్టుకొని, అవసరమైనప్పుడు కార్మిక - కర్షకులకు అండగా నిలబడి నాయకత్వం వహించాలని' హెచ్చరించింది.

కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ సూత్రప్రాయంగా తీర్మానించి యిచ్చిన సందేశమిది. కమ్యూనిస్టు పార్టీలు బూర్జువావర్గంతో జాతీయ విమోచన పోరాటల్లో ఏ పరిస్థితుల్లో, ఏ విధంగా, ఎంతవరకు సహకరించాలో, ఎప్పుడు భేదించవలసి

వుంటుందో వివరంగా చెప్పలేదు. వలసరాజ్యాలన్నీ ఒకే పరిణామంలో లేవు కనుక ఆయాదేశాల వుద్యమాల ననుసరించి అచ్చటిబూర్జువా వర్గాల పాత్రల ననుసరించి కమ్యూనిస్టు పార్టీలు తమ కార్యక్రమాలు స్వతంత్రంగా నిర్ణయించుకొనవలసి వున్నది. 'బూర్జువా వర్గం వలసరాజ్యాల్లో విధిగా విప్లవవ్యతిరేక పాత్రనిర్వహిస్తుంది' అని రాయ్ వాదిస్తూనే వచ్చాడు. కాని కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ దీనినంత ప్రధానంగా పరిగణించ లేదు. ఐరోపాఖండంలోని పారిశ్రామిక విప్లవం, బూర్జువా వర్గపాత్ర కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ నాయకుల కనుచూపుల నుంచి అదృశ్యం కాలేదు. కనుక భారతదేశంలో కూడా బూర్జువావర్గం విప్లవ వ్యతిరేక పంథా చేపట్ట దనే గాఢ విశ్వాసంలోనే వున్నారు. బూర్జువావర్గంతో సహకరించినందువలన కమ్యూనిస్టుపార్టీ గానీ కార్మిక - కర్షక వుద్యమం గానీ బలహీన పడదనే భావం వారిలో ప్రబలంగా నిలిచిపోయినది. కనుక రాయ్ వాదనకు తగిన మద్దతు లభించలేదు.

ఇంతమాత్రంచేత కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌లో రాయ్ విలువ తగ్గ లేదు. కొలదికాలంలోనే రాయ్ కృషి వలన భారతదేశంలో జరిగిన కమ్యూనిస్టు వుద్యమ అభివృద్ధికి సంతృప్తిని ప్రకటించి ఆయనను ప్రధాన నాయకునిగా పరిగ ణించినది. దీనికి తార్కాణంగా నాల్గవ కాంగ్రెసు మహాసభలో మొదట కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ కార్యనిర్వాహకవర్గంలో ఆనరరీ సభ్యునిగా, తరువాత వోటింగు హక్కు గల సభ్యునిగా ఎన్నుకొనబడ్డాడు. (కాంగ్రెసు మహాసభల మధ్యకాలంలో యీ కార్యనిర్వాహకవర్గం అన్ని అధికారాలు కలిగి కమ్యూనిస్టుపార్టీల నిర్వహణ భాధ్యత వహిస్తూ వుంటుంది.) తూర్పు వలస రాజ్యాల కమిషన్‌లో సభ్యునిగా ఎన్నుకొనబడ్డాడు. 1923 జూన్‌లో రాయ్ కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ ప్రెసిడియమ్ సభ్యునిగా కూడా ఎన్నుకొనబడ్డాడు. ఈ ప్రెసిడియమ్ కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌లో అత్యుత్తమ స్థానాన్ని అలంకరించి కార్యనిర్వాహకవర్గ సమావేశాల మధ్యకాలంలో తఱచుగా సమావేశ మవుతూ పార్టీ సిద్ధాంతాలు, కార్యక్రమాలు నిర్ణయిస్తూ వుంటుంది.

భారతదేశంలో కమ్యూనిస్టు పార్టీ బలవత్తరం కాకపోయినా దేశం నలు మూలలా కమ్యూనిస్టు గ్రూపులు యేర్పడటంతో బ్రిటిషు ప్రభుత్వం కొంత ఆందోళనకు గురిఅయి కమ్యూనిస్టు చర్యలను అరికట్టటానికి నిశ్చయించుకొన్నది. తాష్కెంటు, మధ్య ఆసియా నుంచి విదేశాలలో వున్న భారత కమ్యూనిస్టులు మాత్ర

దేశంలో, వాయువ్య సరిహద్దు రాష్ట్రాలలో ప్రవేశించి విప్లవచర్యలు ప్రారంభించారు. ప్యాస్‌పోర్టులు లేవనే నెపంతో కొంతమంది, బ్రిటిషు ప్రభుత్వం మీద తిరుగు బాటును ప్రోత్సహిస్తున్నారనే నెపంతో మరికొంతమంది నిర్బంధించబడ్డారు. ఇది 'పెషావరు కుట్రకేసు'గా 1923 లో ప్రసిద్ధి కెక్కినది. ఇందులో కొంతమంది కారాగారవాస శిక్షలకు గురి అయ్యారు. పాకిస్తాన్ అవతరణ తరువాత ఇందులో కొందరు పాకిస్తాన్ కమ్యూనిస్టు పార్టీ సభ్యులుగా తమ జీవితం సాగించారు.

భారతదేశంలో డాంగే, ముజఫర్ అహమ్మద్, నళినీగుప్త, షౌకత్ ఉస్మానీ, మరికొందరు బంధించబడ్డారు. ఇది 'కాన్పూర్ కుట్రకేసు'గా ప్రసిద్ధి కెక్కినది. ఇందులో రాయ్ కూడా ఒక ముద్దాయి. రాయ్ దేశాంతరవాసి కావటంచేత ఆయనమీద కేసు అలాగే వుంచి మిగిలిన వారిని శిక్షించటం జరిగినది. ఈవిధంగా మొత్తం భారతదేశంలో ప్రభుత్వ దమనచర్యల ఫలితంగా తాత్కాలికంగా కమ్యూనిస్టు వుద్యమం తగ్గుముఖం పట్టినది. కాని రాయ్ తన కృషిని సాగిస్తూనే వచ్చాడు. రహస్యంగా కమ్యూనిస్టులు తమ అస్తిత్వాన్ని నిలుపుకుంటూ జాతీయ కాంగ్రెసులో చేరి బాహాటంగా కార్మిక - కర్షక హక్కుల కొరకు వుద్యమాన్ని కొనసాగించాలని, జాతీయ కాంగ్రెసును ప్రజా వుద్యమ సంస్థగా మార్చటానికి ప్రయత్నించాలని రహస్య వుత్తరాలు, అనుచరులద్వారా సందేశాలు పంపుతూ వచ్చాడు.

ప్రభుత్వ దమన నీతికి గురికాకుండా ప్రభుత్వము గుర్తింపును పొందగల రాజకీయ పార్టీ స్థాపన అవసరమని, దాని వెనుక కమ్యూనిస్టులు రహస్యంగా కృషిజరుపుతూ వుండాలని రాయ్ భారత విప్లవవాదులకు మాస్కోనుంచి తరువాత బెర్లిను, యితర పాశ్చాత్య దేశాలనుంచి సందేశాలు పంపుతూనే వచ్చాడు. 1922 లో రహస్యంగా సమావేశమయిన వలస రాజ్యాల కమీషన్‌కు రాయ్ ఒక నివేదిక సమర్పించాడు. జాతీయ వుద్యమాన్ని, కార్మిక - కర్షక సంఘాలను సమన్వయ పరచి 'సంయుక్త పోరాటాని'కి సంఘటితం చేయాలనేదే దాని సారాంశం. కమీషన్ అంగీకారంతో భారతదేశములోని వివిధ కమ్యూనిస్టు గ్రూపులకు, నాయకులకు యీ కార్యక్రమాన్ని ఉత్తరాలు - వార్తాహరులద్వారా తెలియబరుస్తూ జాతీయ కాంగ్రెసు, కార్మిక - కర్షక వుద్యమాలు, ఖిలాఫత్ వుద్యమం, సిక్కు వుద్యమం మొదలైన అన్ని వుద్యమాలలోని వామ పక్షములతో అఖిల భారత రాడికల్ పార్టీ లేక కార్మిక, కర్షకపార్టీ లేక ప్రజాపార్టీని స్థాపించటానికి ప్రయత్నిం

చాలని అది అసాధ్యంగా కనబడినప్పుడు జాతీయ కాంగ్రెస్‌లోనే వామపక్షంగా కృషిచేయాలని సందేశాలు పంపాడు. డాంగే, ముజఫర్ అహమ్మద్, ఇతర కమ్యూనిస్టు నాయకులకు కూడా ఇదే విధంగా ఉత్తరాలు వ్రాసాడు. '1924 కాన్‌పూర్ కుట్రకేసు'లో కమ్యూనిస్టులు బహిరంగంగా కృషిసాగించి ఉద్యమాన్ని పెంపొందించటం సాధ్యపడదని తేలటంతో రాయ్ 1924 జూన్‌లో జరిగిన 5-వ కాంగ్రెసు మహాసభలో తన వాదాన్ని పునరుద్ఘాటించాడు.

భారతదేశంలోని ప్రజా ఉద్యమం విదేశీ పెట్టుబడిదారులు, అంతకంటె మిన్నగా దేశీయ పెట్టుబడిదారీ వర్గానికి వ్యతిరేకంగా కేంద్రీకరించబడాలని, తత్ఫలితంగా దేశీయ బూర్జువావర్గం తమ రక్షణకు సామ్రాజ్యవాదుల సహాయం కోరక తప్పదని కనుక ప్రస్తుత పరిస్థితులలో వర్గపోరాటాన్ని తీవ్రతరం చేయటానికి భారత కమ్యూనిస్టులు కార్మిక - కర్షక - పెట్టీ బూర్జువా వర్గాలతో సరాసరి సంబంధాలు పెట్టుకొని వారిని సంఘటిత పరచవలసిన సమయం ఆసన్నమయినదని రాయ్ వాదించాడు. కాని కొంతమంది రషియన్ కమ్యూనిస్టు నాయకులు దీనిని వ్యతిరేకించారు.

"రాయ్ చెప్పినంతగా భారతదేశంలో బూర్జువావర్గం (కాపిటలిజం) పెంపొందలేదు. వర్గపోరాటం అంతకంటెనూ లేదు. బూర్జువావర్గం కోరే స్వయం నిర్ణయ హక్కు విప్లవ ఉద్యమానికి ఏ మాత్రం అవరోధం కాజాలదు," అని "వలస రాజ్యాలలోని కమ్యూనిస్టు ఉద్యమాలు వేటికవి, స్వతంత్రించి పనిచేయటం భావ్యంకాదు. అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమాలు థర్డు ఇంటర్నేషనల్ అదుపు ఆజ్ఞలకు అనుగుణంగా వ్యవహరించటం అవసరం," అని తమ వాదనను వారు సమర్థించుకున్నారు.

రషియన్ నాయకులు రాయ్ వాదనను, అభిప్రాయాలను వ్యతిరేకించటానికి ఇతర కారణాలు కూడా కొన్ని లేకపోలేదు. రాయ్ రష్యాలో, థర్డు ఇంటర్నేషనల్‌లో, భారత కమ్యూనిస్టు స్థాపన, ప్రచారంలో ప్రముఖవ్యక్తిగా చలామణి కావటం బెర్లిన్ కమిటీ సభ్యులను రష్యా గుర్తించకపోవటం ఆ కమిటీ నాయకులయిన వీరేంద్రనాథ చటోపాధ్యాయ, భూపేంద్రనాథ్ తదితర భారత కమ్యూనిస్టులకు కంటగింపుగా పరిణమించినది. లోగడ రాయ్ అనుచరుడుగావున్న అబానీ ముఖర్జీ పాత్ర గూఢాయిందులో బాగావున్నది. రాయ్ రచించిన 'పరివర్తిత భారత

దేశం' గ్రంథానికి అబానీ కొంతవరకు సహకరించాడు. కాని ఆ రచన మొత్తం తనదేనని అతడు వాదించటం, చివరకు ఆ వాదన అబద్ధంగా తేలిపోవటంతో అప్పటినుంచి అబానీ రాయ్‌కి వ్యతిరేక ప్రచారం సాగించాడు. అందుకు ప్రతి ఫలంగా అన్నట్లు అబానీని 'బ్రిటిషు ప్రభుత్వ గూఢచారి'గా రషియన్ నాయకుల ముందు నేరారోపణచేసిన చటోపాధ్యాయ వగైరాలు తరువాత ఆతనిని వెనుకటి సంఘటనలు మరచి ఆప్యాయతతో తమ సహచరునిగా, విశ్వాసపాత్రునిగా దగ్గరకు చేర్చుకొనటం మరీ వింత సంఘటన. వీరందరు కలిసికట్టుగా, వేరు వేరుగా రషియన్ నాయకులకు రాయ్‌ని గురించి, ఆయన కార్యకలాపాలగురించి వ్యతిరేక ప్రచారం చేయటానికి తీవ్రకృషి జరిపి మొదట కొంతవరకు సఫలీకృతులయ్యారు.

"ఏది జరుగాలన్నా కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ రష్యను ప్రభుత్వ అనుమతిమీద ఆధారపడటం విచారకరం....రష్యను ప్రభుత్వ ఆర్థిక సహాయం లేనిదే కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ వలస రాజ్యాల్లోని జాతీయ విమోచన వుద్యమాలకు సహాయం చేయగల స్థితిలో లేకపోవటమే ఇందుకు ప్రధానకారణం" అని ఎవెలిన్ (రాయ్ మొదటి భార్య) ఒక నివేదికలో విమర్శించటం కూడా జరిగినది.

రాయ్ తన 'ఆత్మకథ'లో మొదటి భార్య ఎవెలిన్ గురించి ఏ మాత్రం కూడా ఉల్లేఖించక పోవటం చాల అనూహ్యమయిన విషయం. ఈమె అమెరికా వనిత. విశ్వవిద్యాలయ విద్యార్థినిగా వున్నప్పుడే యీమెతో రాయ్‌కి పరిచయ మేర్పడినది. శాన్‌ఫ్రాన్సిస్కో నుంచి రాయ్ న్యూయార్కు వచ్చినప్పుడు ఎవెలిన్ కూడా అక్కడకు వచ్చినది. తరువాత వీరి వివాహం కూడా జరిగినది. 1926 వరకు, ఎవెలిన్ రాయ్‌తో కలసి మెలసి జీవిస్తూ కమ్యూనిస్టు రాజకీయాల్లో, రాయ్ రాజకీయ చరిత్రలో ప్రముఖపాత్ర వహించి రాయ్‌ని ఎంతో ప్రభావితుని చేసినట్లు కనబడు తుంది. 1926 లో వీరిద్దరూ విడిపోయారు.

వలస రాజ్యాలలోని విమోచన ఉద్యమాలలో కమ్యూనిస్టులు పైవర్గాలతో కలిసి కృషిచేయాలి. అయితే ఆ ఐక్యసంఘటన ఎంతవరకు, ఏవిధంగా అనే విష యంలో భేదాభిప్రాయాలు పొడసూపినవి. బూర్జువావర్గం ప్రజాస్వామిక విప్లవం కొరకు, విదేశీ ప్రభుత్వ పతనానికి కృషిచేస్తుంది. కాబట్టి యిది విప్లవ వర్గంగనుక కమ్యూనిస్టులు ఆ వర్గంతోకలిసి పనిచేయటం సక్రమమేనని రష్యను కమ్యూనిస్టుల అభిప్రాయం. భారతదేశంలో పెట్టుబడులు కొంతవరకు అభివృద్ధి చెందివుండటంచేత

దేశీయ బూర్జువావర్గం తమ వర్గ ప్రయోజనాలకే కార్మిక - కర్షకులను వినియోగించు కొనటానికి ప్రయత్నిస్తుందని, కాగా వర్గపోరాటాన్ని అణచటానికి విదేశీ ప్రభుత్వంతో చేతులు కలపటానికి సిద్ధపడుతుందేకాని ప్రజాస్వామిక విప్లవాన్ని విజయవంతంచేసి కార్మిక - కర్షకుల హక్కుల రక్షణకు నిలబడదని, అట్టిపరిస్థితులలో కమ్యూనిస్టులు నాయకత్వం వహించి ప్రజల వుద్యమాన్ని సాగించి ప్రజాస్వామిక విప్లవం జయ ప్రదం చేయగల సమర్ధతను కలిగివుండాలని రాయ్ అభిప్రాయం.

మార్క్సు సిద్ధాంతం ప్రకారం కాపిటలిజం అభివృద్ధి చెందిన ఐరోపా ఖండంలో, ప్రధానంగా ఇంగ్లండు, జర్మనీ దేశాలలో ప్రోలిటేరియన్ కార్మిక నియంతృత్వాలు రాలేదు. దీనికి కారణం వలస రాజ్యాలతో గడించుకున్న అధిక లాభాలలో కొంత శాతం కాపిటలిస్టులు తమ మాతృదేశాలలోని కార్మికులకు "గృహ వసతులు, ఆరోగ్య సౌకర్యాలు, జీతాల పెంపుదల" మొదలైన రక్షణలు కల్పించి వారి విప్లవశక్తిని కుదించటంగా చూపబడ్డది. కనుక ముందుగా వలస రాజ్యాలలో తమ కృషిని కేంద్రీకరించాలని రష్యను కమ్యూనిస్టులు, కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ నాయకులు భావించారు.

"వలస రాజ్యాలలో వర్గ కలహం పెంచితే సామ్రాజ్యతత్వ కూకటి వేళ్లనే పెకలించి వేయవచ్చును. వలస దేశాలలో ప్రజాస్వామిక విప్లవం విజయ వంతం కావటం కాపిటలిస్టు దేశాల లాభాలను అరికట్టటమే. అట్టి పరిస్థితులలో అచ్చటి కార్మికవర్గాలకు కాపిటలిస్టులు అదనపు సౌకర్యాలు చేకూర్చగల స్థితిలో వుండరు. కనుక సామ్రాజ్యదేశాలలోని కార్మికవర్గం 'ప్రోలిటేరియన్ నియం తృత్వాన్ని' విధిగా సాధించి తీరుతుంది." ఇది 5వ కాంగ్రెసు రూపొందించిన నూతన సిద్ధాంతం.

కారల్ మార్క్సు 19వ శతాబ్దంలోనే 'బ్రిటిషు కార్మికులు స్వతంత్రులు కావాలంటే ముందుగా ఐర్లండు కార్మికులను స్వతంత్రులు చేయాలని' సూచించాడు. భారతదేశం గురించి వ్రాసిన వ్యాసాలలో (ఉత్తరాలు) కూడా అచ్చటి కార్మికులు ముందుగా స్వతంత్రులు కావాలని వ్రాసాడు. అదేవిధంగా తరువాత కొంతమంది నాయకులు 'బ్రిటిషు కార్మికులు స్వతంత్రులు కావాలంటే బ్రిటిషు వలస ప్రాంతాల కార్మికులు ముందు స్వతంత్రులు కావటం అవసరమని' వాదించారు. 'బ్రిటిషు



సామ్రాజ్యవాదాన్ని అఫ్గనిస్తాన్, ఇండియా దేశాలలో 'ఎదిరించాల'ని కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ 5 వ కాంగ్రెసు తీర్మానించినది.

రాయ్ రెండవ కాంగ్రెసు మహాసభలోనే తన సిద్ధాంతాన్ని సమర్థించు కుంటూ అంతర్జాతీయంగా కమ్యూనిజం విజయవంతం కావాలంటే వలస ప్రాంతాలయిన తూర్పుదేశాలలో ముఖ్యంగా భారత, చైనా దేశాలలో కమ్యూనిజం విజయం పొందటం మీద ఆధారపడి వుంటుందని చెప్పాడు. అప్పుడు రాయ్ వాదన అతిగా వున్నదని లెనిన్ అభిప్రాయపడినా చివరకు ఆయన వాదానికి కూడా తగిన స్థానమిచ్చి "వలస రాజ్యాలలో ప్రజాస్వామ్య విప్లవాలతోబాటు కాపిటలిస్టు దేశాలలో ప్రోలిటేరియన్ నియంతృత్వం కూడ సాధించినప్పుడే ఐరోపా ఖండంలో కాపిటలిజం పతనం చెందుతుంది" అని తన అభిప్రాయం వ్యక్తపరచాడు.

ఐదవ కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ కాంగ్రెస్ మహాసభలో ముఖ్యంగా రాయ్ అభిప్రాయాలను మానల్స్కీ వ్యతిరేకించాడు. జాతీయ విమోచన వుద్యమంలో కమ్యూనిస్టులు అనుసరించవలసిన విధానం గురించి స్పష్టీకరించటానికి ఒక ఉపసంఘం నియమించబడినది. ఇందులో స్టాలిన్, బుఖారిన్, రాయ్, మానల్స్కీ సభ్యులు వీరికి ఒక ప్రణాళిక సిద్ధం చేయవలసిన బాధ్యత అప్పగించబడినది.

ఈ కాంగ్రెసు తీర్మానానుసారం కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ ఒకే కాలంలో రెండు కార్యాలను సాధించవలసివున్నది. (1) వలస రాజ్యాలలో కమ్యూనిస్టు పార్టీలను నిర్మించటం. (2) సామ్రాజ్యవాదంతో పోరాటం సాగిస్తున్న జాతీయ వుద్యమాలకు అన్నివిధాల సహకరించటం. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ కార్యనిర్వాహకవర్గం జాతీయ వుద్యమాలతో సరాసరి సంబంధాలు పెట్టుకోవాలని కూడా తీర్మానించబడ్డది. కాని రాయ్ సూచించిన 'జాతీయ వుద్యమాలకు ఏవిధంగా, ఎంతవరకు, ఎట్టిపరిస్థితులలో కమ్యూనిస్టులు అండగా నిలబడి వుద్యమం సాగించాలి' అనే అంశం అపరిష్కృతంగానే నిలచిపోయినది. 1927 లో చైనా విప్లవం పరాజయంపొందిన తరువాత ప్రజాస్వామ్య విప్లవ వుద్యమానికి దేశీయ బూర్జువా వర్గంకోరే 'స్వయం నిర్ణయహక్కు' అవరోధమా అనే ప్రశ్న పునరాలోచించటం జరిగినది.

5 వ కాంగ్రెసు మహాసభ అనంతరం కూడా రాయ్ భారతదేశంలో ప్రజా పార్టీని స్థాపించవలసిన అవసరం వుందని, కమ్యూనిస్టు రహస్య కార్యక్రమా

లను బ్రిటిషు ప్రభుత్వంతోపాటు దేశీయ పెట్టుబడిదారీవర్గం కూడా అనుమతించదని, అజ్ఞానంలోవున్న ప్రజాబాహుళ్యం అట్టి పార్టీని సమర్థించగల స్థితిలో లేదని కనుక అన్నివర్గాలకు సమ్మతిని పొందగల మధ్యేమార్గ కార్యక్రమంతో ప్రజాపార్టీని నిర్మించటం అవసరమని స్పష్టీకరిస్తూనే వచ్చాడు. రాయ్ తన వాదాన్ని సమర్థించుతూ 1926 లో "భారతదేశ రాజకీయ భవిష్యత్తు" అని ఒక గ్రంథం కూడా ప్రచురించాడు.

1924 డిశంబరులో బెల్గాములో గాంధీ అధ్యక్షతక్రింద జరిగిన జాతీయ కాంగ్రెసు మహాసభకు ఒక విజ్ఞాపన పత్రం (మ్యానిఫెస్టో) పంపించాడు. అందులో కాంగ్రెసు విప్లవ పంథాను చేపట్టాలని విజ్ఞప్తిచేస్తూ అందుకు చేపట్టవలసిన కార్యక్రమం సూచించాడు. జాతీయ నాయకులు సంస్కరణవాదాన్ని విడనాడాలని హెచ్చరించాడు. వారు బ్రిటిషు ప్రభుత్వంకంటె, తర్వాత రాగల విప్లవాన్ని చూచి భయపడుచున్నారని విమర్శించాడు. విప్లవ కార్యక్రమం అనుసరించినప్పుడే ఉద్యమం ప్రజావుద్యమంగా రూపొంది బలవత్తరం కాగలదని సలహాయిచ్చాడు.

"మనం కోరే స్వాతంత్ర్యం జమీందారీ విధానాన్ని రద్దుపరచాలి. భూమి, గనులు, యితర దేశసంపదనంతా జాతి సంపదగా పరిగణించాలి. కర్షకులకు-సేద్యానికి మాత్రమే—భూమిమీద హక్కువుండాలి. కార్మికులకు జీవనభృతికి తగిన వేతనాలు, పనిలో కాలపరిమితి, ఇతర కుటుంబ సౌకర్యాలు కలిగించాలి. మత, ప్రార్థనా, వాక్ స్వాతంత్ర్యాలు వుండాలి. ఈ కనిష్ఠ కార్యక్రమం కలిగి వున్న ప్రజాపార్టీగా జాతీయ కాంగ్రెసును రూపొందించాలని బెల్గాము జాతీయ కాంగ్రెసు మహాసభకు విజ్ఞప్తి చేస్తూ రాయ్ ఒక కరపత్రం పంపాడు.

# భారత కమ్యూనిస్టు పార్టీ

మొట్టమొదటగా 1925 డిశంబరులో కాన్పూరులో భారత కమ్యూనిస్టు పార్టీ స్థాపన జరిగినది. ఇందుకు సత్యభక్త అను పేరు గల ఒక వ్యక్తి ప్రధాన కారకుడు. ఈయన అసలు పేరు ఎవరికీ తెలియదు. కొంతకాలం గాంధీ మహాత్ముని సబర్మతీ ఆశ్రమంలో వుండి యీ పేరు పెట్టుకున్నాడు.

కమ్యూనిస్టు పార్టీ ప్రారంభోత్సవానికి దేశంలోని వివిధప్రాంతాల నుంచి, వివిధ రాష్ట్రాలలోని కమ్యూనిస్టు గ్రూపుల నాయకులు హాజరయ్యారు. డాంగే జైలులో వున్నాడు. ముజఫర్ అహమ్మద్ అనారోగ్య కారణంగా జైలు నుంచి విడుదల కావటంచేత ఆయన కూడా హాజరయ్యాడు. రాయ్ పాశ్చాత్యదేశాల నుంచి కమ్యూనిస్టు వుద్యమ నిర్మాణానికి అహమ్మద్‌కు అనేక పర్యాయాలు ధనం, విప్లవ సాహిత్యం, ఆదేశాలు పంపుతూ వచ్చాడు. రాయ్‌తో హెచ్చు సంబంధం కలిగి వున్న వారిలో అహమ్మద్ వొకరు.

సత్యభక్త పార్టీ ప్రారంభోత్సవంలో ప్రధాన బాధ్యునిగా ప్రవర్తించాడు. దేశంలోని వివిధప్రాంతాలలోని కమ్యూనిస్టు గ్రూపులను, సభ్యుల సంఖ్యను, కార్య కలాపాలను ఒక నివేదిక రూపంలో ప్రతినిధుల ముందు వుంచినప్పుడు ఆయనమీద కొంతమందికి అనుమానం కలిగినది. కమ్యూనిస్టు పార్టీని కమ్యూనిస్టు ఇంట ర్నేషనల్‌కు అనుబంధ సంస్థగా ఏర్పరచాలని ప్రతినిధులు సూచించినప్పుడు సత్యభక్త వ్యతిరేకించి 'భారత కమ్యూనిస్టు పార్టీ' పేరుతో స్వతంత్ర సంస్థగా వుండాలని వాదించాడు. భేదాభిప్రాయాలు వచ్చినవి. సత్యభక్తను ఎవరూ సమర్ధించక పోవటంతో ఆయన ఆ సమావేశాన్ని విడచి బయటకు వచ్చాడు. అయినా కార్యనిర్వాహక వర్గంలో సత్యభక్త పేరు కూడా చేర్చబడినది. ఉత్తరప్రదేశ్ పార్టీ విభాగానికి సత్యభక్త ప్రధాన కార్యదర్శిగా ఎన్నుకొనబడ్డాడు. సత్యభక్త వీటిని అంగీకరించలేదు. కార్యనిర్వాహకవర్గ సభ్యత్వానికి రాజీనామా యిచ్చాడు. ఉత్తర ప్రదేశ్ కమ్యూనిస్టు పార్టీ విభాగాన్ని 'సామవాదిదళ్'గా పేరు మార్చాడు. రాయ్ కాన్పూరులో జరిగిన కమ్యూనిస్టుల సమావేశ వార్తలను తెలుసుకొని సత్యభక్త బ్రిటిషు గూఢచారి అని భారత కమ్యూనిస్టులకు వర్తమానం పంపాడు. చివరకు 1926 ఏప్రియల్ మాసంలో సత్యభక్త, ఆయన అనుచరులు కమ్యూనిస్టు పార్టీ నుంచి బహిష్కరింపబడ్డారు.

భారత కమ్యూనిస్టు పార్టీ స్థాపన జరిగినందులకు రాయ్ పార్టీనాయకులను అభినందించాడు. పార్టీ ప్రారంభోత్సవం, కార్యనిర్వాహకవర్గ నిర్మాణం బహి రంగంగా జరిపినందులకు పార్టీ భవిష్యత్తునుగురించి రాయ్‌కి కొన్నిసందేహాలు కలుగకపోలేదు. 1926 మార్చిలో రాయ్ భారతదేశంలో ఒక మిత్రునికి ఉత్తరం వ్రాస్తూ 'బ్రిటిషు ప్రభుత్వం కమ్యూనిస్టు పార్టీని, పార్టీ కార్యక్రమాలను ఆక్టే

కొనసాగనివ్వదు. దమననీతి చేపట్టి పార్టీని అణచటానికి పాల్పడినా ఆశ్చర్యపడ నక్కర్లేదు. కనుక పార్టీ చెల్లాచెదరు కాకమునుపే అనుబంధంగా రహస్య పార్టీ యంత్రాంగాన్ని నిర్మించుకొనటం అవసరం' అని హెచ్చరించాడు.

మొదట భారత కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కార్యాలయం బొంబాయిలో వుండేది. 1926 మేలో యీ కేంద్రకార్యాలయం ఢిల్లీకి మార్చబడినది. అప్పుడు కూడా రాయ్ తన అసమ్మతిని తెలుపుతూ ఉత్తరాలు వ్రాసాడు. "ఢిల్లీ - ప్రభుత్వానికీ, పార్లమెంటరీ పార్టీలకు కేంద్రం. మనది కార్మిక సంస్థ కనుక కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కార్యాలయం కార్మికులు ప్రధానంగావుండే బొంబాయి లేక కలకత్తా నగరాల్లో వుండాలని" తన అభిప్రాయం వ్యక్తీకరించాడు.

1921 నుంచి రాయ్ భారతదేశంలో కమ్యూనిస్టు వుద్యమ అభివృద్ధికి, పార్టీ నిర్మాణానికి తీవ్రకృషి జరుపుతూనే వచ్చాడు. సుబోధ రాయ్ అప్పటి బ్రిటిషు ప్రభుత్వ హోమ్ డిపార్టుమెంటులోని రహస్య పత్రాల ఆధారంగా ప్రచురించిన 'భారతదేశంలో కమ్యూనిజం' అనే పుస్తకం పరిశీలిస్తే రాయ్ అనుచరించిన పద్ధతులు, చేసిన ధనసహాయం కొంతవరకు విదితం కాగలదు. ప్రస్తుత భారత కమ్యూనిస్టుపార్టీ నాయకులలో వొకరయిన జి. అధికారి రచించిన 'భారత కమ్యూనిస్టు పార్టీ చరిత్ర'లో కూడ రాయ్‌ని గురించి పలుచోట్ల ఉల్లేఖించబడినది.

(1) రహమత్ అలీ జకరియా:– బెర్లిన్ యూనివర్శిటీ విద్యార్థులలో వొకరు. మాస్కోలో బోల్షివిక్ ఏజంటుగా శిక్షణ పొందాడు. రాయ్ ఆదేశం ప్రకారం 1923 లో మాస్కోనుంచి బెర్లినువచ్చి రాయ్ అనుచరునిగా కృషి సాగించాడు. కమ్యూనిస్టు సాహిత్యం ప్రధానమయిన పెక్కు భారత భాషలలో అనువదించి భారత విప్లవ వాదులకు పంపు బాధ్యత రహమత్ వహించాడు.

(2) దేశద్రోహ నేరం క్రింద యీ క్రింద సూచించిన వారిని బెర్లిను నుంచి భారతదేశం చేరగానే నిర్బంధించటానికి ప్రభుత్వం నిర్ణయించుకున్నది.

(1) మహమ్మద్ అలీ, (2) యమ్. పి. తిరుమల ఆచార్య, (3) అబానీ ముఖర్జీ, (4) వీరేంద్రనాధ్ చటోపాధ్యాయ, (5) చంపకరమణ పిళ్ళె, (6) రహమత్‌అలీ జకరియ. యమ్. యన్. రాయ్ విషయంలో కావ్పూరు

కేసులో వున్న అభియోగాన్ని అమలుపరచాలని ప్రభుత్వం కృతనిశ్చయంతో వున్నది.

(3) బెర్లినులో స్థాపించిన 'ఇండియా లీగు' కేవలం సామ్రాజ్య ప్రభుత్వాన్ని కూలద్రోయటానికే ఆదర్శంగా పెట్టుకొని కృషి చేయుచున్నది. 'ఈ లీగుతో కలిసి పనిచేయటానికి రషియన్ ట్రేడ్ యూనియన్ కార్మికసంఘాలు అనుమతించినవి. అఖిల భారత ట్రేడ్ యూనియన్ కూడా దీనికి అనుబంధంగా కృషి చేయటానికి అంగీకరింప చేయాలి' అని బెర్లిను నుంచి భారత కార్మికులకు తాఖీదులు పంపబడ్డవి.

ఈ ఉత్తరాలు వైపు చేసిన పద్ధతి, కాగితాలు, కవర్లు అన్నీ తనిఖీ చేయగా లోగడ పేరు గాంచిన యమ్. యన్. రాయ్ పంపిన వాటిని పోలివున్నవి. ప్రస్తుతం ఆయన బెర్లినులోనే వున్నాడు.

లీగు కార్యనిర్వాహకవర్గం సంపూర్ణ స్వరాజ్యమే అంతిమ ఆదర్శంగా చూపి అందుకు సామ్రాజ్యవాదానికి వ్యతిరేక పోరాటం సాగించాలని కృతనిశ్చయంతో వున్నట్లు తీర్మానించినది. పరప్రభుత్వం క్రింద కార్మిక - కర్షకుల అభివృద్ధి అసంభవం. భారతదేశం బ్రిటిషు అధికారం క్రింద వున్నంతకాలం ప్రపంచంలో శాంతిగాని, నిరాయుధీకరణగానీ జరుగదు. కనుక ప్రభుత్వాన్ని కూలద్రోయటమే అంతిమ ఆదర్శంగా భావిస్తున్నది.

(4) అఖిల భారత కార్మిక - కర్షక పార్టీ స్థాపన యత్నంలో ఫిలిప్ స్ప్రాట్ ప్రముఖపాత్ర వహించాడు. కమ్యూనిస్టుల తిరుగుబాటుకు యమ్. యన్. రాయ్, ఇతర కమ్యూనిస్టు నాయకులు విదేశాల నుంచి, ఎప్పటినుంచో యిచ్చటి తీవ్రవాదులతో, కమ్యూనిస్టులతో సంబంధాలు పెట్టుకొని వుద్యమాన్ని తీవ్రతరం చేయటానికి ప్రయత్నాలు సాగిస్తూనే వున్నారు.

ఇచ్చట యీ పార్టీ స్థాపనలో యమ్. యన్. రాయ్ ప్రయత్నాలు ఫలించకపోయినా పారిశ్రామిక కేంద్రాలలోని కార్మికుల అసంతృప్తిని, సమ్మెలను, తిరుగుబాటును ఆధారంగా తీసుకొని సోవియటు నాయకులు క్రొత్త పద్ధతులలో వుద్యమాన్ని ఉధృతం చేయటానికి ప్రయత్నించవచ్చును.

(6) యమ్. యన్. రాయ్ భారతదేశ కమ్యూనిస్టులకు విదేశాల నుంచి ధన సహాయం చేస్తూ యిచ్చుట వుద్యమాన్ని పెంపొందించటానికి ప్రయత్నిస్తూనే వున్నాడు.

ముజఫర్ అహమ్మద్, ఆర్. సి. యల్. శర్మ, సింగరవేలు, జె. పి. బేగర్‌హాట్టా మొదలయిన కమ్యూనిస్టులకు డ్రాఫ్టులు ద్వారా సొమ్ము పంపటం జరిగినది.

ఇవి అప్పటి ప్రభుత్వం తమ గూఢచారుల ద్వారా తెలుసుకొని తయారు చేసిన రహస్య నివేదికలనుంచి, విదేశాలనుంచి, ముఖ్యంగా బెర్లిను నుంచి రాయ్ భారతదేశంలోని కమ్యూనిస్టు వుద్యమ అభివృద్ధికి, స్థాపనకు జరిపిన కృషిని తెలుసుకొనుటకు కొన్ని సంఘటనలు మాత్రమే. ప్రభుత్వానికి, గూఢచారులకు కూడా తెలియకుండానే ప్రత్యేక వార్తాహరుల ద్వారా రాయ్ కరపత్రాలు, విజ్ఞాపనలు, సందేశాలు పంపుతూ భారత కమ్యూనిస్టులకు వారి ద్వారానే ధనం కూడా పంపిన ఘట్టాలు ఇంకా చాల వున్నవని భావించటంలో అతిశయోక్తి ఏ మాత్రం లేదు. ప్రభుత్వం ఆచూకీ తీయగలిగినప్పుడు విప్లవ సాహిత్యం, ధనం వశపరచుకొన్నది. ఆ ఆచూకీ ప్రకారం దేశంలో గాలింపు చర్యలు సాగించి కమ్యూనిస్టు వుద్యమాన్ని అణచటానికి ప్రయత్నించినది.

భారతదేశములో కమ్యూనిస్టు పార్టీ స్థాపన అనంతరం భారత కమ్యూనిస్టులు రాయ్ నుంచి విశేషంగా ధనసహాయం కోరటం ప్రారంభించారు. వారు కోరినంత మొత్తాలలో కాకుండా అవసరమయిన ధనం రాయ్ పంపసాగాడు. ఇందులో కొన్ని మొత్తాలు ముందుగానే ప్రభుత్వం పసిగట్టి వశపరచుకొనటం కూడా జరుగకపోలేదు. కమ్యూనిస్టు పార్టీ ఆశించినంతగా ధనసహాయం అందక పోవటంతో భారత కమ్యూనిస్టులు రాయ్‌నే అనుమానించసాగారు. కొంతమంది భారత కమ్యూనిస్టులు తమకు అందిన మొత్తాలు పార్టీ నిధికి చేర్చకుండా తమ స్వంతానికి వినియోగించుకొనటం రాయ్ తెలుసుకొని వారిని మందలిస్తూ 'నేను ఐరోపా ఖండంలో వున్నది మీ స్వంత ఖర్చుల కొరకు అవసరమయిన సొమ్ములు పంపటానికి కాదు. మీకు కావలసిన రాజకీయ సిద్ధాంతాలను బోధించటానికి, వాటి ప్రచార నిమిత్తం అయ్యే ఖర్చులు పంపటానికి' అని తెలియపరచాడు. రాయ్ పంపే మొత్తాలలో కొంత ప్రభుత్వ గూఢచారుల వశం కావటంచేత, కొంత వ్యక్తి

గతంగా కొందరు నాయకులు భుక్తపరచు కొనటంచేత పార్టీకి చేరే మొత్తం చాల స్వల్పం కావటంవలన కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ ధన సహాయం చేస్తున్నా రాయ్ ఆ మొత్తాన్ని ఇండియాకు పంపటంలేదనే అపనమ్మకం కలుగ సాగినది.

గాంధీ నాయకత్వం క్రింద జాతీయ కాంగ్రెసు విప్లవ వుద్యమంగా రూపొందజాలదు. కనుక మొదట భారత కమ్యూనిస్టులకు రాయ్ రహస్యంగా కమ్యూనిస్టు పార్టీ నిర్మాణం కొనసాగిస్తూనే అందరికీ ఆమోదయోగ్యమయిన కార్య క్రమంతో ప్రజాపార్టీని నిర్మించాలని సలహా యిచ్చాడు. ''విప్లవ భావాలు, అభ్యు దయ పంథా చేపట్టగల వ్యక్తులు అన్నివర్గాలలో వుంటారు. అయితే వారు సరాసరి కమ్యూనిస్టు పార్టీలో చేరమని కోరినా చేరరు. కమ్యూనిస్టు పార్టీ ఒక్కసారిగా బల పడటం అసాధ్యం. అది చిన్న పార్టీగానే నిలచిపోతుంది. కనుక అట్టివారిని కూడ గట్టుకొని, అందరికీ సమ్మతమయిన విశాల దృక్పథంగల పార్టీ నిర్మాణానికి పూను కొనటం అవసరం" అని రాయ్ పదేపదే భారత కమ్యూనిస్టులను హెచ్చరిస్తూ వచ్చాడు.

"కాంగ్రెసులో గాంధీ నాయకత్వమున్నా రాను రాను అది ప్రజావుద్యమం కాసాగినది. తీవ్రవాదులు కూడా ప్రవేశించసాగారు. సంపూర్ణ స్వరాజ్యం పరమా వధిగా అంగీకరించినది. కనుక కమ్యూనిస్టులు తమ పార్టీ ప్రతిపత్తిని నిలుపు కుంటూనే జాతీయ కాంగ్రెసులో చేరి ప్రజల హక్కుల రక్షణకు నడుముకట్టి వారి విశ్వాసాన్ని పొందగల నాయకత్వం నిర్మించుకొనటానికి కృషి చేయా''లని బోధించాడు.

## ఉద్యమ సారథ్యం :

క్లుప్తంలో చెప్పాలంటే రాయ్ విదేశాలలో వున్నా భారతదేశంలో కమ్యూనిస్టు ఉద్యమానికి, పార్టీ స్థాపనకు ప్రధాన కారకుడే కాక 'వ్యవస్థా నిర్మాత' అని కూడా చెప్పటంలో ఏమాత్రం సందేహం లేదు. మెక్సికో నుంచి ప్రత్యేక ఆహ్వానితునిగా 1920 లో థర్డు ఇంటర్నేషనల్ రెండవ కాంగ్రెసు మహాసభకు మాస్కో చేరిన రాయ్ ఆ మహాసభలో ప్రముఖపాత్ర వహించి అప్పటినుంచి 1928 వరకు కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ నాయకులలో ఒకప్రక్క అగ్రశ్రేణి

నాయకునిగా చలామణి అవుతూనే మరోప్రక్క విదేశాలలోనే వుంటూ తన జన్మ స్థానమయిన భారతదేశంలో కమ్యూనిస్టు ప్రచారానికి, పార్టీ స్థాపనకు, జాతీయ వుద్యమానికి నిరంతర కృషి సాగిస్తూనే వచ్చాడు.

'వాన్ గార్డు', 'అడ్వాన్సు గార్డు', 'మాసెస్' అను పేరులతో వార్తా పత్రికలు స్థాపించాడు, అనేక కరపత్రాలు ప్రచురించాడు. (1) జాతీయ నాయకులకు ఉత్తరాలు (1920), (2) భారతదేశ సమస్యలు (1920), (3) పరివర్తిత భారత దేశం (1922), (4) మనకు కావలసిన దేమిటి (1922), (5) భారతదేశ సమస్యలు, వాటి పరిష్కారం (1923), (6) సహాయ నిరాకరణోద్యమము (1923), (7) రాజకీయ ఉత్తరాలు (1924), (8) కాన్పూర్ కుట్రకేసు - బ్రిటిషు ప్రధాన మంత్రి రామ్సే మాగ్డొనాల్డుకు బహిరంగలేఖ (1924), (9) మనం ఏమి చేయాలి ? (1925), (10) సహాయ నిరాకరణ ఉద్యమం - తరువాత (1926), (11) భారత దేశ రాజకీయ భవిష్యత్తు (1926) మొదలయిన గ్రంథాలు రచించాడు. వీటన్నింటిని, వీటితోపాటు పాశ్చాత్య దేశాలలోని కమ్యూనిస్టు సాహిత్యాన్ని రహస్యంగా, తన అనుచరుల ద్వారా, ప్రత్యేక వార్తాహరుల ద్వారా భారతదేశం పంపుతూ కమ్యూనిస్టు ఉద్యమానికి ఎంతో దోహదకారి అయ్యాడు.

దాదాపు ప్రతి జాతీయ కాంగ్రెసు మహాసభకు 'మ్యానిఫెస్టో' రూపంలో కరపత్రాలు, విజ్ఞాపనపత్రాలు పంపుతూ జాతీయ వుద్యమానికి అండగా నిత్య దారిద్ర్యంతో క్రుంగికృశించే ప్రజాబాహుళ్యాన్ని ఎలా సమీకరించాలో స్పష్టీకరిస్తూ వుండేవాడు. గాంధీ నాయకత్వానికి మారుగా జాతీయ కాంగ్రెసులో విప్లవ నాయకత్వం రావాలని, అందుకు వామపక్షం, ముఖ్యంగా కమ్యూనిస్టులు తీవ్రకృషి జరపాలని హెచ్చరిస్తూ వచ్చాడు.

సహాయ నిరాకరణోద్యమం (1921) విఫలం కావటంతో కొంతమంది తీవ్రవాదులలో గాంధీ నాయకత్వం మీద అసంతృప్తి ప్రబలినది. బ్రిటిషు సామ్రాజ్యంలో 'స్వయంనిర్ణయ హక్కు' లేక 'డొమినియన్ స్టేటస్' అనే వాదానికి మారుగా 'ప్రజానీకానికి స్వరాజ్యం' అనే నినాదం ప్రబలసాగినది. దీనికి మొదట చిత్తరంజన్‌దాస్ నాయకుడుగా కనబడ్డాడు. ఆయన గయ కాంగ్రెసు మహాసభకు అధ్యక్షస్థానం అలంకరించ బోతున్నాడు. అట్టి సమయంలో రాయ్ ప్రత్యేకంగా దాసుకు ఒక ఉత్తరం పంపుతూ భారత జాతీయ కాంగ్రెసు అవలంబించవలసిన

కార్యక్రమాన్ని, తీర్మానాలను సుస్పష్టంగా వెల్లడించి వామపక్ష నాయకత్వ ఆవశ్యకతను గుర్తింప చేశాడు.

రాయ్ ఆశించినట్లు కాంగ్రెసులో వామపక్షం అధికారాన్ని చేజిక్కించుకొనలేక పోయినది. చిత్తరంజన్‌దాసు 'ప్రజలకు స్వరాజ్యం' అనే వుద్యమానికి మారుగా 'లెజిస్లేటివ్ కౌన్సిలు' ద్వారా హక్కులు సంపాదించటానికి ప్రయత్నించాలనే వాదాన్ని సమర్థించాడు. దీని ఫలితంగా జాతీయ కాంగ్రెసు రెండుగా చీలిపోయినది. ఒకటి 'నో చేంజర్సు', రెండోది కౌన్సిలులో ప్రవేశించటానికి 'స్వరాజ్య పార్టీ'గా అవతరించినది. కాంగ్రెసు చీలిపోవటం గాంధీకి సుతరామూ యిష్టంలేదు. చివరకు 1924 లో బెల్గాము కాంగ్రెసు మహాసభలో ఒక రాజీమార్గం ద్వారా రెండు వర్గాలు కలిసికట్టుగా కృషి చేయటానికి అంగీకారం కుదిరినది. సహాయ నిరాకరణోద్యమంలో గాంధీ ప్రవేశపెట్టిన విదేశీ వస్తు వస్త్ర బహిష్కరణ - రాట్నం మినహాయించి తక్కినవన్నీ - న్యాయస్థానాలు, విద్యాసంస్థలు, కౌన్సిలు ప్రవేశం, తదితర బహిష్కరణలన్నీ - ఉపసంహరించబడ్డవి.

కాంగ్రెసులో గాంధీ నాయకత్వానికిది ఒక విధంగా పరాజయమే. దేశంలో నలుమూలలా అసంతృప్తి చెలరేగుచూనే వున్నది. కాని సక్రమ పంథాలో పెట్టగల నాయకత్వం, ఉద్యమం లోపించటంచేత పరిస్థితులు అస్తవ్యస్తంగా పరిణతి చెందసాగినవి. రాయ్ ఎప్పటికప్పుడు విదేశాల్లో వున్నా భారత దేశ పరిస్థితులను గమనిస్తూనే వున్నాడు. విప్లవ వాదులకు, అభ్యుదయగాములకు, బెంగాలులో లోగడ తన అనుచరవర్గంగా వున్న అనుశీలన సమితి సభ్యులకు, టెర్రరిస్టులకు రహస్యసందేశాలు పంపుతూ వచ్చాడు. ఇందులో కొన్ని ప్రభుత్వ గూఢచారులు చేజిక్కించుకొని అసలు చిరునామా దారులకు చేరకపోవడం, మరి కొన్నింటిని వారు ఫొటో కాపీలు తీసుకొని చిరునామా దారులకు చేర్చటం కూడా జరుగుతూ వచ్చినవి. తాను పంపే రహస్య బంగీలు, పత్రాలు, ఉత్తరాలు కొన్ని ప్రభుత్వ గూఢచారుల హస్తగతం అవుతున్నట్లు, అలాగే తాను పంపుచున్న సొమ్ములో కొంత వారు చేజిక్కించు కుంటున్నట్లు రాయ్‌కి తెలుసు. అయినా రాయ్ తన ప్రయత్నాలు విరమించు కొనలేదు. బొంబే, మద్రాసు మొదలయిన హార్బరులలో రహస్యంగా తన అనుచరవర్గాన్ని ఉద్యోగస్థులుగా చేర్చి వారి ద్వారా తాను పంపే బంగీలు వివిధ ప్రాంతాలకు చేరవేసే ప్రయత్నాలు కూడా చేసాడు.

బొంబేలో డాంగే సంపాదకత్వం క్రింద వెలువడే 'సోషలిస్టు' పత్రికకు, మద్రాసులో సింగరవేలు ప్రచురించే 'లేబరు-కిసాన్ గజెటు'కు, లాహోరునుంచి వెలువడే 'ఇన్‌కిలాబ్' పత్రికకు వాటి ప్రచురణ ఖర్చుల నిమిత్తం రాయ్ అనేక సార్లు ధనం పంపటం గూడా జరిగినది. కొంతమంది విప్లవ వాదులకు ప్రత్యేకంగా తర్ఫీదు నిచ్చి వారికి తగిన సలహాలు యివ్వటానికి బెర్లిను, లేక మాస్కో రమ్మని ఆహ్వానాలు కూడా పంపాడు.

బ్రిటిషు ప్రభుత్వానికి రాయ్ సింహ స్వప్నంగా కనబడసాగాడు. భారత దేశంలో కమ్యూనిస్టు వుద్యమం బాల్యదశలో వున్నా అది ఉత్తరోత్తరా విజృంభించి ప్రభుత్వాన్ని కూలద్రోయ గలదనే భయం కలుగక పోలేదు. ఇంగ్లండునుంచి భారత ప్రభుత్వానికి అనేక హెచ్చరికలు రా సాగినవి. దీని పర్యవసానమే కాన్‌పూరు కుట్రకేసు. ఇందులో రాయ్ ప్రథమ ముద్దాయి. మరొకరు శర్మ. రాయ్ విదేశాలలో వుండటంచేత, శర్మ పాండిచేరీలో వుండటంచేత వీరిమీద అభియోగం అలాగే నిలచిపోయినది. డాంగే, ముజఫర్ అహమ్మద్, నళినీగుప్త, ఉస్మానీ కఠిన శిక్షలకు గురి అయ్యారు. ఇదే సమయంలో రాయ్ అప్పటి బ్రిటిషు లేబరు ప్రధాని రామ్సే మాక్డొనాల్డుకు తీవ్రమయిన నిరసన తెలుపుతూ ఒక సుదీర్ఘమయిన ఉత్తరం కూడా వ్రాశాడు.

అందులో ప్రధానమయిన అంశాలు - "బ్రిటిషు లేబరు పార్టీ విధానాలు, ఆశయాలకు విరుద్ధంగా భారత ప్రభుత్వం చర్యలు కొనసాగించటం, దమన నీతిని ప్రయోగించటం జరుగుచున్నది.... ఇంగ్లండులో కమ్యూనిస్టు పార్టీ వున్నది. అలాగే బ్రిటిషు సామ్రాజ్య అధీనంలో వున్న ఆస్ట్రేలియా, కెనడా, న్యూజిలాండ్, దక్షిణ ఆఫ్రికా మొదలైన దేశాల్లో కూడా కమ్యూనిస్టు ఉద్యమాలు వున్నవి. వాటిని బహిష్కరించని బ్రిటిషు ప్రభుత్వం ఇండియాలో కమ్యూనిష్టు ఉద్యమాన్ని అరికట్ట టానికి తీసుకొంటున్న కఠిన, దమన చర్యలకు నైతిక హక్కు ఎలా వున్నది? ఆ యా దేశాల్లో వారు తమ, తమ సిద్ధాంతాలను, కార్యక్రమాలను బాహాటంగా వెల్లడించినా వారి మీద నేరారోపణ లేనప్పుడు భారత దేశంలో అందుకు విరుద్ధంగా వ్యవహరించటంలో మీ లేబరు ప్రభుత్వానికి, లోగడ వున్న కన్సర్వేటివు ప్రభుత్వానికీ వున్న తారతమ్య మేమిటి? ...."

చివరకు రాయ్ ఆ వుత్తరంలో కాన్‌పూర్ కుట్రకేసును ఉపసంహరించమని భారత ప్రభుత్వాన్ని ఆదేశించమని, తాను భారతదేశం వెళ్ళటానికి అనుమతి

నివ్వవలసినదని బ్రిటిషు ప్రధానిని కోరటం జరిగినది. కాని ఆ వుత్తరానికి బ్రిటిష ప్రభుత్వం నుంచి సమాధాన మేమీ రాలేదు.

ఈ కేసును కాన్పూరులో విచారించటంలో ఒక ప్రత్యేకత కూడా లేక పోలేదు. బొంబే, కలకత్తా మొదలయిన పెద్ద నగరాల్లోని న్యాయస్థానాల్లో విచారణ జరిగితే నేరం రుజువు కాకపోతే నిందితులు విడుదల కావచ్చు. పైగా దేశంలో కమ్యూనిస్టులకు, వుద్యమానికి విశేష ప్రచారం గూడా జరుగవచ్చును. అందుకని ప్రభుత్వం దూరంగా ఒక ప్రత్యేక న్యాయస్థానంలో డాంగే వగైరాలను విచారించి వారు తమ నేరారోపణలకు వ్యతిరేకంగా న్యాయవాదుల ద్వారా వాదించుకొనటానికి వీలులేకుండా చేసి కఠిన శిక్షలు విధింపటం జరిగినది.

డాంగే ధైర్యంగా కోర్టులో నిలబడి పరాధీనంలో క్రుంగి, కృశిస్తున్న భారత ప్రజలు తమ హక్కుల కొరకు పోరాటం సాగించటంలో నేరం ఏమీ లేదని, కమ్యూనిస్టుల వుద్యమం అందుకే ఉద్భవించినదని బాహాటంగా వెల్లడించ గలిగితే దేశంలో కమ్యూనిస్టు ఉద్యమ చరిత్ర మరొక విధంగా వుండగలిగేది. అలాకాకుండా తనను తాను సమర్థించుకొనటానికి, రాయ్‌తో తన కేమీ ప్రత్యేక సంబంధాలు లేవని వాంగ్మూల మివ్వటం, మిగిలినవారు గూడా అదేవిధంగా తమ, తమ వాంగ్మూలా లివ్వటం జరిగినది. అయినా వారు శిక్షలకు గురికాక తప్పలేదు. డాంగే జైలులో వుండగా ప్రభుత్వానికి తనను విడుదల చేయటానికి 'మెర్సీ పిటీషను' కూడా దాఖలు చేసుకున్నట్లు కమ్యూనిస్టులు రెండు పార్టీలుగా చీలిన తరువాత వెల్లడయిన గాధ కూడా ఒకటి వున్నది.

కాన్పూర్ కుట్రకేసు తరువాత దేశంలో కమ్యూనిస్టు ఉద్యమం, కమ్యూనిస్టుల బలం కొంత తగ్గినా వెంటనే తిరిగి పుంజుకొనసాగినది. రాయ్ యథా ప్రకారం పాశ్చాత్యదేశాల నుంచి తన కార్యక్రమం కొనసాగిస్తూనే వచ్చాడు. దేశంలోని వివిధ గ్రూపులకు రహస్య ఉత్తరాలు, సందేశాలు పంపుతూనే వున్నాడు. 1926 లో గౌహతిలో జరిగిన జాతీయ కాంగ్రెసు మహాసభ సమయంలో కూడా రాయ్ ప్రజా వుద్యమ ఆవశ్యకతను గురించి ఒక సుదీర్ఘ ప్రణాళిక, కార్యక్రమం కూడా పంపించాడు.

కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌లో విశేష పలుకుబడి, అధికారాలు కలిగి భారత కమ్యూనిస్టు ఉద్యమ చరిత్రలో ప్రథమ వ్యవస్థాపకునిగా చలామణి అవు

చున్న రాయ్ అంతస్థును చూచి దేశంలో, విదేశాలలో వున్న కొంతమంది భారత కమ్యూనిస్టులకు అసూయ కలుగక పోలేదు. వారి అవాస్తవమయిన ఫిర్యాదుల ఫలితంగా కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ తాత్కాలికంగా భారతదేశంలో కమ్యూనిస్టు ఉద్యమ సారథ్యం బ్రిటిషు కమ్యూనిస్టు పార్టీకి అప్పగించటం జరిగినది. బ్రిటిషు కమ్యూనిస్టు పార్టీ కూడా రాయ్ పంథాలోనే భారత కమ్యూనిస్టు వుద్యమాభివృద్ధికి కృషి చేయటం గమనించదగిన విషయం.

బ్రిటిషు పార్లమెంటులో ఏకైక సభ్యునిగా వున్న శక్లట్‌వాలా బహిరంగంగానే భారతదేశం వచ్చి నాలుగు నెలలు దేశం నలుమూలలా తిరిగి వెళ్లాడు. ఫిలిప్ స్ప్రాట్, బ్రాడ్‌లీ, హచిన్‌సన్ మొదలైనవారు రహస్యంగా భారతదేశం ప్రవేశించి కమ్యూనిస్టు పార్టీ వుద్యమానికి తగిన సలహాలు, కార్యక్రమాలు సూచించి ఉద్యమ అభివృద్ధికి సహాయపడ్డారు. ఇందులో ఫిలిప్ స్ప్రాట్ కార్యసాధనలో విశేషకృషి జరిపి ఇక్కడనే స్థిరపడి రాయ్ భారతదేశం వచ్చిన తరువాత రాయ్ అనుచరునిగా కృషిచేసి 1971 లో మరణించాడు.

ఫిలిప్ స్ప్రాట్ మేధావి. రచయిత, కార్యశూరుడు, కార్యసాధకుడు. 1926 చివరిలో భారతదేశం వచ్చాడు. రాగానే దేశంలోని నలుమూలల వున్న కమ్యూనిస్టు మఠాలను కలుసుకొని అందరినీ ఐక్యపరచి విశాలమయిన ఒక ప్రణాళికతో కర్షక - కార్మిక పార్టీని స్థాపించటానికి కృషిచేసి సఫలీకృతు డయ్యాడు. 1927 లో వివిధప్రాంతాల నుంచి అనేకమంది బొంబేలో సమావేశమయి కర్షక - కార్మిక పార్టీని స్థాపించి ప్రధాన నాయకులను కార్యవర్గంలో చేర్చుకొనటం జరిగినది. కమ్యూనిస్టు నాయకులు రహస్యంగా దీని కార్యకలాపాలు సాగిస్తూ ఉద్యమాన్ని ప్రజా బాహుళ్యంలో విస్తరింప చేయటం దీని ప్రముఖ ఆశయం. రాను, రాను వీరు ప్రజాదరణ పొంది జాతీయ కాంగ్రెసులో ప్రముఖ స్థానాలు అలంకరించి వామపక్షం బలీయం కావటానికి దోహదకారి కాగలిగినారు. రాయ్ ఇంతకాలం కోరుచున్నదీ యీ ఆశయసిద్ధికే.

తాత్కాలికంగా భారత కమ్యూనిస్టు ఉద్యమాభివృద్ధికి బ్రిటిషు కమ్యూనిస్టు పార్టీ సారథ్యం వహించినా రాయ్ తన కార్యక్రమాన్ని తాను కొనసాగిస్తూనే వచ్చాడు. ఇందుకు కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ అనుమతి కూడా వున్నది. 1926 చివరిలో రాయ్ చైనా ప్రయాణానికి ముందు ఒక సుదీర్ఘ మయిన ఉత్తరాన్ని భారత కమ్యూనిస్టులకు పంపుచూ అందులో కర్షక, కార్మిక పార్టీ స్థాపన గురించి,

కమ్యూనిస్టు పార్టీ రహస్య కార్యకలాపాలు, ప్రణాళికను గురించి విస్పష్టంగా కొన్ని సూచనలు చేయటం జరిగినది. ప్రభుత్వ గూఢచారులు దీనిని మధ్యలోనే పట్టుకొన గలిగారు. తరువాత యీ లేఖ (1928 ఆగస్టు) అసెంబ్లీ ఉత్తరంగా విశేష ప్రాముఖ్యం చెందినది.

సహాయ నిరాకరణోద్యమం విఫలం కావటం, తరువాత గాంధీ జాతీయ కాంగ్రెసుకు సరియైన వుద్యమ పంథా చూపలేక కేవలం నిర్మాణ కార్యక్రమం పేరిట ఖద్దరు, రాట్నము, మద్యపాన నిషేధము, మొదలయిన ప్రచారంలో నిమగ్నుడు కావటం, కొంతకాలం రాజకీయంగా విరాగి కావటంతో తీవ్ర వాదులు, కాంగ్రెసులో వామపక్షంగా బలపడటానికి, కమ్యూనిస్టులు ప్రజానీకంలో, ట్రేడ్ యూనియన్ కాంగ్రెసులో కృషిచేసి వుద్యమాన్ని తీవ్ర రూపం చేయటానికి మంచి అవకాశం లభించినది.

పరిస్థితు లిలా కొనసాగితే తన ఉనికికే ప్రమాదం వాటిల్ల గలదని ప్రభుత్వం గ్రహించి జాగ్రత్త చర్యల కుపక్రమించినది. "కమ్యూనిస్టు ఉద్యమాన్ని అణచాలి, ముఖ్యంగా బ్రిటిషు కమ్యూనిస్టు లయిన ఫిలిప్ స్ప్రాట్, బ్రాడ్లీ మొద లయిన వారిని దేశంనుంచి బయటకు గెంటివేయాలి". 'ప్రజా రక్షణ' (పబ్లిక్ సేఫ్టీ) పేరుతో కౌన్సిలులో 1928 లో ఒక బిల్లు ప్రవేశ పెట్టబడినది. దానిని సమర్థించుకొనటానికి అంతకు ముందు సంవత్సరం ఎనిమిది మాసాలక్రితం భారత కమ్యూనిస్టులకు రాయ్ వ్రాసిన ఉత్తరాన్ని కౌన్సిలులో బాహాటంగా చదివి విని పించటమైనది.

కౌన్సిలు లోని అన్ని పార్టీలు ఏకమయినవి. ప్రభుత్వం ఎంత ప్రయత్నించినా తన బిల్లుకు తగిన సహకారం లభించలేదు. చివరకు ఆ బిల్లు వీగి పోయినది. ఇది భారత స్వాతంత్ర్య చరిత్రలో పార్లమెంటు ద్వారా తీవ్ర వాదులకు లభించిన తొలి విజయం.

నెహ్రూ జాతీయ కాంగ్రెసు ప్రతినిధిగా బ్రసెల్స్‌లో జరిగిన పరాధీన దేశాల మహా సభకు హాజరయ్యాడు. ఇది కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ ఏర్పాటు చేసిన మహా సభ. తరువాత నెహ్రూ మాస్కో వెళ్ళినప్పుడు రాయ్‌ని కూడా కలుసు కున్నాడు. రాయ్ మీద ఆయనకు విశేష ఆదర, అభిమానాలు ఏర్పడినవి. తన ఆత్మకథలో రాయ్‌ని గురించి కూడా ఉల్లేఖించాడు. భారతదేశం తిరిగి వచ్చిన

తదుపరి సుభాస్‌చంద్రబోస్, శ్రీనివాస అయ్యంగారు మొదలయిన తీవ్రవాదులతో కలిసి జాతీయ కాంగ్రెసులో 'ఇండియాలీగ్' ఏర్పాటుచేసి సంపూర్ణ స్వరాజ్యానికి కృషి ప్రారంభించాడు. దీనికి తోడు కమ్యూనిస్టులు, ఇతర తీవ్రవాదులు కాంగ్రెసుతో సహకరించి స్వాతంత్ర్య ఉద్యమం తీవ్ర స్థాయికి చేర్చటానికి విశేషమయిన కృషి చేయగలిగారు.

ఆరవ వరల్డు కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ మహాసభ (1928) తీర్మానం ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమానికి, ముఖ్యంగా భారత కమ్యూనిస్టు ఉద్యమానికి, స్వాతంత్ర్యానికి తీరని విఘాతం కలిగించినది. 1927 లో చైనాలో విప్లవం పరాజయం పొందటంతో కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ 'ఐక్య పోరాట నినాదం' తప్పుగా భావించి వివిధ దేశాల్లోని కమ్యూనిస్టు పార్టీలకు 'బూర్జువా వర్గాల'తో సంబంధాలు పూర్తిగా తెగ త్రెంపులు చేసుకొని తామే ఉద్యమాలు సాగించాలని ఆదేశాలు పంపినది. రాయ్ సిద్ధాంతానికిది విరుద్ధం. బూర్జువా వర్గాలతో కలిసి ఐక్య పోరాటం సాగిస్తూనే కమ్యూనిస్టు పార్టీ స్వతంత్ర ప్రతిపత్తిని కలిగి అంతిమ ఘట్టంలో నాయకత్వం వహించగల బలాన్ని, ప్రజల అండదండలను పొందగల స్థితికి చేరుకొనాలని రాయ్ సిద్ధాంతం. దీనిని కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ త్రోసి పుచ్చినది. ఈ విషయం తరువాత వివరంగా చర్చించబడినది.

ప్రభుత్వ దమననీతి వలన జాతీయ వుద్యమం సన్నగిల్లక పోగా పరాకాష్టకు చేరుకొన సాగినది. కొన్ని సంస్కరణలు ప్రవేశపెట్టి దేశ ప్రజలను సంతృప్తి పెట్టాలనే మిషతో బ్రిటిష ప్రభుత్వం 'సైమను కమిషన్'ను నియమించినది. ఇందులో అందరూ తెల్లదొరలే. భారతీయులకు ఇందులో ప్రాతినిధ్యం లేకపోవటం చేత దాదాపు జాతీయ కాంగ్రెసుతోబాటు దేశంలోని అన్ని పార్టీలు, వర్గాలు యీ కమిషన్‌ను బహిష్కరించాలని నిశ్చయించినవి. 1928 ఫిబ్రవరిలో యీ కమిషన్ బొంబే నగరం చేరినప్పుడు మొత్తం షాపులు, దుకాణాలు మూసి వేయబడ్డవి. ఈ కమిషన్ ఏ నగరం వెళ్ళినా 'సైమన్ - తిరిగి వెళ్ళిపో' అనే నినాదం ప్రతిధ్వనించ సాగినది. అక్కడక్కడా పోలీసులతో ప్రజలకు వివాదాలు, సంఘర్షణలు జరిగినవి. ప్రముఖ నాయకుడు, వయోవృద్ధుడు అయిన లాలాలజపతి రాయ్‌ని లాహోరులో బ్రిటిష సార్జెంటు తీవ్రంగా కొట్టటంచేత దేశమంతా సంచలనం చెలరేగినది. చివరకు పంజాబ్ కేసరి ఆ దెబ్బల బాధతోనే వీరమరణం పొందాడు. మద్రాసులో బ్రిటిష సైనికులు తుపాకులు గురి చూపినప్పుడు ప్రజా

వాహినికి అగ్రగామిగా నిలబడి ముందు తన ప్రాణాలు హరించమని రొమ్ము చూపిన ధీశాలి ఆంధ్ర కేసరి టంగుటూరి ప్రకాశంపంతులు. కమ్యూనిస్టులు కూడా 'సైమన్ కమిషన్' బహిష్కరణ ఉద్యమంలో పాల్గొని ప్రజాదరణ పొందగలిగారు.

రాయ్ బెర్లినులో వున్నా భారతదేశ స్థితిగతులను పరిశీలిస్తూ అవసర మయిన సలహాలు పంపుతూనే వున్నాడు. సైమన్ కమిషన్, రెండు టేబిలు సమావేశాలు భారత ప్రజల ప్రగాఢవాంఛను తీర్చజాలవని వాటికి ప్రత్యామ్నాయంగా నవభారత రాజ్యాంగ నిర్మాణానికి 'రాజ్యాంగ పరిషత్తు'ను సమావేశ పరచటానికి కృషి, ఉద్యమం సాగించాలని క్రొత్త నినాదం యిచ్చాడు. మొదట భారత కమ్యూనిస్టులు తమ కార్యక్రమంలో దీనిని కూడా చేర్చుకొని ప్రచారం చేసారు.

కమ్యూనిస్టు ఉద్యమాన్ని అణచటానికి ప్రభుత్వం కృతనిశ్చయమయినది. బ్రిటిషు కమ్యూనిస్టు లయిన ఫిలిఫ్ స్ప్రాట్, బ్రాడలీ, హచిన్‌సన్, ప్రముఖ భారత కమ్యూనిస్టు లయిన కొందరిని, మరి కొంతమంది తీవ్రవాదులను కలిపి మొత్తం 32 మంది మీద ప్రభుత్వాన్ని పడగొట్టటానికి కుట్ర పన్నినట్లుగా కేసు బనాయించి నది. ఇందులో రాయ్, పామీదత్తు మొదలయినవారు కూడా చేర్చబడ్డారు. ఇది 'మీరట్ కుట్ర కేసు'గా (1929) ప్రసిద్ధి చెందినది. మీరట్‌లో యీ కేసు విచారణ జరపటంలో ప్రభుత్వ ఉద్దేశం ప్రధానంగా కాన్‌పూరు మాదిరిగా వారికి న్యాయ విచారణ అందుబాటులో లేకుండా చేయటమే.

జాతీయ వుద్యమం నుంచి కమ్యూనిస్టు వుద్యమాన్ని వేరుచేసి దానిని అణచివేయాలని ప్రభుత్వ సంకల్పం. కాని అలా జరుగలేదు. దేశంలో కాంగ్రెసుతో బాటు అన్ని వర్గాలు కలిసి నేరస్థులకు 'డిఫెన్సు కమిటీ'ని ఏర్పాటు చేసినవి. దీని విచారణ దేశం నలుమూలలా వ్యాపించి ప్రభుత్వం ఆశించిన దానికి విరుద్ధంగా విశేష ప్రచారం జరిగినది. కమ్యూనిస్టు ఉద్యమ ప్రభావం ఇనుమడించినది.

గాంధీ శాసనోల్లంఘనం ప్రారంభించటంచేత జాతీయ నాయకులు ఆశించినంతగా 'మీరట్ కుట్ర కేసు'కు సహాయఘాతం కాలేకపోయారు. అయినా కమ్యూనిస్టులు 'కాన్‌పూరు కుట్ర కేసు'లో మాదిరిగా తమను తాము రక్షించుకొని కేసు నుంచి బయటపడటానికి సిద్ధపడలేదు. పైగా తమ కార్యక్రమాన్ని, సిద్ధాంతాలను సమర్థించుకొంటూ వాటిని బయట ప్రజలు వినాలనే దృష్టితో బాకాలు ఊదినట్లుగా పెద్దగా నినాదాలు చేయసాగారు. మీరట్ కుట్రకేసు వలన ప్రభుత్వం

కమ్యూనిస్టు ఉద్యమం అణచలేకపోగా వారి పైన దేశ ప్రజలలో సానుభూతి పెరుగసాగినది.

ఇలాంటి పరిస్థితులలో ఆరవ కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ (1928) ఆదేశాలు భారత కమ్యూనిస్టు పార్టీకి అందినవి. వారికి వివేచనా జ్ఞానం, స్వతంత్రాలోచనలు నశించినవి. హఠాత్తుగా ఐక్య పోరాటాన్ని విరమించుకున్నారు. జాతీయ కాంగ్రెసుతో సంబంధాలు తెగ త్రెంపులు చేసుకున్నారు. పైగా స్వాతంత్ర్య పోరాటంలోని యితర వర్గాలను, తమ అదుపు, ఆజ్ఞలలో లేని కార్మిక, కర్షక సంఘాలను దూషించసాగారు. వారి దృష్టిలో మిగిలిన సంఘాలు, వర్గాలు, ఉద్యమాలు అన్నీ విప్లవ వ్యతిరేక చర్యలు గానే కనబడ సాగినవి. దీని ఫలితంగా వారు ప్రజలకు దూరమయి ఏకాకులు కావటంతో కమ్యూనిస్టు ఉద్యమం నీరస స్థితికి చేరుకొన్నది. భారతదేశ కమ్యూనిస్టు చరిత్రను పరిశీలిస్తే అప్పటికీ, ఇప్పటికీ తప్పులు చేయటం, తరువాత దిద్దుకొనటం మినహాయించి ఒక క్రమ పంథాలో, పురోగమనం సాగించలేక పోవటం గమనార్హం. దూరదృష్టి, వివేచనాశక్తి గల నాయకత్వం లోపించుటయే దీనికి కారణం. రాయ్ సలహా మేరకు భారత కమ్యూనిస్టు పార్టీ అనుసరించిన కాలం (1928) వరకు కమ్యూనిస్టు పార్టీ ప్రజలతో సన్నిహిత సంబంధాలు పెట్టుకొని వారి దైనందిన సమస్యలకు సహాయకారి కావటంతో ఆశించిన దానికంటె మిన్నగానే పార్టీ పలుకుబడి పెరిగి బాగా అభివృద్ధి చెంద గలిగినది. 6 వ కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ ఆదేశం, దాని ప్రకారం భారత కమ్యూనిస్టులు వ్యవహరించటంతో పార్టీ అస్తవ్యస్తమయి క్షీణించసాగినది.

రాయ్ భారతదేశంలో మొదట్లో కమ్యూనిస్టు ఉద్యమానికి చేసిన కృషిని గురించి దేశ, విదేశాల్లోని అనేకమంది ప్రముఖుల ప్రశంసలకు పాత్రుడు కాగలిగాడు. ఇతరుల మాటటుంచి అప్పటి భారత ప్రభుత్వపు సెంట్రల్ ఇంటలిజన్సు బ్యూరో (సి. ఐ. బి.) భారతదేశ కమ్యూనిస్టు పార్టీ చరిత్రను గురించి తయారు చేసిన రిపోర్టును పరిశీలిస్తే యదార్థం విశదమవుతుంది.

"భారతదేశంలో ఆచరణ యోగ్యమయిన రాజకీయాలలో కమ్యూనిజాన్ని వ్యాప్తి చెందించటానికి భారత కమ్యూనిస్టు నాయకులలో ప్రధముడయిన యమ్. యన్. రాయ్‌ని ఎన్నిక చేయటంలో మాస్కో ఎంతో విజ్ఞత ప్రదర్శించినది. నాయకునిలో వుండవలసిన ప్రత్యేక లక్షణాలతోబాటు ఆయన ఫక్తు బ్రిటిషు

వ్యతిరేక తత్వం గల దేశభక్తుడు, టెర్రరిస్టు; మరియు వలసదేశాలలో వున్న వర్గ సంబంధాలను క్షుణ్ణంగా అవగాహన చేసుకొనిన వ్యక్తి కూడాను. మొదటినుంచీ కొమింటరనుకు రాయ్ అంటే అపారమయిన అభిమాన మున్నది. ఉన్నత పదవుల కొరకు జరిగే ప్రయత్నాలు, బాధలు, ఎగబ్రాకుళ్లు లేకుండానే సహజ సిద్ధమయిన నాయక లక్షణాలు కలిగి, తన అభిప్రాయాలను నిర్మొగమాటంగా కొమింటరను నాయకులముందు బాహాటంగా వెల్లడించగల ధైర్యం, ఆత్మ విశ్వాసం కలవాడు. భారతదేశంలో కొంతమంది యువకులను ఎన్నికచేసి వారిలో నూతన భావాలను ప్రకోపింపచేసి, ప్రభుత్వ వ్యతిరేక కార్యకలాపాలకు సన్నద్ధులుగా చేయగల శక్తి, యుక్తులు ప్రదర్శించటంలో ఆరితేరిన వ్యక్తి. అంతే కాదు వారిని ప్రశాంతంగా, ఒక క్రమ పద్ధతిలో, సుసంఘటిత పరచి ఉద్దేశపూర్వకంగా, అవసరమయితే దయా, దాక్షిణ్య రహితంగా విప్లవం ద్వారా నూతన సమాజ నిర్మాణానికి ఆయత్తం కావటానికి ప్రభావితులను చేయగల శక్తి, సామర్ధ్యాలు చూపిన వ్యక్తి.... మీరట్ కుట్రకేసు రికార్డులను పరిశీలిస్తే భారత దేశంలో కమ్యూనిజం వ్యాప్తికి, కమ్యూనిస్టులు శ్రామిక వర్గంలో, ఇతరత్రా సంపాదించిన పలుకుబడికి రాయ్ నిర్మాణ కార్యక్రమం ఒక 'గీటురాయి' వంటిదిగా విశదమవుతుంది.

## చైనా విప్లవం:

భారతదేశంలో మాదిరిగానే చైనాలో కూడా రాజకీయ చైతన్యం, విప్లవ భావాలు కలిగించి కమ్యూనిస్టు వుద్యమం, పార్టీని నిర్మించటానికి సోవియటు రష్యా, కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ 1920 నుంచీ కృషి చేస్తూనే వున్నవి. ఇంచుమించు భారత, చైనా దేశాల సామాజిక, ఆర్థిక పరిస్థితులు ఒకేవిధంగా వున్నా చైనాదేశం ఆర్థికంగా సామ్రాజ్యవాద దేశాల వత్తిడికి బాగా నలిగిపోయినది. కాని భారత దేశంలో కంటె చైనాలో కమ్యూనిస్టు పార్టీ సుసంఘటితమయిన శక్తిగా రూపొంది ప్రధానంగా దక్షిణ రాష్ట్రాలలో కార్మిక - కర్షక - పెట్టీ బూర్జువా వర్గాలలో తగినంతగా పలుకుబడిని పొందగలిగినది. భారతదేశంలోని జాతీయ కాంగ్రెసువలె చైనాలో సన్-యట్-సేన్ నాయకత్వం క్రింద కొమింటాంగ్ జాతీయ పార్టీగా అభివృద్ధి చెంది సామ్రాజ్యవాద శక్తులను ఎదిరించటానికి అన్నివర్గాలను సమీకరించ

గలిగినది. తరువాత అచ్చట జాతీయ ప్రభుత్వ మేర్పడినా అది నామమాత్రమే. సామ్రాజ్యవాదుల పలుకుబడి యే మాత్రం తగ్గలేదు.

పశ్చిమ ఐరోపా ఖండంలో కార్మిక నియంతృత్వాలు విఫలం కావటం చేత కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ తూర్పు దేశాలలో దృష్టిని కేంద్రీకరించినది. బ్రిటిషు సామ్రాజ్యవాద పతనానికి భారతదేశం ప్రధాన రంగంగా భావించబడినది. అంతకుముందు పర్షియా, ఆఫ్గన్ రాజ్యాలలో బ్రిటిషు సామ్రాజ్య వ్యతిరేక శక్తులను సమీకరించటానికి కొంత కృషి జరిగినది. ఇందులో రాయ్ కూడా ప్రముఖ పాత్ర వహించాడు. తరువాత కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ చైనా రాజకీయాలలో హెచ్చు శ్రద్ధ తీసుకొని కమ్యూనిస్టు వుద్యమాన్ని దృఢతరం చేయటానికి కృషి సాగించినది. చైనా కమ్యూనిస్టు వుద్యమం భారతదేశ విప్లవశక్తులకు ఆశాజ్యోతి కాగలదు. చైనా ద్వారా భారత కమ్యూనిస్టు వుద్యమాన్ని కూడా అభివృద్ధి పరచటానికి అవకాశం వుందని కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ భావించి 'విప్లవ చైనా నుంచి భారతదేశానికి' అనే క్రొత్త నినాదం యిచ్చినది.

సామ్రాజ్యవాదుల పెత్తనం క్రింద నలుగుతూ హెచ్చుగా జమీందారీ పద్ధతిలో వుండటంచేత కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ చైనాలో 'బూర్జువా ప్రజా స్వామిక విప్లవం' ముందు సాధించాలనే ఆశయంతో వున్నది. కనుక చైనా కమ్యూనిస్టు పార్టీకి కొమింటాంగు జాతీయ ప్రభుత్వంతో సహకరించి 'ఐక్యపోరాటం' సాగించి సామ్రాజ్య దేశాల పలుకుబడిని, పెత్తనాన్ని విచ్ఛిన్నం చేయాలని పిలుపు నిచ్చినది. ఇందుకు అనుకూలంగా 1920 నుంచి కొమింటాంగు పార్టీకి, ప్రభుత్వానికి అవసరమయిన సలహా, సహకారాలు అందచేయటానికి కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ చే పంపబడిన రషియన్ సలహాదారులు చైనాలో పనిచేయసాగారు.

సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా రష్యా ప్రభుత్వం చైనాకు అన్ని విధాల సహాయపడటానికి సిద్ధపడినది. దీని ఫలితంగా చైనా కమ్యూనిస్టు పార్టీ బలపడినది. ప్రజా సామాన్యంలో విశేష పలుకుబడిని సంపాదించ గలిగినది. కొమింటాంగు పార్టీలో, ప్రభుత్వంలో కమ్యూనిస్టులు కొన్ని అధికార స్థానాలను పొందగలిగారు. రష్యను సైనిక నాయకులు చైనా సైనికులకు తర్ఫీదు నివ్వటంలో సహకరించటంతో మిలిటరీలో కూడా కమ్యూనిస్టుల ప్రభావం పెరిగినది. సామ్రాజ్య వ్యతిరేక పోరాటానికి ముఖ్యంగా దక్షిణ రాష్ట్రాలలో బలవత్తరమయిన ప్రజా వుద్యమం సుసంఘటిత రూపం దాల్చగలిగినది.

కాని 1926 లో పరిస్థితులు విషమరూపం దాల్చినవి. 1926 మార్చిలో అంతకు ముందు 8 మాసాల క్రితమే ఏర్పడిన జాతీయ ప్రభుత్వాన్ని జనరల్ చియాంగ్-కై-షేక్ కూలద్రోసి అధికారం తన హస్తగతం చేసుకున్నాడు. కమ్యూనిస్టు నాయకులను, రషియన్ సలహాదారులను నిర్బంధంలోనికి తీసుకున్నాడు. అప్పటి ప్రభుత్వాధిపతి వాంగ్-చింగ్-వీ, ఆయన అనుయాయులు రష్యాలో ప్రవాస జీవితం అనుభవించ సాగారు. ఇంత జరిగినా చైనా కమ్యూనిస్టు నాయకులు మాత్రం 'సామ్రాజ్యవాద వ్యతిరేక ఐక్య పోరాట నినాదాన్ని' విడువలేదు. ఇది వారికి వారి రషియన్ సలహాదారులు నేర్పిన పాఠం. పైగా చియాంగ్-కై-షేక్ వారికి వ్యతిరేకంగా దమన నీతిని అనుసరించినా కమ్యూనిస్టులు ఆయనతో 'సామ్రాజ్య వ్యతిరేక పోరాటం' సాగించాలనే ఆశయంతో రాజీ పడటానికి కూడా సిద్ధపడ్డారు.

ఈ రాజీ షరతుల ప్రకారం కమ్యూనిస్టులు కొమింటాంగ్ పార్టీని విమర్శించ కూడదు. పార్టీలో బాధ్యతాయుతమయిన పదవులు చేపట్ట వీలులేదు. కార్యనిర్వాహక సంఘాలలో కూడా కమ్యూనిస్టులు మూడవ వంతుకు మించి సభ్యులుగా వుండ కూడదు. చియాంగ్-కై-షేక్ విధించిన యీ షరతులకు లోబడి కమ్యూనిస్టులు ఐక్య పోరాటాన్ని కొనసాగించటానికి తల వొగ్గక తప్పలేదు. దీని ఫలితంగా కమ్యూనిస్టులు కొమింటాంగ్ పార్టీలో ద్వితీయ శ్రేణి నాయకు లయ్యారు. వారి ఆశయాలు వమ్ము చేయబడ్డవి. కార్మిక-కర్షక వర్గాలలో వారి పలుకుబడి సన్నగిల్ల సాగినది.

చియాంగ్-కై-షేక్ అధికారం చేపట్టిన నాలుగు నెలలకే పెకింగులో వున్న ప్రభుత్వం మీద (సైనిక పరిపాలకుల మీద) 'ఉత్తర దండయాత్ర' జరిపాడు. చైనా దేశం మొత్తం సమైక్యంగా ఒకే పరిపాలన క్రిందకు రావటమే యీ దండ యాత్ర ముఖ్యోద్దేశం. జాతీయ సైన్యానికి తగిన శిక్షణ నిచ్చినది రషియన్ సైనికాధికారులు; ఆయుధ సామగ్రి, ఆర్థిక సహాయం చేసినది రషియన్ ప్రభుత్వం. సోవియటు ప్రభుత్వ అండదండలు లేకపోతే చియాంగ్-కై-షేక్ ఆ దండయాత్రకు పూనుకొనేవాడు కాదు. ఆయన కేవలం నామమాత్రుడే. సైన్యం కంటె మిన్నగా విప్లవ చైతన్యంగల కార్మికులు, కర్షకులు ముందు నిలబడి దండయాత్రను విజయ వంతం చేసారు. అయితే చియాంగ్-కై-షేక్ పెకింగును చేరకుండానే దండ యాత్రను యాంగ్సీనది వరకు సలిపి, తరువాత తూర్పు ప్రాంతాలకు విస్తరింప చేయ

టానికి ప్రయత్నించాడు. 1926 లో జరిగిన యీ దండయాత్ర విజయ పరంపరలు సామ్రాజ్య వాదులకు కనువిప్పు కలిగించినది.

'ఉత్తర దండయాత్ర'లో కమ్యూనిస్టులు సహకరించటం సరియైన విధానం గానే కనబడినది. దీని వలన కమ్యూనిస్టుల పలుకుబడి పెరిగినది. చైనా దక్షిణ రాష్ట్రాలలో కర్షక విప్లవానికి అనువయిన పరిస్థితులు యేర్పడ్డవి. దీనిని సక్రమంగా వినియోగించుకొన గలిగినట్లయితే చియాంగ్ నాయకత్వంలోని బూర్జువా వర్గాన్ని చిత్తుచేసి కమ్యూనిస్టులు తమ ఆధిక్యతను పొందగలిగి వుండేవారు. కాని ఆచరణలో వారు తప్పుడు పంథా చేపట్టటంతో తమ గోతిని తామే త్రవ్వుకున్నారు. ఆ దండ యాత్రలో కార్మిక-కర్షకులు తమ హక్కుల కొరకు ఆందోళన ప్రారంభించారు. చియాంగ్-కై-షేక్ ఎత్తుకు పై ఎత్తు వేసాడు. 'కార్మిక - కర్షక ఆందోళనలు దండయాత్రను బలహీనపరుస్తున్నవి' అనే నెపంతో మార్షలు లా విధించాడు. ఆందోళనలను దేశద్రోహ నేరంగా ప్రకటించి దయా దాక్షిణ్యాలు లేకుండా సైనిక శక్తితో అణచటానికి ప్రయత్నించాడు. కమ్యూనిస్టులు వారికి అండగా నిలబడి వారి హక్కుల కొరకు పోరాడటానికి మారుగా చియాంగ్-కై- షేక్‌కు అండగా నిల బడ్డారు. కారణం 'ఐక్య పోరాట నినాదమే' వారికి ప్రధాన ఆశయంగా కనబడినది. దేశీయ బూర్జువా వర్గ విప్లవ ప్రతిఘటనను, విప్లవ నాశన యత్నాన్ని వారు గమ నించలేక పోయారు. స్టాలిన్ ఒక ప్రత్యేక టెలిగ్రామ్ ద్వారా చైనా కమ్యూనిస్టు పార్టీకి 'కర్షక వుద్యమం ద్వారా కొమింటాంగ్ ప్రభుత్వాన్ని యిబ్బందికి గురి చేయ వద్దు' అని తెలియచేసాడు. 'బూర్జువా ప్రజాస్వామ్య విప్లవం'లో బూర్జువా పాత్రను విప్లవయుతంగా భావించటమే స్టాలిన్ చేసిన పెద్ద పొరపాటు.

కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ పెకింగులోని ప్రభుత్వాన్ని, అచ్చటి సైనికాధికారులను సామ్రాజ్యవాదుల చేతులలోని కీలుబొమ్మలుగా భావించినది. అది యదార్థం కూడాను. కనుక చియాంగ్-కై-షేక్ జరిపే దండయాత్ర ఆ ప్రభుత్వాన్ని, దానికి అండగా వున్న సామ్రాజ్యవాదుల పెత్తనాన్ని భగ్నం చేయటానికి వుపయోగ పడగల శక్తిగా భావించటం జరిగినది. అందుకనే కార్మిక - కర్షక ఆందోళనలకు తాత్కాలికంగా మద్దతు యివ్వకుండా వాటిని విరమించాలని తీర్మానించినది. పైగా చైనా కమ్యూనిస్టు పార్టీని కొమింటాంగు ప్రభుత్వంతో అన్నివిధాల సహకరించి బూర్జువావర్గంతో చేతులు కలిపి సామ్రాజ్యవాద శక్తులను, వాటి తొత్తుగా వున్న పెకింగు ప్రభుత్వాన్ని కూలద్రోయాలని ఆదేశించినది. 'బూర్జువావర్గం విప్లవపాత్రను

విధిగా నిర్వహిస్తుంది' అనే గాఢవిశ్వాసంతో కమ్యూనిస్టు ఇంటర్నేషనల్, రషియన్ నాయకులు 'ఐక్య పోరాట' నినాదాన్ని చివరవరకు సాగించాలనే పట్టుదల చూపటంచేత, చైనాలోని రషియన్ సలహాదారులు, చైనా కమ్యూనిస్టు పార్టీ అదే విశ్వాసంతో కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ తీర్మానాలను తు. చ. తప్పకుండా ఆచరించాలని మొండి పట్టుదల చూపటంచేత చైనా విప్లవం విషమపరిస్థితిలోపడి విప్లవ ప్రత్యాఘాతశక్తులు పైచేయి కాగల అవకాశం లభించినది.

చియాంగ్-కై-షేక్ కొరకరానికొయ్య అయ్యాడు. తన అధికారం సుస్థిరం చేసుకొనసాగాడు. కార్మిక-కర్షక వుద్యమాలను పురిటిలోనే త్రుంచి వేసాడు. కమ్యూనిస్టులను పూచకోత కోయటం ప్రారంభించాడు. చైనా విప్లవం అంతిమదశలో 'ముందు గొయ్యి, వెనుక నుయ్యి' పరిస్థితిలో పడినది. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ ఏమి చేయాలో తోచని స్థితికి వచ్చినది. కొమింటాంగ్ పార్టీలోని తీవ్రవాదులు ప్రవాసంలో వున్న వాంగ్ నాయకత్వం క్రింద కొమింటాంగ్ వామ పక్షంగా యేర్పడి హాంకోలో ప్రభుత్వం యేర్పరచారు. ప్రవాసం నుంచి బయలుదేరే ముందు మాస్కోలో స్టాలిన్ వాంగ్‌కు కావలసిన ఆర్థిక, సైనిక సహాయం చేయ గలనని వాగ్దానం చేసాడు. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ హాంకో ప్రభుత్వాన్ని తీవ్రవాద ప్రభుత్వంగా గుర్తించి చివరకు ఆ ప్రభుత్వానికి సహాయపడటానికి సిద్ధపడి చైనా కమ్యూనిస్టు పార్టీకి ఆ ప్రభుత్వంతో కలసి 'ఐక్య పోరాటం' సాగించాలని పిలుపు యిచ్చినది. ఈ నినాదం ఒక తాత్కాలిక ప్రయోజనం కొరకు కాక శాశ్వత ఆదర్శంగా భావించటంచేత చైనా విప్లవ కార్యక్రమం అస్తవ్యస్తతకు లోనయినది. తీవ్రవాద ప్రభుత్వం అనుకొనిన వాంగ్ ప్రభుత్వంతో కమ్యూనిస్టుల కలయిక కూడా చరిత్రను పునరావృతం చేసినది.

కొమింటాంగు పార్టీ రెండుగా చీలినా వామపక్షంలో కూడా భూస్వాములు, జమీందారీ పెత్తనదారులు లేకపోలేదు. కేవలం అధికారం కోసం వారు చియాంగ్-కై-షేక్‌ను వ్యతిరేకించి వాంగ్ పక్షంలో చేరటం మినహాయించి వారిని తీవ్ర వాదులు లేక విప్లవవాదులుగా పరిగణించరాదు. మొదట చియాంగ్-కై-షేకును విప్లవవాదిగా భావించి తప్పు చేసిన కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ తరువాత వాంగ్‌ని కూడా అదేవిధంగా భావించి చైనా విప్లవం నాశనం కావటానికి కారణభూత మయినది.

1926 సంవత్సరానికి రాయ్ కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ ప్రధాన నాయకులలో ఒకనిగా పరిగణించబడ్డాడు. దాదాపు ఇంటర్నేషనల్‌లోని ఉన్నత స్థానాలన్నింటినీ అలంకరించాడు. కార్యనిర్వాహక వర్గంలో మొదట ఆనరరీ సభ్యునిగా, తరువాత వోటింగు హక్కు గల సభ్యునిగా, ప్రెసిడియం, వ్యవస్థా నిర్మాణం, రాజకీయ సంస్థలలో సభ్యునిగా వున్నాడు. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌లో యీ నాలుగు శాఖలూ సిద్ధాంతాలు రూపొందించి విధానాలను ప్రకటించగల సంస్థలు, వీటితోబాటు కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ పత్రికా సంపాదకవర్గంలో సభ్యునిగా, బ్రిటిషు అగ్రేరియన్ కమీషన్‌లో సభ్యునిగా, తూర్పుదేశాల కమీషన్ అధ్యక్షునిగా, చైనా కమీషన్‌లో చైనా కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ సభ్యుడు పెట్రావ్‌తోబాటు సంయుక్త కార్యదర్శిగా అధికార హోదాలు కలిగివున్నాడు.

1926 నవంబరులో కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ ఏడవ ప్లీనరీ సమా వేశంలో చైనా పరిస్థితులు, విప్లవ కార్యక్రమం గురించి విపులంగా చర్చించబడ్డది. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ తన ప్రతినిధిగా రాయ్‌ని చైనా వెళ్ళి అచ్చటి కమ్యూ నిస్టు పార్టీకి సరియైన కార్యక్రమం రూపొందించి విప్లవం విజయవంతం చేయాలని ఆదేశించినది. రాయ్‌కి చైనాలో సాధించవలసిన మరొక బాధ్యత కూడా అప్పగించ బడినది. చైనాలో వున్న భారత సైనికులలో చీలిక కలిగించి తిరుగుబాటుకు ప్రయత్నించటం, భారత ఈశాన్య సరిహద్దులలో వున్న గదర్ పార్టీ, సిక్కు మతాలతో సంబంధాలు కలిగించుకొని భారతదేశంలో విప్లవ వుద్యమాన్ని దృఢతరం చేయటం.

1926 లో రాయ్ మాతృదేశం రావాలనే ప్రయత్నంలో వున్నాడు. కాని చైనా వెళ్ళాలని స్టాలిన్ పట్టుబట్టడంతో చైనా వెళ్ళవలసివచ్చినది. ఇది కొంత దుష్ప్రచారానికి ప్రత్యర్థులు అవకాశంగా తీసుకున్నారు. భారతదేశంలో రాయ్ జరిపిన కృషికి స్టాలిన్ అసంతృప్తి చెంది భారతదేశం పంపటానికి యిష్టంలేక అచ్చటకు బ్రిటిషు కమ్యూనిస్టులను పంపి రాయ్‌ని చైనా పంపినట్లు భారత విప్లవ కారులు దుష్ప్రచారం సాగించారు. తమకు విప్లవ కార్యక్రమాలకు కావలసిన మొత్తాలు పంపటం లేదని కొంతమంది భారత విప్లవకారులు రాయ్‌ని గురించి మాస్కోలో ఫిర్యాదులు చేయటం కూడా జరిగినది. కాని ఈ కారణంచేత రాయ్ చైనా పంపబడ్డాడని భావించటానికి దీనిని సరియయిన వాదనగా అంగీకరించటానికి వీలులేదు. నిజంగా రాయ్‌ని గురించి స్టాలిన్‌కి అసంతృప్తి, అనుమానం కలిగి

వున్నట్లయితే బృహత్కార్యాన్ని చక్కపెట్టమని చైనా పంపవలసిన అవసరంలేదు. 1924 కాన్పూరు కుట్ర కేసులో రాయ్ ముద్దాయి. రాయ్ భారతదేశంలో అడుగు పెట్టగానే ప్రభుత్వంచే బంధింపబడటం తథ్యం. కనుక రాయ్‌ని భారతదేశం వెళ్ల వద్దని స్టాలిన్ హృదయ పూర్వకమయిన సలహా యిచ్చి చైనా విప్లవం విజయ వంతం చేయాలనే దృఢసంకల్పంతో రాయ్ మీద వున్న గాఢవిశ్వాసంతో ఆయనను కమ్యూనిస్టు యింటర్నేషనల్ ప్రత్యేక ప్రతినిధిగా చైనా పంపాడు.

రాయ్ 1926 చివరిలో, కొంతమంది అనుచరవర్గంతో కాంటన్ చేరాడు. కాంటన్ నుంచి హాంకో చేరాలి. రాయ్ ప్రయాణం చేసిన విమానం చెడిపోయి నందు వలన కాంటన్‌లో రెండువారాలు ఆగవలసివచ్చినది. హాంకో చేరటానికి శత్రు స్థావరాలను తప్పించుకొని వెళ్లవలసి వున్నది. రహస్యంగా, అతిప్రయాసతో మూడువారాల తరువాత అక్కడకు చేరగలిగాడు. అప్పటికే కొన్ని వూహించని సంఘటనలు చైనాలో జరిగిపోయినవి.

చియాంగ్-కై-షేక్ ఒకప్రక్క కమ్యూనిస్టులను హతమార్చుచునే మరో ప్రక్క తన దండయాత్రకు వారిని వినియోగించుకొన గలుగుచున్నాడు. కార్మిక-కర్షక వుద్యమాలను దేశద్రోహనేరంతో విచక్షణారహితంగా అణచుచున్నా 'ఐక్య పోరాట' నినాదంతో వారు బూర్జువా ప్రజాస్వామిక విప్లవం ముందు విజయవంతం కావాలని ఏ షరతులు లేకుండానే కార్మిక-కర్షకుల కొరకు ఏ హక్కులు కోరకుండానే కమ్యూనిస్టు పార్టీ కేంద్ర సంఘం పట్టణ, పల్లె ప్రాంతాలలోని పార్టీ కార్యకర్తలకు, సంఘాలకు ప్రభుత్వాన్ని బలపరచాలని ఆదేశాలు జారీ చేస్తున్నది. అప్పుడు చైనాలో రషియన్ సలహాదారులలో మైకేల్ బరోడిన్ ప్రధాన వ్యక్తిగా చైనా కమ్యూనిస్టు పార్టీకి ఎప్పటికప్పుడు కార్య క్రమాలను, విధానాలను అందచేస్తూ కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ పేరుతో వ్యవహారం నడుపసాగాడు. బరోడిన్ స్టాలిన్ అనుచరునిగా, ఆంతరంగికునిగా 1923 నుంచి చైనాలో రష్యను సలహాదారులలో అతి ముఖ్యమయిన వ్యక్తిగా కీలకస్థానం ఆక్ర మించుకొనగలిగాడు. రష్యా ప్రభుత్వం పంపే ఆర్థిక సహాయమంతా బరోడిన్ చేతులనుండే, ఆయన అంగీకారముతోనే జరుగుతూ వచ్చినది. కనుక చైనా కమ్యూనిస్టు నాయకులు, ఇతర రష్యను సలహాదారు లందరూ విప్లవ పంథా విధానంలో, అంతిమ నిర్ణయంలో బరోడిన్‌కు అగ్రతాంబూలం యిస్తూ వుండేవారు. 'విప్లవం వున్నచోట స్థిరత్వం పొందే ముందు విస్తరింప చేయాలి.' ఒక విశ్వ

విద్యాలయ ఆచార్యుని నినాదం యిది. దీనిప్రకారం కార్మిక - కర్షకులు ఒక నగరం లేక ఒక ప్రాంతం మీద తమ ఆధిపత్యం పొంద కలిగినప్పుడు వారు అంతటితో ఆగి ముందుగా తమ కార్యక్రమాన్ని ఆచరణ పెట్టుచూ అందులో నిమగ్నులు కాకూడదు. అవకాశం వున్నంతవరకు ముందుకు చొచ్చుకొనిపోతూ విప్లవరంగాన్ని విస్తరింప చేయాలి. మొత్తం దేశం తమ అధీనంలోనికి వచ్చిన తరువాత విప్లవ కార్యక్రమం ఆచరణలో పెట్టటానికి పూనుకొనాలి. ఇది ఒకవిధంగా ట్రాట్స్కీ 'ప్రపంచ విప్లవ' నినాదానికి చేరువలో వున్నది. బరోడిన్ చైనా విప్లవంలో దీనిని అనుసరించే కార్యక్రమం రూపొందించాడు. చైనా కమ్యూనిస్టు పార్టీ కేవలం రష్యా ఆర్థిక సహాయం మీద, ఇతరత్రా ఆధారపడి వున్నందున యీ విధానమే అవలంబించినది. రషియన్ సలహాదారులు తమకు అవకాశం వున్నచోట విప్లవ కార్యక్రమం ఆచరణలో పెట్టకపోగా చైనా కమ్యూనిస్టు పార్టీకి తప్పుడు సలహా లిచ్చి 'ఐక్య పోరాట' నినాదంతో విప్లవ వ్యతిరేక శక్తులకు సహాయం చేయసాగారు.

రాయ్ హాంకో నగరం చేరేటప్పటికి షాంఘై కార్మికులు అచ్చటి సైనిక అధికారులను కూలద్రోసి పట్టణం స్వాధీనం చేసుకున్నారు. ఇదేవిధంగా కొన్ని ముఖ్యపట్టణాలలో కార్మికులు విజృంభించి నగరాలను వశపరచుకొని సోవియట్లు స్థాపించటానికి తీవ్రకృషి సాగిస్తున్నారు. ఇట్టి పరిస్థితులలో చియాంగ్-కై-షేక్ యిరుకునపడ్డాడు. కొమింటాంగు పార్టీ కేంద్ర కార్యనిర్వాహక వర్గంలోని తన అనుకూలవర్గంతో నాంకింగులో సమావేశమయి హాంకోలో వున్న వాంగ్ ప్రభుత్వంతో, ఆయనకు అండగా నిలబడిన కమ్యూనిస్టులతోనూ తెగత్రెంపులు చేసుకొనటానికి తన నిర్ణయం ప్రకటించాడు. వాంగ్ నాయకత్వంలోని లెఫ్ట్ కొమింటాంగు 1927 ఏప్రియల్ 17 వ తేదీన సమావేశమయి పార్టీ నుంచి చియాంగ్-కై-షేక్‌ను బహిష్కరిస్తున్నట్లు ప్రకటించినది. పెకింగు మీద తామే ముందుగా దండయాత్ర జరిపి బలం సంపాదించుకొనిన మీదట చియాంగ్-కై-షేక్‌తో రాజీ ప్రతిపాదనలు చేయవచ్చునని తీర్మానించినది కూడాను.

తాజా పరిస్థితులు చర్చించటానికి 1927 మేలో కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ 9వ ప్లీనరీ సమావేశం జరిగినది. వాంగ్ ప్రభుత్వం విప్లవాత్మక మయినది కనుక ఆ ప్రభుత్వానికి మద్దతు ప్రకటించాలని చైనా కమ్యూనిస్టు పార్టీని కోరినది. కార్మిక-కర్షకుల హక్కులను పరిరక్షించటానికి సుస్పష్టమయిన కార్య

క్రమం రూపొందించవలసిన అవసరాన్ని హెచ్చరించినది. శిస్తులు రద్దుచేయటం, భూ సంస్కరణలు అమలు చేయటం, ప్రజలకు ఆయుధాలు ఇవ్వటం మొదలైనవి ఈ కార్యక్రమంలోని అంగాలుగా సూచించబడ్డవి. ఈ కార్యక్రమాన్ని వామపక్ష కొమింటాంగు పార్టీ అంగీకరించే టట్లు ప్రయత్నించాలి. కాని ఆ పార్టీతో విరోధం పెట్టుకొన కూడదు. "వామపక్ష కొమింటాంగ్ పక్షంతో సహకరించటం ద్వారానే విప్లవం జయప్రదం కాగలదు. శత్రుత్వంతో సాధించలేము" అని స్టాలిన్ ప్రకటించాడు.

చైనా కమ్యూనిస్టు విప్లవంలో అనుసరించ వలసిన విధానం గురించి కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌లో ముఖ్యంగా స్టాలిన్ - ట్రాట్స్కీల మధ్య వాగ్వివాదాలు మొదటినుంచీ జరుగుతూనే వచ్చినవి. ఇందులో రాయ్ ట్రాట్స్కీని సమర్థించటం కాని, లేక వ్యతిరేకించటం గాని జరుగలేదు. 1920 లో రెండవ కాంగ్రెసులో తాను వెల్లడించిన అభిప్రాయాలకు అనుకూలంగా వలస రాజ్యాలలో బూర్జువా ప్రజాస్వామిక విప్లవంలో పై వర్గాలు సామ్రాజ్య వాదులతో చేతులు కలిపి విప్లవాన్ని అణచటానికి ప్రయత్నించే ప్రమాదం వున్నది కనుక కమ్యూనిస్టు పార్టీ తగు జాగరూకతతో ఐక్య పోరాటాన్ని జరుపుతూనే అనుకూల పరిస్థితులు ఏర్పడగానే వుద్యమ నాయకత్వం వహించి విప్లవాన్ని జయప్రదం చేయాలనే వాదనను సమర్థిస్తూ వచ్చాడు. రాయ్ వాదన ప్రకారం 'ఐక్య పోరాట' నినాదం ఒక తాత్కాలిక ప్రయోజనం కొరకు అంటే పై వర్గాలను కూడా సామ్రాజ్య వ్యతిరేక పోరాటంలో ప్రజా వుద్యమానికి అండగా నిలుపుకొనటానికే మాత్రమే. కాని స్టాలిన్ ఈ కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌లో, రష్యా కమ్యూనిస్టు పార్టీ- ప్రభుత్వంలో అప్పటికే పలుకుబడి, విశేష అధికారం గల వ్యక్తిగా పరిణమించటం చేత స్టాలిన్ ఆదేశాలకు, ఆజ్ఞలకు ఎదురు చెప్పగల సాహసం ఎవరికీ లేకపోయినది.

కాని అప్పటికే చైనా పరిస్థితులు యీ కార్యక్రమం ఆచరణకు అసంభవంగా పరిణమించినవి. ఏప్రియల్ మాసంలో రెండవ పర్యాయం ఉత్తర దండయాత్ర జరిగినప్పుడు చైనా కమ్యూనిస్టు పార్టీ, రషియన్ సలహాదారులు దానిని బలపరచి వాంగ్ ప్రభుత్వంతో సహకరించాలని తీర్మానించుకున్నారు. "దక్షిణ ప్రాంతాల్లో సామ్రాజ్య వాదుల, దేశీయ బూర్జువా వర్గాల బలం బాగా వున్నది. కనుక ప్రస్తుతానికి యీ కార్యక్రమాన్ని అంగీకరింప చేయటానికి అతివాద కొమింటాంగ్‌తో సంఘర్షణకు దిగటం మంచిది కాదు. దానికి సహాయ భూతంగా

వుండి దండయాత్రకు మద్దతు నివ్వటం అవసరం. ఉత్తర రాష్ట్రాలలో కమ్యూనిస్టులు తమ కార్యాచరణకు వేరే కేంద్ర స్థానం యేర్పరచుకొనటం అవసరం" అని బరోడిన్ నూతన వాదాన్ని లేవదీసాడు.

బరోడిన్ వాదంలో పసలేదు. ఇది యదార్థానికి విరుద్ధం కూడాను. దక్షిణ ప్రాంతాలయిన నాలుగు రాష్ట్రాలలో పదికోట్ల జనాభా వున్నది. ఆ ప్రాంతం మొత్తములో కమ్యూనిస్టులు విశేషమయిన పలుకుబడిని పొందగలిగారు. కర్షక-కార్మిక వుద్యమాలు బాగా బలపడి చైనా కమ్యూనిస్టు పార్టీకి అండగా నిలబడ్డవి. వారి హక్కుల కొరకు పార్టీ పిలుపునిస్తే చాలు వారు ఎన్ని త్యాగాలు చేయటానికైనా వెనుకాడరు. అటు చియాంగ్ ప్రభుత్వం గాని, ఇటు వాంగ్ ప్రభుత్వం గాని వారి కోర్కెలు మన్నించక తప్పదు. కాగా ఉత్తర రాష్ట్రాలలో కమ్యూనిస్టుల ప్రాబల్యం గాని, ప్రజా వుద్యమాలు గాని లేవు.

రాయ్, బరోడిన్‌ల కిక్కడే భేదాభిప్రాయాలు పొడసూపినవి. 1) ఉత్తరదేశ దండయాత్ర, 2) కర్షకుల హక్కులను విస్తరింప చేయటం, 3) కొమింటాంగ్‌తో కమ్యూనిస్టు పార్టీ సంబంధాలు.

1) ఉత్తరదేశ దండయాత్రకు ఒక సైనికాధికారి ఒక పథకం తయారు చేసాడు. చియాంగ్ దానిని మొదట మధ్యలోనే ఆపటం వలన పెకింగులో సైనిక ప్రభుత్వం సామ్రాజ్యవాదుల అండదండలతో సాగుతూనే వున్నది. ఈ దండయాత్ర వలన ప్రయోజనానికి మారుగా ప్రమాదం యేర్పడ వచ్చునని రాయ్ సందేహం వెలిబుచ్చాడు. వాంగ్ ప్రభుత్వ సైన్యాలన్నీ దండయాత్రకు బయలుదేరితే ఇచ్చట అభివృద్ధి నిరోధకులు వాంగ్ ప్రభుత్వాన్ని వశపరచుకొని ప్రజా వుద్యమాన్ని అణచటానికి ప్రయత్నించ వచ్చును. 2) జమిందారీ విధానాన్ని, భూ స్వామ్య పద్ధతిని రద్దుచేసి రైతులకు భూమి పంచిపెట్టే విధానాన్ని అమలుచేస్తే ప్రజానీకంలో కమ్యూనిస్టుల పలుకుబడి పెరుగటయే కాక దానివలన విప్లవ ఆశయ సిద్ధి నెరవేర గలదు. కనుక 'విప్లవాన్ని విస్తరింప చేయాలనే' నినాదానికి మారుగా ఉన్నచోట 'విప్లవం సుస్థిరత్వం పొందటానికి ప్రయత్నించాలనే' నినాదం అవసరం. 3) కొమింటాంగుతో 'ఐక్య పోరాటం' పేరుతో కమ్యూనిస్టు పార్టీ రాజీకి దిగరాదు. ఆ కాలం గతించినది. ప్రజా హక్కుల కొరకు, ప్రజా పోరాటం ద్వారా కొమింటాంగులో వున్న అభివృద్ధి నిరోధకులను తొలగించి నాయకత్వం చేపట్ట

వలసిన తరుణం వచ్చినది. ఇవి రాయ్ కమ్యూనిస్టు పార్టీ సమావేశాల్లో వెల్లడించిన అభిప్రాయాలు. రాయ్ కేవలం సలహా దారునిగానే చైనా వెళ్ళాడు. అచ్చట కమ్యూనిస్టు పార్టీని అదుపు, ఆజ్ఞలలో పెట్టగల అధికారం ఆయనకు లేదు. ధన సహాయంలో, ఇతరత్రా అన్ని అధికారాలు బరోడిన్ చేతులలోనే వున్నవి. కనుక చైనా కమ్యూనిస్టు పార్టీ బరోడిన్ సలహా ననుసరించక తప్పలేదు.

ఉత్తర దండయాత్ర ప్రారంభం కాగానే వూహాన్ (వాంగ్) ప్రభుత్వం "విప్లవ సైన్యానికి అందరి మద్దతు కావాలి. ప్రస్తుతానికి కార్మిక-కర్షక సంఘాలు తమ ఆందోళనలు, వుద్యమాలు విరమించుకోవాలి" అని ప్రకటించినది. దీన్ని బరోడిన్ వ్యతిరేకించలేదు. పైగా ఆయనకు 'కొమింటాంగ్‌తో సహకారం', 'ఐక్య పోరాటం' అనే నినాదాల మైకం తొలగలేదు. ఉదాసీనుడై తటస్థ వైఖరిని అవలంబించాడు. వూహాన్ ప్రభుత్వం లోని విప్లవ వ్యతిరేక వర్గం యే మాత్రం అవకాశం దొరికినా కమ్యూనిస్టులను, వారి స్నేహితులయిన రషియన్ సలహా దారులను కొమింటాంగ్ నుంచి బయటకు నెట్టివేయాలనే సంకల్పంలో వున్నది.

రాయ్ బరోడిన్ తటస్థ వైఖరిని, చైనా కమ్యూనిస్టు పార్టీ నిస్సహాయతను ఖండించి వ్యతిరేకించాడు. "వూహాన్ ప్రభుత్వ పరిపాలనలో వున్న రాష్ట్రాలలో కార్మిక-కర్షక వుద్యమాలు తీవ్రతరం చేయాలి. దీని వలన కమ్యూనిస్టులకు ప్రజా బలం చేకూరుతుంది. ప్రభుత్వం మన కార్యక్రమాన్ని అంగీకరిస్తే మంచిదే. మన పలుకుబడి పెరుగుతుంది. అంగీకరించక పోతే పార్టీలోని మిత వాదులను, విప్లవ ప్రతిఘటన శక్తులను తొలగించి పార్టీ నాయకత్వం చేపట్టుదాం" అని రాయ్ వాదించాడు. కాని రాయ్ వాదానికి మద్దతు లభించలేదు. రష్యను సలహాదారులలో ఒకరు వినా మిగిలిన వారందరూ బరోడిన్‌నే సమర్థించారు.

చైనా కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కార్యవర్గం మొదట రాయ్ వాదాన్ని అంగీకరించి ఉత్తర దండయాత్రకు ముందు వూహాన్ (లెఫ్ట్ కొమింటాంగు) ప్రభుత్వం క్రింద వున్న రాష్ట్రాలలో విధిగా సంస్కరణలు అమలు జరపాలని తీర్మానించినది. కాని తిరిగి మూడవ రోజునే యీ తీర్మానానికి వ్యతిరేకంగా దండ యాత్రను సమర్థించాలని తీర్మానించినది. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ తీర్మానాను సారం ఒక వంక కార్మిక-కర్షకుల హక్కులను రక్షించాలనీ, మరో వంక కొమింటాంగు ప్రభుత్వాన్ని బలపరచి సహకరించాలని చైనా కమ్యూనిస్టు పార్టీ

తీర్మానించినది. ఇది జరుగని పని. అసలు కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ తీర్మానమే ఈ అవకతవకలకు కారణ భూతం. ఈ తీర్మానం ఆమోదించిన కొలది వారాలకే వూహాన్ ప్రభుత్వ జనరల్ వాకరు - చాంగ్‌షా ఒక రాష్ట్రంలో తిరుగుబాటు చేసి అధికారం కైవసం చేసుకొని దాదాపు ఇరవై వేల మంది కమ్యూనిస్టులను, వారి అనుయాయులను హత్య చేయించాడు. ఆ రాష్ట్రంలోని కార్మిక-కర్షక సంఘాలు చాంగ్‌షా మీద ఎదురుదెబ్బ తీయటానికి ప్రయత్నించినప్పుడు చైనా కమ్యూనిస్టు పార్టీ ఆ వుద్యమాన్ని విరమింప చేసినది.

రాయ్ ఆ ప్రతిఘటన వుద్యమాన్ని నడిపి సైనికబలాన్ని తేల్చుకుందామని వాదించాడు. దీనికి వ్యతిరేకంగా బరోడిన్ కొమింటాంగ్‌తో రాజీకి దిగటం మంచిదిగా భావించాడు. "కొమింటాంగ్‌తో రాజీమంతనాలు జరుపటం క్రియలో లొంగిపోవటమే. కనుక ఒకసారి బలాబలాలు తేల్చుకొనటం అవసరం" అని రాయ్ స్పష్టీకరించాడు. 'సంఘర్షణకు దిగితే ఏమవుతామోననే భయం, రాజీగా ఐక్య పోరాటం సాగించాలనే పట్టుదల' బరోడిన్‌ని తికమకలు పెట్టినవి. 'రాజీబేరం మొదటికే మోసం, అమీతుమీ తేల్చుకొనటం మంచిదని' రాయ్ అభిప్రాయం. ఇద్దరికీ పొత్తు కుదరలేదు. మాస్కో అభిప్రాయం తెలుసుకొనటం అవసరంగా భావించారు.

"ఐదవ కాంగ్రెసు తీర్మానం ప్రకారం చైనా కమ్యూనిస్టు పార్టీ బూర్జువా వర్గ ఉత్తర దండయాత్రను సమర్థిస్తూనే వూహాన్ ప్రభుత్వంలో విప్లవం తీసుకొని రావాలి" అని స్టాలిన్ రాయ్‌కి టెలిగ్రామ్ పంపాడు. ఇది ఐక్యపోరాట సిద్ధాంతం. అంతకుముందు 70 సంవత్సరాల క్రితం కారల్ మార్క్సు, ఏంగిల్సు ఐరోపాఖండ చరిత్ర నాధారం చేసుకొని బూర్జువా వర్గం విప్లవపాత్రను నెరవేరుస్తుంది అని చెప్పిన సూత్రం దీనికి ప్రాతిపదిక. వాస్తవ పరిస్థితులను ఆకళింపు చేసుకొని తదనుకూలమయిన కార్యక్రమ నిర్ణయంలో భేదాభిప్రాయాలు పొడసూపి మాస్కో సలహా అభ్యర్థించిన రాయ్ - బరోడిన్‌లు ఇద్దరికీ స్టాలిన్ యిచ్చిన టెలిగ్రామ్ ఆచరణలో అసంభవమని తెలుసు. సామ్రాజ్య వ్యతిరేక పోరాటంలో బూర్జువావర్గంతో కలసి ఒక అడుగు ముందుకు వేయాలని చెప్పటం సాంఘిక పోరాటంలో (విప్లవం) రెండు అడుగులు వెనక్కు వేయటంగా సంభవించినది.

జాతీయ పోరాటంలో, కర్షకులు ప్రధానంగా వున్న చైనా దేశంలో వారి హక్కుల పరిరక్షణ, భూసంస్కరణలు ఆదర్శంగా వుండాలి. జమీందారులు,

సైనిక అధికారుల నాయకత్వం క్రింద నడిచే జాతీయ వుద్యమం కర్షకులను తమ పాచికలుగా వుపయోగించుకొనటానికి ప్రయత్నిస్తుంది. కర్షకులు తమ హక్కుల కొరకు ఆందోళన జరిపితే అసలు వుద్యమాన్నే నాశనం చేయటానికి పై వర్గాలు పూనుకుంటవి. చైనాలో సరిగ్గా యిదే జరిగినది. కొమింటాంగ్, కమ్యూనిస్టు పార్టీలు తమ, తమ ఆశయసిద్ధి కొరకు ఒకరి నొకరు సాధనంగా వాడుకొనటానికి ప్రయత్నాలు జరిగినవి. అయితే చైనా కమ్యూనిస్టు పార్టీ స్థిరసంకల్పంతో, దూర దృష్టితో స్వతంత్రంగా వ్యవహరించక కొమింటరను చెప్పుచేతల్లో వుండి ఎప్పటి కప్పుడు 'ఐక్య పోరాటం' పేరుతో కొమింటాంగ్‌తో రాజీ బేరాలకు దిగటంతో యీ అవకాశాన్ని ఆసరాగా తీసుకొని విప్లవ ప్రతిఘటనశక్తులు సైనికబలాన్ని పెంచుకొనటం, విప్లవశక్తులు కార్మిక - కర్షకుల మద్దతును పోగొట్టుకొని బల హీనమై పరాజయం పొందటం జరిగినది.

స్టాలిన్ పంపిన టెలిగ్రామ్ ఖచ్చితమయిన, సరియైన కార్యక్రమాన్ని సూచించలేదు. అప్పటికే విప్లవం ప్రమాదస్థితికి చేరుకున్నది. కమ్యూనిస్టుల మనస్తత్వాన్ని, దౌర్బల్యాన్ని చియాంగ్-కై-షేక్ పసిగట్ట గలిగాడు. తిరుగుబాటుకు సంసిద్ధమయ్యాడు. వూహాన్ ప్రభుత్వంలో విప్లవ ప్రతిఘటనశక్తుల బలం పెరుగ సాగినది. తీవ్రవాద పటుత్వం తగ్గినది. అది కూడా నామమాత్రంగానే వున్నది. ఆర్థిక మాంద్యం, సైనికుల తిరుగుబాటులు, కార్మిక - కర్షక ఆందోళనలు, సామ్రాజ్య ప్రభుత్వాల వత్తిడులతో వూహాన్ ప్రభుత్వం ఏమీ చేయలేని స్థితిలో పడినది.

ఇట్టి పరిస్థితులలో రాయ్ సుదీర్ఘంగా ఆలోచించి అంతిమ ప్రయత్నానికి నిర్ణయించుకున్నాడు. మాస్కోకు యదార్థ పరిస్థితులు తెలియబరచి స్టాలిన్ నుంచి ప్రత్యేక సందేశం తెప్పించుకున్నాడు. రాయ్ సలహా ననుసరించి, స్టాలిన్ తన టెలిగ్రామ్‌లో భూమిని జాతీయం చేసి భూసంస్కరణలు వెంటనే అమలు జరుపాలని, కార్మిక - కర్షక సైన్యాన్ని సిద్ధం చేయాలని, వారికి కావలసిన ఆయుధాలు, ఆయుధ సామగ్రి అందచేయాలని, వాంగ్‌కు తాను మాస్కోలో యిచ్చిన వాగ్దానం ప్రకారం అన్నివిధాల రష్యా ప్రభుత్వం సహాయ పడగలదని తెలియ జేసాడు.

రాయ్‌కి దీనితో విప్లవ విజయానికి కొన్ని ఆశాకిరణాలు కనబడసాగినవి. 30 లక్షల సభ్యత్వం కల కర్షక సంఘాలను సమీకరించి భూసంస్కరణలు అమలు చేయగలమని వారికి హామీ యిచ్చి, ఆయుధ సామగ్రిని అందచేయగలిగితే వారు

వాంగ్ ప్రభుత్వానికి అండగా నిలబడి విప్లవ పోరాటానికి ఆయత్తపడగలరని, దీని వలన లెఫ్ట్ కొమింటాంగ్, కమ్యూనిస్టుల ఐక్యతను కాపాడి విప్లవ ప్రతిఘటన శక్తులను చిత్తుచేయవచ్చునని భావించాడు. వాంగ్‌ని ప్రత్యేకంగా కలుసుకొని కర్షకుల అండ, సోవియటు ప్రభుత్వ మద్దతు వుండగలవని హామీ యిచ్చాడు. వాంగ్ తన అధికారం నిలబెట్టుకొనాలనే తాపత్రయంలో వున్నా రాయ్ హామీలను నమ్మగల స్థితిలోలేడు. సైనికాధికారులు వ్యతిరేకంగా వున్నారు. కమ్యూనిస్టుల పంథా అస్తవ్యస్తంగా వున్నది. వారు కర్షకులను సమీకరించి తనకు అండగా నిలబెట్ట గలరనే విశ్వాసం వాంగ్‌కు లేదు.

వాంగ్ అవకాశవాది. స్వతహాగా విప్లవ భావాలు కల వ్యక్తికాదు. తన అధికారం కొరకు ఎటు బలం వుంటే అటు మ్రొగ్గటానికి సిద్ధపడిన వ్యక్తి. రాయ్ అతన్ని మొదట పెట్టీ బూర్జువా నాయకునిగా భావించాడు. కర్షకుల అండ దండలు, సోవియటు ప్రభుత్వ సహకారం లభించగలవని నమ్మకం చెప్పినా నమ్మలేదు. చివరకు స్టాలిన్ పంపిన టెలిగ్రామ్ చూపించి నమ్మకం కలిగించాడు. వాంగ్‌లో నమ్మకం కుదిరినది. కమ్యూనిస్టులతో కలిసికట్టుగా సహకరించి కృషి చేయటానికి సిద్ధపడ్డాడు.

కాని చైనా కమ్యూనిస్టు పార్టీ కర్షకుల హక్కుల రక్షణకు ముందుకు రాలేకపోయినది. వారి ఆందోళనకు, వుద్యమానికి నాయకత్వం వహించలేక పోయినది. భూమిని జాతీయంచేసి కర్షకులకు పంచిపెట్టాలనే ప్రతిపాదన చేయలేక పోయినది. దీనికి ముఖ్య కారకులు పార్టీ కార్యదర్శి చెన్, బరోడిన్‌లు. వారు రాయ్ విధానాన్ని వ్యతిరేకించారు. నిస్పృహ, నిరాశతో వున్న కర్షకులు - కర్షక సంఘాలు ఛిన్నాభిన్నమైనవి. వూహాన్ ప్రభుత్వానికి ముందు దారి కనబడలేదు. ఇరుకున బడినది. వాంగ్ రాయ్ తనకిచ్చిన హామీలు, కర్షకుల బలం, ప్రజల సంఘటన శక్తి నిరాధారం, సత్యదూరంగా భావించాడు. కనుక సైన్యం మీద సైనిక అధి కారుల మీద ఆధారపడటమే యుక్తమని తుది నిర్ణయానికి వచ్చాడు.

వూహాన్ (వాంగ్) ప్రభుత్వం నాంకింగ్ (చియాంగ్-కై-షేక్) ప్రభుత్వంతో రాజీ బేరాలు ప్రారంభించినది. కొమింటాంగుకు కమ్యూనిస్టులతో పొత్తు వుండకూడదని, వూహాన్ ప్రభుత్వంలోని కమ్యూనిస్టు సైనికాధికారులను, సలహాదారులను వెడలగొట్టాలని నాంకింగ్ ప్రభుత్వం షరతులు విధించినది.

అందుకు అంగీకరించటానికి వూహాన్ ప్రభుత్వం సిద్ధంగా వున్నట్లు కనపడినది. ఇక రాయ్, బరోడిన్, ఇతర రష్యను సలహాదారులు చైనాలో విలువగల స్థితిలో లేరు. వున్నా వారి వునికికే ప్రమాదం సంభవించగలదు. ఎవరి వీలునుబట్టి వారు రహస్యంగా చైనా విడచి మాస్కో ప్రయాణం కట్టారు. బరోడిన్, అతని అనుచరులు 1927 జులై ఆఖరిలో బయలుదేరారు. రాయ్ తన అనువదపర్గంతో 1927 ఆగస్టులో రహస్యంగా హాంకో నుంచి బయలుదేరి జీపుకారులో అతిప్రయాసతో గోబీ ఎడారిలో ప్రయాణంచేసి చివరకు ట్రాన్సు - సైబీరియన్ రైలు ప్రయాణం ద్వారా మాస్కో చేరగలిగాడు.

కొమింటాంగ్ పార్టీగాని అందునుంచి విడివడిన వామపక్షంగాని (లెఫ్టు కొమింటాంగు) ప్రజా వుద్యమంగా రూపొందలేదు. జమీందారీ, సైనిక నాయకత్వం మీద ఆధారపడిన వుద్యమం కావటంచేత విప్లవం అపజయం పొందక తప్పలేదు. వలస రాజ్యాలలో సామ్రాజ్య వ్యతిరేక పోరాటం. వర్గ సంఘర్షణ కమ్యూనిస్టు వుద్యమానికి ప్రధానమైన పట్టుగొమ్మలు. జాతీయ వుద్యమంలో ప్రజల మద్దతును పొందటానికి ఇవి రెండూ అవసరమే. ఒక దశలో దేశీయ బూర్జువావర్గం తమ ప్రయోజనాలకు నష్టం కలుగగలదని భావించినప్పుడు సామ్రాజ్యవాదులతో పొత్తు కుదుర్చుకొని జాతీయ వుద్యమాన్ని అణచటానికి వెనుకాడదు. కనుక కమ్యూనిస్టులు ప్రజల ఆమోదం పొంది, ప్రజలకు అవసరమయిన స్వల్పకాలిక ప్రణాళికను సిద్ధ పరచి అందుకు మద్దతుగా ప్రజానీకాన్ని సమీకరించి వుద్యమాన్ని బలపరచవలసిన అవసరం, పరిస్థితులను, అవకాశాన్ని బట్టి వర్గ సంఘర్షణకు కూడా దిగవలసిన అవసరం యెంతైనా వున్నది. కొమింటాంగులో యీ అవకాశాన్ని వినియోగించు కొనగల వ్యూహరచన లేకపోవటంచేత కమ్యూనిస్టు పార్టీ ప్రజా వుద్యమాన్ని సంఘటిత పరచటంలో విఫలమయి చివరకు విప్లవ పరాజయానికి కూడా కారణ భూతమయినది.

చైనా విప్లవ అపజయంలో ఎవరి పాత్ర ఎంతవరకు వున్నది అని మీమాంస వచ్చినప్పుడు ఇదమిత్థంగా ఏదీ నిర్ణయించటానికి వీలులేదు. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్, రష్యను నాయకులు ఐరోపా కాపిటలిస్టు దేశాల చరిత్రను ఉదా హరణంగా తీసుకొని, మార్క్సిజాన్ని గ్రుడ్డిగా అనుకరించి యధార్థ పరిస్థితులు గమనించలేక పోయారు. చైనాలోని రష్యను సలహాదారులు మాస్కో సలహాలను

వు.చ. తప్పకుండా అమలు చేయటానికి ప్రయత్నించారు. కాని వారికి పరిస్థితుల ననుసరించి స్వతంత్రంగా ఆలోచించే శక్తి లేదు. బరోడిన్ సామ్రాజ్యవాద వ్యతిరేక ఐక్య పోరాటానికి ప్రాధాన్యం యిచ్చాడు. రాయ్ వూహాన్ (వాంగ్) ప్రభుత్వమయిన లెఫ్ట్ కొమింటాంగ్ పార్టీని విప్లవ పార్టీగా రూపొందించటానికి ప్రాముఖ్యత యిచ్చాడు. అయితే అప్పటి చైనా పరిస్థితులు ఏ ఒక్క దానిమీద ఆధారపడే స్థితిలో లేవు. ఒక వేళ వున్నా విప్లవ ప్రతిఘటన శక్తుల ధాటికి తట్టుకొనగల స్థితిలో లేవు. అప్పటి ప్రత్యేక పరిస్థితుల వలన జమీందారీ, మిలిటరీ లార్డుల ప్రభావం బాగా వున్నది. దానిని ప్రతిఘటించగల శక్తిని కర్షక సంఘాలు, కర్షక వుద్యమం ద్వారానే సంఘటిత పరచవలసి వున్నది. కాని చైనా కమ్యూనిస్టు పార్టీ ఆ వుద్యమాన్ని సక్రమ కార్యక్రమాన్నిచ్చి, సక్రమ పంథాలో నడుపలేని లోపంచేతనే విప్లవం అపజయం పొందక తప్పినదికాదు. తరువాత మావో యిదే కార్యక్రమంతో కర్షక వుద్యమాన్ని నడిపి విప్లవం సాధించగలిగాడు.

రాయ్‌ని కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ బహిష్కరించటానికి, స్టాలిన్ ఆగ్రహానికి గురికావటానికి [illegible] కమ్యూనిస్టులు చైనాలో రాయ్ పాత్రను గురించి అనేక కట్టుకథలు అల్లి అపనింపాలు చేయటానికి బహుళ ప్రచారం సాగించారు. కాని వారి ప్రచారంలో ఏ మాత్రం యదార్థం కనబడదు.

వాంగ్‌కు రాయ్ స్టాలిన్ పంపిన టెలిగ్రామ్ చూపించటం ఒక పెద్ద తప్పిదంగా ఆరోపించటం జరిగినది. ఆ టెలిగ్రామ్ చూపటం వలననే అభివృద్ధి నిరోధకులయిన వాంగు అనుయాయులు చియాంగుతో రాజీ పడటానికి కృషి తీవ్రతరం చేసారని వారి వాదన. ఇందులో సత్యం ఏ మాత్రం లేదు. అంతకుముందు నుంచే వాంగు అనుచరులు కమ్యూనిస్టులతో తెగత్రెంపులు చేసుకోవాలని, నాంకింగు ప్రభుత్వంతో రాజీ కుదుర్చుకోవాలని చియాంగ్‌తో రహస్య మంతనాలు జరుపుతున్నారు. ఈ రహస్యం అప్పటి కమ్యూనిస్టు పార్టీ, బరోడిన్ మొదలయిన వారికి కూడా తెలుసు. వాంగ్‌కు స్టాలిన్ లోగడ యిచ్చిన హామీల మీద నమ్మకం తగ్గినది. సైనికాధికారులు దూరం కాసాగారు. కనుక ఆత్మరక్షణకొరకు అభివృద్ధి నిరోధకులతో లాలూచీకి దిగటానికి సిద్ధపడ్డాడు. ఇట్టి పరిస్థితుల్లో రాయ్ వాంగుకు రష్యా మీద, కమ్యూనిస్టుల మీద పూర్తి నమ్మకం కలిగించి అభివృద్ధి నిరోధకులకు లొంగకుండా కమ్యూనిస్టుల ప్రజా వుద్యమాన్ని బలపరచటానికి ఆయత్తుని చేయటానికే ఆ టెలిగ్రామ్ చూపటం జరిగినది.

రాయ్ మాస్కో చేరగానే చైనా కమ్యూనిస్టు పార్టీ ఐదవ కాంగ్రెసు సమావేశంలోని చర్చలు, తీర్మానాలు, రాయ్ చైనాలో వున్న సమయంలో పార్టీ కేంద్ర సంఘ సమావేశాల్లో జరిగిన చర్చలు, సారాంశాలు, తీర్మానాలు అన్నీ కలిపి చైనా విప్లవం పేరుతో పుస్తకం రచించాడు. ఇది రష్యన్ భాషలో స్టేటు పబ్లిషింగు డిపార్టుమెంటుచే ప్రకటించబడినది. రాయ్ జర్మనీ వెళ్ళినప్పుడు దీనిని ఇతర భాషలలో కూడా ప్రచురించే ప్రయత్నంలో వుండగా సోవియట్ ప్రభుత్వం కోరిక మీద వ్రాత ప్రతిని తిరిగి రష్యా పంపాడు. తరువాత 1930 లో జర్మనీ భాషలో రాయ్ రచించిన 'చైనాలో విప్లవం-ప్రత్యాఘాత విప్లవం'-బృహద్గ్రంథం ప్రచురించ బడినది. తరువాత రెండు ప్రకరణాలు చేర్చి ఇంగ్లీషు భాషలో కూడా యీ పుస్తకం రచించాడు. కాని కొన్ని కారణాల వలన యిది 1946 లో గాని ప్రచురింపబడలేదు.

రాయ్ 1928 వరకు మాస్కోలో వుంటూనే కొన్ని ప్రధాన బాధ్యతలను కూడా నెరవేర్చాడు. అదే విధంగా మాస్కో చేరిన బరోడిన్ కూడా తరువాత బాధ్యతగల అనేక ప్రభుత్వ పదవులను (లేబరు కమీషనరు, టాస్ డిప్యూటీ ప్రధానాధికారి, కాగిత పరిశ్రమ మేనేజరు, మాస్కో దిన పత్రిక సంపాదకుడు) అలంకరించాడు. చివరకు 1945 లో స్టాలిన్ పార్టీ శాసనంలో వ్యతిరేక ముఠాకు చెందిన వానిగా బరోడిన్ సైబీరియా లేబరు క్యాంపుకు పంపబడి అచ్చటే 1951 లో మరణించాడు.

ఐక్య పోరాటాన్ని వలస రాజ్యాలలో ఎప్పుడు, ఏ పరిస్థితులలో, ఎంత వరకు ఆచరించాలో స్టాలిన్ నాయకత్వం క్రింద వున్న కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ స్పష్టీకరించ లేకపోవటం చేతనే వలస రాజ్యాలలోని కమ్యూనిస్టు వుద్యమాలు పతనం కావలసి వచ్చినవి.

పెక్కు సంవత్సరాల అనంతరం ప్రఖ్యాత అమెరికను రచయిత చైనా అభిమానపరుడు ఎడ్గార్ స్నో మావోను కలుసుకొని 1927 విప్లవ పరాజయానికి కారణభూతు లెవరని ప్రశ్నించినప్పుడు మావో ఇచ్చిన సమాధానం - "భారత ప్రతినిధిగా కామింటరనులో వున్న యమ్. యన్. రాయ్ చెన్, బరోడిన్‌ల కంటె తీవ్రవాది గానే నిలబడ్డాడు. కేవలం ఆతడు అలా నిలబడటం మితిమీరి మాట్లాడటం మినహాయించి ప్రత్యేకంగా విప్లవ సాధనకు తగిన కార్యక్రమాన్ని చూపలేక పోయాడు." మావో అభిప్రాయం ప్రకారం అప్పటి పరిస్థితుల ననుసరించి రాయ్

అవివేకిగా, బరోడిన్ తప్పుచేసిన వానిగా, చైనా కమ్యూనిస్టు ప్రధాన కార్యదర్శి చెన్ తనకు తెలియకుండానే దేశ ద్రోహిగా ప్రవర్తించినట్లు వర్ణించబడినది.

కాని రాయ్‌ని గురించి మావో ఆ విధంగా వర్ణించటం సమంజసంకాదు. ఆ కాలంలో మావో పెద్ద నాయకునిగా గుర్తింపబడలేదు. ఆయన చైనా కర్షక సంఘానికి అధ్యక్షునిగా ఒక చిన్న నాయకునిగానే చలామణి అయ్యాడు. కాగా ఆ విప్లవ సమయంలో మావో ప్రత్యేకించి విప్లవ విజయానికి ఏ కార్యక్రమ పంథా కూడా చూపలేదు. రాయ్ విప్లవ కార్యక్రమం, పంథా చూపాడు. కాని అన్ని అధికారాలు చెన్, బరోడిన్ చేతులలో వుండటంచేత ఆయన కార్యక్రమం క్రియా రూపం దాల్చటానికి వీలులేక పోయినది.

1927 విప్లవాన్ని గురించి మావో అభిప్రాయాలను ఎడ్గార్ స్నో వివరించిన దానిని బట్టి యిలా వున్నది. "కొమింటాంగ్‌తో తెగ తెంపులు చేసుకునే ముందు కమ్యూనిస్టు పార్టీ భూమిని జాతీయం చేసి, కార్మిక-కర్షక వర్గాలకు ఆయుధాలిచ్చి సైన్యాన్ని నిర్మించ గలిగినా విప్లవ ప్రత్యాఘాత చర్యలను ఓడించగల స్థితిలో వుండగలిగేది కాదు".

ఇదే అభిప్రాయంలో మావో వుంటే రాయ్, బరోడిన్, చెన్‌ల గురించి ఆయన తీవ్రంగా విమర్శించి నిరసించటంలో అర్థంలేదు. రాయ్ జైలులో వున్నప్పుడు 1931 లో చైనాను గురించి ఒక చిన్న గ్రంధం రచించాడు. అది రహస్యంగా బయటకు పంపటం యస్. కె. విద్యార్థి పేరుతో 1932 లో ప్రచురింప బడటం జరిగినది. తరువాత రాయ్ జైలునుంచి బయటకు వచ్చిన తరువాత 'చైనాలో నా అనుభవం' పేరుతో తిరిగి ముద్రించటం జరిగినది. 1946 లో 'చైనా విప్లవం - ప్రత్యాఘాత విప్లవం' బృహద్గ్రంథం వెలువడినది. వీటన్నిటిని విమర్శనా దృష్టితో చూడగలిగితే రాయ్ చైనాలో ప్రవర్తించిన తీరు తెన్నులు, అచ్చటి ఆర్థిక, రాజకీయ, సాంఘిక పరిస్థితులు విశదం కాగలవు. ఒక ప్రముఖ చైనా రచయిత చైనా విప్లవాన్ని గురించి "కొన్నివేల మైళ్ళదూరంలో వుండి ముక్కూ, మొగము తెలియకుండా అది చేయాలి, ఇది చేయాలి అని ఆజ్ఞాపించటం, ఆ ఆజ్ఞలు చేరే లోగా యిక్కడ నూతన సంఘటనలు జరిగిపోవటం, మళ్ళీ నూతన సందేశాల కొరకు ఎదురు చూడటం అప్పటి చైనా విప్లవ చరిత్ర" అని వర్ణించాడు.

ఏది ఏమైనా రాయ్ చైనా యాత్ర విఫలమయినదని అంగీకరించక తప్పదు. అయితే ఆ యాత్రలో తాను గడించిన విశేష అనుభవం తన మాతృదేశ మయిన భారతదేశంలో వినియోగించటానికి చక్కని అవకాశం లభించినది.

# నిందారోపణలు:

రాయ్ తన అనుచరబృందంతో అతిప్రయాసతో అనేక యిబ్బందులను అధిగమించి 1927 సెప్టెంబరులో చైనా నుంచి మాస్కో తిరిగి చేరుకున్నాడు. అయితే రాయ్ వూహించిన స్వాగతం లభించలేదు. చైనాలో తన చర్యలను సమర్థించుకొనగల సమర్థత రాయ్ కున్నది. కాని స్టాలిన్ రాయ్ కట్టి కవకాశమీయక కలుసుకొనటానికి కూడా నిరాకరించాడు. అట్టి వాతావరణంలో రాయ్ చర్యలను సమర్థించ గలిగినవారు ఏ కొద్దిమందో కనబడసాగారు. అందులో బ్రిటిషు కమ్యూనిస్టు పార్టీ సభ్యులు రజనీపామీదత్తు, ఆయన సోదరుడు క్లిమెన్సుదత్తు, మరికొందరు వున్నారు. బరోడిన్ తనకు కూడా ఆశించినంత ఆదరణ లభించని కారణంచేత కాబోలు చైనాలో రాయ్‌తో తీవ్రంగా భేదించినా తిరిగి రష్యాలో సన్నిహితుడు కాసాగాడు.

రాయ్ మీద స్టాలిన్, ఇతర కమ్యూనిస్టు నాయకుల వ్యతిరేకభావానికి చైనా విప్లవంకంటె మిన్నగా ఇతర కారణాలు కొన్ని సాకుగా ప్రచారం లోనికి వచ్చినవి. రాయ్ చైనాలో వున్న సమయంలో భారతదేశం నుంచి బెంగాలు రాష్ట్ర కార్మిక - కర్షక పార్టీ కార్యదర్శినని చెప్పుకొని సోమేంద్రనాథ్ టాగూరు అనే ఒక వ్యక్తి మాస్కో వచ్చాడు. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ కోశాధికారి, ఆర్గనైజింగు ప్రధానాధికారి అయిన పియాట్నిట్స్కీని కలుసుకొని రాయ్‌కి వ్యతిరేకంగా "రాయ్ భారతదేశంలో కమ్యూనిస్టు పార్టీ సభ్యత్వాన్ని అతిగా చూపించి అందుకు అతిగా కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ నుంచి నిధులను స్వీకరించి తన స్వంతవినియోగం కొరకు దుబారా చేయుచున్నాడు" అని నివేదిక సమర్పించాడు.

పియాట్నిట్స్కీ ఒక తరహా మనస్తత్వం కలవాడు. కోశాధికారి కావటం చేత వివిధదేశాల కమ్యూనిస్టు పార్టీ ప్రముఖుల ఆదర అభిమానాలు, మన్ననలు,

పొగడ్తలు పొందటానికి ప్రయత్నిస్తూ వుండేవాడు. ఆర్గనైజింగు అధికారిగా నిధుల కొరకు తన దగ్గరకు వచ్చిన వారిని కమ్యూనిస్టు కార్యక్రమాలు అక్షరాలా అమలు జరిపించాలనే పట్టుదలతో అయిన దానికీ, కాని దానికీ విమర్శించి కార్యక్రమాలు అమలుచేయటం లేదని, నిధులు సక్రమంగా వినియోగించటం లేదని, సభ్యత్వం పెంచటం లేదని అర్థరహితమయిన విమర్శలకు, దూషణలకు గురిచేసే మనస్తత్వాన్ని అలవరచుకున్నాడు. కాగా సర్వదా స్టాలిన్ అభిమానపాత్రుడు కావాలనే తాపత్రయంతో తాని ప్రవర్తనను చేపట్టినట్లుగా కనబడేవాడు. కాని రాయ్ కెప్పుడూ పియాట్ నిట్స్కీని పొగడవలసిన అవసరం రాలేదు. సాధారణంగా వారిద్దరూ కలసి మెలసి వుండేవారు కూడా కాదు. తన కిచ్చిన నిధులలో సంవత్సరాంతంలో మిగులు వుంటే తిరిగి యిస్తూ వుండేవాడు.

చైనా విప్లవ పరాజయంతో స్టాలిన్ లెఫ్ట్ కమ్యూనిజం వైపుకు మొగ్గ సాగాడు. పైగా తాను మొదట బలపరచిన 'ఐక్య పోరాటం' పనికిరాదు అనే నిర్ణయానికి వచ్చాడు. స్టాలిన్ అభిప్రాయం ప్రకారం "కమ్యూనిస్టులు జాతీయ వుద్యమాలలో ఇతర పార్టీలతో ఏ మాత్రం పొత్తు పెట్టుకొనకూడదు. బూర్జువా వర్గంతోపాటు కర్షక వర్గం, పెట్టీ బూర్జువావర్గానికి చెందిన చిన్న వ్యాపారస్థులు, మధ్యతరగతివారు అందరూ విప్లవ వ్యతిరేకులే. కార్మికవర్గ మొక్కటే విప్లవానికి అనుకూలం. కనుక కార్మిక నియంతృత్వం ద్వారానే విప్లవం సాధించగలము," అనే నిర్ణయానికి వచ్చాడు. ఇది గ్రుడ్డిగా వెనుకటి నిర్ణయాలను మార్చుకొనటం వినా అనుభవపూర్వకమైన నిర్ణయంకాదు. బుఖారిన్ దీన్ని వ్యతిరేకించాడు. రాయ్ చైనా నుంచి వచ్చిన తరువాత కూడా 'ఐక్య పోరాట' సిద్ధాంతాన్ని పూర్తిగా త్రోసి వేయలేదు. అది వొక సాధనంగా, కనీస కార్యక్రమంతో అన్ని వర్గాలను సంఘటిత పరచి వర్గ సంఘర్షణలో కమ్యూనిస్టులు కార్మిక - కర్షక - పెట్టీ బూర్జువావర్గ బలంతో సామ్రాజ్యవాదులతో లాలూచిపడే బూర్జువావర్గాన్ని త్రోసివేసి జాతీయ వుద్యమ నాయకత్వాన్ని చేపట్టాలని వాదిస్తూనే వచ్చాడు. లోగడ లెనిన్‌తో యీ సిద్ధాంతం మీదనే రాయ్ ప్రతిఘటించాడు. అప్పటినుంచీ రాయ్ తన వాదాన్ని సమర్థించుకుంటూనే వచ్చాడు. రాయ్ 'ఐక్య పోరాటాన్ని' సమర్థించటంచేత బుఖారిన్ అనుయాయునిగా సందేహించబడ్డాడు.

రాయ్ మాస్కోలో తన జీవితం కేవలం ఏకపత్నీవ్రతునిగా, పరమ యోగిగా గడుపలేదని 1926 వరకు భార్య ఎవలిన్‌తో కలసి వున్నా యితర స్త్రీలతో

సాంగత్యం పెంచుకొని ప్రతిష్ఠను భంగకరంగా వ్యవహరించినట్లు నిందారోపణలు కూడా జరుగక పోలేదు. కాని తాను నమ్మిన సిద్ధాంతాల కొరకు ప్రాణం కూడా పణంగా పెట్టటానికి రాయ్ ఎప్పుడూ వెనుకాడలేదు. ఎన్నో లక్షలు రాయ్ చేతి మీదుగా నడిచినవి. కూడబెట్టుకోవాలనే ఆలోచన రాయ్‌కి ఎప్పుడూ కలుగలేదు. చివరకు తన భారతదేశ ప్రయాణం ముందు తన దగ్గర మిగుల్చుకొన్నది ఒంటిమీద దుస్తులు, రచించిన వ్రాత ప్రతులు మాత్రమే. దేశం వెళ్ళను సహచరుల ఆర్థిక సహాయంతోనే భారతదేశంలో కాలుపెట్ట గలిగాడు.

లెనిన్ మరణానంతరం అధికారం హస్తగతం చేసుకోవటంలో స్టాలిన్ ముందంజ వేయగలిగాడు. ట్రాట్స్కీ కున్న కుశాగ్రబుద్ధి, మేధాసంపత్తి స్టాలిన్‌లో లేవు. విప్లవ పోరాటంలో, అంతర్యుద్ధంలో ట్రాట్స్కీ స్టాలిన్ కంటె మిన్నగా వ్యవహరించాడు. అయినా 'ప్రపంచ విప్లవం' పూర్తి కానిదే 'విప్లవ పోరాటం' ఆపగూడదనే తీవ్రవాద ధోరణి అవలంబించటంచేత లెనిన్ స్టాలిన్ వైపు మొగ్గు చూపటం ప్రారంభించాడు. మొదట్లో రాయ్ ట్రాట్స్కీని అభిమానించినా లెనిన్ అభిప్రాయాన్ని గ్రహించటంతో స్టాలిన్‌కు దగ్గరయి, సన్నిహితునిగా, అభిమాన పాత్రునిగా వ్యవహరించ కలిగాడు.

స్టాలిన్ కార్యశూరుడు. తన ప్రాబల్యం కొరకు కామింటరనులో, రష్యాతోపాటు వివిధదేశాల కమ్యూనిస్టు పార్టీలలో మేధాసంపత్తి, వ్యక్తిత్వం గల నాయకులను తొలగించి తనకు అనుచరులను, వందిమాగధులను అగ్రస్థానాలకు నియామకం చేయటంలో కృతకృత్యుడు కాగలిగాడు. కామింటరను కంటె రష్యా కమ్యూనిస్టు పార్టీ, దానికి అధినేతగా స్టాలిన్ మొత్తం కమ్యూనిస్టు ప్రపంచానికి నియంతగా రాణించగలిగాడు. దీనిఫలితంగా ముఖ్యంగా జర్మనీ, ఫ్రెంచి, ఇటలీ కమ్యూనిస్టు పార్టీలు తీరని అపచారానికి గురి అయినవి. మేధాసంపత్తి క్షీణించ సాగినది. స్వతంత్ర అభిప్రాయాలు వెల్లడించి ఒక నిర్దిష్ట కార్యక్రమం రూపొందించే సామర్థ్యం సన్నగిల్లినది. ఈ కుట్ర ఫలితంగా రాయ్ కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ నుంచి దూరం చేయబడ్డాడు. తన అభిప్రాయాలను బాహాటంగా వెల్లడించటమే రాయ్ చేసిన మహాపరాధం.

పియాట్ నిట్స్కీకి అవకాశం దొరికినది. "పార్టీ నిధులను దుబారా చేస్తున్నాడు. భారతదేశ కమ్యూనిస్టు ఉద్యమానికి తగిన కృషి చేయటంలేదు.

బుఖారిన్ అనుయాయునిగా చేరి స్టాలిన్‌కే ఎసరు పెట్టుచున్నాడు. ట్రీలోలుడై కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ ప్రతిష్టకు భంగకరంగా వ్యవహరిస్తున్నాడు...."
ఇంకా, ఇంకా కారణాలు చూపి రాయ్‌కి వ్యతిరేక నివేదిక తయారుచేసి కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ నుంచి రాయ్‌ని తొలగించటానికి పథకం రూపొందించాడు.

1927 అక్టోబరులో రాయ్ మాస్కోనుంచి బెర్లిను వెళ్ళాడు. 1928 ఫిబ్రవరిలో జరుగనున్న కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ 9 వ కార్యనిర్వాహకవర్గ సమావేశంలో పాల్గొనటానికి మాస్కో తిరిగి వెళ్ళాడు. బెర్లిను కమ్యూనిస్టు నాయకులు రాయ్ మాస్కో వెళ్ళినందున ప్రయోజన ముండదని ముందుగానే రాయ్‌ని హెచ్చరించారు. కాని రాయ్ చైనాలోని తన కార్యక్రమాన్ని వ్యక్తపరచి స్టాలిన్‌ను ఒప్పించగలననే నమ్మకంలో వున్నాడు. చైనా విప్లవం గురించి కొంత మంది నిపుణులు అనేక సమావేశాలు జరిపి ఒక నివేదికను తయారుచేసారు. ఆ నివేదికను చర్చించటానికే 9 వ కార్యనిర్వాహక వర్గ సమావేశం ఏర్పాటుచేయట మైనది.

రాయ్ 1928 ఫిబ్రవరి 4 న మాస్కో చేరాడు. కాని వాతావరణం వూహించిన దానికి భిన్నంగా కనబడినది. కాంటను (చైనా) పరాజయానికి, అచ్చటి కార్మిక వుద్యమంలో కమ్యూనిస్టుల పలుకుబడి తగ్గటానికి కారణభూతుడయిన హెంజ్‌న్యూమాన్ కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ విమర్శకు గురి కావలసిన ప్రధమ వ్యక్తి. ఆయనను గురించి రాయ్ ఆదివరకే స్టాలిన్‌కు నివేదిక అందచేసి వున్నాడు. కాని న్యూమాన్ రాయ్ బెర్లినులో వున్నప్పుడు స్టాలిన్ అనుచరునిగా వ్యవహరించి ట్రాట్స్కీ, జినోవీవ్, కామెనేవ్‌లతో వ్యతిరేకించి వారి పతనానికి తోడ్పడగలిగాడు. ఈ విషయం రాయ్‌కి తెలియదు. స్టాలిన్ విధానాలను సమర్ధించటంచేత న్యూమాన్ చైనాలో చేసిన తప్పిదానికి భిన్నంగా పొగడబడ్డాడు.

రాయ్ బెర్లినులో వుండగానే చెవి బాధతో కొంత అస్వస్థుడయ్యాడు. మాస్కో చేరేటప్పటికి అది భరించలేని బాధగా పెరిగినది. ఆస్పత్రిలో చేరి ఆపరేషన్ చేయించుకున్నాడు. తాత్కాలికంగా ఉపశమనం కనిపించినా మరొక ఆపరేషను చేయవలసిన అవసరం వుండటంచేత అస్వస్థునిగా ఆస్పత్రిలోనే వున్నాడు. సహజంగా కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ సభ్యులను క్రెమిలిన్ హాస్పిటలులో చేర్చటం పరిపాటి. కాని రాయ్‌ని దీనికి భిన్నంగా మాస్కో వెలుపల వున్న ఒక చిన్న హాస్పిటలులో చేర్చటం జరిగినది.

రాయ్‌కి తన భవిష్యత్తును గురించి అనుమానం కలుగకపోలేదు. అంతా అయోమయంగానే కనబడసాగినది. తనతో చైనా వచ్చిన లూయిూ గ్లేసరు అనే ఒక స్విస్ వనితకు "ఇచ్చట నా వ్యాధి కుదిరే పరిస్థితులు కనబడటంలేదు. బయటకు వెళ్లాలను కుంటున్నాను. కాని డాక్టర్లు అనుమతించటంలేదు" అని నర్మగర్భంగా వుత్తరం వ్రాసాడు. ఆమె ఆ ఉత్తరంలోని రహస్యం గమనించిన వెంటనే మాస్కో వచ్చినది. బరోడిన్ సహాయంతో రాయ్‌ని ఆ హాస్పిటలునుంచి హోటలు లక్సుకు తరలించినది. తరువాత ఆమె రాయ్‌ని బెర్లిను తీసుకొని వెళ్ళటానికి ఏర్పాట్లు చేసినది. కాని రాయ్‌ని అపరాధిగా చూపదలచిన పియాట్ నిట్స్కి 'రాయ్ జర్మనీలో అరెస్టు కాబడవచ్చు'ననే మిషతో రాయ్ ప్యాసుపోర్టును తిరిగి యివ్వటానికి నిరాకరించాడు. అప్పటికి బుఖారిన్ పలుకుబడి యింకా తగ్గలేదు. ఆయన సహాయంతో ఆమె కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ ఆఫీసునుంచి రాయ్ ప్యాసుపోర్టు, వీసాలు సంపాదించినది. లూసో బెర్లిను విమానసర్వీసు డైరెక్టరును కలుసుకొని ఎంతో ప్రయాసతో బెర్లినుకు రెండు సీట్లు రిజర్వుచేయించి రాయ్‌ని బెర్లినుకు తీసుకొని వెళ్ళగలిగినది. రాయ్ తిరిగి మాస్కో వెళ్ళగల అవకాశం లేదని నిశ్చయించుకొనక పోయినా అది మాస్కోనుంచి చివరి యాత్రగానే పరిణమించినది.

రాయ్ 1928 ఏప్రియల్ మాసంలో బెర్లిను చేరాడు. చెవిబాధ పెరిగినది. చీము రాసాగినది. దీనికితోడు గుండెబాధ కూడా యేర్పడినది. ఆపరేషను చేయవలసిన అవసరమున్నా చాల దుర్బలంగా వుండటంచేత డాక్టర్ల సలహా ననుసరించి కొంతకాలం ఒక ఎత్తైన ప్రదేశంలో విశ్రాంతి తీసుకున్నాడు. క్రమేపి ఆరోగ్యం కుదుటబడసాగినది. ఈ సమయంలోనే తన వాదన, కార్యక్రమం సమర్థించుకొనటానికి 'చైనా విప్లవం - ప్రత్యాఘాత విప్లవం' గ్రంథాన్ని జర్మనీ భాషలో పూర్తి చేసాడు. 'ఇంటర్నేషనల్ ప్రెస్ కరస్పాండెన్సు' పత్రికకు తరచుగా భారతదేశం గురించి, భారతదేశంలో ఐక్య పోరాట అవసరాన్ని, కార్యక్రమం గురించి అనేక వ్యాసాలు వ్రాసాడు.

# ఆరవ వరల్డు కాంగ్రెసు :

1928 జూలై నెలలో కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ ఆరవ కాంగ్రెసు మహాసభ జరిగినది. ఇందులో కమ్యూనిస్టు సిద్ధాంతంలో, విధానాలలో పెద్ద మార్పు తీసుకొని రాబడినది. వలస రాజ్యాలలో కమ్యూనిస్టు కార్యక్రమాలు పూర్తిగా మార్చబడినవి. నూతన సిద్ధాంతం, నూతన కార్యక్రమం ఆచరణలో పెట్టాలని ఆదేశించటం జరిగినది. లెనినిజం పోయి స్టాలినిజం వచ్చినది. తత్ఫలితంగా అంతర్జాతీయంగా కమ్యూనిస్టు పార్టీలు, విప్లవ వుద్యమాలు తిరుగుముఖం పట్టి తలక్రిందులు కాసాగినవి.

ఇందుకు ప్రధాన కారణం చైనా విప్లవం విఫలం కావటమే. అందుకు కారణం "అచ్చటి బూర్జువా వర్గం విప్లవం విఫలం కావటానికి ప్రముఖ పాత్ర వహించినది. అంతేకాదు పెట్టీ బూర్జువా వర్గాలు కూడా విప్లవ వ్యతిరేక పాత్రను నిర్వహించినవి." అని చూపబడ్డది. కనుక కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ నూతన కార్యక్రమం చేపట్టి కమ్యూనిస్టు పార్టీలకు నూతన ఆదేశాలిచ్చినది.

"బూర్జువా వర్గాన్ని ఏ మాత్రం విప్లవ శక్తిగా అంగీకరించటానికి వీలు లేదు. సామ్రాజ్య పెట్టుబడిదారీ వర్గ ప్రయోజనాలకే అది వినియోగపడుతుంది. చైనాలోని అనుభవమే దీనికి తార్కాణం. ప్రోలిటేరియన్ కార్మికవర్గానికిది బద్ధ శత్రువు. గ్రామాలలో అతి బీద దశలో వున్న కర్షకులను, పట్టణాల్లో దరిద్రం అనుభవించే పెట్టీ బూర్జువా విద్యావంతులను సంఘటితపరచి విప్లవ చైతన్యవంతులను గావించి ప్రోలిటేరియన్ కార్మికవర్గానికి అనుబంధ సంస్థలుగా రూపొందించటానికి ప్రయత్నించవచ్చు. కాని అది కూడా కేవలం తాత్కాలిక పొత్తును కుదుర్చుకొనటానికి మాత్రమే జరగాలి. పెట్టీ బూర్జువా వర్గం కూడా విప్లవపాత్రను నిర్వహించదు. కనుక కమ్యూనిస్టు పార్టీలు తమ వ్యవస్థా నిర్మాణంలో, ఆంతరంగిక రాజకీయాలలో యీ పెట్టీ బూర్జువా శక్తులకు కూడా చోటు యివ్వకుండా చాలా జాగ్రత్తగా క్రమశిక్షణతో వ్యవహరించాలి. కాగా యీ వర్గం అటు పై వర్గాలకు, యిటు క్రింది వర్గాలకు మధ్యగా వూగిసలాడుతూ వుంటుంది కనుక వారి చర్యలను, మనస్తత్వాన్ని తీవ్రంగా ఖండించాలి.

"వ్యవసాయ కూలీ సంఘాలు, కర్షక సంఘాలు తేలిగ్గా పెట్టి బూర్జువా పార్టీలుగా మారటానికి అవకాశం వున్నది. కనుక వీటిని విప్లవ శక్తులుగా రూపొందించే అవకాశంలేదు. కాబట్టి కమ్యూనిస్టులు అట్టి పార్టీల నిర్మాణానికి తమ శక్తిని వృధాచేయకుండా దేశం నలుమూలల విస్తరించియున్న కమ్యూనిస్టు వ్యక్తులు, ముఠాలను సంఘటితపరచి బలవత్తరమయిన రహస్య కమ్యూనిస్టు పార్టీని నిర్మించాలి." ఇది స్టాలిన్ అల్ట్రా 'లెఫ్ట్ కమ్యూనిజానికి' ప్రతిబింబం.

దీని ఫలితంగా భారతదేశంలో జాతీయ కాంగ్రెసు బూర్జువా వర్గానికి చెందిన గాంధీ నాయకత్వమే కాదు, వామపక్షానికి చెందిన తీవ్రవాదులు కూడా నిశిత విమర్శనలకు గురి అయ్యారు. అసలు జాతీయ కాంగ్రెసుతోనే పొత్తు వుండరాదని ఆదేశింపబడినది. భారత కమ్యూనిస్టులు కూలీ సంఘాలను, కర్షక సంఘాలను పెట్టి బూర్జువా వర్గాలను సమీకరించటం విరమించుకొని ఎవరితోనూ పొత్తులేని ఫక్తు కమ్యూనిస్టు పార్టీని నిర్మించాలని కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ ఆదేశించినది.

బుఖారిన్ దీన్ని నిశితంగా విమర్శించి ఖండించాడు. "చైనాలో కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ సూచించిన విధానం సరియైనదే. కాని అచ్చటి పరిస్థితుల కనుగుణంగా చైనా కమ్యూనిస్టుల కార్యాచరణలో తేడా వచ్చినందువలననే విప్లవం అపజయం పొందవలసి వచ్చినది. కాగా భారత, చైనా దేశ పరిస్థితులు వేరు. చైనాలో జాతీయ ప్రభుత్వాలు నెలకొనినవి. సాయుధ తిరుగుబాటులు జరిగినవి. భారతదేశంలో అట్టి ప్రభుత్వమూ లేదు. సాయుధ తిరుగుబాటుకు అసలు అవకాశమే లేదు.... ప్రజా వుద్యమం తీవ్రరూపం దాల్చినప్పుడు పై వర్గాలయిన పెట్టుబడిదారులు, భూస్వాములు, జమీందారులు సామ్రాజ్య వాదులతో రాజీ పడటానికి ప్రయత్నించటం యదార్థమే. కనుక కమ్యూనిస్టులు దూరదృష్టితో తగు జాగ్రత్తను వహించి పై వర్గాలనుంచి వుద్యమ ప్రభావాన్ని తప్పించి ముందుకు తీసుకొని వెళ్ళవలసి వుంటుంది. అసలు జాతీయ కాంగ్రెసును, కాంగ్రెసులోని వామ పక్షాలను విడనాడటం ప్రజా వుద్యమానికే భంగకరం" అని వాదించాడు. ఒక విధంగా బుఖారిన్ చైనాలో విప్లవ పోరాటానికి ముందు స్టాలిన్ అనుసరించిన విధానాన్నే సమర్థించాడు.

కుసినెన్ వలస రాజ్యాలలోని విప్లవ వుద్యమాలను గురించి ఒక నివేదికను సిద్ధపరచి కాంగ్రెసు మహాసభలో ప్రవేశపెట్టాడు. "ఇప్పటికీ ఆలోచించినంతగా

వలస రాజ్యాలలో కమ్యూనిస్టు పార్టీలు స్థాపించబడలేదు. కొంతమంది కామ్రేడ్సు (రాయ్ మొదలయినవారు) సూచించిన విధంగా కార్మిక - కర్షక - పెట్టీ బూర్జువా పార్టీలను స్థాపించినందు వలన ప్రయోజనం శూన్యం. పైగా అది పెట్టీ బూర్జువా వర్గ ప్రాబల్యానికి దారితీస్తుంది. ఆ వర్గం విప్లవ వ్యతిరేకమని రుజువు చేసినది. కాగా పీడిత ప్రజానీకం(ప్రోలిటేరియన్ వర్గం)తో కమ్యూనిస్టుల సరాసరి సంబంధాలు కూడా సన్నగిల్లే అవకాశం వున్నది. కాబట్టి వలస రాజ్యాలలో కమ్యూనిస్టులు తమ స్వంతకాళ్ల మీద నిలబడి కమ్యూనిస్టు పార్టీలను ప్రభుత్వ నిషేధాజ్ఞలను అధిగమించటానికి వీలుగా రహస్యంగా యేర్పరిచి ప్రోలిటేరియన్ వర్గంతో సన్నిహిత సంబంధాలు పెంచుకొనటం అవసరం." కుసినెన్ సమర్పించిన నివేదిక సారాంశమిది.

ఆరవ వరల్డ్ కాంగ్రెసు మహాసభకు రాయ్ హాజరు కాలేదు. ఆయన పరోక్షంలో కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ నాయకులు రాయ్‌ని తీవ్రంగా విమర్శించారు. ఇందుకు రాయ్ 'డీకాలనైజేషను' సిద్ధాంతాన్ని వారు ప్రధాన ప్రాతిపదికగా తీసుకున్నారు. రాయ్ చైనా నుంచి తిరిగి మాస్కో చేరగానే ఆరవ కాంగ్రెసు మహాసభలో ప్రవేశపెట్టటానికి వలస రాజ్యమయిన భారతదేశంలో పారిశ్రామిక అభివృద్ధి, కాపిటలిజం పెంపుదలను గురించి 'డీకాలనైజేషను' పేరుతో సిద్ధాంతీకరించి ఒక ముసాయిదా తీర్మానం తయారుచేసాడు. ఈ సిద్ధాంతీకరణ ఆరవ కాంగ్రెసు మహాసభలో తీవ్ర విమర్శలకు గురి అయినది. కనుక దీని పూర్వాపరాలు స్థూలంగా తెలుసుకొనటం అవసరం.

1926 ఫిబ్రవరి - మార్చి నెలలలో సమావేశమయిన కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ కార్యనిర్వాహకవర్గ ఆరవ సమావేశంలో కాపిటలిస్టు దేశాల ఆర్థిక విధానం గురించి దీర్ఘ చర్చలు జరిగినవి. రాయ్ సిద్ధాంతం ప్రకారం ఐరోపా ఖండంలో కాపిటలిజం అంతిమ దశకు వచ్చి సామ్రాజ్య వాదం (ఇంపీరియలిజం) విషమ స్థితిలో పడినప్పుడు వలస రాజ్యాలలో పారిశ్రామిక అభివృద్ధి (డీకాలనైజేషను) జరుగక తప్పదు. మాతృ దేశాలలో పెట్టుబడిదారులు ఒక స్థాయిని మించి పరిశ్రమలను పెంచలేని స్థితికి రాక తప్పదు. వారి దగ్గర కుప్పలు-తిప్పలుగా పెరుగుచున్న ధనరాసులను తమ మాతృదేశంలో అదనపు పెట్టుబడులుగా వినియోగించి నందున వారికి ఆశించిన లాభాలు రాజాలవు. కనుక వలస రాజ్యాలలో తమ పెట్టుబడులను వినియోగించి అధిక లాభాలు గడించటానికి ప్రయత్నిస్తారు. వలస రాజ్యాలలో ముడి సరుకులు చవుకగా లభించటమే కాకుండా కార్మిక శక్తి కూడా

చవుకగానే వుంటుంది. దీని ఫలితంగా వలస రాజ్యాలను శాశ్వతంగా వలస రాజ్యాలగానే అట్టిపెట్టాలనే సామ్రాజ్యవాదితత్వంలో దానికి భిన్నంగా సవరింపు జరిగి వారి విధానానికి వ్యతిరేకంగానే వలస రాజ్యాలలో పారిశ్రామిక అభివృద్ధికి గాను కొన్ని రాయితీలు యివ్వటానికి, యిష్టంలేక పోయినా అంగీకరించక తప్పదు. తత్ఫలితంగా సామ్రాజ్యవాద పెట్టుబడులతోపాటు దేశీయ బూర్జువా వర్గం కూడా పెరిగి క్రమేపి తమ హక్కుల కొరకు ఆందోళనలు సాగించటం, ఆ ఆందోళనల ఫలితంగా వారికి కొన్ని రక్షణలు కల్పించి ఇద్దరూ కలిసి క్రింది వర్గాలను పీడించటానికి ప్రయత్నించటం జరుగుతుంది. ఈ విధానం వలన ఆర్థికంగా దేశీయ బూర్జువా వర్గాలకు రక్షణ కలిగించటం, రాజకీయంగా క్రింది వర్గాలను అణచటం జరుగుతుంది.

తరువాత పదవ కార్యనిర్వాహక వర్గ సమావేశంలో కూడా రాయ్ తన వాదాన్ని సమర్థించుకుంటూ "బ్రిటను సామ్రాజ్య తత్వం ముందుకు సాగే పరిస్థితులు లేకపోగా వలస రాజ్యాలలో తమ పెట్టుబడులను పెట్టగల స్థితిలో కూడా లేదు. కనుక అట్టి స్థితిలో పారిశ్రామికంగా అభివృద్ధి చెందుచున్న భారతదేశంలో కాపిటలిజం పెరగటానికి పరోక్షంగా దోహదకారి అయినా ఆర్థిక-రాజకీయ పెత్తనాలను మాత్రం తన చేతుల్లో వుంచుకొనటానికి ప్రయత్నిస్తుంది. దీని వలన బ్రిటిషు కాపిటలిజం, బ్రిటిషు సామ్రాజ్యవాదం తమ పతనానికి కాలాన్ని కొంత వరకు వెనక్కు నెట్టగలిగినా భారతదేశంలో దేశీయ పెట్టుబడిదారులే స్వయంగా కాపిటలిజం అభివృద్ధిపరచటానికి అనేక అవకాశాలు యేర్పడుచున్నవి. క్రమేపి కొంతకాలానికి భారతదేశమే తన వుత్పత్తి సరుకులను ఎగుమతిచేయగల స్థితికి రాగలదు. బ్రిటిషు కాపిటలిజం పెంచిన భారత కాపిటలిజం చివరకు బ్రిటిషు కాపిటలిజంతో రాజీకి దిగి జూనియర్ పార్టనరుగా విప్లవ వుద్యమాన్ని అణచటానికి సహకరిస్తుంది. బ్రిటిషు ప్రభుత్వం ప్రవేశపెట్టే సంస్కరణలు, ఇతర విధానాలు కూడా రాజకీయంగా దేశీయ బూర్జువా వర్గం హస్తగతం చేసుకునే ప్రమాదం వున్న"దని రాయ్ స్పష్టీకరించాడు.

రాయ్ 'డీకాలనైజేషన్ సిద్ధాంతాన్ని కుసినెన్, ఇతర కమ్యూనిస్టు నాయకులు అనేక పెడర్థాలకు గురి చేయటం జరిగినది. "వలస రాజ్యాలలో ఏ సామ్రాజ్య ప్రభుత్వం కూడా పరిశ్రమలు స్థాపించటానికి, వలస రాజ్యాన్ని పారిశ్రామిక దేశంగా మార్చటానికి ప్రయత్నించదు. ఇది హాస్యాస్పదం, అసంభవం

కూడాను. రాయ్ తన సిద్ధాంతం ద్వారా బ్రిటిషు సామ్రాజ్యవాదం తన వలస రాజ్యమయిన భారతదేశానికి ఏ సంఘర్షణ, విప్లవం లేకుండానే స్వాతంత్ర్య ప్రదానం చేయటానికి సిద్ధపడుతుందనే విశ్వాసంలో వున్నాడు. ఇంతవరకూ మన కామ్రేడ్‌గా వున్న రాయ్ మితవాదులను మించి మితవాది అయినట్లు దీనివలన సుస్పష్టమయినది. అంతేకాదు ఆతడు బ్రిటిషు సామ్రాజ్యవాద బంటు" అని తీవ్రంగా విమర్శించటం జరిగినది.

స్టాలిన్ నిరంకుశత్వాని కిది పరాకాష్ట. తన మీద, తన పరోక్షంలో జరిగిన తీవ్రవిమర్శలకు రాయ్ చలించలేదు. తనకు అవకాశమిస్తే తన వాదనను సమర్ధించుకొనగల మేధాశక్తి రాయ్‌లో వున్నది. అట్టి అవకాశం నిరాకరించబడ్డది. కొమింటరనుకు 'బహిరంగ లేఖ' రూపంలో తనపై మోపిన అపనిందలకు సమాధానమిస్తూ "తాను సిద్ధపరచిన ముసాయిదా తీర్మానంలో ఏ ఒక అక్షరమయినా బ్రిటిషు ప్రభుత్వం భారతదేశానికి అంగీకారం లేక బహుమతి ప్రదానంగా స్వాతంత్ర్య మిస్తుందనే అర్ధాన్ని చూపమని, అలా చూపగలిగితే కొమింటరను విధించే శిక్షకు గురి కాగల"నని సవాలు చేసాడు. దానికి సమాధానం లేదు. అసలు రాయ్ 'డీకాలనైజేషన్' సిద్ధాంత తీర్మానాన్ని కూడా బయటపెట్టలేదు. తరువాత రాయ్, 'నా నేరం' 'మన విభేదాలు' అని సుదీర్ఘమయిన పత్రాలు కూడా పంపాడు. అవి కూడా బుట్ట దాఖలు చేయబడ్డవి.

"బ్రిటిషు సామ్రాజ్యవాద పతనానికి బ్రిటిషు ప్రభుత్వమే పరిస్థితుల ప్రాబల్యంచేత విషబీజాలను నాటుకొని తన గోతిని తానే త్రవ్వుకుంటుంది. ఈ అవకాశాన్ని దేశీయ బూర్జువా వర్గం తనకు అనుకూలంగా వుపయోగించుకొనటానికి కృషి సాగిస్తుంది. కాబట్టి విప్లవ భావాలున్న యితర పార్టీలతో బాటు కాంగ్రెసు వామపక్షీయులను కూడా సంఘటితపరచి వుద్యమ నాయకత్వం చేపట్టటం అవసరం. కమ్యూనిస్టులు అట్టి వారిని విమర్శించి దూరం చేసుకొనినందున ప్రయోజనం లేకపోగా ప్రజా వుద్యమం బూర్జువా వర్గ ఆధిపత్యంలో వుండి ప్రమాదానికి గురికాక తప్పదు" అని రాయ్ హెచ్చరించాడు.

ఇది అసాధారణమైన సిద్ధాంతం. ఊహాతీతమైనది కూడాను. ఆ కాలంలో దీని యుక్తాయుక్తములను గ్రహింపగలిగినవారు చాల అరుదు అనే చెప్పక తప్పదు. కనుక రాయ్ ఇందుకు తీవ్ర విమర్శనకు గురికావటం సహజమే.

ఇదే విధంగా రెండవ ప్రపంచయుద్ధ సమయంలో కూడా రాయ్ నిశితంగా విమర్శింప బడ్డాడు. కాని యుద్ధానంతరం భారతదేశం స్వతంత్రరాజ్యం కావటం రాయ్ దూర దృష్టిని సూచిస్తున్నది. దీనిని చరిత్రకారులు 'గాంధీ భిక్ష'గా వక్రంగా చిత్రించటం గమనార్హం.

రాయ్ చైనాలో వున్నప్పుడు సోమేంద్రనాథ్ టాగూరు ఇంటర్నేషనల్ కార్యనిర్వాహకవర్గ రాజకీయ ఉపసంఘానికి ఒక నివేదికను సమర్పించి అందులో భారతదేశంలో ఆధునిక పరిశ్రమలు విరివిగా స్థాపించబడుచున్నట్లు వెల్లడించాడు. బుఖారిన్ యీ నివేదికను చూచి భారతదేశంలో 'డీకాలనైజేషను' ప్రారంభ మయినట్లు భావించి ఇంకా లోతుగా పరిశీలించవలసిన అవసరాన్ని గుర్తించి ఇందు కొరకు ఒక ప్రత్యేక సంఘాన్ని యేర్పరచాడు. బ్రిటిషు కమ్యూనిస్టు పార్టీ సభ్యుడు హ్యూ. పి. రత్‌బోనుకు భారతదేశ పారిశ్రామిక విధానం గురించి అవసరమయిన భోగట్టా సమకూర్చే బాధ్యత అప్పగించబడినది.

రాయ్‌ని చైనా నుంచి తిరిగి రాగానే యీ ఉపసంఘ నివేదిక ఆధారంతో ఒక సమగ్రమయిన నివేదికను (స్టేట్‌మెంటు) సంసిద్ధపరచమని కోరటం జరిగినది అస్వస్థుడై హాస్పిటలులో వున్నా ప్రతిరోజూ రాయ్ రత్‌బోనును తన దగ్గరకు పిలిపించుకొని ఆయన సమకూర్చిన భోగట్టా వివరాలు తెలుసుకుంటూ వచ్చాడు. తరువాత బెర్లినులో రత్‌బోన్ సహకారంతో 'బ్రిటిషు సామ్రాజ్య క్షీణదశ, పతనం' పేరుతో ఒక బృహద్గ్రంథాన్ని పూర్తిచేసి ప్రచురణకు ఒక కమ్యూనిస్టు పబ్లిషింగ్ హౌస్‌కు యివ్వటం జరిగినది. ఇది ప్రచురణ జరుగక ముందే నాజీ అధికారులు ఆ కార్యాలయాన్ని దాడిచేసి స్వాధీన పరచుకొని అచ్చట వున్న కమ్యూనిస్టు సాహిత్యంతోపాటు యీ వ్రాత ప్రతిని కూడా దగ్ధం చేసివేశారు.

అనేక చర్చలు జరిపి అవసరమయిన భోగట్టా సేకరించి బుఖారిన్ ఆదేశంతో రాయ్ సిద్ధపరచిన 'డీకాలనైజేషను' సిద్ధాంతం ఆరవ కాంగ్రెసు మహా సభలో నిశితంగా విమర్శనకు గురి కావటం గర్హనీయమయిన విషయం. ఈ పదాన్ని మొదట సృష్టించినది బుఖారిన్. కాగా కమ్యూనిస్టు ఇంటర్నేషనల్, రషియన్ కమ్యూనిస్టు నాయకులు చివరకు యీ పదాన్నే తేలికగా, వ్యాఖ్యాభావంతో ప్రయో గించసాగారు. రాయ్ 'డీకాలనైజేషన్' సిద్ధాంతాన్ని కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ తీవ్రంగా విమర్శించి, తిరస్కరించి, త్రోసివేయటంతో రాయ్ తనకు కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌లో స్థానం లేనట్లుగా భావించుకున్నాడు.

రాయ్ తరువాత జర్మనీలో ఒక సంవత్సరముండి తాను విశ్రాంతి కాలంలో చైనా విప్లవం గురించి తయారుచేసిన ప్రతిని సమగ్రంగా పరిశీలించి మొట్టమొదట జర్మనీభాషలో 'చైనాలో విప్లవం - ప్రత్యాఘాత విప్లవం' పేరుతో ప్రచురించాడు. అనతి కాలంలో లక్షప్రతులు అమ్ముడుపోయినవి. తరువాత ఇంగ్లీషు ప్రతిని కూడా పూర్తిచేయగలిగాడు. రాయ్ కథనం ప్రకారం 6 వ వరల్డు కాంగ్రెసు రాయ్‌ని 'డీకాలనైజేషను సిద్ధాంత కారకుడు కావటంచేత పెద్ద నేరస్తునిగా భావించినది. అయినా రాయ్ కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ నుంచి తొలగించబడలేదు. ఆ కాంగ్రెసు సమావేశం తరువాత దాదాపు ఒక సంవత్సరం వరకు రాయ్ భారతదేశాన్ని గురించి వ్రాసిన వ్యాసాలు కొమింటరను పత్రికలయిన 'ఇంప్రెసర్' లేబర్ మాసపత్రికలలో ప్రచురితమవుతూనే వచ్చినవి. తరువాత 1929 సెప్టెంబరుమాసంలో సమావేశమయిన కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ పదవ కార్యనిర్వాహకవర్గ సమావేశంలో రాయ్‌ని కమ్యూనిస్టు యింటర్నేషనల్ నుంచి తొలగించుతూ తీర్మానించటమైనది. దీనికి ప్రధాన కారణం రాయ్ కమ్యూనిస్టు కామ్రేడ్ కాదని, గాంధీ లేక జర్మనీకి చెందిన బ్రాండ్లెర్, థాల్‌హిమెర్ వర్గానికి చెందిన కామ్రేడ్ అని చెప్పబడినది.

ఇంతకంటె రాయ్‌ని గురించి కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌గాని, స్టాలిన్ గాని ఆయనను ఇంటర్నేషనల్‌నుంచి తొలగించటానికి ప్రత్యేక కారణాలను చూపలేదు. 1932 లో రషియన్ ప్రభుత్వ ప్రచురణలలో రాయ్ రచించిన 'చైనా విప్లవం - ప్రత్యాఘాత విప్లవం' విశేషంగా ప్రస్తుతింపబడినది. 1935 లో జరిగిన ఏడవ వరల్డు కాంగ్రెసు రాయ్ 1928 లో సూచించిన, కాని అప్పటి ఆరవ వరల్డు కాంగ్రెసుచే తిరస్కరింపబడిన కార్యక్రమాన్నే తిరిగి అంగీకరించటం ఆశ్చర్యకరమైన విషయం.

దీనికి కారణం యీ మధ్యకాలంలో వివిధ దేశాల్లోని కమ్యూనిస్టు పార్టీలు అస్తవ్యస్తకు గురిఅయి, ఛిన్నాభిన్నమయినవి. ప్రజలలో పలుకుబడి తగ్గినది. ఏకాకి జీవితం గడుపసాగినవి. ఉద్యమాలు సన్నగిల్లినవి. ఫాసిజం తలెత్తటానికి, విజృంభించటానికి పరోక్షంగా సహకరించినవి.

## అధికార రాజకీయాలు - అంతఃకలహాలు :

1928 ఫిబ్రవరిలో జరిగిన ఇంటర్నేషనల్ 9 వ కార్యనిర్వాహకవర్గ సమావేశంలో అంతవరకు బ్రిటిషు వలస విధానంలో ఆమోదించబడిన తీర్మానాలకు పూర్తి వ్యతిరేకత ప్రకటించబడినది. కొమింటరను ఆర్థిక శాస్త్రవేత్త యూజెన్‌వర్గా బ్రిటిషు ప్రభుత్వం భారతదేశంలో పారిశ్రామిక అభివృద్ధిని నిరోధించటానికి ప్రయత్నిస్తుందని ఒక సిద్ధాంతం రూపొందించాడు. ప్రపంచ యుద్ధ అవసరాన్నిబట్టి పారిశ్రామిక అభివృద్ధికి అంగీకరించినా భారతదేశాన్ని కేవలం వ్యావసాయిక దేశంగా వలస రాజ్యంగా వుంచాలనే బ్రిటిషు ప్రభుత్వం ప్రయత్నిస్తుంది అని తిరిగి ముడిసరుకుల ఎగుమతికే భారతదేశాన్ని వినియోగించుకొనటానికి చూస్తుందని ఇందుకు వుదాహరణంగా 1924 నుంచి భారతదేశంలో బ్రిటిషు పెట్టుబడులు తగ్గ సాగినవని వర్గా తన సిద్ధాంతాన్ని సమర్థించుకొనటానికి విశేషంగా ప్రయత్నించాడు.

కాని వర్గా సిద్ధాంతాన్ని బ్రిటిషు కమ్యూనిస్టు పార్టీ సభ్యులు, ఇండియన్ కమీషన్‌లో వున్న బ్రిటిషు, ఇండియన్ సభ్యులు కూడా తీవ్రంగా విమర్శించారు. భారత పారిశ్రామిక అభివృద్ధిని, అందుకు అనుకూలంగా బ్రిటను అనుసరిస్తున్న ఆర్థిక విధానాన్ని సహేతుకంగా చూపగలిగారు. కుసినెన్ వర్గాకు అండగా నిలబడి ఆయన సిద్ధాంతాన్ని బలపరచటానికి ప్రయత్నించాడు. కుసినెన్ స్టాలిన్ వర్గీయుడు. స్టాలిన్ అభిమానం కొరకే వర్గాను సమర్థించినట్లు కనబడినది. రాయ్‌ని, ఆయనతో బాటు బ్రిటిషు కమ్యూనిస్టు పార్టీని, అందులో ముఖ్యంగా రత్‌హోమ్, పామి దత్తులను తీవ్రంగా విమర్శించి 'డీకాలనైజేషన్' సిద్ధాంతాన్ని ప్రమాదభూయిష్టంగా వర్ణించాడు. మరి కొంతమంది సభ్యులు విషయ పరిజ్ఞానం లేకుండానే కుసినెన్‌ను సమర్థిస్తూ 'డీకాలనైజేషన్' సిద్ధాంతం సోషల్ డెమాక్రాటిక్ తత్వంగా వర్ణించారు. కుసినెన్ ఈ సిద్ధాంతాన్ని భారత స్వతంత్ర పోరాటానికి అవరోధంగా చిత్రించి భారత కమ్యూనిస్టులు స్వంత వుద్యమాన్ని, పోరాటాన్ని సాగించవలసి వున్నదని వ్యక్తీకరించాడు.

6 వ వరల్డు కాంగ్రెసు (1928) వరకు సభ్యులు తమ అభిప్రాయ భేదాలను, భావాలను బాహాటంగా ప్రకటిస్తూ వచ్చారు. కాని తరువాత అధికార రాజకీయ కుమ్ములాటలో వాక్ స్వాతంత్ర్యం అరికట్టబడినది. స్టాలిన్ ఆగ్రహానికి

గురికావలసి వస్తుందని అందరూ ముభావం వహించారు. స్వతంత్ర అభిప్రాయాలు కల్గి డీకాలనైజేషను మీద పరిశీలిక సంఘాన్ని నియమించిన బుఖారిన్ కూడా మూకీభావం వహించాడు. ఇది ఆయన అనుచరవర్గానికి ఆశ్చర్యం కలిగించినది. డీకాలనైజేషన్ సిద్ధాంతాన్ని సమర్థించినవారు సామ్రాజ్యవాద బంటులుగా వర్ణించబడటమే దీనికి కారణం.

1929 నాటికి స్టాలిన్ తన అధికారాన్ని సుస్థిరం చేసుకొని కొమింటరను చేత తన యిష్టంవచ్చిన సిద్ధాంతాలు, కార్యక్రమం అంగీకరింపచేయగల పలుకుబడిని పొందగలిగాడు. ఆయన మాటకు ఎదురులేదు. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ వెనుకటి విధానాల్ని విడనాడి ఒక్కసారి ఆ కొసనుంచి యీ కొసకు దూకినట్లుగా 'అల్ట్రాలెఫ్ట్' విధానం అవలంబించినది. దీని పర్యవసానం భారతదేశంలో అంతకు ముందు జాతీయ కాంగ్రెసు, జాతీయ వాదులతో కలసి జాతీయ వుద్యమాన్ని సాగించాలనే భారత కమ్యూనిస్టుల విధానం పూర్తిగా మారినది. జాతీయ కాంగ్రెసుతో తెగ తెంపులు చేసుకొనటమే కాదు, కాంగ్రెసులో వామపక్షానికి చెందిన జవహర్‌లాల్ నెహ్రూ, సుభాష్‌చంద్రబోస్ మొదలయిన తీవ్రవాదులు కూడా కమ్యూనిస్టుల దృష్టిలో విప్లవ వ్యతిరేక వర్గానికి చెందినవారుగా తీవ్ర విమర్శనలకు గురిఅయ్యారు.

రాయ్ జర్మనీ చేరినప్పటినుంచి ఆగస్టు థాల్‌హిమెర్, హెన్‌రిచ్ బ్రాన్‌డ్లెర్ మొదలయిన అపొజిషన్ కమ్యూనిస్టు నాయకులతో సన్నిహితుడు కాసాగాడు. స్టాలిన్ నిరంకుశ భావాలను ఎదిరించిన వారిలో వీరు ముఖ్యులు. వీరు 'అల్ట్రాలెఫ్ట్' కమ్యూనిజాన్ని వ్యతిరేకించి ఐక్య పోరాటాన్ని సమర్థించినవారు. కనుక కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ నుంచి వీరుకూడా స్టాలిన్ ఆగ్రహానికి గురిఅయి తొలగించబడ్డారు. బరోడిన్ తరువాత థాల్‌హిమెర్‌ను రాయ్ తన రాజకీయ గురువుగా భావించాడు. జర్మనీలో వుండగా వారితో కలసి వారి పత్రికలలో వ్యాసాలు వ్రాస్తూవుండేవాడు. వాస్తవానికి రాయ్‌ని కమ్యూనిస్టు ఇంటర్నేషనలు నుంచి తొలగించటానికి యిది ప్రధాన కారణంగా చూపించబడ్డది. రష్యను కమ్యూనిస్టు పార్టీలోని అంతఃకలహాలు, అధికార రాజకీయాలు వినా రాయ్‌ని కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ నుంచి దూరం చేయటానికి మరొక ప్రబల కారణమేమీ కనబడదు.

మొదటి నుంచి బుఖారిన్, రాయ్ ఒంపొరుల అభిప్రాయాలు దరిదాపుల్లో వుంటూ వుండేవి. తన అధికారానికి బుఖారిన్ అడ్డురాగలడనే అనుమానం స్టాలిన్‌కు బాగా వున్నది. 1927 నుంచి స్టాలిన్ వర్గం వీరిద్దరినీ రైట్ కమ్యూనిస్టులుగా విమర్శించటం ప్రారంభించినది. బుఖారిన్ అధిష్టించిన పదవుల నుంచి ఆయనను ఒకదాని తరువాత వొకటిగా తొలగించటం జరిగినది. బుఖారిన్ చేసిన నేరం - తన కున్న అభిప్రాయాలను బాహాటాంగా వెల్లడించటానికి వెనుదీయడు. సోవియటు కమ్యూనిస్టు పార్టీలో, కొమింటరనుతో కమ్యూనిస్టు విధానాల మీద భేదాభి ప్రాయాలు వచ్చినపుడు ప్రత్యర్థులకు భావస్వాతంత్ర్యం వుండాలనే తత్వం కలవాడు బుఖారిన్.

రాయ్ నేరం కూడా యిదే. ఆయన స్వతంత్ర ఆలోచనాపరుడు. క్రమ శిక్షణ, నిరంకుశత్వానికి ఎప్పుడూ తలవంచలేదు. కమ్యూనిస్టు నాయకుడు, మహా మేధావిగా ప్రసిద్ధి చెందిన లెనిన్‌తో వలస రాజ్య విధానంలో 1920 లో మొదటగా మాస్కో చేరినప్పుడే ప్రతిఘటించాడు. లెనిన్ సహనశీలుడు, ప్రజాస్వామ్యవాది కనుక భావప్రకటనా స్వాతంత్ర్యాన్ని అరికట్టలేదు. అంతేకాదు. ఇతరుల భావాలకు తగిన విలువ నిచ్చాడు. కాని స్టాలిన్ నిరంకుశవాది. ప్రజాస్వామ్యవాది కాదు. ఇతరుల భావాలకు విలువనీయగల సహనశీలత ఆయనలో లేదు. అధికారకాంక్షతో ప్రత్యర్థులను అణగద్రొక్కటానికి ఏ మాత్రం విచక్షణాజ్ఞానం, వివేచనాశక్తిని వుపయోగించని నియంతగా వ్యవహరించాడు.

ఒక సమయంలో లెనిన్ - బుఖారిన్, జినోవీవ్‌లకు ఇచ్చిన సలహా- "మీరు మీకు విశ్వాసపాత్రులు కాని వివేచనాపరులను పార్టీ నుంచి బహిష్కరించటం ప్రారంభిస్తే చివరకు మీకు మిగిలేది విశ్వాసపాత్రులయిన మూర్ఖులు మాత్రమే. దాని ఫలితం చివరకు పార్టీ సర్వనాశనం కావటం."

లెనిన్ చేయని పని, చేయకూడదని చెప్పిన పని స్టాలిన్ చేశాడు. తనకు ప్రత్యర్థులు అని సందేహించిన, వూహించిన వారి నందరినీ బలి చేశాడు. పర్యవసానం - సోవియట్ కమ్యూనిస్టు పార్టీ, కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ నిర్జీవ ప్రతిమలు కాక తప్పలేదు. దాదాపు పది సంవత్సరాలు సోవియటు నాయకుల ఆదరాభిమానాలకు పాత్రుడయి కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌లో లెనిన్, బుఖారిన్, ట్రాట్స్కీ, జినోవీవ్, కామనేవ్, స్టాలిన్ మొదలయిన నాయకులతో సమవుజ్జీగా

గౌరవ మర్యాదలు పొంది అనేక వున్నత స్థానాలను అలంకరించి ప్రముఖ బాధ్యతలను నిర్వహించిన రాయ్ కూడా స్టాలిన్ అధికార మారణహోమంలో ఒక ఇంధనం కాక తప్పలేదు.

ట్రాట్స్కీ మిలిటరీ నియంతృత్వాన్ని ఎదిరించిన బుఖారిన్‌కు అండగా నిలిచిన రాయ్‌ని లెనిన్ 'చారిత్రకంగా తీవ్రవాది' అని శ్లాఘించాడు. అట్టి తీవ్ర వాదులు స్టాలిన్ ఉగ్రతీవ్ర వాదాన్ని పనికి రాదన్నప్పుడు కేవలం 'మితవాదు'లుగా చిత్రింపబడి స్టాలిన్‌కి ఆగ్రహపాత్రులు కావలసి వచ్చినది. అయితే రాయ్ అదృష్ట వంతుడు. స్టాలిన్ ఆగ్రహానికి గురి అయిన అనేకమంది మేధావులు లేబరు క్యాంపులలో మ్రగ్గి మతిభ్రమణకు లోనయి నామరూపాలు లేకుండా నశించి పోయారు. మరికొందరు అప్పటికప్పుడే ఉరికంబా లెక్కించబడ్డారు. కాని రాయ్ లేబరు క్యాంపు, ఉరికంబం నుంచి తప్పించుకొనగలిగాడు. అయితే నిరాశా, నిస్పృహలతో విరక్తి చెందిన విరాగి కాలేదు. తన సహజ మేధాసంపత్తి తనకు అండగా వుండనే వున్నది. తన మాతృభూమికి తన అవసరం వుండనే వున్నది. ఆ కృతనిశ్చయం రాయ్‌లో అచంచలంగానే నిలచిపోయినది.

మాతృదేశ స్వాతంత్ర్యసిద్ధికి దేశం విడిచివెళ్లిన రాయ్ విదేశాలలో వున్నా తన ఆశయసిద్ధికి రూపురేఖలు దిద్దుతూనే వచ్చాడు. బరోడిన్ ఆదేశంపై మొదట రష్యా బయలుదేరటానికి అసమ్మతి ప్రకటించినా 'మాస్కో భారతదేశానికి మార్గం' అని బరోడిన్ చెప్పటంతో తాను రష్యా వెళ్లటానికి అంగీకరించాడు. తాష్కెంటు వెళ్లటం కూడా అదే భావన. అచ్చటినుంచి భారతదేశ వాయువ్య సరిహద్దులకు ఆయుధ సామగ్రిని చేరవేసి భారత విప్లవాన్ని విజయవంతం చేయాలని రాయ్ ఆకాంక్ష. తరువాత భారతదేశం వెళ్లాలని ప్రయత్నించినా రష్యన్ నాయకులు, ముఖ్యంగా స్టాలిన్ అడ్డుతగలటంతో తన ప్రయాణం వాయిదా వేసుకుంటూ వచ్చాడు. చైనాయాత్ర తరువాత భారతదేశం పంపగలమనే హామీ స్టాలిన్ నుంచి పొందిన తరువాతనే రాయ్ చైనాయాత్రకు సిద్ధపడ్డాడు. కాని పరిస్థితులు తారుమారు అయినవి. పైగా ఆరోగ్యం క్షీణించినది. అయినా రాయ్ నిరాశ, నిస్పృహలకు లోను కాలేదు. తన మాతృదేశంలో తన విధి నెరవేర్చాలంటే వేలకొలది మైళ్ల దూరంలో వుండటం ప్రయోజనకారిగా భావించలేదు. మాతృదేశంలో అడుగు పెట్టటానికి అవకాశం కొరకు ఎదురుచూడసాగాడు. తనకు భారతదేశంలో మొదట

కారాగారవాసం తప్పదని తెలుసు. అయినా తన ఆశయసిద్ధికి ఆ శిక్షను రాయ్ లెక్క చేయలేదు.

రష్యాను విడచిన తరువాత అచ్చటి కమ్యూనిస్టు ప్రభుత్వం సోవియటు కమ్యూనిస్టు పార్టీ, కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ 'కమ్యూనిస్టు చరిత్ర' నుంచీ రాయ్ చరిత్ర పుటలనే మటుమాయం చేసినది. ఇదే కమ్యూనిజం కోరే మానవ స్వాతంత్ర్యం. స్టాలిన్ అనంతరం ఇప్పుడిప్పుడే సోవియటు రష్యా రాయ్‌ని తిరిగి గుర్తిస్తున్నట్లుగా కనబడుతుంది. 1967 లో మాస్కో ప్రోగ్రెసివ్ పబ్లిషర్సు ప్రచురించిన 'లెనిన్ సంపుటాల'లో రాయ్ సంగ్రహ జీవితాన్ని గురించి ఈవిధంగా ఉదహరించబడ్డది.

'మానవేంద్రనాధ్ రాయ్ (1890–1949) భారత రాజకీయవేత్త. 1910-15 లో బ్రిటిషు సామ్రాజ్య వాదానికి వ్యతిరేకంగా విప్లవ వుద్యమంలో పాల్గొన్నాడు. 1915 లో విదేశాలకు వెళ్లాడు. తరువాత కమ్యూనిస్టు వుద్యమంలో చేరాడు. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ 2, 3, 4, 5 కాంగ్రెసు మహాసభలలో ప్రతినిధిగా పాల్గొన్నాడు. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ కార్యనిర్వాహకవర్గ సంఘంలో 1922 నుంచి క్యాండిడేట్ సభ్యుడు, 1924 నుంచి పూర్ణహక్కు గల సభ్యుడు. తరువాత కమ్యూనిస్టు వుద్యమాన్ని విడచి స్వదేశం చేరాడు. 1940 నుంచి భారత దేశంలో ప్రజాపార్టీ అయిన రాడికల్ డెమాక్రాటిక్ పార్టీకి నాయకత్వం వహించాడు. రాడికల్ హ్యూమనిస్టు అను పత్రికను ప్రచురించాడు."

ఇందులో రాయ్ జనన-మరణాలను గురించి కొద్ది పొరపాటులు కన బడుతున్నా అసలు గుర్తించవలసిన విషయం రాయ్ కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ నుంచి ట్రాట్స్కీ, బుఖారిన్, రాడెక్, జినోవీవ్ మొదలయిన వారి మాదిరిగా బహిష్కరింప బడినట్లుగాని లేక పార్టీ ద్రోహిగా పరిగణించినట్లుగాని చూపబడ లేదు. కాగా రాయ్ వినా మరే భారతీయుని పేరు ఇందులో ఉదహరించక పోవటం గమనార్హమయిన విషయం.

## స్వల్పకాల ప్రణాళిక:

1927 నుంచీ భారత జాతీయ కాంగ్రెసులో గాంధీ కోరే సంస్కరణ లను, డొమినియన్ స్టేటస్‌తో తృప్తిచెందని వర్గం 'సంపూర్ణ స్వరాజ్యం' తమ

ధ్యేయంగా ప్రచారం సాగిస్తూనే వచ్చినది. దీనికి తోడుగా దేశంలో ఆర్థికమాంద్యం రావటంతో కార్మిక-కర్షక వర్గాలు, మధ్యతరగతులు తీవ్ర అసంతృప్తి చెంది దీనికి మూలకారణం బ్రిటిషు ప్రభుత్వమేనని వ్యతిరేక భావం పెరుగసాగినది. 1928 లో కలకత్తా జాతీయ కాంగ్రెసు మహాసభ ఒక సంవత్సరంలోగా 'డొమినియన్ స్టేటస్' యివ్వకపోతే అహింసాయుతంగా సంపూర్ణ స్వరాజ్యానికి సమరం సాగించగలమని బ్రిటిషు ప్రభుత్వానికి అల్టిమేటమ్ యిచ్చినది. 1929 లో నెహ్రూ అధ్యక్షత క్రింద లాహోరులో జరిగిన కాంగ్రెసు మహాసభ సంపూర్ణ స్వరాజ్యాన్ని ప్రకటించటంతో కాంగ్రెసుకు అంతవరకు వూహించని ప్రజాబలం చేకూరి ఒక మహత్తర శక్తిగా రూపొందినది.

తీవ్రవాదిగా పరిగణించబడిన నెహ్రూ అధ్యక్షత క్రింద సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మానము ఆమోదించటం బెర్లినులో వున్న రాయ్‌కి భారతదేశ పరిస్థితులు ఆశాజనకంగా కనబడినవి. 'లాహోరు కాంగ్రెసు నుంచి నేర్చుకొనవలసిన గుణపాఠాలు' అను పేరుతో భవిష్యత్తులో అనుసరించవలసిన కార్యక్రమాన్ని విపులీకరిస్తూ ఒక కరపత్రం ప్రకటించి భారతదేశం పంపాడు, అభ్యుదయగాములు, విప్లవవాదులు కాంగ్రెసుకు చేయూతగా ప్రజావుద్యమం బలపరచాలని సందేశం పంపాడు.

ఈ అవకాశాన్ని సద్వినియోగ పరచుకొనటంలో కమ్యూనిస్టులు విఫలులయ్యారు. అంతకుక్రితం 1927-28 సంవత్సరాలలో ప్రజావుద్యమాలలో పలుకుబడిని పొందిన కమ్యూనిస్టు పార్టీ బలం 1929 లో పేరు-వూరు లేకుండా సన్నగిల్లినది. ఇందుకు ప్రధాన కారణాలు మూడు. (1) బ్రిటిషు ప్రభుత్వ దమన నీతి. (2) 6 వ కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ విధానం. (3) తత్ఫలితంగా భారత కమ్యూనిస్టులు కార్మిక-కర్షక-పెట్టీ బూర్జువా వర్గాలతో అనుసరించిన తప్పుడు పంథా.

కమ్యూనిస్టులు జాతీయ కాంగ్రెసును బహిష్కరించారు. తీవ్రవాదులయిన నెహ్రూ, బోసులను విమర్శించి వారి అనుయాయులనుంచి దూరం కాబడ్డారు. మితవాద ధోరణిలో నెహ్రూ, బోసుల నాయకత్వం క్రింద వున్నదని అఖిల భారత ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసును బహిష్కరించి తమకున్న పలుకుబడిని కూడా పోగొట్టుకొన్నారు. బొంబాయి, కలకత్తా, పంజాబు, ఉత్తరప్రదేశ్‌లలో కర్షక సంఘాలలో కృషిచేసి ప్రాబల్యం పొందగలిగిన కమ్యూనిస్టులు 6 వ పరల్డు

కాంగ్రెసు తీర్మానం ప్రకారం స్వతంత్ర కమ్యూనిస్టు పార్టీ నిర్మాణంకొరకు బయటకు రావటంతో ప్రజలతో వున్న సంబంధాలు కూడా త్రెంచుకున్నారు. వీటికి తోడు 1929 మార్చిలో ప్రభుత్వం ప్రధాన కమ్యూనిస్టు నాయకులను మీరటు కుట్ర కేసులో ముద్దాయిలుగా నిర్బంధించినది.

బెర్లినులో వున్న రాయ్ భారత పరిస్థితులను ఎప్పటికప్పుడు పరిశీలిస్తూనే వున్నాడు. మాతృదేశంలోని తన మిత్రులకు, అనుచరులకు ఉత్తరాల ద్వారా, వ్యాసాలద్వారా జాతీయ విమోచన వుద్యమంలో, కాంగ్రెసుతో, కార్మిక-కర్షక సంఘాలతో కలసి కృషిచేస్తూ ఐక్య పోరాటం సాగించాలని ఎప్పటికప్పుడు తెలియ చేస్తూనే వున్నాడు. ఆ సమయంలో బెర్లినులో అనేకమంది భారత విద్యార్థులు అభ్యసిస్తూవున్నారు. వారిలో కొందరిని విప్లవ వాదులుగా మార్చగలిగాడు. తయాబ్ షేక్, ప్రజేష్‌సింగు, డాక్టరు అనాడిభాదూరి, సుందరకపాడీ ఇందులో ముఖ్యులు. తయాబ్ షేక్ కొంతకాలం జర్మనీలోని 'సెంట్రల్ యూరోపియన్ హిందూస్తాన్ అసోసియేషన్' కార్యదర్శిగా కూడా పనిచేసాడు.

1930 లో సెకండు ఇంటర్నేషనల్ సోషలిస్టు లేబరు కార్యనిర్వాహక వర్గ సమావేశం బెర్లినులో జరిగినది. ఇంగ్లండులో లేబరు ప్రభుత్వం అధికారంలో వున్నది. బ్రిటిషు ప్రధాని రామ్సే మాక్డొనాల్డు, ఇతర మంత్రులు ఆ సమావేశానికి బెర్లిను వచ్చారు. ఆ కార్యనిర్వాహక సభ్యులకు రాయ్ 'బహిరంగ ఉత్తరం' వ్రాసాడు. 'బ్రిటిషు లేబరుపార్టీ అధికారానికి రాకముందు వలస రాజ్యాలలోని జాతీయ విమోచన వుద్యమాలను బలపరచినది. అధికారం చేపట్టగానే తన వాగ్దానాలను వమ్ము చేసినదని' రాయ్ తీవ్రంగా విమర్శించాడు. రాయ్ ప్రోద్బలంతో తయాబ్ షేక్, మరికొంతమంది అనుచరులు భారతదేశ స్వాతంత్ర్యానికి అనుకూలంగా నిరసన ప్రదర్శనలు చేసారు. "సామ్రాజ్యవాదం నశించాలి. రాజ్యాంగ పరిషత్తు ఏర్పరచాలి. విప్లవం వర్ధిల్లాలి" అనే నినాదాలు చేయబడ్డవి. ఈ సందర్భంలో షేక్ అరెస్టు అయ్యాడు. అప్పటికి భారతదేశానికి రాజ్యాంగ పరిషత్తు (కాన్‌స్టిట్యూషన్ అసెంబ్లీ) అంటే ఏమిటో తెలియదు. ఇది రాయ్ ఇచ్చిన నూతన నినాదం.

రాయ్ ఇంటర్నేషనల్ కమ్యూనిస్టు అపొజిషన్ వర్గంద్వారా భారతదేశ స్వాతంత్ర్యానికి అనుకూలంగా సానుభూతి సభలు ఏర్పాటు చేయించాడు. 1930 లో యీ వర్గానికి చెందిన వివిధ దేశాల నాయకుల సంతకాలతో 'భారత ప్రజల

స్వాతంత్ర్య పోరాటం' పేరుతో ఒక ప్రణాళిక ప్రకటించబడినది. ఇదే సమయంలో 1928 నుంచి కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ అవలంబించిన సంకుచిత తత్వాన్ని, పాక్షిక వైఖరిని నిశితంగా విమర్శిస్తూ పత్రికలలో అనేక వ్యాసాలు కూడా ప్రకటించాడు. మాస్కో ఆత్మహత్యా సదృశమయిన ఆదేశాలను భారత కమ్యూనిస్టులు అనుసరించకుండా వుండటానికి నిరంతర కృషిని సాగించాడు. కాని ప్రయోజనం ఫలించలేదు. భారత కమ్యూనిస్టులు స్వతంత్ర శక్తిని కోల్పోయి మాస్కో నాయకులను గ్రుడ్డిగా అనుసరించటంతో తమ అస్తిత్వానికే భంగం తెచ్చుకున్నారు.

భారత కమ్యూనిస్టులు ఒక మహదవకాశాన్ని చేతులారా జారవిడిచి నందులకు రాయ్ ఆందోళన చెందాడు. కొన్ని వేల మైళ్ల దూరంలో వుండటంచేత తానేమీ చేయలేని స్థితిలో వున్నట్లు భావించాడు. చివరకు మాతృదేశం వెళ్లి ప్రజా వుద్యమానికి సక్రమపంథా చూపటం వినా మరోమార్గం లేదనే నిశ్చయానికి వచ్చాడు. బెర్లిను మిత్రులు వారించారు. "కాన్పూరు కుట్రకేసులో రాయ్ ముద్దాయిగా వారంటు నోటీసు అలాగే నిలచివున్నది. వెళ్లగానే అరెస్టు కావటం ఖాయం. కనుక వెళ్లినా ప్రయోజనం శూన్యం. భారత స్వాతంత్ర్య పోరాటం ప్రస్తుతం బాల్యదశలోనే వున్నది. ఈ పరిస్థితుల్లో రాయ్ చేయగలిగిన దేమీలేదు." అని వారు రాయ్ ప్రయాణం మాన్పించటానికి శతవిధాల ప్రయత్నించారు. కాని చివరి మాట రాయ్ ప్రయాణానికి కారణభూతం అనే చెప్పవచ్చును. 'బాల్యదశ'లో వున్న వుద్యమం తాను దూరంగా వున్నందు వలన అలాగే వుండిపోవక తప్పదు. ఆ వుద్యమాన్ని పరిపక్వదశకు తీసుకొని రావలసిన అవసరం వున్నది. ఇది తన విద్యుక్తధర్మంగా రాయ్ భావించాడు. బ్రిటిషు ప్రభుత్వం కమ్యూనిస్టులను నిర్దాక్షిణ్యంగా జీవితాంతం కారాగారవాస శిక్షలకు గురి చేయటం రాయ్‌కి తెలుసు. అయినా అందుకు సిద్ధపడే తన ప్రయాణానికి సిద్ధపడాడు.

1930 ఆగస్టులో ముందుగా కార్యరంగాన్ని చక్కబరచటానికి తయాబ్ షేక్‌తోబాటు పైన సూచించిన మిగిలిన వారిని కూడా భారతదేశం పంపాడు. 'భారత పీడిత వర్గాలకు అగ్రగామిగా వున్న విప్లవవాదులకు' అనే పేరుతో కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ రూపొందించిన విధానాలను విమర్శిస్తూ భారత కమ్యూనిస్టులు అనుసరించవలసిన విధానాన్ని స్పష్టీకరిస్తూ ఒక ప్రణాళికను సిద్ధపరచి వారితోబాటు పంపాడు.

ఈ ప్రణాళిక ముఖ్యంగా భారత కమ్యూనిస్టులను హెచ్చరిస్తూ సిద్ధం చేయబడినది. "జాతీయ బూర్జువా వర్గ నాయకత్వం నుంచి కాంగ్రెసును విముక్తి చేయాలి. ప్రజల దైనందిన జీవిత అవసరాలకు తగిన స్వల్పకాల కార్యక్రమాన్ని కాంగ్రెసుచే అంగీకరింప చేయాలి. జాతీయ వుద్యమం ద్వారానే స్వాతంత్ర్య పోరాటాన్ని ముందుకు సాగించటానికి వీలున్నది. అంతకంటె మరో మార్గం లేదు. కనుక కమ్యూనిస్టులు జాతీయ కాంగ్రెసులో చేరి ప్రస్తుతానికి అవసరమయిన కార్యక్రమం చేపట్టి ప్రజలను సమీకరించాలి. సోవియటు రష్యాలో మాదిరిగా ఒక్కసారే దేశంలో సోవియట్లను యేర్పరచే అంతిమ కార్యక్రమం చేపట్టటం సరియైన మార్గం కాజాలదు.... రాజ్యాంగ పరిషత్తును ప్రజలలో ప్రచారంచేసి భారతదేశంలో తమ భవిష్యత్ రాజ్యాంగాన్ని నిర్మించుకునే హక్కు భారత ప్రజలదే ననే విశ్వాసం కలిగించాలి. గ్రామ, పట్టణ స్థాయిలో ప్రజా సంఘాలు ఏర్పరచి వాటికి తాలూకా, జిల్లా, రాష్ట్ర సంఘాలు యేర్పరచి బ్రిటిషు ప్రభుత్వానికి ప్రత్యామ్నాయ ప్రభుత్వం యేర్పరచగల రాజ్యాంగ పరిషత్తును సమావేశపరచటానికి ప్రజా వుద్యమాన్ని రూపొందించాలి..... లాహోరు కాంగ్రెసు సంపూర్ణ స్వరాజ్య తీర్మానం అంగీకరించినది. కాని ఆ స్వరాజ్యం ఎలా వుంటుందో, ప్రజలకు ఏ విధంగా వుపకరించ గలదో స్పష్టీకరించలేదు. కమ్యూనిస్టులు అందుకు అవసరమయిన కార్యక్రమాన్ని, పంథాను చూపవలసిన బాధ్యత చేపట్టాలి. ప్రస్తుత కాంగ్రెసు నాయకత్వం గ్రామ పట్టణ సంఘాలమీద ప్రత్యేక శ్రద్ధ చూపని కారణంగా ప్రజలలో రాజకీయ చైతన్యం బొత్తిగాలేదు. వారికి రాజకీయ చైతన్యం కలిగించి గ్రామ, పట్టణ సంఘాలనుంచి రాజ్యాంగ పరిషత్తుకు తమ ప్రతినిధులను పంపగల స్తోమతు వారికి కల్గించాలి." క్లుప్తంగా రాయ్ భారత కమ్యూనిస్టులకు సూచించిన ప్రణాళిక యిది.

తయాబ్ షేక్, సుందరకబాడీ ప్రభృతుల తీవ్రకృషి ఫలించంగా కాంగ్రెసు యూత్ లీగులోని అనేకమంది రాయ్ ప్రణాళిక (రాయిజమ్)కు మద్దతు నీయ సాగారు. తయాబ్ షేక్ కాంగ్రెసు అధ్యక్షుడు జవహర్‌లాల్ నెహ్రూను కలుసు కొని రాయ్ ప్రణాళికను గురించి, రాజ్యాంగ పరిషత్తు నిర్మాణం గురించి చర్చించి నప్పుడు నెహ్రూ బహిరంగంగానే తన అనుకూలతను ప్రకటించాడు.

1930 డిశంబరులో రాయ్ మారువేషంలో, రహస్యంగా కరాచీ చేరి ఒక మిలిటరీ అధికారి అనుచరునిగా తప్పించుకొని తరువాత బొంబాయి చేరాడు.

అప్పటికి కాంగ్రెసులో, ట్రేడ్ యూనియన్ కాంగ్రెసులో షేక్ - కబాడీల కృషి ఫలితంగా చెప్పుకోదగినంతగా రాయ్ భావాలకు అనుకూలవర్గం యేర్పడినది. తరువాత వీరు రాయిస్టులుగా ప్రచారం లోనికి వచ్చారు. ఇందులో వి. బి. కార్నిక్, మనిబెన్‌కారా, ఎ. యన్. చెట్టి, డాక్టరు యం. ఆర్. చెట్టి, జి. యల్. కాండల్కార్, డాక్టరు సి. వై. చిట్నిస్, ఛార్లెసు మాస్కారెన్‌హాజ్ మొదలైన కార్మిక నాయకులు కూడా వున్నారు. కార్నిక్ గిర్నీ కాంగర్ యూనియన్ ప్రధాన నాయకుడు. మనిబెన్ కారా బొంబాయి మునిసిపల్ వర్కర్సు యూనియన్ స్థాపకురాలు. డాక్టరు చెట్టి బాంబే ట్రాన్సుపోర్టు, డాక్ వర్కర్సు యూనియన్ స్థాపకుడు. ఎ. బి. చెట్టి కూడా యీ యూనియన్ నాయకుడు. జి. యమ్. అధికారి 1928 లో రాయ్ దగ్గర నుంచి పరిచయ పుత్తరం తీసుకొని బొంబాయి వచ్చాడు. కాని తరువాత యీయన ఆఫిషియల్ కమ్యూనిస్టు పార్టీలో చేరాడు.

రాయ్ బొంబాయిలో డాక్టరు మహమ్మద్ పేరుతో రహస్య జీవితం ప్రారంభించాడు. ప్రొద్దుకుంకగానే అభ్యుదయగాములు, విద్యావంతులు అయిన అనేకమంది యువకులు, కార్మిక నాయకులు అయన నివాసానికి వస్తూ వుండేవారు. వారితో యిష్టాగోష్టి సమావేశాలు జరిపి వారికి తెలియని, వూహించని అనేక విషయాలను వారికి విడమరచి చెప్పుతూ వుండేవాడు. దాదాపు రెండు నెలలు బొంబాయిలో రహస్యంగానే వుంటూ, అనేకమంది యువకులకు రాజకీయ శిక్షణ నివ్వగలిగాడు. వల్లభాయ్‌పటేలు, బొలాభాయ్‌దేశాయ్ మొదలయిన కాంగ్రెసు నాయకులను, డాక్టరు అంబేద్కరు, యన్. యమ్. జోషి (కార్మిక నాయకుడు)లను కలుసుకొని రాజకీయ కార్యక్రమం గురించి రహస్యంగా చర్చలు జరిపాడు.

రాయ్ మాతృదేశంలో అడుగు పెట్టినట్లు గూఢచారులు పసికట్టారు. కాని పదిహేను సంవత్సరాల క్రితం రాయ్‌కి, ఇప్పటి రాయ్‌కీ పోలికలు లేవు. కనుక వారికి అగమ్యగోచరునిగానే సంచరించసాగాడు. రాజకీయ నాయకులు కొంత మంది రాయ్‌కి రక్షణ కల్పించి దూరప్రదేశంలో వుంచటానికి ప్రయత్నించినప్పుడు అందుకు రాయ్ అంగీకరించలేదు. ఎప్పుడో ఒకప్పుడు తనకు కారాగారవాసం తప్పదు. తాను ఏకాంతంగా రహస్యజీవితం గడపటానికి భారతదేశం రాలేదు. కనుక వీలైనంత త్వరలో విప్లవ వుద్యమానికి గట్టి పునాది వేయాలనే సంకల్పంతో తన కార్యక్రమాన్ని తీవ్రతరం చేయసాగాడు.

రాయిస్టులు సంఖ్యలో కొలది మాత్రమే అయినా కాంగ్రెసులో రాయ్ సిద్ధాంతాలు ప్రచారంచేసి అనతికాలంలో కార్మిక - కర్షక - పెట్టీ బూర్జువా వర్గాలలో ప్రాహింపని పలుకుబడిని సంపాదించ గలిగారు. పార్టీ సిద్ధాంతాలకు అంకితమయిన ముఖ్యకార్యకర్తలు బొంబే, బరోడా, పూనా, బెనారసు, కలకత్తా, మరి కొన్ని ప్రాంతాల ముఠాలను సంఘటిత పరచి 'రివల్యూషనరీ పార్టీ ఆఫ్ ఇండియన్ వర్కింగు క్లాసు'గా ఒక రహస్య అజ్ఞాతపార్టీని అఫిషియల్ కమ్యూనిస్టు పార్టీకి పోటీగా స్థాపించ గలిగారు. రాయ్ మ్యానిఫెస్టో దీనికి మూలకార్యక్రమంగా అంగీకరించబడ్డది. రాయిస్టులు కరపత్రాలు, సమావేశాలు ద్వారా కాంగ్రెసులోనూ, బయటా విరివిగా ప్రచారం సాగించారు. ఫార్లెస్ మరికొందరు పత్రికా సంపాదకులుగా 'ఇండిపెండెంటు ఇండియా', 'మాసెస్ ఆఫ్ ఇండియా' బొంబాయి నుంచి, కలకత్తా నుంచి 'వర్కర్స్ ఏజ్' అను పత్రికలు స్థాపించి వాని ద్వారా, ఇతర భారత పత్రికలలో వ్యాసాల ద్వారా ప్రచారం ముమ్మరం చేయగలిగారు.

బొంబే గిర్నికాంగర్ ట్రేడ్ యూనియన్ బలవత్తరమయిన కార్మిక సంస్థ. మొదట యీ సంస్థ అఫిషియల్ కమ్యూనిస్టుపార్టీ ఆధ్వర్యంలో దేశపాండే, రణదేవల నాయకత్వం క్రింద పనిచేస్తూ వుండేది. వారిని రాయిస్టులు తొలగించారు. జి. యల్. కాండ్లకర్ అధ్యక్షుడుగా గిర్నికాంగర్ యూనియన్‌ను రాయిస్టులు వశపరచుకొన గలిగారు. దీనికి తోడుగా జి. ఐ. పి. రైల్వే యూనియన్, బొంబే ప్రొవిన్షియల్ వర్కింగు క్లాసు పార్టీలలో రాయిస్టులు ఆధిక్యతను పొంది కార్మిక వర్గాలలో బాగా పలుకుబడిని సంపాదించగలిగారు. 'నవజవాన్ భారత సభ' పేరుతో వేరొక సంస్థ నెలకొల్పబడినది. ముఖ్యంగా మధ్యతరగతి వర్గాలను (పెట్టీ బూర్జువా) సంఘటిత పరచటం దీని ప్రధానోద్దేశ్యం. కాంగ్రెసును బలపరస్తూ మధ్య తరగతి ప్రజల, కార్మిక-కర్షక వర్గాల ప్రయోజనాలను కాంగ్రెసుచేత అంగీకరింపచేయటమే రాయిస్టుల కార్యక్రమం.

కాంగ్రెసు చేపట్టిన వస్త్ర, వస్తు బహిష్కరణ కార్యక్రమ ఫలితంగా విదేశీ వస్త్రమిల్లులు మూలబడినవి. దీని ఫలితంగా స్వదేశీ మిల్లు యజమానులు విపరీతమయిన లాభాలు గడించసాగారు. కార్మికులు నిరుద్యోగులయ్యారు. వర్గ సంఘర్షణ తీవ్రస్థాయి నందుకొనినది. కార్మికుల పరిస్థితిని చక్కదిద్ద వలసినదిగా కాంగ్రెసు అధ్యక్షుడు పండిత నెహ్రూకు కార్మికులు విజ్ఞప్తిని పంపారు. బొంబే ప్రొవిన్షియల్ కాంగ్రెసు సంఘం కార్మికుల హక్కులను బలపరుస్తూ అఖిల భారత

కాంగ్రెసు కమిటీకి సిఫారసు చేసినది. అయినా కాంగ్రెసునుంచి వీరికి తగినంత సహాయం లభించలేదు. కార్మికులు ఆందోళనకు పూనుకున్నారు. కార్మిక నాయకు లయిన రాయిస్టులు అనేకమంది అరెస్టు కాబడినారు.

ఇదే సమయంలో కాంగ్రెసు సత్యాగ్రహ సమరం ప్రారంభించినది. అనేకమంది కాంగ్రెసు నాయకులు కారాగారాలలో బంధితులయ్యారు. తరువాత గాంధి - ఇర్విను సంధిలో కాంగ్రెసు నాయకులు విడుదల చేయబడ్డారు. కాని గాంధి కార్మిక నాయకుల విడుదలకు ప్రభుత్వాన్ని వత్తిడి చేయలేదు. ఇందుకు గాంధీ కాపిటలిస్టులకు అనుకూలుడని కార్మికులు తీవ్రంగా విమర్శించారు కూడాను.

కార్మిక సంస్థలకు చెందిన వివిధ విభాగాలను సంఘటితపరచి అందరికీ ఆమోదయోగ్యమయిన కార్యక్రమం రాయ్ రూపొందించాడు.

(1) యజమానుల వత్తిడికి కార్మికులు లొంగరాదు.

(2) సమావేశాలు, ప్రదర్శనలు, సమ్మెల ద్వారా తమ హక్కులను రక్షించు కొనాలి.

(3) కార్మికుల ఆమోదంతో ఎన్నికల ద్వారా కార్యనిర్వాహకవర్గం యేర్పడాలి.

(4) కార్మికులకు తెలియపరచకుండా, వారి అనుమతి పొందకుండా సమ్మెలు ఆపరాదు.

(5) జాతీయ స్వతంత్ర పోరాటంలో కార్మికులు తమ మద్దతును ప్రకటించి పూర్తి సహకారాన్ని అందచేయాలి. ఇందుకు — సామ్రాజ్య వాదాన్ని, కాపిటలిస్టు ఆధిపత్యాన్ని తొలగించటం, జాతీయ సంపదను ప్రజాసంపదగా పరిగణించటం, వాక్, సభా, సంఘాల స్వాతంత్ర్యం పరిరక్షించటం - ఆదర్శాలుగా, ఆశయంగా వుండాలి.

6 వ పరిష్కు కాంగ్రెసు తీర్మానానుసారం కమ్యూనిస్టులు అఖిల భారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు నాయకత్వాన్ని కూడా తీవ్రంగా విమర్శించసాగారు. ఇది రాయిస్టులకు ఒక అవకాశంగా పరిణమించినది. కార్మిక వుద్యమంలోని మిత వాదులతో సహకరించి రాయిస్టులు తమ పలుకుబడిని బాగా పెంచుకొన గలిగారు. జాతీయ కార్మిక నాయకులు, రాయిస్టులు కలిసి అఖిల భారత ట్రేడ్ యూనియన్

కాంగ్రెసు నుంచి కమ్యూనిస్టులను బయటకు పంపగలిగారు. ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు కార్యదర్శులలో తయాబ్ షేక్ ఒకరిగా ఎన్నుకొనబడ్డాడు. ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు, ట్రేడ్ యూనియన్ ఫెడరేషను, రైల్వే ఫెడరేషను మొదలయిన కార్మికసంస్థ లన్నింటినీ కలిపి ఒకే పతాకం క్రింద జాతీయ కార్మిక సంస్థగా రూపొందించటానికి జాతీయవాదులు, రాయిస్టులు కలసికట్టుగా కృషి చేసారు. గిర్నీ కాంగర్ యూనియన్‌కు వి. బి. కార్నిక్, మనిబెన్ కారా ఉపాధ్యక్షులుగా ఎన్నుకొనబడ్డారు. 1931 లో సామూహిక సమ్మెకు పిలుపు నివ్వటానికి రాయిస్టులు రంగాన్ని సిద్ధపరచే ప్రయత్నంలో వుండగా ప్రభుత్వం వీరిద్దరినీ బంధించి జైలులో పెట్టినది. తరువాత యీ యూనియన్‌లో భేదాభిప్రాయాలు వచ్చి కార్యాలయం మార్చటం, సభ్యులు కొట్లాడుకొనటం జరిగినది.

6 వ వరల్డు కాంగ్రెసు తీర్మానాలు భారత కమ్యూనిస్టులను మొదట కొంత తికమకలు కూడా పెట్టినవి. వారు అంతవరకు చేపట్టిన కార్యక్రమం విప్లవ వ్యతిరేక పంథాగా చూపించి వారికి అనూహ్యము, అగమ్యగోచరమయిన నూతన పంథా చేపట్టాలని యిచ్చిన సందేశం మొదట్లో వారు నమ్మలేదు. అందువలన అఫిషియల్ కమ్యూనిస్టు పార్టీ నుంచి అనేకమంది బయటకు వచ్చి రాయ్ అనుకూల వర్గంతో చేరి కృషిచేయటం ప్రారంభించారు. దీనిని గమనించిన కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ రాయ్ పలుకుబడిని తగ్గించటానికే అన్నట్లు తన ప్రతినిధులను, రాయబారులను భారతదేశం స్వయంగా పంపి తన నూతన కార్యక్రమాన్ని, విధానాలను అఫిషియల్ కమ్యూనిస్టు పార్టీకి వివరించటమే కాకుండా రాయ్‌ని అప్రతిష్ట పాలు చేయటానికి కూడా ప్రయత్నించినది.

## కరాచీ కాంగ్రెసు:

1931 లో జరిగిన కరాచీ కాంగ్రెసు మహాసభను చరిత్రాత్మక ఘట్టంగా పరిగణించాలి. లాహోరు కాంగ్రెసు 'సంపూర్ణ స్వరాజ్యాన్ని' ప్రకటించినది. సంస్కరణలు ప్రవేశపెట్టాలనే తలంపుతో ఇంగ్లండు నుంచి బ్రిటిషు ప్రభుత్వం తరఫున పంపబడిన 'సైమను కమీషను'లో భారత ప్రతినిధులు లేనికారణమున

దేశం నలుమూలలా అది బహిష్కరింపబడి ఆందోళన విజృంభించినది. గాంధీ ప్రారంభించిన శాసనోల్లంఘన ఫలితంగా గాంధీతోపాటు అనేకమంది నాయకులు కారాగారవాస శిక్షలకు గురిఅయ్యారు. తరువాత గాంధీ - ఇర్విను సంధి ప్రకారం వారంతా విడుదల అయ్యారు. ఈ సంధిని కరాచీ కాంగ్రెసు మహాసభ ఆమోదించ వలసి వున్నది. పోలీసుల దమనకాండకు గురిఅయిన లాలాలజపతిరాయ్ అకాల మరణం, భగవత్‌సింగు, రాజగురు, సుఖదేవ్‌ల ఉరిశిక్షలు, మొదటి రౌండుటేబిలు సమావేశాన్ని కాంగ్రెసు బహిష్కరణ - కరాచీ కాంగ్రెసు మహాసభకు ముందు జరిగిన ఘట్టాలు.

గాంధీ - ఇర్విను సంధి తీవ్రవాదులకు ఏ మాత్రం సంతృప్తిని కలిగించ లేదు. కాంగ్రెసు అధ్యక్షులు వల్లభాయ్‌పటేలు గాంధీని సమర్థించినా నెహ్రూ, బోసులు ఆ సంధిని ప్రతిఘటించ గలరనే విశ్వాసం వారిలో వున్నది. కమ్యూనిస్టులు ఇది తమకు పట్టని విషయంగా భావించారు. వేరుగా కార్మిక - కర్షక సభను యేర్పాటు చేసే ప్రయత్నంలో వున్నారు. రాయ్ మారువేషంలో 'బెనర్జీ' పేరుతో 'కాంగ్రెసు నాయకుల అతిథి'గా కరాచీ కాంగ్రెసులో పాల్గొన్నాడు.

బొంబాయిలో వున్నప్పుడు రాయ్ అజ్ఞాతవ్యక్తిగా కొన్ని రాజకీయ సమావేశాలకు కూడా హాజరవుతూ వచ్చాడు. ఒక సమావేశంలో రాజకీయచర్చలో అనుకోకుండా రాయ్ ప్రముఖులయిన కమ్యూనిస్టు పార్టీ నాయకుల వితండ వాదనలను ఖండించటానికి అయాచితంగా డాక్టరు మహమ్మదుగా వేదికపైకి వచ్చి రష్యా విప్లవం, మార్క్సిజం, లెనిన్ సిద్ధాంతాల గురించి అనర్గళంగా ఉపన్యసించి తన మేధాశక్తిని చూపినప్పుడు వారు నిర్విణ్ణులయి గిట్టుమిట్టాడటమే కాకుండా సరియైన సమాధానాలు యివ్వలేని స్థితిలోపడి 'ఇంత మేధాశక్తి గల యీ వ్యక్తి ఎవరు ?' అనే మీమాంసలో మునిగి చివరకు బహుశః యమ్. యన్. రాయ్ మారు వేషంలో వున్నాడేమోననే సందేహం కూడా వెళ్లబుచ్చటం జరిగినది అనుకోని యీ సంఘటన వల్ల.

మరొక పర్యాయం రాయ్ కార్నిక్ నివాసంలో వున్నప్పుడు హరీంద్ర నాథ్ చటోపాధ్యాయ అందులో ప్రవేశించటం, రాయ్‌ని గుర్తించి కొంత సంభాషణ జరుగటం తరువాత చటోపాధ్యాయ కార్నిక్‌తో రహస్యంగా రాయ్ ప్రమాదకరమైన వ్యక్తి, అతనితో పొత్తు మంచిది కాదనీ హెచ్చరించటం జరిగినది. చటోపాధ్యాయ

తరువాత తన సోదరితో రాయ్ ఆగమనం గురించి చెప్పటం, అదే కమ్యూనిస్టు వర్గంలో వ్యాపించటం జరిగినది.

బొంబాయిలో ఎక్కువ కాలం వుండటం రాయ్ క్షేమానికే భంగకరంగా పరిణమించినది. పైగా పోలీసులు, గూఢచారులు రాయిస్టుల ప్రచారాన్ని, పలుకు బడిని గమనించి రాయ్ ఉనికిని ఆరాతీయటంలో నిమగ్నులు కాసాగారు. అదే సమయంలో ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలో అనావృష్టికి గురిఅయి పంటలు నాశనం కావటంతో రైతులలో అసంతృప్తి, తీవ్ర ఆందోళన వ్యాపించినది. శిస్తులు ఆపు చేయాలనే విజ్ఞప్తులు అధికారుల చెవి కెక్కకపోవటంతో ప్రజా వుద్యమం ప్రబల మయి శిస్తు నిరాకరణ రూపం దాల్చినది. రాయ్ స్వయంగా అచ్చటికి వెళ్లి రైతుల పరిస్థితులను కళ్లారా చూడాలనే సంకల్పంతో ఉత్తరప్రదేశ్ వెళ్లాడు.

ఆ రాష్ట్రంలో రహస్యంగా సంచరిస్తూ రాయ్ నెహ్రూను కూడా కలుసు కొన్నాడు. నెహ్రూ రాయ్ రహస్య సంచారానికి అన్నివిధాల తోడ్పడి తనతోబాటు అనేక గ్రామాలకు, పట్టణాలకు కూడా తీసుకొని వెళ్లాడు. రాయ్‌ని కరాచీ కాంగ్రెసు మహాసభకు ఆహ్వానించగా ఆయన అంగీకరించి రహస్యంగా మారువేషంతోనే హాజరయ్యాడు.

రాయ్ గాంధి - ఇర్విను సంధిని వ్యతిరేకించిన వారిలో ప్రధాన వ్యక్తి. అది సంస్కరణ వాదానికి, బూర్జువా వర్గం సామ్రాజ్యవాదంతో రాజీపడటానికి, విప్లవశక్తులను అణచటానికి వుపకరించగల సాధనం మాత్రమే. అయితే కాంగ్రెసు దాన్ని ఆమోదించకుండా త్రోసివేయటం జరుగని పని అని ఆయనకు తెలుసు. కాని గాంధీ సంస్కరణ వాదాన్ని పెట్టుబడిదారుల విప్లవ వ్యతిరేకతత్వాన్ని విపులంగా చూపగలిగినప్పుడు తీవ్రవాదుల అసంతృప్తి యినుమడించి వామపక్షం బలపడటానికి అవకాశాలు మెరుగుబడగలవని ఆశించాడు.

విషయనిర్ణయ సభలో తయాబ్ షేక్, మితవాద కార్మిక నాయకుడు జమ్నాదాస్‌మోహతా అధికార తీర్మానానికి సవరణ ప్రతిపాదించారు. లాహోరు తీర్మానానుసారం సంపూర్ణ స్వరాజ్యానికి గాంధీ - ఇర్విను సంధి వ్యతిరేకం, 'బూర్జువా వర్గ కుట్ర' అని వర్ణించాడు. వారు తమ సవరణను సమర్థించుకుంటూ దీర్ఘోపన్యాసాలు చేసారు. అనేకమంది తీవ్రవాదులు అనుకూలతను వ్యక్తం చేసారు.

అయినా సవరణ వీగిపోయినది. రాయ్‌కి యిలా జరుగుతుందని ముందుగానే తెలుసు. "కేవలం మహాత్మాగాంధి దర్శనం కొరకు ప్రతినిధులు వచ్చారు. కాని వారి అధికారాన్ని ప్రశ్నించటానికి మాత్రం కాదు" అని చెప్పాడు. తీవ్రవాద నాయకు డనుకొనిన నెహ్రూ చేతనే గాంధీ కాంగ్రెసు మహాసభలో యీ తీర్మానాన్ని ప్రవేశపెట్టించటం మరీ విశేషం. దీనితోబాటు రౌండుటేబిలు సమావేశానికి కాంగ్రెసు ఏకైక ప్రతినిధిగా గాంధీ లండను వెళ్లాలనే తీర్మానం కూడా ఆమోదించ బడినది.

ఢిల్లీ సంధిని కరాచీ కాంగ్రెసు ఆమోదించినా 'ప్రాథమిక హక్కులు - జాతీయ ఆర్థిక విధానాల' మీద ఆమోదించిన తీర్మానాలు చారిత్రక ఘట్టంగా చెప్పు కొనదగినవి. మొట్టమొదటిసారిగా కాంగ్రెసు కరాచీలో లన సాంఘిక - ఆర్థిక స్వరూపాన్ని రూపొందించినది. తరువాత మన రాజ్యాంగ చట్టానికే ప్రాతిపదిక లయినవి. ఇందులో రాయ్ అదృశ్యహస్తం, ప్రభావం వుందని బ్రిటిషు ఇంటెలిజెన్సు విభాగం అనుమానించక పోలేదు. రాయ్ సూచించిన స్వల్పకాలిక కార్యక్రమా న్ననుసరించి యిది రూపొందించబడినట్లుగా భావించబడినది. నెహ్రూ క్యాంపుకు ప్రక్కనే రాయ్‌కి కూడా ప్రత్యేక వసతి యేర్పాటు చేయబడినది. నెహ్రూ రాయ్‌తో ఆయన క్యాంపుకు వచ్చి రహస్యంగా సామాజిక - ఆర్థిక విధానం మీద అనేకసార్లు చర్చలు జరిపిన ఫలితంగా ఒక ముసాయిదా తీర్మానం తయారుచేశాడు. అది రాయ్‌కి సంతృప్తి కలిగించలేదు. దానిని రాయ్ తీవ్రంగా ప్రతిఘటించిన మీదట మరి కొన్ని సవరణలు కూడా జరిగినవి. అప్పటికీ రాయ్ సంతృప్తి చెందలేదు. సోషలిస్టుగా చలామణి అవుతున్న నెహ్రూ అంతకంటె ముందుకు పోలేక పోయాడు. అదే సమయంలో రాయ్ సుభాస్‌చంద్రబోస్‌ను కూడా కలుసుకున్నాడు. ఈ సమావేశం కాంగ్రెసు వెలుపల దూరప్రదేశంలో వున్న ఒక బంగళాలో జరిగినది. ఇద్దరూ బెంగాలీ ప్రముఖులు కావటంచేత ఒకరి నొకరు ఆప్యాయంగా కౌగలించుకున్నారు. అనేక విషయాలను గురించి ఒకరి అభిప్రాయాలను ఒకరు తెలుసుకొన్నారు. తరువాత తయాబ్ షేక్ బోస్‌ను గురించి రాయ్ అభిప్రాయం తెలుసుకొన గోరినప్పుడు 'బోస్‌కు భారతమాత అంటే అచంచల భక్తి, విశ్వాసా లున్నవి. అంతకుమించి మరేమీలేదు' అని సమాధానం చెప్పాడు. 1934 లో రాయ్ జైలులో వున్నప్పుడు కరాచీ తీర్మానం లోపభూయిష్టమని, విప్లవశక్తులను పెడమార్గం పట్టిస్తున్నదని విమర్శించాడు.

గాంధీ - ఇర్విను సంధి వలన ఆశించిన ఫలితాలు చేకూరకపోయినా కాంగ్రెసు పటిష్ఠం కావటానికి అవకాశం లభించినది. కాంగ్రెసు వొకటే మొత్తం దేశానికి ప్రాతినిధ్యం వహించగల సంస్థగా కనబడినది. నెహ్రూ, బోసు, ఇతర తీవ్రవాదులు కరాచీలో గాంధీ - ఇర్విను సంధిని ఆమోదించినా అది కేవలం ఒక విరామసంధిగానే భావించసాగారు. నెహ్రూ కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి. దేశాన్ని తిరిగి శాసనోల్లంఘనానికి ఆయత్తపరచాలనే భావంతో గ్రామీణ, పట్టణ ప్రాంతాల్లో ప్రచారం ముమ్మరం చేసి పార్టీ వ్యవస్థను సంఘటిత పరచి ప్రభుత్వంతో పోరాటానికి సిద్ధపరచాలని రాష్ట్ర సంఘాలకు తాఖీదులు పంపాడు. దీనిఫలితంగా ముఖ్యంగా ఉత్తరప్రదేశ్‌లోని కొన్ని జిల్లాలలో కర్షకులు శిస్తులు చెల్లించటానికి నిరాకరించారు. కాంగ్రెసు సంఘాలు ప్రత్యామ్నాయ ప్రభుత్వ సంస్థలుగా పని చేసినవి.

రాయ్ కరాచీ కాంగ్రెసుకు ముందు, తరువాత కూడా హెచ్చు కాలం ఉత్తరప్రదేశ్‌లోనే అజ్ఞాతంగా సంచరించాడు. మొదట నెహ్రూతో కలసి, తరువాత స్వయంగా అనేక గ్రామాలు, పట్టణాలు సందర్శించి కర్షక వుద్యమాన్ని రేకెత్తించాడు. మధ్యలో బ్రజేష్‌సింగు స్వంత గ్రామమయిన కలాకంకర్‌లో వారి యింటి యందు రహస్యంగా నివసిస్తూ పంజాబు రాష్ట్రంలో కొన్ని గ్రామాలు కూడా సందర్శించాడు. (స్టాలిన్ కుమార్తెను వివాహం చేసుకొనిన బ్రజేష్‌సింగు వీరే!) ప్రజలను చైతన్యవంతులుగా చేయగలిగితే వారు తమ హక్కుల కొరకు తామే ముందుకు రాగలరని రాయ్ ఉత్తరప్రదేశ్‌లో అనుభవపూర్వకంగా తెలుసు కొన్నాడు. మొత్తం దేశంలోని గ్రామీణ ప్రాంతాలలో యీ చైతన్యం, ఆందోళన కొనసాగితే కాంగ్రెసు నాయకత్వం తేలిగ్గా తీవ్రవాదుల చేతుల్లోనికి రాగలదని రాయ్ ఆశించాడు.

కర్షక ఆందోళనలో కమ్యూనిస్టు భావాలు కలవని ఉత్తరప్రదేశ్ ప్రభుత్వం భయపడినది. శిస్తులు తగ్గించబడ్డవి. అయినా రైతులు తృప్తి చెందలేదు. నెహ్రూ నాయకత్వం క్రింద ఆందోళన ముమ్మరం చేయబడినది. ప్రభుత్వం నెహ్రూతో బాటు ఉత్తరప్రదేశ్ రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షుడు షేర్వానిని కూడా నిర్బంధంలోనికి తీసుకొన్నది.

రాయ్ భారతదేశం ప్రవేశించిన తరువాత దాదాపు ఏడు మాసాలు అజ్ఞాతంగా డాక్టరు మహమ్మదు, తరువాత బెనర్జీ పేర్లతో మారువేషంలో ప్రభుత్వ బారిని పడకుండా సంచరించగలిగాడు. ఈ కొలదికాలంలోనే అజ్ఞాతంగా వుండి సాధారణంగా మానవులు సాధించలేని అనేక కార్యాలను సాధించగలిగాడు. అనేక మందిని రాయిస్టులుగా మార్చగలిగాడు. ట్రేడ్ యూనియన్ సంఘాలలో, కర్షక సంఘాలలో కనీస కార్యక్రమాన్నిచ్చి వాటిని సంఘటిత పరచి కాంగ్రెసుచేత ఆ కార్యక్రమం ఆమోదింప చేయటానికి తీవ్రకృషిని జరిపి కొంతవరకు కృత కృత్యుడు కాగలిగాడు. ప్రభుత్వం పసికట్టినది. వెంటాడినది. అనుమానంతో అనేక మందిని రాయ్‌గా భావించి అరెస్టు చేసినది. చివరకు బొంబాయిలో 1931 జులై 21న రాయ్‌ని బంధించ కలిగినది. ఇది కూడా ఒక విచిత్ర సంఘటనలో జరిగినది. రాయ్ తన అనుచర వర్గంతో ఒక నివాసంలో రహస్యంగా అర్థరాత్రి వరకూ చర్చలు సాగించాడు. దూరంగా ఇద్దరు గూఢచారులు అజ్ఞాతంగా మఫ్టీలో ఆ చుట్టు ప్రక్కల తిరుగుతూనే వున్నారు. సమావేశానంతరం అందరూ బయటకు వచ్చారు. చివరకు ఒకనితో మరొక ఎత్తైన వ్యక్తి బయటకు వచ్చి అందరికీ వీడ్కోలు చెప్పి ఆతనితో ముందుకు సాగి మరొక భవనంలో ప్రవేశించటం అందులో ఒక అంతస్తులోని ఒక ఫ్లాటులో దీపాలు వెలుగటం ఆ గూఢచారులు గమనించారు. తరువాత తెల్లవారుఝామున ఆకస్మికంగా ఆ భవనం మీద పోలీసులు దాడి జరిపి రాయ్‌ని అరెస్టు చేసారు. తరువాత తయాబ్ షేక్, సుందర కబాడీ, డాక్టరు యమ్, ఆర్. చెట్టీ, ఎ. బి. చెట్టీ, మాస్కారెన్‌హాజ్ మొదలయినవారు కూడా బంధింప బడ్డారు.

రాయ్ మీద వున్న కక్షతో అఫిషియల్ కమ్యూనిస్టులు పోలీసులకు సహకరించి రాయ్ రహస్య ప్రదేశాలను తెలియబరచారు. 'ఇంపీరియలిస్టు బంటు'గా, 'కమ్యూనిస్టు పార్టీ ద్రోహి'గా రాయ్‌ని చిత్రించి కమ్యూనిస్టులలో వ్యతిరేక భావాన్ని కలిగించటానికి తీవ్రప్రచారం సాగించారు. భారతదేశంలో కమ్యూనిస్టు వుద్యమానికి యిది గొడ్డలిపెట్టు అని, తమ గోతిని తామే త్రవ్వుకుంటున్నామని తెలియని మూఢత్వంతో వారు సంచరించారు. రాయ్ వునికి తెలుసుకొనటానికి పోలీసులు విశ్వప్రయత్నాలు చేసారు. బాంబే చేరిన కొలది రోజులకే రాయ్ ఆగమనాన్ని అనుమానించారు. ప్రెస్ రిపోర్టు ప్రకారం - 'పోలీసులు వెంటాడుచున్నా అనేక

పర్యాయాలు జాగ్రత్తగా తప్పించుకో గలిగాడు. ఆయనలో అంత యుక్తి చమత్కారం, ఉపాయం లేకపోతే వచ్చిన వారం రోజులలోనే పట్టుబడేవాడు.'

రాయ్ మరి కొంతకాలం పోలీసులకు కనుకట్టు కలిగించి అజ్ఞాతంలో వుండ గలిగేవాడేమో. కాని మాస్కో నుంచి రాయ్‌ని తప్పించి బెర్లిను తీసుకొని రాగలిగిన స్విస్ వనిత భారతదేశం వచ్చి రాయ్‌ని రహస్యంగా రెండుసారులు కలుసుకొనినది. ఆమె ఆగమనం పోలీసులకు అనుమానాన్ని కలిగించినది. బ్రిటిషు ఇంటలిజెన్సు విభాగం ఆమె చర్యల మీద నిఘా వేసినది. ఆమె రాయ్ అనుచర వర్గంతో కలిసి తిరగటం వారు పసికట్టినారు. సుందర కబాడీని ముందుగా అరెస్టు చేసి రాయ్ ఆచూకీ తెలుసుకొన గలిగారు.

ఏ రోజు నయినా ప్రభుత్వం బంధించగలదని రాయ్‌కి తెలుసు. అయినా వున్న సమయంలోనే త్వరితగతిలో తన ఆశయాలకు, ప్రజా వుద్యమానికి అనుగుణమయిన అనుయాయులను, పార్టీని నిర్మించటం ప్రధానంగా భావించి అందు కొరకు అవసరమయిన పునాదిని నిర్మించటానికి ప్రయత్నించి సఫలీకృతుడయ్యాడు.

కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ తొలగించినా, కమ్యూనిస్టులు 'ఇంపీరియలిస్టు బంటుగా' చిత్రించినా, కాంగ్రెసుతో సహకరించాలని రాయ్ చెప్పినా బ్రిటిషు ప్రభుత్వానికి రాయ్ మీద అనుమానం వుండనే వున్నది. అతనిని కమ్యూనిస్టుల కంటె ప్రమాదభరితునిగా భావించినది.

"కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌కు విరుద్ధంగా స్వతంత్ర కమ్యూనిస్టు పార్టీని స్థాపించటం నా అభిమతం కాదు. భారత కమ్యూనిస్టు పార్టీ కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ అంతర్భాగంగా వుండాలనటమే నా ప్రగాఢవాంఛ. కాని కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ సూచించిన తప్పుడు పంథా విడువనిదే కమ్యూనిస్టు పార్టీని ప్రజా పార్టీగా నిర్మించటానికి వీల్లేదు."

"కమ్యూనిస్టులమయిన మనం, టెర్రరిస్టులు ఒకే సిద్ధాంతం కొరకు పోరాడుచున్నాము. అదే విప్లవం. కాని వారు చేసే హత్యాకాండలను మనం గర్హించుచున్నాము. సిద్ధాంతరీత్యా దీనిని మనం ఖండించలేము. కాని కార్యక్రమం, ఆచరణ కిది ఆటంకంగా భావిస్తున్నాము. వారితో - మిత్రులారా ! దీనివలన ప్రయోజనం శూన్యం. ఎన్ని సాయుధదాడులు చేసినా బ్రిటిషు ఇంపీరియలిజాన్ని

మన దేశం నుంచి పారద్రోలలేము. కనుక అందుకు ప్రత్యామ్నాయంగా సరియైన పద్ధతులు, కార్యక్రమం చేపట్టాలి."

మొదట టెర్రరిస్టుగా వున్న రాయ్ భారతదేశం తిరిగి వచ్చిన తరువాత భారత కమ్యూనిస్టులకు, టెర్రరిస్టులకు యిచ్చిన సలహా యిది. కాబట్టి బ్రిటిషు ప్రభుత్వం రాయ్ విషయంలో అతిజాగ్రత్త వహించి అనేక ప్రయత్నాలు చేసి బంధించ గలిగినది.

బ్రిటిషు ఇంటలిజెన్సు నివేదికలను బట్టి - "భారతదేశంలో కమ్యూనిజం నిజమైన ప్రమాదహేతువుగా చేయగల వ్యక్తి రాయ్ వొక్కడే. అనతికాలంలో వూహించలేని శీఘ్రగతిలో దేశంలో కమ్యూనిస్టు విధానాలను ప్రచారం చేయ గలిగాడు. ఇట్టి సాహసకృత్యం సాధించగల శక్తి రాయ్ వొక్కనికే వున్నది.... యదార్ధవాదిగా తక్కిన కమ్యూనిస్టు నాయకుల భుజాల మీద, శిరస్సుల మీద నిలువ గలిగిన వ్యక్తి రాయ్ వొక్కడే ......భూస్వామ్య పద్ధతికి, కాపిటలిజానికి, ఇంపీరియ లిజానికి ప్రమాదభరితుడయిన బద్ధశత్రువు."

స్విస్ వనిత ఆగమనం పసిగట్టబడినదని రాయిస్టులు తెలిసికొనటంచేత ఆమెను దూరంగా వుంచటం మంచిదని బ్రజేష్‌సింగు దగ్గరకు పంపారు. ఆమె కొంతకాలం ఆయనతో కలాకంకార్ ప్రాసాదంలో వున్నది. రాయ్ అరెస్టు చేయ బడిన మరునాడే వారిద్దరినీ పోలీసులు అరెస్టు చేసారు. ఆమె బెయిలుమీద విడుదల అయి రాయ్ విచారణ రక్షణ సంఘంలో చేరి బొంబే వచ్చినప్పుడు 'విదేశీయుల అక్రమ ప్రవేశచట్టం' క్రింద తిరిగి అరెస్టు చేయబడి 'భారతదేశ శత్రువు'గా బయటకు పంపి వేయబడినది. ఆమెకు దేశంలో స్థిరపడాలంటే ఇచ్చట వివాహిత కావటం అవసరం. డాక్టరు యమ్. ఆర్. చెట్టి అందుకు సిద్ధపడ్డాడు. కాని ఆ కార్యం క్రియారూపం చెందకముందే ప్రభుత్వం ఆమెను దూరం చేసినది.

## జైలు జీవితం :

1924 కాన్పూరు కుట్రకేసులో రాయ్ ముద్దాయిగా ఆయన మీద అభి యోగం అలాగే నిలచియున్నది. ఆ కుట్ర కేసులో, రాయ్‌కీ సంబంధం వుందని, అప్పటినుంచి జారీ చేసిన వారంటు నోటీసు అలాగే వున్నదని ప్రభుత్వం ప్రకటించి

నది. రాయ్‌ని అరెస్టు చేయగానే బొంబే నుంచి కాన్పూరు తీసుకొని వెళ్లి అచ్చటి జైలులో నిర్బంధించినది.

రాయ్ అరెస్టు అయ్యాడన్న సంగతి దేశం నలుమూలలా వ్యాపించినది. కాన్పూరులో జైలుచుట్టూ వేనకువేలు జనం మూగినది. ప్రభుత్వానికి వ్యతిరేకంగా అనేక ప్రదర్శనలు జరిగినవి. కోర్టులో బహిరంగ విచారణకు ప్రభుత్వం సంకోచించినది. చివరకు రాయ్ వున్న జైల్లోనే విచారణ జరిపినది. రాయ్ రక్షణ (డిఫెన్సు) సంఘం యేర్పడినది. సహాయం చేయటానికి అనేక సంస్థలు ముందుకు వచ్చినవి. వాదించటానికి అనేకమంది న్యాయవాదులు సిద్ధపడ్డారు. కాని రాయ్ తాను నిర్దోషినని రుజువు చేసుకొనటానికి మాత్రం ప్రభుత్వం అవకాశ మీయలేదు.

రాయ్‌ని జైలు నుంచి విడచిపెట్టాలని యీ దేశంలోనే కాదు, ఇతర దేశాల్లో కూడా ఆందోళనలు జరిగినవి. హాంబర్గులో ఇరవై వేలమంది కార్మికులు ప్రదర్శనలు జరిపారు. చికాగోలో పదిహేనువేలమంది అచ్చటి బ్రిటిషు రాయబార కార్యాలయం ముందు తమ అసమ్మతిని ప్రకటిస్తూ ప్రదర్శనం చేసారు. బ్రిటిషు ప్రభుత్వానికి రాయ్‌ని వొదలి పెట్టాలంటూ బహిరంగలేఖ వ్రాసారు. ఇంగ్లండులో లేబరు పార్టీ తరఫున ప్రదర్శనలు జరిగినవి. ప్రపంచ ప్రఖ్యాత వైజ్ఞానికుడు ప్రొఫెసరు ఐన్‌స్టీన్ ఒక సమావేశంలో మాట్లాడుతూ 'రాయ్ వంటి మహావ్యక్తిని జైల్లో పెట్టినందుకు బ్రిటిషు ప్రభుత్వం సిగ్గుపడాలి' అని విమర్శించాడు. ఇన్ని ప్రదర్శనలు, ఇంత అలజడి జరిగినా ప్రభుత్వం లక్ష్యపెట్టలేదు. 1932 జనవరి 9 న రాయ్‌కి పన్నెండు సంవత్సరాల శిక్ష విధిస్తూ కోర్టు తీర్పు చెప్పినది. ఇదే కేసులో డాంగే ప్రభృతులకు నాలుగు సంవత్సరాల శిక్ష విధించబడ్డది.

రాయ్ వూహించిన దానికంటె యీ శిక్షాకాలం అతిగా కనబడినది. హైకోర్టుకు, తరువాత అవసరమయితే ప్రీవీకౌన్సిలుకు అప్పీలు చేయటానికి నిర్ణయించుకున్నాడు. ఇందుకు మొదట పూర్తి బాధ్యత వహించటానికి బ్రజేష్‌సింగు అంగీకరించి విచారణకు సంబంధించిన రికార్డునంతా సమకూర్చి తన అధీనంలోనే వుంచుకొనటం జరిగినది. కాని తీరా విచారణ సమయానికి ఆయన అఫిషియల్ కమ్యూనిస్టు పార్టీలో చేరటం, తరువాత వెంటనే యూరోపా ఖండం వెళ్లిపోవటంతో రాయ్ తన వాదన సమర్ధించుకొనటానికి అనేక చిక్కులను ఎదుర్కొనవలసి వచ్చినది. పైగా తనకు దగ్గర మిత్రులయిన అనేకమంది రాయ్‌తో బాటు జైళ్లలో

నిర్బంధించబడి యున్నారు. హైకోర్టులో విచారణ సమయం వారం రోజు లుండగా న్యాయవాదిని నిర్ణయించుకొనటం జరిగినది. కైలాస్‌నాథ్ కట్జూ రాయ్ న్యాయవాదిగా అలహాబాదు హైకోర్టులో వాదించాడు.

రాయ్ తన రక్షణకు సంబంధించి అభియోగాన్ని ఎదుర్కొనటానికి నివేదికను సిద్ధపరచి కోర్టుకు సమర్పించాడు. అందులో బ్రిటిషు న్యాయశాస్త్రవేత్తలు హ్యూమ్, బెంథాలు, డిసే, లాకీ మొదలయిన వారలను ఉటంకిస్తూ పీడిత ప్రజానీకం తమ రక్షణకు, హక్కులకు అక్రమపాలన సాగించే ప్రభుత్వాన్ని ఎదిరించగల హక్కు కలిగి వున్నదని, దానినే తాను సమర్ధిస్తున్నానని బ్రిటనుకు భారతదేశాన్ని పరిపాలించటానికి హక్కు లేదని, తిరుగుబాటు చేయటానికి తనకు పూర్తి హక్కు వున్నదని రాయ్ స్పష్టంగా వెల్లడించాడు.

రాయ్ వాంగ్మూలం కోర్టులో బహిరంగంగా వెల్లడించటానికి అనుమతించబడలేదు. అందులో కొన్ని విషయాలు పాఠకులు గమనించటం అవసరం.

"నేను భారత విమోచన ఉద్యమాన్ని సృష్టించలేదు. అది భారత ప్రజల మనస్సులో అంతరంగంగా రగులుకొంటూ వున్నది. ఇతరులకంటె ముందుగా దానిని నేను తెలిసికొనగలిగాను. ప్రజలను రాజకీయ బానిసత్వం నుంచి, ఆర్థిక దోపిడీ నుంచి, సాంఘిక అన్యాయాల నుంచి విముక్తి చేయటానికి నేను కార్మిక సంస్థను నిర్మించాను. అట్టి పార్టీ స్థాపన చరిత్రాత్మకంగా అవసరమే కాకుండా విప్లవానికి అవసరం కూడాను. బ్రిటిషు రాజుగాని, మరే శక్తిగాని అట్టి పార్టీని అడ్డగించలేవు.... వాస్తవంగా ఈ ప్రభుత్వం ప్రజలను బాగుపరచే ఆర్థిక విధానం చేపట్టదు. కారణం దీనివలన నష్టపడేది సామ్రాజ్యవాదం, దానికి అండగా వున్న దేశీయ సంస్థానాధీశులు, జమీందారులు, పెట్టుబడిదారులు. కనుక అభ్యుదయ ఆర్థిక కార్యక్రమం అమల్లో పెట్టాలని కోరటం సామ్రాజ్య ప్రభుత్వ ప్రస్తుత చట్టాలను ధిక్కరించటంగా భావించబడుచున్నది. ప్రజలను దుర్భర దారిద్ర్య పరిస్థితులలో అట్టిపెట్టి వారు మెరుగుపడకుండా అణచిపెట్టి సామ్రాజ్యవాదులు, వారి మద్దతుదారులు యింకా ధనికులు కావటానికే యీ చట్టాలు వుపకరిస్తున్నవి.

"నేను హింసాత్మకమయిన సాయుధ విప్లవాన్ని ప్రచారం చేయలేదు. విప్లవం చరిత్రాత్మక అవసరమనే నేను బోధించాను. సాంఘిక అభ్యుదయం కోరే

శక్తులు అప్పుడప్పుడు తరంగాల మాదిరి ఉప్పొంగుతూ వుంటవి. బూజుపట్టిన పాతవిధానాలు క్రొత్త వ్యవస్థను అడ్డగించటం వలన హింసాత్మక రూపాన్ని ధరించక తప్పదు. విప్లవం తనకవసరమయిన వైతాళికులను సృష్టించుకుంటుంది. వీరు పాత, క్రొత్తల స్పర్ధను పరిపక్వదశకు చేర్చటానికి అవసరమయిన కార్యరంగాన్ని సమకూరుస్తారు. పరిస్థితుల అవసరాన్నిబట్టి చరిత్రగతిని త్వరితం చేయటానికి వీరు విప్లవానికి వైతాళికులుగా బాధ్యత వహిస్తారు. విప్లవం జయప్రదం కావటానికి విప్లవశక్తులను వీరు తగు జాగ్రత్తతో సంఘటిత పరుస్తారు........ఈ విప్లవం నా సృష్టికాదు. దేశ పరిస్థితుల ననుసరించి యిది ఆవిర్భవిస్తుంది. నేను అందరికంటె ముందుగా దీని అస్తిత్వాన్ని గమనించ గలిగిన వ్యక్తిని మాత్రమే.

"నేనుగాని కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌గాని విప్లవానికి కారణభూతులము కాము. సామ్రాజ్య తత్వంలోనే యిది అంతర్భూతంగా యిమిడి వున్నది. కనుక నన్ను శిక్షించినంత మాత్రంచేత విప్లవం ఆగదు. సామ్రాజ్యవాదం తన సమాధిని తానే నిర్మించుకొన్నది. అది సమాధి చేయబడే వరకు విప్లవశక్తులు వూరుకొనవు. ఇది చరిత్రాత్మక సత్యం. దీనిని గుర్తించటం అవసరం."

జస్టిస్ థామ్ బ్రిటిషు న్యాయశాస్త్రవేత్తల ఉదాహరణను తాను సమర్థించబోవటం లేదని, వారి వాదన కేవలం విద్వత్సభా సంబంధమయిన గోష్ఠికి పరిమితమైనదేగాని, చట్టసమ్మతం గాదని రాయ్ వాదనను త్రోసివేసి, తాను ఇండియన్ పీనలుకోడ్ ననుసరించి తీర్పు యిస్తున్నానని ప్రకటించి క్రింది కోర్టులో విధించిన శిక్షను ఆరు సంవత్సరాలకు తగ్గించాడు. ఆ శిక్షాకాలాన్ని యింకా తగ్గించుకొనాలనే దృష్టితో రాయ్ ప్రీవీకౌన్సిలుకు అప్పీలు చేయటానికి సర్ స్టాఫర్డు క్రిప్సు, యితర ప్రముఖ బ్రిటిషు న్యాయవాదులతో సంప్రదింపులు జరిపించాడు. అయినా అది ప్రయోజనకారి గాదనే నిర్ణయానికి రావటంచేత తన పూర్తి శిక్షను అనుభవించి 1936 నవంబరు 20న విడుదల అయ్యాడు. రాయ్‌కి మొదట యిచ్చిన ఎ తరగతి బి తరగతిగా తగ్గించబడినది. కాన్పూరు సెంట్రల్ జైలు నుంచి బరేలీ సెంట్రలు జైలుకు, అలహాబాద్ జైలునకు చివరకు డెహ్రాడూన్ జైలునకు మార్చబడి అక్కడే పూర్తి కారాగారవాసం అనుభవించాడు.

రాయ్ జైలులో దుర్భర జీవితాన్ని అనుభవించవలసి వచ్చినది. గాలి, వెలుతురు లేని గది. వాతావరణం సరిపడలేదు. ప్రభుత్వం చదువుకొనటానికి

పుస్తకాలుగానీ, వ్రాసుకొనటానికి కలం, కాగితాలుగాని తగినట్లుగా సప్లయి చేయటానికి నిరాకరించినది. ప్రతి వస్తువు బయటనుంచి మిత్రుల సహాయంతో తెప్పించుకొనవలసి వచ్చేది. నెహ్రూ రాయ్ జైలు జీవితాన్ని గురించి యీ విధంగా వ్రాసాడు.— "ఆయన జైలులో వ్యాధిగ్రస్తుడై నానా యాతనలు పడవలసి వచ్చినది.... సాధారణంగా మాబోటివారికి జైలులో సమకూర్చే సదుపాయాలు ఆయనకు నిరాకరింపబడ్డవి. చదువుకొనటానికి పుస్తకాలు, వ్రాసుకొనటానికి అవసరమయిన వస్తువులు కూడా ఆయనకు చాల పరిమితం చేయబడ్డవి.....ముఖ్యంగా మేధాసంపత్తిగల వ్యక్తి యీ నిరాదరణకు గురికావటం అంతకంటె భరించరాని శిక్ష మరొకటి వుండజాలదు.... ఆ విధంగా తన విలువగల కాలాన్ని ఆయన వృథా చేస్తున్నాడు. తన జీవితంలో అత్యున్నతమయిన శిఖరాన్ని అందుకొనగలిగిన ఆ యువకుని జీవితం ఒక్కసారిగా అగాధమయిన కొండ లోయకు దించబడ్డది.... ప్రస్తుత సమాజంలో భారత పుత్రులలో మహా సాహసోపేతులు, మేధావుల సంతతికి చెందిన ఒక ప్రధాన వ్యక్తి భవిష్యత్తు యీ విధంగా అంధకారమయం కావటం శోచనీయం."

నిజంగా అది భరింపరాని జీవితమే. రాయ్ జైలునుంచి బెర్లినులో వున్న తన భార్య ఎలెన్‌కు వ్రాసిన ఉత్తరాలలో అనేక పర్యాయాలు ఈ దుర్భర జీవితం అనుభవించటం కంటె మరణశిక్ష మెరుగు అని వ్రాయటం కూడా జరిగినది.

కారాగారవాసి అయినా బయటవున్న అనుచరవర్గంతో రాయ్ సంబంధాలు తెగలేదు. రాయిస్టులకు, కార్మిక నాయకులకు ఎప్పటికప్పుడు వుద్యమ తీరు తెన్నులను తెలుసుకొంటూ అవసరమయిన సలహాలు, కార్యక్రమ విధానాన్ని సూచిస్తూవచ్చాడు. వీనికి తోడు పత్రికలకు అప్పటి రాజకీయ పరిస్థితులు, పంథాను గురించి అనేక వ్యాసాలు పంపుతూ వచ్చాడు. రాయ్ వ్రాతలన్నీ రహస్యంగా జైలునుంచి బయటకు వస్తూ వుండేవి.

తీవ్రవాదులయిన జయప్రకాష్‌నారాయణ, ఆచార్య నరేంద్రదేవ్, అచ్యుత పట్వర్ధన ప్రభృతులు సోషలిస్టు భావాలు కలిగి, కాంగ్రెసుచేత సోషలిజాన్ని వొప్పించటానికి ప్రయత్నాలు సాగించారు. వీరికి కాంగ్రెసులో రాయిస్టుల సహకారం కూడా లభించినది. కాంగ్రెసులో కాంగ్రెసు సోషలిస్టు పార్టీ అంకురార్పణ జరిగినది. జైలులో వున్న రాయ్ దీన్ని వ్యతిరేకించాడు. కాంగ్రెసు ధ్యేయం సంపూర్ణ స్వరాజ్యం. బ్రిటిషు ప్రభుత్వ దాస్య శృంఖలాలనుంచి ముందుగా

మాతృదేశాన్ని విముక్తి చేయటం అవసరం. అందుకు జాతీయ కాంగ్రెసు పోరాటాన్ని సాగిస్తున్నది. కాంగ్రెసుచేత సోషలిజాన్ని ఒప్పించటానికి ప్రయత్నించటం ప్రస్తుత సమస్యకాదు. పైగా కాంగ్రెసులో మరొక పార్టీని నిర్మించటం కాంగ్రెసును బలహీనపరచటమే. సోషలిస్టులు స్వతంత్రంగా బయట మార్క్సిస్టు సిద్ధాంతాలతో వేరే పార్టీని స్థాపించుకొనటం అవసరం. కాని పార్టీలో పార్టీని స్థాపించి ఒకవంక సంపూర్ణ స్వరాజ్యాన్ని సాధించటానికే, మరొవంక సోషలిజాన్ని ప్రవేశపెట్టటానికి ప్రయత్నించటం సరియైన మార్గంకాదు. కాబట్టి ప్రస్తుతం కాంగ్రెసును బలపరచి కాంగ్రెసుచేత ప్రజా బాహుళ్యానికి అవసరమయిన కార్యక్రమం అంగీకరింపచేయటమే ఉత్తమ మార్గంగా సూచిస్తూ సోషలిస్టు నాయకులకు ఉత్తరాలు వ్రాశాడు. ఇవి తరువాత "కాంగ్రెసు సోషలిస్టు పార్టీకి ఉత్తరాలు" అను పేరుతో పుస్తకరూపంలో ప్రచురింపబడ్డవి.

జైలు జీవితం రాయ్‌కి ఒక విధంగా మేలు సమకూర్చినది. అంతవరకు విశ్రాంతి నెరుగని రాజకీయ జీవికి కొంత విశ్రాంతి లభించినది. మార్క్సిజం గురించి పునఃపరిశీలన చేసాడు. ప్రాక్, పశ్చిమ తత్వశాస్త్రాలను పరిశోధించాడు. ఆధునిక విజ్ఞాన శాస్త్రాలలో వచ్చిన మార్పులను, సమాజంమీద వాటి ప్రభావాలను గురించి తీరికగా ఆలోచించగలిగాడు. ఇందుకు అవసరమయిన గ్రంథాలను బెర్లినులో వున్న ఎలెన్‌రాయ్ పంపుతూవచ్చినది. తన శిక్షకాలంలో రాయ్ అనేక ఉద్గ్రంథాలను రచించగల్గాడు.

మేధావుల శ్రేణికి చెందిన సర్. కట్టమంచి రామలింగారెడ్డి రాయ్‌ని గురించి 'ఒక గ్రంథ భాండారాన్ని జీర్ణించుకొని మరొక గ్రంథ భాండారాన్ని సృష్టించగలిగిన మహా మేధావి'గా శ్లాఘించాడు. ఇది అక్షరాల నిజం. జైలులో వున్నప్పుడు- 'ఫాసిజం', 'మెటీరియలిజం', 'విజ్ఞానము, తత్వశాస్త్రము', 'జైలు వుత్తరాలు', 'ఆధునిక విజ్ఞానశాస్త్రంలోని తాత్విక ఫలితాలు' మొదలయిన అనేక ప్రామాణిక గ్రంథాలను రచించాడు. ఇందులో చివరి గ్రంథంలో కొన్ని భాగాలు ముద్రించబడినా మరికొన్ని అముద్రితంగానే వున్నది. కేవలం ఆర్థిక వాద ఆధారంతో రూపొందిన మార్క్సిజంలోని కమ్యూనిజం సమగ్ర రాజకీయ ఆచరణ కాదని తెలుసుకొన్నాడు. మానవ సంకల్పం కూడా (భావ చైతన్యం) సాంఘిక పరిణామంలో ప్రముఖ పాత్ర నిర్వహించగలదని, వ్యక్తి స్వేచ్ఛ సమాజ అభివృద్ధికి

మొదటి మెట్టు అని, కమ్యూనిజంలోని నియంతృత్వ ధోరణి దీనికి విరుద్ధమనే నిశ్చయానికి వచ్చాడు. ఇదే తరువాత రాడికల్ హ్యూమనిజానికి ప్రాతిపదిక అయినది.

రాయ్ జైలులో వున్నా 'రాయిజం' వ్యాప్తి చెందుతూనే వచ్చినది. రాయిస్టులు అందుకు నిర్విరామ కృషి జరుపుతూనే వచ్చారు. జైలులో రాయ్ ఆరోగ్యం పూర్తిగా దెబ్బతిన్నది. చెవి బాధ తిరుగబెట్టినది. ఆయన బరెల్లీ సెంట్రలు జైలునుంచి డెహ్రాడూన్ జైలుకు మార్చబడ్డాడు. అచ్చటి వాతావరణం రాయ్‌కి అనుకూలించినది. కొంతవరకు స్థిమితం చిక్కినది. తరువాత రాయ్ డెహ్రాడూన్‌లోనే తన నివాసస్థలం యేర్పరచుకొన్నాడు.

1932 కే దేశంలో కమ్యూనిస్టు ప్రాబల్యం పూర్తిగా తగ్గిపోయినది. అచ్చటచ్చట కొన్ని గ్రూపులు పనిచేసినా వారిలో సహకారం కూడా సన్నగిల్లినది. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ తిరిగి భారతదేశ పరిస్థితుల గురించి పునఃపరిశీలన జరిపినది. 1935 లో జరిగిన ఏడవ వరల్డు కాంగ్రెసు భారత కమ్యూనిస్టులను కాంగ్రెసులో చేరి ప్రజా వుద్యమంలో కలిసి కృషిచేయాలని ఆదేశించినది. ఇదే భావాన్ని ప్రకటించిన రాయ్ సిద్ధాంతాన్ని 1928 లో ఆరవ వరల్డు కాంగ్రెసు త్రోసి పుచ్చినది. ఆలస్యమయినా చివరకు కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ సక్రమ పంథా చేపట్టినందులకు రాయ్ సంతోషించాడు. 'రాయిస్టులకు', అఫిషియల్ కమ్యూనిస్టు పార్టీకి కార్యక్రమ విధానంలో భేదం లేదు. కాబట్టి కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌లో 'రాయిస్టు వర్గాన్ని' చేర్చుకొనటానికి దరఖాస్తులు పంపబడ్డవి. కాని ప్రయోజనం శూన్యం. రాయ్ సిద్ధాంతాన్ని అంగీకరించినా, రాయ్‌ని కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌లో చేర్చుకొనటానికి స్టాలిన్ అంగీకరించలేదు. ఐరోపాఖండంలో ఫాసిస్టు ప్రమాదాన్ని కమ్యూనిస్టు అపొజిషన్ వర్గం గుర్తించి ఎదుర్కొనటానికి కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ విప్లవ శక్తులను సంఘటిత పరచాలని హెచ్చరించినది. ఫాసిజం వలన వచ్చే ప్రమాదమేమీ లేదన్నట్లుగా కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ వారి హెచ్చరికకు తగిన విలువనీయక పోవటం దురదృష్టకరం. అసలు ఫాసిజం, దాని సిద్ధాంతాన్ని గురించి స్టాలిన్, యితర కమ్యూనిస్టు నాయకులు సరియైన అంచనా వేయలేక పోయారు.

## కాంగ్రెసు పార్టీ - సోషలిస్టు రాజకీయాలు :

రాయ్ 1936 నవంబరు 20 న జైలునుంచి విడుదల అయ్యాడు. జైలునుంచి కాలు బయటపెట్టాడో లేదో ఒక ప్రక్కన కాంగ్రెసు నాయకులు, మరో ప్రక్క కాంగ్రెసు సోషలిస్టు పార్టీ నాయకులు బ్రహ్మరథం పట్టసాగారు. 15 సంవత్సరాల తరువాత - వివిధ దేశాల్లో పర్యటించి, మెక్సికో, రష్యా, చైనా విప్లవాల్లో ప్రముఖ పాత్ర వహించి దాదాపు పది సంవత్సరాలు లెనిన్, ట్రాట్స్కీ, బుఖారిన్, స్టాలిన్ మొదలయిన ప్రముఖ నాయకుల సమవుజ్జీగా కమ్యూనిస్టు ఇంటర్నేషనల్, సోవియటు రష్యాలో కృషిచేసి మారువేషంలో మాతృదేశంలో కాలూని ఆరేడు మాసాల్లో కాంగ్రెసు ప్రజా వుద్యమానికి నూతన కార్యక్రమం చూపి బ్రిటిషు ప్రభుత్వ నిర్బంధంలో ఆరు సంవత్సరాలు కారాగారవాసం అనుభవించి బయటకు వచ్చిన రాయ్ దేశం నలుమూలలనుంచి ఆకర్షింపబడటం ఆశ్చర్య పడవలసిన విషయం కాదు. ఉభయ పార్టీల నాయకులూ ఎవరికి వారు రాయ్‌ని తమ వానిని చేసుకోవాలని ఆరాటపడ్డారు.

జైలునుంచి బయటకు రాగానే రాయ్ పత్రికా విలేఖరులతో "ప్రస్తుత నా కార్యక్రమం కాంగ్రెసు ద్వారా 'ఐక్య పోరాటం' జరిపి ప్రజా వుద్యమాన్ని సంఘటిత పరచటమే. సోషలిజం మాత్రం కాదు.' అని విశదీకరిస్తూ, "కోటాను కోట్ల ప్రజా బాహుళ్యాన్ని జాతీయ కాంగ్రెసు నాయకత్వం క్రింద సమీకరించి సంపూర్ణ స్వతంత్ర పోరాటాన్ని ముందుకు తీసుకొని పోవటమే అందరి కర్తవ్యం. సోషలిజం కాని, కమ్యూనిజం గాని ప్రస్తుత సమస్య కాదు. కాబట్టి సోషలిస్టులు, కమ్యూనిస్టులు కూడా జాతిని పర ప్రభుత్వంనుంచి విముక్తి కావించటం మొదటి గమ్యస్థానంగా గుర్తించి జాతీయ కాంగ్రెసులో చేరి అందుకు కృషి చేయటం తమ విద్యుక్త ధర్మంగా భావించాలి. జాతీయ కాంగ్రెసు పార్టీ వొక్కటే అందరికీ సమానమైన వేదిక." అని దేశ ప్రజల నుద్దేశించి వివిధ పార్టీలను హెచ్చరించాడు.

"సోషలిజం నా అంతిమ గమ్యస్థానం కాని అందుకు ముందుగా మనం స్వాతంత్ర్యాన్ని సంపాదించాలి. సోషలిస్టు సమాజ వ్యవస్థకు పరిస్థితులను సృష్టించాలి. కాబట్టి సోషలిజం కోరే మతాలు, పార్టీలు అన్నీ కలసి ముందుగా

జాతి స్వాతంత్ర్యాన్ని, రాజకీయ అధికారాన్ని పొందటానికి ప్రయత్నించాలి." అని స్పష్టీకరించాడు.

జైలుగేటు నుంచి బయటకు రాగానే రాయ్‌కి అనేకమంది స్థానిక కాంగ్రెసు నాయకులు, అనుచరులయిన రాయిస్టులు స్వాగతం చెప్పారు. రాయ్ ఆరోగ్యం కోల్పోయి బాగా నీరసించి పోయాడు. అయినా ఆ మరునాడే ఉత్తర ప్రదేశ్ కాంగ్రెసు రాజకీయ మహాసభ జరుగుచున్న బరెల్లీ వెళ్లి అందులో పాల్గొన్నాడు. డిశంబరులో జరుగనున్న ఫెయిజపూరు కాంగ్రెసు మహాసభకు ప్రతినిధిగా ఎన్నుకొనబడ్డాడు. బరెల్లీ నుంచి అలహాబాదు చేరినప్పుడు కాంగ్రెసు వర్కింగు కమిటీ సభ్యులుగా వున్న ఆచార్య కృపలానీ స్టేషనుకు ఎదురొచ్చి స్వాగతం చెప్పి రాయ్‌ని ఆనందభవనానికి తీసుకొని వెళ్లాడు. ఒక వారం రోజులు రాయ్ అక్కడ విశ్రాంతి తీసుకొని కాన్పూరు వెళ్లగా అచ్చట ప్రజలు ఘన స్వాగత మిచ్చి బ్రహ్మాండమయిన పూరేగింపు జరిపారు.

ఫెయిజపూరు కాంగ్రెసు మహాసభకు వెళ్లేముందు రాయ్ అఖిల భారత కాంగ్రెసు కమిటీ సభ్యునిగా ఎన్నుకొనబడ్డాడు. మహాసభలో కాంగ్రెసు అధ్యక్షుడు పండిట్ నెహ్రూ ప్రక్క గుడారంలో వసతి యేర్పాటు చేయబడ్డది. కాంగ్రెసు వేదికమీద ప్రముఖ నాయకులతో పాటు ఉచితస్థాన మలంకరించాడు. నెహ్రూ తన అధ్యక్ష ఉపన్యాసంలో రాయ్‌ని గురించి స్వాతంత్ర్య - విప్లవ పోరాటాలలో కాకలు తీరిన అగ్రగామిగా అభివర్ణించి అట్టి అతిరథుడు కాంగ్రెసులో చేరటం కాంగ్రెసు పార్టీకి శుభసూచకమని తన హర్షాన్ని ప్రకటించి రాయ్‌కి స్వాగతం చెప్పాడు. మితవాద నాయకులకు మాత్రం రాయ్ కాంగ్రెసు ప్రవేశం పచ్చివెలగకాయ మాదిరిగానే వున్నది.

ఫెయిజపూర్ కాంగ్రెసును చరిత్రాత్మక మైనదిగా వర్ణించవచ్చును. లాహోర్ కాంగ్రెసులో సంపూర్ణ స్వరాజ్య తీర్మానం ఆమోదించబడ్డది. కరాచీ కాంగ్రెసులో ఆర్థిక విధానం తీర్చిదిద్దబడినది. గాంధీ ఇర్విన్‌సంధి ఆమోదించ బడినది. గాంధీ రౌండ్‌టేబిల్ సమావేశానికి హాజరుకావటం, సత్యాగ్రహం, నాయకుల నిర్బంధం, 1935 ఇండియా చట్టం మొదలైన ఘట్టాల తరువాత ఫెయిజపూర్ కాంగ్రెసు మహాసభ జరిగినది. సత్యాగ్రహ సమరానికి, స్వాతంత్ర్య సాధనకు తగిన కార్యక్రమం రూపొందించవలసి యున్నది.

ఈ మహాసభలో రాయ్ విలక్షణంగానే వ్యవహరించాడు. కాంగ్రెసును 'రాజ్యాంగ పరిషత్తుగా' బ్రిటిషు ప్రభుత్వానికి పోటీ ప్రభుత్వంగా రూపొందింపాలని నూతన నినాదాన్నిచ్చి గంభీరోపన్యాసం చేసినప్పుడు మితవాద నాయకులయిన భూలాభాయ్‌దేశాయి మొదలయినవారు కూడా రాయ్ దూరదృష్టికి ఆశ్చర్యచకితులు కాక తప్పలేదు.

ఫెయిజపూరు కాంగ్రెసు మహాసభ అనంతరం రాయ్ జైలులో గాంధీతో పాటు మితవాద నాయకులయిన వల్లభాయిపటేలు, రాజేంద్రప్రసాద్, ఆచార్య కృపలానీ మొదలయిన వారితో కాంగ్రెసును పటిష్టం చేసి బలవత్తర సంస్థగా రూపొందించటానికి సుదీర్ఘమైన సంభాషణలు జరిపాడు. కాంగ్రెసులోని భిన్నదృక్పథాలు గల భిన్న పార్టీలు వుండటం కాంగ్రెసు సమైక్యతకు భంగకరమనే వాదాన్ని అంగీకరించాడు. కాంగ్రెసు - సోషలిస్టు పార్టీ కంటె రాయ్, రాయిస్టులే తమతో కలిసి కాంగ్రెసులో కృషి చేయగలరనే నమ్మకం వారికి కలిగినది.

దేశం నలుమూలలా, వివిధ రాష్ట్రాలు పర్యటించి పెక్కు బహిరంగ సమావేశాల్లో, కార్మిక - కర్షక - మేధావుల సమావేశాల్లో రాయ్ వుపన్యసించాడు. కాంగ్రెసు సంస్థ వొక్కటే దేశాని కంతటికీ ప్రాతినిధ్యం వహించగల సంస్థగా చూపి కాంగ్రెసును బలపరచవలసిన అవసరాన్ని గురించి విరివిగా ప్రచారం చేశాడు. అయితే రాయ్ కేవలం కాంగ్రెసును బలపరచటానికే తన ప్రచారం పరిమితం చేయలేదు. హిందూమతాన్ని గురించి, హిందూ సమాజంలో వున్న మూఢ విశ్వాసాలను గురించి నిశితంగా విమర్శించాడు. "కులతత్వాలతో, వర్ణభేదాలతో వేల సంవత్సరాలనుంచి బానిసభావాలతో, మూఢ విశ్వాసాలతో క్రుళ్ళి, కృశించి మానవుడు మానవునిగా పరిగణించబడని హిందూ సమాజం భావవికాసం పొంది, భావ విప్లవం జరుగనిదే రాజకీయ స్వాతంత్ర్యం పొందినా నిష్ప్రయోజనం కాగలదు. ఆ స్వాతంత్ర్య ఫలితాలను ఏ కొద్దిమందో అనుభవించగలుగుతారు. కాబట్టి రాజకీయ స్వాతంత్ర్యానికి ముందు భావదాస్యం పోవాలి. భావ విప్లవం జరగాలి".... అని బోధించాడు. "గాంధీ సిద్ధాంతాలు కేవలం సంస్కరణలకు, హిందూ మత వుద్ధరణకు పరిమితమై వున్నవి. అవి భారత సమాజాన్ని బానిస భావంనుంచి విముక్తి కలిగించటానికి యే మాత్రం వుపకరించవు. వర్ణ వ్యవస్థను బలపరచినంతకాలం అంటరానితనం, హిందూ మతోద్ధరణ చేపట్టినంతకాలం

హిందూ ముస్లిముల ఐక్యత కేవలం నినాదాలుగామాత్రం నిలబడిపోవటం వినా ఆచరణలో ఒక్క అడుగు ముందుకు వేయలేము. కాగా, దీని ఫలితం క్రమేపి కాంగ్రెసునుంచి ముస్లిములు, ఇతర మతస్థులు బయటకు వెళ్ళే ప్రమాదం వున్నది" అని జాతిని హెచ్చరించాడు.

1937 ఏప్రియల్ 1 న 'ఇండిపెండెంటు ఇండియా' పేరుతో వార పత్రికను ప్రారంభించాడు. ఇందుకు పూచీకత్తుగా ప్రభుత్వానికి ముందుగా వెయ్యి రూపాయలు చెల్లించవలసి యున్నది. కాని చేతిలో రాగిగవ్వ కూడా లేదు. నిధుల కొరకు మిత్రులకు, నాయకులకు విజ్ఞప్తి చేశాడు. ఫలితం, బెంగాలు మిత్రులనుంచి నాలుగువందల రూపాయలు వినా మరెవ్వరి సహాయం లభించలేదు. రష్యా నుంచి, ఐరోపాఖండం నుంచి రాయ్ ద్వారా వేనకువేలు అందుకొనిన కమ్యూనిస్టుల కిది కంటగింపుగా పరిణమించినది.

నెహ్రూ మాత్రం హర్షం ప్రకటించాడు. 'ప్రస్తుతం చలామణిలో వున్న వారపత్రికలు, మాసపత్రికలు జాతీయ పోరాటంలో సిద్ధాంతపరంగా సక్రమపంథా, కార్యక్రమం చూపలేక పోవుచున్నవి. వివిధదేశాల్లో సాంఘిక - రాజకీయ వుద్యమాల్లో వ్యక్తిగతంగా పాల్గొని విశేష అనుభవాన్ని గడించిన ప్రజ్ఞాదురంధరుడు కామ్రేడ్ రాయ్ యిలాంటి బాధ్యతను చేపట్టటం చాలా అవసరం' అని సందేశం పంపాడు.

సుభాస్‌చంద్రబోసు కూడా అదేవిధంగా రాయ్ మేధాశక్తిని పొగడుతూ 'స్థిరరూపం దాల్చని జాతీయ పోరాటానికి రాయ్ అండదండలు అవసరమని' రాయ్ అభిప్రాయాలతో ఏకీభవించని వారు కూడా ఆయన చెప్పేది జాగ్రత్తగా పరిశీలించటం అవసరం' అని తన సందేశం పంపాడు. కాని మహాత్ముని సందేశం మరొక విధంగా వున్నధి. ఆయిన పంపిన సందేశం పోస్టుకార్డు మీద ఒకే ఒక వాక్యం. 'మౌనంగా సేవ చేయటం మంచిది'.

తన మొదటి సంచికలోనే రాయ్ 'విజ్ఞానం - మూఢ విశ్వాసాలు' అనే వ్యాసంలో గాంధీ సిద్ధాంతాలను నిశితంగా విమర్శించాడు. దీనికి వెంటనే గాంధీ సమాధానమిస్తూ రాయ్‌ని తన 'ప్రథమ శత్రువు'గా ప్రకటించాడు. ప్రస్తుత సమాజాన్ని సంస్కరించాలి. వర్గ కలహం పనికిరాదు. కార్మికులకు పెట్టుబడి

దారులూ, కర్షకులకు జమిందారులూ ధర్మకర్తలుగా వ్యవహరించాలి. ఇందుకు వారిలో హృదయ పరివర్తన జరుగటానికి తీవ్ర కృషి చేయాలి" అని గాంధీ బోధించగా "అధిక ప్రజల అభ్యుదయానికి నూతన సమాజ నిర్మాణం జరగాలి. ఉన్న సమాజంలో స్వప్రయోజనకారులు అందుకు అంగీకరించినప్పుడు వర్గకలహం తప్పదు. పాత సామాజిక వ్యవస్థను బాగుచేయాలనుకొనటం చిరిగిన దుస్తులను కుట్టి అతుకులబొంతగా తయారుచేయటమే"నని రాయ్ బోధించాడు.

రాయ్ జైల్లో వున్నప్పుడే కాంగ్రెసు సోషలిస్టు పార్టీ కాంగ్రెసులో అంతర్భాగంగా అవతరించినదని వెనుక చెప్పబడినది. ముఖ్యంగా ఈ పార్టీ స్థాపకుడు జయప్రకాశ నారాయణ అని చెప్పవచ్చును. ఈయన అమెరికాలో వున్నప్పుడు కమ్యూనిస్టులతో పరిచయం కలిగి మార్క్సిజాన్ని అర్థం చేసుకొనటానికి ప్రయత్నించాడు. రాయ్ రచనలు - ముఖ్యంగా 'పరివర్తిత భారతదేశం' జయప్రకాశ నారాయణను ప్రభావితుని చేయగా తీవ్రవాద రాజకీయాలు చేపట్టాడు. జయప్రకాశతో పాటు ఆచార్య నరేంద్రదేవ్, మినూ మసానీ, అశోకమెహతా, అచ్యుత పట్వర్ధన, రామమనోహర్‌లోహియా మొదలైనవారు కాంగ్రెసు సోషలిస్టు పార్టీ నిర్మాతలుగా చెప్పవచ్చును. అయితే వీరి భావాలు కలగా పులగం. జయప్రకాశ్, నరేంద్రదేవ్ మార్క్సిస్టులు. మసానీ, మెహతా ప్రజాస్వామిక సోషలిస్టులు. అచ్యుత పట్వర్ధన్, లోహియా సోషలిస్టులయినా గాంధీ సిద్ధాంతాలకు దగ్గరగా వికేంద్రీకరణను, అహింసావాదాన్ని అంగీకరించినవారు.

కాంగ్రెసుచే సోషలిస్టు భావాలను అంగీకరింప చేసి సోషలిస్టు సమాజాన్ని నిర్మించాలని వీరి ధ్యేయం. మొదట్లో రాయిస్టులు కూడా వీరితో సహకరించి కాంగ్రెసు సోషలిస్టు పార్టీ అభివృద్ధికి బాగా కృషి చేశారు. బాధ్యత గల కొన్ని ప్రధాన స్థానాలను అలంకరించారు. రాయ్ భారతదేశం వచ్చే ముందు యిచ్చిన మ్యానిఫెస్టో ప్రకారం రాజ్యాంగ పరిషత్తును గురించి అందుకు ప్రాతిపదికగా గ్రామ సంఘాల పునర్నిర్మాణం గురించి విరివిగా ప్రచారం సాగించారు. స్వతంత్ర భారత రాజ్యాంగచట్ట నిర్మాణం కొరకు ప్రజా వుద్యమాన్ని తీవ్రతరం చేయసాగారు.

రాయ్ జైలునుంచే వీరి కార్యకలాపాలు సమీక్షిస్తూ సరియైన పంథా కాదని వీరికి తెలియచేశాడు. "కాంగ్రెసు ధ్యేయం సంపూర్ణ స్వరాజ్యం. అందుకు అందరూ నడుంకట్టి ముందుకు సాగాలి. స్వాతంత్ర్యపోరాటం సఫలీకృత

మయిన తరువాతనే సోషలిస్టు కార్యక్రమం చేపట్టవలసి వున్నది. స్వరాజ్య సాధనకు కృషిచేసే కాంగ్రెసుచేత సోషలిజం వొప్పించటానికి ప్రయత్నించటం అవివేకమేకాకుండా అనైక్యతకు కారణభూతం కాగలదు. పార్టీలో మరొక పార్టీని స్థాపించటం కాంగ్రెసేకాదు ఏ పార్టీ కూడా సహించదు. తీవ్రవాదులు కాంగ్రెసు నుంచి గెంటివేయబడగల ప్రమాదం వుందని" హెచ్చరించాడు.

రాయ్ సలహాను వీరు పెడచెవిని పెట్టారు. నెహ్రూమీద లేనిపోని ఆశలతో తమ నాయకుని చేసుకొనాలని పగటి కలలు కన్నారు. నెహ్రూ తీవ్రవాది, ఆవేశపరుడు. అయితే కృతనిశ్చయాన్ని చేపట్టగల ధైర్యం లేనివాడు. కనుక తీవ్రవాదుల భావాలకు నామమాత్రంగా మద్దతు యిచ్చినా గాంధీ నాయకత్వాన్ని కాదనలేని స్థితిలో పడి తాను యిరుకున పడటమేకాకుండా కాంగ్రెసు సోషలిస్టు పార్టీని కూడా యిరుకున పెట్టాడు. గాంధీ ప్రభావానికి లోనుఅయిన కాంగ్రెసే యీ సమస్య పరిష్కరించినది. కాంగ్రెసు నియమావళిలో మొదట స్వరాజ్య సాధనకు 'శాంతియుతమయిన మరియు రాజ్యాంగబద్ధమయిన పద్ధతుల ద్వారా' అనే క్లాజు ఆదర్శప్రాయంగా వుండేది. గాంధీ పట్టుదలమీద ఆ స్థానంలో 'సత్యం - అహింసా పద్ధతుల ద్వారా' అనే క్లాజు ప్రవేశపెట్టబడినవి. దీని ఆధారంతో కాంగ్రెసు ఆదర్శాలకు కట్టుబడని కాంగ్రెసు సోషలిస్టు పార్టీని, యితర తీవ్రవాదులను క్రమేపి కాంగ్రెసునుంచి గెంటివేయటం జరిగినది.

నెహ్రూ వూగిసలాటను రాయ్ తీవ్రంగా విమర్శించాడు. మొట్టమొదటి సారి నెహ్రూ రాయ్‌ని 1927 లో మాస్కోలో కలుసుకొన్నప్పుడు రాయ్ మేధా సంపత్తికి, కమ్యూనిస్టు భావాలకు ప్రభావితుడై విశేష గౌరవ, మర్యాదలు ప్రకటించాడు. ఒక మహా మేధావి ముందు తానొక సామాన్య వ్యక్తిగా భావించు కున్నాడు. రాయ్ ఇండియా ప్రవేశించి మారువేషంలో వున్నప్పుడు 1930-31 లో వీరిద్దరూ కలసి కొన్ని ప్రాంతాలు పర్యటించారు. కరాచీ కాంగ్రెసు మహా సభలో నెహ్రూకు మద్దతుగా, ప్రాథమిక హక్కులు - ఆర్థిక విధానాలు తీర్మానాలలో రాయ్ సలహా లివ్వటం, అందులో అన్నీ కాకపోయినా కొన్నింటిని నెహ్రూ పొందు పరచటం జరిగినది. జైలునుంచి విడుదల అయిన 24 గంటలలోనే రాయ్ నెహ్రూను కలుసుకొని మంతనాలు జరుపటం తరువాత నెహ్రూ అతిథిగా ఆనంద భవనంలో వారం రోజులు విశ్రాంతి తీసుకొనటం జరిగినది. రాయ్ కూడా నెహ్రూ

మీద అనేక ఆశలు పెట్టుకున్నాడు. చివరకు అవి అన్నీ అడియాశలయినందుకు విచారించాడు.

నెహ్రూ ఆ రోజుల్లో నోరు విప్పితే సోషలిజాన్ని గురించి, సోషలిస్టు సమాజాన్ని గురించి అతిగా మాట్లాడుతూ వుపన్యాసాలిస్తూ వుండేవాడు. కాంగ్రెసు సోషలిస్టు పార్టీకి నాయకత్వం వహిస్తాడేమోననే సందేహం మితవాదులకు కలుగక పోలేదు. రాయ్ కాంగ్రెసు సోషలిస్టు పార్టీ వుండరాదని, కాంగ్రెసునే బలపరచాలని బహిరంగ ప్రకటనలు చేయటంతో మితవాద నాయకులు నెహ్రూను త్రోసివేసి రాయ్‌కి పట్టం కట్టాలని ఆశలు చూపించారు. రాయ్ పదవికోసం, అధికారం కోసం ఎప్పుడూ ఆరాటపడలేదు. ప్రయత్నించలేదు. టెర్రరిస్టు వుద్యమంలో జతిన్‌ముఖర్జీకి కుడిభుజంగా నిలబడ్డాడు. మెక్సికోలో కరంజాకు, రష్యాలో లెనిన్‌కు అంతరంగికునిగా, విశ్వాసపాత్రునిగా తన కర్తవ్యం నెరవేర్చి వారి మన్ననలు పొందగలిగాడు. అదేవిధంగా భారత రాజకీయాల్లో నెహ్రూకు కుడిభుజంగా నిలబడి స్వాతంత్ర్య పోరాటంలో, సోషలిస్టు సమాజ స్థాపనలో ముందంజవేసి నవభారత నిర్మాణం జరిపించాలని కలలు కన్నాడు. మితవాదులు నెహ్రూను కాంగ్రెసు నుంచి దూరం చేయాలని పన్నిన కుతంత్రాలను నెహ్రూకు సవివరంగా ఎరుక పరచాడు. నెహ్రూలో రాయ్ ఆశించిన మనోసంకల్పం, స్థిరచిత్తం, దూరదృష్టి లోపించినందు వలననే భారత రాజకీయాలు వక్రమార్గం పట్టినవి.

నెహ్రూ రష్యాలోని సోషలిజాన్ని, కమ్యూనిజాన్ని ఎంతగా శ్లాఘించాడో అదేవిధంగా జర్మనీలోని హిట్లరు ప్రభుత్వాన్ని, అచ్చటి ఆర్థిక విధానాన్ని కూడా కొనియాడాడు. నాజీ ప్రభుత్వం జర్మనీలో సాధించలేని కార్యం లేదనే అభిప్రాయంలో వున్నాడు. ఒక వంక సోషలిజం కావాలంటూ మరోవంక గాంధీ నాయకత్వం త్రోసివేయలేని స్థితిలో వున్నాడు. ఆధునిక విజ్ఞానాన్ని, పాశ్చాత్య సంస్కృతిని బలపరుస్తున్న నెహ్రూ గాంధీ సంస్కరణ వాదాన్ని, ఆచరణ సాధ్యం కాని మూఢవిశ్వాసాలను హేతుబద్ధం చేయాలని ప్రయత్నిస్తున్నాడు. గాంధిజం - మార్క్సిజం ఒకదాని కొకటి చుక్కెదురు. ఎక్కడా సంబంధం లేదు. సమన్వయం కుదరదు. నెహ్రూ ఏ వర్గానికి వుపకరించకుండా చివరకు తనకు తానే మోసగించుకొని ఇరువర్గాలను మోసగించాడు. భావిచరిత్రకారులు నెహ్రూ జీవితాన్ని, ఆశయాలను ఎలా చిత్రిస్తారో గమనించవలసి యున్నది.

## కాంగ్రెసు పునర్నిర్మాణం :

కాంగ్రెసు మితవాద నాయకత్వం తమ తీవ్రవాద రాజకీయాలను వ్యతిరేకించటంచేత కాంగ్రెసు సోషలిస్టులు, కమ్యూనిస్టులు కార్మిక - కర్షక సంఘాల అభివృద్ధికి తమ దృష్టిని కేంద్రీకరించారు. అఖిల భారత కిసాన్ సభ అవతరించినది. వీటిని కాంగ్రెసుకు అనుబంధ సంస్థలుగా చేర్చి జాతీయ వుద్యమాన్ని విస్తరింపచేయాలని వీరి సంకల్పం. ఇందుకు కాంగ్రెసు నియమావళిలో ఒక సవరణ ప్రవేశపెట్టి అంగీకరింపచేయటానికి వీరు ప్రయత్నించారుకూడాను.

రాయ్ మొదట్లో జైలులో వున్నప్పుడు 1934 లో ఇందుకు తన అనుకూలతను వ్యక్తపరచినా ఆ మరుసటి సంవత్సరమే తన వ్యతిరేకతను ప్రకటించాడు. "అధికారం హస్తగతం చేసుకునే పార్టీ కేంద్రీకృతమయిన పార్టీగానే రూపొందాలి. వివిధ పార్టీల సమాగమంతో ఫెడరల్ పద్ధతిలో యేర్పడే పార్టీ విప్లవ వుద్యమాన్ని నడుపలేదు." అని 'జాతీయ వుద్యమాన్ని బహుపార్టీతత్వం బలహీనపరుస్తుందని' చెప్పాడు. దీనివలన రాయ్ కర్షక వుద్యమాన్ని, సంస్థను తేలికగా చూసినట్లు భావించరాదు. రాయ్ తన అనుచరవర్గానికి జైలునుంచి ఒక ఉత్తరం వ్రాస్తూ "భారత విప్లవ పోరాటం జరుగవలసినది, గెలుపపలసినది ముఖ్యంగా గ్రామ ప్రాంతాలలోనే.... కర్షక నాయకత్వం కొరకు కాంగ్రెసును దెబ్బలాటకు గురి కానీయకూడదు. దేశంలో దాదాపు నూటికి ఎనభైమంది కర్షకులే. వారి సహాయ సానుభూతులు లేనిదే స్వతంత్ర పోరాటం విజయవంతం కాజాలదు. వారికి కావలసినది భూమిమీద హక్కు, వారు పండించే పంటలకు రక్షణ. ఇందుకు ప్రత్యేకంగా కర్షక సంఘాన్ని స్థాపించటంకంటె జాతీయ వుద్యమం ద్వారానే వీటిని సాధించవచ్చును.... జాతీయ విప్లవం అంటే కర్షకులకు వ్యవసాయ విప్లవం ... రాజులను, జమీందారులను తొలగించటమే" అని వ్యక్తంచేసాడు.

కాబట్టి కాంగ్రెసులో విరివిగా కర్షకులను చేర్పించాలని, కాంగ్రెసుచేత కర్షక హక్కులను గుర్తింపచేయాలని రాయ్ తన అనుచరవర్గానికి సలహా యిచ్చాడు. రాయిస్టుల వత్తిడిమీద, తీవ్రవాదుల ప్రచార ఫలితంగా కాంగ్రెసు కార్యక్రమంలో "జమీందారీ విధానం రద్దుచేయుట, భూమిని జాతీయం చేయటం,

శిస్తులను క్రమబద్ధం చేయటం, కరువుసమయాల్లో శిస్తు రెమిషన్, వ్యవసాయ దారుల ఋణాలు రద్దుపరచటం, వడ్డీ వ్యాపారాన్ని ఆదుశాతానికి మించని రేటుకు పరిమితంచేయటం మొదలైనవి" చేర్చబడినవి.

దేశం పారిశ్రామికంగా అభివృద్ధి చెందాలంటే ముందు వ్యవసాయ విప్లవం జరగాలి.........రైతు స్థితి బాగుపడి కొనుగోలుశక్తి పెరిగినప్పుడే దేశంలో ఉత్పత్తి సాధనాలు పెరుగగలవు.....లెనిన్ రష్యాలో యిదే దృష్టితో రైతు సంఘాలను వ్యతిరేకించాడు. లెనిన్ పంథా సరియైనదిగా గ్రహించిన రాయ్ భారత దేశంలో అదే పద్ధతి ప్రవేశపెట్టటం మంచిదిగా భావించాడు. స్వతంత్ర రైతు సంఘాలు భవిష్యత్తులో సోషలిస్టు సమాజ నిర్మాణానికి అవరోధం కాగలవనే సందేహం రాయ్‌కి లేకపోలేదు.

1936 లో లక్నోలో సోషలిస్టులు, కమ్యూనిస్టులు కార్మిక - కర్షక సంఘాలను కాంగ్రెసులో అనుబంధ సంస్థలుగా చేర్చుకొనాలని ప్రవేశపెట్టిన తీర్మానం నెహ్రూ బలపరచినా వీగిపోవటం గమనార్హం. దీనికి ప్రత్యామ్నాయంగా ప్రజలను సమీకరించటానికి వేరే ఉపసంఘాన్ని (మాస్ కాంటాక్టు కమిటీ) వేయాలనే తీర్మానం ఆమోదించబడినది. రాయ్ జైలు నుంచి విడుదల అయిన తరువాత యీ సంఘంలో సభ్యునిగా ఎన్నుకొనబడ్డాడు. కార్మిక - కర్షక సంఘాల ప్రవేశం గురించి యీ వుపసంఘంలో తర్జన - భర్జనలు జరిగినవి. ప్రదేశ కాంగ్రెసు సంఘాలు కాంగ్రెసు సభ్యత్వాన్ని విస్తరింప చేయాలేగాని అనుబంధ సంస్థలను చేర్చుకొనరాదని తమ అభిప్రాయం వెల్లడించినవి. దీని ఫలితంగా ఒక ప్రక్క-రాయ్, మితవాదులు, మరో ప్రక్క- సోషలిస్టులు, కమ్యూనిస్టులు సంఘర్షణకు దిగే పరిస్థితి యేర్పడినది.

నెహ్రూ కుప్పిగంతులకు మితవాద కాంగ్రెసు నాయకులు విస్తుపోయారు. రాయ్ తమకు అండగా నిలబడగలడనే అంధ విశ్వాసంతో ఫైయిజపూర కాంగ్రెసుకు ముందు బొంబేలో కొందరు ప్రముఖ నాయకులు రాయ్‌ని కలుసుకొని 'రహస్య మంతనాలు' జరిపారు. నెహ్రూ రాజకీయాలతో తాము విసుగెత్తినట్లు చెప్పి నెహ్రూ స్థానంలో రాయ్‌కి పట్టం కట్టుతామని బలవంతం చేశారు. రాయ్ అంగీకరిస్తే కాంగ్రెసు అధ్యక్షపదవి కొరకు అవసరమయిన గట్టి ప్రయత్నాలన్నీ చేస్తామని, అయితే గాంధీ అంగీకారం మాత్రం చివరిమాట అని

చెప్పారు. రాయ్ అందుకు అంగీకరించకపోగా అలహాబాదులో వున్న నెహ్రూకు ఆ రాత్రియే ప్రత్యేక వార్తాహరుని ద్వారా కబురుపంపుతూ మితవాదుల కుట్రను తెలియజేసి తాను నెహ్రూకు మద్దతుగావుండి తన గత విప్లవ అనుభవం ద్వారా కాంగ్రెసును ప్రజా వుద్యమంగా రూపొందించటానికే భారతదేశం వచ్చినట్లు స్పష్టీకరించాడు. కాని గాంధీ ప్రాపకంతో సోషలిస్టు రూపంలో, పైకి రావాలను కొన్న నెహ్రూ రాయ్‌ని రాజకీయాలలో తనకు సన్నిహితుని చేసుకొనక పోగా దూరంగా వుంచటానికే ప్రయత్నించాడు. నెహ్రూ తన సోషలిస్టు, కమ్యూనిస్టు భావాలకు కట్టువడి అందుకొరకు ప్రయత్నించివుంటే కాంగ్రెసు చరిత్ర, భారతదేశ చరిత్ర మరొకవిధంగా వుండగలిగేది.

ఫెయిజపూరు కాంగ్రెసులో రైతు - కూలీ సంఘాల విషయం తిరిగి చర్చకు వచ్చినది. కాంగ్రెసు సంఘాలలో అనుబంధ సంస్థలకు కొన్ని స్థానాలు ప్రత్యేకించాలని సోషలిస్టులు పట్టుబట్టారు. వీరికి నెహ్రూ మద్దతు కూడా లభించినది. మహాసభకు ముందే రాయ్ బొంబేలో రాజేంద్రప్రసాద్, వల్లభాయిపటేలు, భూలాభాయిదేశాయిలతో కాంగ్రెసు పునర్నిర్మాణం కొరకు సుదీర్ఘ చర్చలు జరిపాడు. తత్ఫలితంగా గ్రామ ప్రాంతాల ప్రజా బాహుళ్యాన్ని కాంగ్రెసు జెండా క్రిందకు తీసుకొని రావటానికి అనుకూలంగా కాంగ్రెసు నియమావళిని మార్చటానికి కొన్ని ప్రతిపాదనలు రూపొందించబడ్డవి. తరువాత గాంధీ, నెహ్రూలతో చర్చలు జరిపి రాయ్ కొన్ని సూచనలు చేసాడు. ఇందులో ప్రధానమైనవి.—

(1) గ్రామ సంఘాలు తరచుగా సమావేశమవుతూ వుండాలి.

(2) ప్రజల కోర్కెలకు జాతీయ వుద్యమానికి సంబంధం కనబడుతూ వుండాలి.

(3) గ్రామ సంఘాలలో చర్చించబడే సమస్యల నాధారంగా తీసుకొని రాష్ట్ర సంఘాలు సిఫారసు చేయాలి. వాటి నాధారంగా అఖిల భారత కాంగ్రెసు కమిటీ, వర్కింగు కమిటీ తీర్మానాలు సిద్ధపరచి మహాసభ అనుమతిని పొందాలి.

దీనివలన కాంగ్రెసులో ప్రజాస్వామికం వర్ధిల్లటానికి అవకాశం లభించటమే కాకుండా ప్రజలు విరివిగా రాజకీయ - సాంఘిక - ఆర్థిక సమస్యలు

చర్చించి చైతన్యవంతులు కాగల అవకాశం లభిస్తుంది. భవిష్యత్తులో నిర్మించబోవు స్వతంత్ర భారత ప్రభుత్వాని కిది ప్రాతిపదిక కాగలదని రాయ్ ఆశయం.

ఫెయిజపూరు కాంగ్రెసు కార్మిక-కర్షక సంఘాలను అనుబంధ సంస్థలుగా కాంగ్రెసులో చేర్చుకొనాలని ప్రవేశపెట్టిన తీర్మానాన్ని త్రోసివేసినది. అందుకు ప్రతిగా సాధారణ సభ్యులకు ప్రజలతో సన్నిహిత సంబంధాలు పెట్టుకొని కాంగ్రెసు సిద్ధాంతాలు - కార్యక్రమం చర్చించి వారి అభిప్రాయాలు వెల్లడించే అవకాశం కలిగించబడినది. గ్రామ సంఘాలు ఏర్పరచి కనీసం సంవత్సరానికి రెండుసార్లు అయినా సమావేశమయి స్థానిక సమస్యలను చర్చించి తమ సిఫారసులు పంపే విధంగా కాంగ్రెసు పునర్నిర్మాణం చేయాలని రాష్ట్ర సంఘాలు ఆదేశించబడ్డవి. అందుకొరకు ఒక ఆర్గనైజింగు కార్యదర్శిని నియమించటానికి కాంగ్రెసు వర్కింగు కమిటీకి అధికార మీయబడినది. అదేవిధంగా రాష్ట్ర సంఘాలు కూడా ఆర్గనైజింగు కార్యదర్శులను నియమించాలని తీర్మానించబడినది. ప్రజా సంబంధ ఉపసంఘ నివేదిక ననుసరించి వర్కింగు కమిటీ కాంగ్రెసు నియమావళిలో మార్పులు సిఫారసు చేయటానికి రాజేంద్ర ప్రసాద్, జయప్రకాశ నారాయణ, జయరామదాసు, దౌలత రామ్‌లతో ఒక ఉపసంఘాన్ని నియమించినది. రాయ్ కాంగ్రెసు ఆర్గనైజింగు కార్యదర్శిగా ఉండటానికి ప్రయత్నించాడు. అయితే గాంధీ - నెహ్రూలు యిద్దరూ దానిని అంగీకరించలేదు.

ఫెయిజపూరు కాంగ్రెసులో గాంధీ మనస్తత్వం తెలుసుకొనటానికి కావాలని రాయ్ ప్రత్యేక సమావేశం జరిపాడు. ఇందుకు రైల్వే వర్కర్లు - (బొంబే, నాగపూరు రైల్వే) జరుపుచున్న సమ్మెకు సానుభూతి తీర్మానం ప్రవేశ పెట్టటానికి గాంధీ అనుమతిని కోరటం సాకుగా చూపి గాంధీని కలుసుకున్నాడు. గాంధీ ఆ తీర్మానాన్ని అంగీకరించలేదు. వారి కుటుంబాలకు సమ్మెకాలంలో కాంగ్రెసు సంఘాలు కొంత ధనసహాయం చేయటం అవసరమని అభ్యర్థించాడు.... చర్చ యీ విధంగా ప్రారంభమయి ఒకరి అంతర్గత భావాలను మరొకరు అవగాహన చేసుకొనే వరకు సాగినది. రాయ్ ఆ రాత్రే తమ మధ్య జరిగిన సంభాషణ తీరును తన ఆంతరంగిక మిత్రులకు తెలియజేసాడు. గాంధీ కాంగ్రెసు మహాసభ అనంతరం తిరిగి సబర్మతీ ఆశ్రమానికి చేరినప్పుడు శిష్యులు రాయ్‌ని గురించి గాంధీ అభిప్రాయం కోరగా "రాజకీయంగా రాయ్ అనే వ్యక్తిని మీరు పూర్తిగా

విస్మరించటం మంచిది. చాలా ప్రమాదమయిన వ్యక్తి. రాయ్‌ని విమర్శించినందు వలన ప్రయోజనం వుండదు. పలుకుబడి పెరుగుతుంది. ఇంకా ప్రమాద భరితుడు కాగలడు" అని సలహా యిచ్చాడు. గ్రామ కాంగ్రెసు సంఘాలలో అన్ని వర్గాలను చేర్చుకొని కాంగ్రెసును విప్లవపూరితం చేయాలనినందుకు గాంధీయులు, విడిగా కర్షక సంఘాలను యేర్పరచి కాంగ్రెసును బలహీనపరచవద్దని సలహాయిచ్చినందుకు సోషలిస్టులు, కమ్యూనిస్టులు రాయ్‌ని పరదేశిగానే భావించారు.

రాయ్ సందేహించినట్లుగానే బీహారులో కిసాన్ సభ కాంగ్రెసుతో సంఘర్షణకు దిగినది. తరువాత 1938 లో జరిగిన హరిపుర కాంగ్రెసు కిసాన్ సంఘాలతో గ్రామ కాంగ్రెసు సంఘాలు సంబంధం పెట్టుకొనరాదని, కర్షకులను విరివిగా కాంగ్రెసులో చేర్పించి వారి సమస్యా పరిష్కారాన్ని కాంగ్రెసు సంస్థయే చేపట్టాలని తీర్మానించినది.

ఫెయిజపూర్ కాంగ్రెసు మహాసభ సందర్భంలోనే రాయిస్టులందరు రాయ్ నాయకత్వం క్రింద సమావేశమయ్యారు. రాయ్ వారికి 'రాయిజం' పేరుతో ప్రత్యేక సిద్ధాంతమేమీ లేదని కాంగ్రెసు చేపట్టిన కార్యక్రమాన్ని దేశం నలుమూలలా వ్యాపింపచేసి కాంగ్రెసును సుసంఘటితపరచి ప్రజా వుద్యమాన్ని బలపరచటమే 'రాయిస్టులు' తమ విద్యుక్తధర్మంగా బాధ్యత వహించాలని ప్రబోధించాడు. తరువాత వారు అఖిల భారత రాడికల్ డెమోక్రాటిక్ లీగుగా కొంతకాలం వ్యవహరిస్తూ వచ్చారు.

## ఇండియా చట్టం - కాంగ్రెసు పార్టీ :

1935 భారత రాజ్యాంగచట్టం దాదాపు భారతదేశంలోని అన్నివర్గాల తీవ్రవిమర్శనకు ప్రతిఘటనకు గురి అయినది. కాంగ్రెసులోని మితవాదులలోనే ఒక వర్గం దీన్ని వ్యతిరేకించినా, మరొక వర్గం డాక్టరు అన్సారి నాయకత్వంలో గాంధీ ఆశీర్వాదంతో కేంద్ర ఎన్నికలకు పోటీ చేయటానికి నిర్ణయం తీసుకొన్నది. రాయ్ జైల్లో వుండగానే యీ పార్టీ స్థాపన గురించి విమర్శిస్తూ 'కాంగ్రెసు బూరువా నాయకత్వం బ్రిటిషు ప్రభుత్వంతో రాజీపడటానికి దొడ్డిదారిని తెరచినది.

లాహోరు, కరాచీ తీర్మానాలను విస్మరించటం మహాపరాధం, మాతృదేశానికి తీరని అపచారం' అని గుర్తు చేసాడు.

అంతే తక్కిన వర్గాలు, పార్టీలు సూచించిన విధంగా ఎన్నికలను బహిష్కరించాలని రాయ్ అభిమతం కాదు. "మితవాదుల రాజీ పద్ధతిని ఎదుర్కొన టానికి శాసనోల్లంఘనం కాని, గాంధీ నిర్మాణ కార్యక్రమం కాని, లేక ఎన్నికలనే బహిష్కరించటం కాని సరియైన పంథా కాదు. మితవాదులు కౌన్సిలు ప్రవేశాన్ని అంతకంటె తీవ్రవాద కార్యక్రమంతో ఎదుర్కొనాలి...... ఎన్నికలు కాంగ్రెసు సిద్ధాంతాలను, భావాలను, కార్యక్రమాన్ని విపులంగా ప్రచారం చేసి ప్రజలను సమీక రించి సంఘటిత పరచటానికి మంచి అవకాశాన్ని యివ్వగలవు. ఇందులో ప్రజల కోర్కెలను జోడించాలి. కేవలం పదవుల కొరకే ఎన్నికలు కారాదు. పరాయి ప్రభుత్వం యిచ్చిన చట్టానికి మారుగా ప్రజలచే ఎన్నుకొనబడే రాజ్యాంగ పరిషత్తు ద్వారా రాజ్యాంగచట్టాన్ని నిర్మించాలని ప్రచారం చేయటం అవసరం. ఎన్నికలలో నిలబడే అభ్యర్థులు ప్రజల అవసరాలను, కోర్కెలను సఫలీకృతం చేయాలని వత్తిడి చేయాలి. వారి నుంచి హామీలు పొందాలి. తద్వారా సంస్కరణవాదులు బ్రిటిషు ప్రభుత్వంతో రాజీపడే ఆస్కారం లేకుండా చేయాలి" అని వివరించాడు.

నెహ్రూ శాసనసభా ప్రవేశాన్ని తీవ్రంగా ఎదుర్కొన్నాడు. శాస నోల్లంఘనం చేయాలని ప్రచారం సాగించాడు. రాయ్ నెహ్రూకు ప్రత్యేకంగా ఉత్తరం కూడా వ్రాసాడు. "మితవాదుల రాజీ పద్ధతులకు శాసనోల్లంఘనం సరి యైన సమాధానం కాదు. వారి శాసనసభా ప్రవేశాన్ని ప్రజా పోరాటంగా మార్చగల వేదికగా తయారు చేయాలి." అని సూచించాడు. నెహ్రూకు యిది సమ్మతంగా కనబడలేదు. తన కార్యక్రమం అవలంబించినట్లయితే కాంగ్రెసు తీవ్రరాజకీయాలను చేపట్ట కలిగి వుండేదని రాయ్ తరువాత వ్యక్తం చేసాడు.

ఎన్నికలను బహిష్కరించరాదని చెప్పినందులకు వామ పక్షంలోని తీవ్రవాదులందరూ రాయ్‌ని, రాయిస్టులను సంస్కరణవాదులుగా, పార్టీ వ్యతిరేకు లుగా నిందించసాగారు. కాంగ్రెసు ఎన్నికలలో పోటీ చేయాలని నిర్ణయం తీసుకొన్నది. కాంగ్రెసు సోషలిస్టులు మంత్రి పదవులు చేపట్టరాదనే వినాదం ప్రారంభించారు. 1935 ఇండియా చట్టాన్ని భగ్నం చేయటానికే మంత్రి పదవులను చేపట్టవలసిన అవసరం వున్నట్లుగా కాంగ్రెసు ప్రచారం చేసినది. కాంగ్రెసు

మంత్రి పదవులు స్వీకరించటానికి పూనుకొన్నప్పుడు సోషలిస్టులు తమకు పదవులు వలదని భీష్మించుకొని దూరంగా కూర్చున్నారు. దీని ఫలితం మితవాదులు అధికారం చేపట్టి తమ పదవులను అంటిపెట్టుకొని వుండటం, అతివాదులు ప్రభుత్వానికి దూరంగా వుండటంచేత ప్రజలలో యేమీ చేయలేక పలుకుబడిని పోగొట్టుకొనటం జరిగినది.

రాయ్ ఏమాత్రం సంస్కరణలకు అవకాశం వున్నా విప్లవవాదులు వాటిని చేయి విడువరాదని వాటిని అమలుచేస్తూనే ముందుకు సాగిపోవటానికి ప్రజలను ఆయత్తపరచాలని బోధించాడు. అయినా తీవ్రవాదులు వినలేదు. పైగా రాయిస్టులు, మిగిలిన తీవ్రవాదుల మధ్య సంబంధాలు బెడిసినవి. రాయ్ వామ పక్షానికి ద్రోహం తలపెట్టాడని వారు బాహాటంగా విమర్శించసాగారు. రాయ్‌ని బెదిరిస్తూ రహస్య వుత్తరాలు కూడా వచ్చినవి.

"కాంగ్రెసు మంత్రి పదవులను స్వీకరించటం వలన పదవీ వ్యామోహంతో కొంతమంది 'ఇండియా చట్టాన్ని భగ్నం చేయటానికే' అనే కాంగ్రెసు నినాదాన్ని మరచిపోయి చట్టానికి అనుకూలంగా కృషిచేయటానికి సంసిద్ధులు కాక తప్పదు. దీని ఫలితంగా కాంగ్రెసులో మితవాద - అతివాద చీలికలు వచ్చి కాంగ్రెసులోని వామపక్షం నెహ్రూ నాయకత్వం క్రింద బలపడగలదు. మితవాదులను కాంగ్రెసునుంచి వేరుచేయటంతో కాంగ్రెసు నాయకత్వం, ప్రజావుద్యమం తీవ్రవాదుల చేతులలోనికి రాగలదు" అని రాయ్ ఆశించాడు. అలాగే జరిగినది. సుభాసుచంద్రబోసు కాంగ్రెసు అధ్యక్షుడు అయ్యాడు. ఈయన మొదట గాంధీకి ఎదురుతిరిగినా చివరకు లొంగిపోవటం, అంతలో ద్వితీయ ప్రపంచయుద్ధం రావటంతో వచ్చిన అవకాశాన్ని తీవ్రవాదులు చేయిజారవిడచుకున్నారు.

కాంగ్రెసు పార్టీ మంత్రి పదవులను చేపట్టినంత మాత్రాన పరిస్థితులు చక్కబడవు. అసలు 1935 ఇండియా చట్టం ప్రకారం కాంగ్రెసు పార్టీగాని, నాయకులుగాని ప్రజల కోర్కెలను తీర్చగల స్థితిలో వుండటానికే వీలులేదు. కాంగ్రెసు నాయకులు పదవులను చేపట్టిన తరువాత పార్టీ కార్యక్రమాల కంటె ప్రభుత్వ కార్యక్రమాలలోనే విలీనమయి తమ పదవులను అంటిపెట్టుకొని నిలబెట్టుకొనటానికే ఆరాటపడుతూ వుంటారు. కనుక మితవాద నాయకత్వంతో ఏకీభవించని తీవ్రవాదులు వామపక్షాన్ని బలపరచుకొని తీవ్ర భావాలతో కాంగ్రెసును ఉత్తేజపరచి

నాయకత్వం వశపరచుకొనటానికి మంచి అవకాశం లభించగలదని రాయ్ ఆశించాడు.

ఇదే సమయంలో రాజ్యాంగ పరిషత్తును సమావేశపరచాలనే ఆందోళన ద్విగుణీకృతం చేయటంతో ప్రజాస్వామ్య విప్లవానికి అనువయిన ప్రాతిపదిక యేర్పడగలదు. ఫ్రెంచి జాకోబినులు, రషియన్ బోల్షివిక్కులు, ఇంగ్లీషు ఇండిపెండెంట్లు - జాకోబిన్ క్లబ్బులను, సోవియట్లను, స్వతంత్ర చర్చీలను ఆధారం చేసుకొని అధికారం వశపరచుకొనినట్లు కాంగ్రెసులోని వామపక్షం కాంగ్రెసు పార్టీని, అధికారం హస్తగతం చేసుకొనటానికి వినియోగించు కొనవచ్చునని రాయ్ ఆశించాడు. మొదట ఫ్రాన్సులో అధికారం చేపట్టిన గిరాండిస్టులు, రష్యాలో మెన్షవిక్కులు, ఇంగ్లండులో రాజులు పదవీచ్యుతులు కావటానికి ఇవే పద్ధతులు అవలంబించబడినవి.

రాయ్ ముఖ్యంగా ఫ్రెంచి విప్లవాన్ని ఆదర్శంగా తీసుకొన్నాడు. రాజ్యాంగ పరిషత్తును సమావేశపరచటంలో ప్రధానోద్దేశం గ్రామీణ కాంగ్రెసు సంఘాల ద్వారా ప్రభుత్వ యంత్రాంగానికి ప్రతిగా నిలబడగల మరో యంత్రాంగాన్ని తీర్చిదిద్దటమే. ఫ్రెంచి విప్లవంలో నాయకత్వం వహించిన జాకోబిన్లు ముఖ్యంగా పట్టణాలకు చెందిన మధ్యతరగతివారు. కాని యిచ్చట వ్యవసాయం ప్రధానం కనుక ఇతర హక్కులతో పాటు 'రైతు విప్లవం' ప్రధాన భాగంగా జాతీయ వుద్యమాన్ని పెంపొందించాలని వ్యక్తపరచాడు. దీనినే 'ఇరవై శతాబ్దపు జాకోబినిజం'గా రాయ్ వర్ణించాడు. మంత్రిపదవులను అంతిమ గమ్యస్థానంగా భావించకుండా వాటి కొరకు జరిపే ఎన్నికల సంరంభాన్ని కాంగ్రెసు ప్రచారానికి, రాజ్యాంగ పరిషత్తు పునాదికి, వామపక్ష నాయకత్వానికి ఉపయుక్తంగా మలచుకొనటానికి ప్రయత్నించాలని రాయ్ వ్యక్తం చేసాడు. కాని రాయ్ సూచించిన పంథా అతివాదులకు నచ్చలేదు. రాయ్‌ని మితవాదులలో మితవాదిగా చిత్రించారు కూడాను.

ఎన్నికల ప్రచారం వలన కాంగ్రెసు పలుకుబడి వూహించ లేనంతగా పెరిగినది. 1936 లో ఆరులక్షలున్న కాంగ్రెసు సభ్యత్వం 1937 లో ముప్పయి లక్షలకు, 1939 లో ఏభై లక్షలకు పెరిగినది. అధికారంలో వున్న కాంగ్రెసు మంత్రివర్గాలు ప్రజల కోర్కెలను తీర్చలేక పోవటంతో వర్గ సంఘర్షణ పెరిగినది.

మితవాద, అతివాద నాయకుల మధ్య మితిమీరిన అఘాతం యేర్పడినది. 1939 లో కాంగ్రెసు మంత్రివర్గాలు అనుసరిస్తున్న విధానాలు ప్రజా క్షేమానికి, ప్రజా రక్షణకు పూర్తిగా భిన్నం కాసాగినవి. ఇండియా చట్టాన్ని భగ్నం చేయటానికే ప్రభుత్వ అధికారం చేపట్టామని చెప్పిన కాంగ్రెసు నాయకులు దానిని అంటి పెట్టుకొని కూర్చొనటానికే ప్రయత్నించారు. కాని యీ అవకాశాన్ని తీవ్రవాద వర్గాలు కలసి కట్టుగా పనిచేసి సరిగా వుపయోగించుకొనలేక పోవటం విచారకరం. దీనిఫలితంగా వామపక్షబలం సన్నగిల్లినది. గాంధీ నాయకత్వం పేరుతో బూర్జువావర్గ నాయకత్వం సుస్థిరం కావటానికి వీలుచిక్కినది. ప్రజాభక్షణకు అంకురార్పణ జరిగినది.

నెహ్రూ తరువాత అంతటి తీవ్రవాద నాయకునిగా పేరొందిన సుభాసు చంద్రబోసు హరిపుర కాంగ్రెసు అధ్యక్షునిగా ఎన్నికయ్యాడు. ఇందుకు మొదట గాంధీ ఆశీర్వాదం కూడా కొంత లేకపోలేదు. తీవ్రవాదులను సంతృప్తిపరచటానికో లేక వారి వత్తిడి వలననో యిది జరిగినది. అయినా వర్కింగు కమిటీలో మితవాద ఆధిక్యత వుండనే వున్నది. కాంగ్రెసు ప్రభుత్వాలు ప్రజావసరాలను తీర్చలేని స్థితిలో పడినవి. మితవాద - అతివాదుల మధ్య భేదాభిప్రాయాలు తలయెత్తినవి. ఉభయులకూ ఆమోదయోగ్యమయిన కార్యక్రమం చేపట్టటానికి వీలులేని స్థితి యేర్పడినది. మితవాదులు గాంధీ నాయకత్వం క్రింద అతివాదులను కాంగ్రెసు నుంచి వెడలగొట్టటానికి పథకం రూపొందించసాగారు.

1939 లో త్రిపురి కాంగ్రెసుకు బోసు తిరిగి అధ్యక్షుడు కావాలనుకున్నాడు. ఇందుకు రాయ్ పట్టుదల కూడా కొంత కారణం. గాంధీ సమ్మతించలేదు. డాక్టరు పట్టాభిని ఎన్నిక చేశాడు. ఇది కాంగ్రెసు చరిత్రలో మితవాద - అతివాదులకు పరీక్షాసమయం. కాంగ్రెసు భవిష్యత్తును, భారత భవిష్యత్తును తీర్చిదిద్దగల ఘట్టం. బోసు విజయం - పట్టాభి పరాజయం తథ్యమని భావించిన గాంధీ, కాంగ్రెసుకు తన నాయకత్వం కావాలో లేక బోసు నాయకత్వాన్ని అభిలషిస్తుందో తేల్చుకొనవలసిన సమయం ఆసన్నమయినదని గ్రహించటంచేత "పట్టాభి వోటమి నా వోటమి" అని ప్రతినిధులను హెచ్చరించాడు. గాంధీ నాయకత్వాన్ని ఎదిరించిన సుభాసుచంద్ర బోసు డాక్టరు పట్టాభి మీద 1580 - 1375 వోట్లతో గెలువగలిగాడు. తీవ్రవాదులు అంతిమ విజయాన్ని సాధించగలిగారు. కాంగ్రెసు నాయకత్వం అతివాదుల చేతుల లోనికి వచ్చినది.

'పట్టాభి పరాజయం తన ఓటమిగా ప్రకటించిన గాంధీ కాంగ్రెసు మహాసభకు హాజరు కాలేదు. మితవాదులు కుట్రలు, కుతంత్రాలు ప్రారంభించారు. నిరసనగా వర్కింగు కమిటీ సభ్యత్వాలకు రాజీనామా లిచ్చారు. గాంధీని తిరిగి గద్దె నెక్కించాలనే ప్రయత్నాలు జరిగినవి. కాంగ్రెసు నియమావళి ప్రకారం వర్కింగు కమిటీ సభ్యులను కాంగ్రెసు అధ్యక్షుడే నియమించవచ్చును. త్రిపుర కాంగ్రెసులో అందుకు విరుద్ధంగా 'గాంధీ సలహా ననుసరించి వర్కింగు కమిటీ సభ్యుల నెన్నుకొనాలని' గోవిందవల్లభపంతు తీర్మానం ప్రవేశపెట్టాడు. ఇదే సమయంలో కాంగ్రెసు ప్రతినిధుల దృష్టిని ఆకర్షించి పంత్ తీర్మానాన్ని నెగ్గించటాని కన్నట్లు గాంధీ ఒక చిన్న విషయం మీద రాజకోటలో నిరాహారదీక్ష ప్రారంభించాడు. పై పెచ్చు బోసు మహాసభ సమయంలో తీవ్ర అనారోగ్యానికి గురి కావటం జరిగినది. తీవ్రవాదులలో పొత్తు కుదరక చీలిక లొచ్చినవి. సుభాసుచంద్ర బోసుకు నూటికి అరవై శాతం తీవ్రవాదులతోనే కాంగ్రెసు వర్కింగు కమిటీని నియమించవలసినదిగా రాయ్ సలహా యిచ్చాడు. కేవలం రాయిస్టులే సుభాసుచంద్ర బోసుకు అండగా నిలబడ్డారు. పంతు తీర్మానాన్ని త్రోసివేయగల హక్కు అధ్యక్షుని కున్నది. అయినా బోసు స్వతంత్రంగా వ్యవహరించ లేక పోయాడు. గోవింద వల్లభపంతు ప్రవేశపెట్టిన తీర్మానం నెగ్గినది. అధ్యక్ష పదవికి బోసు రాజీనామా యివ్వక తప్పలేదు. రాజేంద్రప్రసాద్ కాంగ్రెసు అధ్యక్షునిగా ఎన్నుకొనబడ్డాడు. తిరిగి గాంధీ నాయకత్వం, మితవాదుల ప్రాబల్యం కాంగ్రెసులో స్థిరపడినది. క్రమేపి 'సత్య - అహింస'ల పేరుతో తీవ్రవాదు లందరూ కాంగ్రెసు నుంచి బయటకు గెంటివేయబడ్డారు. వామపక్షం సర్వనాశనమయినది.

# భారత దేశం - యుద్ధం:

1939 సెప్టెంబరు 1వ తేదీన జర్మను నియంత హిట్లరు పోలెండు మీద యుద్ధం ప్రకటించాడు. జడి జల్లులు ప్రారంభమయి చివరకు పెనుతుఫానుగా మారినట్లు ఐరోపాఖండంలో చిన్న రాజ్యాలను ఒకదాని తరువాత ఒకటి స్వాహా చేస్తూ ఫాసిస్టు జర్మను మిలిటరీ శక్తి మొత్తం ఐరోపా ఖండాన్నే దాదాపు పాదాక్రాంతం చేయటానికి సన్నద్ధమయినది. అంతటితో ఆగలేదు. అది చివరకు ద్వితీయ ప్రపంచ మహాయుద్ధంగా పరిణమించినది.

ఇంగ్లండు మొదట తటపటాయించినది. చేంబర్లేను ప్రభుత్వం జర్మనీతో రాజీ బేరాలకు దిగినది. కాని హిట్లరు బిగుసుకుని కూర్చొనటంతో తరువాత చర్చిలు నాయకత్వంక్రింద ఇంగ్లండు జర్మనీతో యుద్ధానికి సిద్ధపడినది. తనతో పాటు తన వలసరాజ్యమయిన భారతదేశ ప్రభుత్వంచేత కూడా జర్మనీమీద యుద్ధం ప్రకటింపచేసినది. దేశంలో ఏ పార్టీ, ఏ వర్గం అనుమతి, అంగీకారం లేకుండా యుద్ధ కార్యకలాపాలు ఉత్పత్తులు ముమ్మరం చేయబడ్డవి.

జర్మనీతో చేసుకొనిన 'నిర్యుద్ధ సంధి' పేరుతో రష్యా జర్మనీతో పాటు ఆత్మరక్షణ కన్నట్లు పోలండులో కొంత భాగాన్ని ఆక్రమించుకొని తటస్థ పైఖరిని అవలంబించినది. పోలండు తరువాత హిట్లరు తన దండయాత్రను పశ్చిమ ఐరోపాఖండానికి మళ్లించాడు. చిన్నదేశాలయిన హాలండు, బెల్జియం, డెన్మార్కు, నార్వే దేశాలు తటస్థంగా వున్నా హిట్లరు సైన్యాలు ఆక్రమించినవి. తరువాత ఫ్రాన్సు దేశం కూడా హిట్లరు పాదఘట్టనకు గురికాక తప్పలేదు. ముసోలినీ మధ్యఆశియా, ఆఫ్రికా ఉత్తర ప్రాంతాల్లో దండయాత్ర సాగించాడు. ఇంత జరిగినా రష్యా అది సామ్రాజ్యవాదుల అంతర్యుద్ధంగా భ్రమసి మూకీభావం వహించటం గర్హించదగిన ఘట్టం. ఇది స్టాలిన్ నాయకత్వం క్రింద రష్యా చేసిన సహింపరాని పెద్ద తప్పిదం. దీనిఫలితంగా ఆ యా దేశాల్లో యుద్ధవ్యతిరేక కార్య కలాపాలను ముమ్మరం చేసి కమ్యూనిస్టులు ఫాసిస్టులకు పంచమాంగ దళంగా వ్యవహరించారు.

తరువాత జపాను అక్షరాజ్యాలకు అనుకూలంగా యుద్ధంలో ప్రవేశించి ఆగ్నేషియా దేశాలను ఒకదాని తరువాత ఒకటి ఆక్రమించి భారత సరిహద్దులకు చేరటంతో భారతదేశ భవిష్యత్తు అంధకారబంధుర మయినది. ఐరోపాఖండంతో పాటు ఆఫ్రికా, ఆశియా ఖండాలు ఫాసిస్టుల దురాక్రమణకు గురిఅయ్యే ప్రమాదం ఏర్పడినది.

కాంగ్రెసు మంత్రి పదవులు యింకా కొనసాగుతూనే వున్నవి. తన అంగీకారం లేకుండా యుద్ధ ప్రకటనకు కాంగ్రెసు తీవ్ర వ్యతిరేకతను ప్రదర్శించినది. ముందుగా భారతదేశానికి స్వతంత్రం యిస్తేనే ఇంగ్లండుతో సహకరించగలనని షరతు పెట్టినది. అందుకు ఇంగ్లండు అంగీకరించలేదు. యుద్ధానంతరం కాంగ్రెసు కోరినట్లు భారతదేశానికి స్వరాజ్యం యిచ్చే ప్రతిపాదనలు

ఆలోచించగలమని సూచించినది. అదికూడా ముక్కుకు సూటిగాలేదు. చర్చిలు బ్రిటీషు సామ్రాజ్యాన్ని విచ్ఛిన్నం చేయటానికి తాను అధికారం చేపట్టలేదని బాహాటంగా చెప్పటంతో కాంగ్రెసు యుద్ధానికి ఏమాత్రం సహకరించకూడదనే అంతిమ నిర్ణయానికి వచ్చినది. కాంగ్రెసు మంత్రి పదవులకు రాజీనామా యివ్వాలని ఆదేశించినది. గాంధీ భారతదేశానికి యుద్ధానంతరం స్వరాజ్యం యిస్తాననే ఇంగ్లండు వాగ్దానాన్ని 'దివాలాతీసే బ్యాంకు ముందుతారీఖుతో యిచ్చే చెక్కు-పత్రం'గా వర్ణించాడు. ఈ యుద్ధంలో ఇంగ్లండు నామరూపాలు లేకుండా వోడి పోతుందని అట్టి ఇంగ్లండు ప్రభుత్వం చేసే వాగ్దానాలు నిష్ప్రయోజనమేనని కాంగ్రెసు భావించినది.

నెహ్రూ ఉత్తరప్రదేశ్ కాంగ్రెసు కమిటీ అధ్యక్షులు. కాంగ్రెసు ఏకైక నియంతగా గాంధీ వుండాలని తీర్మానం ఆమోదింపచేశాడు. తరువాత మిగిలిన అన్ని రాష్ట్ర సంఘాలు దీనిని అనుసరించినవి. జయప్రకాశనారాయణ యుద్ధాన్ని ఆసరాగాతీసుకొని స్వతంత్ర పోరాటాన్ని విస్తృతంచేయాలని ప్రచారంచేసాడు. సుభాసుచంద్రబోసు ఫార్వర్డుబ్లాకును స్థాపించి పిమ్మట అంతర్థానుడై జపాను సహకారంతో తరువాత 'ఆజాద్ హింద్ ఫౌజును' స్థాపించి దానికి అధిపతిగా ఆగ్నేషియానుంచి 'ఢిల్లీ ఛలో' నినాదం యిచ్చాడు. కమ్యూనిస్టులు ఇది కేవలం సామ్రాజ్యదేశాలమధ్య జరిగే సామ్రాజ్యవాద యుద్ధంగా వర్ణించి యుద్ధానికి వ్యతిరేకంగా అంతర్యుద్ధం - విప్లవం లేవదీయాలని ప్రచారం ప్రారంభించారు.

* * * * *

రాంఘర్ కాంగ్రెసుకు రాయ్ పోటీ చేశాడు. ఆజాద్ అంటే రాయ్‌కి విశేషమయిన గౌరవ, అభిమానాలు కలవు. మొదట రాయ్ ఆజాద్‌తో పోటీ చేయటానికి సమ్మతించలేదు. కాని రాయిస్టులతో పాటు మరికొందరు తీవ్రవాదులు కాంగ్రెసులో వామపక్షబలం తేల్చుకొనాలనే దృష్టితో రాయ్‌ని బలవంతపెట్టటంతో రాయ్ పోటీకి అంగీకరించాడు. ఆజాద్‌కు 1854 వోట్లు రాగా రాయ్‌కి 183 వోట్లు వచ్చినవి. ఇంత తేడా వుండటానికి కారణాలు కూడా లేకపోలేదు. మొట్టమొదటిసారిగా కాంగ్రెసు చరిత్రలో సిద్ధాంతాలమీద యీ పోటీ జరిగినది. కనుక రాయ్ వోట్లుకొరకు ప్రతినిధుల వెంటబడి ప్రచారం చేయలేదు. బెంగాలు రాష్ట్రంలో రాయ్‌కి ఎక్కువ మద్దతు లభించివుండేది. కాని సుభాసుచంద్రబోసు త్రిపుర కాంగ్రెసు అధ్యక్షపదవికి రాజీనామాచేయటంతో బెంగాలు రాష్ట్ర సంఘం

తిరుగుబాటు చేసినది. దానికి ప్రతిగా కాంగ్రెసువర్కింగుకమిటీ బెంగాలు రాష్ట్రీ సంఘాన్నే రద్దుచేసినది. తీవ్రవాదులయిన కాంగ్రెసు సోషలిస్టులు, రాయ్‌కి వ్యతిరేకంగా ఓటు చేశారు. కమ్యూనిస్టులు తమ వోట్లను మురగ వేసుకున్నారు. సుభాసుచంద్రబోసు రాజీనామా తరువాత కాంగ్రెసులో తీవ్రవాదబలం అంచనా వేయటానికే రాయ్ అధ్యక్షపదవికి పోటీ చేశాడు. తన వోటమితో కాంగ్రెసులో వామపక్ష నాయకత్వం సన్నగిల్లటం గ్రహించ గలిగాడు.

చివరి ప్రయత్నంగా రాంఘర్ కాంగ్రెసు మహాసభలో రాయ్ రాజ్యాంగ పరిషత్తు తీర్మానం ప్రవేశపెట్టాడు. అయితే కాంగ్రెసు మాత్రం కేవలం తీర్మానం ఆమోదించినా అందలి విధానాలను పూర్తిగా మార్చివేసినది. రాయ్ సూచించిన కార్యక్రమానికి మారుగా గాంధీ నిర్మాణ కార్యక్రమం ద్వారా, బ్రిటిషు ప్రభుత్వ అంగీకారంతో రాజ్యాంగపరిషత్తును యేర్పరచాలనే తీర్మానం ఆమోదించబడినది. ఇది రాయిస్టులకే కాదు మొత్తం వామపక్షానికే ఘోర పరాజయం. కాంగ్రెసు మితవాదులు అంతిమ విజయాన్ని సాధించగల్గారు.

హిట్లరు దమనచర్యలు, రాక్షసకృత్యాలు వీరవిహారంగా, సాహసోపేతంగా వర్ణించబడ్డవి. ఇంగ్లండుమీద వున్న హేయభావం, వ్యతిరేకత భారత ప్రజలలో హిట్లరుమీద మోజు, జర్మనీమీద అభిమానంగా మారినది. ఐరోపాఖండంలోని స్వతంత్ర దేశాల ఆహుతి, మారణహోమం భారత ప్రజలకు ఏమాత్రం కనువిప్పు కలిగించలేదు. మానసికతత్వం కలుషితమయినది. ఫాసిస్టు ప్రమాదాన్ని భారతీయులు గుర్తించలేకపోయారు.

1940 వేసవిలో రాయిస్టులకు డెహ్రాడూన్‌లో రాజకీయ పాఠశాల యేర్పాటు చేయబడినది. దాదాపు వందమంది ప్రముఖ కార్యకర్తలు పాల్గొన్నారు. అంతకంటె మిన్నగా ఇంటిలిజెన్సు అధికారుల రాకపోకలు ఎక్కువ అయినవి. రాయిస్టులకు, రాయ్‌కి సోవియట్ రష్యాతో సంబంధాలు వున్నవని, కమ్యూనిస్టు నాయకునిగా రాయ్ ఏమి చేయబోతున్నాడో ననేది వారి అనుమానం. రాయ్ వచ్చిన విద్యార్థులకు ఫాసిజం సిద్ధాంతాన్ని గురించి, యుద్ధం విస్తరిస్తే ఫాసిజం వలన ప్రపంచ ప్రజాస్వామిక శక్తులకు జరిగే ప్రమాదం గురించి, ప్రజాస్వామిక వాదుల బాధ్యత గురించి వివరంగా అరటిపండు వొలిచి యిచ్చినట్లు తెలియచెప్పాడు.

యుద్ధగమనాన్ని రాయ్ ఎప్పటికప్పుడు గమనిస్తూ వున్నాడు. హిట్లరు వేగం తగ్గలేదు. ఐరోపా ఖండాన్నే కాదు, మొత్తం ప్రపంచాధిపత్యాన్నే పొందాలనే కాంక్షతో వున్నాడు. ప్రజాస్వామ్య శక్తుల కిది సవాలు. జీవన్మరణ సమస్య. హిట్లరు విజయం సాధిస్తే అంతవరకు ఐరోపాఖండం సాధించిన సంస్కృతి, నాగరికత, ప్రజాస్వామ్య వ్యవస్థలు మొత్తం సమూలముట్టంగా భస్మీపటలం కాక తప్పదు. బ్రిటిషు ప్రజానీకం, ప్రజాస్వామ్య శక్తులు హిట్లరు సవాలుకు ప్రతిసవాలు చేసినవి. కన్సర్వేటివు ప్రభుత్వ స్థానంలో చర్చిలు నాయకత్వం క్రింద అన్ని పక్షాలతో జాతీయ ప్రభుత్వం యేర్పడినది. ఐరోపా ఖండంలోని ప్రజాస్వామ్య శక్తులు సంఘటితం కాసాగినవి. రూజువెల్టు నాయకత్వం క్రింద అమెరికా అభయ హస్త మిచ్చినది. రష్యా యింకా మిత్రరాజ్యాల తరపున యుద్ధంలో దిగలేదు. ఇటలీ, జపానులు హిట్లరుకు మద్దతుగా తమ, తమ సామ్రాజ్యాల విస్తరణకాంక్షతో యుద్ధంలో దిగినవి. తలవని తలంపుగా హిట్లరు తలపెట్టిన యుద్ధం భూగోళం నలుమూలలా విస్తరించి ప్రపంచ యుద్ధంగా మారసాగినది.

ఇది ఫాసిస్టు శక్తులకూ, ప్రజాస్వామ్య శక్తులకూ మధ్య జరుగుచున్న యుద్ధంగా రాయ్ గ్రహించాడు. "ఇది ఫాసిస్టు వ్యతిరేక యుద్ధం. ఫాసిజం గెలిస్తే మొత్తం మానవాళియే అధఃపతనం కాక తప్పదు. కార్మిక - కర్షక వుద్యమాలు, స్వతంత్ర పోరాటాలు, మానవ హక్కులు, ఇంతవరకు అభివృద్ధిపథంలో మానవ సమాజం వేల సంవత్సరాల నుంచి నిర్మించుకొనిన సాంఘిక వ్యవస్థలు అన్నీ మంట కలువ వలసినదే. ఇది కేవలం బ్రిటిషు ప్రభుత్వం ఒక్కటే పోరాడుతున్న యుద్ధం కాదు. ఈ యుద్ధంలో ఇంగ్లండులోని ప్రజాస్వామ్య శక్తులకు ఎంత బాధ్యత వున్నదో, భారత ప్రజాస్వామ్య శక్తులకు కూడా అంతే బాధ్యత వున్నది. ఇందులో షరతులకు, హామీలకు ప్రసక్తి లేదు. హిట్లరు గెలిస్తే మొత్తం మానవ సమాజమే పరతంత్రానికీ, బానిస బ్రతుకుకీ, తలవొగ్గక తప్పదు. ఇంగ్లండు యిచ్చే హామీలు ఎందుకూ పనికిరావు. ఒకవేళ ఇంగ్లండు గెలిస్తే అది కేవలం బ్రిటిషు సామ్రాజ్యం గెలిచినట్లు కాదు. కాగా యుద్ధ ఫలితంగా బ్రిటను తన సామ్రాజ్యాన్నే కోల్పోవక తప్పదు. ఇది మొత్తం ప్రజాస్వామ్య శక్తుల గెలుపు. ఇందులో భారత ప్రజాస్వామ్య శక్తుల గెలుపు కూడా యిమిడి వుంటుంది. ఫాసిజాన్ని గెలువగలిగిన భారత ప్రజాస్వామ్య శక్తులు భారత స్వాతంత్ర్యాన్ని పొందినట్లే. మనకు స్వాతంత్ర్యం విధిగా వచ్చి తీరుతుంది. బ్రిటను అంగీకరించక తప్పదు. అడ్డుపడ

లేదు. అడ్డుపడినా నిలువగల శక్తి ఇంగ్లండుకు వుండనూ వుండదు. కేవలం బ్రిటీషు ప్రభుత్వం హామీ యివ్వని కారణంగా యుద్ధ వ్యతిరేకతతో యుద్ధ కార్య కలాపాలు స్తంభింప చేయటం ఫాసిజానికి బలాన్ని చేకూర్చటమే. కాబట్టి కాంగ్రెసు మంత్రి పదవులను విడనాడకుండా బ్రిటీషు ప్రభుత్వంతో యుద్ధానికి సహకరిస్తూ ప్రజాస్వామ్య శక్తులను సంఘటిత పరచాలి. ఇది మన స్వతంత్ర పోరాటంలో ఒక అంతర్భాగమే కాక ఫాసిజం గెలిచి బ్రిటను వోడిపోతే మనకు స్వరాజ్యం అసలే రాదు." అని రాయ్ "భారత దేశం - యుద్ధం" అనే కరపత్రంలో వివరించాడు.

ఇది తీవ్రవాదులకే కాదు మితవాదుల విమర్శకు కూడా గురి అయినది. కొంతమంది రాయిస్టులకు కూడా రాయ్ వాదం విడ్డూరంగా కనబడినది. 'ఏటికి ఎదురీత'గా భావించి కొంతమంది రాయ్‌ని విడనాడటం కూడా జరిగినది. "నిజంగా ఇది ఏటికి ఎదురీతే. ముందు చూపులేని నాయకులు పలుకుబడికొరకు ప్రజావాహినిలో కలసి పోవటం సహజం. అది నాయకుల లక్షణం కాదు. తిట్లుతిన్నా, దెబ్బలు తిన్నా వారికి సక్రమమార్గం చూపగల మేధావులే తగిన నాయకులు కాగలరు. ప్రస్తుతానికి అవమానాలకూ, అప్రతిష్టకూ గురి అయినా అంత్యంలో నిజం బయట పడక తప్పదు. చరిత్రే నిర్ణయిస్తుంది" అని రాయ్ తన అనుచరవర్గానికి మనో ధైర్యం కలిగించాడు.

* * * * *

1940 సెప్టెంబరు 1న రాయిస్టులు దేశంలో పలు ప్రాంతాల ఫాసిస్టు వ్యతిరేక ప్రదర్శనలు జరిపారు. బేషరతుగా యుద్ధానికి సహాయం చేయాలని ప్రచారం చేశారు. ఆ క్రిందటి మాసంలో ఇండియా ప్రభుత్వం కాంగ్రెసు కోర్కెలను మన్నిస్తూ యుద్ధానంతరం భారతీయులు రాజ్యాంగ చట్టాన్ని నిర్మించు కొనటానికి అనుమతించబడగలదని ప్రకటించినది. దీనికి మద్దతుగా బ్రిటిషు ప్రభుత్వం లేబరు పార్టీ నాయకుడు, ఇండియామీద అభిమానపాత్రుడు అయిన సర్ స్టాఫర్డు క్రిప్పును భారత నాయకులతో మంతనాలు జరిపి యుద్ధానికి అనుకూల వాతావరణం సృష్టించటానికి తమ రాయబారిగా భారతదేశం పంపినది. రాయ్ క్రిప్పును ఒకటికి రెండుసార్లు కలుసుకొని యుద్ధ వ్యతిరేకతకు కాంగ్రెసు విధానాలను విశదీకరించి ప్రజలలో పలుకుబడిగల స్వతంత్ర వ్యక్తుల ద్వారా వైస్రాయి కౌన్సిలును పునర్వ్యవస్థీకరించాలని సలహా యిచ్చాడు. క్రిప్సుతో రాయ్‌కి ఐరోపా

ఖండంలో వున్నప్పుడే పరిచయమున్నది. కాని కాంగ్రెసును మించి శక్తివంత మయిన మరో సంస్థ దేశంలో లేదనే విశ్వాసంతో క్రిప్స్ రాయ్ సలహాను పాటించలేదు. సామరస్య చర్చలకు వైస్రాయి కాంగ్రెసు నాయకులను ఆహ్వా నించాడు. అప్పటికే కాంగ్రెసు మంత్రి పదవులకు రాజీనామా లిచ్చినది. "ఇప్పటికయినా మించిపోయినది లేదు, రాజకీయవాదులు ముందుకువచ్చి అధికారం చేపట్టి యుద్ధానికి సహాయం చేయాలని" రాయ్ విజ్ఞప్తిచేసాడు.

రాయ్ మీద క్రమశిక్షణకు భిన్నంగా ప్రవర్తిస్తున్నాడని చర్య గైకొన బడినది. "ఫాసిజంతో పోరాడాలి అనే నెపంతో రాయ్ బ్రిటిషు ప్రభుత్వానికి సహాయం చేయాలనటం కాంగ్రెసు ఆదర్శాలకు విరుద్ధం"గా రాయ్, రాయిస్టులు కాంగ్రెసు సాధారణ సభ్యత్వంనుంచి తొలగించబడ్డారు. 1940 అక్టోబరులో రాయ్ రాడికల్ డెమోక్రాటిక్ ప్రజా పార్టీని స్థాపించాడు. డిశంబరులో బొంబెలో ప్రారంభ సమావేశం జరిగినది. కాంగ్రెసుకు రాయ్ ఏ కార్యక్రమం సూచించాడో అదే కార్యక్రమం యీ మహాసభ అంగీకరించినది. ఈ సభలో 'రాడికల్ డెమోక్రాటిక్ పార్టీ' పేరు స్థిరపరచబడినది.

కార్మిక సంఘాలలో కూడా యుద్ధాన్ని గురించి అభిప్రాయభేదాలు పొడ సూపినవి. రాయిస్టులు తమ పలుకుబడిలో వున్న కార్మిక సంఘాలన్నింటినీ కలిపి 'ఇండియన్ లేబరు ఫెడరేషను' పేరుతో వేరే ట్రేడ్ యూనియన్‌ను స్థాపించారు. దీనికి అఖిలభారత రైల్వేమెన్సు ఫెడరేషను అధ్యక్షుడు జమనాదాస్ మెహతా అధ్యక్షులుగానూ, రాయ్ ప్రధాన కార్యదర్శిగానూ ఎన్నుకొనబడ్డారు.

కాంగ్రెసు యుద్ధ వ్యతిరేక చర్యలకు పూనుకొన్నది. బ్రిటిషు ప్రభుత్వ వోటమి భారత స్వాతంత్ర్య సాధనకు దగ్గర మార్గంగా భావించినది. వ్యక్తి సత్యాగ్రహం ప్రారంభించినది. ఇది తరువాత 1942 'క్విట్ ఇండియా' ఉద్యమంగా పరిణమించినది. సుభాసుచంద్రబోసు జపాను సహకారంతో 'ఆజాద్ హింద్ ఫౌజు'ను నిర్మించి అక్షరాజ్యాల విజయమే ఢిల్లీ ఎర్రకోటను పట్టుకొనటానికి సుళువైన మార్గంగా భావించాడు. కమ్యూనిస్టులు సామ్రాజ్యయుద్ధంగా భావించి యుద్ధ వ్యతిరేక చర్యలకు కార్మిక సమ్మెలను ప్రోత్సహించారు. యుద్ధ సామగ్రులతో సహా అన్ని ఉత్పత్తులను కుంటుపరచటానికి వివిధ ప్రయత్నాలు చేశారు.

దేశం మొత్తం యుద్ధ వ్యతిరేక చర్యలకు పూనుకొన్నది. ఎటుచూచినా యుద్ధ వ్యతిరేక వాతావరణం. 'బ్రిటిష ప్రభుత్వం వోడిపోవాలి - జర్మనీ గెలవాలి- హిట్లరు జయించాలి' అనే మనస్తత్వం వ్యాపించినది. రాయ్ ఒక్కడే యుద్ధానికి అనుకూలుడు. మేరుపర్వతంలాగా ఒంటరిగా నిలబడ్డాడు. రాడికల్ డెమాక్రాటిక్ పార్టీ - ఇండియన్ లేబర్ ఫెడరేషను ప్రభుత్వంతో సహకరించి ప్రజాస్వామ్య శక్తులు బలపడటానికి వివిధరంగాలలో తీవ్రకృషి చేసినవి. నేషనల్ డెమోక్రాటిక్ యూనియన్ స్థాపించి దేశంలో తటస్థంగా వున్న బ్రిటిష అనుకూల శక్తులను, జమీందారులను, లాయలిస్టులను సంఘటిత పరచి యుద్ధ అనుకూల వాతావరణం సృష్టించటానికి రాయ్ తీవ్రంగా ప్రయత్నించాడు. బాల్యం నుంచి తీవ్ర విప్లవ వాదిగా, టెర్రరిస్టుగా బ్రిటిష ప్రభుత్వంతో ముఖాముఖి పోరాటం సాగించిన రాయ్ ఆ ప్రభుత్వంతో సహకరణకు దిగటం ఆశ్చర్యకరమే. "నా గమ్యస్థానంలో మార్పు లేదు. నా ఆశయసిద్ధి కొరకు ఇదే సక్రమమార్గం. ఆగర్భశత్రువుగా భావించిన బ్రిటిష ప్రభుత్వంతో ఒకే కంచంలో తిని ఒకే మంచం మీద పవళించటంగా చేతులు కలపటం విడ్డూరమే. కాని ప్రస్తుత చరిత్ర గమనాన్ని గమనించాలి. నా కృషి కేవలం మాతృభూమి విముక్తి కొరకే"నని రాయ్ బాహాటంగా వెల్లడించాడు. 'ఆగస్టు విప్లవం - ఆజాద్ హింద్ ఫౌజు' కేవలం ఫాసిజాన్ని బలపరచటానికే వుపయోగపడుతున్నవని విమర్శించాడు.

* * * * *

కొద్దిమాసాల్లోనే పశ్చిమ ఐరోపాఖండాన్ని దాదాపు పాదాక్రాంతం చేసుకొనగల్గిన హిట్లరు ఇంగ్లండుమీద తన దండయాత్రను ముమ్మరం చేసాడు. చర్చిలు ప్రధానమంత్రిగా తన ప్రతిభా నైపుణ్యంతో, ఇంగ్లండులోని ప్రజాస్వామ్య శక్తుల అండదండలతో ఏకోన్ముఖంగా శత్రుదాడులను ఎదుర్కొనటమే కాకుండా జర్మనీమీద తిరుగు దండయాత్రలను కూడా చేసి హిట్లరుకు 'కొరకరాని కొయ్య' అనిపించుకొనగలిగాడు. హిట్లరు ఆశించినట్లు ఇంగ్లండు కూడా తక్కిన ఐరోపా దేశాల మాదిరిగా 'దాసోహం' అనలేదు సరిగదా 'దెబ్బకు దెబ్బ' తీయటానికి సన్నద్ధం కాసాగినది. చర్చిలు 'యుద్ధ వీరుని'గా చరిత్రలో ప్రసిద స్థానాన్ని పొందగలిగాడు. కలకత్తాలో ఒక సమావేశంలో రాయ్ యుద్ధానుకూలంగా మాట్లాడుచూ వ్యక్తిగతంగా చర్చిలు కరుడుగట్టిన సామ్రాజ్యవాది అయినా క్రియా

రూపంలో ప్రస్తుత ప్రపంచయుద్ధంలో విప్లవ వాదిగా వ్యవహరిస్తున్నాడని కొనియాడాడు.

రష్యా జర్మనీతో ఆ యుద్ధానికి మునుపే ఒకరిపై ఒకరు దండయాత్ర జరుపరాదని సంధి (నాన్‌యగ్రెషన్ పాక్టు) చేసుకొన్నది. ఆ సాకుతో ఐరోపా ఖండంలో హిట్లరు పైశాచికచర్యలు జరుపుచున్నా యుద్ధానికి దూరంగా తటస్థంగా వున్నది. ఇంగ్లండుపై యుద్ధం ప్రయోజనం కాదని భావించిన హిట్లరు తన దృష్టిని తూర్పు ఐరోపాఖండంపై కేంద్రీకరించి 1941 జూన్ 21 న రష్యాపై దండయాత్రను ప్రారంభించాడు. కమ్యూనిజానికి వ్యతిరేకి అయినా చర్చిలు రష్యాను బలపరచాడు. అమెరికా సహాయం చేయటానికి సిద్ధపడినది. ఫాసిజాన్ని అరికట్టటానికి చర్చిలు, రూజ్‌వెల్టులు స్టాలిన్‌తో సంప్రదించి కార్యక్రమాన్ని రూపొందించారు.

ఈ విధంగా 1941 లో రష్యా యుద్ధాలలో ప్రవేశించటంతో అకస్మాత్తుగా భారత కమ్యూనిస్టులకు అంతకుముందు ప్రచారం చేసిన 'సామ్రాజ్యవాద యుద్ధం' ఆ రోజు నుంచి 'ప్రజా యుద్ధం'గా కనబడినది. యుద్ధ అనుకూల నినాదం ప్రారంభించారు. అయితే బ్రిటిషు ప్రభుత్వానికి సహాయంచేయటానికి వారి మన సంగీకరించలేదు. భారత - రష్యా స్నేహ సంఘాన్ని స్థాపించారు.

రష్యా జర్మనీపై చేసే యుద్ధాన్ని ప్రజాయుద్ధంగానూ, బ్రిటను జర్మనీపై చేసే యుద్ధాన్ని సామ్రాజ్యవాద యుద్ధంగానూ సిద్ధాంతీకరించి రష్యాకు సాయం చేయాలని, ఇంగ్లండుకు వ్యతిరేకంగా పోరాడాలని ప్రచారం చేశారు. స్వతంత్ర ఆలోచనాశక్తి లేని భారత కమ్యూనిస్టులు రష్యాకు 'ఉడుతా భక్తి'గా ఏదో కొంత ధనాన్ని సేకరించి పంపితే రష్యా హిట్లరుపై యుద్ధాన్ని గెలుస్తుందనే మూఢ విశ్వాసంలో వుండిపోయారు. రష్యా యుద్ధంలో ప్రవేశించిన ఆరు నెలలకుగానీ భారత కమ్యూనిస్టులు యుద్ధానికి సహాయం చేయాలనే నిర్ణయానికి రాలేకపోయారు.

వీరు మొదట రాయ్ 'భారతదేశం - యుద్ధం' కరపత్రాన్ని ప్రకటించినప్పుడు 'రాయ్ అసలు రంగు' అంటూ వేరే కరపత్రం ప్రచురించి 'బ్రిటిషు ప్రభుత్వ ఏజంటు'గా దుష్ప్రచారానికి పూనుకున్నారు. ఇప్పటికయినా కొంతవరకు వారు త్రోవలోనికి వచ్చినందులకు రాయ్ సంతోషించాడు. "రష్యాకు సహాయం చేయటం అంటే నిధిని ప్రోగుచేసి రష్యాకు పంపటంకాదు. దానివలన ప్రయోజనం శూన్యం.

మీరు పంపే సొమ్ము రష్యా ఒక బాంబు లేక ఒక విమానం తయారుచేయటానికి చాలదు. మీ తికమక సిద్ధాంతాలతో ప్రజలను తికమకలు పెట్టడం ప్రమాదభరితం. అంతకంటె సరియైనమార్గం భారతదేశంలో ప్రజాస్వామ్యశక్తులను శక్తివంతంచేసి ఫాసిస్టుశక్తుల బలాన్ని కుదించటమే. సోవియటు రష్యాకిది బలాన్ని చేకూరుస్తుంది" అని రాయ్ వారికి సలహాయిచ్చాడు. యుద్ధ స్వభావం తెలియనివారు గనుక రాయ్ సలహా వారికి నచ్చలేదు. అర్థంకానూలేదు.

యుద్ధారంభంనుంచీ రాయ్ అనుసరించిన విధానం సరియైనది. కమ్యూనిస్టుల పంథా ఫాసిస్టుశక్తులు బలపడటానికి తోడ్పడినది. సోవియటు రష్యా భారత దేశంలోని వివిధ పార్టీల కార్యక్రమాలను, విధానాలను గమనించకపోలేదు. స్టాలిన్ రాడికల్ డెమోక్రాటిక్ పార్టీని గుర్తించగలడని రాయ్ ఆశించాడు. కాని రషియన్ కమ్యూనిజమే యుద్ధానంతరం తన అంతర్జాతీయ వాదాన్ని విడచి జాతీయవాదాన్ని చేపట్టుతుందని వూహించలేకపోయాడు. అంతర్జాతీయవాది అయిన స్టాలిన్ యుద్ధంలో జాతీయ వీరుడై రష్యను జారు ప్రభుత్వ కాలంలోని వీరులను, వీరగాథలను ఆదర్శవంతం చేశాడు. కమ్యూనిజం అంతర్జాతీయ తత్వాన్ని కోల్పోయినది. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ అంతరించినది. స్టాలిన్ సైనికులలో అత్యున్నతము, ప్రథమస్థానమయిన జనరలిస్సిమో పట్టాన్ని స్వయంగా అలంకరించుకున్నాడు. రెడ్ ఆర్మీ సుప్రీము కమాండరు అయ్యాడు. అంతకుముందు ఇరవై సంవత్సరాల క్రితం ట్రాట్స్కీ సూచించిన 'మిలిటరీ నియంతృత్వం' నెలకొల్పబడినది.

## యుద్ధ గమనం - యుద్ధ ఫలితాలు :

హిట్లరు తూర్పుగా రష్యామీద దండయాత్ర సాగించాడు. మొదట రెడ్ ఆర్మీ కొంత వెనుకకు తగ్గినా ఫాసిస్టు సేనలను స్టాలిన్‌గ్రాడ్ దగ్గర నిలబెట్టి వీరోచితంగా పోరాటం జరిపినది. ఇంగ్లండు, అమెరికా దేశాలు ఐరోపా, ఆసియా ఖండాలలో యుద్ధతీవ్రతను పెంచినవి. మిత్రరాజ్యాల విజృంభణను అక్ష రాజ్యాలు తట్టుకొనలేని స్థితికి వచ్చినవి. ప్రజాస్వామ్య శక్తుల గెలుపు ఖాయంగా భావించబడినది.

రాయ్ సోవియటు రష్యా మీద ఆశలు పెట్టుకున్నాడు. స్టాలిన్ నాయకత్వం, రషియన్ కమ్యూనిజం అంతర్జాతీయంగా అభ్యుదయపాత్రను చేపట్టి ప్రజాస్వామ్య శక్తులకు నాయకత్వం విధిగా వహించగలదనే గాఢవిశ్వాసంలో వున్నాడు. ద్వితీయ ప్రపంచయుద్ధం మిత్రరాజ్యాలకు అనుకూలంగా పరిణమించి ముందుకు సాగి అంతిమస్థాయికి చేరుతున్నకొద్దీ రష్యా తన విప్లవభావాల్లో అంత ర్జాతీయతత్వంలో పట్టుదల తగ్గించుకొని జాతీయవాదాన్ని పెంపొందించుకొన సాగినది. 'రష్యను కమ్యూనిజాన్ని' 'అంతర్జాతీయ కమ్యూనిజం' కంటె పై స్థాయికి పెంచే మంత్రదండాన్ని చేపట్టినది.

క్రెమిలిను టవరు నుంచి విధిగా రోజూ సాయంత్రం ఐదు గంటలకు అంతర్జాతీయ గీతాలాపన జరుగుతూ వుండేది. తాను మాస్కో చేరినప్పుడు 1920లో మొట్టమొదట దీనిని విన్నాడు. అప్పటినుంచీ రాయ్‌కి యీ గీతం అంటే ఎంతో మక్కువ, అభిమానం. యుద్ధకాలంలో రోజూ విశ్రాంతి సమయంలో రేడియో దగ్గర కూర్చొని సాయంత్రం విధిగా మాస్కో స్టేషను పెట్టుకొని ఆ గీతాన్ని, ఆ సంగీతాన్ని వింటూ వుండేవాడు. ఆ అంతర్జాతీయ గీతాలాపన జరుగుచున్నంత కాలం రాయ్‌కి రష్యా మీద వున్న ఆశలు సడలలేదు. కాని ఒకనాటి సాయంత్రం అనుకోకుండా 1943 లో ఆ అంతర్జాతీయ గీతానికి మారుగా జాతీయగీతాన్ని విన్నాడు. దానితో తన ఆశలు నిరాశ చేసుకున్నాడు. 'చరిత్రగతి మారినది, కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ గతించినది. రష్యను విప్లవంలోని అభ్యుదయశక్తి అంతరించినదని' విచారించాడు. అయినా స్టాలిన్ యుద్ధానంతరం ప్రపంచాన్ని, ముఖ్యంగా ఐరోపాఖండాన్ని అభ్యుదయపథంలో నడిపించటానికి ప్రయత్నించ గలడనే విశ్వాసం వదలుకొన లేకపోయాడు. కాని స్టాలిన్ దానికి వ్యతిరేకంగా హిట్లరు పాదాక్రాంతమయిన తూర్పు ఐరోపాఖండ దేశాలకు విముక్తి కలిగించి సోవియటు రష్యాకు దాసోహం అనగలిగిన కీలుబొమ్మ ప్రభుత్వాలను స్థాపించటంతో వున్న ఆశకూడా పోయినది. 1943 మే 22 న కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ కూడా రద్దు చేయబడినది.

బ్రిటిషు సామ్రాజ్యవాదం క్షీణదశకు చేరుకుంటున్నది. అమెరికా, రష్యాలు తమ అంగబలం, అర్థబలంతో తక్కిన ప్రపంచ దేశాలను రెండుగా చీల్చే ప్రమాదాన్ని రాయ్ గ్రహించాడు. యుద్ధానంతరం ఇంగ్లండు భారతదేశాన్ని పరిపాలించగల స్థితిలో వుండదని దేశీయ బూర్జువా వర్గం - కాపిటలిస్టులు ముందుగానే

గ్రహించారు. అధికారం హస్తగతం చేసుకోవాలనే తలంపుతో మొత్తం దేశాన్ని కాపిటలిజంతో ముంచివేయటానికి పారిశ్రామిక విధానం పేరుతో 'బాంబే ప్లాను' సిద్ధపరచారు. ఇది అమలులోనికి వస్తే పీడిత ప్రజావర్గం తిరిగి తల ఎత్తటానికి వీలులేదు. కొన్ని దశాబ్దాలు దేశీయ బూర్జువావర్గం క్రింద కృంగి, కృశించి పోవలసినదే. ఈ ప్రమాదాన్ని అతివాదశక్తులు గుర్తించలేదు.

1944 డిశంబరులో కలకత్తా మహాసభలో రాయ్ 'స్వతంత్ర భారత రాజ్యాంగ చట్టం' పేరుతో ఒక ముసాయిదా చట్టాన్ని రూపొందించి భారతప్రజల ముందుంచాడు. అందులో రాజకీయంగా ప్రజలకు అవసరమయిన అధికారాలు, రాజ్యాంగబద్ధమయిన రక్షణలను సూచించాడు. అంతేకాదు 'బాంబే ప్లాను'కు ప్రత్యామ్నాయంగా ఇండియన్ లేబరు ఫెడరేషనుచే 'ప్రజల ప్లాను'ను సిద్ధపరచి దేశం స్వయంసమృద్ధి కావటానికి పారిశ్రామిక విప్లవంతోపాటు 'వ్యవసాయ విప్లవం' కూడా జరిపి ప్రజల కొనుగోలుశక్తిని అభివృద్ధి పరచటానికి ఆర్థిక విధానాలను రూపొందించాడు. కాంగ్రెసు అధికారంకొరకు ప్రాకులాడటం వినా వీటిని గురించి పట్టించుకొనలేదు. కాంగ్రెసు సోషలిస్టులుకాని, కమ్యూనిస్టులుగాని రాయ్‌మీద పెంచుకొనిన ద్వేషంతో రాయ్ రాజకీయ, ఆర్థికవిధానాల గురించి అసలు ఆలోచించనేలేదు. సోషలిజం కావాలనే నెహ్రూ కూడా 'ప్రజల ప్లాను'లో కొన్ని మంచి భావాలు వున్నవి కాని 'రాయ్ రాజకీయాలు పనికిరావని' కొట్టివేసాడు.

నెహ్రూను గురించి రాయ్ కనిన కలలు కల్లలుగానే పరిణమించినవి. నెహ్రూకు పట్టిన జాఢ్యం అసలు నయంకాదనే నిర్ణయానికి వచ్చాడు. 'జవహర్ లాల్ నెహ్రూ' పేరుతో నెహ్రూను నిశితంగా విమర్శిస్తూ ఒక పెద్ద వ్యాసంకూడా వ్రాశాడు. "ఒక ప్రక్క నా రాజకీయాలు పనికిరావంటూ మరో ప్రక్క పైస్రాయి వేవెల్‌తో సంప్రదింపులకు పూనుకుంటున్నాడు. 'క్రిప్సు సూచనలను' అంగీకరించాలని చెప్పిన నా సలహా కాంగ్రెసుచేత తిరస్కరింపచేసిన నెహ్రూ అంతకంటె తక్కువ అధికారాలను యిచ్చేటూనే వేవెల్ సూచనలను అంగీకరించటానికి సిద్ధపడ్డాడు.... నెహ్రూ దృష్టిలో తర్కశాస్త్రానికి, కార్య - కారణాల సంబంధానికి విలువలేదు. ఉంటే ఈ ఇరవై శతాబ్దంలో అజ్ఞానాన్ని ప్రకోపించే మహాత్ముని వారసుడనిపించుకొనడు. హిట్లరు ఫాసిజాన్ని కొనియాడలేడు.... రాజకీయాల్లో నెహ్రూ వడిదుడుకులు సహింపరానివి. సోషలిస్టు అంతర్జాతీయవాదం కొత్తగా

తెలియనివాడు. అభివృద్ధి సోషలిజం పేరుతో క్రొత్త సోషలిజం సృష్టించాడు. ఇది నాజీజానికి అనుకరణ. ఏ కవిగానో, నటకునిగానో రాణించగలడు ... ఒక ప్రక్కన 'ప్రజల ప్లాను'లో కొన్ని మంచి అభిప్రాయాలున్నవని అంగీకరిస్తూ మరోవంక 'బాంబే ప్లాను' నిర్మాతలలో వొకరైన సర్ ఆర్థర్ దలాల్‌ను లార్డు వేవెల్ నాయకత్వం క్రింద యేర్పడే జాతీయ ప్రభుత్వంలో చేర్చుకొనటానికి వొప్పుకుంటున్నాడు కనుక నెహ్రూకు బాంబే ప్లాను కూడా నచ్చినది..... కాంగ్రెసు జాతీయతత్వానికి మారురూపమయిన గాంధీ ప్రాచీన తత్వాన్ని నెహ్రూ ఆధునిక తత్వం అని నమ్మించటానికి తంటాలుపడుచున్నాడు. మహాత్ముని ఆశీర్వాదంతో రాజకీవి, నియంతృత్వలక్షణాలు గలిగి వీరపూజకు దోసిలొగ్గే సామాన్య ప్రజానీకానికి నెహ్రూ లీలామానుష విగ్రహంలాగా పనికివస్తున్నాడు. తన స్థానం ఏమిటో తనకే తెలియనిస్థితిలో వున్నాడు. అపరాశవాదిగా రూపొందాడు. ఆవేశం ఎక్కువ, ఆలోచన తక్కువ.... తన ఆవేశపూరిత వుపన్యాసాలతో మహాత్ముని సిద్ధాంతాలకు పై మెరుగులు దిద్ది దూరంగావున్న మేధావులను కూడా తనకు కాకపోయినా మహాత్ముని నాయకత్వం క్రిందకు లాక్కొనిరాగల ప్రజ్ఞావిశేషాలు కలవాడు.... జాతీయవాదం - సోషలిజం వొకదాని కొకటి చుక్కెదురు. వీటి రెంటి సమన్వయ ఫలితం ఫాసిజం. భావిభారత దేశచరిత్రలో నెహ్రూ ఫాసిజానికి రెండవ యుగ పురుషునిగా వర్ణింపబడతాడు..... ఇతరుల రోగాన్ని నయంచేసేముందు తనకున్న రోగాన్ని నయంచేసుకొనటం మంచిది" అని ఆ వ్యాసంలో నెహ్రూని గురించి ఘాటుగా విమర్శించాడు.

నెహ్రూ రాజకీయాలను గురించి రాయ్ పాశ్చాత్య దేశంలోని ఒక మిత్రునికి వ్రాసిన వుత్తరంలో యీ విధంగా తెలియబరచాడు. "యదార్థంగా గొప్ప వ్యక్తులు కాని గొప్పవారి గుణాలు అనిశ్చితంగానే వుండక తప్పదు. అట్టి వ్యక్తులు తమ నిజ రంగును కప్పిపుచ్చుకొనటానికి సర్వదా ప్రయత్నిస్తూనే వుంటారు. తమ అవివేకతను మభ్యపెట్టి నమ్రతను, మర్యాదను ప్రకటిస్తూ వుంటారు. కాగా తమకున్న జాడ్యాన్ని వొక సద్గుణంగా బహిర్గతం చేయటానికి తహతహలాడటం కద్దు. వివేచనాపరులు, మేధావులే అట్టివారిని పొగడటంతో సమస్యలు మరీ చిక్కుపడక తప్పదు......... కాబట్టి ఇట్టి వాతావరణంలో వున్న సామగ్రితోనే కార్య సాధనకు పూనుకొనటం యదార్థవాది లక్షణం."

రాయ్ నెహ్రూను వ్యక్తిగత ద్వేషంతో విమర్శించలేదు. చివరి ప్రయత్నంగా నెహ్రూ రాజకీయాలు సరిదిద్దటానికే నిశితమార్గం అవలంబించాడు. నెహ్రూ దానిని అంగీకరిస్తూనే తన అసమర్థతను వెల్లడించుకున్నాడు. "రాయ్ నన్ను పెట్టీ బూర్జువాగా చిత్రించి, నన్ను, నా తత్వాన్ని విమర్శించటంలో కొంత యదార్థం కూడా లేకపోలేదు. ఆయన వాడిన మాటలు ములుకులై నా తల దిమ్మెత్తించినంత పని చేసినవి.........అయినా రాయ్‌ని గురించి నా హృదయంలో కొంత గౌరవం, పాక్షికభావం లేకపోలేదు."

నెహ్రూ రాయ్ సూచించిన విధానం చేపట్టి కాంగ్రెసు నాయకత్వం చేపట్ట గలిగినట్లయితే భారత రాజకీయాలు, సాంఘిక, ఆర్థిక విధానాలు మరో విధంగా వుండివుండేవి. భారత చరిత్ర గమనమే మారి వుండేది.

ఇంగ్లండులో ఎన్నికలలో కన్సర్వేటివులు అపజయం పొందగా లేబరు పార్టీ అధికారం చేపట్టినది. యుద్ధవీరునిగా, ఫాసిస్టు వ్యతిరేక యుద్ధంలో విప్లవ పాత్ర నిర్వహించిన చర్చిలు ఎన్నికలలో పరాజయం పొందగా ప్రజాస్వామ్య శక్తులు విజయం సాధించినవి. వీటి ఫలితం భారతదేశ రాజకీయాలలో, అధికార సంక్రమణలో కన్పడవచ్చునని రాయ్ ఆశించాడు. అట్లీ నాయకత్వంలోని లేబరు ప్రభుత్వం 1946 మేలో భారతదేశానికి స్వాతంత్ర్యం యిస్తానని ప్రకటించినది. కాని యుద్ధానికి వ్యతిరేక వుద్యమాన్ని నడపి ఫాసిస్టు శక్తులకు తోడ్పడిన కాంగ్రెసుకు, మతసంస్థ అయిన ముస్లిములీగుకు అధికారం దత్తం చేయటానికి సిద్ధపడటం రాయ్‌కి తీవ్రసంతాపం కలిగించినది. స్టాఫర్డు క్రిప్సుతో ఢిల్లీలో స్వయంగా మాట్లాడి లేబరు పార్టీ చేయబోయే తప్పిదాన్ని హెచ్చరించాడు. బ్రిటిషు లేబరు పార్టీలో తీవ్రవాది అయిన బెవిన్ మీద ఆశలు పెట్టుకొన్నాడు. ఫలితం శూన్యం. తీవ్రవాద శక్తులకు నాయకత్వం వహించిన, వహించగల ప్రజాపార్టీ భారతదేశంలో కనబడలేదు. కనుక అయిష్టంగానే ఇంగ్లండు బూర్జువా వర్గాలకే అధికారం కట్టబెట్టటానికి సిద్ధపడినది. "కేవలం కాంగ్రెసు, ముస్లింలీగు పార్టీలకే భారతదేశం పరిమితం కాలేదు. భారత ప్రజలను గుర్తించి వారి అభివృద్ధి కొరకు అధికారం సామాన్య ప్రజానీకానికి సంక్రమింప చేయటం అవసరం. ప్రస్తుతం వోటింగు హక్కు వున్నవారు మూడుశాతానికి మించిలేరు. కనుక భారతీయులకు అధికారం సంక్రమింపచేసే ముందు తాత్కాలిక జాతీయ ప్రభుత్వాన్ని యేర్పరచి, వయోజన వోటింగు ద్వారా రాజ్యాంగ పరిషత్తుకు ఎన్నికలు జరిపించి తద్వారా నిజమైన ప్రజా

ప్రభుత్వాన్ని యేర్పరచటానికి బ్రిటిషు ప్రభుత్వం పూనుకోవాలి." అని రాయ్ బ్రిటిషు లేబరు పార్టీకి ఒక లేఖ కూడా పంపాడు. ఫలితం శూన్యం. వేవెలు ఆహ్వానం మేరకు ముందు కాంగ్రెసు నాయకులు, తరువాత ముస్లిములీగు నాయకులు కేంద్ర మంత్రివర్గంలో అధికారం చేపట్టినా చివరకు పొత్తు కుదరక 1947 ఆగస్టు 15 న స్వాతంత్ర్యం పేరుతో భారత, పాకిస్తాన్ దేశాలు అవతరించక తప్పలేదు. ఇది మహాత్ముని మహత్యమని కాంగ్రెసు, జిన్నా దూరదృష్టి అని ముస్లిములీగు ప్రజలను నమ్మించి వూరూరా, ఇంటింటా వేడుకలు, ఉత్సవాలు చేయించినది.

బ్రిటిషు ప్రభుత్వంచే పంపబడిన క్యాబినెట్ మిషనులో సభ్యుడయిన ఆర్థర్ బాటమ్లీ (వీరు తరువాత లేబరు గవర్నమెంటులో మంత్రిగా చేరారు) డెహ్రాడూన్‌లో రాయ్‌ని కలుసుకొని తన సంభాషణలో "మేము భారతదేశానికి స్వాతంత్ర్యం యివ్వటానికి వచ్చాము" అని సగర్వంగా చెప్పినప్పుడు "ఇది మీరు గర్వంగా చెప్పుకొన నక్కర్లేదు. మీ అసమర్థతను మీరు కప్పిపుచ్చుకొనటాని కింతకంటె మరో మార్గం మీకులేదు.... మిస్టరు బాటమ్లీ ! చరిత్ర యిదివరకే యీ ప్రధాన నిర్ణయం చేసినట్లు మీకు తెలియదా ? అని ఘాటుగా సమాధానం చెప్పినప్పుడు ఆయన నోరు మూయక తప్పలేదు. 20 సంవత్సరాల క్రితం రాయ్ ప్రకటించిన 'డీకాలనై జేషన్' సిద్ధాంతంలోనే యీ విషయం స్పష్టీకరించటం గమనార్హం.

"కారల్ మార్క్సు సూచించిన, కమ్యూనిస్టులు ప్రచారంచేసిన గతి తార్కిక భౌతికవాదం నూరుసంవత్సరాల క్రితం పనికివచ్చినా ప్రస్తుతం వైజ్ఞానికంగా సమాజం అనేకరెట్లు ముందుకు నడిచినది. వెనుకటి రాజకీయాలతో, ఆర్థిక సూత్రాలతో మారుచున్న సామాజిక వ్యవస్థను చక్కదిద్దటం వెర్రితనమే అవుతుంది. ఇందుకు అనుకూలమయిన సిద్ధాంతాలు, ఆచరణలు రావాలి". యుద్ధానంతరం రాయ్ తన మిగిలిన జీవితాన్ని యీ పరిశోధనకే వినియోగించాడు. పార్టీ వ్యవస్థలు, పార్టీ ప్రచారాలు, అధికార రాజకీయాలు ప్రజల వ్యక్తిత్వాన్ని, స్వేచ్ఛను పెంచటానికి మారుగా కులం, వర్గం, మతం, సంఘం, జాతి పేరుతో ప్రజల మానసిక వికాసాన్ని త్రుంచివేస్తున్నవి. కాబట్టి మనోవికాసానికి, వ్యక్తిగత స్వేచ్ఛకు ఇవి అడ్డుగోడలుగా వున్నవని రాయ్ అంతిమ నిర్ణయానికి వచ్చి రాడికల్ డెమోక్రాటిక్ పార్టీని 1948 లో రద్దు చేశాడు.

రాయ్ రాజకీయ పరాజయమే ఇందుకు కారణమని కొందరు భావించ వచ్చు. కాని రాయ్ రాజకీయాలనుంచి అస్త్రసన్యాసం చేయలేదు. ప్రపంచ పరిస్థితులను ఎప్పటికప్పుడు సమీక్షిస్తూనే తన నూతన పరిశోధన సాగించాడు. నూతన సిద్ధాంతాన్ని మానవ సమాజాని కందచేశాడు. అందలి బాగోగులు నిర్ణయించవలసినది భావిచరిత్ర, చరిత్రకారులు మాత్రమే.

యుద్ధానంతరం రాయ్ కలకత్తాలో వున్నప్పుడు జయప్రకాశనారాయణ, అశోకమెహతా మొదలగువారు రాయ్‌ని కలుసుకొని వామపక్ష సంఘటనకు ఆయన సహాయం అభ్యర్థించారు. అందుకు రాయ్ తన వ్యతిరేకతను, అనంగీకారాన్ని ప్రకటిస్తూ "పాతిక, ముప్ఫయి సంవత్సరాల వరకూ మీరు కాంగ్రెసును గద్దెనుంచి దించలేరు. అప్పటికయినా అనుమానమే. మీరు కాంగ్రెసును ఓడించాలంటే మహాత్ముని ప్రభావానికి గురి అయిన యీ దేశంలో ఆయనకు ప్రతిగా మీరు పూర్తి దిగంబరులయిన మరో ఒకరిద్దరు మహాత్ములను ముందుగా సృష్టించుకొనటం మంచిదని" వ్యంగ్యంగా సలహా యిచ్చాడు.

అదే సంవత్సరం నెహ్రూ రాయ్‌ని డెహ్రాడూన్‌లో కలుసుకున్నాడు. ఆయన నెహ్రూతో మహాత్ముడు చెప్పినది - "ఒక ప్రక్క లక్షాధికారులు, కోటీశ్వరులు భోగలాలసులై తమ జీవితం సాగించగా, మరోప్రక్క ఏడులక్షల గ్రామాల్లో దుర్భర దారిద్ర్యాన్ని అనుభవించే భారతప్రజలే నిజమైన భారతదేశంగా" గుర్తుకు తెచ్చి ఆర్థిక ప్రణాళికలో వ్యవసాయానికి ప్రధమస్థాన మివ్వాలని, ఆహారంలో స్వయంసమృద్ధి పొందగలిగినప్పుడే నూటికి ఏభై వంతులు భారత సమస్యలు పరిష్కారం కాగలవని సలహా యిచ్చాడు.

ఒకసారి ఒక మిత్రుడు మీ అభిప్రాయం ప్రకారం నెహ్రూ భారత ప్రజాస్వామ్యానికి ద్రోహం చేస్తున్నాడా ? అని అడిగినప్పుడు "ఆ విధంగా నేను చెప్పను. నెహ్రూ ప్రజాస్వామ్యానికి కావాలని ద్రోహం చేయటంలేదు. కాని అది వర్ధిల్లటానికి ఆయన కంకణం కట్టుకొనలేదు" అని సమాధానం చెప్పాడు.

మరొక మిత్రుడు నెహ్రూను నిశితంగా విమర్శించినందులకు తన అసమ్మతిని తెలియజేసినప్పుడు "వ్యక్తులు నాకెవరూ శత్రువులు కారు. వారి సిద్ధాంతాలే నాకు ముఖ్యం. అందులో రాజీ ప్రసక్తి లేదు. అలా అనుకుంటే మొదట నేను లెనిన్‌తో ఘర్షణకు దిగేవాడిని కాదు." అని సమాధానం చెప్పాడు.



# పరిచయం:

సుప్రసిద్ధ చరిత్రకారుడు జాన్ గంతర్ రచించిన 'ఆసియా ఖండంలో' (ఇన్‌సైడ్ ఏషియా) రాయ్‌ని గురించి "మూడు విప్లవాలలో - రష్యా, చైనా, ఇండియా - ప్రధాన పాత్ర వహించిన మహావ్యక్తి" అని వర్ణించాడు. మెక్సికోను గురించి మరిచిపోయి వుంటాడు. బాల్యం నుంచీ విప్లవ రాజకీయాలలో పాల్గొని అసమాన ధైర్యసాహసాలు, ప్రతిభా విశేషాలు, మేధాసంపత్తి కలిగి దాదాపు నలభై సంవత్సరాలు రాజకీయ జీవితంలో మునిగితేలిన రాయ్ భారత రాజకీయాల్లో రాణించలేక పోవటం శోచనీయం. కాగా భారత రాజకీయాల్లో రాయ్ వొంటరిగానే వుండి పోయాడు. ద్వితీయ ప్రపంచ యుద్ధం యీ వొంటరితనానికి ఇంకా తోడ్పడినది.

ఇందుకు కారణాలు అనేకం వూహించబడ్డవి. "రాయ్ స్వభావసిద్ధంగా గర్విష్టి, సహనశీలత తక్కువ, రాజీపద్ధతులు లేవు, తోటి రాజకీయ నాయకులతో కలసి కృషిచేసే కలుపుగోలుతనం లేదు." అని కొందరు భావించారు.

జదుగోపాలముఖర్జీ రాయ్‌ని గురించి "చిన్నతనంలోనే రాయ్ ప్రజలను దూరం చేసుకొనటం తన సహజధోరణిగా అలవాటు చేసుకున్నారు" అని వ్రాశాడు.

బ్రిటిషు కమ్యూనిస్టు జె. టి. మర్ఫీ రాయ్‌ని కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ రెండవ కాంగ్రెసు మహాసభలో కలుసుకొన్నాడు. రాయ్‌ని గర్విష్టిగా విమర్శించాడు. ఫిలిప్ స్ప్రాట్‌కు రాయ్ అంటే ఎంతో అభిమానం, గౌరవం. రాయ్ అనుచరునిగా భారత కమ్యూనిస్టు వుద్యమంలో, కార్మిక వుద్యమంలో తీవ్రకృషి చేసిన వారిలో వొకరు. "రాయ్ తన అశేష మేధాసంపత్తిని, వ్యక్తిత్వాన్ని తన చుట్టూ వున్న యే కొలదిమంది మిత్రుల పరిధినుంచి విస్తరింప చేయటంలో విఫలత చెందాడని" వాపోయాడు.

ఇందుకు రాయ్ తన స్వీయగాథలో "నేను ఇతరులతో కలసి మెలసి సంచరించటంలో బెట్టుగా వుండటం సహజమే. కాని గర్విష్టిని మాత్రం కాదు. ఇందుకు కారణం చిన్నతనంలోనే నా విదేశయాత్రా ఫలితంగా నాకు కలిగిన

ఆధునిక భావాలు, సంస్కారం కావచ్చును. కాని కాలం గడచినకొద్దీ అనుభవం నాకు సహనాన్ని నేర్పినది" అని సమాధానం చెప్పుకున్నాడు.

"రాయ్ బ్రాహ్మణునిగా హిందూమతంలో పుట్టినా పాశ్చాత్యనాగరికత, సంస్కృతి, భావాలతో పూర్తిగా మునిగిపోయి పాశ్చాత్యునిగానే మిగిలిపోయాడు. భారతీయుడు కావాలని ప్రయత్నించినా కాలేక చివరకు పరదేశీయునిగా వుండిపోయాడు. భారత ప్రజల మనస్తత్వాన్నిబట్టి రాయ్ రాజకీయరంగంలో కృషి సాగించలేక ప్రజలకు దూరం అయ్యాడు." అనే విమర్శ సర్వసాధారణంగా కనబడుచున్నది.

రాజకీయ నాయకుని కుండవలసిన లక్షణాలు రాయ్‌లో లోపించటం ప్రధాన కారణంగానే భావించవచ్చును. కేవలం 'నాయకుని' లక్షణాలు అలవర్చుకో గలిగినట్లయితే తేలిగ్గా ఉన్నత అధికారాలు చేపట్టి వుండేవాడు. పలుకుబడి కొరకు ప్రాకులాడలేదు. అధికారం కొరకు ఆరాటపడలేదు. నమ్మిన సిద్ధాంతాన్ని వొంటరిగా, ఏకాకిగా విడమరచి చెప్పటానికి ఎప్పుడూ వెనుకాడలేదు. మేరు పర్వతంలాగా ఎన్ని అవాంతరాలు వచ్చినా ఎదుర్కొనటానికి వెనుకంజ వేయలేదు. మానవసేవకు మతం, జాతి ఎల్లలు కారాదు. సర్వమానవ సమాజ అభ్యుదయం తన మహోత్కృష్ట ధ్యేయంగా స్వీకరించాడు.

అగ్రవర్ణంగా చలామణి అవుతున్న పూజారీ కుటుంబంలో జన్మించినా రాయ్ అగ్రవర్ణ అధికారాలకు ఆధారభూతమయిన దేవుళ్లను, దయ్యాలను వుపాసించ లేదు. జగత్తుకు ఆధారభూతమయిన మూలసూత్రాలను, నీతిసూత్రాలనే నమ్ముకొని వాటిని ఆరాధించాడు. అందలి పరమసత్యాలను కనుగొనటానికి, వాటిని సమాజ అభివృద్ధికి అన్వయింప చేయటానికి నిరంతర కృషి సాగించాడు.

పరిస్థితుల ననుసరించి ఏ మాత్రం తలవొగ్గ గలిగినా రాయ్ కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ నుంచి దూరం అయ్యేవాడు కాదు. పైగా విశేష అధికారాలతో తన పలుకుబడిని ద్విగుణీకృతం చేసుకొన గలిగేవాడు. భారతదేశం వొంటరిగా కాక రష్యా అండదండలతో ప్రవేశించి జైలుశిక్షను తప్పించుకొని కమ్యూనిస్టు మహా నాయకునిగా నీరాజనాలు అందుకొని వుండేవాడు. అదేవిధంగా గాంధీ, నెహ్రూలతో కొంత సర్దుబాటు చేసుకొనగలిగి వుంటే మేటి దేశ నాయకునిగా చలామణి అయి భారత స్వాతంత్ర్య ప్రదాన కాలాన్ని మరి కొంత ముందుకు నెట్టకలిగి వుండేవాడు.

తాను నమ్మిన సిద్ధాంతాలకు ఒక అంగుళం కూడా ప్రక్కకు జరుగరాదని రాయ్ అభిమతం. అలాగే జీవితాంతం రాయ్ ప్రవర్తించాడు.

ప్రజాస్వామ్యం పరమావధిగా, వలసదేశాల విముక్తి అంతిమ ఆదర్శంగా ప్రథమ ప్రపంచయుద్ధంలో పాల్గొనిన విల్సను 'అమెరికా అమెరికనులదే' అనే నినాదంతో పశ్చిమార్థగోళాన్ని అమెరికను సామ్రాజ్యవాదం క్రిందకు తీసుకుని రావటానికి చేసిన ప్రయత్నంలోని మోసం గ్రహించాడు. మెక్సికోలో కరంజా ప్రభుత్వానికి అండగా నిలబడి అమెరికను సామ్రాజ్యవాదాన్ని ప్రతిఘటించటానికి లాటిన్ అమెరికాను సంఘటితపరచాడు.

పిన్నవయస్సులోనే ఎదురులేని మహా మేధావి అయిన లెనిన్ సిద్ధాంతాన్ని ప్రతిఘటించి ప్రత్యామ్నాయ సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. లెనిన్ నియంతగా వ్యవహరించలేదు. వలసరాజ్యాలలో, ముఖ్యంగా భారతదేశానికి సంబంధించినంతవరకు రాయ్ వాదాన్ని అంగీకరించక తప్పలేదు. నిజమైన మార్క్సిస్టుగా మరొక మార్క్సిస్టు అభిప్రాయాలను హేతుబద్ధంగా చర్చించటానికి తగిన అవకాశం యిచ్చాడు. మార్క్సిజం ముందే నిర్ణయించబడిన 'పిడివాద సిద్ధాంతాల సంచయం' కాదని లెనిన్ గ్రహించినవాడు కావటంచేత రాయ్ సిద్ధాంతానికి కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌లో, వలసరాజ్య విధాన కార్యక్రమంలో తగిన స్థానమిచ్చాడు.

లెనిన్ మరణానంతరం కూడా రాయ్ తన అభిప్రాయాలను చంపుకొనలేదు. రష్యా అధికార రాజకీయాల్లో ట్రాట్స్కీ, స్టాలిన్ కుమ్ములాటలో కూడా రాయ్ ప్రాపకం కొరకు ఎవరినీ బలపరచలేదు. ఒంటరిగా బాహాటంగా తన వ్యక్తిగత అభిప్రాయాలను వెల్లడిస్తూనే వచ్చాడు. చైనా అనుభవంతో బూర్జువా ప్రజాస్వామ్య విప్లవం పేరుతో దేశీయ బూర్జువా వర్గం - పెట్టుబడిదారులు నిర్వహించే విప్లవ వ్యతిరేకపాత్రను కళ్లారా చూడగలిగాడు. దాదాపు భారతదేశం అదే స్థితిలో వున్నది. కాని చైనాలో వున్నంత బలంగా భారతదేశంలో కమ్యూనిస్టు పార్టీ సంఘటితం కాలేదు. చైనా పార్టీకి రష్యా అండదండలు వున్నవి. భారత కమ్యూనిస్టు పార్టీ బాల్యదశలోనే వున్నది. పైగా రష్యా సహాయం సరాసరి అందే పరిస్థితులు కూడా మృగ్యం. కనుక భారత ప్రజా వుద్యమాన్ని ఎంతో జాగ్రత్తగా, దూరదృష్టితో నడుపవలసిన అవసరాన్ని గుర్తించాడు.

మార్క్సిజం ప్రకారం కాపిటలిజం నశించి సోషలిజం - కమ్యూనిజం - రాకతప్పదు. ఇది కారల్ మార్క్స్ చెప్పిన చరిత్రాత్మక సత్యం. ఇంపీరియలిజం కాపిటలిజానికి అంతిమఘట్టం. కాని మార్క్స్ భావించినట్లు చరిత్రగమనం అలా సాగలేదు. కాపిటలిజం సుస్థిరం కావటానికి 'ఫాసిజం' రూపంలో క్రొత్త అవతారాన్ని ధరించినది. మొత్తం మానవాళిని, ప్రజాస్వామ్య శక్తులను భస్మీపటలం చేసి చిరకాలం బానిస సమాజంలో మ్రగ్గింప చేయటమే ఫాసిజం యొక్క అంతిమ లక్ష్యం. ఈ ప్రమాదాన్ని గుర్తించి ఎలుగెత్తి చాటి కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌ను, సోవియటు రష్యాను హెచ్చరించగలిగినది రాయ్ వొక్కడే. అయితే ఈ పరమ సత్యాన్ని, పైశాచిక శక్తిని కమ్యూనిస్టు నాయకులు గ్రహించకపోగా కరుడుగట్టిన మార్క్సిస్టులుగా కాపిటలిజం దానంతటదే క్షీణించక తప్పదనే మూఢవిశ్వాసంలో వుండిపోయారు.

కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌లో, సోవియటు రష్యాలో లెనిన్, స్టాలిన్‌లతో సమాన హోదాలో రాజకీయాలు చేపట్టాడు. రష్యాలో వుంటూనే భారత విప్లవ వుద్యమానికి, కమ్యూనిస్టు పార్టీ స్థాపనకు బెర్లిను కేంద్ర కార్యాలయంగా యేర్పరచుకొనటంచేత జర్మనీలోని నాజీ పార్టీ స్థాపన, కార్యక్రమం, విధానాలను గమనిస్తూ అందలి లోతుపాతులను తెలుసుకొన గలిగాడు. హిట్లరుతో యాదృచ్ఛికంగా ఒక విందులో కలుసుకొని ముఖాముఖి సంభాషణల ద్వారా నాజీ పార్టీ అధికారానికి వస్తే జరుగబోవు ఘోరవిపత్తును అంచనావేయ గలిగాడు. భారతదేశంలో మహాత్మా గాంధీ, పండిట్ జవహర్‌లాల్‌నెహ్రూలాలతో సమవుజ్జీగానే కాంగ్రెసు సారధ్యం వహించాడు. కాని ప్రజల మనస్సును చూరగొనలేకపోయాడు.

నెహ్రూ రాయ్‌ని గురించి తన ఆత్మకథలో మహా మేధావిగా వర్ణిస్తూ 'ఆయనముందు తానొక సామాన్య వ్యక్తి'గా చూపుకొన్నాడు. ఆయుధాల కొరకు బటేవియా వెళ్ళి కలుసుకొనిన జర్మనీ రాయబారి హెల్ఫెరిచ్ ప్రథమ ప్రపంచ యుద్ధానంతరం రచించిన తన స్వీయగాథలో రాయ్‌ని గురించి "గొప్ప దేశభక్తుడు, జాతీయవాది, సాహసోపేతుడు, పట్టుదలగలవాడు, నమ్మదగినవాడు" అని ప్రస్తుతించాడు. మెక్సికోలోని ఒక మిత్రుడు "రాయ్ ఎప్పుడూ ఏదో తీవ్రంగా ఆలోచిస్తూనే వుంటాడు" అని తన అభిప్రాయం వెల్లడించాడు. కావాలని పట్టుబట్టి రష్యా పిలిపించుకొనిన లెనిన్ రాయ్ పిన్నవయసును గమనించి విభ్రాంతి చెంది

"మిమ్మల్ని తల నెరసిన ముసలివానిగా, తూర్పుదేశానికి చెందిన వివేకవంతునిగా ఊహించుకొన్నాను" అని సాదరంగా ఎదురొచ్చి అతిధి మర్యాదలతో ఆహ్వానించాడు.

అట్టి మేధావి రాయ్‌కి భారత ప్రజ మొదట నీరాజన మిచ్చి ప్రస్తుతించినా వెంటనే సమసిపోవటం నిజంగా శోచనీయమే. జైల్లో వున్నప్పుడు రాయ్ తనను గురించి వ్రాస్తూ "అసత్యాలను వేటాడటం నా వృత్తిగా స్వీకరించాను. ఇది యదార్థంగా వందన స్వీకారములేని వృత్తియే కాగా విరోధభావాన్ని పెంచుతుంది. అయినా యీ వేటాడే వృత్తిని నేను వదలుకొనను. పలుకుబడి కొరకు ప్రాకులాడటం నా వల్లకాని పని. రెండు నాలుకలు కలిగివుండే ప్రతిభ నాలో లేదు." అని స్పష్టీకరించాడు.

రాయ్ స్వతంత్ర ఆలోచనాపరుడు. నమ్మిన సిద్ధాంతాన్ని తు. చ. తప్పకుండా ఆచరణలో పెట్టటానికి సర్వదా సంసిద్ధుడు. సమాజాభివృద్ధికి అవసర మయిన కార్యక్రమాన్ని రెండు దశాబ్దాల ముందే తీర్చిదిదగల మేధాసంపత్తి గలవాడు. రాయ్ దూరదృష్టితో చూడక వర్తమానకాలానికి తగినట్లుగా ప్రజల మనస్తత్వాలనుబట్టి రాజకీయాలు చేపట్టినట్లయితే అధికారం తనంతటదే వరించి వుండేది. అది మంచి నాయకుని లక్షణం కాదని రాయ్ అట్టి రాజకీయాలు చేపట్ట లేదు.

మానవ స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలు పరమావధిగా తన జీవితాన్ని అంకితం చేసిన రాయ్ సత్యాన్వేషణ వొక్కటే పరమ సాధనంగా చేపట్టాడు. సమాజం పెరుగుచున్నకొలదీ సమస్యలు కూడా పెరుగసాగినవి. భూతకాలంలో ఒకానొక వ్యవస్థకు, సమాజ నిర్మాణానికి, అభ్యుదయానికి అనుకూలించిన భావాలు, సిద్ధాంతాలు వర్తమానకాలంలో ఎందుకూ పనికిరాకుండా పోతున్నవి. అదేవిధంగా వర్తమాన సిద్ధాంతాలు భవిష్యత్తులో ప్రయోజన శూన్యం కాకతప్పదు. అంతమాత్రం చేత వున్న సామాజిక వ్యవస్థను సమూలంగా సర్వనాశనం చేసి సరాసరి నూతన వ్యవస్థను నిర్మించటానికి పూనుకొనటం యుక్తం కాజాలదు. సమాజాభివృద్ధికి అడ్డుతెరలను తొలగించటం అవసరమే. సమాజంలో వున్న మంచి గుణాలకు మరికొన్ని మంచి గుణాలను చేర్చి ముందుకు సాగటం స్వాతంత్ర్య ప్రియుల లక్షణం.

రాయ్ తన యాత్రలో, సత్యాన్వేషణలో అనేక మజిలీలు చేసి ఒకదాని తరువాత ఒకటిగా పురోగమించి ముందుకు సాగాడు. పెర్రరిస్టుగా తన జీవితం

ప్రారంభించిన నరేంద్రనాథ్ భట్టాచార్య సైనిక విప్లవవాదిగా, తీవ్ర జాతీయవాదిగా రూపొందాడు. జాతీయవాదం సామాన్య ప్రజానీకాన్ని, మొత్తం సమాజాన్ని తృప్తిపరచలేదని, సాయుధ తిరుగుబాటు నిరుపయోగమని గ్రహించాడు. మార్క్సిజం చేపట్టి సోషలిస్టు - కమ్యూనిస్టు భావాలు అలవరచుకొని యం. యన్. రాయ్‌గా, అంతర్జాతీయవాదిగా ఖ్యాతి చెందాడు. మార్క్సిజం సూచించిన కమ్యూనిజం కూడా సమాజాభివృద్ధికి అడ్డుతెరగానే వుండటంతో దానిని అధిగమించి ముందడుగు వేయటానికి ప్రయత్నించాడు. అదే న్యూ హ్యూమనిజం - నవ్య మానవవాద సిద్ధాంతం.

నిరాశ చెందిన రాజకీయవేత్తలు, నాయకులు ఆశించిన ఫలితాలు పొంద లేక విరాగులు కావటం సహజం. రాయ్ తన జీవితంలో ఎప్పుడూ నిరాశ చెంద లేదు. కేవలం రాజకీయజీవిగా తన జీవితం గడుపనూలేదు. రాజకీయాలకు తత్వ శాస్త్రాన్ని, తత్వ సిద్ధాంతాలను జోడించి సమగ్ర రాజకీయ స్వరూపాన్ని రూపొందించటానికి ప్రయత్నించి సఫలుడు కాగలిగాడు.

ప్రాచీన భారతదేశం మహర్షులకు, ఆధ్యాత్మిక వాదానికి ఆలయంగా ప్రసిద్ధి కెక్కినది. గౌతమబుద్ధుడు, చార్వాకుడు వంటి ఏ కొలదిమందినో మినహా యించితే అందరూ భౌతికవాదాన్ని విడచి కేవలం ఆధ్యాత్మిక చింతనలో మున్కలు వేసినవారే. అప్పటికీ, ఇప్పటికీ 'భగవద్గీత' నాధారంగా చేసుకొని అందరూ ఆ పరిధిలోనే సాము గరిడీలు చేశారు. రాయ్ వొక్కడే ఆ పరిధిని అధిగమించి నూతనమైన, అమూల్యమైన, సజీవమైన, సామాజికపరమైన తత్వశాస్త్రాన్ని యివ్వ గలిగాడు. ఇది కేవలం భారతదేశానికే పరిమితమై లేదు. మొత్తం మానవాళికి కరదీపం. రాయ్ కేవలం తత్వశాస్త్రజ్ఞుడే కాదు, కర్మయోగి కూడాను.

కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ నుంచి దూరం చేయబడిన వారిలో ఏ కొద్ది మందో మినహాయించి మిగిలిన వారందరూ విరాగులు కావటమో, లేక మార్క్సి జాన్ని, కమ్యూనిజాన్ని పడదిట్టి చివరకు కేవలం కమ్యూనిస్టు వ్యతిరేకులుగా తమ శేషజీవితాన్ని గడిపినవారే. కాని రాయ్ జీవితం మరొకవిధంగా జరిగినది. తాను నిరాశ, నిస్పృహలు చెంది రాజకీయ జీవితాన్ని అస్తమింప జేసుకొనలేదు. పైగా వంద సంవత్సరాల క్రితం ఆవిర్భవించిన మార్క్సిజాన్ని ఆ తరువాత అభివృద్ధి చెందిన విజ్ఞాన శాస్త్రాన్ని, మానవ సమాజాన్ని, రాజకీయ పరిస్థితులను సమీక్షించి

మార్క్సిజంలో వున్న లోటుపాటులను సరిదిద్ది, కమ్యూనిజమే అంతిమదశగా భావించక మానవ స్వాతంత్ర్యం కొరకు దాని తరువాత దశను కనుగొనటానికి వివిధ పరిశోధనలు జరిపి సమగ్రమయిన ఒక నూతన సిద్ధాంతాన్ని రూపొందించటానికి తీవ్ర కృషిని జరిపాడు. దాని ఫలితమే నవ్య మానవవాదం.

# జాతీయ వాదం - గాంధిజం :

ద్వితీయ ప్రపంచ యుద్ధారంభం నుంచీ ఒక ప్రక్క రాయ్ యుద్ధ గమనాన్ని పరికిస్తూ, ఫాసిస్టు వ్యతిరేక ప్రచారం చేస్తూనే తత్వవిచారంలో పూర్తిగా మునిగిపోయాడు. సామాజిక అభివృద్ధికి, నూతన సమాజ నిర్మాణానికి నూతన భావాలు, నూతన సిద్ధాంతాల ఆవశ్యకతను గుర్తించాడు. ఆచరణకంటె ముందు ఆలోచన అవసరంగా భావించాడు.

జాతీయవాదం ఒక దశలో విప్లవచర్యగానే భావించబడినది. జమీందారీ యుగంలో దారిద్ర్యంతో, బానిస బ్రతుకుతో ప్రజానీకం దుర్భర బాధలకు గురిఅయి మూఢవిశ్వాసాలతో సమాజం అస్తవ్యస్తమయి 'ఎవరికివారే యమునాతీరే'గా వున్నప్పుడు జాతిని సంఘటిత పరచటానికి, పరజాతి పెత్తనం నుండి ప్రజలు విముక్తి చెందటానికి జాతీయవాదం విప్లవచర్యగా కనబడినది. కాని ఆ చర్య వలన సామాన్య ప్రజానీకం తాము ఆశించిన ఫలితాలు, హక్కులు, రక్షణలు పొందలేక సమాజం యథాస్థితిలో వున్నప్పుడు జాతీయభావాలు, జాతీయవాదం, జాతీయ ప్రభుత్వాలు అన్నీ నిష్ప్రయోజనమే. సామాజిక అభివృద్ధికి అడ్డుతగిలే జాతీయ వాదాన్ని విప్లవచర్యగా భావించరాదు. 17, 18 శతాబ్దాలలో ముఖ్యంగా ఐరోపా ఖండంలో జాతీయవాదం అభివృద్ధిదాయకంగా వుండి జాతి పురోభివృద్ధికి, పారిశ్రామిక విప్లవానికి తోడ్పడినది. కాని కాపిటలిజం అభివృద్ధి చెంది సామ్రాజ్యతత్వం పెరగటంతో జాతీయవాదం అభివృద్ధి నిరోధకమే కాకుండా 'ఫాసిజం'గా వెర్రి తలలు వేసి సమాజాన్ని తిరిగి అంధకారంలో, బానిసతత్వంలో, దారిద్ర్యంలో కట్టుదిట్టంగా బంధించటానికి ప్రయత్నిస్తుంది. బలమైన (అగ్ర) జాతులు బలహీన జాతులమీద పెత్తనం చేయటం సిద్ధాంతరీత్యా ధర్మకార్యంగా చూపబడినది. బలం-

బలప్రయోగమే న్యాయసూత్రంగా చిత్రించబడినది. మొదట ఇటలీలో ప్రారంభమయిన యీ సిద్ధాంతం జర్మనీ, జపాను దేశాలు స్వీకరించినవి. జాతీయవాదం, జాతీయ సోషలిజం పేరుతో దేశీయ దళితవర్గాల నుద్ధరించాలనే నెపంతో అగ్రజాతి అధికారం చేపట్టి ప్రపంచంలోని మొత్తం దళితవర్గాలను దాస్యశృంఖలాలతో బంధించటం తమ విద్యుక్తధర్మంగా రూపొందినది. కమ్యూనిస్టు ఆరవ వరల్డు కాంగ్రెసులో (1928) రాయ్ హెచ్చరించిన యీ ప్రమాదం స్టాలిన్‌కు గాని, స్టాలిన్‌కు అనుకూలంగా పరిణమించిన కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌కుగాని ప్రజాస్వామ్యాన్ని మంటగలిపి జాతీయ సోషలిజం ముసుగులో పెరుగుచున్న ఫాసిస్టు పెనుభూతం కనబడలేదు.

గాంధిజం మరొక రూపంలో భారతదేశంలో యిదే పంథా చేపట్టటానికి ప్రయత్నించినది. 1921 లో తారాస్థాయి నందుకొనిన జాతీయవుద్యమం ప్రజలకు తమ మార్గాన్ని, గమ్యస్థానాన్ని చూపటంలో విఫలమయినది. నూతన సమాజ నిర్మాణానికి మాపుగా వున్న సమాజాన్ని స్థిరపరచటానికి పూనుకొన్నది. నూతన భావాలు, నూతన సిద్ధాంతాలకు 'పాశ్చాత్య సంస్కృతి' పేరుతో హేయభావం కలిగించి బూజుపట్టిన పాత భావాలను 'భారత సంస్కృతి', 'ఆధ్యాత్మిక తత్వం' పేరుతో సుస్థిరం చేయటానికి తీవ్ర కృషి చేసినది.

ప్రత్యేకించి భారతదేశానికి ఒక ఆధ్యాత్మిక తత్వం వుందనుకొనటం పొరపాటు. ప్రాచీనకాలంలో నాగరికత ముందుగా నెలకొనిన అన్ని దేశాలలో యీ ఆధ్యాత్మిక చింతన యేదో వొక రూపంలో వ్యాప్తి చెందుతూనే వచ్చినది. సంస్కృతి, సంస్కారాలు దేశకాల పరిస్థితులనుబట్టి, సమాజ నిర్మాణం, పోకడల ననుసరించి వేరువేరుగా వుండవచ్చును. కాని సాధారణంగా జమీందారీ యుగంలోని సమాజ వ్యవస్థ భావాలు, సంస్కృతి, నాగరికత అన్ని దేశాలలో ఇంచుమించుగా వొకే విధంగా వుండక తప్పదు. అదేవిధంగా కాపిటలిజంలో కూడా వివిధ దేశాలలో సామీప్యం వుంటుంది.

పాశ్చాత్యదేశాలు భారతదేశంకంటె 2,3 శతాబ్దాలు ముందుగానే పారిశ్రామిక విప్లవం సాధించి కాపిటలిజంలో ప్రవేశించటంచేత భారతదేశం పరాధీనంలో మ్రగ్గుతూ పారిశ్రామిక విప్లవం సాధించలేక పోవటంచేత భావాలలో, సంస్కృతి, సంస్కారాలలో భేదం సహజంగా కనబడసాగినది. ఆధునిక

విజ్ఞానంలో ముందంజవేసిన పాశ్చాత్యదేశాలు ఆధునిక భావాలలో కూడా ముందంజ వేయటం సహజమే. దీనిని మార్గదర్శిగా స్వీకరించటానికి మారుగా 'పాశ్చాత్య సంస్కృతి' మనకు పనికిరాదని నిరసించటం, పైగా పాతపడిన జమీందారీ విధానాన్నే అంటిపెట్టుకొని 'భారత సంస్కృతి' పేరుతో సమాజాన్ని ముందుకు పోరాదనటం విప్లవ ప్రతిఘటన చర్య కాక తప్పదు.

గాంధిజం ఇందుకు పుపకరించినది. కాగా దేశంలో జమీందారీ వ్యవస్థలో దేశీయ బూర్జువా వర్గం బలపడటానికి మార్గం సుగమం చేసినది. ఒక ప్రక్క యంత్రయుగాన్ని నిరసించినా దేశంలో జరుగుచున్న పారిశ్రామిక అభివృద్ధిని అరికట్టలేకపోయినది. విదేశీ వస్త్ర, వస్తు బహిష్కరణ స్వదేశీ మిల్లుల అభివృద్ధికి దోహదమిచ్చినది. చేతి రాట్నంతో, చేతి పరిశ్రమలతో యంత్రసహాయం లేకుండా కోటానుకోట్ల ప్రజా సామాన్యానికి కావలసిన వసతులన్నీ కల్పించటం, వుత్పత్తిని సాధించటం హాస్యాస్పదమే కాకుండా అవివేకం కూడాను. అవసరాలు, కోర్కెలు తీర్చుకొనటానికి ప్రయత్నించటం, అందుకు అవసరమయిన సాధనాలు నిర్మించుకొనటం మానవుడు అనాదినుంచి సాగిస్తున్న నిరంతర యాత్ర. ఇందులో అవసరాలు తీరగా మిగిలిన వానిని కూడపెట్టుకుంటూ వాని సహాయంతో ముందుకు సాగుతూ మానవుడు అభివృద్ధి యాత్రలో ఒక్కొక్క మజిలీని అధిగమించగలుగుచున్నాడు.

నిరాడంబర జీవిత సిద్ధాంతం ఒక విధంగా మానవుని కట్టుదిట్టంగా పంజరంలో పెట్టి బంధించినట్లే. 'ఉన్న అవసరాలను తగ్గించుకొనండి. కోర్కెలను చంపుకొనండి. కడుపు కాలినా కాళ్ళు ముడుచుకొని, కళ్ళు మూసుకొని రామనామ జపం చేయండి. ఇహలోకంలో కంటె పరలోకంలోనే మీకు మోక్షం వున్నది' అని బోధించటం వీనులకు విందుగా వుంటుంది. కాని యీ వాదం సమాజాన్ని అధః పాతాళానికి త్రొక్కటం కాదా ? బ్రతికినంతకాలం మానవుడు శల్యావశిష్టంగా నిర్జీవ ప్రతిమగా దారిద్ర్యావస్థలో కృంగి కృశించటం కాదా ? 'ధర్మార్థ కామమోక్షాలు' మానవుని సోపానమార్గాలుగా ప్రాచీన గ్రంథాలు చిత్రించినవి. ఇందులో 'అర్థం, కామం' ప్రజలు తమ కోర్కెలు, అవసరాలు తీర్చుకొనటానికి కృషి అవసరం అని బోధించటం కాదా ? ఇది భౌతికవాదం కాదా ?

భగవద్గీత ప్రమాణగ్రంథంగా, వర్ణ వ్యవస్థ భారత సామాజికరూపంగా గాంధిజం బోధిస్తున్నది. వర్ణవ్యవస్థ అంటే 'అగ్రకులాల ఆధిక్యత, క్రింది కులాల దాస్యం.' ఎవరి పరిధిలో వారు తమ నిత్యజీవితాన్ని సర్దుబాటు చేసుకొనాలనే సిద్ధాంతం. దీని ఫలితంగా వేలకొలది సంవత్సరాల నుంచి పై వర్గాలు క్రింది వర్గాలను దాస్యవృత్తిలో బంధించి తమ అవసరాలను తీర్చుకొంటూ అధికారం చలాయిస్తూ వున్నవి. ఈ వర్ణ వ్యవస్థ వున్నంతకాలం యీ దాస్యవృత్తి నశించదు. కాగా యీ వర్ణ వ్యవస్థ నాధారం చేసుకొని అంతర్గతంగా కులాలు, కులాల్లో కులాలు, పంచమవర్ణం వుద్భవించినవి. కేవలం అంటరానితనం 'హిందూమతానికి చీడపురుగు' అని, అస్పృశ్యతా నివారణకు దేవాలయ ప్రవేశం జరిపినంత మాత్రం చేత యీ జాఢ్యం నశించదు. అసలు మూలాధారమయిన వర్ణ వ్యవస్థను అంటి పెట్టుకొని హెచ్చుతగ్గులను నిర్మూలించాలనుకోటం నేలవిడిచిన సాము. కల్లు, సారాయిలు బజార్లలో అమ్ముతూ, మద్యపాన నిషేధ ప్రచారం సాగించినందువలన ఫలితం ఏమున్నది? ఆర్థికంగా మొత్తం సమాజం అభివృద్ధి చెంది ఎవరి కాళ్లమీద వారు నిలువ గలిగినప్పుడు ఒకరి నొకరు గౌరవించుకొనటం, సమాన హోదాలో చూడటం సాధ్యపడుతుంది. మాల, మాదిగగ వున్న వ్యక్తిని దూరంగా అట్టిపెట్టి నీచంగా చూసిన అగ్రకులస్థుడు అదే వ్యక్తి క్రైస్తవ మతం చేపట్టి విద్యాధికుడై, ఉద్యోగస్తుడుగా వచ్చినప్పుడు ఎదురేగి కరచాలనం చేసి ఆదరపూర్వకంగా గౌరవించి తనకు మించిన మర్యాద నివ్వటంలో కారణ మేమిటి? ఆర్థిక అసమానతే యిందుకు కారణం. అవి లేనప్పుడు కులభేదాలు, వర్గభేదాలు వాటంతటవి పటుత్వం పోగొట్టుకొనక తప్పదు. గాంధిజం బోధించిన వర్గ వ్యవస్థ హిందూమత వుద్ధరణకు మారుగా జాతి నిస్తేజమై నిర్వీర్యం కావటానికి దోహదపడినది.

ధర్మకర్తృత్వం కూడా దీనికి దగ్గర సిద్ధాంతమే. ఒక వర్గం మరొక వర్గం మీద పెత్తనం చలాయించటం సుస్థిరం చేయటం. రైతులు జమీందార్లను, కార్మికులు పెట్టుబడిదార్లను అంటిపెట్టుకొని వారి దయాదాక్షిణ్యాలకు బద్ధులుకావాలి. ఎదురు తిరగటం, తమ హక్కులకొరకు పోరాడటం చేయకూడని పని. తమ నిత్య బాధలతో కుమిలిపోతూనే పై వారిలో 'హృదయ పరివర్తనం' కలిగించాలి. హింసా పద్ధతులను ఏ మాత్రం చేపట్టరాదు. ఇదే సిద్ధాంతాన్ని గాంధీ హిట్లరు ఇంగ్లండు మీద దండయాత్ర చేసినప్పుడు బ్రిటిషు ప్రజలకు బోధించాడు. 'మీరు మీ ఆయుధాలను ఎదురు ప్రయోగించక అస్త్రసన్యాసం చేయండి' అని సలహా యిచ్చాడు.

గాంధీ సలహా ప్రకారం బ్రిటిష ప్రభుత్వం తలవొగ్గినట్లయితే నేటి మానవసమాజం ఎలా వుండేదో వూహించటం కష్టం. కలవారు తాము కూడబెట్టుచున్నదానిలో వారు అనుభవించగా మిగిలినదానిని లేనివారి అవసరాలకు వినియోగించమని గాంధీ సలహా. ఇది ఆచరణలో అసాధ్యం, అసంభవం కూడాను.

గాంధీ బోధనలు, గాంధీ సిద్ధాంతాలు నీరసించిన ప్రజలను కర్తవ్య విముఖులను చేసినవి. పెట్టుబడిదారీ వర్గానికి, జమీందారీ వర్గానికి హిరణ్యాక్ష వరాలు అయినవి. మూఢ విశ్వాసాలకు లోనయి నిద్రాణంలో వున్న ప్రజానీకం తమకు ఏమి కావాలో తెలియక, తెలిసినా అడుగలేక, అడిగినా పొందగల శక్తి లేక గొట్టుమిట్టాడుచుంటే, యీ అవకాశాన్ని పురస్కరించుకొని బూర్జువా వర్గం పారిశ్రామిక విధానాన్ని చేపట్టి దేశాన్ని యంత్రయుగంలోనికి మార్చి తమ పెత్తనం సుస్థిరం చేసుకొనటానికి అన్నివిధాలా ప్రయత్నాలు చేయనే చేసినది. గాంధీ నిరసించిన యంత్రయుగం ఆగనూ లేదు. ఆశించిన 'హృదయ పరివర్తన' జరుగనూలేదు.

హిందూ - ముస్లిము - ఇతర మతస్థుల కలయిక కూడా గాంధి ఆశించి నంతగా ఫలించకపోవటం అసలు గాంధిజంలోనే లోటు వుండటమే ఇందుకు కారణం. ఒక ప్రక్క 'రఘుపతి రాఘవ రాజరాం' అని ప్రార్థనలు చేయించుతూ మరోప్రక్క 'అందరమొకటే' అని చెప్పినందువలన ప్రయోజనం శూన్యం. మహమ్మదీయులు మొదట జాతీయ వుద్యమంలో చేరినా గాంధిజంలోని హిందూ మతోద్ధరణ వారిని రానురాను దూరంచేసి ద్విజాతి సిద్ధాంతానికి కారణభూతమయినది. ఇదే చివరకు పాకీస్తాను అవతరణకు దోహదకారి అయినదని కూడా చెప్పవచ్చును.

తన అభిప్రాయాలను వ్యతిరేకించినవారిని గాంధీ ఎప్పుడూ సహన భావంతో చూడటంకాని లేక ఇతరుల అభిప్రాయాలకు తగిన విలువ యివ్వటంగాని జరుగలేదు. ఇదే నియంతృత్వ లక్షణం. తమ నాయకుని పరమ పూజ్యునిగా భావించి వారి ప్రవచనాలను వేద ప్రమాణంగా భావించినంత కాలం యే జాతి కూడా నిరంకుశత్వంలోని అవలక్షణాలను గ్రహించగల స్థితిలో వుండజాలదు.

మొదటినుంచీ రాయ్ గాంధీ భావాలను, కార్యక్రమాలను తీవ్రంగా విమర్శిస్తూనే వచ్చాడు. భారతదేశంలో కాలు పెట్టినప్పటినుంచీ రాయ్‌ని బ్రిటిష ప్రభుత్వం, భారత కమ్యూనిస్టులు, గాంధేయులు తమ శత్రువుగా భావించటంచేత

ఆయన ప్రచారానికి ఎన్నో అంతరాయాలు ఏర్పడ్డవి. పత్రికలు కావాలని రాయ్ ఉపన్యాసాలను, భావాలను, కార్యక్రమాన్ని ప్రకటించటం మానివేసినవి.

నవ్య మానవవాద పరిణతిలో రాయ్ కొంతవరకు గాంధిజంలోని సుగుణాలకు దగ్గర కావటంతో గాంధీ మీద ఆదరాభిమానాలు పెరిగినవి. వ్యక్తి స్వేచ్ఛ, వికేంద్రీకరణ, అధికార రాజకీయాల కాలుష్యం, ప్రజాస్వామ్య విలువలు, మానవతా దృష్టి, నైతికజీవితంలో దాదాపు యిద్దరి అభిప్రాయాలు ఒకటిగానే రూపొందినవి. 1947 ఆగస్టు 15 న అధికార సంక్రమణలో గాంధీ దూరంగా మతకలహాలకు గురి అయిన హిందూ - మహమ్మదీయుల రక్షణార్థము తన జీవితం బలిచేయటానికి సిద్ధపడటంలో నిజంగా రాయ్ గాంధీని 'మహాత్ముని'గా చూడగలిగాడు. 1948 జనవరి 30 న కలకత్తాలో ఒక సమావేశంలో రాయ్ ఉపన్యసిస్తూవుండగా మహాత్ముడు హత్య చేయబడినట్లు వార్త విని విచలుడై వేదికమీద నిలబడలేక తన ఉపన్యాసాన్ని మధ్యలోనే ఆపివేసి వెళ్ళిపోయాడు.

అయితే సిద్ధాంతాల్లో చివరకు ఇద్దరి భావాలు పూర్తిగా ఏకీభవించినవి అని అనుకొనరాదు. ఒకరు భగవంతుడున్నాడనే గాఢవిశ్వాసం కలిగి భగవత్ప్రేరణతో, అంతర్వాణిని బట్టి తన గమనం సాగిస్తున్నానని చెప్పగా మరొకరు తన అనుభవాన్ని, ఆధునిక విజ్ఞాన శాస్త్రాన్ని, మానవ సమాజాన్ని, సిద్ధాంతాలను ఆధారం చేసుకొని హేతువాద దృష్టితో గమనం సాగించారు. ఇద్దరి లక్ష్యం మానవ స్వాతంత్ర్యమే. కాని దాని అవధులు, విలువలు, పరిమాణం, రూపురేఖల్లో భేదం చాలా వున్నది.

# కాపిటలిజం - ప్రజాస్వామ్యం :

పారిశ్రామిక విప్లవం జమీందారీ వ్యవస్థను భగ్నం చేయటమే కాకుండా సమాజాన్ని అనేకవిధాల ముందుకు తీసుకొని వెళ్లినది. రాజులు, జమీందారులు అంతరించారు. రాజకీయ అధికారం ప్రజలకు, ప్రజలచే ఎన్నుకొనబడిన వారికి దత్తమయినది. ఆర్థిక వ్యవస్థ పూర్తిగా మారినది. మానవశక్తి వ్యవసాయ రంగం నుంచి పారిశ్రామిక రంగానికి మళ్లించబడినది. జీవనోపాధి కొరకు జనం ఫారి

శ్రామిక కేంద్రాలకు ఎగబ్రాకినది. క్రొత్త పట్టణాలు, నగరాలు వెలసినవి. ప్రజానీకంలో సంఘీభావం పెరుగ సాగినది. నూతన భావాలు, నూతన ఆదర్శాలు చిగురెత్తినవి.

ముడిపదార్థాలను ఫ్యాక్టరీ కేంద్రాలకు, ఉత్పత్తి వస్తువులను దేశం నలుమూలలా చేరవేయవలసిన అవసరాలు పెరిగిన కొలదీ రోడ్లు, రవాణా సౌకర్యాలు కూడా పెంపొంద సాగినవి. వార్తాహరుల స్థానంలో తంతి, తపాలా శాఖలు విస్తరించబడ్డవి. పారిశ్రామిక రంగం వివిధరకాలుగా పెరిగిన కొలదీ వృత్తుల సంఖ్య కూడా పెరుగ సాగినది. విద్యారంగంలో మార్పులు వచ్చినవి. ఆధునిక విజ్ఞానం పెరుగ సాగినది. మానవుడు ప్రకృతిని జయించి నూతన మార్గాలు కనుగొనసాగాడు.

పెట్టుబడిదారీ విధానంలో ముఖ్యసూత్రం ధనార్జన, లాభాలు గడించటం. జీవనభృతి కొరకు, కుటుంబ పోషణకు ఎగబడిన శ్రామికవర్గం చేత రోజుకు 15, 16 గంటలు పని చేయించి అధిక లాభాలు గడించటం మొదట సర్వసాధారణంగా అమలులో వున్నా క్రమేపీ కార్మికవర్గం సంఘటితమై పని గంటలు తగ్గించటానికి, గృహవసతులు, ఆరోగ్యవసతులు, జీతాలు పెంచటానికి సమ్మెలు, వుద్యమాలు జరిపి కొంతవరకు సఫలీకృతం కావటం గమనించదగిన విషయం.

జమీందారీ వ్యవస్థ పనికిరాదని మానవసమాజం పెట్టుబడిదారీ విధానాన్ని, బూర్జువా ప్రజాస్వామ్య వ్యవస్థను చేపట్టినది. అయితే అంతమాత్రంచేత సమస్యలు పరిష్కరించబడగలవని, సమాజం స్వర్గపథం చేపట్టగలదని వూహించటం అవివేకం. మానవ సమాజం ముందుకు సాగిన కొలదీ క్రొత్త సమస్యలు రాక తప్పదు. ఒక సమస్యను పరిష్కరించటంతో అనేక క్రొత్త సమస్యలు వుత్పన్నమవటం సహజం. అందువలన మొదటి సమస్యనే విడనాడటం మానవలక్షణం కాదు. స్వేచ్ఛా, స్వాతంత్ర్యాల పరిధి పెరిగిన కొలదీ సమస్యలు కూడా పెరుగుతూనే వుంటవి. వాటిని పరిష్కరించుకొనటంలోనే మానవ అభివృద్ధి యిమిడి వున్నది. పెట్టుబడిదారీ విధానం వలన మానవశక్తి కేంద్రీకరింపబడినది. కాని మానవ స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలు కుదింపబడ్డవి. కాపిటలిజం పెరిగిన కొలదీ పాశ్చాత్య దేశాలు వెనుకబడిన దేశాలను, సాంఘికంగా సంఘటితపడక అస్తవ్యస్తంగా వున్న ప్రాంతాలను ఆక్రమించుకొనసాగినవి. దేశ ఎల్లలను అధిగమించి పరఖండంలో

పరదేశాలను, ప్రాంతాలను ఆక్రమించటంలో అంతరార్థం రాజ్యకాంక్ష కంటె, సామ్రాజ్య విస్తరణ కంటె ప్రధాన కారణం వ్యాపార విస్తరణ, వాణిజ్య అభివృద్ధియే. వాణిజ్య రక్షణకు, వ్యాపారం క్రమబద్ధంలో సాగించి అధిక లాభాలు గడించటానికి, ఆక్రమించిన దేశాల నుంచి సురక్షితంగా ముడి ఖనిజాలను మాతృదేశాలకు చేర వేయటానికి, ఉత్పత్తి చేసిన పారిశ్రామిక వస్తువులను తిరిగి ఆ యా దేశాలలో అమ్ముకొనటానికి వలస రాజ్యాలలో సైనికశక్తిని పెంచుకొని, ప్రభుత్వాలు స్థాపించి బానిస దేశాలుగా యేర్పరచుకొన్నవి. మాతృదేశాలలో క్రింది వర్గాలమీద ప్రయోగించిన దమనకాండ, పీడన వలస రాజ్యాలలో చైతన్యరహితమయిన ప్రజానీకం మీద తేలికగా, హెచ్చు శాతంలో జరుపబడినది. 'నల్లజాతుల సముద్ధ రణకే తెల్లజాతులు వుద్భవించినట్లు' సూత్రాలు అల్లబడినవి.

కాపిటలిజం కారల్ మార్క్స్ చెప్పినట్లు శ్రామికుల అదనపు విలువ నాధారం చేసుకొని మనగలిగి విస్తరించినా కాపిటలిజం అభివృద్ధి చెందుతున్న కాలదీ ప్రజాస్వామ్య శక్తులు (లిబరలిజం) కూడా అభివృద్ధి చెందటం గమనించ దగిన విషయం. కాపిటలిజంలోని అవకతవకలను, సాంఘిక అన్యాయాలను నిరసించి ఐరోపా ఖండంలో ప్రాచీన వ్యవస్థకు చెందిన కొంతమంది తిరిగి సంఘాన్ని వెనుకకు నెట్టటానికి ప్రయత్నించక పోలేదు. దానివలన ఫలితం శూన్యం. చరిత్ర గతిని వెనుకకు నెట్టటం అసాధ్యం. కాపిటలిజం తన గమనాన్ని అది సాగిస్తూనే వచ్చినది.

18వ శతాబ్దం చివరిలో జరిగిన ఫ్రెంచి విప్లవం పీడిత వర్గాలకు, ప్రజాస్వామ్య శక్తులకు ఆశాజ్యోతిని వెలిగించినది. 'స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం,' యీ విప్లవ నినాదం. మధ్యతరగతికి చెందిన మేధావులు నాయకత్వం వహించారు. మానవ సమాజ అభివృద్ధికి, సాంఘిక న్యాయానికి నూతన భావాలు, నూతన పంథా, నూతన కార్యక్రమం రూపొందించబడినది. ఫ్రెంచి విప్లవం మొత్తం ప్రపంచానికే నూతన సందేశాన్నిచ్చినది. దీని ఫలితంగా ముఖ్యంగా ఐరోపా ఖండంలో రాజకీయ, ఆర్థిక విధానాలు మారసాగినవి. ప్రజా ప్రభుత్వాలు, ప్రజలచేత ఎన్నుకొనబడిన ప్రతినిధులచేత రూపురేఖలు దిద్దుకొనసాగినవి. రాజకీయ అధికారాలు విస్తారంగా ప్రజా బాహుళ్యానికి సంక్రమించటానికి, ఆర్థిక అసమానతలు తగ్గించటానికి, సాంఘిక న్యాయం చేకూర్చటానికి విశేష కృషి జరిగినది. విజ్ఞానం

పెరిగిన కొలదీ ప్రజాస్వామ్య విలువలు పెరుగ సాగినవి. విద్యావిధానంలో, సాంఘిక నిర్మాణంలో, ఆచార వ్యవహారాల్లో, నాగరికతలో, సంస్కృతిలో 'లిబరలిజం' ప్రతిబింబింప సాగినది.

ఇది ఒక దశాబ్దం లేక కొన్ని దశాబ్దాల కృషి ఫలితం కాదు. పారిశ్రామిక విప్లవంతోబాటు అంతకు ముందునుంచీ బయలుదేరిన భావవిప్లవ (తాత్విక విప్లవం) ప్రభావమే ఐరోపా ఖండాన్ని ఆధునిక విజ్ఞానానికి ఆలవాలం చేసి నూతన పరిశోధనలు చేయటానికి, నూతన ఆదర్శాలను కనుగొనటానికి, మానవ విలువలను పెంచటానికి దోహదకారి అయినది. తదనుగుణంగా పాశ్చాత్య జాతులు తమ వ్యవస్థలను పునరుద్ధరించుకొని జాతిని చైతన్యవంతం చేసుకొనటానికి ప్రయత్నించినవి. ఇది దాదాపు మూడు శతాబ్దాల కృషి ఫలితం. ఇది కేవలం ఐరోపా ఖండానికి పరిమితమయినా దీని ఫలితాలు మొత్తం మానవాళికి అనుభవయోగ్యం అయినవి. 'పాశ్చాత్య సంస్కృతి' లేక 'పాశ్చాత్య నాగరికత' పేరుతో భారతీయులు దీనిని విరసించటం తమ అజ్ఞానాన్ని అంటిపెట్టుకొని వుండటమే.

## మార్క్సిజం - కమ్యూనిజం :

ఎన్ని సిద్ధాంతాలు రూపొందించబడినా, ఎన్ని విధానాలు చేపట్టినా మానవ ప్రగతిని ముందుకు సాగించటానికే ననే భావం మరచిపోకూడదు. మానవ పురోభివృద్ధి జరుగుచున్న కొలదీ సిద్ధాంతాలు, విధానాలు కూడా మారుతూ వుంటవి. వీటిని సుస్థిరాలనుకొని అంధ విశ్వాసాలతో అంటిపెట్టుకొని కూర్చొనటం స్వేచ్ఛా, స్వాతంత్ర్యప్రియుల లక్షణం కాదు. మనం మన చేతులతో నిర్మించుకొనిన వ్యవస్థలు ఆదర్శాలకు అనుకూలంగా అవి సజీవంగా వున్నంతకాలం వుపయోగపడి సమాజాభివృద్ధికి తోడ్పడుతూ వుంటవి. ఆశించిన ఆదర్శాలు నెరవేరి గమ్యస్థానం చేరువకు వెళ్లినప్పుడు సమాజ పయనంలో నూతన ఆదర్శాలు అవతరించి వాటి గమ్యస్థానం చేరువకు తదనుకూలమయిన మరొక వ్యవస్థను తిరిగి నిర్మించుకొనవలసిన అవసరం యేర్పడుతుంది. అందుకు సరియైన సిద్ధాంతాలను, విధానాలను, చేపట్టవలసి వుంటుంది. కనుక మానవ అభివృద్ధి కివి మజిలీలే కానీ, చరమదశ లేక అంతిమ గమ్యస్థానం అనేది ప్రత్యేకించి ఏదీ లేదు.

కాపిటలిజంలో వున్న అంతర్గత పరస్పర విరుద్ధభావాలను కారల్ మార్క్స్ బాగా లోతుకు దిగి పరిశోధించాడు. అంతేకాదు మానవ చరిత్రను అనాది నుంచీ పరిశీలించాడు. ఆదిమ మానవుడు తన స్వశక్తి మీద ఆధారపడి జీవయాత్ర సాగిస్తూ తోటిమానవులతో సంఘంగా యేర్పడినప్పటినుంచీ ఇప్పటివరకూ చరిత్ర గమనం వర్గ కలహంతో, వర్గ సంఘర్షణతో సాగుచున్నట్లు చిత్రీకరించాడు. బానిస యుగంలో మతాధిపతులు, బానిసరాజులు, జమీందారీ యుగంలో జమిందారులు, పెట్టుబడిదారీ యుగంలో కాపిటలిస్టులు మిగిలిన సమాజాన్ని (అనాగరికులు, రైతులు, కార్మికులను) పీడించుకొని దోచుకుతినటమే చరిత్ర గమనంగా వర్ణించాడు. కనుక యీ వర్గ సంఘర్షణ అనాదినుంచీ భిన్నరూపాలలో కనబడుచున్నా అంతర్గతంగా దోపిడీ విధానమే యిందుకు ప్రధాన కారణం అనే నిర్ణయానికి వచ్చాడు.

పెత్తనం చేపట్టిన వర్గం తమ క్రింద నున్న వర్గానికి శ్రమకు తగిన ఫలితం యివ్వకుండా కేవలం వారి ప్రాణాలు నిలబెట్టి మిగిలినదంతా తమ కైవసం చేసుకొనటానికి సర్వవిధాల ప్రయత్నిస్తుంది. ఇదే దోపిడీ విధానం. దీనిని నిలబెట్టు కొనటానికి రాజ్యాంగ యంత్రాన్ని సృష్టించుకొంటుంది. తమకు అనుకూలమయిన న్యాయసూత్రాలను, చట్టాలను, సంస్కృతిని, వ్యవస్థను నిర్మించుకొంటుంది. సైనిక శక్తిని పెంచుకొంటుంది. ఇవి అన్నీ అధికారంలో వున్న వర్గ ప్రతిబింబాలే. అధికారాన్ని సురక్షితం చేసుకొనటానికి సృష్టించిన ధర్మపన్నాగాలు.

జర్మనీ తత్వశాస్త్రజ్ఞుడు హెగిల్ ప్రకృతి అస్తిత్వాన్ని, మార్పును, సంఘ గమనాన్ని గుర్తిస్తూ ఒక సిద్ధాంతం సృష్టించాడు. "ప్రకృతి క్రమబద్ధ మయినది. కొన్ని వ్యతిరేక పదార్థాల సమ్మేళనమే ప్రకృతి. సదా వీటి మధ్య సంఘర్షణ యేర్పడి వున్న పరిస్థితులు మారి నూతన పరిస్థితులు యేర్పడుతూ వుంటవి. ప్రకృతిలో సమాజం కూడా ఒక భాగం గనుక సంఘంలో కూడా యీ సంఘర్షణ వుంటుంది. అయితే సంఘంలో జరిగే మార్పులు సంఘాభ్యుద యానికి వుపకరిస్తవి. సంఘం వున్న దశ నుంచి తప్పనిసరిగా అంతకుమించిన మరో మంచిదశకు చేరుకుంటుంది."…. ఈ సూత్రాలతో హెగిల్ తన సిద్ధాంతాన్ని సృష్టించాడు. ఇది 'డైలెక్టిక్స్'గా (గతితర్క వాదం) పేరు పొందినది. దీనికి హెగిల్ జ్ఞానం (భావం లేక ఐడియలిజం) ప్రధానంగా తీసుకున్నాడు. 'భావం మారుతూ వున్న కొలదీ, భావం పరిపూర్ణత చెందుచున్న కొలదీ సంఘం మారుతూ, పరిపూర్ణత్వాన్ని పొంద కలుగుతుంది.'

కారల్ మార్క్స్ దీనిని తలక్రిందులు చేశాడు. సమాజానికి ప్రత్యేకించి ఒక భావం - జ్ఞానం - అంటూ ఏమీలేదు. అన్నింటికీ ప్రకృతియే ప్రధానం. ప్రకృతి పరిస్థితులు, భౌతికపరమయిన సంఘ పరిస్థితులు మారుచున్న కొలదీ ప్రకృతిజన్యమయిన సామాజకునిలో భావాలు - జ్ఞానం - పెరుగుతూ వున్నా అప్పటి 'ఆర్థిక పరిస్థితులను' బట్టి సమాజంలో భావాలు మారుతూ వుంటవి. బానిస యుగంలోని భావాలకు, జమీందారీ యుగంలోని భావాలకు, పెట్టుబడిదారీ యుగంలోని భావాలకు పొత్తువుండదు. వీటికి శాశ్వత విలువలంటూ ఏమీవుండవు. ఉత్పత్తి సాధనాలను బట్టి భావపరంపర - జ్ఞానం - మారుతూ వుంటుంది. కనుక సమాజ చరిత్రగతిని, భావపరంపరను 'ఆర్థిక నియమబద్ధం'గా చూపించి సంఘాభివృద్ధికి 'ఆర్థిక సూత్రాలే' ప్రధానకారణంగా చూపి భౌతికవాదాన్ని సృష్టించాడు.

దోపిడీ విధానం పోవాలంటే సమాజం కాపిటలిజం నుంచి సోషలిజం లేక కమ్యూనిస్టు వ్యవస్థకు చేరాలి. వర్గ పోరాట చరిత్రలో కార్మికవర్గమే అంతిమ వర్గం. కార్మికవర్గం సాయుధ తిరుగుబాటు ద్వారా అధికారం చేపట్టి కార్మిక నియంతృత్వాన్ని, కార్మిక ప్రభుత్వాన్ని యేర్పరచుతుంది. తరువాత వర్గ కలహం - వర్గ పోరాటం వుండదు. అదనపు విలువలు కూడగట్టుకొనవలసిన అవసరం వుండదు. ఒకవర్గం మరోవర్గం మీద పెత్తనం చేసే అవసర ముండదు కనుక అంతకుముందు వున్న వర్గాలు సృష్టించుకొనిన రాజ్యాంగ యంత్రం (స్టేట్) కొనసాగవలసిన అవసరం వుండదు. ఫలితం దానంతటది క్షీణించి రద్దు అయిపోతుంది. కమ్యూనిజంలో వర్గరహిత సమాజం యేర్పడుతుంది. సోమరిపోతులు, ఒకరి శ్రమ మీద మరొకరు ఆధారపడే వ్యక్తులకు స్థానం వుండదు. అందరూ సమానంగా సమాజ అభివృద్ధికి తోడ్పడుచూ శ్రమకు తగిన ఫలితం అనుభవించ గలరు. కమ్యూనిజం మానవ చరిత్రలో అంతిమ గమ్యస్థానం. అంతిమ విప్లవం.- 'యదార్థమైన చరిత్ర అప్పటినుంచే ప్రారంభమవుతుంది.' కనుక 'ప్రపంచ కార్మికులారా ! ఏకంకండి. మీరు పోగొట్టుకొన వలసినది ఏమీలేదు, కేవలం మీ దాస్యశృంఖలాలను మాత్రమే' అని నినాదం యిస్తూ వంద సంవత్సరాల క్రితం 1848 లో కారల్ మార్క్స్, ఫ్రెడరిక్ ఏంగిల్సు 'కమ్యూనిస్టు మ్యానిఫెస్టో'ను విడుదల చేశారు. ఇది నిజంగా అనాటి కార్మిక ప్రపంచానికి, ముందుతరాల వారికి ఆశాజ్యోతిగా పరిఢవిల్లినది.

కారల్ మార్క్స్ తన నూతన సిద్ధాంతాన్ని సృష్టించటానికి ఎన్నో అవాంతరాలను ఎదుర్కొనవలసి వచ్చినది. ఉన్న సమాజాన్ని, సిద్ధాంతాలను కాదని విమర్శించినందులకు నిశితంగా విమర్శించబడ్డాడు. పలుకుబడిని పోగొట్టుకొన్నాడు. అయినా ఒంటరిగా తాను నమ్మిన సిద్ధాంతాన్ని మానవ ప్రపంచాని కివ్వటానికి వెనుకాడలేదు. వొంటరిగానే తన పోరాటాన్ని సాగించాడు.

మార్క్సిజం ప్రపంచ విప్లవ శక్తులకు ఉక్కు కవచంగా, పెట్టనికోటగా పరిఢవిల్లి అభ్యుదయ పథంలో ఏకోన్ముఖంగా నడిపించినది. తమ హక్కుల కొరకు వివిధ దేశాల్లోని పీడిత ప్రజానీకం అనేక పోరాటాలు సాగించి విజయం సాధించినది. లెనిన్ నాయకత్వం క్రింద రష్యాలో 'ప్రోలిటేరియన్ విప్లవం' జరిగినది. ప్రపంచ మానవాళికి మార్క్సిజం వినా మరో సిద్ధాంతం లేదు, లేదు అనే భావం విప్లవశక్తులలో గాఢంగా హత్తుకొని పోయినది.

రాయ్ ఇదే విశ్వాసంతో మార్క్సిజం చేపట్టాడు. అయితే ప్రశ్నించరాని సిద్ధాంతంగా కాకుండా ఆలోచనాశక్తిని ప్రేరేపించగల తత్వంగా మాత్రమే స్వీకరించాడు. జాతీయ సరిహద్దులను అతిక్రమించి అంతర్జాతీయవాదిగా, మానవాభ్యుదయానికి వివిధ దేశాల్లో నిర్విరామ కృషి సలిపాడు. ద్వితీయ ప్రపంచయుద్ధంలో భారతదేశంలో వొంటరిగానే పలుకుబడి కొరకు ప్రాకులాడక, దూరదృష్టితో పరిస్థితుల నర్థం చేసికొని ప్రజాస్వామ్యవాదిగా తాను నమ్మిన సిద్ధాంతాలను ప్రచారం చేయటానికి సర్వవిధాల ప్రయత్నించాడు.

*           *           *           *           *

రాయ్ రాజకీయవేత్తగా రాణించలేక పోయాడు. కావచ్చును. ఆయన రాజకీయ జీవితం నిరుపయోగం, విఫలం అని భావించితే సరిగ్గా అవే కారణాలతో అట్టి పరిస్థితులలోనే కారల్ మార్క్స్ తన రాజకీయ జీవితం ప్రారంభించి రాజకీయవేత్తగా రాణించలేక తన జీవితకాలంలో విఫలుడు కావలసివచ్చినది. 'నవ సమాజ నిర్మాత, ప్రవక్త నిరుపయోగమై, బూజుపట్టిన పాత సాంఘిక వ్యవస్థలో నాయకుడుగా ఎప్పుడూ రాణించలేడు గదా!' ఈ లోకోక్తి అంతరార్థం గ్రహించ గలిగిన వారు కారల్ మార్క్స్ లేక యమ్. యన్. రాయ్ వొంటరితనాన్ని గురించి, లేక రాణించలేదని విచారించ నవసరం వుండదు.

యుద్ధానంతరం రాయ్ రష్యామీద తీరని ఆశలు పెట్టుకొన్నాడు. అంత ర్జాతీయ ప్రజాస్వామ్య శక్తులు యుద్ధంలో విజయం సాధించినవి. ఫాసిస్టు శక్తులు పరాజయం పొందినవి. సోవియటు రష్యా ప్రతిష్ట పరాకాష్ట నందుకొన్నది. ప్రపంచ విప్లవశక్తులు ప్రపంచ విప్లవం కొరకు, స్టాలిన్ నాయకత్వం కొరకు ఎదురు చూడసాగినవి. కాని ఆశించినది జరుగకపోగా వ్యతిరేకం గూడా జరిగినది. యుద్ధానంతరం ముఖ్యంగా ఐరోపా ఖండంలో స్టాలిన్ నాయకత్వం క్రింద 'రెడ్ నెపోలియానిజం' స్థిరపడుతుందని రాయ్ ఆశించాడు. నెపోలియన్ ఆశయం వ్యతిరేకమయినా నెపోలియన్ సాగించిన యుద్ధఫలితంగా యూరప్ ఖండంలో అనేక స్వతంత్ర రాజ్యాలు వెలసినవి. అదేవిధంగా ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరం యూరప్‌లోని లిబరలిజం, కమ్యూనిజం రెండూ మిశ్రితమై 'సిసలైన ప్రజా స్వామ్యానికి' ఒక నూతన వ్యవస్థ యేర్పడగలదని రాయ్ భావన. కాని కరుడుగట్టిన కమ్యూనిస్టుగా స్టాలిన్ స్థిరపరచిన 'ఇనుపతెర'తో ఆ ఆశలు అడియాసలు అయినై.

యుద్ధంలో మిత్ర రాజ్యాలుగా పెనవేసుకొని ప్రజాస్వామ్య శక్తులకు నాయకత్వం వహించిన ఇంగ్లండు, అమెరికా, రష్యాలలో చివరి రెండుదేశాలు యుద్ధం పొలిమేరలకు చేరక మునుపే ప్రపంచ నాయకత్వం కొరకు ప్రయత్నాలు సాగించినై. ఇంగ్లండు యుద్ధ ఫలితంగా సామ్రాజ్యవాద శక్తిని కోల్పోయినది. ఒకవంక అమెరికా కాపిటలిస్టు దేశాలకు నాయకత్వం వహించగా మరొకవంక రష్యా కమ్యూనిస్టు దేశాలకు నాయకత్వం వహించినది. ఈ ప్రచ్ఛన్న యుద్ధంలో వెనుకబడిన దేశాలు, చిన్న రాజ్యాలు, తటస్థ రాజ్యాలమీద అమెరికా, రష్యా దేశాలు తమ తమ పలుకుబడి, ఆధిపత్యం కొరకు తమ విదేశ విధానాలను మలచు కొని ప్రపంచాధిపత్యం కొరకు పెనగులాడసాగినవి. ఇందులో అంతర్జాతీయవాదం కంటె జాతీయవాదమే, స్వప్రయోజనమే ప్రధాన కారణంగా కనబడినది. కాపిటలిస్టు దేశమయిన అమెరికా తన స్వప్రయోజనాలకు అనుకూలంగా తన విదేశాంగ విధానాలను మార్చుకొనటంలో ఆశ్చర్యపడవలసిన పనిలేదు. కాని రష్యా స్టాలిన్ నాయకత్వం క్రింద అంతర్జాతీయ కమ్యూనిజం పేరుతో కరుడుగట్టిన జాతీయ తత్వాన్ని అలవరచుకొని పొరుగుననున్న చిన్న దేశాలలో బలవంతంగా, బెదరించి, రెడ్ఆర్మీ సహాయంతో వున్న ప్రభుత్వాలను కూలద్రోసి తనకు దాసోహం అనే ప్రభుత్వాలను - 'కీలుబొమ్మ ప్రభుత్వాలను' యేర్పరచటం రాయ్‌కి దిగ్భ్రాంతి కలిగించినది.

స్టాలిన్ మొదట్లో లెనిన్ మరణానంతరం అధికారంకొరకు, నాయకత్వం కొరకు పెనగులాడి ప్రత్యర్థులను, లెనిన్ హయాంలో అందరూ కలిసి ఏకోన్ముఖంగా కృషి సలిపిన అనేకమంది నాయకులను, సహచరులను, అనుచరులను నిర్దాక్షిణ్యంగా బయటకు గెంటివేయటం, కాన్సన్ట్రేషను క్యాంపులకు పంపటం, ఉరిశిక్షలకు గురి చేయటం రాయ్ ఎరుగును. ఇందులో కొంతమంది మేధావులు రాయ్‌కి వ్యక్తిగతంగా తెలిసినవారు కూడా వున్నారు. ఇతరుల అభిప్రాయాలకు, సిద్ధాంతాలకు, స్వతంత్ర ఆలోచనా శక్తికి స్టాలిన్ ఏ మాత్రం సహనం చూపలేదు. అది లెనిన్‌తోనే అంతరించిపోయినది. కాగా స్టాలిన్ కమ్యూనిజం పేరుతో పార్టీ నియంతగా, ప్రభుత్వాధినేతగా ఉగ్ర రాజకీయాలు (అల్ట్రాలెఫ్టిజం) చేపట్టి ప్రపంచ నియంత కావాలనే సంకల్పంతో ప్రత్యర్థులను మటుమాయం చేసాడు. ఆ విధానంలో, ఆచరణలో ఫాసిజానికి, కమ్యూనిజానికి ఏమీ భేదం కనపడదు.

ప్రోలిటేరియన్ లేక శ్రామిక నియంతృత్వం ద్వారా వర్గరహిత సమాజాన్ని సృష్టించగలమని కలలుగన్న రష్యా రాజకీయాలు వక్రమార్గం బట్టినవి. శ్రామికుల పేరుతో కమ్యూనిస్టు పార్టీ అధికారం చేపట్టినది. వేరొక పార్టీ కును గడకు రష్యాలో స్థానం లేదు. సుప్రీము సోవియటుకు జరిగే ఎన్నికలు, ప్రతినిధు లను ఎన్నుకొనటం ఒక తంతు, తమాషాగా యేర్పడినది. పార్టీ కార్యకలాపాల్లో, ప్రభుత్వ వ్యవహారాల్లో శక్తియుక్తులు, నోరుగలవాళ్ళు పార్టీ నాయకులుగా చలా మణి అవుతూ వర్గరహిత సమాజానికి మారుగా మరొక 'నూతన వర్గం' ఆవిర్భ వించినది. వీరి చెప్పుచేతల్లో, వీరి కనుసన్నల్లో రష్యను సమాజ, ప్రజల భవిష్యత్తు ఆధారపడివున్నది. ప్రజల బాగోగులను పరిశీలించటం, స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలను పరిరక్షించటం వీరి పనికాదు. ప్రజలను ఒక కంట కనిపెట్టుతూ వారి నిస్పృహను, అసంతృప్తిని, వ్యతిరేకభావాన్ని, స్వతంత్ర ఆలోచనలను దేశద్రోహ నేరంగా చిత్రించి అధికారులకు, ప్రభుత్వాధినేతలకు రహస్య సమాచారం చేరవేసే గూఢచారి వృత్తిని చేపట్టి ప్రభుత్వ మన్ననల పొందటము, అధికారం చలాయించటం వీరి వృత్తి. ప్రభుత్వం, పార్టీ వీరి సహాయంతో తన కబంధ హస్తాలతో, ఇనుప తెరలతో సమాజాన్ని బంధించి బయట ప్రపంచానికి తన అభ్యుదయ కార్య క్రమాలను, ప్రణాళికలను గోరంతలు కొండంతలుగా వర్ణించి చెప్పుకొనటం పరిపాటి అయినది. మానవుని అంతరిక్షంలోనికి పంపగలిగినా అతని నిత్యావసర

వస్తువులకు, తిండి పదార్థాలకు రష్యా యిప్పటికీ విదేశాలమీద ఆధారపడివుండటం గమనార్హం.

స్టాలిన్ ఒక పర్యాయం రాయ్, ఇటలీ కమ్యూనిస్టు నాయకుడు.... టాగ్లియట్‌తో కలిసివున్నప్పుడు వివిధదేశాలలోని కమ్యూనిస్టు పార్టీలను గురించి ముచ్చటిస్తూ "కమ్యూనిస్టు పార్టీలు విప్లవం తీసుకొనిరావటం కల్ల. ఆ పని చేయ వలసినది రెడ్ ఆర్మీయే"నని తన అభిప్రాయం వెల్లడించాడట. ట్రాట్స్కి-ప్రపంచ విప్లవాన్ని రెడ్‌ఆర్మీ ద్వారానే సాధించాలని చెప్పినప్పుడు ఆయన దేశం నుంచే గెంటివేయబడ్డాడు. అధికారం సుస్థిరం చేసుకొనిన అనంతరం స్టాలిన్ నియంతగా సైనికశక్తిమీద ఆధారపడటం గమనార్హం. స్టాలిన్ అనుసరించిన దమననీతి, నిరంకుశచర్యలు రాయ్ కమ్యూనిజం, మార్క్సిజం గురించి పునః పరిశీలన జరుపటానికి కారణభూతమైనవి.

# పరిశీలన:

సర్వరోగ నివారిణిగా చెప్పబడిన మార్క్సిజం, స్వర్గధామం చేర్చగలదని ఆశించిన కమ్యూనిజం పూహాగానంగానే మిగిలిపోయినవి. స్వేచ్ఛా, స్వాతంత్ర్య ప్రియులు, మేధావులు, ప్రజాస్వామ్య వాదులు ప్రపంచంలో అచ్చటచ్చటా మార్క్సిజం - కమ్యూనిజం గురించి హేతువాదంతో, విమర్శనాదృష్టితో పరిశీలించక పోలేదు. కాపిటలిజం అంతర్జాతీయంగా ఫాసిజం పేరుతో నియంతృత్వాన్ని స్థాపించ టానికి ద్వితీయ ప్రపంచ యుద్ధాన్ని ప్రారంభించినది. యుద్ధానంతరం అదేవిధంగా రష్యన్ కమ్యూనిజం కూడా అంతర్జాతీయంగా నియంతృత్వాన్ని నెలకొల్పటానికి సిద్ధపడినది. మార్క్స్ ప్రోలిటేరియన్ శ్రామిక నియతృత్వం అవసరానికి తాత్కాలికమని చెప్పినా స్టాలిన్ దానిని తన నియంతృత్వంతో సుస్థిరం చేయ సంకల్పించాడు.

వంద సంవత్సరాల క్రితం కారల్ మార్క్స్ అప్పటి పెట్టుబడిదారీ విధానం క్రింద నలిగి తీరని బాధలకు గురిఅయి బానిస బ్రతుకులు గడుపుచున్న కార్మికవర్గాలను, సామాజిక వ్యవస్థను చూచి వ్యధ చెంది మానవతాదృష్టితో అనేక

పరిశోధనలు చేసి పరిష్కారమార్గంగా ఒక సిద్ధాంతాన్ని సృష్టించాడు. దానినే 'కమ్యూనిస్టు మ్యానిఫెస్టో' (1847) గా ప్రకటించాడు. మానవస్వేచ్ఛకు ఒక నూతన మార్గాన్ని సూచించాడు. కాని ఆచరణలో మార్క్సిజానికి వక్రభాష్యం చెప్పి కమ్యూనిజాన్ని వక్రమార్గంలో నడిపించటం జరిగినది. సోషలిజం లేక కమ్యూనిజం వచ్చిన తరువాత ఆర్థిక నిర్మాణం యేవిధంగా వుంటుందో లేక ఎలా వుండాలో మార్క్స్ ఎక్కడా స్పష్టంగా చెప్పలేదు. ఉన్న సామాజిక, ఆర్థిక పరిస్థితుల ననుసరించి నిర్ణయించుకొనవలసినది మార్క్సిస్టులే. దీనినే లెనిన్ రష్యాలో 'నూతన ఆర్థిక విధానం' ప్రవేశ పెట్టినప్పుడు 'కాపిటలిజానికి తిరోగమనం' అని విమర్శించిన తన అనుచరులకు లెనిన్ వివరంగా స్పష్టీకరించటం జరిగినది. మార్క్స్ సజీవుడై వున్నట్లయితే రష్యను కమ్యూనిజాన్నిగాని, స్టాలిన్ నియంతృత్వ విధానాలను గాని సమర్థించి వుండేవాడు కాదు.

ముఖ్యంగా రష్యా విప్లవానంతరం కమ్యూనిజం గురించి అనేక విమర్శనలు బయలుదేరినా అందుకు ప్రతిగా సమగ్రపూరకమయిన మరొక సిద్ధాంతం వెలువడలేదు. ప్రజాస్వామ్యమే సర్వోత్కృష్టమయినదిగా అనేకమంది మేధావులు అంగీకరించినా ఆచరణసాధ్యమయిన కార్యక్రమంలో అనేక పంథాలు చేపట్టటం, ఆచరణలో విఫలం కావటం జరుగుతూ వచ్చినది. 'కమ్యూనిస్టు మ్యానిఫెస్టో' వెలువడిన వంద సంవత్సరాల అనంతరం (1948) రాయ్ వొక్కడే సమాజ అభివృద్ధికి సమగ్రరూపంలో భౌతికవాదాన్ని ఆధారంగా తీసుకొని 'నవ్య మానవ వాదం' - సాంఘిక తత్వశాస్త్రానికి సంబంధించిన నూతన సిద్ధాంతాన్ని ప్రతిపాదించటం జరిగినది.

ఈ సిద్ధాంతాన్ని గురించి రాయ్ ముచ్చటిస్తూ "నే నీ సిద్ధాంతాన్ని కేవలం స్వయంగా నా మేధాశక్తితో సృష్టించలేదు. గతచరిత్ర, సమాజం ఆధారంగా వర్తమాన మేధాశక్తిని క్రోడీకరించి ప్రస్తుత సమాజానికి అనువయిన విధంగా సమన్వయింప చేయటానికి ప్రయత్నించాను. మేధావులు, స్వేచ్ఛా, స్వాతంత్ర్యప్రియులు దీనిని పరిశోధించి, అవసరమయితే సవరించి మెరుగులు దిద్దగలిగితే హర్షిస్తాను." అని స్పష్టంగా వెల్లడించాడు. ఇరవై ఐదు వందల సంవత్సరాల క్రితం గౌతమబుద్ధుడు ప్రపంచానికి నూతన సందేశమిస్తూ "ఏ సిద్ధాంతాన్ని మూఢంగా విశ్వసించవద్దు. ప్రతివిషయం కూలంకషంగా చర్చించి, పరిశీలించి వాస్తవిక ప్రపంచానికి, సమాజానికి సమన్వయం కుదిరినప్పుడే ఆచరణలో పెట్టటానికి ప్రయత్నించు" అని





బోధించాడు. మార్క్స్ కూడా తన సిద్ధాంతాలను తు.చ. తప్పకుండా ఆచరించాలని ఎప్పుడూ చెప్పివుండలేదు. ఒక కాలానికి అవసరమయిన, పనికి వచ్చిన సిద్ధాంతం కాలం, సమాజం మారిన తరువాత నిరుపయోగం కావచ్చు. కనుక సమాజం మారుతున్న కొలదీ నూతన పరిశోధనలు, నూతన సిద్ధాంతాలు అవసరం కాక తప్పదు.

మార్క్సిజం పందొమ్మిదవ శతాబ్ది మధ్యలో రూపొందించిన సిద్ధాంతం. అప్పటికీ, యిప్పటికీ మానవుడు వైజ్ఞానికంగా వూహించని పురోభివృద్ధిని సాధించ గలిగాడు. ముఖ్యంగా జీవశాస్త్రంలో, మానసిక శాస్త్రంలో అంతులేని అభివృద్ధి జరిగినది. గత వంద సంవత్సరాల ప్రగతి నాధారం చేసుకొని సంస్కృతి కూడా పెరిగినది. భావపరిణామంలో అనేక మార్పులు జరిగినవి. తదనుగుణంగా రాజకీయ, ఆర్థిక వ్యవస్థా నిర్మాణంలో ప్రగతిశీలకమయిన మార్పులు తెచ్చుకొనటానికి విధిగా ప్రయత్నించవలసి వున్నది.

చరిత్రగతిలో హెగెల్ జ్ఞానాన్ని (చైతన్యం) మార్గదర్శిగా అంగీకరిస్తే మార్క్స్ పదార్థాన్ని (జడం) మూలంగా తీసుకొన్నాడు. ఒకరు 'ఐడియలిజం' ప్రాతిపదిక చేసుకొనగా మరొకరు 'మెటీరియలిజం' చేపట్టారు. ఒకరు మనస్సును, పదార్థాన్ని విడదీసి మనస్సు (భావం)కే ప్రాముఖ్యం యిచ్చి పదార్థాన్ని, పదార్థ జనితమని అంగీరిస్తూనే పదార్థానికి ప్రాముఖ్యము యిచ్చి మనోభావాలు కల మానవుని అస్వతంత్రుని చేశాడు. 'మానవులు తమ చరిత్రను తాము నిర్మించుకుంటార'ని మార్క్సిజం బోధించిన సిద్ధాంతాని కిది వ్యతిరేకం కాదా ?

భౌతికవాదం ప్రకారం అన్నింటికీ మూలం స్వయంసంపూర్ణత్వం కలిగిన పదార్థమే. మానవుడు పదార్థం వలన యేర్పడుచున్నాడు. కనుక మానవునిలోని మెదడుకూడా పదార్థ సమ్మేళన ఫలితమే. మెదడు క్రమాభివృద్ధిని చెంది పరిపక్వ దశకు చేరి కార్యాచరణకు పూనుకొనినప్పుడు మనస్సు యేర్పడుతుంది. (పశు, పక్ష్యాదులలో మెదడు వున్నా అది తగినంతగా పరిణతి చెందక పోవటంచేత వాటి మెదడు నుంచి మనస్సు ఆవిర్భవించే అవకాశం లేదు. మానవుని మెదడులో యీ అవకాశం వుండటం వలననే అతడు సర్వస్వతంత్రుడు కాగలిగాడు.) మనస్సు తనచుట్టూ వున్న పరిస్థితులకు ప్రభావితమైనప్పుడు భావం యేర్పడుతుంది. పదార్థం స్వయంసంపూర్ణత్వం కలిగి వుంటుందని అంగీకరించినప్పుడు సర్వస్వతంత్రత కలిగి వున్నదని అంగీకరించాలి. అప్పుడు పదార్థజనితమైన మానవునితో బాటు

ఆతని మనస్సు నుండి ఉద్భవించిన భావాలు కూడా సర్వస్వతంత్ర శక్తిని కలిగి వుండటం సహజమే. కాని మార్క్సిజంలో యీ సిద్ధాంతం స్పష్టంగా లేదు. మానవుడు 'సర్వస్వతంత్రు' డంటూనే భావం అస్వతంత్రంగా చూపబడినది. భావం అస్వతంత్రమయినప్పుడు మానవుడు కూడా అస్వతంత్రుడు కాక తప్పదు. తక్కిన జంతుజాలం మాదిరిగా 'చరిత్ర నియమానికి' కట్టుబడి వుండక తప్పదు. మానవ కృషికి, ప్రయత్నానికి విలువవుండదు. కర్మసిద్ధాంతానికీ, చరిత్ర నియమానికీ తేడా వుండదు. "మానవుడు తాను నిర్మించిన, సృష్టించుకొనిన వస్తుజాలంలో, ఉత్పత్తిలో, సాధనాలలో అన్నిటికంటె మించి శక్తిసంపన్నమయిన, సాహసోపేత మయిన, విప్లవయుతమయిన వస్తువును తన మెదడు ద్వారా ఉత్పత్తి చేసుకొన గలుగుచున్నాడు. అదే భావం; సర్వస్వతంత్రమయిన ఆలోచనాశక్తి, ముందుచూపు, దూరదృష్టి గల వివేచనాజ్ఞానం" అని రాయ్ స్పష్టీకరించాడు.

రాయ్ పదార్థానికి ఎంత ప్రాముఖ్యం యిచ్చాడో పదార్థజనితమయిన మానవునికి, మానవునితోబాటు ఆతని మనస్సుద్వారా ఉద్భవించిన భావాలకు అంతే ప్రాముఖ్యం యిచ్చాడు. ఒకసారి వెలువడిన భావాలు అంతటితో ఆగవు, నశించవు, సజీవమై, స్వతంత్రశక్తి కలిగి సమాజంమీద స్థిరంగా తమ ప్రభావాన్ని ప్రకటిస్తూ ముందుకు సాగిపోతూవుంటవి. మార్క్సిజం చెప్పినట్లుగా 'ఆర్థిక పరిస్థితులను'బట్టి భావాలు యేర్పడుతూ వుంటవని సంఘంలో ఒక వ్యవస్థను నిర్మూలించి రెండవ వ్యవస్థను నిర్మించుకొన్నప్పుడు మొదటి వ్యవస్థలోని భావాలు అంతటితో నశించటం, ఆ స్థానంలో రెండవ వ్యవస్థకు సంబంధించిన భావాలు యేర్పడుతూ వుంటవని కనుక భావాలకు శాశ్వత విలువలు, స్వతంత్రశక్తి లేదని అనుకోవటం పొరపాటు. ప్రకృతినుంచి వుద్భవించిన మానవుడు ప్రకృతిని జయించగలుగుచున్నాడు. ప్రకృతిని మార్చగలుగుచున్నాడు. చుట్టూ వున్న వాతావరణాన్ని చూడగల శక్తి, దానికి ప్రతిగా వ్యవహరించగల శక్తి మానవునిలో వుండబట్టే మానవుడు ప్రకృతిని లోబరచుకొనగలుగుచున్నాడు. దీనికి యితర జంతు, పక్షి సముదాయంలో లేని మనస్సు, మేధస్సే ప్రధాన కారణం. ఒక కార్యం సాధించటానికి ముందు ఆలోచన అవసరం. ఆలోచన కలిగినప్పుడే మానవుడు కార్యసాధనకు పూనుకుంటాడు.

ఒక వ్యక్తి ఒక అనుభవాన్ని పొందినప్పుడు లేక ఒక వస్తువును చూచినప్పుడు అతనిలో సహజంగా ఒక భావం లేక భావోత్పత్తి కలుగుతుంది. ఆ భావం అతనితో లేక ఆ వస్తువుతో ఆగిపోదు. ఆ భావాన్ని అతడు సంఘంలో

ప్రకటించినప్పుడు దాని ప్రభావం సంఘం మీద పడక తప్పదు. (మొట్టమొదటగా ఒక మానవుడు ఎంతో శ్రమించి సాధించగలిగిన కార్యం తరువాత యితరులకు కరతలామలకమవటం సర్వసాధారణమైన విషయమే.) సంఘం ఆ భావాన్ని ఆధారంగా తీసుకొని మరొక వస్తువును, అనుభవాన్ని వూహించుకొని అందుకోసం ప్రయత్నిస్తూవుంటుంది. ఈ విధంగా సంఘ అనుభవాన్నిబట్టి భావోదయం, భావోదయాన్నిబట్టి సంఘం ఒకదాని నొకటి పెనవేసుకొని ఒకదానిపై నొకటి తన ప్రభావాన్ని ప్రసరింపచేస్తూ ముందుకు గమనం సాగిస్తూ వుంటవి. మానవ సంఘం గమనం సాగించినట్లు మానవునిలో వుద్భవించిన భావాలు కూడా క్రమబద్ధంలో తమ గమనం సాగిస్తూవుంటవి.

భావ సముదాయమే జ్ఞానం. జ్ఞానం శక్తివంతమైనది. మానవునిలో జ్ఞానం పెరుగుచున్నకొలదీ అతనిలో శక్తి కూడా పెరుగుతుంది. ఈ జ్ఞానాన్ని క్రమపద్ధతిలో వినియోగించగలిగినప్పుడు అది అతనికి, అతని చుట్టూవున్న సంఘానికి శ్రేయోదాయకం కాగలదు. అజ్ఞానావస్థలో వున్న ప్రజానీకానికి నూతన భావాలతో, భావ విప్లవం కలిగించి వారిలో నిద్రాణమైయున్న శక్తిని ప్రజ్వలింప చేయాలి. ప్రజలకు శ్రేయోదాయకమైన నూతన మార్గం చూపగలిగిన భావాలు ప్రజలలో ప్రచారంచేసినప్పుడు అవి సంఘం మొత్తంలో వ్యాప్తిచెంది మొత్తం సంఘాన్ని శక్తివంతం చేయగలవు.

ప్రకృతి క్రమబద్ధమైనది. హేతుబద్ధమయిన కొన్ని సూత్రాలకు కట్టుబడి వున్నది. కనుక ప్రకృతినుంచి జనించిన మానవుడు కూడా క్రమబద్ధుడు, హేతు బద్ధుడు కాగలుగుచున్నాడు. సమాజ పరిస్థితులనుబట్టి, బహిర్గత వొత్తిడుల ననుసరించి, మానవునిలోని క్రమపద్ధతి, వివేచనాజ్ఞానం నిస్తేజమైనప్పుడు స్వశక్తిని కోల్పోవుచున్నాడు. పై వొత్తిడులను తొలగించి సమాజ పరిస్థితులను చక్కబరచి నప్పుడు మానవుడు మానవునిగా, స్వేచ్ఛాజీవిగా మనగల స్థితికి రాగలడు. మేధావులు, వివేచనాపరులయిన స్వేచ్ఛాపిపాసులు దీనిని ప్రధాన బాధ్యతగా గుర్తించాలి.

మార్క్సు భౌతిక వాదాన్ని చేపట్టి 'మానవుడు సర్వస్వతంత్రుడు' అని చెప్పినా మానవ విలువలకు, మానవ భావాలకు మూలకారణంగా ఆర్థికపరిస్థితులకు ప్రాధాన్యం యివ్వటంతో మార్క్సిజం చూపెట్టిన మానవతావాదం, మానవ విలువలు

మటుమాయమైనవి. 'వర్గపోరాటం, శ్రామిక నియంతృత్వం'కు వున్న ప్రాముఖ్యతలో మానవతావాదం బహిర్గతం కాలేకపోయినది. మానవ చరిత్రను 'ఆర్థిక నియమానికి' బంధించి ముడివేయటం మానవునిలోని సృజనాత్మక శక్తిని, స్వాతంత్ర్యేచ్ఛను, ఆలోచనాశక్తిని, వివేచనాజ్ఞానాన్ని తిరస్కరించటమే అవుతుంది. కేవలం సమాజంలోని ఆర్థిక పరిస్థితుల ననుసరించే మానవులలో భావ పరంపర అభివృద్ధి చెందుతుందని చెప్పటం పొరపాటు. అట్టి పరిస్థితుల్లో ముందు యుగానికి కావలసిన సిద్ధాంతాన్ని ఆయన సృష్టించటం, డెభ్భైసంవత్సరాల తరువాత జరిగిన రష్యా విప్లవానికి ప్రవక్తగా జన్మించటం అసంభవం అని చెప్పుకొనవలసి వుంటుంది గదా !

మానవుని మనస్సు, అంతఃకరణ స్వతంత్రశక్తిని గలిగి సృజనాత్మకమైనట్టిదిగా పరిణతి చెంది వున్నది. వివేచనాశక్తిని, హేతువాదాన్ని, క్రమపద్ధతిని కలిగి వుండటంచేత మానవుడు సహజంగా సుఖజీవనంతోబాటు మంచి చెడ్డలను విడదీసి మంచివయిన నైతిక విలువలను చేపట్టి నీతిదాయకమైన సమాజ వ్యవస్థను నిర్మించుకొనటానికి సిద్ధపడతాడు. నీతి మానవప్రవర్తనకు సంబంధించిన విషయం. హేతువాది అయిన మానవుడు నీతిదాయకుడు కావటం సహజ లక్షణం. కనుక మానవునిలో వున్న సృజనాత్మక శక్తిని అడ్డుతెరల నుంచి విముక్తి కావించటానికి ప్రయత్నించాలి. ప్రతి కార్యసాధనకు ముందు వివేచనాశక్తి అవసరం కాబట్టి ప్రతి రాజకీయ లేక ఆర్థిక విప్లవాలకు తాత్విక విప్లవం అవసరమని భావించాలి. దీనినే రాయ్ ఇరవయ్యో శతాబ్దపు జాకోబినిజంగా, పునరుజ్జీవన (భావ) వికాస వుద్యమంగా వర్ణించాడు. రాయ్ మార్క్సిస్టు పంథాలో మార్క్సును అధిగమించి ఇంకా ముందుకు వెళ్లాడు. తన 'నవ్య మానవవాద' సిద్ధాంతాన్ని భౌతికవాదం, హేతువాదం, వ్యక్తి స్వేచ్ఛావాదం, మానవ నైతిక విలువలను ఆధారంగా తీసుకొని ఒక పరిపూర్ణ సిద్ధాంతంగా రూపొందించటానికి ప్రయత్నించాడు.

# మార్క్సిజంలోని లోపాలు :

## మధ్య తరగతి

మార్క్సిజం ప్రకారం సమాజంలో వుండేది రెండే రెండు వర్గాలు - ఒకటి పీడించేది రెండోది పీడింపబడేది. జమీందారీ వ్యవస్థలో జమీం దారులు - రైతులు వుంటే పెట్టుబడిదారీ విధానంలో కాపిటలిస్టులూ - కార్మికులూ వుంటారు. మధ్యతరగతికి చెందిన వర్గాలను పెట్టీ బూర్జువా వర్గంగా చిత్రించి సాధారణంగా వీరు విప్లవ వ్యతిరేకపాత్ర చేపట్టుతారని మార్క్సిజం బోధిస్తుంది. అసలు మార్క్సిజం మధ్యతరగతిని గుర్తించలేదు సరిగదా యీ తరగతి కాపిట లిజం చివరి దశలో నశిస్తుందని అంచనా వేసినది. కాని అలా జరుగలేదు.

పీడిత ప్రజానీకంలో విప్లవభావాలు కలిగించి వారిని ఉత్తేజపరచి చైతన్యవంతులు చేయగల సమర్థులయిన వ్యక్తులు కావాలి. బానిసత్వంలో మ్రగ్గు చున్న ప్రజానీకంలో హెచ్చుమందికి స్వాతంత్ర్యం అంటే ఏమిటో తెలియదు. ముందు తాము మానసికంగా స్వాతంత్ర్యాన్ని పొంది, నైతికంగా సంఘంలో ఉచ్ఛ స్థాయిలో వుండి మనోధైర్యం, ఆత్మవిశ్వాసం, విప్లవ దృక్పథం గల వ్యక్తులే యితరులకు మార్గదర్శకులై స్వాతంత్ర్యప్రియులను చేయగలుగుతారు.

ఇలాంటి వ్యక్తులు లభించాలంటే సాధారణంగా మధ్యతరగతి నుంచే ఎక్కువమంది లభించగలరు. గ్రంథకర్తలు, రచయితలు, ఉపాధ్యాయులు, ప్రొఫెసర్లు, విజ్ఞానవేత్తలు, తత్వశాస్త్రజ్ఞులు, డాక్టర్లు, లాయర్లు యింకా యితర వర్గాలకు చెందిన విద్యాధికులంతా యీ తరగతికి చెందినవారే. పరిస్థితులను అర్థం చేసుకొనే శక్తి, పరిస్థితులను మార్చాలనే జ్ఞానం వీరికి వుంటుంది. భావవిప్లవం వీరిలో జరిగినంత త్వరగా సాధారణ ప్రజానీకంలో జరుగదు. కనుక వీరిలో ముందు చైతన్యం కలిగించి విప్లవ నాయకత్వం సృష్టించవలసిన అవసరమున్నది.

మార్క్సిజం యీ తరగతికి చెందినవారిని పూర్తిగా నిరసించటమే కాకుండా విప్లవ వ్యతిరేకులని కూడా చెప్పుతుంది. చరిత్రను పరిశీలిస్తే విప్లవ పోరాటంలో ముందంజవేసి నాయకత్వం చేపట్టి సంఘాభివృద్ధికి కృషి చేసినవారు

యీ తరగతులకు చెందినవారేనని స్పష్టంగా తెలుస్తుంది. సోషలిజం, కమ్యూనిజం కావాలనేవారు, అందుకొరకు కృషి చేసేవారు మధ్యతరగతికి చెందినవారే. కార్మిక వుద్యమాలలో నాయకత్వం వహించినది యెక్కువగా మధ్యతరగతికి చెందినవారే. రష్యా విప్లవం జరిగి అరవైసంవత్సరాలు దాటినా, అక్కడ కమ్యూనిజం స్థాపించ బడినదని చెప్పబడినా మార్క్సిజం ప్రకారం అక్కడ వున్నది కార్మికవర్గ మొక్కటే కాదు. నాయకత్వం వహించినదీ, వహిస్తున్నదీ మధ్యతరగతి వారే.

## వర్గపోరాటం

'వర్గపోరాటం' వల్లనే మానవ చరిత్ర అభివృద్ధిచెందుతూ వున్నది. 'మానవ చరిత్ర వర్గకలహమే'నని మార్క్స్ తన కమ్యూనిస్టు మ్యానిఫెస్టోలో స్పష్టంగా విశదీకరించాడు. పెట్టుబడిదారీ విధానంలో మాదిరిగానే అంతకుముందు వున్న జమీందారీ విధానంలో, అంతకుముందు పూజారీ యుగంలో కూడ ఒక వర్గం మరొక వర్గంమీద పెత్తనం చలాయిస్తూ పీడించటం, పీడితవర్గం పోరాటంద్వారా తమ హక్కులకొరకు అధికారవర్గాన్ని కూలద్రోయటం తత్ఫలితంగా మానవ సంఘం వున్న దశను దాటి మరొక దశలో ప్రవేశిస్తూ వచ్చినది. కనుక 'ఈ వర్గ పోరాటంలోనే మానవ సంఘ అభ్యున్నతి కూడా యిమిడివున్నది' అని మార్క్సిజం బోధిస్తుంది.

మార్క్సిజం సంఘంలో 'వర్గానికి' అతి ప్రాముఖ్యం యివ్వటంతో వ్యక్తులు, వ్యక్తి స్వేచ్ఛ, వ్యక్తి భావాలు విస్మరించబడ్డవి. ప్రతిదీ వర్గ దృష్టితో చూడబడినది. 'వర్గ రాజకీయాలు, వర్గ ఆచార - వ్యవహారాలు, వర్గ న్యాయచట్టాలు, వర్గ సంస్కృతి, వర్గ భావాలు' - యీ విధంగా అధికారంలో వున్న వర్గం తనకు సంబంధించిన సూత్రాలను అల్లుకుంటుందని, ఆ వర్గ అధికారం మారగానే వాటి స్థిరత్వం నశించి పెత్తనం చేపట్టిన వర్గం తిరిగి తనకు అనుకూలమయిన సూత్రాలను, వ్యవస్థలను నిర్మించుకొంటూ వుండగలదని మార్క్సిజం చెప్పుతుంది. యదార్థమయిన చరిత్ర "వర్గరహిత సంఘం - కమ్యూనిజంలోనే యేర్పడుతుంది" అని మార్క్స్ స్పష్టీకరించాడు.

చరిత్రను వర్గ దృష్టితో చూడటం వలన అనేక సమస్యలు తలెత్తగలవు. కమ్యూనిజంతోనే 'యదార్థ చరిత్ర' ప్రారంభమవుతుందని చెప్పినప్పుడు గత

చరిత్రను మిధ్యగానే భావించవలసివుంటుందా ? చరిత్ర అంతకుముందు సృష్టించిన రాజకీయ, ఆర్థిక, సాంఘిక వ్యవస్థలు, సంస్కృతి, నాగరికత, భావాలు అన్నీ వదలుకొనవలసినదేనా ? కమ్యూనిజంలో చరిత్ర యదార్థమైనది అయినప్పుడు దానికి కారణభూతమయిన కాపిటలిజం, అందుకు కారణభూతమయిన జమీందారీయుగంలోని చరిత్రలు కూడా యదార్థంకాక తప్పదు. మానవ చరిత్రను దేనికది విడదీసి, ఏ భాగానికది వేరువేరుగా చూపటం క్రమపద్ధతి కాదు.

వర్గపోరాటమే సంఘాభివృద్ధికి కారణభూతమని అంగీకరిస్తే వర్గ రాహిత్యమైన సోషలిజం - కమ్యూనిజంలో వర్గ పోరాటం వుండదు కనుక సంఘాభివృద్ధి కూడా ఆగిపోతుందా అనే ప్రశ్న రాక తప్పదు. "కమ్యూనిజం మానవ సంఘానికి అంతిమ దశగా భావించరాదు. సంఘాభివృద్ధికి హద్దులు, గమ్యస్థానం లేవు. మానవుడు అనుభవం, జ్ఞానం సంపాదిస్తున్న కొలదీ ప్రకృతిలోని అవరోధాలను తొలగించుకొంటూ సంఘం ముందుకు గమనం సాగిస్తూనే వుంటుంది. అనుభవానికి, జ్ఞానానికి పరిమితిలేనట్లే సంఘాభివృద్ధికి కూడా పరిధి లేదు. కనుక వర్గ పోరాటానికి ప్రాముఖ్యత కలిగించటం పొరపాటు" అని రాయ్ స్పష్టం చేశాడు.

మార్క్స్ చెప్పిన ప్రకారం చరిత్రను పరిశీలిస్తే సంఘం యెప్పుడూ రెండుగా చీలటంగాని, ఒక వర్గం పూర్తిగా విప్లవ పాత్రను, రెండో వర్గం పూర్తిగా విప్లవ వ్యతిరేక పాత్రను వహించటంగాని జరుగలేదు. మార్క్సిజం ప్రకారం పెట్టుబడిదారీ వ్యవస్థ పెరిగినకొలదీ మధ్యతరగతి నశించి కార్మికవర్గంగా మారుతుంది. అది కూడా జరుగలేదు. కాగా వీరే హెచ్చుగా విప్లవపాత్ర వహించినట్లు కనబడుతుంది. 'మానవుడే సంఘానికి మూలం' అని చెప్పిన మార్క్సిజం సంఘంలో వ్యక్తి ప్రాముఖ్యతకు, స్వాతంత్ర్యేచ్ఛకు, భావోద్రేకతకు తగిన విలువ నివ్వలేదు. కాని ఇంతవరకు చరిత్రలో కేవలం వర్గం కంటె వ్యక్తులే ప్రధాన పాత్ర వహించినట్లు కనబడుతుంది. పరిస్థితులు అనుకూలించినప్పుడు, వాటిని విప్లవ పంథాలో మళ్ళించి నడిపించగల వ్యక్తులు - నాయకత్వం - కూడా అవసరం.

మూఢ విశ్వాసాలతో అజ్ఞానాంధకారంలో మునిగి, దాస్యంలోవున్న ప్రజానీకం - రైతులు, కార్మికులు, పీడిత వర్గాలు - మొత్తంగా విప్లవ పాత్ర

వహించటం చరిత్రలో ఎప్పుడూ జరుగలేదు. ప్రజాప్రభుత్వాల ద్వారానే ప్రజాస్వామ్యం పేరుతో, ప్రజల వోట్లతో హిట్లరు, ముస్సోలినీలు అధికారం చేపట్టారు. కాంగ్రెసు కూడా భారతదేశంలో ప్రజా బలంతోనే, వారి వోట్లతోనే అధికారం చేపట్టగలిగినదని మరచిపోకూడదు. ఫాసిజం పీడిత ప్రజల మద్దతుతోనే ప్రపంచ శక్తిగా రూపొందగలిగినది.

ఏ వర్గానికీ చెందని కేవలం మానవ స్వాతంత్ర్యమే ప్రధాన లక్ష్యంగా భావించిన మేధావులే విప్లవ పాత్రను నిర్వహించినట్లు చరిత్ర చెప్పుతుంది. ఫ్రెంచి విప్లవంలో ప్రధాన పాత్ర వహించిన రూసో, వాల్టేర్, మరాట్, రోబస్ పియరీ పెట్టుబడిదారీ వర్గానికి చెందినవారుకారు. కొంతమంది మతాధికారులు కూడా ఆ విప్లవానికి అండగా నిలబడ్డారు. కమ్యూనిజానికి పునాది వేసిన కారల్ మార్క్సు, రష్యా విప్లవాన్ని సాధించిన లెనిన్ శ్రామికులు కారు. వీరంతా ఏ వర్గానికీ చెందినవారు కారు. కనుక చరిత్రను, సంఘాన్ని రెండుగా విడదీసి అర్థం చేసుకొనటానికి ప్రయత్నించితే యదార్థ పరిస్థితులను తెలుసుకోలేము.

## అదనపు విలువ - (సర్ప్లస్ వాల్యూ)

మార్క్సిజంలో అదనపు విలువకు హెచ్చు ప్రాధాన్యత యివ్వబడినది. దీన్ని గురించి మార్క్సు తాను రచించిన గ్రంథం - 'దాస్ కాపిటల్'లో సుదీర్ఘంగా చర్చించాడు. యజమాని తన క్రింద వున్న శ్రామికుని శ్రమకు తగిన ఫలితం యివ్వకుండా కొంత శాతం తాను భుక్తం చేసుకుంటున్నాడు. ఇదే మార్క్సిజం ప్రకారం అదనపు విలువగా, దోపిడీ విధానానికి ప్రాతిపదికగా సూచింపబడ్డది.

బానిస, జమీందారీ, పెట్టుబడిదారీ యుగాల్లో బానిసలు, రైతులు, కార్మికులు క్రమంగా యీ దోపిడీ విధానానికి గురి అయ్యారు. బానిస యజమానులు - మత ప్రవక్తలు; జమీందారులు - రాజులు; కాపిటలిస్టులు-ఇంపీరియలిస్టులు ఆయా కాలాల్లో శ్రామికుల నుంచి గుంజిన శ్రమ విలువలో అధికభాగాన్ని తాము స్వంతం చేసుకుని కూడబెట్టుకొని తమ స్వంత ఖర్చులకు, దుబారాలకు, భోగలాలసతకు వినియోగించుకొనటం పరిపాటి అయినది. ఇది అనువాయిగా సంఘంలో జరుగుతూ వున్న అన్యాయం. ఇది నశించాలంటే సోషలిస్టు వ్యవస్థ రావటమే తరుణోపాయం. సోషలిస్టు వ్యవస్థలో కార్మిక నియంతృత్వం యేర్పడుతుంది. కార్మికులు అధికారం

చేపట్టగలరు. వారి శ్రమకు తగిన ఫలితం వారే అనుభవిస్తూ వుంటారు. దోపిడీ విధానం నశిస్తుంది. కనుక 'అదనపు విలువ' వుండటానికి ఆస్కారమే లేదని మార్క్సిజం చెప్పుతుంది.

సిద్ధాంతరీత్యా యీ వాదన బాగానే వున్నది. కాని ఆచరణలో అసాధ్యంగా తేలినది. మార్క్సిజం ప్రకారం, మార్క్సు సిద్ధాంతాల నాదర్శంగా పెట్టుకొనిన కమ్యూనిస్టు పార్టీ ఆధ్వర్యం క్రింద రష్యాలో శ్రామికరాజ్యం, సోషలిస్టు వ్యవస్థ యేర్పడ్డది. కాని ఎవరి శ్రమకు తగిన ఫలితాన్ని వారికి సరిగ్గా విలువకట్టి వేతనా లివ్వటం ఇంతవరకు సాధ్యపడలేదు. పరిపాలనా విధానానికి ప్రభుత్వం అవసరం. ప్రభుత్వం నడవటానికి సొమ్ము కావాలి. దీనిని ప్రభుత్వం ప్రజలనుంచి వసూలు చేస్తుంది. ప్రభుత్వం ఒకవేళ ప్రజలకు శ్రమకు తగ్గ వేతనాలు యివ్వగలిగినా పరిపాలనా యంత్రాంగానికి తిరిగి ఆ ప్రజలనుంచే కొంత సొమ్ము శిస్తుల రూపంలో వసూలు చేయటం వారి నుంచి 'అదనపు విలువ'ను సేకరించటమే గదా ? ఇది తిరిగి ప్రజలకొరకే వెచ్చించటం వలన యిందులో దోపిడీ విధానం లేదని వాదించ వచ్చును. పెట్టుబడిదారీ విధానంలో 'అదనపు విలువ'ను వ్యక్తులు తమ స్వంత బొక్కసంలో వేసుకుంటే సోషలిజంలో ప్రభుత్వ ఖజానా లోనికి చేరుతుంది. తేడా అంతే. కనుక దీనిని 'సోషలిస్టు ప్రభుత్వానికి' మారుగా 'స్టేట్ కాపిటలిజం'గా వర్ణించవలసి వుంటుంది.

'ఎవరి శ్రమకు తగిన ఫలితం వారికి ముట్టచెప్పాలి లేక ఎవరికి అవసర మయిన వనరులను, వసతులను, సుఖజీవన సాధనలను వారికి కలుగజేయాలి' అనేది కమ్యూనిజం అంతిమ లక్ష్యమయినప్పుడు అదనపు విలువను కూడపెట్టకుండా లేక అవసరమైనంతవరకే వుత్పత్తిని సాధించుకొనటంలో సంఘాభివృద్ధి, మానవాభ్యున్నతి వుండటానికి వీలులేదు. పశు, పక్ష్యాదులకు మానవునికున్న తేడా యిదే. మానవుడు తన అవసరాలకు మించిన వుత్పత్తిని సాధించగలుగుచున్నాడు. మిగులు వుత్పత్తి ద్వారా వివిధ రంగాలలో సమాజ అభివృద్ధికి అవసరమయిన వ్యవస్థలను నిర్మించుకొనగలుగుచున్నాడు. మానవుడు మానవుడుగా పరిపక్వం చెందినప్పటినుంచీ తాను జరుపుచున్న కృషి, కూడపెట్టుచున్న తన శ్రమ ఫలితం గానే నేటి దశకు రాగలిగాడు. శ్రమించిన కొలదీ, శ్రమలో అవసరాలకు పోను హెచ్చు శాతాన్ని మిగిల్చిన కొలదీ మానవ సమాజం అభ్యున్నతిపథంలో ముందుకు

పయనించటానికి అవకాశాలు కూడా పెరుగుతూనే వుంటవి. ఈ 'అదనపు శ్రమ' లేక 'అదనపు విలువ'ను 'సాంఘిక విలువ'గా మార్చి సంఘాభివృద్ధికి వినియోగించు కొనటానికి ప్రయత్నించాలి కాని దానిని దోపిడి విధానంగా భావించి అంతం చేయాలనుకొనటం అవివేకమని రాయ్ స్పష్టీకరించాడు. 'ఆర్థిక అవసరాలు' తీర్చుకొనటమే మానవ లక్ష్యం కాదు. మానవునిలోని స్వేచ్ఛాపిపాస, సత్యాన్వేషణ ప్రకృతి రహస్యాలను కనుగొనటానికి, అందుకు నిర్విరామ కృషి సలుపటానికి మానవుని ప్రేరేపణకు కారణభూతులవుచున్నవి. ఉన్నదానితో సరిపుచ్చుకుంటే వైజ్ఞానిక పరిశోధనకు, ఖగోళాన్ని అధిగమించి చంద్రమండల యాత్రలకు, విశ్వాన్వేషణకు మానవుడు పూనుకొనవలసిన అవసరం లేదు. కనుక అదనపు విలువను నిరసించటం, మానవుని అవసరాలను కమ్యూనిజం తీర్చగలదని చెప్పటం మానవుని 'ఆర్థిక వాదం'లో బంధించి ఆతని పురోగతిని అడ్డగించటమే అవుతుంది. పై సూత్రంలోని రెండవ భాగాన్ని అంగీకరించినా మొదటిది ప్రమాదాన్ని తెచ్చి పెట్టుతుంది.

## ఆర్థిక వాదం

మార్క్సు అదనపు విలువతోబాటు చరిత్రగతికి, సమాజాభివృద్ధికి, మానవుని భావాలకు సమాజంలో మారుచున్న వుత్పత్తి సాధనాలకు, ఆర్థిక పరిస్థితులకు ప్రత్యేక స్థానం యిచ్చి మానవ అభ్యున్నతికి, స్వాతంత్ర్య సాధనకు మానవుని ఆర్థికంగా సుఖజీవిని చేయటం తప్పనిసరిగా భావించాడు. ఇది యదార్థమే. మానవుడు తన నిత్యజీవితం కొరకు దైనందిన పోరాటం సాగించినంత కాలం ఆతనికి విశ్రాంతివుండదు. అతనిలో ఆలోచనాశక్తి పెంపొందటానికి, జ్ఞానం సంపాదించటానికి, చైతన్యవంతుడు కావటానికి అవకాశం లభించదు. కాని మార్క్సు 'ఆర్థిక వాదం' ఆచరణలో మానవుడు కేవలం ఆర్థిక జీవిగా, చరిత్ర గమనం, సంఘ గమనం కేవలం ఆర్థిక సూత్రాలమీదనే ఆధారపడివున్నట్లుగా పరిగణించబడినది.

మార్క్సు 'ఆర్థిక పరిస్థితులను' నిర్వచనం చేస్తూ మానవ సంఘం దైనందినం అనుభవించే ఆర్థిక జీవితాన్ని, సంఘంలో వొండొరుల మధ్య యేర్పరచు కొన్న జీవిత సంబంధ బాంధవ్యాలను సూచిస్తూ వీటన్నింటికీ వుత్పత్తి సాధనాలను ప్రధానంగా చూపించి సంఘంలోని వివిధ దశల పరిస్థితులు, భావాలు, సంస్కృతులు

తెలుసుకోనాలంటే ఆయా దశలలోని వుత్పత్తి సాధనాల ద్వారా గ్రహించ వచ్చునని సూచించాడు. దీనివలన మానవునికంటె మానవుడు వుత్పత్తి చేసిన సాధనాలకే అధిక ప్రాముఖ్యం యివ్వబడినది. పైగా మానవుడు నిర్మించిన వుత్పత్తి సాధనాలు, ఆర్థిక పరిస్థితులు మానవ సంస్కృతి మీద, భావాలమీద అధికారం వహించి మానవుని అస్వతంత్రునిగా, ఆర్థిక నియమబద్ధునిగా, స్వేచ్ఛారహితునిగా చేసినవి.

మార్క్సిజం మొత్తంలో వుత్పత్తి సాధనాలను గురించి, వాటి ప్రాముఖ్యాన్ని గురించి, వాటివలన మానవుడు పొందే ప్రభావాన్ని గురించి, భావ మార్పులను గురించి వ్రాసినంతగా మరే విషయం వ్రాయబడలేదు. ఒకసారి తనకు అవసరమయిన వుత్పత్తి సాధనాలను సృష్టించుకొన గలిగిన మానవుడు, అవి యిక పనికిరావని గ్రహించినప్పుడు వాటి స్థానంలో నూతన దశకు వుత్పత్తి సాధనాలను సృష్టించుకొనగల శక్తి అతనిలో వున్నది. మానవునిలో అట్టి స్వతంత్ర శక్తి వుండబట్టే విప్లవం ద్వారా సంఘాన్ని ఒక దశ నుంచి మరోదశకు తీసుకొని వెళ్ల గలుగుచున్నాడు. "ఉత్పత్తి సాధనాలను సృష్టించేది ఎవరు ? సృష్టికర్తకు సృష్టి మీద అధికారం వుంటుందా ? లేక సృష్టికి సృష్టికర్త మీద అధికారం వుంటుందా ?" అని రాయ్ సూటిగా ప్రశ్నించాడు. ఉత్పత్తి సాధనాలకే మార్క్సు ఎక్కువ ప్రాముఖ్యం యిచ్చి మానవుని ఆర్థిక సూత్రాలచే బంధించి మానవుని ఆర్థిక బానిసను చేశాడు. ఆర్థిక నియమం ప్రకారం చరిత్ర గతిని సిద్ధాంతీకరించాడు. మానవ స్వతంత్ర శక్తి, స్వతంత్ర భావోద్రేకత కిది గొడ్డలిపెట్టు.

## విప్లవం - సాయుధ తిరుగుబాటు

మార్క్సిజం ప్రకారం విప్లవం తప్పనిసరిగా జరుగుతుంది. పెట్టుబడి దారీ విధానం పెరిగిన కొలదీ కార్మికవర్గం కూడా పెరుగుతుంది. కార్మిక వర్గం రాను రాను బలవత్తరమై విప్లవం ద్వారా అధికారాన్ని చేపట్టుతుంది. పెట్టుబడిదారీ వర్గం తన వినాశనానికి తానే విషబీజాలను వృద్ధిచేసుకొంటుంది అని, ఆ వర్గ పతనం తప్పదని మార్క్సు తన కమ్యూనిస్టు మ్యానిఫెస్టోలో వెల్లడించాడు. కాని మానవ ప్రయత్నాని కిందులో ప్రాముఖ్యత యివ్వబడలేదు. అనివార్యంగా విప్లవం జరుగు తుందనే చూపబడ్డది.

రాయ్ విప్లవం అనివార్యంగా జరిగితీరుతుందని గాని లేక సంఘంలో జరిగే ప్రతి మార్పు మార్క్స్ సూచించినట్లు తప్పనిసరిగా అభివృద్ధిదాయకం కాగలదనే వాదాన్ని గాని అంగీకరించలేదు. సంఘాభివృద్ధికి విప్లవం అవసరమే. మార్క్స్ చెప్పినట్లుగా విప్లవం జయప్రదం కావటానికి అప్పటి పరిస్థితు లెంత అవసరమో, విప్లవ వుద్యమాన్ని నడిపే నాయకత్వం కూడా అంత అవసరమని రాయ్ అభిప్రాయం. కనుక వున్న పరిస్థితులతో బాటు సరియైన నాయకత్వానికి కూడా సమానమైన ప్రాముఖ్యత వున్నదని గ్రహించాలి.

మార్క్సిజం ప్రకారం పారిశ్రామికంగా బాగా అభివృద్ధిచెంది పెట్టుబడి దారీ వ్యవస్థలో అంతిమ ఘట్టానికి చేరుకొనిన జర్మనీ, ఇంగ్లండు లేక మరొక పాశ్చాత్యదేశంలో ముందుగా కార్మిక నియంతృత్వం, సోషలిజం రావలసివున్నది. జర్మనీలో సోషలిజానికి మారుగా ఫాసిజం వచ్చినది. కాగా ఐరోపా ఖండంలో అన్నిటికంటె పారిశ్రామికంగా వెనుకబడివుండి జమీందారీ విధానంలో వున్న రష్యాలో విప్లవం నెగ్గినది. రష్యాలో కార్మిక వర్గం అభివృద్ధిచెంది సోషలిజానికి అనుకూలమయిన పరిస్థితులు లేకపోయినా లెనిన్ తన మేధాశక్తితో మైనారిటీలో వున్నా విప్లవం జయప్రదం చేయగలిగాడు. జర్మనీలో రోజాలగ్జంబర్గులాంటివారు నాయకత్వం వహించారు. పైగా సోషలిజానికి అనుకూలమైన పరిస్థితులు వున్నవి. కాని విప్లవ వర్గ మనుకొనిన కార్మిక వర్గం విప్లవ పాత్ర నిర్వహించకపోవటంచేత విప్లవం నాశనమయినది. కాబట్టి విప్లవం తప్పనిసరి అనిగాని, ఫలానా పరిస్థితులు వుండాలని గాని, ఫలానా దేశంలో ఫలానా విధంగా వస్తుందని గాని, కార్మికులు ఖచ్చితంగా విప్లవ పాత్ర వహిస్తారని గాని ముందుగా నిర్దేశించుకొని వూహించు కొనటం పొరపాటు.

కార్మిక నియంతృత్వానికి 'సాయుధ తిరుగుబాటు' ఒక సాధనంగా మార్క్స్ సూచించాడు. అధికారంలో వున్న ప్రభుత్వం తన అధికారాన్ని తేలిగ్గా వదలుకొనదు. కనుక సాయుధ తిరుగుబాటు అవసరం. మార్క్స్ వంద సంవత్స రాల క్రితం పందొమ్మిదవ శతాబ్దంలో చెప్పిన సూత్రాన్ని ఇరవయ్యో శతాబ్దంలో సైనికబలంతో, మారణ ఆయుధాలతో అధికారాన్ని సుస్థిరం చేసుకుంటున్న ప్రభుత్వాలను యే కొలదిమంది వ్యక్తులు పరిమిత ఆయుధ బలంతో కూలద్రోయటం అసంభవం. కాలం గడచిన కొలదీ ప్రతి ప్రభుత్వం కూడా తన సైనిక బలాన్ని

అన్నివిధాల పెంపొందించుకొంటున్నది. మార్క్సిస్టు సిద్ధాంతం ప్రకారం పెట్టుబడిదారీ ప్రభుత్వాలు పతనం చెందకిపోగా బలవత్తరం కాసాగినవి. కనుక రాయ్ 'సాయుధ తిరుగుబాటు' మీద ఆధారపడినందు వలన ప్రయోజనం లేదని విప్లవం సాధించటానికి ప్రజలలో రాజకీయ చైతన్యం కలిగించి ప్రజలను సమీకరించి రాజ్యాంగ పద్ధతుల ద్వారా 'అంగీకార సూత్రం'తో లేక వున్న ప్రభుత్వం మీద వత్తిడులు తెచ్చి నూతన వ్యవస్థకు అవసరమయిన ప్రాతిపదికను నిర్మించటమే ప్రస్తుత పరిస్థితులలో సరియైన మార్గంగా సూచించాడు. ఒకవేళ యే కొద్దిమంది సుశిక్షితులయిన వ్యక్తులు ఏ దేశంలో నయినా సాయుధ తిరుగుబాటుతో వున్న ప్రభుత్వాన్ని కూలద్రోయ గలిగినా ఫలితం శూన్యమే. ప్రభుత్వం మారటం తప్ప అది ప్రజలతో సంబంధంలేని ప్రభుత్వంగానే వుంటుంది. ప్రజల్లో ముందుగా చైతన్యం కలిగించి వారి మద్దతుతో ఏర్పడిన ప్రభుత్వానికీ, ప్రజల మద్దతులేని ప్రభుత్వానికీ తేడా వుండనే వుంటుంది. ప్రజలతో సంబంధాలులేని ప్రభుత్వం ప్రజల ఆశయాలను తీర్చలేదు. దీనికి ఉదాహరణగా ప్రస్తుతం బంగ్లా, వియత్నాం మొదలయిన దేశాలలో జరిగిన సాయుధ తిరుగుబాటులను తీసికొనవచ్చును.

## రాజ్యం (రాజ్యాంగ యంత్రం)

రాజ్యం లేక రాజ్యాంగ యంత్రం అధికారంలో వున్న వర్గానికి తన అధికారం నిలబెట్టుకొనటానికి ఒక సాధనం అని, కమ్యూనిజంలో యీ అవసరం వుండదు కనుక రాజ్యాంగ యంత్రం (స్టేట్) దానంతటదే క్షీణించి అంతరించ గలదని మార్క్సిజం చెప్పుతుంది. రష్యా విప్లవం జరిగి ఇప్పటికి అరవై సంవత్సరాలు దాటినా అచ్చటి రాజ్యాంగ యంత్రంలో ఏ మాత్రం సడలింపు కనబడటంలేదు సరిగదా వున్నకొలదీ అచ్చటి ప్రభుత్వం తన చుట్టూ వున్న పెట్టుబడిదారీ వర్గ ప్రభుత్వ దోబూచులను చూపి సైనిక శక్తిని పెంచుకుంటూ అష్టదిగ్బంధంగా రూపొందుచున్నది. రాజ్యాంగ యంత్రం క్షీణించటంగాని లేక అంతరించటంగాని భవిష్యత్తులో జరుగవచ్చునని అనుకోవటం కూడా పొరపాటే.

మానవుడు సంఘంగా ఏర్పడినప్పటినుంచీ తన హక్కుల పరిరక్షణ కొరకు ఒక రాజకీయ వ్యవస్థను యేర్పరచుకొనటానికి ప్రయత్నిస్తూనే వచ్చాడు. ఇదే రాజ్యంగా చలామణి అవుతూ వచ్చినది. ప్రాచీన కాలంలో పంచాయితీ రాజ్యం

లేక గణతంత్రరాజ్యం లేక రిపబ్లిక్‌గా నాగరికత చెందిన దేశాల్లో వివిధరూపాల్లో యీ వ్యవస్థ రూపొందించబడినట్లు చరిత్ర వలన తెలుస్తుంది. సంఘం పెరిగిన కొలదీ, జాతి సరిహద్దులు విస్తరించిన కొలదీ యీ రాజ్యంలో కూడా మార్పులు జరిగినా ఇది మాత్రం అంతరించక సజీవంగానే వుంటూ వచ్చినది.

ప్రస్తుత మిది (1) పరిపాలనా విభాగమైన పాలక వర్గం, (2) ప్రజా ప్రతినిధులకు సంబంధించిన అసెంబ్లీ లేక పార్లమెంటరీ వ్యవస్థ, (3) న్యాయ విభాగంగా విభజింపబడి మానవ హక్కుల పరిరక్షణకు ఆలవాలమై యున్నది.

కనుక సంఘం వున్నంత కాలం యీ హక్కుల పరిరక్షణకు రాజ్యం కూడా అవసరమే. కనుక కమ్యూనిజంలో రాజ్యం వాడిపోతుందని గాని లేక అంత రించి పోతుందని గాని వూహించటం అవివేకమే అవుతుంది.

సమాజంలో సమాజ అభివృద్ధికొరకు ఇతర వ్యవస్థలు యెంత అవసరమో రాజ్యాంగ వ్యవస్థ (రాజ్యం) కూడా అంత అవసరమే. అయితే ఆచరణలో అది అధికారంలో వున్న వర్గం లేక పలుకుబడికొరకు సాధనంగా వినియోగించుకొనటంచేత సమాజంలో అవ్యవస్థత యేర్పడి ఆందోళనకు కారణ భూతమగుచున్నది. మానవ అభివృద్ధికి రాజకీయ, ఆర్థిక స్వాతంత్ర్యాలు రెండూ అవసరమే. ఆర్థిక సమానత్వంలేని (పెట్టుబడిదారీ దేశాలు) రాజకీయ స్వాతంత్ర్యం నిరుపయోగమైనట్లే రాజకీయ స్వాతంత్రంలేని (కమ్యూనిస్టు దేశాలు) ఆర్థిక సమానత్వం కూడా అంతే. ఇవి రెండూ, ఒకే బండికి రెండు చక్రాల వంటివి. సంఘాభివృద్ధికి ఇవి రెండూ సమానంగా దొర్లినప్పుడే సమాజం ముందుకు సాగ గలుగుతుంది. మానవ పురోగతికి 'సమాజం' సాధన అయినట్లు రాజ్యాంగ వ్యవస్థ కూడా సాధన మాత్రమే నని గ్రహించి దానిని అనుకూలమయిన పద్ధతుల్లో మలచుకొనాలి.

## కమ్యూనిజం

కమ్యూనిజంలో, కమ్యూనిస్టు వ్యవస్థలో సమాజం నిరాటంకంగా అభివృద్ధి పథం చేపట్టి ముందుకు సాగగలదని మార్క్సిజం చెప్పినది. కాని ఆచరణలో ఆ సూచనలు కనబడకపోగా సమాజాన్ని, సమాజంలోని వ్యక్తులను వర్గం పేరుతో, పార్టీ పేరుతో, నోరు మెదల్చటానికి కూడా వీలులేకుండా చేసి

ప్రశ్నించినవారిని 'దేశ ద్రోహులుగా, విప్లవ ద్రోహులుగా, సంఘ ద్రోహులుగా' చిత్రించి నానా వ్యథలకు గురిచేయటం పరిపాటి అయినది. వ్యక్తి స్వేచ్ఛకు, వ్యక్తి స్వాతంత్ర్యానికి, వ్యక్తి భావాలకు, వ్యక్తి ఆశయాలకు ఏ మాత్రం విలువ కనబడటంలేదు. ఫాసిజం జాతిపేర మానవుని దాస్యంలో, అజ్ఞానంలో అట్టిపెట్ట టానికి ప్రయత్నించగా కమ్యూనిజం వర్గంపేర వ్యక్తి స్వాతంత్ర్యాన్ని అరికట్టు తుంది. వర్గ దృష్టితో మానవుడు, మానవ విలువలు బలి చేయబడుచున్నవి. తమ లక్ష్య సాధన కొరకు ఇవి చేబట్టిన మార్గాలు భిన్నమయినా రెంటి గమ్యస్థానం వొక్కటే. ఒకటి అధికారం హస్తగతం చేసుకొనటానికి హింసా పద్ధతులను ముందుగా చేపట్టి తరువాత అధికారాన్ని సుస్థిరం చేసుకొనటానికి ప్రయత్నించగా రెండవది అధికారం చేపట్టిన తరువాత తన హింసాకాండను ఇనుమడింప చేసినది. రెంటికీ మారణ హోమం, దమన నీతి సమాన లక్ష్య సాధనాలు. రెండూ సమవుజ్జీగా ప్రపంచాధిపత్యం కొరకు పెనగులాడుచున్నవి. లక్ష్యం వుత్కృష్టమయినదిగా భావించినప్పుడు సాధన కూడా ఉత్కృష్టమయినదిగానే వుండాలి. స్వాతంత్ర్యం పరమలక్ష్యంగా భావించినప్పుడు స్వాతంత్ర్యసాధన దానికి వ్యతిరేకం కారాదు. శూన్యం నుంచి ఆశించినదేదీ వుద్భవించదు. వినాశనం నుంచి స్వర్గం పుట్టి పడదు. సాధనను బట్టియే సిద్ధి కూడా వుంటుంది.

మానవ స్వాతంత్ర్యానికి మార్క్సిజమ్ శరణ్యమనుకొనిన యమ్. యన్. రాయ్ తన విప్లవ జీవితంతో, అనుభవంతో దానిని శోధించి, పరిశోధించి అందలి అవకతవకలను గుర్తించి వాటిని సరిచేసి సరిక్రొత్త రూపులను దిద్ది అదే పంథాలో మానవ సమాజ అభివృద్ధికి, మానవ స్వాతంత్ర్యానికి రాజకీయ, ఆర్థిక, మానసిక వికాసాలకు తోడ్పడగల హేతుబద్ధమయిన, నైతిక విలువలుగల వ్యక్తి స్వేచ్ఛకు ప్రాధాన్యత యిచ్చి 'నవ్య మానవవాద సిద్ధాంతాన్ని' రూపొందించటానికి ప్రయత్నించాడు. ఈ ప్రయత్నం మార్క్స తరువాత మార్క్సిజాన్ని కాదని చేయటానికి సాహసించినది యమ్. యన్. రాయ్ వొక్కడే. మానవ సంకల్పానికి, మనో నిశ్చయానికి అగ్రతాంబూలం యిచ్చాడు. మానవ స్వేచ్ఛకు, వ్యక్తి స్వాతంత్ర్యానికి ఉత్కృష్ట స్థానం యివ్వాలని బోధించాడు. దీని యుక్తాయుక్తము లను నిర్ణయించవలసినది ప్రపంచ మేధావులు, స్వేచ్ఛా స్వాతంత్ర్య ప్రియులు, భావి చరిత్రకారులు మాత్రమే.

# పార్టీ ప్రభుత్వాలు :

జాతీయవాదాన్ని పరిత్యజించి మార్క్సిస్టుగా అంతర్జాతీయ వాదం చేపట్టిన రాయ్‌కి మార్క్సిజం సూచించిన కమ్యూనిజం ఆశించినంతగా సమాజ అభివృద్ధికి తోడ్పడకపోగా ఫాసిజాన్ని తలదన్నిన నిరంకుశ ప్రభుత్వాన్ని, నియంతృత్వాన్ని స్థాపించటంతో అసలు మార్క్సిజంలోనే సిద్ధాంతరీత్యా లోపం వుందని గ్రహించాడు. కార్మిక విప్లవం పేరుతో 'ప్రోలిటేరియన్ నియంతృత్వం' స్థాపించబడుతుందని, అది తాత్కాలికమేనని చెప్పబడినా ఆచరణలో కమ్యూనిస్టు పార్టీ, పార్టీ పేరుతో ఒక కార్యనిర్వాహక సంఘం - ఆ సంఘం పేరుతో ఒకే ఒక వ్యక్తి నియంతగా, నిరంకుశునిగా సర్వఅధికారాలు హస్తగతం చేసుకొని దేశాన్ని పరిపాలించటం, సమాజాన్ని తీర్చిదిద్దటానికి అధిపత్యం వహించటం ప్రజల శ్రేయస్సుకు, ప్రజా స్వామ్యానికే భంగకరం. 'ప్రజా ప్రభుత్వం' అంటే చలామణిలో వున్న అర్థం ప్రకారం ప్రజల కొరకు, ప్రజల యొక్క, ప్రజలచేత ఏర్పడే ప్రభుత్వం. అట్టి ప్రభుత్వానికి ఒక పార్టీ పేరుతో ఒక నియంత సర్వం సహాధికారాన్ని చేపట్టటం స్వాతంత్ర్య సూత్రాలకే విరుద్ధం. మార్క్సిజం ప్రకారం సోవియటు రష్యాలో స్థిరపడిన ప్రభుత్వం వాస్తవానికి స్టాలిన్ లేక కమ్యూనిస్టు పార్టీ ప్రభుత్వం మాత్రమే. ప్రజా ప్రభుత్వం మాత్రం కాదు. మార్క్సిజంలో వున్న లోపమే రష్యా ప్రభుత్వంలో సహజంగా ప్రతిబింబించినది. దానిని సరిదిద్దటం అసంభవం. మార్క్సిజం - ప్రజాస్వామ్యం ఒకదానితో మరొకటి యిముడలేవని చరిత్ర రుజువు చేసినది.

వర్గ దృష్టితో సమాజాన్ని విడదీయటం వలన సమాజం అనేక ప్రమాదాలకు గురికాక తప్పదు. ఒక వర్గ రక్షణ మిగిలిన వర్గాల భక్షణకు దారితీస్తుంది. అంతేకాదు ఆచరణలో ఆ ప్రత్యేక వర్గ రక్షణ కూడా అనుమానాస్పదమే. సమాజం అంటే అందలి వ్యక్తుల కలయిక అని గుర్తించటం అవసరం. ఈ సత్యాన్ని గుర్తించినప్పుడు సమిష్టి వాదం (కమ్యూనిజం) పేరుతో సంఘాన్ని చీలదీసి వ్యక్తి మనుగడను కాదని వర్గ శ్రేయస్సుకు ప్రాధాన్యత నివ్వటం విప్లవ పంథా కాదని స్పష్టం అవుతుంది. కనుక రాయ్ వర్గ రహితమే కాకుండా పార్టీ రహిత ప్రభుత్వం యేర్పడటం అవసరంగా భావించాడు.

అధికారం హస్తగతం చేసుకొనటానికి మితవాద - అతివాద పార్టీలన్నీ ఎన్నికల సమయంలో ప్రజలను సమీకరించి వారి మద్దతును, వోట్లను పొందటానికి రకరకాల వాగ్దానాలు చేస్తూ వుంటవి. కాని అధికారం చేపట్టగానే తమ అధికారాన్ని సుస్థిరం చేసుకొనటానికి నిమగ్నమై ప్రజల కిచ్చిన వాగ్దానాలు మరచిపోవటం కద్దు. వివిధ దేశాలలోని అనుభవం, పార్టీల చరిత్ర ఇందుకు తగినంత ఆధారాన్ని చూపగలవు. కాగా అధికారంలో వున్న పార్టీ (ప్రభుత్వం) ప్రతిపక్షాల, ప్రజల విమర్శనలను ఖాతరు చేయక ప్రజాసమస్యల కంటె తమ పార్టీ బలాన్ని పెంచుకొనటంలోనే హెచ్చు కాలాన్ని గడుపుతూ రాబోయే ఎన్నికలకు తిరిగి సిద్ధపడుతూ వుండటం సహజంగా జరుగుచున్నది.

ఒకవేళ అధికారంలో వున్న పార్టీ తన వాగ్దానాలు నెరవేర్చటానికి సిద్ధపడినా ఆ నిర్ణీతకాలంలో అంటే తిరిగి ఎన్నికలు జరిగేలోగా వాటిని నెరవేర్చటం అసాధ్యం. నిజమైన ప్రజాస్వామ్య లక్షణం ప్రజలను వైజ్ఞానిక, సాంస్కృతిక రంగాలలో పై స్థాయికి చేర్చి వారిని వివేకవంతులుగా, ఉత్తమ పౌరులుగా తీర్చిదిద్దటం. అలాజరిగితే పార్టీ మనుగడకు, అధికార స్థిరత్వానికి ముప్పు ఏర్పడక తప్పదు. కనుక అధికారం చేపట్టిన ప్రతి పార్టీ ప్రజలను అంధవిశ్వాసాలలో, మూఢాచారాలతో అట్టిపెట్టి తన మనుగడను, అధికారాన్ని నిరవధికంగా కొనసాగించటానికి ప్రయత్నిస్తూ వుంటుంది. పైగా ప్రజలు తమ వోటు హక్కు ద్వారా తమ సార్వభౌమ అధికారాన్ని పార్టీ ప్రతినిధులకు ధారాదత్తంచేసి తాము నిర్వీర్యులగుచున్నారు.

సాధారణంగా ప్రతిదేశంలోనూ ఎన్నికలు నాలుగు లేక ఐదు సంవత్సరాలకొక పర్యాయం జరుగుతూ వుంటవి. ఎన్నికలలో పోటీచేసే వ్యక్తుల నీతి - నిజాయితీలను బట్టిగాక పార్టీ వాగ్దానాల మీద, పార్టీ ప్రచారం మీద, పలుకుబడి మీద ఆధారపడి ప్రజలు వోట్లు వేస్తూ వుంటారు. అంతవరకే వారి బాధ్యత. తిరిగి ఎన్నికలు వచ్చేవరకు గెలుపొందిన పార్టీ లేక పార్టీ ప్రతినిధులు ప్రజలచే ఎన్నుకొనబడినా ప్రజాప్రతినిధులుగా వ్యవహరించరు. ప్రజల దగ్గరకు వీరు వెళ్ళవలసిన అవసరంలేదు. ప్రజలకు వీరిని ప్రశ్నించే హక్కులేదు. ఎన్నికల మధ్యకాలంలో అధికారం చేపట్టిన పార్టీ ఏదో వొక రూపంలో తన సుస్థిరత కొరకు నియంతృత్వ విధానాలను కొనసాగించటం వినా ప్రజాస్వామ్య పద్ధతులలో ప్రజల భావాలను,

అవసరాలను గుర్తెరిగి ప్రజల సమస్యలను పరిష్కరించటానికి స్వార్థరహిత ప్రయత్నాలు చేయజాలదు. సమాజంలో అట్టి ప్రభుత్వం ద్వారా తాత్కాలికంగా కొంత అభివృద్ధి కనబడవచ్చు. కాని అది పార్టీ దృష్టితో, వర్గ దృష్టితో వుండి మొత్తం ప్రజానీకానికి మేలుచేకూర్చగలవి తక్కువ మోతాదులోనే వుండగలవు.

పార్టీ రాజకీయాలు, వర్గ రాజకీయాలు ఏ రూపంలో వున్నా, ఎంత ఆదర్శవంతంగా వున్నా ఆచరణలో సంకుచిత, స్వార్థ, నిరంకుశ రాజకీయాలు కాక తప్పదు. పార్టీలో క్రమశిక్షణ పెరిగిన కొలదీ ప్రజాస్వామ్యం కుదింపబడుతూ వుంటుంది. పార్టీల ద్వారా ఎన్నుకొనబడిన ప్రతినిధులు ప్రజల వోట్ల ద్వారా గెలిచినా పార్టీలకే వినయవిధేయులయి ప్రజల సమస్యలను మరచిపోయి పార్టీ క్రమ శిక్షణకు లోబడి అస్వతంత్రులుగా వ్యవహరించక తప్పదు. పార్లమెంటరీ ప్రజాస్వామ్య ప్రభుత్వాలలో ప్రతినిధులకు నామమాత్రంగా కొలది స్వాతంత్ర్యం వున్నా నిరంకుశ ప్రభుత్వాలలో అసలు మచ్చుకయినా అది కనబడదు.

కనుక ప్రజల కొరకు ప్రజా ప్రతినిధుల పేరుతో యేర్పడే ప్రభుత్వాలు ప్రజా ప్రభుత్వాలు కాక పార్టీ ప్రభుత్వాలుగా వ్యవహరిస్తూ వుండటంచేతనే ప్రజల మంచిచెడ్డలను విచారించి తదనుకూల కార్య విధానాన్ని రూపొందించటంలో విఫలం అవుతూ వున్నవి. ప్రజా స్వామ్యం వర్ధిల్లాలంటే ప్రజల కొరకు కాక ప్రజల చేత, ప్రజల యొక్క ప్రభుత్వం స్థాపించబడాలి. ఇందుకు పార్టీలు ఆటంకదాయకం. ఈ నిర్ణయానికి రావటంచేత రాయ్ తాను నిర్మించి పెంచి పెద్దచేసిన రాడికల్ డెమోక్రాటిక్ పార్టీని ఆదర్శవంతంగా రద్దుచేయాలని సంకల్పించాడు. 1946 లో బొంబేలో పార్టీ సమావేశంలో యిది కూలంకషంగా చర్చించబడినది. తరువాత 1948 లో కలకత్తాలో సమావేశమయి అసలు పార్టీయే రద్దు చేయబడినది.

రాడికల్ డెమోక్రాటిక్ పార్టీ, పార్టీ రూపంలోకాక ప్రజలలో తత్వ శాస్త్రజ్ఞునిగా, స్నేహపాత్రునిగా, మార్గదర్శిగా మెలగాలనే నిర్ణయానికి రావటం జరిగినది.

ఇది నిజంగా కడు సాహసోపేతమయిన కార్యం. తన చేతులతో పెంచి పెద్దచేసిన బిడ్డను ఎవరూ చేతులారా విసర్జించరు. పార్టీ సభ్యులకు, కార్యకర్తలకు ఇది అశనిపాతం. దిక్కుతోచని పరిస్థితి. దేశం నలుమూలలా విస్తరించియున్న

పార్టీ సభ్యులు ఒకచోట సమావేశమయి ఆదర్శ లక్ష్య సాధనకు తరుణోపాయం కనుగొనటానికి చర్చావేదికగా వున్న పార్టీని రద్దు చేయటంలో కొందరు వ్యతిరే కించక పోలేదు.

"నిజంగా యిది జీవన్మరణ సమస్యలాంటిదే. పార్టీ మీద మమకారం వుండటం సహజమే. కాని మమకారం ప్రజా సేవ కాజాలదు. మీరు ఉత్తమ ప్రజా సేవకులు కావాలంటే మీ ఆదర్శాలను ఒక వుద్యమంగా రూపొందించండి. ఇప్పుడు మీరు స్వతంత్ర జీవులు. పార్టీ క్రమశిక్షణ, పార్టీ ప్రతిబంధకం, పార్టీ అదుపులు - ఆజ్ఞలు - అవరోధాలు మీకు లేవు. గౌతమబుద్ధుడు, జీసస్ క్రీస్తు వంటి ప్రవక్తలు పార్టీల ప్రమేయం లేకుండానే తమ ఆదర్శాలను ప్రపంచం నలుమూలలా విస్తరింప చేయగలిగారు. వారికి కావలసినది అధికారం కాదు. ఆదర్శం సఫలీకృతం కావటమే. మనం కూడా నిజంగా ప్రజాసేవకులం కావటానికి అధికారం చేపట్టటం ప్రథమ సాధనంగా భావించనక్కర్లేదు. అధికారం లేకుండానే మన ఆదర్శాలను ప్రజలలో వ్యాప్తి చెందించి వారే తమ రాజకీయ వ్యవస్థను నిర్మించుకొనగల చైతన్యవంతులుగా రూపొందించటమే మన విద్యుక్తధర్మంగా భావించాలి.... ఒకవేళ మీరు పార్టీ ద్వారానే యీ ఆదర్శం నెరవేర్చదలిచి పార్టీ మీద మమకారంతో పార్టీని రద్దుచేయటానికి యిష్టపడకపోతే మీరు పార్టీని నడుపుకొన వచ్చును. కాని యమ్. యన్. రాయ్ ఇందులోనుంచి బయటపడి తన కృషిని కొనసాగించుకొనటానికి స్వేచ్ఛ నివ్వండి"అని రాయ్ కలకత్తా సమావేశంలో పార్టీ ప్రతినిధులను అభ్యర్థించాడు.

రాడికల్ డెమోక్రాటిక్ పార్టీ రద్దు కావటంతో పార్టీలోని అనేకమంది కార్యకర్తలతోబాటు కొంతమంది నాయకులు కూడా ఇది ఒకవిధమయిన 'షాక్'గా భావించారు. "నిజంగా యిది 'షాక్' వంటిదే. 'షాక్' ప్రయోగం ద్వారా మానసికంగా మీలో వున్న అనారోగ్యాన్ని పోగొట్టదలచాను" అని రాయ్ సమాధానం చెప్పాడు. రాయ్ 'రాజకీయ అస్త్రసన్యాసం' చేశాడని, ఇది ఆయన రాజకీయ విఫలతకు వుదాహరణ అని యితరులు, యితర పార్టీ నాయకులు భావించారు. కాని రాయ్ వెనుకంజ వేయలేదు. అస్త్రసన్యాసం చేయలేదు. విరాగి కాలేదు. విశ్రాంతి తీసుకొనలేదు. కమ్యూనిజం మానవ శ్రేయస్సుకు అంతిమ సాధనం కాదనే నిర్ణయానికి వచ్చి అంతకంటె భిన్నమయిన, ఉత్తమమయిన సాధనకు అన్వేషణ సాగించాడు.

# యుద్ధానంతర ప్రపంచం :

రాయ్ రాడికల్ డెమోక్రాటిక్ పార్టీని రద్దుచేసి పార్టీ రాజకీయాలకు స్వస్తి పలికినా జాతీయ, అంతర్జాతీయ రాజకీయాలలో తన ఆసక్తిని ఏమాత్రం తగ్గించుకొనలేదు. యుద్ధానంతర ప్రపంచ పరిస్థితులను గురించి, అమెరికా, రష్యాలు ప్రపంచాధిపత్యం కొరకు జరిపే కుట్రలు, కుతంత్రాల గురించి, ప్రచ్ఛన్న యుద్ధం గురించి తన అభిప్రాయాలను వ్యక్తం చేస్తూ అనేక పత్రికలలో వ్యాసాలు ప్రకటించాడు.

ప్రచ్ఛన్న యుద్ధం రాయ్‌ని ఎంతో చికాకు పరచినది. రాయ్ మార్క్సిస్టుగా, కమ్యూనిస్టుగా యున్నంతకాలం అమెరికా, రష్యా దేశాల మధ్య విరోధాన్ని వ్యతిరేక శక్తుల మధ్య జరిగే పోరాటంగా వూహించి రష్యాను సమర్థించాడు. కాని యుద్ధానంతరం రష్యా చేపట్టిన విధానం ప్రజాస్వామిక శక్తులకు గొడ్డలిపెట్టు అయి ప్రచ్ఛన్న యుద్ధం ఒక మహామారిగా అవతరించినది. ఈ ప్రచ్ఛన్న యుద్ధం ప్రత్యక్ష యుద్ధంగా మారితే అణ్వస్త్రాల ప్రయోగంతో మొత్తం మానవ నాగరికతే నామ రూపాలు లేకుండా సర్వనాశనం కాగల ప్రమాదం వుందని గుర్తించిన వారిలో రాయ్ వొకరు. కనుక అట్టి ప్రమాదాన్ని నివారించటానికి మానవ శక్యమయిన ప్రయత్నాలన్నీ చేయాలని రాయ్ నాగరిక ప్రపంచానికి విజ్ఞప్తి చేశాడు.

"ప్రపంచంలోని వివిధదేశాలకు ఒక ప్రక్క అమెరికా మరో ప్రక్క రష్యా నాయకత్వం వహించి యీ ప్రచ్ఛన్న యుద్ధాన్ని సాగిస్తున్నవి. ఇందులో మెరుగు, తరుగులను చూడవలసివచ్చినప్పుడు రష్యా కూటమి కంటె అమెరికా కూటాన్నే సమర్థించవలసి వుంటుంది. నియంతృత్వం ఏ రూపంలో వున్నా నియంతృత్వమే. మానవ స్వాతంత్ర్యాన్ని మంట కలుపుతుంది. ప్రజాస్వామ్యాన్ని కూకటివ్రేళ్లతో పెకలించి వేస్తుంది. ఆర్థిక సమానత్వం కొరకు పోరాడినా మానవుని మానసికంగా బానిసను చేసివేస్తుంది. మానవుడు శారీరకంగా అభివృద్ధి చెందటం ప్రధానం కాదు. మానసికంగా కూడా అభివృద్ధి చెందగలిగినప్పుడే సర్వ స్వతంత్రుడు కాగలుగుచున్నాడు. నియంతృత్వ విధానం దీనికి ఏమాత్రం వుపకరించకపోగా వ్యతిరేక విధానాన్ని చేపట్టినది. లోపభూయిష్టమయినా కాపిటలిస్టు

దేశాల్లో ప్రజాస్వామ్యం నామమాత్రంగానైనా గుర్తించబడినది. అయితే అంత మాత్రంచేత కాపిటలిజాన్ని సమర్థించమని భావించరాదు. స్వేచ్ఛావాదులు, స్వాతంత్ర్యప్రియులు కోరుకొనవలసినది కాపిటలిజం లేక కమ్యూనిజం కాదు. ప్రజా స్వామ్యమా లేక నియంతృత్వమా, స్వాతంత్ర్యమా లేక బానిసత్వమా" అని రాయ్ స్వేచ్ఛావాదిగా ప్రపంచ మానవాళిని హెచ్చరించాడు.

కమ్యూనిజాన్ని అరికట్టవలసిన అవసరం ఎంతైనా వున్నది. అమెరికను ప్రజాస్వామ్య విధానం అంతకంటె తక్కువ హానికరమయినదే. అంతమాత్రంచేత అమెరికా విధానాన్నిగానీ, అమెరికా కూటమినిగానీ రాయ్ బలపరచలేదు. సమ ర్థించనూలేదు. 'తక్కువ హానికరమయిన దానిని ఎన్నుకొనినందువలన ప్రస్తుత సమస్య పరిష్కారం కాదని' రాయ్ బాహాటంగానే వెల్లడించాడు.

కమ్యూనిజాన్ని అరికట్టే ప్రయత్నంలో అమెరికా ప్రధానంగా సైనిక శక్తిని, మిలిటరీ విధానాన్ని చేపట్టినది. ఇందుకు అనుగుణంగా అమెరికా సింగ్ మెన్‌రీ (దక్షిణ కొరియా), జనరల్ చియాంగ్-కై-షేక్, పర్షియారాజు, అరబ్ నియంతలు, జనరల్ ఫ్రాంకో, చివరిదశలో ఇజ్రేయిల్, దక్షిణ వియత్నాం ప్రభుత్వాలతో సైనిక సంధులు చేసికొన్నది. అదేవిధంగా జపాను, జర్మనీలతోకూడా సంధి వొడంబడికలు చేసుకున్నది. అమెరికా అనుసరించిన యీ మిలిటరీ విధానం కమ్యూనిజాన్ని అరికట్టటానికి మారుగా మారణాస్త్రాల వుత్పత్తికి, యుద్ధ వాతావరణాన్ని, యుద్ధోన్మాదాన్ని ప్రబలం చేయటానికి కారణభూత మయినది. ప్రజాస్వామ్య శక్తులను సంఘటితం చేయటానికి మారుగా సంకుచిత పరచటానికి వుపకరించినది.

"అమెరికా కమ్యూనిజాన్ని అరికట్టటానికి, ప్రజాస్వామ్య శక్తులకు నాయకత్వం వహించటానికి మారుగా కేవలం కమ్యూనిస్టు వ్యతిరేక శక్తులను సంఘటితపరచి సైనికంగా అభివృద్ధి పరచినందువలన ప్రయోజనం లేదు. కేవలం కమ్యూనిస్టు వ్యతిరేకత ఫాసిజాన్ని బలపరచటమే. కాగా ఐరోపా ఖండంలోని ప్రజాస్వామ్య దేశాలను దూరం చేసుకొనటం జరుగుతుంది.... 'బలహీన దేశాలకు సహాయపడటం' అనే ట్రూమన్ విధానం ప్రపంచంలో శాంతి స్థాపనకు మారుగా యుద్ధోన్మాదాన్ని పెంచటానికి వుపకరించినది. ఎవరి అంతరంగిక వ్యవహారాలు చక్కబెట్టుకొనటానికి వారికి అవకాశం యిస్తే ప్రపంచంలో శాంతి స్థాపన త్వరలో

జరుగుతుంది." అని రాయ్ అమెరికాను గురించి వ్రాశాడు. రష్యను కమ్యూనిజం కంటె అమెరికను ప్రజాస్వామ్యం గ్రుడ్డిలో మెల్లగా రాయ్ భావించినా అమెరికా విదేశాంగ విధానాన్ని రాయ్ తీవ్రంగా విమర్శించాడు. విదేశాంగ విధానాల్లో అమెరికా కంటె రష్యా విధానమే రాయ్ దృష్టిలో కొంత మెరుగుగా కనబడినది. రష్యాకు కమ్యూనిజం విస్తరింప చేయాలనే కాంక్ష వినా మరో యుద్ధాన్ని ప్రజ్వలింప చేయాలనే సంకల్పంలేదు. అమెరికా ప్రాబల్యాన్ని ముఖ్యంగా ఐరోపా ఖండంలో లేకుండా చేయటమే. అందుకు యుద్ధం కంటె శాంతి ద్వారానే ఆ కార్యాన్ని సాధించటానికి రష్యా పూనుకున్నది.

కమ్యూనిజాన్ని అరికట్టటానికి మిలిటరీ విధానం సరియైన మార్గం కాదు. ప్రజాస్వామ్య శక్తులను, భావాలను, వ్యవస్థలను, మానవ విలువలను బలపర్చాలి. ఐరోపా ఖండంలో ప్రజాస్వామ్య వ్యవస్థలు, భావాలు ప్రబలం కావటం చేతనే అక్కడ కమ్యూనిజం కాలూనలేక పోయినది. మార్క్సిజం ప్రకారం అభివృద్ధి చెందిన దేశాల్లో కాక అభివృద్ధి చెందని దేశాలే కమ్యూనిస్టు విస్తరణకు అనుకూలంగా వున్నవని చరిత్ర రుజువు చేసినది. రష్యా తరువాత చైనాలో కమ్యూనిస్టులు విప్లవాన్ని సాధించటం గమనించాలి. ఆసియా, ఆఫ్రికా ఖండ దేశాల్లో సమాజం వెనుకబడి ప్రజాస్వామ్య శక్తులు, వ్యవస్థలు నిలద్రొక్కుకొనక పోవటం చేత యీ ఆసరాతో రష్యా యీ ఖండాలలో కమ్యూనిజాన్ని విస్తరింప చేయాటానికి ప్రయత్నిస్తున్నది. దీన్ని అరికట్టటానికి అమెరికా సక్రమ పంథా చేపట్టలేదు. కేవలం ప్రభుత్వపరంగా సైనిక శక్తిని పెంచినందువలన ప్రయోజనం దెబ్బతింటున్నది. ప్రజాభిప్రాయాన్ని సంఘటిత పరచకపోవటం అమెరికా విదేశాంగ విధానంలోని పెద్ద పొరపాటు. చైనా తరువాత క్రమేపి ఆగ్నేసియా అంతా కమ్యూనిస్టు ప్రభావితం అయ్యే ప్రమాదం వున్నది. అందుకు రష్యా, చైనాలు తీవ్ర కృషి సాగించినవి. రాయ్ తన మిత్రుడయిన రత్ ఫిషర్‌కు వ్రాసిన ఉత్తరంలో "నెపోలియన్ చేయలేని కార్యాన్ని స్టాలిన్ సాధించ గలుగుచున్నాడు. ఐరోపా ఖండాన్ని ఆసియా ఖండంలో జయింప గలుగుచున్నాడు. దాదాపు ఆగ్నేసియా మొత్తం కమ్యూనిస్టు పాదాక్రాంతం కాక తప్పదు" అని తెలియచేశాడు.

కమ్యూనిజం మీద వున్న మోజుతో ఆసియా, ఆఫ్రికాఖండ దేశాలు అమెరికాను బలపరచటం దుర్లభం. అమెరికా విధానాలు, విదేశాంగ నీతి హేయభావాన్ని

కలిగించినవి. పాశ్చాత్య సంస్కృతి పనికిరాదనే భావం దీనికి జోడించబడ్డది. అమెరికా వ్యతిరేకత కమ్యూనిజానికి, రష్యాకు అనుకూలంగా పరిణమించినది. అనుకోకుండా అప్పటి ప్రజలు రష్యాకు సన్నిహితులయి కమ్యూనిస్టు ప్రచారానికి దోహద పడుచున్నారు. ద్వితీయ ప్రపంచయుద్ధంలో భారత ప్రజలు బ్రిటిషు వ్యతిరేకత కారణంగా యిదేవిధంగా ఫాసిజానికి తోడ్పడటం గమనించదగిన విషయం.

"కనుక ప్రపంచ మానవాళి యీ రెంటిలో దేనిని చేపట్టినా మానవ స్వేచ్ఛ, స్వాతంత్ర్యాలకు భంగం వాటిల్లక తప్పదు. ఒకటి మహామారి అయితే రెండోది అంతుదొరకని అగాధమయిన మహాసముద్రం. ఒకటి నియంతృత్వం, రెండోది భరించరాని సామ్రాజ్యతత్వం" అని రాయ్ ప్రకటిస్తూ "ప్రపంచంలో బలవత్తరమయిన మూడవ కూటమిని సృష్టించి సంఘటిత పరచకపోతే మానవ సంఘర్షణ తప్పదు" అని స్పష్టం చేశాడు.

నెహ్రూ అనుసరించిన తటస్థ విదేశాంగ విధానాన్ని రాయ్ నిశితంగా విమర్శించాడు. తటస్థ విధానాన్ని అనుసరించుతూ అమెరికను పెట్టుబడులతో, ఋణ సహాయంతో భారతదేశ ఆర్థికాభివృద్ధికి ప్రయత్నించటం భారతదేశం అమెరికాకు మడుగులొత్తటమేనని రాయ్ అభిప్రాయం. ఇంటా - బయటా కమ్యూనిస్టుల విమర్శనలు, వత్తిడులు నెహ్రూ ప్రభుత్వాన్ని అమెరికా దరికి చేరుస్తున్నవని రాయ్ గ్రహించాడు. 1948 నుంచి దేశంలో కమ్యూనిస్టుల ప్రచారాన్ని, ప్రాభవాన్ని అణచటానికి నెహ్రూ ప్రభుత్వం అనుసరించిన దమనవిధానాలే ఇందుకు సాక్ష్యం. అంతర్గతంగా నెహ్రూ చేపట్టిన కమ్యూనిస్టు వ్యతిరేక విధానం అంతర్జాతీయంగా విదేశాంగ విధానంలో కూడా అదే పంథాలో నడువక తప్పలేదు. దీని ఫలితంగా చైనా నుంచి ముప్పుతప్పదని భారతదేశం అమెరికా సహాయం అర్థించక తప్పదని రాయ్ హెచ్చరించాడు. సరిగ్గా అదే జరిగినది. చైనా దండయాత్ర చేసినది. నెహ్రూ అమెరికా సహాయం కోసం ఎదురు చూడవలసి వచ్చినది.

చైనాలో జయాన్ని సాధించిన కమ్యూనిజం అంతటితో ఆగలేదు. టిబెటు, నేపాలు, కాశ్మీరు, టర్కీస్తాన్ ద్వారా భారతదేశంలో ప్రవేశించటానికి తీవ్రకృషి చేసినది. అంతర్జాతీయంగా కమ్యూనిజం భారతదేశం చుట్టూ వలయాకారాన్ని యేర్పరచుకొని దిగ్బంధం చేయటానికి సంకల్పించినది. రష్యా, చైనా ప్రభుత్వాలు దీనికి అండగా వెనుక నిలబడ్డవి. ఇట్టి పరిస్థితులలో నెహ్రూ వంటి

మహానాయకుడు అధికారంలో వున్నా దేశం తటస్థంగా వుండగలదా? కాగా తటస్థం అంటూనే ఉభయకూటములలో ఒక ప్రక్కకు మొగ్గు చూపినప్పుడు అది ప్రమాదానికి దారితీయక తప్పదు.

భారతదేశం దూరదృష్టితో సరియైన తటస్థ విధానం అవలంబించాలని, అందుకు సరియయిన విదేశాంగ విధానం చేపట్టాలని రాయ్ సూచించాడు. "సరియైన తటస్థవిధానం ఏ దేశం మీద ఆధారపడని విదేశాంగ విధానంతో మేళవించి వుండాలి. తన జాతీయ అభివృద్ధికి వివాదంలో వున్న రెండు వర్గాలలో ఒకదాని మీద ఆధారపడటం అవివేకం.....దేశంలోని కమ్యూనిస్టు సమస్యలను ప్రజాస్వామ్య పద్ధతులతోనే పరిష్కరించటానికి ప్రయత్నించాలి. హింస లేక సైనిక సహాయం మీద ఆధారపడటం మంచిది కాదు." అని చెప్పాడు.

"నిజంగా నెహ్రూ ప్రభుత్వం ప్రచ్ఛన్నయుద్ధంలో తటస్థంగా వుండ దలచినట్లయితే దేశంలోని కమ్యూనిస్టులను తమ అభిప్రాయాలు బాహాటంగా వెల్లడించుకొనటానికి స్వేచ్ఛ నివ్వాలి. ఇది కమ్యూనిస్టు కూటమి లేక రష్యా కూటమిలో చేరినట్లుగాదు. ప్రజాస్వామ్యాన్ని పరిరక్షించటమే అవుతుంది. ప్రజా బలంమీద, ప్రజల అండతో యేర్పడి, ప్రజల సమస్యలను తీర్చగలిగి, ప్రచార సాధనా లన్నింటినీ తన అధీనంలో వుంచుకొన గల్గిన ప్రభుత్వం కమ్యూనిస్టుల అవకతవకలను చూపి వారి ప్రచారాన్ని తేలిగ్గా ఎదుర్కొనవచ్చును. అదే సరియైన మార్గం. హింసాకాండను చేపట్టనక్కర్లేదు. బయటనుంచి వచ్చే ప్రమాదాన్ని ఎదుర్కొనటానికి కూడా యిదే సక్రమమయిన పద్ధతి. ప్రజల సమస్యలను తీర్చి ప్రజాబలం మీద ఆధారపడిన ప్రభుత్వం కమ్యూనిజాన్ని చూచి భయపడనక్కర్లేదు. ప్రజలను తృప్తిపరచలేని ప్రభుత్వం తటస్థంగా వున్నా ప్రమాదం రాకతప్పదు." అని రాయ్ వెల్లడించాడు.

ప్రజాస్వామ్యమా లేక నియంతృత్వమా అనే వాదాన్ని పరిష్కరించ వలసినది యుద్ధరంగం కాదు. ప్రతిభ, మేధాసంపత్తితో యీ సమస్యను పరిష్కరించాలి. యుద్ధం ద్వారా చేయగలిగినది పైశాచికకృత్యం, విలయతాండవం. [illegible]హోమం ద్వారా ప్రజాస్వామ్యం రక్షింపబడదు. శాంతి సాధనాల ద్వారానే ప్రజాస్వామ్యాన్ని పరిరక్షించాలి. యుద్ధం ఏనా మరో మార్గం లేదనుకుంటే మిగిలే

దేమీ వుండదు. అట్టి పరిస్థితులలో సామ్రాజ్యవాదం, ఫాసిజం కంటె కమ్యూనిజం లోనే బ్రతకటానికి వీలున్నది.

కమ్యూనిజాన్ని సైనికశక్తితో పోరాడి జయించాలనుకొనటం ప్రమాద భరితం. కేవలం 'ఆర్థిక వాదం'తో పోరాటం జరపటం కూడా అంత ప్రయోజనకారి కాదు. కమ్యూనిజం కూడా ఆర్థిక అభివృద్ధిని కోరుతుంది. అందుకోసం ప్రయత్నిస్తుంది కూడాను. కనుక కమ్యూనిజాన్ని ఆర్థిక విధానాలతో జయించాలనుకొనటం అవివేకమే అవుతుంది. అనవసరం కూడాను.

కమ్యూనిస్టుల పలుకుబడిని, కమ్యూనిజాన్ని నిరోధించటానికి ఆర్థిక పరిస్థితులను మెరుగుపరచవలసిన అవసరాన్ని రాయ్ వ్యతిరేకించలేదు. సామాన్య మానవుల దారిద్ర్యాన్ని పోగొట్టి వారికి కావలసిన అన్నివసతులు విధిగా కల్పించాలి. అయితే ఇది వొక్కటే మానవాభివృద్ధికి చాలదని రాయ్ అభిప్రాయం. కమ్యూనిజం ఆర్థిక అభివృద్ధికి అడ్డురాదు. కాని సమాజాన్ని సమిష్టిరూపంలో మూసగా తయారు చేసి మానవ స్వేచ్ఛను, వ్యక్తి స్వాతంత్ర్యాన్ని మంటకలుపుతుంది. కనుక సరియైన ప్రజాస్వామ్యమే కమ్యూనిజాన్ని అరికట్ట కలుగుతుంది.

ప్రస్తుతం ఆచరణలో వున్న పార్లమెంటరీ లేక కాపిటలిస్టు ప్రజాస్వామ్యం కమ్యూనిజాన్ని అరికట్టగల స్థితిలో లేదు. వాటి అభివృద్ధి పాత్రను అవి నిర్వహించినవి. వాటికొరకు యేర్పడిన సిద్ధాంతాల ప్రాముఖ్యత, అవసరం తీరిపోయినది. కనుక ప్రస్తుతం పార్లమెంటరీ లేక పెట్టుబడిదారీ ప్రజాస్వామ్యం పనికిరాదు. కమ్యూనిజం అంతకంటె పనికిరాదు. మానవ స్వేచ్ఛకు, స్వాతంత్ర్యానికి వీటి పరిధులను అతిక్రమించి ముందుకుపోవలసిన అవసరాన్ని రాయ్ గుర్తించాడు.

"ప్రపంచం మహా విపత్తును పొందే దరిదాపులకు చేరుకుంటుంది. కనుక ప్రస్తుతం అమలులో వున్న సిద్ధాంతాలు, విధానాలు విసర్జించి నూతన సిద్ధాంతాలు రూపొందించుకొనాలి. ఆ సిద్ధాంతాలు సాంఘికపరంగా మానవ శ్రేయస్సును ప్రతిబింబింపచేయాలి. అందుకు అనుకూలమయిన రాజకీయ, ఆర్థిక, నైతిక వ్యవస్థలను నిర్మించుకొనాలి" అని రాయ్ ప్రకటించాడు. అందుకు నవ్య మానవవాద సిద్ధాంతాన్ని (న్యూ హ్యూమనిజం) సృష్టించి ఆచరణలో తదనుకూలమయిన రాడికల్ ప్రజాస్వామ్యం, సహకార ఆర్థికవిధానం చూపించి నీతిదాయకమయిన సాంఘిక వ్యవస్థను నిర్మించటానికి కృషిచేయాలి.

"ప్రపంచంలో యదార్థమయిన శాంతిస్థాపన జరిగి మానవాభ్యుదయం ఉన్నతపథం చేరాలంటే ప్రతి దేశంలోని మేధావులు, స్వేచ్ఛా స్వాతంత్ర్యప్రియులు సంకుచితము, ద్వేషపూరితము అయిన జాతీయ దృక్పథాన్ని త్రోసిరాజని విశాల దృక్పథంతో అంతర్జాతీయ మానవతత్వాన్ని పెంపొందించటానికి తగిన వాతావరణం సృష్టించటానికి తీవ్ర కృషిచేయవలసి వున్నది. జాతీయ ప్రభుత్వాలు యిందుకు అడ్డుతెరలుగా వున్నవి. అంతర్జాతీయ సహకారాని కివి అవరోధాలు కల్పించుచున్నవి. లోగడ నానాజాతి సమితి, ప్రస్తుత అంతర్జాతీయ సమితి యీ అవరోధాల వలననే తమ ఆదర్శాలను ఆచరణలో పెట్టలేకపోయినవి.

"ప్రభుత్వాల పరంగా ఎలాంటి ప్రయత్నం చేసినా అది ప్రపంచాన్ని ప్రస్తుత విపత్తునుంచి తొలగించలేదు. మానవ ప్రయత్నంలోనే యీ ఆశ యిమిడి వున్నది. ప్రతి దేశంలోనూ మేధావులయిన పురుషులు, స్త్రీలు సంకుచిత, ఆటవిక, పైశాచిక తత్వాన్ని ప్రకోపించే మానసిక రుగ్మతను అధిగమించి విశాలమయిన మానవతా వాదాన్ని అలవరచుకొని అందుకు అనుకూలమయిన వాతావరణం సృష్టించటానికి పూనుకొనటంలోనే యీ ఆశ యిమిడివున్నది.... ప్రత్యర్థుల కార్యక్రమం, విధానాలను బట్టి మనం కార్యక్రమాన్ని రూపొందించుకొన గూడదు. నైతిక విలువలకు ప్రాధాన్యం యిచ్చి నైతిక బలంతో మానవులలో ఆత్మవిశ్వాసం కలిగించాలి. గమ్యస్థానానికి సరిపడిన సాధన సంపత్తిని వుపయోగించుకొనాలి." అని రాయ్ వుద్ఘాటించాడు.

# భావ చైతన్యం:

మానవుడు మానవ సమాజానికి మూలం. కనుక సమాజ అభివృద్ధికి మానవుని కొలతబద్దగా తీసుకొనటం అవసరం. మానవ అభివృద్ధికి వ్యక్తిని గీటురాయిగా తీసుకొనాలి. ఒక జాతి లేక ఒక దేశం సర్వం సహాధికారం కలిగి స్వతంత్ర జాతి లేక స్వతంత్ర దేశంగా పరిగణింపబడవచ్చు. కాని అందలి ప్రజలు బానిసలుగానే వుంటారు. ఒకజాతి లేక దేశ సౌభాగ్యం ఇనుమడింపవచ్చు. కాని అందలి ప్రజలు నిత్యదారిద్ర్యంతో క్రుంగి కృశించి పోతూనే వుంటారు. కనుక

మానవాభివృద్ధిని, స్వాతంత్ర్యాన్ని కేవలం సమిష్టిగా, వర్గ దృష్టితో, జాతిదృష్టితో పరిగణించకూడదు. మానవుడు వ్యక్తిగతంగా తాను అనుభవించుచున్న శారీరక, మానసిక అభివృద్ధుల ననుసరించి అతడున్న సమాజ అభివృద్ధిని, స్వేచ్ఛను పరిశీలించాలి.

ప్రకృతి నియమబద్ధమైనది, హేతుబద్ధమైనది అని అంగీకరించినప్పుడు ప్రకృతి నుంచి వుద్భవించిన మానవుడు కూడా సహజంగా హేతుబద్ధుడగుచున్నాడు. మెదడు పదార్థజనితం. మెదడు పరిపక్వదశకు చేరి క్రియాత్మకంలో మనస్సుగా రూపొంది చుట్టూ వున్న పరిస్థితులను పరిశీలించగలశక్తి, వాటికి ప్రతిగా వ్యవహరించగల శక్తి కలిగి వుంటుంది. భౌతిక నిర్మాణంలో మానవుని కిట్టి శక్తి కలుగుట చేతనే తన అనుభవం, మేధస్సు వలన ప్రకృతి ప్రతిబంధకాలను త్రెంచుకుంటూ, అడ్డుతెరలను తొలగించుకుంటూ తన అస్తిత్వం కొరకు మనుగడకు ప్రకృతితో నిత్యం పోరాటం సాగిస్తూ వున్నాడు. ఇదే అతని స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలకు ప్రాతిపదిక.

తక్కిన ప్రాణులలో లేని బుద్ధి, ఆలోచనాశక్తి, హేతువాదం, జిజ్ఞాస మానవునిలో వున్నవి. ప్రకృతి పోరాటంలో తాను నిత్యం చూస్తూవున్న పరిస్థితులను, అనుభవాన్ని బట్టి జ్ఞానం సంపాదించుకుంటున్నాడు. అనుభవాన్ని బట్టి జ్ఞానం పెరుగుతూ వుంటుంది. జ్ఞానం పెరిగిన కొలదీ ప్రకృతిని జయిస్తూ ప్రకృతి రహస్యాలను తెలుసుకొంటూ ప్రకృతిని లోబరచుకొన గలుగుచున్నాడు. ప్రకృతిని లోబరచుకొన్న కొలదీ అతనిలో స్వాతంత్ర్యేచ్ఛ, సత్యాన్వేషణ, జ్ఞాన సముపార్జన పెరుగుచునే వుంటవి. వీటికి అంతు, పరిధులు, గమ్యస్థానం లేవు. కనుక మానవుని కృషి వీటి కొరకు నిరంతరం సాగుతూనే వుంటుంది.

మానవుడు తాను అనుభవం ద్వారా పొందిన జ్ఞానం - భావ సముదాయం - తాత్కాలికమైనది కాదు. స్థిరత్వాన్ని పొందుతుంది. స్వతంత్ర శక్తిని కలిగి వుంటుంది. మానవుడు తాను వొంటరిగా పొందిన అనుభవం, సాధించిన ఫలితం ఆతనితోనే నశించదు. తన చుట్టూవున్న తోడి మానవులకు, సంఘానికి కూడా అది అనుభవ యోగ్య మవుతుంది. దాని లాభనష్టాలు మిగిలిన సంఘమంతా గ్రహించ గలుగుతుంది. మార్క్సు చెప్పినట్లుగా కేవలం ఆ యా దశల 'ఆర్థిక పరిస్థితుల' ననుసరించి మానవ సమాజంలో భావజనితం జరుగుతూ వుంటుందని, భావ

సముదాయానికి ప్రత్యేకత లేక స్వతంత్ర శక్తి (వ్యక్తిత్వం) లేదని భావించటం పొరపాటు. అనాదినుంచీ మానవుడు పొందిన జ్ఞానం ఋషుల ప్రవచనాలలో, ప్రవక్తల సిద్ధాంతాలలో గ్రంథస్థమయి, ఇతర విధాల మనకు వెలుగుబాట చూపు చున్నది.

ఒకసారి యేర్పడిన భావం (జ్ఞానం) అంతటితో ఆగిపోదు, నశించదు. ముందు వుదయించే భావపరంపర కిది ప్రాతిపదిక అవుతుంది. మానవుడు తాను పొందిన ఒక అనుభవం మరికొన్ని అనుభవాలకు, కార్యాచరణకు ప్రాతిపదిక అయినట్లే మానవుని మనస్సులో రేకెత్తిన ఒక భావం మరికొంత భావచైతన్యతకు తదనుకూల ఆచరణకు కారణభూతమగుచున్నది. సంఘం పరిణామం చెందుతూ ముందుకు సాగుచున్నకొలదీ మానవుల్లో కలిగే భావ సముదాయం కూడా పరిణతి చెంది తన గమనం సాగిస్తూవుంటుంది. దీనికి ఒక క్రమపద్ధతి వున్నది. సమాజా న్ననుసరించి సిద్ధాంతాలు, సిద్ధాంతాల ననుసరించి సమాజం ఒకదానిపై నొకటి తమ ప్రభావాన్ని ప్రసరింపజేస్తూ జంటగా ఒకదానితో నొకటి పెనవేసుకొని జరిపిన సుదీర్ఘ యాత్రా ఫలితమే ప్రస్తుత మానవ చరిత్ర. కాబట్టి మానవుడు ఆర్థికంగా తాను అనుభవించుచున్న శారీరక సుఖ దుఃఖాలను బట్టి అతనిలో భావోద్రేకత కలుగుచున్నదని, అది తాత్కాలికమైనదే నని భావించితే మానవుడు తన చుట్టూ వున్న పరిస్థితులను అధిగమించి నూతన సమాజ నిర్మాణానికి కావలసిన పరిస్థితు లను సృష్టించటం అసాధ్యం, అసంభవం కాక మానదు. అట్టి స్థితిలో 'మానవుడు తన చరిత్రను తానే సృషించుకొనటం' వూహామాత్రమే.

భావసముదాయమే జ్ఞానం. జ్ఞానం శక్తివంతమైనది. మానవునిలో జ్ఞానం పెరుగుచున్న కొలదీ అతనిలో శక్తి కూడా పెరుగుతూ వుంటుంది. ఈ జ్ఞానం సక్రమ పంథాలో వినియోగించ గలిగినప్పుడు అది అతనితో బాటు తన చుట్టూ వున్న సంఘానికి గూడా శ్రేయోదాయకం కాగలదు. అజ్ఞానావస్థలో వున్న ప్రజా నీకానికి భావ విప్లవం కలిగించి వారిలో చైతన్యాన్ని, ఆత్మవిశ్వాసాన్ని కలిగించాలి. ప్రజాశ్రేయస్కరమై, ప్రజానీకానికి నూతన మార్గం చూపగల భావాలను ప్రజలలో ప్రచారం చేసినప్పుడు అవి క్రమేపి సంఘం మొత్తంగా వ్యాప్తి చెంది మొత్తం సంఘాన్ని చైతన్యవంతం, శక్తివంతం చేయగలవు. మానవసంకల్పంలోనే మానవ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు యిమిడి వున్నవి. కనుక తమ సంకల్పసిద్ధికి మానవులను ఉత్తేజపరచవలసిన బాధ్యతను స్వేచ్ఛా, స్వాతంత్ర్యప్రియులయిన మేధావులు

చేపట్టాలి. మానవయత్నం లేకుండా యే కార్యం గట్టెక్కదు. కార్యసాధనకు ముందు వివేచనాశక్తి అవసరం.

మానవుడు సృష్టిక్రమంలో క్రమబద్ధుడు కనుక అతని ఆలోచనారీతులు, వివేచనాజ్ఞానం కూడా సహజంగా హేతుబద్ధమై తనకు, తన సంఘానికి వుపకరించగల మంచిచెడుగులను, లాభనష్టములను, మేలు కీడులను, నీతి అవినీతులను విచక్షణతో విడదీయగల జ్ఞానం అతనికి వుండగలదు. సమాజంలో అట్టి అవకాశం లోపించినప్పుడు లేక కొంతమంది స్వార్థపరులు తమ స్వప్రయోజనం కొరకు మిగిలిన మానవ సమాజానికి అట్టి అవకాశాన్ని కలిగించక అజ్ఞానంలో అట్టిపెట్ట గలిగినప్పుడు వారు చైతన్యరహితులై, ఆత్మవిశ్వాసం లేక అధికారం చేపట్టిన వర్గీయుల కట్టుబాటులకు లోనయి బానిస జీవితం గడుపక తప్పదు. అతనిలో సహజంగా వున్న హేతువాదం, నీతిదాయకమైన వివేచనాశక్తి నశిస్తుంది. వాటిని పునరుద్ధరించవలసిన బాధ్యత మేధావుల మీద వున్నది. కనుక రాజకీయంగా, లేక ఆర్థికంగా జరిగే ప్రతి విప్లవానికి ముందు ప్రజల్లో తాత్విక విప్లవాన్ని జయప్రదం చేయాలి.

మానవ సృష్టికి అనిర్వచనీయమయిన ఏదో శక్తి లేక మతాధారమైన భగవంతుడు కారణభూతుడు కాదు. ప్రకృతి పదార్థ సమ్మేళనము వలననే మానవ సృష్టి జరుగుచున్నది. మానవుడు సర్వ స్వతంత్రుడు. తన అభివృద్ధికి తానే కారకుడు. తన చరిత్రను తానే నిర్మించుకొనగలడు. ఊహాజనితమయిన లేక కపబడని భగవంతుని కనుసన్నల ననుసరించి మానవ జీవితం తీర్చి దిదబడటంలేదు. మానవుని కష్ట-సుఖాలు, స్వర్గ-నరకాలు ఆతని కృషి, దీక్ష ననుసరించి యీ లోకంలోనే వున్నవి. ఇంతకు మించి పరలోకం, ఆముష్మిక సుఖ సంపదలు లేవు. వివేచనా శక్తితో స్వతంత్రునిగా మానవుడు ఆలోచించగలడు. అట్టి మానవుడు తన బుద్ధికి క్రమబద్ధమైన, శ్రేయోదాయకమైన, నీతిదాయకమైన కార్యాచరణకు సన్నద్ధుడై తనతోబాటు తన తోటి మానవులను కూడా అభ్యుదయ మార్గంలో నడిపించగలడు. ఒకరిపై ఒకరి వత్తిడులు లేని ఇలాంటి మానవుల సముదాయమే నిజమైన స్వాతంత్ర్య సమాజం. ఇట్టి మానవ సమాజ నిర్మాణానికి ముందుగా ప్రజలలో స్థిరచిత్తం, ఆత్మవిశ్వాసం కలిగించగల భావ చైతన్యాన్ని కలిగించాలి. స్వాతంత్ర్యసౌధాని కిది ప్రథమ సోపానం.

# రాజకీయ వ్యవస్థ :

ప్రస్తుతం ఆచరణలో వున్న పార్లమెంటరీ ప్రజాస్వామ్యంగాని లేక సోషలిస్టు ఆర్థిక విధానంగాని సమాజ అభివృద్ధి, సమాజంలోని వ్యక్తుల స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలకు తగిన కార్యక్రమాలు చేపట్టక ఆచరణలో విఫలత చెందినవి. మొదటిదానిలో పరిమితమైన రాజకీయ స్వాతంత్ర్యం, వ్యక్తి స్వాతంత్ర్యమున్నా, ఆచరణలో వ్యక్తి నిర్జీవ ప్రతిమగా, అనిశ్చిత జీవిగా, ఆగర్భ దరిద్రునిగా నిలచి పోతున్నాడు. రెండవదానిలో ఆర్థిక అసమానతల నిర్మూలనకు ప్రయత్నాలు జరుగుచున్నా మానవుని మానసిక అభివృద్ధికి ప్రతిబంధకాలు పెరుగుచున్నవి. రాజకీయ స్వాతంత్ర్యంలేని ఆర్థిక స్వాతంత్ర్యం, ఆర్థిక స్వాతంత్ర్యంలేని రాజకీయ స్వాతంత్ర్యం రెండూ మానవ స్వాతంత్ర్యానికి అవరోధాలుగానే పరిణమించినవి. కనుక సమాజంలో మూలాధారమైన వ్యక్తుల స్వాతంత్ర్యానికి, స్వేచ్ఛకు ఎట్టి అవరోధాలు కలిగించని సరియైన ప్రజాస్వామ్యం (రాడికల్ ప్రజాస్వామ్యం) అమలులో వుండేటట్లు రాజకీయ వ్యవస్థను నిర్మించుకొనాలి.

మానవ సమాజ పురోభివృద్ధికి రాజకీయ వ్యవస్థ - రాజ్యాంగ యంత్రం (స్టేట్) ఒక సాధనం. ఇది మార్క్సు సూచించిన ప్రకారం సోషలిజం లేక కమ్యూనిజంలో క్షీణించి పోదు, అంతరించనూ అంతరించదు. మానవ సమాజం వున్నంతవరకు యిది వుండక తప్పదు. ఆదిలో యిది సమాజ అవసరాలకూ, అభివృద్ధికి ఏర్పరచుకునినా సమాజంలోని ఒక వర్గం స్వలాభం కొరకు, స్వప్ర యోజనం కొరకు సమాజంమీద పెత్తనం చేయటానికి, సమాజాన్ని అదుపు ఆజ్ఞలలో పెట్టటానికి వినియోగింపబడుతూ వచ్చినది. ఈ విధానానికి స్వస్తిచెప్పి రాజ్యాంగ వ్యవస్థను మొత్తం సమాజ అభ్యుదయానికి వుపకరించగల సాధనంగా రూపొందించుకొనాలి.

పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో రాజకీయ స్వాతంత్ర్య మున్నదని చెప్పబడినా ఆచరణలో మృగ్యంగా తేలిపోయినది. వ్యక్తికి కేవలం వోటింగు అధికారం మినహాయించి రాజకీయాల్లో, పరిపాలనా విధానంలో, తన సమస్యలను తాను చక్కదిద్దుకొనటం, తన భవిష్యత్తును తాను రూపొందించు కొనటంలో ప్రత్యేకమైన హక్కులూ, అధికారాలూ ఏమీ లేవు. ప్రజల పేరుతో ప్రజా

ప్రతినిధులుగా ఇతరులు పరిపాలన చేస్తూ వుంటారు. ప్రజల బాగోగులు వారిచే ఎన్నుకొనబడిన ప్రతినిధులకు అప్పగించబడుచున్నవి. వారు సవ్యంగా వ్యవహరించ నప్పుడు వారిని ప్రశ్నించే అధికారం, తిరిగి పిలిపించి మరొక ప్రతినిధిని ఎన్నుకునే అధికారం ప్రజలకు లేదు.

మెజారిటీ వోట్లను సంపాదించి మెజారిటీ సభ్యులను గెలిపించగల పార్టీ అధికారం చేపట్టుతుంది. పార్టీ ప్రథమ ఆశయం తన అధికారాన్ని సుస్థిరం చేసు కొనటం, రాబోయే ఎన్నికలలో తిరిగి జయం పొందటం. ప్రభుత్వం తాను పెట్టే శాసనాలు ప్రజల యిష్టానిష్టాల మీద ఆధారపడి వుండవు. ప్రజలకు వ్యతిరేకమైన శాసనాలు అమలు జరుగుచున్నా ప్రతిఘటించటానికి ప్రజలలో శక్తి వుండదు. వోట్లు వేసినంతవరకే వారు మానవులుగా పరిగణించబడుచున్నారు. అంతవరకూ వారి చుట్టూ పార్టీ ప్రతినిధులు ఒకటికి నాలుగుసార్లు తిరుగుతూ ఎన్నో వాగ్దానాలు చేసి లేనిపోని ఆశలు పెట్టినా తరువాత వారు పూర్తిగా నిర్లక్ష్యం చేయబడటం పరిపాటి ఐపోయినది.

ఇది ప్రజల పేరుతో ప్రజల కొరకు నడుపబడుచున్న ప్రభుత్వం కావచ్చును. కాని ప్రజలచేత నడుపబడే ప్రభుత్వం గాని లేక ప్రజా ప్రభుత్వం గాని అనిపించుకొనదు. ప్రజలకు యిట్టి ప్రభుత్వంతో యే మాత్రం సంబంధం వుండదు. బండిచక్రంలోని ఆకులుగా ప్రజలు తమ వ్యక్తిత్వాన్ని కోల్పోయి నిస్సహాయులై మూకీభావం వహించక తప్పదు. ప్రజలే ప్రభుత్వం, ప్రభుత్వమే ప్రజలు అన్న భావం యేర్పడి ఆచరణయోగ్యం చేయగలిగినప్పుడే ప్రజాస్వామ్యం వర్ధిల్ల గలుగు తుంది. ప్రతినిధుల ప్రభుత్వం, పార్టీ ప్రభుత్వం ప్రజా ప్రభుత్వం కాజాలదు.

ప్రతి గ్రామంలో, ప్రతి నగరంలో పార్టీ రహితమైన ప్రజా సంఘాలు స్థాపించాలి. ఇవి ప్రజలతో సన్నిహిత సంబంధాలను కలిగి వుండటమే కాకుండా ఆ యా ప్రాంతాల సమస్యలను, వాటి పరిష్కార మార్గాన్ని తెలుసుకొనటంలో ఆసక్తిని ప్రకటించాలి. ఈ సంఘాల ప్రాతినిధ్యంతో మండలి, తాలూకా, జిల్లా, రాష్ట్ర ప్రజా సంఘాలను యేర్పరచాలి. ఇందులో పార్టీ ప్రమేయం వుండదు. పార్టీ రహిత ప్రజా సంఘాలుగా యేర్పడటంచేత మొత్తం ప్రజానీకానికి వీటితో సరాసరి సంబంధం వుండగలదు. ఈవిధంగా రాజకీయ వ్యవస్థను ఒకదానిపై నొకటి

ఆధారపడి 'పిరమిడు' రూపంలో స్థూపాకారంలో కేంద్ర పరిపాలనా యంత్రాంగాన్ని రూపొందించాలి.

రాష్ట్ర ప్రభుత్వానికి, కేంద్ర ప్రభుత్వానికి జరిగే ఎన్నికల్లో యీ సంఘాలు ప్రధాన పాత్ర వహించ గలవు. గ్రామ, పట్టణ ప్రజా సంఘాలు సమావేశమయి తమ నియోజకవర్గ ప్రతినిధి పేర్లను సిఫారసు చేయగా మండలి సంఘం అందులో మెజారిటీ అభిప్రాయాన్ననుసరించి, యోగ్యతను బట్టి ఆ నియోజకవర్గ అభ్యర్థిని ఎన్నుకోనాలి. ఎన్నికలలో వారికి అనుకూల ప్రచారం జరిపి గెలిపించి రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలకు పంపటానికి తగిన కృషి చేయాలి. వీరు ఏ పార్టీ వత్తిడులకు గురిగాక కేవలం ప్రజా ప్రతినిధులుగా మాత్రమే ఎన్నిక కాపటంచేత సరాసరి ప్రజలకే ప్రాతినిధ్యం వహించగలరు. వీరి ద్వారా యేర్పడిన ప్రభుత్వాలు కూడా ప్రజా ప్రభుత్వాలుగా విలసిల్లటానికి అవకాశం యేర్పడుతుంది. రాష్ట్ర లేక కేంద్ర ప్రభుత్వ అసెంబ్లీ, పార్లమెంటు సభ్యులు ప్రజా సంఘాల ద్వారా ఎన్నుకొనబడిన వారు కావటంచేత ఆ యా ప్రాంతాల సమస్యలను ఆ యా ప్రభుత్వాల ద్వారా చర్చించి శాసనాలు చేయటానికి కృషి చేయగలరు. దీనివలన ప్రభుత్వానికీ - ప్రజలకు మధ్య దళారీలు వుండరు. ప్రజలే సరాసరి ప్రభుత్వ కార్యకలాపాల్లో పాల్గొనటం వలన ప్రజాస్వామ్యం అంతరాయం లేకుండా ముందుకు సాగిపోవ టానికి అవకాశం కలుగుతుంది. పార్టీ వ్యామోహంలో వున్న ప్రస్తుత పరిస్థితుల్లో యిది అసాధ్యంగానే కనబడుతుంది. కాని యింతకంటె వేరే మార్గం లేదను కొన్నప్పుడు ఎక్కడో వొకచోట యీ ప్రయత్నానికి దీక్ష వహించి పార్టీ రాజ కీయాలను భగ్నం చేయటానికి కృషి చేయాలి. ప్రస్తుత పరిస్థితుల్లో విప్లవానికి, నూతన సమాజ నిర్మాణానికి దగ్గరదారులు గాని, దొడ్డిత్రోవలు గాని లేవు.

ప్రస్తుత సమాజ వ్యవస్థలో ఈ కార్యక్రమం అసాధారణం గానూ, అసంభవం గానూ కనబడవచ్చు. కాని నిరాశచెంద నక్కర్లేదు. ఎన్నికల తరుణంలో నిస్వార్థులయిన ప్రజా సేవకులు, మేధావులు నియోజకవర్గంలో ఏ కొలది మంది అయినా ఈ ఉద్యమానికి ఉద్యుక్తులు కాగలిగితే సత్ఫలితాలు కనబడగలవు. జీవిత సమస్యలను, రాజకీయ పరిస్థితులను సమీక్షిస్తూ కరపత్రాలు, సభలు, సమా వేశాల ద్వారా వోటర్లను చైతన్యవంతులు చేయటానికి ప్రయత్నించాలి. ఎన్నికలకు నిలబడే వ్యక్తులు వాటిని ఎలా పరిష్కరించటానికి సిద్ధపడగలరో ప్రశ్నించాలి.

సమర్థులయిన, నీతి, నిజాయతీ గల వ్యక్తులనే గెలిపించాలని వోటర్లకు ప్రబోధం చేయాలి.

ఈ ప్రచారం వలన ఒకటి, రెండు ఎన్నికలలో తగిన ఫలితం కనబడక పోవచ్చును. కాని అచ్చటచ్చటా నూటికి నలుగురైదుగురు ఈ ప్రచారానికి ప్రభావితు లయితే చాలును. తరువాత జరిగే ఎన్నికల్లో వీరి ప్రభావం ప్రజలమీద విశేషంగా కనబడి అచ్చటచ్చటా ప్రజాస్వామ్య వ్యవస్థలు ఏర్పడగలవు. కాగా అవి వూహించ నంత వేగంగా నలుదిశలా వ్యాపించి ప్రజలు తాము ఆశించిన, సమర్థవంతులయిన వ్యక్తులను ఎన్నుకొనటానికి దోహదం చేయగలవు. ఇందులో పార్టీల వత్తిడులు, క్రమశిక్షణ వుండదు. కనుక ఆ విధంగా ఎన్నుకొనబడే వ్యక్తులు నిజంగా ప్రజా ప్రతినిధులుగానే తమ విద్యుక్త ధర్మాన్ని నెరవేర్చటానికి ఉద్యుక్తులు కాగలరు. హ్యూమనిస్టు లనుకునే వారు తాము ఎన్నికలలో నిలబడ నవసరంలేదు. మంచి వారిని, బుద్ధిమంతులను, నిజాయితీపరులను ఎన్నుకొనవలసిన బాధ్యతను ప్రజలకు గుర్తింపచేయటమే వారి ప్రథమ కర్తవ్యం.

రాజకీయాలు, లేక రాజకీయ వ్యవస్థలు కేవలం అసెంబ్లీ, పార్లమెంటు లకే పరిమితం కావు. పంచాయతీలు, మున్సిపాలిటీలు, పంచాయతీ సమితులు, జిల్లాపరిషత్తులు మొదలయిన వన్నీ యీ పరిధిలో నున్నవి. కనుక వీటిని పార్టీ ప్రమేయం లేని ప్రజాస్వామ్య వ్యవస్థలుగా రూపొందించగలిగితే వీటి ప్రభావం అసెంబ్లీ, పార్లమెంటులకు కూడా విస్తరింపగలదు. పార్టీ రాజకీయాలు, పార్టీ అధికారాలు అనాదివి కావని గ్రహించగలిగినప్పుడు పై కార్యక్రమం ఆచరణ యోగ్యం కాగలదని భావించటంలో సందేహం పొడసూపదు.

# ఆర్థిక వ్యవస్థ :

పెట్టుబడిదారీ విధానంలోని 'స్వేచ్ఛా వ్యాపారం' ఉత్పత్తి వినియోగం కొరకు కాక కేవలం లాభదృష్టితో జరగటం వలన సమాజంలో ఒక వర్గం మిగిలిన సమాజాన్ని పీడించి దోపిడీ చేయటానికి, ఒక దేశం మరో దేశాన్ని ఆక్రమించు కొని వలస రాజ్యంగా, బానిస దేశంగా అట్టి పెట్టుకొనటానికి దారితీసినది, పారి

క్రామికంగా ఒక దేశం అన్నివిధాలా అభివృద్ధి చెందుతుంది. అహోరాత్రుల్లో ఫ్యాక్టరీలు పని చేస్తూనే వుంటవి. ఉత్పత్తి పెరుగుతూనే వుంటుంది. కాని అందలి ప్రజల జీవితం దుర్భరంగానే వుంటుంది. దైనందిన అవసరాలకు కావలసిన వస్తువులను కొనగలశక్తి వారిలో వుండదు.

దీనికి ప్రతిగా సోషలిస్టు ఆర్థిక విధానం చూపెట్టబడినది. ఇది పెట్టుబడి దారీ విధానం కంటె మెరుగుగానే భావించవచ్చును. కాని ప్రభుత్వమే పరిశ్రమల నన్నింటినీ చేపట్టి ఉత్పత్తి చేయటం వలన ఇది 'స్టేట్ కాపిటలిజం'గా మారినది. ఇందులో నిర్లక్ష్యతకు, అవినీతికి అవకాశం లేకపోలేదు. భారీపరిశ్రమల మీద వున్న మోజు ప్రజల నిత్యావసర వస్తూత్పత్తి మీద వుండటం లేదు. ప్రజల కనీస అవసరాలను తీర్చలేని ఆర్థిక విధానాలు అభివృద్ధిదాయకం కాజాలవు. రష్యాలో అనేక 'పంచవర్ష ప్రణాళిక'లు అమలు జరుపబడ్డవి. కాని ప్రజల తిండి పదార్థాలకు కొదువ వుండనే వున్నది. అందుకు ఇతర దేశాల మీద ఆధారపడక తప్పలేదు. కనుక పారిశ్రామిక అభివృద్ధితోపాటు వ్యవసాయక వుత్పత్తులను కూడా పెంచాలి. ప్రజల కొనుగోలుశక్తిని పెంచాలి. దేశంలో వుత్పత్తి జరిగే వస్తు సముదాయం దేశంలోని ప్రజల అవసరాలను తీర్చాలి. అవసరాలకు మించిన వాటినే ఎగుమతులు చేయగల ఆర్థిక వ్యవస్థను రూపొందించుకొనాలి. దేశాభివృద్ధికి, సమాజాభివృద్ధికి అందలి ప్రజల అభివృద్ధి, కొనుగోలుశక్తిని సూచీపటంగా తీసుకొనాలి.

కనుక ఆర్థికాభివృద్ధి ప్రధానంగా సమాజంలోని వ్యక్తుల భౌతిక అవసరాలను తీర్చటమే కాకుండా వారి స్వేచ్ఛను, ఔన్నత్యాన్ని కూడా పెంపొందించే టట్లు వుండటం అవసరం. ఆర్థిక ప్రణాళికలు, కార్యక్రమాలు సమాజంలోని రాజకీయ, సాంస్కృతిక, విద్యారంగాల్లో కూడ తగిన మార్పులు తీసుకొని రాగలవిగా వుండాలి. మానవుడు భౌతిక అవసరాలతోనే తృప్తి చెందడు. మాన సికంగా కూడ అభివృద్ధి చెంది స్వేచ్ఛా గమనంలో పురోగమించటానికి తగిన వాతావరణం, అవకాశాలు కలిగించాలి.

కాబట్టి 'ఉత్పత్తి, పంపిణీ, మార్పిడి' మీద వున్న స్వంత హక్కులు, అధికారాలన్నీ దీనికి అనుగుణంగా మలచుకొనటం అవసరం. అయితే ఈ విధానం అంతిమ లక్ష్యం మాత్రం కాదు. సాధన మాత్రమే. మానవుడు వూహించిన కాపిట లిజం, సోషలిజం - (స్వేచ్ఛా వ్యాపారం లేక ప్రభుత్వ వ్యాపారం) గమ్య స్థానం చేరటానికి సాధనలుగా వుపకరించటంలేదు.

విజ్ఞాన శాస్త్రం, టెక్నాలజీలో సమాజం సాధించిన విజయాలను, పాలనా యంత్రాంగంలో, మేనేజిమెంటులో పొందిన అభివృద్ధిని, అనుభవాలను ఆర్థికాభివృద్ధికి అనుకూలంగా మలచుకొనటం అవసరం. అంటే వీటిని ఆచరణలో సమాజంలోని వ్యక్తుల క్షేమానికి, వారి అభివృద్ధికి వివేచనాత్మకమయిన దృష్టితో మలచుకొని సమాజాన్ని 'స్వేచ్ఛా సమాజం'గా తీర్చిదిద్దటానికి పూనుకొనాలి.

అయితే సైన్సు, టెక్నాలజీ నాధారంచేసుకొని రూపొందించే ఆర్థికాభివృద్ధి వున్న పరిస్థితులను తారుమారు చేసే విధంగా వుండకూడదు. వాస్తవ పరిస్థితులను, మనకు లభించే సహజ సంపదను, దాని అభివృద్ధిని గమనించి ఆర్థికాభివృద్ధిని రూపొందించుకొనాలి.

భౌతిక అభివృద్ధితో బాటు మానవుడు మానసికంగా, సాంస్కృతికంగా, సామాజికంగా అభివృద్ధి చెందుతూ రాజకీయ స్వాతంత్ర్యాన్ని పొందాలి.

ఆర్థికాభివృద్ధికి పెట్టుబడులను సమకూర్చుకొనటంలో, మానవ శ్రమను ముఖ్యంగా సాంకేతిక విజ్ఞానాన్ని వినియోగించుకొనటంలో, ఉత్పత్తికి అవసరమయిన వస్తువులను ఎన్నిక చేసుకొనటంలో, అవి అందరికీ లభ్యమయ్యేటట్లు చేయగల పంపిణీ విధానంలో, వీలైనంత ఎక్కువమందికి ఉద్యోగ అవకాశాలు కల్పించటంలో ఒక క్రమమయిన ప్రణాళికను అనుసరించాలి.

ఇట్టి ప్రణాళిక మానవ స్వేచ్ఛకు భంగకరం కారాదు. పైగా అందుకు అభివృద్ధిదాయకంగా వుండాలి. ప్రణాళికలు ఆచరణలో స్వేచ్ఛా సమాజానికి అనుబంధంగా వుంటూ వ్యక్తి స్వేచ్ఛను, సంక్షేమాన్ని విస్తృతపరచే విధంగా వుండాలి. అవి తమకు తాముగా 'అంతిమ లక్ష్యం' కారాదు; కాకూడదు. ఏ ప్రణాళిక అయినా ఒక 'సాధన' మాత్రమే, లక్ష్యం 'స్వేచ్ఛ' అని మరువరాదు.

సామాజిక జీవన ప్రమాణాన్ని మొత్తంగా పెంచటం ఆర్థికాభివృద్ధి ఆశయంగా భావించాలి. ఈ ఆదర్శాన్ని సుస్పష్టమయిన రూపంలో వ్యక్తపరచాలి. ఇందుకు ఆర్థిక ప్రణాళికలను స్వల్పకాలిక, దీర్ఘకాలిక అవసరాలకు అనుగుణంగా మలచుకొనాలి.

సమాజంలో హెచ్చుమంది బీదరికంలో వున్నప్పుడు పంపిణీ విధానాన్ని జాగ్రత్తగా రూపొందించాలి. కాగా దేశం భిన్నజాతులతో, భిన్న సంస్కృతులమ

కలిగి వున్నప్పుడు అన్ని ప్రాంతాలనూ, అన్ని జాతులను సమన్వయపరిచే విధంగా వుండాలి.

ముఖ్యంగా మన దేశంలో ఆర్థిక ప్రణాళికలు ప్రజల దైనందిన జీవిత అవసరాలను తీర్చే విధంగా వుండాలి. ఉద్యోగ అవకాశాలు పెరిగేటట్లు చూడాలి. పరిశ్రమలు, పారిశ్రామిక ఉత్పత్తులు, వ్యవసాయం, సేద్యపు వనరులు, ఉత్పత్తులు, పశు సంపద, పాడి పెంపకం, నిత్యావసర వస్తువుల ఉత్పత్తులు క్రమ పద్ధతిలో పెంపొందాలి.

మంచినీటి సదుపాయాలు కల్పించాలి. తక్కువ ఖర్చుతో గృహ నిర్మాణ పథకాలు చేపట్టాలి. ఆరోగ్య, వైద్య సదుపాయాలు కల్పించాలి. ప్రాథమిక, సాంకేతిక విద్యాభివృద్ధి జరగాలి. వీటికి తోడు జాతి మొత్తం అభివృద్ధికి, ఎరువులు, సిమెంటు, జౌళి పరిశ్రమలు, ఇనుము - ఉక్కు మొదలయిన భారీ పరిశ్రమలను అవసరాలను బట్టి ఆ యా ప్రాంతాల ఖనిజ సంపదల అవకాశాల కనుగుణంగా నిర్మించాలి. వీటికి తోడు జనాభా పెరుగుదలను అరికట్టటంలో తగు జాగ్రత్తలు తీసుకొనవలసిన అవసరమెంతైనా వున్నది. ప్రజలను భయపెట్టి శస్త్ర చికిత్సలు చేయటం కంటె వారికి జ్ఞాన ప్రబోధం కలిగించి 'చిన్న కుటుంబాల' వలన కలుగు లాభాలను విరివిగా ప్రచారంచేసి వారికి కనువిప్పు కలిగించాలి.

ఇట్టి క్రమపద్ధతిలో ఏర్పడిన ఆర్థిక వ్యవస్థ ఆదర్శవంతం, ఆశయసిద్ధి పొందటానికి, ఉత్పత్తి, పంపిణీ, మార్పిడులు సద్వినియోగంగా జరుగటానికి పెట్టుబడిదారీ, సోషలిస్టు ఆర్థిక రంగాల కంటె సహకార ఆర్థిక రంగం బాగా వుపకరిస్తుంది. రాజకీయ స్వాతంత్ర్యానికి ప్రజా సంఘాలు ప్రాతిపదిక అయినట్లు ఆర్థిక విధానాలకు సహకార సంఘాలు ప్రాతిపదిక కావాలి. ఉత్పత్తి, పంపకం, మారకం అన్నీ యీ సహకార సంఘాలే నిర్వహించేటట్లు ఆర్థిక వ్యవస్థను పునర్నిర్మించాలి. ఉత్పత్తిదారుల సహకార సంఘాలు, వినిమయదారుల సహకార సంఘాలు, వీటి రెంటినీ సమన్వయపరచగల, వస్తు మార్పిడి చేయగల సహకార సంఘాలను ఏర్పరచి సమాజం మొత్తంలో సహకార వుద్యమాన్ని పటిష్టం చేయాలి. రాజకీయరంగంలో మధ్య దళారీలను తొలగించినట్లు ఆర్థిక రంగంలో కూడా మధ్య దళారీలు లేకుండా చేయాలి. ఫ్యాక్టరీలలో, పొలాల్లో పండే వుత్పత్తినంతా మార్కెట్టులో లభ్యమయ్యేటట్లు చూడాలి.

సక్రమ పద్ధతుల్లో సహకార సంఘాల ద్వారా జరిగే పుత్పత్తి ప్రజ అవసరాలను బట్టి జరుగుతుంది. పంపిణీ అందరికీ అందుబాటులో వుంటుం మారకంలో లాభ దృష్టి వుండదు. నిలవ చేయటం, దాచటం, అధిక ధరల అమ్మటం లేక కల్తీపదార్థాలను కలుపటం అనే అవినీతి చర్యలు పుండవు. కనీ ధరలకు వస్తువులను ప్రజలకు అందించే అవకాశమున్నది. శ్రామిక శక్తి వల లభించే 'అదనపు విలువ' వ్యక్తులు గుంజటం గాని లేక కూడబెట్టుకొని తమ స్వం బొక్కసాలు నింపుకొనటం గాని జరుగదు. మిగులు శక్తి, మిగులు పుత్పత్తి మిగులు విలువ సహకార సంఘ సభ్యులకే చెంది జాతి ఆదాయంగా, సంఘ ఆదాయంగా జాతి అభివృద్ధికి, సంఘ అభివృద్ధికి వినియోగించటానికి వీలు కలుగుతుంది.

రాజకీయ చైతన్యానికి, ప్రజలు తమ సమస్యలను గురించి చర్చించుకొని తమ భావాలను వ్యక్తపరచటానికి ప్రజా సంఘాలు పుపకరించినట్లు దేశంలో జరిగే పుత్పత్తిని, పుత్పత్తి సాధనాలను, పారిశ్రామిక, వ్యవసాయక ఆర్థిక విధానాలను సహకార సంఘాల ద్వారా జరుపటం చేత ఆర్థిక అసమానతలు తొలగి జాతీయ ఆదాయం సంఘపరం కావటమే కాకుండా ప్రజలు విశేషంగా తమ మంచి చెడ్డలను తెలుసుకొనటానికి, భాగస్వాములు కావటానికి మంచి అవకాశం లభిస్తుంది.

పారిశ్రామిక విధానాన్ని 'జాతీయం' చేసినంత మాత్రంచేత పరిస్థితులు చక్కబడవు. దీనివలన ఉత్పత్తి పెరుగుతుందని గాని లేక పంపిణీ సక్రమంగా జరుగుతుందని గాని తగిన హామీ లేదు. పైగా ఇందుకు బాధ్యత వహించే పరిపాలనా యంత్రాంగం బాధ్యతారహితంగా ప్రవర్తించటం పరిపాటి అయినది. స్వంత లేక స్వేచ్ఛా వ్యాపారాన్ని అరికట్టి పరిశ్రమలు జాతీయం చేయటం వలన సమస్యలు పరిష్కారం కావు. సహకార ఆర్థిక విధానం మూలసూత్రం - ఉత్పత్తి లాభదృష్టితో గాకుండా ప్రజల అవసరాల కొరకు - గనుక యీ పోటీలో నిలబడగల ప్రైవేటు పరిశ్రమలు మాత్రమే కొనసాగగలవు. నిలబడలేనప్పుడు వాటంతటవే నశిస్తవి. కాక ఇష్టపడిన ప్రైవేటు పరిశ్రమలు సహకార సంఘాలతో మిళితమై పోగలవు. కనుక బలవంతంగా వాటిని కంట్రోలు చేయటంగాని లేక ప్రభుత్వం స్వాధీనం చేసుకొనవలసిన అవసరంగాని పుండదు.

సహకార రంగం ఉత్తమమైనదిగా ఎంపిక చేసుకొనటంలో ప్రభుత్వ, ప్రైవేటు రంగాలను పూర్తిగా నిరసించటం గాని, లేక తొలగించాలని గాని భావించ

రాదు. పారిశ్రామికీకరణంలో పరిశ్రమలన్నీ ఒకే విధంగా వుండవు. భారీ పరిశ్రమలు, పెద్ద ప్రాజెక్టులు, మధ్యతరహా, చిన్నతరహా, కుటీర పరిశ్రమలు, రకరకాలయిన ఇతర పరిశ్రమలు వుండక తప్పదు.

భారీ పరిశ్రమలకు, ప్రాజెక్టులకు, ముఖ్యంగా రక్షణ ఉత్పత్తులకు ప్రభుత్వరంగమే బాధ్యత వహించవలసి వుంటుంది. ప్రైవేటురంగంలో కూడా ఇనుము-ఉక్కు, జౌళి పరిశ్రమలు మొదలయినవి కొన్ని నిర్వహించటం జరుగు తూనే వున్నది. వీటికి తోడుగా మధ్యతరహా, చిన్నతరహా పరిశ్రమలు అనేకం ప్రైవేటు రంగంలో వున్నవి. ప్రభుత్వం నిజంగా 'ప్రజా ప్రభుత్వం' అయితే ఈ రెండు రంగాలతోబాటు సహకార రంగాన్ని కూడా విస్తరింపచేయాలి. సహకార రంగ విస్తరణలోనే ప్రజాస్వామ్యం వర్ధిల్లటానికి ప్రజలు భాగస్వాములుగా రాజకీయ చైతన్యం పొందటానికి ఎక్కువ అవకాశాలు లభిస్తవి. ఇది వికేంద్రీ కరణకు పునాది వంటిది.

సహకార ఆర్థిక విధానం వలన మానవుడు ఆధునిక విజ్ఞానశాస్త్రం, సాంకేతిక పరిజ్ఞాన సహాయంతో ఎక్కువ లాభం పొందే అవకాశం వున్నది. కాపిటలిస్టు, సోషలిస్టు ఆర్థిక విధానాల వలన మానవుడు తన వ్యక్తిత్వాన్ని కోల్పోవటమే కాకుండా ఆర్థిక యంత్రాంగంలో ఒక చిన్న పనిముట్టుగా వ్యవహ రిస్తున్నాడు. మానవ నిర్మితమయిన యంత్రం మానవుని మీద పెత్తనం చేయటం శోచనీయం. కనుక దీనిని అరికట్టి మానవుని అవసరాలకు వినియోగపడగల పంథా సహకార ఆర్థిక విధానంలో వున్నది.

ఆర్థిక విధానాలు ప్రణాళికాబద్ధం చేసినంత మాత్రంచేత ప్రయోజనం ఆశించినంతగా వుండదు. హెచ్చుమంది ప్రజలకు హెచ్చులాభాన్ని చేకూర్చాలి. అంటే సంపద అందరికీ సమానంగా పంపకం జరిగే విధంగా సాంఘిక న్యాయం చేకూర్చాలి. ఆర్థిక ప్రణాళికలు మానవ స్వేచ్ఛకు, మానసిక అభివృద్ధికి, సాంస్కృతిక వికాసానికి అవరోధం కాకూడదు. ఆర్థిక స్వాతంత్ర్యంలేని రాజకీయ స్వాతంత్ర్యం (ప్రజాస్వామ్యం) నిరుపయోగమైనట్లే రాజకీయ స్వాతంత్ర్యం లేని ఆర్థిక స్వాతంత్ర్యం (నియంతృత్వం) కూడా నిరుపయోగమేనని గుర్తించాలి. ప్రజా స్వామ్యం వడిదుడుకులు లేకుండా వర్ధిల్లటానికి సహకార రంగం మంచి అవకాశాన్నిస్తుంది.

# విద్యా, సాంస్కృతిక రంగాలు :

రాజకీయ, ఆర్థిక స్వాతంత్ర్యాలు కలిగి మానవుడు వ్యక్తిగతంగా స్వేచ్ఛను పొంది మానసిక వికాసానికి అవరోధాలులేని నవసమాజాన్ని నిర్మించాలంటే సమాజాన్ని చైతన్యవంతం చేయాలి. ప్రజలను అభ్యుదయ కాముకులుగా సంఘటిత పరచాలి. ఇందుకు విద్యా, సాంస్కృతిక రంగాలలో తగిన మార్పులు తీసుకొని రావటం ఎంతైనా అవసరమున్నది. మూఢవిశ్వాసాలతో, కుల విభేదాలతో, వర్గ కలహాలతో, మత ద్వేషాలతో, దాస్యభావాలతో నిండి నిబిడీకృతమయిన ప్రస్తుత సమాజాన్ని పునర్నిర్మాణం చేయటానికి విద్యావిధానంలో ముందుగా విప్లవం జరగాలి.

ఆధునిక విజ్ఞానశాస్త్రం ప్రకారం ప్రతి మానవునిలోనూ అభివృద్ధి చెందటానికి అవసరమయిన లక్షణాలు సమానంగానే వున్నవి. పాలకులు - పాలితులు, నాయకులు - అనుచరులు అనే విచక్షణతో గీటుగీసి తారతమ్యాలు సృష్టించటం ప్రజాస్వామ్య మనుగడకు భంగకరం. మానవ నిర్మిత రాజకీయ, ఆర్థిక, సాంఘిక కట్టుబాటులు, ఆడ్డంకుల వలన ఇతర కారణాల వలన మానవుడు తన సహజ గుణాలను మరచిపోవటం లేక వ్యక్తపరచుకొనగల శక్తిని కోల్పోవటం జరుగుచున్నది. మానవునిలోని సహజలక్షణాలను ప్రజ్వలింప చేయగల విద్యా, సాంస్కృతిక రంగాలను విస్తరింప చేయాలి. ప్రజాస్వామ్య రక్షణ కిది పునాదిరాయి, ప్రాతిపదిక కావాలి.

మానవుని అంతర్గత శక్తులను ప్రస్ఫుటం చేసి మానవుని మానవునిగా సమాజంలో సమానవ్యక్తిగా, స్వతంత్ర పౌరునిగా గౌరవస్థానాన్ని యిచ్చి సమాన హోదాలో మానసిక అభివృద్ధికి తోడ్పడగల విద్యావిధానాన్ని ప్రవేశ పెట్టటం అవసరం. ప్రస్తుతం దేశంలో వున్న ప్రాథమిక, ఉన్నత సాంకేతిక విద్యావిధానాలు యిందుకు వుపకరించకపోగా యే కొద్దిమందికి మాత్రమే పరిమితమై వున్నవి. "సమాజానికి కావలసినది పేటికి భిన్నమైన, నవసమాజ నిర్మాణానికే వుపకరించగల విద్యావిధానం మాత్రమే. ఉన్న వ్యవస్థను నిలబెట్టగల యెట్టి విద్యావిధానమైనా సరియైనది కాజాలదు. నూతన వ్యవస్థను నిర్మించాలి అందుకు నూతన విద్యా

విధానాన్ని, మానవులు క్రమపద్ధతిలో, హేతుదృష్టితో తమంతట తాము పరిస్థితులను అవగాహన చేసుకొని బాధ్యత వహించి పరిష్కార మార్గం కనుగొనగల విద్యా విధానాన్ని ప్రవేశపెట్టాలి."

ప్రస్తుత సమాజ వ్యవస్థ మానవ నిర్మితమే. దీని అవసరం తీరినప్పుడు అభివృద్ధిపథంలో మరో వ్యవస్థను నిర్మించుకొనాలి. ఇట్టి దృక్పథం మానవునిలో కలిగించాలి. అతనిలో ఆత్మవిశ్వాసం వున్నప్పుడే తనకు అనుకూలమయిన మరో వ్యవస్థను నిర్మించుకొనటానికి ముందుకు రాగలడు. ఆత్మ విశ్వాసం లేనప్పుడు పునఃసృష్టికి పూనుకొనలేడు. ప్రస్తుత విషమ స్థితికి, నాగరికత ప్రపంచం ఎదుర్కొనే వివిధ సమస్యలకు యిదే ప్రధాన కారణం. "ఆత్మవిశ్వాసం గల వ్యక్తులే యదార్థమయిన ప్రజాస్వామ్య వ్యవస్థను రూపొందించి నిర్మించుకొన గలుగుతారు. మానవునిలో ఆత్మవిశ్వాసం కలగాలంటే పైన భగవంతుడున్నాడనే అజ్ఞానం పటాపంచలు కావాలి. 'దైవ నిర్ణయం, దైవ సంకల్పం' అనే సూత్రాల నుంచి మానవుని విముక్తి చేయాలి. అదేవిధంగా సమిష్టి నిర్ణయానికి, సంఘ కట్టుబాట్లకు మానవుడు దాసోహం కారాదు. ముందుచూపు, దూరదృష్టి అవసరం. ఇందుకు అవసరమయిన రంగాన్ని ఆయత్తపరచగల విద్యావిధానం వుండాలి".

విద్యా సాంస్కృతిక రంగాలను నూతన పంథాలో నిర్మించినప్పుడు వీటి అభివృద్ధితోపాటు అనేకమంది పురుషులు, స్త్రీలు విజ్ఞానవంతులుగా, నిస్వార్థ పరులుగా, మేధావులుగా సంఖ్యాపరిమాణంలో పెరుగుటయే కాకుండా ప్రజాహిత సంస్థలలో పాల్గొని తమ అనుభవాన్ని, వివేచనా శక్తిని, మేధా సంపత్తిని సంఘాభి వృద్ధికి దోహదం చేయటానికి ముందుకు రాగలరు. వారి త్యాగనిరతికి ప్రజలు ఆదరాభిమానాలతో తగిన స్థానమిచ్చి వారిని తమ నాయకులుగా గౌరవించగలరు. విద్యాధికులయినంత మాత్రంచేత వారు సంఘ సేవకులు కాజాలరు. మానవ సేవ, సంఘ అభివృద్ధికి అనుగుణమయిన విద్యావిధానం కావాలి. విద్యాధికులను కూడా మార్చి స్వార్థరహిత, త్యాగనిరతి గల విద్యాధికులను, మేధావులను సృష్టించగల విద్యావిధానం ప్రవేశపెట్టాలి. విద్యకు డిగ్రీయు కంటె విజ్ఞానం, పరిపూర్ణత ప్రధానం కావాలి.

ప్రస్తుత సమాజంలో నీతికి, నైతిక విలువలకు స్థానం లేకుండా పోయినది. అధికారముద్ర - హింసావాదం - రాజకీయ పెత్తనం క్రమమైన,

న్యాయమైన విధానంగా అంగీకరించబడుచున్నది. లక్ష్యసాధనకు కార్యక్రమం, విధానం ఎట్టిదయినా చేపట్టవచ్చుననే ప్రచారం జరుగుచున్నది. ఉత్కృష్టమయిన లక్ష్యాన్ని చేరటానికి నికృష్టమయిన సాధనాలు చేపట్టరాదు. అక్రమ చర్యలవలన క్రమపద్ధతిని సృష్టించలేము. కుల మత ద్వేషాలతో అధికారం చేపట్టిన పార్టీ కుల మత సహకారాన్ని, అనురాగాన్ని పెంపొందించలేదు. అవినీతితో అక్రమ పద్ధతులలో, ధనాన్ని ఎరచూపి వోట్లు కొని, ప్రజలను మభ్యపెట్టి, ప్రలోభాలు కలిగించి ఉన్మాద వాతావరణం సృష్టించే పార్టీలు, అభ్యర్థులు ప్రజలలో అవినీతిని తొలగించలేరు, ప్రశాంత వాతావరణాన్ని సృష్టించలేరు. కనుక రాజకీయ, ఆర్థిక, సాంఘిక చర్యలలో, చట్టనిర్మాణంలో నైతిక విలువలకు ప్రధాన స్థానం యివ్వాలి. ఒక వంక మద్యపానం శాసనబద్ధం చేస్తూ మరో వంక పీడిత ప్రజానీకంమీద సానుభూతిని ప్రకటిస్తూ మద్యపానం విరమించాలని, దారిద్ర్యహేతువని, సంఘానికి చీడపురుగు అని ప్రచారం చేయటంవలన ఫలితం యేముంటుంది? దళితవర్గాలను, బీద ప్రజలను సముద్ధరించటానికి వీరకంకణం కట్టుకుని ఎరుకల, యానాది, రజక, నాయీబ్రాహ్మణ వగైరా వగైరా కుల సంఘాలకు నాయకత్వం వహించి వాటిని ప్రోత్సహించినందువలన ఫలితమేమి? మత ప్రమేయములేని సంక్షేమ రాజ్యం కావాలంటూ అధికారం చేపట్టగానే మతాధికారులకంటె మిన్నగా మౌఢ్యంతో దేవతలను, దేవుళ్ళనూ పూజిస్తూ మత ప్రచారానికి పూనుకునే నాయకులు ప్రజానీకానికి ఎంతవరకు నాయకత్వం వహించగలరు. మతం వ్యక్తి యిష్టాయిష్టాలను బట్టి వుండాలి. ప్రభుత్వ జోక్యం పనికిరాదు.

నీతి పేరుతో జరిగే అవినీతి చర్యలను అరికట్టాలి. మానవుని సంఘంలో ఒక వ్యక్తిగా, స్వేచ్ఛా జీవిగా భావించి వ్యక్తుల పురోభివృద్ధినే సంఘ అభివృద్ధిగా జాతి అభ్యుదయంగా పరిగణించి అట్టి నవసమాజ నిర్మాణానికి కృషి చేయాలి. అవినీతితో యేర్పడిన ప్రభుత్వాలు ప్రజలలో మాలిన్యాన్ని పెంపొందించటానికే వుపకరిస్తవి. కనుక అధికార రాజకీయాలను, పార్టీ ప్రచారాలకు విసుగుచెందిన అనేకమంది ప్రముఖులు, విద్యావేత్తలు, శాస్త్రపరిశోధకులు ప్రస్తుత రాజకీయాల నుంచి దూరంగా వుండటం సర్వసాధారణంగా కనబడుచున్నది. వారి మేధా సంపత్తికి తగిన విలువ నీయకపోవటమే యిందుకు కారణం. పార్టీ ప్రమేయంలేని రాజకీయాల్లో వారు ముందుకు వచ్చి తమ అనుభవాన్ని, శాస్త్ర పరిశోధనలను సమాజాభివృద్ధికి అంకితం చేయగలరు. తమ బాధ్యతను గుర్తెరిగి అట్టి వుద్యమం

కొరకు వారు ముందుకురావలసిన అవసరం ఎంతైనా వున్నది. అచిర్మ శ్రేయో రాజ్యానికి ఆదర్శవంతమైన పురుషులు, స్త్రీలు నాయకత్వం వహించాలి.

రాయ్ కమ్యూనిజమే మానవ స్వాతంత్ర్యానికి అంతిమదశగా అంగీక రించలేదు. 'మానవ స్వాతంత్ర్యానికి హద్దులు, పరిధులు వుండవు, వుండరాదు' అని స్పష్టీకరించాడు. మానవ స్వాతంత్ర్యానికి, సమాజ అభివృద్ధికి దోహదం కలిగించే తన సిద్ధాంతాన్ని, కార్యాచరణను ఇరువదిరెండు సూత్రాలలో సూత్రీకరించాడు. ఇవి నవ్యమానవ సిద్ధాంతానికి ప్రాతిపదికలు - మూలసూత్రాలు. ఇది అంతిమ నిర్ణయం అనిగాని లేక వీటిని సవరించవలసిన, మార్చవలసిన అవసరం లేదనిగాని రాయ్ అభిప్రాయం కాదు. ఆధునిక విజ్ఞానం ఆధారంగా ప్రస్తుత సమాజ అభివృద్ధికి మానవుడు వూహించగల, ఆలోచించగల రీతులలో యీ సూత్రీకరణ జరిగినదని విజ్ఞానం పెరిగిన కొలదీ యిందులో చేర్పులు, మార్పులు వుండటం సహజమేనని రాయ్ అభిప్రాయం. మానవుని ఆలోచనాక్రమంలో ఇది కూడా ఒక దశ. దీనికి అవధులు, అంతులు లేవు.

1848 జనవరిలో కారల్ మార్క్స్, ఫ్రెడరిక్ ఏంగిల్సు మానవ స్వాతంత్ర్యానికి, సమాజ అభివృద్ధికి అప్పటి విజ్ఞానాన్ని, నాగరికత, సంస్కృతులను ఆధారం చేసుకొని నవసమాజ నిర్మాణానికి 'కమ్యూనిస్టు మ్యానిఫెస్టో' పేరుతో ఒక సిద్ధాంతాన్ని, కార్యాచరణను రూపొందించి మానవ ప్రపంచానికి నూతన పంథా చూపించి ఆశాజ్యోతిని వెలిగించారు. దాని ఫలితంగా రష్యాలో 1917 లో విప్లవం సాధించబడినది. కాని అప్పటినుంచి ప్రపంచంలో విజ్ఞానం పెరుగుతూ వచ్చినది. ప్రపంచ చరిత్రలో అనేక మార్పులు జరుగుతూ వచ్చినవి. వీటిని గుర్తించక ఇప్పటికీ 'కమ్యూనిస్టు మ్యానిఫెస్టో' ప్రమాణ గ్రంథంగా పరిగణించటం భావ్యం కాదు. అది అప్పటి పరిస్థితుల ననుసరించి 'ఒక ఆలోచనాక్రమ పద్ధతి' అని అంగీక రించ గలిగితే మార్క్సిజాన్ని త్రోసివేయటం అనే ప్రశ్న వుదయించదు. అందలి మంచిని గ్రహించి ముందుకు సాగటమే ప్రస్తుతం అనుసరించవలసిన విధానం. సరిగ్గా వంద సంవత్సరాల తరువాత యమ్. యన్. రాయ్ మార్క్సిజాన్ని ఆధా రంగా తీసుకొని సరిక్రొత్త ఆలోచనా క్రమపద్ధతిని రూపొందించాడు.

1948 లో రాయ్ తన నవ్యమానవ సిద్ధాంతాన్ని (న్యూ హ్యూమనిజం) ప్రపంచ మానవాళికి ప్రసాదించాడు. ముప్ఫయి సంవత్సరాలు దాటి దీని ప్రభావం

సమాజం మీద, ప్రపంచ రాజకీయాల్లో ఆశించినంతగా కనబడటం లేదని నిస్పృహ చెందనక్కర్లేదు. ప్రభావం వున్నది. చరిత్రగతిలో ఈ కాలం అతి సూక్ష్మాతి సూక్ష్మం. ఈ ఉద్యమం నానాటికీ అభివృద్ధి చెందుతూనే వున్నది. రాయ్ భారత దేశంలో తిరిగి అడుగు పెట్టినప్పటినుంచీ యిట్టి వుద్యమ అవసరాన్ని గుర్తించాడు. ఇందుకు నాందిగా 'రినైజాన్సు సంస్థ'ను స్థాపించి భావవికాసం కొరకు, మూఢ విశ్వాసాలను తొలగించటానికి, ఆత్మవిశ్వాసం కలిగించటానికి తీవ్రకృషి జరుపుతూనే వచ్చాడు. భారతదేశంలో రాయ్ స్వేచ్ఛాయుతమైన, హేతుబద్ధమయిన, శాస్త్రీయదృక్పథం గల వుద్యమానికి పునాదులు వేశాడు.

అధికార రాజకీయాలతో, అవినీతితో నిండిన కాంగ్రెసు ప్రభుత్వాలను చూచి మహాత్మాగాంధీ విస్తుపోయి స్వరాజ్యానంతరం కాంగ్రెసు పార్టీని రద్దుచేసి లోకసేవక సంస్థను స్థాపించాలనే ఆలోచనకు వచ్చాడు. రాయ్ కూడా పార్టీ ప్రమేయంలేని రాజకీయాలు కావాలంటున్నాడు. కొన్ని విషయాలలో అంటే - మానవతా దృక్పథం, నైతిక విలువల ప్రాధాన్యత, వికేంద్రీకరణ, ప్రజాస్వామ్యం - పార్టీ అధికార రాజకీయాలు గురించి ఇద్దరి భావాలలో సామ్యం వున్నది. కాని ఇద్దరి దృక్పథాల్లో ఏ మాత్రం పొంతనలేదు. సిద్ధాంతంలో, ఆచరణలో, గమ్యస్థానంలో ఉత్తర దక్షిణ ధృవాలను చూపుచున్నవి. ఒకరిది ఆధ్యాత్మిక వాదం, మరొకరిది శాస్త్రీయ భౌతిక వాదం. ఒకరి సిద్ధాంతం మానవునిలో ఆత్మవిశ్వాసం చంపి 'అంతా రామమయం' లేక 'భగవదేచ్ఛ' లేక 'అంతర్వాణి'గా చూపగా మరొకరి సిద్ధాంతం 'మానవుడే అన్నింటికీ మూలాధారం'గా చూపించి అతనిలో ఆత్మవిశ్వాసం కలిగించి స్వేచ్ఛాజీవిగా నిలబెట్టుతుంది.

రాయ్ భారతదేశ రాజకీయాల్లో ఏకాకి అనిపించుకొనినా ప్రపంచ మేధావులు ఆయన మేధా సంపత్తిని గుర్తించారు. 1952 లో ప్రపంచంలోని వివిధ దేశాల్లోని హ్యూమనిస్టు సంఘాలు అంతర్జాతీయ సంస్థగా యేర్పడి ఆమ్‌స్టర్‌డమ్‌లో తమ ప్రధాన కార్యాలయాన్ని స్థాపించినవి. ఇందులో రాయ్ ఉపాధ్యక్షులలో వొకరిగా ఎన్నుకొనబడ్డాడు. ప్రథమ హ్యూమనిస్టు కాంగ్రెసు మహాసభలో పాల్గొని తన సందేశాన్ని, సిద్ధాంతాన్ని విపులీకరించటానికి ఆహ్వానించబడ్డాడు. అమెరికా, ఐరోపాఖండ దేశాల్లోని అనేక విశ్వవిద్యాలయాలు, ప్రజాహిత సంస్థలు రాయ్‌ని ఆహ్వానించినవి. తన నూతన సిద్ధాంతాన్ని, నవ్య మానవవాదాన్ని పాశ్చాత్యులకు

అందించి వెలుగునివ్వటానికి 1952 లో ప్రయాణసన్నద్ధుడై వుండగా అదే సమయంలో ముస్సోరిలో విశ్రాంతి తీసుకొంటూ ఒకనాడు దంపతు లిద్దరూ నడక ప్రయాణం నుంచి తిరిగి వస్తున్నప్పుడు రాయ్ ఒక ఎత్తైన ప్రదేశం నుంచి కాలుజారి దాదాపు ఏభై గజాల దూరం దొర్లుకుంటూ రావటంతో ఒంటినిండా గాయాలు పడటం, ఆరోగ్యం దెబ్బతినటం జరిగినది. తరువాత పాక్షికంగా పక్షవాతం రావటంతో ఆరోగ్యం పూర్తిగా నీరసించినది. ఆ ప్రమాదం నుంచి బయటపడి తిరిగి 1953 లో ప్రయాణ సన్నద్ధుడు కాగా మళ్లీ అదే పక్షవాత రోగానికి గురి అయ్యాడు. చివరకు అదే వ్యాధితో 1954 జనవరి 25 న తన జీవితం చాలించాడు.

1942 లో లక్నోలో జరిగిన రాడికల్ డెమొక్రాటిక్ పార్టీ మహాసభలో గంభీరోపన్యాసమిస్తూ రాయ్ 'వెలుగు తూర్పు నుంచే వెలువడుతుంది' అని ప్రకటించాడు. దాని అంతరార్థం తరువాతగాని బోధపడలేదు. నాలుగు విప్లవాలలో ప్రముఖపాత్ర వహించిన రాయ్ మరికొంతకాలం జీవించివుంటే ప్రపంచ రాజకీయాలను, మానవాళిని తీర్చిదిద్దగల వుద్యమం - తన సిద్ధాంతంద్వారా ఒక ఉన్నత స్థాయికి చేర్చగలిగి వుండేవాడు.

రాయ్ మరణానంతరం భారతదేశంలోని రాయ్ అనుచరులు హేతువాదాన్ని, భావ వికాసాన్ని పెంపొందించటానికి ముఖ్యంగా సాంస్కృతిక రంగాల్లో విస్తారంగా కృషి చేస్తూవున్నారు. రాయ్ సూచించిన రాడికల్ హ్యూమనిజం భారతదేశంలోని ప్రజాస్వామ్య సోషలిస్టు వుద్యమానికి దోహదకారియై ముందు ముందు యీ వుద్యమం బలవత్తరం కావటానికి కారణభూతమయినది. "ఇండియన్ కమిటీ ఫర్ కల్చరల్ ఫ్రీడం"లో రాయ్ అనుచరులే హెచ్చుగా వున్నారు. నెహ్రూ ప్రారంభించిన 'పంచాయతీరాజ్' రాయ్ ప్రచారం చేసిన వికేంద్రీకరణను సూచిస్తున్నది. సర్వోదయ నాయకుడుగా మారిన జయప్రకాశనారాయణ తన పార్టీ రహిత రాజకీయాలకు రాయ్ కొంతవరకు కారణభూతునిగా అంగీకరించాడు. పార్టీ రాజకీయాలు ఎంత కలుషభూయిష్టమో ప్రజలు యిప్పుడు గ్రహించగలుగుతున్నారు.

టెర్రరిస్టుగా, తీవ్ర జాతీయవాదిగా తన జీవితం ప్రారంభించిన రాయ్ మార్క్సిస్టుగా అనుభవాన్నిగడించి చివరకు హ్యూమనిస్టుగా పరిపక్వదశను చేరుకున్నాడు. మార్క్సిస్టుగా స్వర్గాన్ని భూమికి దించాలని సర్వవిధాల ప్రయత్నించాడు. చివరకు అది అసాధ్యం, అసంభవం అని గుర్తించి భూమినే

కొంత మరమ్మతుచేసి అందుకు అనుకూలంగా మార్చటానికి, దరిదాపులకు చేర్చటానికి సన్నద్ధుడయ్యాడు. తన కలలు, వ్యూహాలు నిజరూపం ధరించకనునుసే జీవితం చాలించటం శోచనీయం. ఆచరణకు పూనుకొనవలసినది రాయ్ అనుచరులు, స్వాతంత్ర్యప్రియులయిన మేధావులు.

రాయ్ ప్రవచించిన రాడికల్ హ్యూమనిజం లేక నవ్య మానవవాదం సమాజాన్ని కమ్యూనిజం నుంచి విడిపించి ఉత్తమయిమన మరో దశను చేర్చటానికి ప్రయత్నిస్తుంది. పార్లమెంటరీ ప్రజాస్వామ్యం, సోషలిజం లేక కమ్యూనిజం మానవ పురోగమనానికి అంతరాయాలు కల్గించటంచేత వాటిని పరిత్యజించవలసిన అవసరమున్నది. మానవుడు యదార్థ మానవునిగా వికసించాలంటే మధ్య దళారీల ప్రమేయం వుండకూడదు. స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలు పరిపక్వదశను చేర్చగల సమాజ నిర్మాణం జరగాలి. ఇందుకు రాజకీయ స్వాతంత్ర్యముండాలి. ఆర్థిక అసమానతలు తొలగించాలి. సహకార వుద్యమాన్ని విస్తరింపచేయాలి. శాస్త్రీయ విజ్ఞానం పెంచాలి. విద్యా, సాంస్కృతిక రంగాల్లో తీవ్రమయిన మార్పులు తీసుకొని రావాలి. మానవుడు తన భవిష్యత్తుకు తానే కారకుడనే ఆత్మవిశ్వాసాన్ని కల్గించాలి. దైవ ప్రేరణ, దైవ సంకల్పం అనే భావాలు మటుమాయం చేయాలి.

క్లుప్తంగా రాయ్ సిద్ధాంతంలో ప్రధాన ఆదర్శాలను యీ విధంగా తీసికొనవచ్చును.

(1) సమాజంలో వ్యక్తికి ప్రాధాన్యత యిచ్చి సమాజ అభివృద్ధికి వ్యక్తి స్వేచ్ఛను, అతని శారీరక, మానసిక అభివృద్ధులను కొలమానంగా పరిగణించాలి.

(2) ఐహిక యిచ్ఛలతో కూడిన లౌకిక ప్రజాస్వామ్య రాజ్యంలో నీతికి, నైతిక విలువలకు తగిన స్థాన మివ్వాలి. ఆదర్శ రాజ్య స్థాపనకు ఆదర్శవంతమైన సాధనాలు చేపట్టాలి.

(3) మానవుడు సహజంగా భౌతికవాది, క్రమబద్ధుడు, హేతువాది. కనుక నీతి, నిజాయితీల కొరకు సత్ప్రవర్తనకు నిలబడగల విచేచనాశక్తి అతనిలో వున్నది. నిర్ధాణమై లేక పత్తిడులకు, పరిస్థితులకు లొంగిన మానవుని లోని యీ లక్షణాలను ప్రస్ఫుటింపజేసి ఉత్తమ మానవునిగా రూపొందించవలసిన బాధ్యత మేధావులపై వున్నది.

(4) ప్రజాస్వామ్య రాజ్య వ్యవస్థ నిర్మాణం పై నుంచి క్రిందకు వుండరాదు. పిరమిడు రూపంలో స్తూపాకారంలో క్రింద నుంచి నిర్మించాలి. ప్రజల కొరకు గాక ప్రజలచేత, ప్రజల యొక్క పరిపాలన సాగాలి.

1949 అక్టోబరు 23 న రాయ్ తన మిత్రుడు రత్ ఫిషర్‌కు వ్రాసిన లేఖలో యీ విధంగా వ్రాశాడు.

"పాతిక సంవత్సరాల నుంచి ప్రచారం చేస్తున్న మన భావాలను ఒక్క సారి పూర్తిగా విస్మరించటానికి వీల్లేదు. కమ్యూనిస్టులు సహించరాని తప్పులు చేస్తున్నారు. అయినా వారితో పూర్తిగా సంబంధాలు త్రెంచుకోలేము....జీవితమంతా ఆర్థిక సమానతకు, రాజకీయ స్వాతంత్ర్యానికి, సాంఘిక న్యాయానికి అంకితం చేసిన వ్యక్తి ప్రస్తుత సమాజంలోని వసునకొండకు, అణగారింపులకు, ఆర్థిక అసమానతలకు విసిగి వేసారక తప్పదు.....పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో వున్న అసమానతలను, అస్వాతంత్ర్యాన్ని తీవ్రంగా విమర్శించిన కారల్ మార్క్స్ అవివేకుడా? లేక తన విమర్శనలను హృదయపూర్వకంగా చేయలేదా? స్టాలిన్ ఆర్థిక సమానత పేరుతో శ్రామికులు శ్రమించి సంపాదించుకొనినది కూడా కొల్లగొట్టటం వలన సోషలిజం చెప్పే సిద్ధాంతాలు, సాంఘిక న్యాయాలను మనము త్యజించ వలసినదేనా?"

రాయ్ ప్రజాస్వామ్య సూత్రాలతో రూపొందిన 'లిబరలిజం'లో వున్న వ్యక్తి స్వేచ్ఛను, రాజకీయ స్వాతంత్ర్యాన్ని మార్క్సిజం రూపొందించిన సోషలిజం లేక కమ్యూనిజంలోని ఆర్థిక పురోగతిని ప్రాతిపదికలుగా చేపట్టి వాటి రెంటిలోని లోపాలను విడనాడి వేరే సిద్ధాంతాన్ని రూపొందించాడు. పార్టీ రాజకీయాలు, పార్టీ ప్రభుత్వాలు యీ రెంటిలోనూ వాటి అసమర్థతను చూపి వాటి ఆదర్శాలకు భిన్నంగా అవి ఆచరణలో వ్యక్తం కావటంచేత పార్టీల ప్రమేయంలేని రాజకీయాల ద్వారా సరాసరి ప్రజలే తమ రాజకీయ, ఆర్థిక, సాంఘిక నిర్మాణంలో పాల్గొని తమ భవిష్యత్తుకు, శ్రేయస్సుకు తామే అధినేతలమనే భావం కలిగేటట్లు చేయగలిగి నప్పుడే యదార్థమైన ప్రజాస్వామ్యం వర్ధిల్లగలదని చెప్పాడు. ఇందుకు నిస్వార్థులు, త్యాగశీలు రయిన మేధావంతులు, విద్యావంతులు, సేవాపరాయణులు ముందుకు వచ్చి బాధ్యతను చేపట్టాలని విజ్ఞప్తి చేశాడు.

# రాడికల్ హ్యూమనిస్టు సూత్రాలు :

1

మానవుడు సమాజానికి నమూనా (మచ్చుతునక). సహకారపూర్వక సామాజిక సంబంధాలు వ్యక్తిలోని అంతర్గత శక్తుల పెంపుకు దోహదం కలిగిస్తవి. సామాజిక అభివృద్ధికి వ్యక్తి అభివృద్ధి కొలమానం. సమిష్టి తత్వం వ్యక్తుల కలయికను సూచిస్తుంది. వ్యక్తులు అనుభవించే స్వేచ్ఛా, సుఖజీవన కలయికను అధిగమించి, వేరుగా భావించే సామాజిక విముక్తి, అభ్యుదయం అనే ఆదర్శాలు ఊహాకల్పితమాత్రములై ఎప్పుడూ పొందరానివి గానే వుండిపోతవి. సుఖజీవన మనేది వాస్తవమయితే అది వ్యక్తులచేతనే అనుభవించబడుతుంది. మానవ సమాజంలోని ఏ అంశాన్ని కూడా జాతి, వర్గ, మరి ఏ యితర రూపాలతో సమిష్టిగా చిత్రించటం పొరపాటు. అట్టి భావన ఆచరణలో వ్యక్తిని బలిచేయటానికే వుపకరిస్తుంది. వ్యక్తుల సుఖజీవన వ్యాపారమే సమిష్టి సుఖజీవనం.

2

స్వేచ్ఛాపిపాస, సత్యాన్వేషణలు ప్రధాన హేతువులుగా మానవాభ్యుదయాన్ని ప్రేరేపిస్తవి. స్వేచ్ఛాపిపాస అంటే మానవుడు తన మనుగడకొరకు జరిపే పోరాటాన్ని ఉత్తమ (ఉచ్ఛ) స్థాయి - అనగా వివేకం, ఉద్వేగాలతో కూడిన స్థాయిలో - సాగించటం. సత్యాన్వేషణ దానినిబట్టి వుత్పన్నమయిన ఉపచ్ఛాయ (ఉప సిద్ధాంతం). ప్రకృతిని గురించి పరిజ్ఞానం పెంపొందినకొలదీ మానవుడు ప్రకృతిజన్యమయిన యీతిబాధలనుంచి, భౌతిక, సామాజిక దౌష్ట్యములనుంచి క్రమాభివృద్ధితో విముక్తుడు కావటానికి ఆ జ్ఞానం ఉపకరిస్తూవుంటుంది. జ్ఞానం ద్వారా పొందినదే సత్యం.

3

వ్యక్తిగా, సమిష్టిగా చేసే సహేతుకమయిన మానవ ప్రయత్న ప్రయోజనం అనుక్షణం అభివృద్ధిపథంలో స్వేచ్ఛను పొందటమే. స్వేచ్ఛఅంటే యాంత్రికమయిన సామాజిక వ్యవస్థలోని వ్యక్తులమాదిరి చక్రంలోని ఆకులవలె కాకుండా పరిపూర్ణ మానవులుగా ఎంచబడి వారి పరిపూర్ణ వికాసానికి అడ్డుతగిలే

అవరోధాలు క్రమాభివృద్ధితో అదృశ్యంకావటం. కనుక ఏ సమిష్టి యత్నంలోగాని లేక ఏ సామాజిక వ్యవస్థలో గాని అందలి అభ్యుదయ, విమోచనత్వాలలో గల విశిష్టతకు ఆ సమాజంలోని వ్యక్తుల స్థానాన్ని కొలమానంగా తీసుకొనాలి. వాస్తవంగా సమాజంలోని వ్యక్తులు పొందుచున్న ప్రయోజనాన్ని బట్టే ఏ సమిష్టి కృషి విజయాన్నైనా నిర్ణయించవలసి వుంటుంది.

## 4

నియమబద్ధమయిన భౌతిక ప్రకృతి నుంచి మానవుడు ఉద్భవించటం వలన వస్తుతః హేతువాది అగుచున్నాడు. హేతుత్వం జీవలక్షణం కనుక సంకల్పానికి విరుద్ధం కాదు. మేధాశక్తి, ఉద్వేగం జీవుల సర్వసామాన్య లక్షణాలుగా నిరూపించవచ్చును. కాబట్టి చారిత్రక నియతివాదం సంకల్ప స్వేచ్ఛను త్రోసిపుచ్చదు. యదార్థంగా మానవ సంకల్పం ఎంతో బలవత్తరమయిన నిర్ణాయకశక్తిని కలిగి వుంటుంది. లేనిచో హేతుబద్ధమయిన చారిత్రక గమనంలో విప్లవాలకు స్థానం వుండదు. సహేతుకము, వైజ్ఞానికము అయిన నియతివాదాన్ని మతసంబంధమయిన కర్మసిద్ధాంతంతో ముడిపెట్టి తికమకపరచకూడదు.

## 5

భౌతిక వాదాన్ని పొరపాటుగా వ్యాఖ్యానించుకొనటం చేతనే చరిత్రను ఆర్థికపరంగా వ్యాఖ్యానించటం జరిగినది. ఇది ద్వైతభావాన్ని సూచిస్తుంది. కాని భౌతికవాదం ఏకత్వాన్ని ప్రతిపాదించే సిద్ధాంతం. చరిత్ర నియమబద్ధమయిన గమనం కలిగి వున్నది. అయితే దానికి కారణాలు అనేకం. అందులో మానవ సంకల్పం ఒక కారణం. కనుక చరిత్ర గమనాన్ని ఎల్లప్పుడూ ఏదో ఒక ఆర్థిక ప్రేరేపణతో సరాసరి ముడిపెట్టటానికి వీలులేదు.

## 6

భావోత్పత్తి శారీరక వ్యాపారం. పరిసరాలను అవగాహన చేసుకొనటం వలన భావోత్పత్తి జరుగుతూవుంటుంది. అయితే ఒకసారి ఏర్పడిన భావాలు స్వయం నియమబద్ధమయి తమంతట తాము మనగలవు. భావగమనమూ, సామాజిక పరిణామమూ ఒకదానిపై నొకటి పరస్పరం తన ప్రభావాన్ని ప్రసరింపజేసుకుంటూ సమాంతర స్థాయిలో సాగిపోతవి. అయినా మానవ పరిణామక్రమంలో ఏ ప్రత్యేక

దశలోనూ చారిత్రక సంఘటనలకూ, భావోద్యమాలకూ సరాసరి కార్యకారణ సంబంధం నెలకొల్పటానికి వీలులేదు. (ఇచ్చట 'భావం' సర్వసామాన్య తాత్త్విక దృక్పథంలో లేక భావక్రమములో వాడబడినది.) సాంస్కృతిక రీతులూ, నైతిక విలువలూ కేవలం అప్పుడు స్థిరపడివున్న ఆర్థిక సంబంధాలపై ఏర్పడిన సిద్ధాంత సౌధాలు కావు. అవి కూడా చారిత్రకంగా నియతమైనవే. అయితే భావ చరిత్ర ననుసరించి అవి యేర్పడుతూ వుంటవి.

7

నూతన స్వేచ్ఛా ప్రపంచాన్ని సృష్టించటానికి విప్లవం సమాజ ఆర్థిక పునర్నిర్మాణ దశను అధిగమించి ముందుకు సాగాలి. పీడనకు, దోపిడీకి గురి అయిన వర్గాల పేరుతో రాజకీయ అధికారాన్ని చేపట్టినంత మాత్రంచేత, ఉత్పత్తి సాధనాలలో స్వంత ఆస్తి హక్కును నిర్మూలించటంచేత స్వాతంత్ర్యం అవశ్యంగా సిద్ధించదు.

8

స్వేచ్ఛ అనే లక్ష్యాన్ని చేరటానికి కమ్యూనిజం లేక సోషలిజం ఒక సాధన మాత్రమే. అది ఆ లక్ష్య సాధనకెంతవరకుపకరిస్తుంది అనేది అనుభవాన్ని బట్టి నిర్ణయించాలి. రక్తమాంసాలున్న మానవుణ్ణి ఊహాకల్పితమయిన జాతి లేక వర్గం అనే సమిష్టి అహానికి బానిసను చేసే రాజకీయ విధానము, ఆర్థిక ప్రయోగము స్వేచ్ఛ అనే లక్ష్యాన్ని చేరుకొనటానికి తగిన సాధనాలు కావడానికి వీలులేదు. ఎందుకనగా స్వేచ్ఛా నిరోధం స్వేచ్ఛకు దారితీస్తుందనుకొనటం అసంగతం. మరియు వ్యక్తిని ఊహా కల్పితమైన సమిష్టి అహానికి బలిచేయడం స్వేచ్ఛకాదు. వ్యక్తి సర్వంసహాధికారాన్ని గుర్తించక స్వేచ్ఛ అనే ఆదర్శాన్ని కేవలం మిధ్యగా కొట్టి పారవేసే ఏ సామాజిక తత్వశాస్త్రమయినా, ఏ సమాజ పునర్నిర్మాణ పథక మయినా అభ్యుదయ, విప్లవ ప్రాధాన్యతను అతి పరిమిత మోతాదులో కల్గి వుంటుందే గాని వాటినుంచి అదనంగా ఆశించటానికి వీలులేదు.

9

రాజ్యం (స్టేట్) సమాజం యొక్క రాజకీయ వ్యవస్థ. కాబట్టి అది కమ్యూనిస్టు విధానంలో క్షీణించి రూపరహితం అవుతుందనే భావన కేవలం భ్రమ మాత్రమే. అనుభవం దీనిని పటాపంచలు చేసినది. పరిశ్రమలను సమాజపరం చేసే

ప్రణాళికాబద్ధమయిన ఆర్థిక విధానానికి శక్తివంతమయిన రాజకీయ యంత్రాంగం అవసరం. అట్టి యంత్రాంగం ప్రజాస్వామ్యపు అదుపులో వున్నప్పుడు మాత్రమే నూతన సామాజిక వ్యవస్థలో స్వేచ్ఛకు హామీ వుంటుంది. రాజకీయ ప్రజాస్వామ్యం, వ్యక్తి స్వేచ్ఛ వున్నప్పుడే ఉత్పత్తిని వినియోగార్థం రూపొందించే ప్రణాళిక ఆచరణకు సాధ్యపడుతుంది.

## 10

ప్రభుత్వ యాజమాన్యం, ప్రణాళికాబద్ధమయిన ఆర్థిక విధానం వాటంతటవిగా శ్రామికులపై జరుగు దోపిడీని అంతమొందించలేవు; సంపదను సమంగా పంపిణీ చేయటానికి కూడా దోహదం కావు. రాజకీయ ప్రజాస్వామ్యం లేకుండా ఆర్థిక ప్రజాస్వామ్యం అసంభవం. అదేవిధంగా ఆర్థిక ప్రజాస్వామ్యం లేకుండా రాజకీయ ప్రజాస్వామ్యం సంభవం కాదు.

## 11

నియంతృత్వం తనకు తానుగా శాశ్వతంగా స్థిరపడటానికి జాగ్రత్త వహిస్తుంది. రాజకీయ నియంతృత్వం క్రింద జరిగే ప్రణాళికాబద్ధమయిన ఆర్థిక విధానం - సామర్థ్యం, సమిష్టియత్నం, సాంఘిక అభ్యుదయం - అనే సాకులతో వ్యక్తి స్వేచ్ఛను నిరాదరిస్తుంది. తత్ఫలితం ? ప్రస్తుతం వూహించినట్లుగా సోషలిస్టు సమాజంలో ఉత్తమ స్థాయికి చెందిన ప్రజాస్వామ్యం సంభవం కాదు. నియంతృత్వం తాను కాంక్షించే లక్ష్యాన్ని తానే చిత్తు చేస్తుంది.

## 12

అనుభవం ద్వారా పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలోని లోపాలు బట్టబయలు చేయబడ్డవి. అధికారదత్తత వలననే అవి సంభవించినవి. ప్రజాస్వామ్యాన్ని సమర్థవంతం చేయాలంటే అధికారం సదా ప్రజలలోనే స్థిరత్వం పొంది వుండాలి. అంతేకాదు. వారు తమ సర్వంసహాధికారాన్ని నియమిత కాలాలలోగాక ఎల్లప్పుడూ సమర్థవంతంగా చలాయించుకొనడానికి తగిన మార్గాలు, సాధనాలు వుండాలి. ఏకాకులుగా వుండే పౌరులు సర్వసాధారణంగా ఎల్లప్పుడూ క్రియలో శక్తివిహీనులుగానే వుంటారు. తమకున్న అధికారాన్ని అమలుపరచుకొనటానికీ, ప్రభుత్వ యంత్రాంగాన్ని స్థిరంగా తమ అదుపులో వుంచుకొనటానికీ చలామణి చేయగల సాధనాలు వుండవు.

## 13

లాంఛన ప్రాయమైన పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో లిబరలిజం (స్వేచ్ఛావాదం) దోషారోపణకు లేక పెడర్థాలకు గురిచేయబడ్డది. స్వేచ్ఛా వ్యాపార సూత్రం మనిషిని మనిషి దోచుకొనటానికి చట్టబద్ధమయిన అవకాశం కల్పిస్తున్నది. 'ఆర్థిక మానవుడు' అనే భావన వ్యక్తి విమోచన సూత్రాన్ని వ్యతిరేకిస్తుంది. ఆర్థిక మానవుడు అంటే బానిస లేక బానిస యజమాని కాక తప్పదు. కాబట్టి ఈ నీచ భావాన్ని తొలగించి మానవుడు సహజతః నీతిజీవి అనే వాస్తవికతను, హేతువాది కనుక నీతిపరుడు (మంచివాడు) అనే భావాన్ని కలిగించాలి. నీతి అంటే అంతరంగానికి జరిగే విన్నపం. అంతరంగమంటే పరిసరాలను సహజ వాసనల (జ్ఞానం)తో గుర్తించి ప్రతిక్రియించటం. చైతన్య స్థాయిలో అది స్వాభావికంగా జరిగే జీవ ప్రవృత్తి. కాబట్టి అది సహేతుకం.

## 14

పార్లమెంటరీ ప్రజాస్వామ్యానికి నియంతృత్వం ప్రత్యామ్నాయం కాదు. పౌరులు శక్తి విహీనులుగా, వికారులుగా చేయబడు లాంఛనప్రాయమైన ప్రజా స్వామ్యానికి నిర్మాణాత్మకమైన ప్రజాస్వామ్యమే ప్రత్యామ్నాయం. దేశవ్యాప్తంగా, ప్రజా సంఘాల అల్లిక ఆధారంగా నిర్మాణాత్మక ప్రజాస్వామ్య పునాదిని నిర్మించి పార్లమెంటు శీర్షికగా స్తూపాకారం (పిరమిడు)లో రాజ్య నిర్మాణం జరగాలి. సమాజం నిర్మించుకొనే రాజకీయ వ్యవస్థ అయిన రాజ్యం మొత్తం సమాజంతో సమ్మిళితమై సహయోగం పొందాలి. అప్పుడే రాజ్యం స్థిరంగా ప్రజాస్వామ్య పరమైన అదుపులో వుంటుంది.

## 15

మానవుడు యోచనాపరుడు. వ్యక్తిగా మాత్రమే అతడలా రాణించ గలడు. అట్టి మానవుడు తన ప్రపంచానికి తానే కర్త అనే పరమ చారిత్రక సత్యాన్ని బలపరచటమే విప్లవాత్మకము, విమోచనదాయకమయిన సాంఘిక సిద్ధాంత కర్తవ్యం. మెదడు ఒక ఉత్పత్తి సాధనం. అది అత్యంత విప్లవాత్మకమయిన సరుకును ఉత్పత్తి చేస్తుంది. పాతను బద్దలు కొట్టగల భావాలు లేనిదే విప్లవాలు రావు. అధిక మొత్తంలో మానవులు తమ సృజనాత్మక శక్తిని తెలిసికొని,

ప్రపంచాన్ని పునర్నిర్మించాలనే దృఢసంకల్పంతో ప్రేరేపించబడి, సాహసోపేత మయిన భావచైతన్యం కలిగి, స్వేచ్ఛా మానవులతో కూడిన స్వేచ్ఛా సమాజమనే లక్ష్యంతో ఉద్దీప్తులైనప్పుడు మాత్రమే ప్రజాస్వామ్యం వర్ధిల్లటానికి తగిన పరిస్థితులు సృష్టించ గలుగుతారు.

## 16

సాంఘిక విప్లవ విధానం, కార్యక్రమం సాంఘికాభ్యుదయ ప్రాథమిక సూత్ర పునరుద్ఘాటనపై ఆధారపడాలి. స్వేచ్ఛ, సహేతుక సహకార జీవనసూత్రాల నాధారంగా పట్టుదలతో, విపులయత్నంతో ప్రజలను విద్యావంతులుగా చేయడం వలననే సాంఘిక పునర్వికాసం రాగల్గుతుంది. అప్పుడే ప్రజలు విప్లవానంతర సామాజిక - రాజకీయ వ్యవస్థ యొక్క పునాది నిర్మాణానికి సమర్ధవంతమయిన ప్రజాస్వామ్య సంఘాలుగా సమీకృతం చేయబడతారు. సాంఘిక విప్లవానికి పునర్వికాసం పొందిన మానవుల సంఖ్య అపరిమితం కావాలి. ప్రజాసంఘాలు విస్తరణ శీఘ్రగమనాన్ని పొందాలి. కాగా వీటిరెంటినీ సమన్వయపరచే వ్యవస్థా నిర్మాణం వుండాలి. అదేవిధంగా విప్లవ కార్యక్రమం స్వేచ్ఛ, హేతుత్వం, సాంఘిక సామరస్యత అనే సూత్రాలపై నాధారపడి వుండాలి. అంటే సామాజిక జీవితక్రమంలో వున్న గుత్తాధిపత్యాన్ని, స్వప్రయోజనతత్వాన్ని అన్నివిధాల తొలగించి వేయటం.

## 17

రాడికల్ ప్రజాస్వామ్యం ముఖ్యంగా మనిషిని మనిషి దోచుకుతినే అవకాశంలేని ఆర్థిక పునర్నిర్మాణ సమాజాన్ని అభిలషిస్తుంది. సమాజంలోని వ్యక్తుల వైజ్ఞానిక, కళాత్మక శక్తులు వికసించటానికి ముందు క్రమానుగతంగా, అభ్యుదయ కరంగా వారి భౌతిక అవసరాల సంతృప్తి జరగటం అవసరం. ప్రజల జీవన ప్రమాణాన్ని అభ్యుదయకరంగా పెంచుటకు పూచీనివ్వగల ఆర్థిక పునర్ని ర్మాణం రాడికల్ ప్రజాస్వామ్య రాజ్యానికి పునాది. ప్రజలు ఆర్థికంగా విముక్తులు కావటం వారి స్వేచ్ఛాపథ గమనంలో ఒక ప్రధాన అంతస్తుగా భావించాలి.

## 18

నూతన సామాజిక వ్యవస్థ యొక్క ఆర్థిక విధానం - ఉత్పత్తి, పంపిణీలు ప్రజల వినియోగార్థం, అవసరాలకు - అనే ప్రాతిపదికపై ఆధారపడి వుంటుంది.

రాజకీయ వ్యవస్థ - అధికార దత్తతవలన ప్రజలకున్న అధికారాన్ని పోగొట్టే విధానాన్ని తొలగిస్తుంది. కాగా వయోజను లందరూ ప్రజా సంఘాల ద్వారా ప్రత్యక్షంగా పాల్గొనే విధానంమీద ఆధారపడి వుంటుంది. సంస్కృతి - సర్వత్ర జ్ఞాన వ్యాప్తిని కలిగించడంమీద, తక్కువ అదుపు, ఎక్కువ అవకాశాలు కల్గి శాస్త్రీయమయిన, సృజనాత్మకమయిన కార్యకలాపాల్లో ఆసక్తిని కలిగించటం మీద ఆధారపడి వుంటుంది. నవ సమాజం హేతువాదం, విజ్ఞానం మీద నిర్మింపబడటం వలన అవశ్యంగా ప్రణాళికాబద్ధం చేయబడుతుంది. అయితే వ్యక్తి స్వేచ్ఛ ప్రధాన లక్ష్యంగా ఈ నవ సమాజం రాజకీయంగా, ఆర్థికంగా, సాంస్కృతికంగా ప్రజా స్వామ్య మవుతుంది. తత్ఫలితంగా అట్టి ప్రజాస్వామ్యం తనను తాను రక్షించు కొనగల స్థితిలో వుంటుంది.

## 19

స్వేచ్ఛా ప్రపంచాన్ని సృష్టించాలనే దృఢసంకల్పమున్న, ఆధ్యాత్మికంగా (మానసికంగా) స్వేచ్ఛాజీవులయిన మానవుల సమిష్టియత్నంతో రాడికల్ ప్రజాస్వామ్య ఆదర్శం సాధించబడుతుంది. అట్టి మానవులు ప్రజలకు కాబోయే పరిపాలకులుగా కాక వారికి మార్గదర్శకులుగా, స్నేహితులుగా, తత్వవేత్తలుగా వ్యవహరిస్తారు. వారి రాజకీయ ఆచరణ స్వేచ్ఛాలక్ష్యానికి అనుగుణంగా, హేతు బద్ధంగా వుంటుంది. ప్రజల్లో స్వాతంత్ర్యేచ్ఛ ఇనుమడించిన కొలదీ వారి ప్రయత్నాలు కూడా దృఢతరమవుతూ వుంటవి. చివరకు పర్యవసానంగా చైతన్య వంతమయిన ప్రజాభిప్రాయ మద్దతుతో, వివేకవంతమయిన కార్యాచరణతో రాడికల్ ప్రజాస్వామ్య రాజ్యం అవతరిస్తుంది. అధికార కేంద్రీకరణకు, స్వేచ్ఛకు పొత్తు కుదరదని గుర్తించడం చేత వీలైనంతగా అధికార వికేంద్రీకరణనే రాడికల్ ప్రజాస్వామ్యవాదులు కాంక్షిస్తారు.

## 20

వ్యక్తి స్వేచ్ఛను హరించని విధంగా అందరి అభ్యుదయ, శ్రేయస్సులకు దోహద మిచ్చేటట్లు సమాజ పునర్నిర్మాణం జరగటానికి పౌరుని విద్యావంతుని చేయటం ప్రథమ కర్తవ్యంగా భావించాలి. ప్రజాసంఘాలు పౌరునికి రాజకీయ, పౌర విద్య గరపే పాఠశాలలుగా ఉపకరిస్తవి. నిస్సంగులయి, తటస్థంగా వున్న మేధావులను రాడికల్ ప్రజాస్వామ్య రాజ్య నిర్మాణం, ఆచరణ, ప్రజాహిత

కార్యాలలో అగ్రస్థానం చేపట్టేటట్లు చేస్తవి. అట్టి వ్యక్తులతో నిండిన ప్రభుత్వ యంత్రాంగం ఏ ఒక వర్గం చేతుల్లో వుండదు కనుక ఎవరినీ బాధించే సాధనంగా వుండదు. ఆధ్యాత్మికం (మానసికం)గా స్వేచ్ఛా జీవులయిన వ్యక్తులు అధికారంలో వున్నప్పుడే దాస్యశృంఖలాల నన్నింటినీ ఛేదించి అందరికీ స్వేచ్ఛను ప్రసాదించ గలరు.

## 21

రాడికలిజం విజ్ఞాన శాస్త్రాన్ని సామాజిక నిర్మాణంతో సమైక్య పరుస్తుంది. వ్యక్తిత్వాన్ని సమిష్టి జీవితంతో సమన్వయపరుస్తుంది. స్వేచ్ఛకు నీతి, జ్ఞానాలతోబాటు సామాజిక విలువనిస్తుంది. ఆర్థిక నియతివాదం, భావగమన శక్తి రెండూ తగినంతగా గుర్తింపు పొందగల సమగ్రమయిన సాంఘిక సిద్ధాంతా న్నిస్తుంది. తద్వారా నేటి సామాజిక విప్లవానికి కావలసిన విధానాన్నీ, కార్య క్రమాన్నీ రాబట్టుతుంది.

## 22

'మానవుడే అన్నింటికీ కొలమానం' (ప్రొటాగొరస్) లేక 'మానవుడు మానవ జాతికి మూలం' అనే సూక్తి నాధారంచేసుకొని రాడికలిజం బయలుదేరు తుంది. ఆధ్యాత్మికం (మానసికం)గా విముక్తిచెందిన నీతివాదుల సమిష్టి యత్నంతో ప్రపంచాన్ని స్వేచ్ఛా మానవుల ప్రజారాజ్యంగా, సౌభ్రాతృత్వ వ్యవస్థగా పునర్ని ర్మించాలని కాంక్షిస్తుంది.

# ముగింపు:

రాయ్ ప్రతిపాదించిన న్యూ హ్యూమనిస్టు (నవ్యమానవవాద) సిద్ధాంతం వెనుక సూచించిన 22 సూత్రాలలో క్రోడీకరించబడినది. ప్రపంచ అనుభవాన్ని, చరిత్రను ఆధారంగా తీసుకొని యివి రూపొందించబడినవి. వీటిని విపులీకరించా లంటే 'భాష్యం' లాగా మరొక ఉద్గ్రంథం తయారవుతుంది. వీటి అవసరాన్ని గురించి, ఆశయాన్ని గురించి వెనుకటి ప్రకరణలలో కొంతవరకు వివరంగానే ముచ్చటించబడినది. అంతిమ భాగంగా మరొకసారి మననం చేయటం వలన పునశ్చరణ కాదనే భావంతో పాఠకుల నుద్దేశించి సారాంశం యివ్వబడుతుంది.

నవ సమాజ నిర్మాణానికి విప్లవం అవసరం. విప్లవం విప్లవ రాజకీయాలను చేపట్టాలి. రాజకీయాలకు కార్యసాధన అవసరం. కార్యసాధనకు సిద్ధాంతం ప్రాతిపదిక కావాలి. ఆచరణకు ఆలోచన అవసరం. గమనానికి లక్ష్యం ప్రధానం. పరిస్థితులను తీర్చిదిద్దటానికి, చక్కబెట్టటానికి భావం యేర్పడాలి. కనుక యీ సూత్రాలను రెండుగా విభజించవచ్చును. మొదటిది ఆలోచనకు రెండవది ఆచరణకు సంబంధించిన భాగం.

## (1) ఆలోచన భాగం

భౌతికవాదమే యీ సిద్ధాంతానికి మూలసూత్రం. ప్రకృతిని మించి, ప్రకృతి శక్తులను మించి అసాధారణమైన, అనూహ్యమైన వేరే శక్తి (భగవంతుడు) ప్రత్యేకించి లేదు. అట్టి శక్తిని కల్పించుకొని, సృష్టించుకొని ప్రకృతి గమనాన్ని, మానవ జీవితాన్ని ఆ శక్తికి దాసోహం చేయటం వలన మానవుడు అస్వతంత్రుడై, వివేచనారహితుడై, ఆత్మవిశ్వాసాన్ని కోల్పోయి దాస్యబద్ధుడగుచున్నాడు. ఈ భౌతిక ప్రపంచాన్ని మించిన మరో ప్రపంచం లేదు. మానవుడు పొందుచున్న కష్ట-నష్టాలు, పొందగల సుఖ-సంపదలు యిచ్చటే వున్నవి. స్వర్గ-నరకాలు స్వార్థ పరుల స్వప్రయోజనాల కొరకు సృష్టించబడినవి.

ఆధునిక విజ్ఞానం వలన, జీవశాస్త్ర పరిశోధనలవలన జడపదార్థంనుంచి చైతన్యవంతమయిన ప్రాణి పుట్టుక రహస్యం కనుగొనబడినది. భౌతిక ప్రకృతిలోని వివిధ పదార్థాల సమ్మేళన, సంపర్కం దీనికి మూలసూత్రంగా అంగీకరించబడ్డది.

ఇది క్రమబద్ధము, సూత్రబద్ధము. కనుక ప్రాణి పరిణామదశ కూడా సూత్రబద్ధమే. మానవదశ యిందులో సర్వోత్కృష్టమైనది. పరిపక్వదశకు చెందిన మెదడు మానవునిలో మనస్సుగా రూపొంది మానవుణ్ణి సృష్టికి ప్రతిసృష్టిచేయగల ధృఢ సంకల్పునిగా చేయటం గమనించతగిన విషయం.

ప్రకృతినుంచి ఉద్భవించిన ప్రాణి తన మనుగడకొరకు తంటాలు పడటం సహజం. కాని మానవదశకు తక్కువ స్థాయిలో నున్న ప్రాణి సముదాయమంతా ప్రకృతి ప్రతిబంధకాలను ,బాధలను తప్పించుకొనటానికే ప్రయత్నిస్తున్నవి. అందుకు నిలువగల, తప్పించుకొనగల జీవులే మనగలుగుచున్నవి. లేనివి అంతరించి పోవుచున్నవి. మానవుడు ఉచ్ఛదశకు చెందిన ప్రాణిగా ప్రకృతి బాధలను తప్పించుకొనటానికి ప్రయత్నించటమే కాకుండా వాటిని తొలగించుకొనటానికి కూడా నిర్విరామకృషి సలుపుచున్నాడు. ఇది అతడు **ప్రకృతితో** జరుపుచున్న నిరంతర పోరాటంగా మారినది. మానవుడు ప్రకృతితో జరుపుచున్న యీ పోరాటంలో ప్రకృతి ప్రతిబంధకాలను తొలగించుకుంటూ, ప్రకృతి రహస్యాలను తెలుసుకుంటూ ప్రకృతిని తన సుఖజీవనానికి, అభివృద్ధికి అనువుగా మలచుకొనగలుగుచున్నాడు. ఇదే మానవ స్వాతంత్ర్యం. ఈ స్వేచ్ఛా గమనంలో మానవుడు అనుభవపూర్వకంగా ప్రకృతినుంచి కొన్ని సత్యాలను గ్రహించగలుగుచున్నాడు. ఇందులో మానవ తృప్తికి, అన్వేషణకు హద్దులు, పరిమితులు లేవు. సత్య పరిశోధనతోబాటు స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు కూడా ఉన్నతపథం అధిరోహిస్తూ వుంటవి.

మానవుడు జరిపే యీ పోరాటం తాను ఏకాకిగా, ఒంటరిగా ఒక్కడే చేయటంకంటె తనతోపాటు మరికొందరిని కలుపుకొనినప్పుడు త్వరగా, తేలికగా చేయగలడు. అందుకు సమిష్టి ప్రయత్నంగా సమాజ వ్యవస్థ యేర్పడినది. సమాజ వ్యవస్థ మానవుని స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు ఒక సాధనంగా వుపకరించినది. ఈ సమిష్టి యత్నం లేక సమాజ వ్యవస్థ ద్వారా కొండ గుహల్లో జీవించిన మానవుడు ఆకాశసౌధ, హర్మ్యాలలో నివసిస్తున్నాడు. గాడిద, గుర్రం, ఎద్దుమీద ప్రయాణంచేసిన మానవుడు కారులు, విమానాలు నిర్మించుకున్నాడు. చేతి పనిముట్లతో తనకు కావలసిన వస్తువుత్పత్తికి తంటాలుపడిన మానవుడు యంత్రాలను సృషించుకున్నాడు. విల్లంబులు, బల్లాలతో ఆత్మరక్షణకు పూనుకొనిన మానవుడు అణుబాంబులను తయారు చేయగలుగుచున్నాడు. ఇవి మొత్తం మానవ

సమాజ సృష్టి. కాని అనుభవంలో మాత్రం ఏ కొలదిమందో వీటిమీద గుత్తాధిపత్యం వహించటం జరుగుచున్నది.

మానవుడు తన మనుగడకొరకు మొదట్లో తనను చుట్టుకొనివున్న ప్రకృతి పరిశీలన, దానికి ప్రతిగా వ్యవహరించిన చర్యలవలననే అతని మనస్సులో భావోద్రేకత జనించినది. తత్ఫలితంగా సాధన పుత్పత్తి ప్రారంభమయినది. చెట్టు మీద వున్న పండును తినాలని కాంక్ష యేర్పడటం భావోద్రేకతకు సంబంధించిన విషయం. దానిని అందుకొనలేనప్పుడు రాతి ముక్కనో లేక కర్రనో సాధనగా వుపయోగించి దానిని పొందటానికి ప్రయత్నించటం సహజం. ఈ విధంగా మానవ చరిత్రతోపాటు భావచరిత్ర కూడా పరిణామదశలో ఒక విశిష్ట స్థానాన్ని పొంద కలిగినది. హెగిల్ సూచించినట్లుగా ఈ భావ పరిణామం ప్రకృతితో పొత్తులేని, ప్రకృతికి లోనుగాని భావం (ఐడియలిజం) కాదు. మార్క్స్ సూచించినట్లుగా సమాజంలోని ఆర్థిక పరిస్థితులను, ఆర్థిక సూత్రాల ననుసరించి తదనుగుణంగా భావాలు ఏర్పడుతూ వుంటవని, ఇవి అశాశ్వతమని భావించనూరాదు. సమాజ వ్యవస్థ ఏర్పడకముందే, ఆర్థిక సూత్రాలు రాకముందే మానవుడున్నాడు. అప్పటి మానవుడు భావరహితుడు కాదు. అతనిలో అతనికి తగ్గ భావజనితం కూడా అప్పుడు వున్నది. అప్పటినుంచి భావం శాశ్వత స్థానాన్ని పొందగలిగినది. కనుక ఫలానా పరిస్థితుల ననుసరించి లేక దశనుబట్టి ఫలానా భావాలు ప్రచారంలో వున్నవని, ఆ దశ దాటగానే ఆ భావాలు కూడా నశించిపోతవనే అభిప్రాయం తప్పు. వీటికి 'కార్య - కారణ' వాదాన్ని కూడా ఆపాదించటం తప్పు. అట్టిది ఎక్కడయినా, ఎప్పుడయినా జరిగినా దానిని యాదృచ్ఛికంగానే భావించాలి.

ప్రకృతి క్రమబద్ధమయినది. కనుక ప్రకృతి పరిణామం కూడా క్రమబద్ధ మయినది. ఈ క్రమబద్ధమయిన ప్రకృతి నుంచి పుద్భవించిన మానవుడు కూడా తప్పనిసరిగా క్రమబద్ధుడు కాగలడు. దీనిని అడ్డగించగల, నాశనం చేయగల శక్తులు అనేకం అతనికి వ్యతిరేకంగా వ్యవహరించవచ్చు. అవి లేనప్పుడు, లేక వున్నా వాటిని తొలగించ గలిగినప్పుడు మానవుడు క్రమబద్ధుడై, హేతువాదిగా ఆలోచించగలడు. జ్ఞానం పెరిగిన కొలదీ అతనిలో వివేచనాశక్తి, హేతువాదం పెరుగుతూ వుంటుంది. జ్ఞానప్రయోజనం మానవుని తన పురోగమనానికి వున్న అడ్డుతెరల నుంచి విముక్తిదాయకుని చేయటమే.

హేతువాది అయిన మానవుడు నీతిదాయకుడుగా కూడా వుండగలడు. నీతి మానవ ప్రవర్తనకు సంబంధించిన చర్య. ఇది మనస్సుకు మంచి - చెడుగులను గురించి విజ్ఞప్తి చేస్తూ వుంటుంది. వివేచనాశక్తి గలిగి, విచక్షణాపరుడయిన మానవుడు ఎప్పుడూ సత్ప్రవర్తనతోనే వుంటాడు. తాను మంచిగా వున్నప్పుడు యితరులు కూడా మంచిగా వుండాలని కోరుకుంటాడు. తాను సుఖజీవనం చేస్తూ యితరులు కూడా అదే జీవితం గడపాలని ఆశిస్తాడు. తనతోబాటు తనతోటి మానవులు కూడా అభ్యుదయపరులు కావాలని ఆకాంక్షిస్తాడు. మతప్రవక్తలు బోధించే నీతిసూక్తులు మరో ప్రపంచం నుంచి వూడిపడలేదు. భగవంతు డిచ్చిన ప్రసాదం కూడా కాదు. అనాది మానవునిలో, కలుషరహితుడయిన మానవునిలో యీ నీతిసూత్రాలు కనబడుచున్నవి.

మానవుడు సర్వస్వతంత్రుడు కావటానికి కేవలం శారీరక సుఖ - సంపదలే సరిపోవు. వానితోబాటు మానసిక అభివృద్ధిని కూడా మెరుగుపరచాలి. ఆర్థిక రంగంతో బాటు వివిధరంగాలలో వైజ్ఞానికంగా, సాంస్కృతికంగా విస్తృత ప్రవేశం, అనుభవం పొంది ఉత్తమ పురుషులు, స్త్రీలుగా రూపొందగల సమాజ వ్యవస్థను నిర్మించాలి. ఇందుకు వ్యక్తి స్వేచ్ఛ, వ్యక్తి స్వాతంత్ర్యం, వ్యక్తి కాంక్షకు విశేష ప్రాధాన్యత వుండాలి. ఇందుకు ఎట్టి అవరోధాలు, అడ్డంకులు వుండరాదు. స్వాతంత్ర్యం వూహాజనితమైన గాలిలోని అందచందాలమేడ కారాదు. ఒక సమగ్రమైన స్వరూపంతో మానవత్వం, వ్యక్తి సేచ్ఛ, హేతువాదం, నీతి దాయకం అనే మూలస్తంభాల మీద నిర్మించాలి.

## (2) ఆచరణ భాగం

ప్రస్తుతం అమలులో వున్న పార్లమెంటరీ ప్రజాస్వామ్య పద్ధతిగాని లేక నియంతృత్వ విధానం గాని మానవ స్వాతంత్ర్యానికి, సమాజ అభివృద్ధికి ఆశించి నంతగా వుపకరించటం లేదు. కనుక మరో మార్గం - మూడవ మార్గం సూచింప బడినది.

ఐరోపా ఖండంలో పారిశ్రామిక విప్లవం జరిగినది. మధ్యయుగం దాటి సమాజం పెట్టుబడిదారీ విధానాన్ని చేపట్టినది. స్వేచ్ఛ సమానత్వం సౌభ్రాతృత్వం పేరుతో ఫ్రెంచి విప్లవం జయప్రదమయినది. మానవుడు తన అపూర్వ మేధా

సంపత్తిని సమకూర్చుకో గలిగాడు. విజ్ఞాన, వైజ్ఞానిక రంగాలలో యెనలేని అభివృద్ధి పొడసూపినది. ఉత్పత్తి పెరిగినది. మానవశ్రమ ఫలించినది.

కాని మానవుడు తాను శ్రమించి ఫలించిన ఫలితాన్ని స్వయంగా పొంద లేక పోవుచున్నాడు. కాపిటలిజం సామ్రాజ్యవాదంగా, ఫాసిజంగా మారినది. వెనుక బడి వున్న దేశాలు వలస రాజ్యాలుగా మారినవి. మానవశ్రమ దోచుకొనబడినది. పెట్టుబడిదారులు శ్రామికుల శ్రమకు తగిన ఫలితాన్ని వారికి ముట్ట చెప్పటం లేదు. హెచ్చు శాతం వారే గుంజుకొని తమ స్వప్రయోజనాలకు వినియోగించు కుంటున్నారు.

'అధికారం ప్రజలదే. అన్ని హక్కులూ ప్రజలవే. తమకు అవసర మయిన, తాము యోగ్యమని భావించిన ప్రభుత్వాన్ని తామే యేర్పరచుకొనవచ్చును. తమ రాజకీయ అధికారం తామే చలాయించవచ్చును'— ఇవి ప్రజాస్వామ్య సూత్రాలుగా వర్ణించబడినవి. వాక్స్వాతంత్ర్యం, సభా స్వాతంత్ర్యం, పత్రికా స్వాతంత్ర్యం వుండగలవని హామీ యివ్వబడినది. ప్రజలకు తమ ప్రభుత్వాన్ని స్థాపించుకొనుటకు, తమ ప్రతినిధులను ఎన్నుకొనటానికి వయోజనులయిన స్త్రీ, పురుషు లందరికీ వోటింగు అధికార మీయబడినది.

ఆచరణలో యిది ఆశించిన ఫలితాలు చేకూర్చకపోగా మానవ మనుగడకే దెబ్బతగిలినది. మానవుడు మానవుడుగా పరిగణించబడలేదు. మహా సముద్రంలో ఒక నీటిబిందువులాగా, పెద్ద యంత్రాగారంలో ఒక చిన్న సనిముట్టు లాగా, ప్రకృతినుంచి విడివడ్డ ఒక స్థాణువులాగా మానవజీవితం నిర్లక్ష్యం చేయబడినది. నిరసించబడ్డది. బిందువులే సముద్రం, సనిముట్టులే యంత్రాగారం, స్థాణువులే భౌతిక ప్రపంచం అనే భావం విస్మరించబడ్డది.

ప్రజలచేత, ప్రజల యొక్క ప్రభుత్వం కాక ప్రజలకొరకుగా ప్రభుత్వం స్థాపించబడినది. అధికారం కొరకు ప్రయత్నించే పార్టీలు అన్నీ ప్రజాశ్రేయస్సునే తమ ధ్యేయంగా పెట్టుకొని ప్రచారం సాగిస్తూవుండటం పరిపాటి అయినది. ప్రచార సాధనాలు, అంగబలం, అర్థబలం వున్న పార్టీలు సర్వసాధారణంగా తమ ప్రతినిధులను గెలిపించుకొనటం, అధికారం చేపట్టటం జరుగుతూవున్నది. ఇందుకు అక్రమ చర్యలు, అవినీతి మార్గాలు అనుసరింపబడుచున్నవి. పార్టీ ప్రచారాలకు, సాధనాలకు, కుల, మతోన్మాదాలకు గురిఅయిన వోటరు తన వివేచనా శక్తిని,

విచక్షణా జ్ఞానాన్ని కోల్పోవుచున్నాడు. తాను పంపే ప్రతినిధిని తాను నిర్ణయించు కొనలేని స్థితిలో పడిపోవుచున్నాడు. తన వోటింగు హక్కును తాను సద్వినియోగం చేసుకొనలేక పోవుచున్నాడు.

ప్రజలచే గెలిపించబడిన ప్రతినిధులు, ప్రజల ద్వారా అధికారం చేపట్టిన పార్టీ యదార్థంగా మొత్తం దేశానికి, ప్రజలకు ప్రాతినిధ్యం వహించదు. దేశ ప్రజలలోని అల్పసంఖ్యా బలంతోనే యిది అధికారం చేపట్టగలుగుతుంది. పది పార్టీలు ఎన్నికలలో పోటీచేసినప్పుడు పదికోట్ల జనాభాలో ఐదు కోట్లు వోటింగు హక్కు గలవారుంటే అందులో సగం లేక నాల్గవవంతు శాతం కూడా లేని వోటర్ల బలంతోనే ఒక పార్టీ అధికారం చేపట్టుతుంది. రెండే పార్టీలు వున్నప్పుడు నూటికి 51 శాతం వోట్లు పొందిన పార్టీ మెజారిటీ బలంగల పార్టీగా నిర్ణయించబడుతుంది.

అధికారం చేపట్టిన తరువాత ప్రతి పార్టీ తన ప్రత్యర్థులనే కాదు, తనకు అధికారమిచ్చిన ప్రజలను కూడా విస్మరించటం పరిపాటి అయినది. ప్రభుత్వాన్ని పాలించేది ప్రజలు పంపిన ప్రతినిధులు కాదు. వారిని గెలిపించిన పార్టీ, పార్టీ పేరుతో కార్యనిర్వాహకవర్గం, కార్యనిర్వాహక వర్గం పేరుతో ఒక వ్యక్తి లేక కొంతమంది వ్యక్తులు మాత్రమే ప్రభుత్వ సారధ్యాన్ని చేజిక్కించుకొంటున్నారు. ఈ ఒకటి లేక అరడజను వ్యక్తుల మీద దేశ భవిష్యత్తు, ప్రజల భవిష్యత్తు ఆధార పడి వున్నది. ప్రజలకు తిరిగి ఎన్నికల సమయం వచ్చే వరకు ఏవిధమయిన అధికారం వుండదు. వారి అధికారం తమ వోటు ద్వారా యితరులకు సంక్రమింప చేయటం జరిగిపోయినది. తాము పంపిన ప్రతినిధులు తమ అధీనంలో, తమ చెప్పుచేతల్లో వుండే అవసరం లేదు. వారిని సక్రమంగా వ్యవహరించనప్పుడు తిరిగి పదవీచ్యుతులను చేసే అధికారం లేక వెనుకకు పిలిపించే అధికారం ప్రజలకు లేదు. ప్రతినిధులు ప్రజలకుకాక పార్టీకే విధేయులు. పార్టీ క్రమశిక్షణకు లోబడి, పార్టీ కనుసన్నలలో మెలగవలసి వుంటుంది. పార్టీ ప్రభుత్వం కూడా తన పార్టీని సంఘటిత పరచటంలో చూపుచున్న ఆసక్తిని ప్రజల యోగక్షేమాల విషయంలో చూపదు. తిరిగి రాబోయే ఎన్నికలలో గెలవాలి. అధికారాన్ని సుస్థిరం చేసుకొనాలి అనే తాపత్రయం ప్రతి పార్టీకి సహజలక్షణం. ఈలోగా కొన్ని వాగ్దానాలను నెరవేర్చవచ్చును. కొన్ని అభివృద్ధి కార్యక్రమాలను చేపట్టవచ్చును. కాని దయా దాక్షిణ్యాలు గల రాజు పరిపాలనకు యీ పార్టీ ప్రభుత్వ పరిపాలనకు ఆచరణలో అట్టే

లేదా వుండదు. అందులో ఒక వ్యక్తి పరిపాలన, ఇచ్చట అసెంబ్లీ, పార్లమెంటు పేరులతో కొలదిమంది వ్యక్తుల పరిపాలన జరుగుతుంది. తేడా అంతే.

దీనివలన ప్రజలకు రాజకీయంగా కొన్ని అధికారాలు సంక్రమించవచ్చు. వాక్, సభా, పత్రికా స్వాతంత్ర్యాలు లభించవచ్చు. కాని కేవలం అవి పరిమితమే. ఆచరణలో ఆర్థిక అసమానతలు పెరుగసాగినవి. ఉన్నవారికి, లేనివారికి అగాధం పెరుగసాగినది. ధనికులు లక్షాధికారులు, కోటీశ్వరులు కాగా పేదవారు నిరుపేదలై జీవనభృతికి చాలక భార్యాబిడ్డలను, కుటుంబాన్ని పోషించుకొనలేని దుర్భర దారిద్ర్యాన్ని అనుభవించవలసి వచ్చినది. స్వేచ్ఛా వ్యాపారం గుత్తాధిపత్యం దీనికి ప్రబల కారణంగా నిరూపించబడ్డది.

కనుక సోషలిజం లేక కమ్యూనిజం దీనికి సరియైన మార్గంగా సూచించ బడ్డది. సమాజం వర్గ సంఘర్షణతో, వర్గ పోరాటంతో కూడివున్నది. వర్గ కలహమే సమాజ అభివృద్ధికి కారణభూత మగుచున్నది. సమాజంలో కార్మిక వర్గమే అంతిమ వర్గంగా నిరూపించబడ్డది. కార్మిక పోరాటం అంతిమ పోరాటంగా నిర్ణయించబడ్డది. పెట్టుబడిదారీ వర్గాన్ని కూలద్రోసి కార్మిక నియంతృత్వం స్థాపించటం పరమావధిగా, అంతిమ లక్ష్యంగా భావించబడ్డది.

నియంతృత్వం స్వాతంత్ర్యానికి వ్యతిరేక సిద్ధాంతం. కార్మిక నియంతృత్వం పేరుతో అధికారం చేజిక్కించుకొన్నది కమ్యూనిస్టు పార్టీయే. పార్టీ లేక వర్గప్రభుత్వాలు పనికిరావన్న మార్క్సిజం పార్టీ ప్రభుత్వానికే దారి తీసినది. పెట్టుబడిదారీ వర్గ స్థానంలో కార్మిక వర్గ ప్రభుత్వం చూపించబడ్డది. యదార్థంగా పరిపాలనలో కార్మికులు గాని, కార్మిక ప్రతినిధులు గాని వుండరు. కార్మికుల పేరుతో కమ్యూనిస్టు పార్టీ, పార్టీ పేరుతో నియంత పరిపాలన జరుగు చున్నది.

సమాజంలో ఆర్థికంగా హెచ్చు తగ్గులు తొలగించటానికి ప్రయత్నాలు జరిగినవి. పరిశ్రమలు జాతీయం చేయబడ్డవి. ప్రభుత్వమే అన్ని వ్యవహారాలు చూడసాగినది. పెట్టుబడిదారీ వర్గంగాని, స్వంత ఆస్తులుగాని వుండటానికి వీలులేని విధానం అవలంబించబడ్డది. సమాజం యాంత్రికం చేయబడ్డది.

కమ్యూనిస్టు పార్టీ వినా మరో పార్టీ వుండటానికి వీలులేదు. ఎన్నికల తంతు జరుగుతూనే వుంటుంది. పార్టీచే ఎన్నుకొనబడిన సభ్యులు ప్రజల ప్రతినిధు

బుగా చలామణి చేయబడతారు. పార్టీని ధిక్కరించి మరొకరు నిలబడే హక్కు గాని, అవకాశం గాని లేదు. పార్టీ సభ్యులకు వోటువేయని ప్రజలమీద నిఘా వుంటుంది. అట్టి వారు ప్రజా ద్రోహులుగా, విప్లవ వ్యతిరేకులుగా పరిగణింపబడతారు. స్వంత అభిప్రాయాలు ప్రకటించటానికి వీలులేదు. రచయితలు, కళాకారులు, వైజ్ఞానికులు మొదలైన వారు ప్రభుత్వాన్ని విమర్శించకూడదు. ప్రభుత్వం చెప్పినది అనుసరించటమే. 'ఒకే ప్రభుత్వం, ఒకే పార్టీ, ఒకే నియంత' నినాదం ఆచరణలో వున్నది. 'క్రమశిక్షణ' పేరుతో వ్యక్తిత్వం నిర్మూలించబడుతుంది.

పరిశ్రమలు జాతీయం చేసినంత మాత్రంచేత పరిస్థితులు చక్కబడవు. యాంత్రికంగా ఎవరి విధులు వారు నెరవేర్చాలని శాసించినందు వలన స్వాతంత్ర్యం పుట్టిపడదు. వర్గం - సమాజం - లేక జాతి పేరుతో జరిగే అభివృద్ధిని అందరి ప్రజల అభివృద్ధిగా పరిగణించరాదు. చరిత్రలో జరిగే ప్రతిసంఘటన - నిన్నకంటె నేడు - నేటికంటె రేపు - అభ్యుదయ గమనంలో వుంటుందని భావించరాదు. సమాజంలో జరిగే ప్రతిమార్పు అందరి ప్రజల జీవిత పరిణామం మీద, మానసిక చైతన్యం మీద ప్రభావితమై వారి స్థాయిని పెంచటానికి వుపకరించాలి. దేశం స్వతంత్రదేశమయినా, జాతి స్వతంత్రజాతి అనిపించుకొనినా అందరి జనులు స్వతంత్రులు కారు. ప్రభుత్వం వైజ్ఞానికంగా సర్వత్రా అభివృద్ధిని సాధించి చంద్ర మండలానికి, శుక్రమండలానికి యాత్రలు జరిపినా అందరి ప్రజలు నిస్సహాయు లయిన స్థాణువులుగానే లెక్కింపబడుచున్నారు. కడుపునిండా తిండి పెట్టినంత మాత్రంచేత మానవుడు పరిపూర్ణ మానవుడు కాజాలడు. అన్ని వసతులూ, అన్ని సౌకర్యాలు కలిగించి శారీరకంగా, మానసికంగా సంపూర్ణ మానవత్వం విరాజిల్ల గల మానవ సమాజాన్ని సృష్టించాలి.

కాపిటలిజం, కమ్యూనిజం తమ తమ బాధ్యతలను నెరవేర్చినవి. మార్క్సిజం ప్రకారం కాపిటలిజం తన ధర్మాన్ని తాను నెరవేర్చిన తరువాత క్షీణించక తప్పదు. కాపిటలిజంలోనే ఆ విషబీజాలున్నవని మార్క్సు చెప్పాడు. అదే వాదం కమ్యూనిజానికి కూడా వర్తిస్తుందని మార్క్సిస్టులు గమనించాలి. సమాజ అభివృద్ధికి ఏదీ అంతిమదశ కాదు. కమ్యూనిజం కూడా అంతే. కనుక కమ్యూనిస్టు వ్యవస్థను అధిగమించి మరో ఇజాన్ని, వ్యవస్థను రూపొందించాలని రాయ్ ప్రయత్నించాడు. అదే న్యూ హ్యూమనిజం — నవ్య మానవ వాదం.

పార్లమెంటరీ ప్రజాస్వామ్యం, నియంతృత్వ విధానం రెండూ మానవ అభివృద్ధికి ఆటంకదాయకములైనవి. ప్రజాస్వామ్యం వర్ధిల్లాలంటే అందుకు గట్టి పునాదులు నిర్మించాలి. ప్రజాస్వామ్యం ప్రజలలోనే వెల్లివిరియాలి. పరిపాలన ప్రజలనుంచే బయలుదేరాలి. అందుకు అవసరమయిన దక్షతను, నైపుణ్యాన్ని వారికి కలుగచేయాలి. అధికారం పై అంతస్తులో వుండి గగనకుసుమం కాకూడదు. మానవ స్వేచ్ఛ, మానవ స్వాతంత్ర్యం, మానవ అభివృద్ధి మానవులయిన వ్యక్తుల నుంచే ప్రారంభం కావాలి. అదే పునాదిరూపాన్ని ధరించాలి. ప్రజాస్వామ్యం ప్రత్యక్షంగా కనబడాలి.

మానవుడు వొంటరిగా తన కోర్కెల నన్నింటినీ సాధించలేడు. సమాజం మొత్తంగా సాధించగలిగినవి అతనికి అందుబాటులో వుండటం లేదు. కనుక ఏ గ్రామాని కాగ్రామం, ఏ నగరాని కానగరంలోని ప్రజలు సంఘాలుగా రూపొంది తమ దైనందిన పరిస్థితులను, సమస్యలను చర్చించుకొని వాటికి పరిష్కార మార్గం కనుగొనుటకు అవకాశం కల్గించాలి. వీటిని అనుసరించే మండల, జిల్లా, రాష్ట్ర, కేంద్ర ప్రజా సంఘాలను రూపొందించాలి. ఇవి ఏ పార్టీకి, ఏ వర్గానికీ, ఏ మతానికీ సంబంధించిన సంఘాలు కాదు. మొత్తం జాతికి, సమాజానికి సంబంధించిన సంఘాలు.

ఎన్నికల సమయంలో యివి తమకు అనుకూలమైన, ప్రతిభావంతులయిన ప్రతినిధులను ఎన్నిక చేసుకొని వారి విజయం కొరకు కృషి చేయగలవు. ఇందులో పార్టీలకు విధేయతగాని, 'క్రమశిక్షణ' రూపంలో తగ్గటంగాని వుండదు. ఎన్నిక అయిన ప్రతినిధులు సరాసరి ప్రజల ప్రతినిధులుగానే వ్యవహరించ గలరు. (ప్రజల అభిమతాన్ని ధిక్కరించి ప్రజల కోర్కెలకు వ్యతిరేకంగా ప్రవర్తించే ప్రతినిధులను తిరిగి పిలిపించి, పదవీచ్యుతులను చేయగల అధికారం ప్రజలకు రాజ్యాంగబద్ధమైనప్పుడు ప్రతినిధులు తప్పనిసరిగా ప్రజాభిమతాన్ని మన్నించగలరు.) ఇది ఎన్నికలలో జరిగే అక్రమ, అవినీతి పద్ధతులను తొలగించటానికి, పార్టీ రాజకీయాలను తగ్గించటానికి వుపకరిస్తుంది. వీరి ద్వారా ఏర్పడిన అసెంబ్లీలు, పార్లమెంటు పార్టీ ప్రమేయంలేని ప్రభుత్వాలను యేర్పరచి ప్రజలకు పూర్తిబాధ్యత వహించ గలవు. ప్రజా సంఘాలచే చర్చించబడి, సూచింపబడిన విధానాలను రాష్ట్ర సంఘాలు, కేంద్రసంఘం పరిశీలించి సమాజం మొత్తానికి అభివృద్ధిదాయకమైన, సంఘర్షణలేని సమన్వయ విధానాన్ని రూపొందించగా వాటిని అమలు చేయటానికి యీ ప్రభుత్వాలు

కృషి చేయగలవు. దీనివలన ప్రజలలో రాజకీయ చైతన్యం అభివృద్ధి చెందటమే కాకుండా వారు రాజకీయ అధికారాన్ని కలిగి ప్రజాస్వామ్యం దినదిన ప్రవర్ధమానం కావటానికి అవకాశం లభిస్తుంది.

ప్రజల జీవన పరిమాణం పెంచటం సమాజాభివృద్ధికి తప్పనిసరి. ఇందుకు ఆర్థిక ప్రణాళికలు అవసరం. అయితే జాతీయ విధానాన్ని చేపట్టి ప్రయివేటు వ్యాపారాన్ని తొలగించినంత మాత్రంచేత యీ లక్ష్యం నెరవేరదు. సహకార ఆర్థిక విధానం యిందుకు సరియైన మార్గం. ప్రజా సంఘాలు రాజకీయ స్వాతంత్ర్యానికి పరిరక్షకులు కాగా సహకార సంఘాలు ఆర్థిక అసమానతలు పోగొట్టి ప్రజల ఆర్థిక జీవితాన్ని మెరుగుపరచటానికి దోహదకారి కాగలవు. ఉత్పత్తిదారుల సంఘాలను, వినిమయదారుల సంఘాలను మొత్తం జాతికి, దేశానికి విస్తరింప చేయాలి. లాభదృష్టితో, విదేశాలకు ఎగుమతుల దృష్టితో కాకుండా ప్రధానంగా దేశీయ ప్రజల అవసరాల దృష్టితో ఆర్థిక విధానాన్ని రూపొందించాలి. వస్తూత్పత్తిని మార్కెటుకు చేర్చి వినిమయదారులకు సక్రమంగా అందే విధంగా చూడాలి. అధిక లాభాలకు, దోపిడీ విధానానికి వీలులేని ఆర్థిక విధానం, అధిక శ్రమకు - విలువను - సామాజిక విలువగా రూపొందించగల సహకార ఆర్థిక విధానం ఉత్తమమైనది. ఇందుకు పోటీగా నిలబడగల ప్రయివేటు వ్యాపారస్తులు వుండ గలుగుతారు. లేనివారు వారంతట వారు తొలగటమో లేక తాముకూడా సహకార సంఘాలలో మిళితం కావటమో తప్పదు. పరిశ్రమలు జాతీయం చేయటంవలన కాపిటలిజం స్టేట్ కాపిటలిజంగా మారి అధికారం కేంద్రీకరింపబడగల ప్రమాదం వున్నది. దానికి సోషలిజం లేక కమ్యూనిజం అని రంగుపూసినా సహజగుణం నశించదు. కాగా ప్రభుత్వ యాజమాన్యం క్రింద నడిచే పరిశ్రమలు అవినీతికి, నష్టానికి గురికావటం అనుభవ పూర్వకంగా తెలిసిన విషయం. అయితే కొన్ని ప్రధాన పరిశ్రమలు, రక్షణ ఉత్పత్తులు, సిమెంటు, ఉక్కు - ఇనుము, పెద్ద ప్రాజెక్టులు ప్రభుత్వం నిర్వహించక తప్పదు. అలాగే ప్రైవేటు పరిశ్రమలు కూడా కొన్ని వుండవచ్చును. కాని ఆర్థిక విధానం వీలైనంతవరకు వికేంద్రీకరణకు ప్రాధాన్యత నిచ్చి ప్రణాళిక రూపొందించటం అవసరం.

ఇలాంటి సమాజాన్ని నిర్మించటానికి ఇందుకు సమర్థులయిన వ్యక్తులను, ప్రతిభావంతులను, మేధావులను సృష్టించాలి. కనుక అందుకు తగిన విద్యావిధానం ప్రవేశపెట్టాలి. లక్ష్యం ఒకటే అయినా చేరటానికి భిన్నమార్గాలు కలవు. మానవుడు

యంత్రంకాదు. సృజనాత్మక శక్తి కలవాడు. ఆ శక్తిని అన్నివిధాల పరిపక్వదశకు చేర్చగల సాహితీ, సంస్కృతులను పోషించాలి. ప్లేటో సూచించినట్లు మానవులు దివ్యమానవులు కావటానికి పరిపాలకులు ప్రలోభంతో కాక ప్రజారంజకులయిన ప్రవక్తలు, తత్వవేత్తలుగా వుండాలి. సమాజంలో యిట్టి వ్యక్తులకు కొదవలేదు. అధికార వ్యామోహంతో కొట్టిమిట్టాడుచున్న ప్రస్తుత సమాజానికి వెరచి, విసుగెత్తి వీరు అజ్ఞాతవాసం అనుభవించుచున్నారు. పార్టీ రహిత రాజకీయాలను ప్రవేశపెట్టి అన్నిరంగాలలో ప్రతిభావంతులయిన బుద్ధిజీవులను తయారు చేయగలిగినప్పుడు నానాటికి వీరి సంఖ్య పెరిగి వీరే ముందుకు వచ్చి సమాజాన్ని తీర్చిదిద్ది నవ సమాజ నిర్మాణ నాయకులుగా, పరిపాలకులుగా, నిర్మాతలుగా వర్ధిల్ల గలరు.

ఇరవై ఐదువందల సంవత్సరాల క్రితమే పాశ్చాత్య తత్వశాస్త్రజ్ఞుడు ప్రొటోగొరస్ 'మానవుణ్ణే ప్రతిదానికి కొలమానంగా భావించాలని' ప్రబోధించగా గడచిన శతాబ్దంలో కారల్ మార్క్స్ దానిని విపులీకరిస్తూ మరొక అడుగు ముందుకు వేసి 'మానవుడే అన్నింటికి మూలాధారం, వేరు వంటివాడని' స్పష్టీక రించాడు. వృక్షం సజీవంగా వుండి సమృద్ధిగా ఫలవంతం కావాలంటే మూలాధార మయిన - వేరు - సజీవంగా, సమృద్ధిగా వుండాలని భావం. కాని ఆచరణలో మార్క్సిజం వక్రమార్గం పట్టటంతో కమ్యూనిజం వెర్రితలలు వేసినది. రాయ్ మరొక అడుగు ముందుకు వేసి వారు చూపెట్టిన ప్రకారమే మానవుణ్ణి యథా స్థానంలో నిలబెట్టటానికి విశేష ప్రయత్నం చేసి నూతన విధానాన్ని రూపొందించాడు. యోగ్యతాయోగ్యతలను నిర్ణయించవలసినది చరిత్ర మాత్రమే.

# అనుబంధం:

రాయ్ జీవితం కేవలం రాజకీయాలకే పరిమితం కాలేదు. తత్వవేత్తగా, చరిత్రకారునిగా, శాస్త్రవేత్తగా, మానసిక వాదిగా వివిధరంగాలలో రాయ్ జరిపిన కృషి, చూపిన ప్రతిభ అద్వితీయము. ప్రపంచ ప్రఖ్యాత పురుషులలో పేరెన్నిక గనిన ధీశాలి. తన అశేష మేధాసంపత్తికి తానే గీటురాయి.

రాయ్ రచనలు అనంతము. దాదాపు మూడు దశాబ్దాలపాటు వివిధ దేశాలలో, వివిధ భాషలలో (స్పానిష్, జర్మనీ, రషియన్, ఇంగ్లీషు) అనేక రచనలు జరిగినవి. ఇందులో అనేకము పత్రికా ముఖంగా వెలువడిన వ్యాసాలు కాలగర్భంలో కలసి పోయినవి. కొన్ని యితర పాశ్చాత్య భాషల లోనికి అనువదించబడినవి. కొన్ని యింకనూ అముద్రితంగానే నిలచిపోయినవి. ముద్రిత గ్రంథాలలో కొన్ని నామరూపంలోనే కనబడుచున్నవి.

మిత్రుల కోరికపై రాయ్ తన మరణానికి ముందు తన భార్య ఎలెన్‌రాయ్ సహకారంతో తన రచనల గురించి అనుక్రమంలో ఒక పట్టికను తయారుచేశాడు. ఇది కేవలం అప్పటికి రాయ్ జ్ఞప్తి ననుసరించి పూర్తి చేసినది మాత్రమే. తరువాత 1955 లో కాలిఫోర్నియా విశ్వవిద్యాలయంలోని 'ఆధునిక భారతదేశ పరిశోధనా సంస్థ'చే నియమితులయిన మిస్టరు పాట్రిక్ విల్సన్ భారతదేశంలో నాలుగు సంవత్సరాలు మకాంవేసి రాయ్‌ని గురించి భోగట్టా సేకరించి ఒక పట్టికగా తయారుచేసి గ్రంథరూపంలో, కరపత్రాలలో రాయ్ రచనలను మొత్తం 124 అని నిర్ధారించటం జరిగినది. అయితే యిందులో కొన్ని రాయ్ యితర భాషలలో వ్రాసి తరువాత ఇంగ్లీషులో అనువదించిన పుస్తకాలు కూడా వున్నవి.

రాయ్ రచనా విధానము కూడ వర్ణనాతీతము. శాస్త్రపరిచయమే కాకుండా, భాషాపాండిత్యము కూడా రాయ్ రచనలలో వుట్టిపడుతూ వుంటుంది. పాఠకుల ప్రయోజనార్థము రాయ్ రచనలు యిక్కడ పొందుపరచుట యుక్తమనే భావంతో క్రమపద్ధతిలో పట్టిక యివ్వబడినది. కాని ఇందులో కొన్నింటి ప్రతులు ప్రస్తుతము లభ్యం కాని స్థితిలో వుండుటచే వాటికి *గుర్తు యివ్వబడినది.

*1. High Road to peace, Mexico, 1917
2 La India : Su Pasado, Su Presente Y Su Pornenir, Mexico 1918 (Spanish)
*3. Letters to Indian Natnonalists, 1920
*4. The Problems of India, 1920
5. India in Transition, Geneva, 1922. Also German Version.
6. What do we want ? Geneva, 1922
7. India's Problem and its Solution, 1923
8. One Year of Non-Co-operation from Ahmedabad to Gaya, Calcutta, 1923
9. Political letters, Zurich, 1924
10. Caunpur Conspiracy case : An open letter to the Rt. Hon. J.R Macdonald, London 1924
*11. What is to be done ? 1925
12. The Aftermath of Non-Co-operation, London; 1926
13. The Future of Indian Politics, London 1926. Also Russian Edition, Moscow; German Edition, Hamburg, Berlin.
14 La Liberation Nationale des Indes, Paris, 1927 (Spanish)
15. Les Avies Internationalix de I' opposition du P. C. et de I' U R S S, Paris, 1927 (German)
16. Die Internationalen Verbiindeten der opposition in der K P D S U, Hamburg 1928 (German)
17. Kitaiskaia revoliutsiia i Kommunisti cheskii internatsional; Sbornik statei i materialov. Moscow, Lenin Grad, 1929
*18. The Lessons of the Lahore Congress, 1929
19. Revolution and Konter - Revotion in China, Berlin - German Version, 1930. English Version "Revolution and counter Revolution in China" Published from Calcutta, 1946
20. Our Task in India, 1932
21 I accuse, New york 1932. Same text published in India at the same time under the title, 'My Defence'.
22. Our Problems, 1937
23. Letters to Congress Socialist Party, 1937
24. Our Differences, 1938
25. My Experience in China, 1938
26. Fascism, Its Paylosophy, Profession and Practice, 1938
27. The Historical Role of Islam, 1939
28. Heresies of Twentieth Century, 1939
29. From Savagery to Civilisation, 1939

30. The Alternative, 1940
31. Materialism, An out line of the History of Scientific Thought, 1940
32. Man and Nature, 1940
33. Science and Superstition, 1940
34. Letters to Mahatma, 1940.
35. Gandhism, Nationalism and Socialism, 1940
36. Memoirs of a cat, 1941
37. Ideal of Indian womanhood, 1941
38. Freedom or Fascism ? 1942
39. Scientific Politics, 1942
40. War and Revolution, 1942
41. India and war, 1942
42. Communist International, 1943
43. Nationalism An Antiquated cult, 1943
44. Indian Labour and post - War Reconstruction, 1943
45. Nationalism, Democracy and Freedom, 1943
46. Poverty or Plenty ? 1943
47. Planning a new India, 1943
48. Letters from Jail, 1943
49. Alphabet of Fascist Economics, 1944
50. National Government or People's Government ? 1944
51. Constitution of India, A Draft, 1944
52. This way to Freedom, 1944
53. Last Battles of Freedom, 1944
54. Problem of Freedom, 1945
55. Jawahar Lal Nehru, 1946
56. New Orientation, 1946
57. Beyond Communism, 1946
58. New Humanism, 1947
59. Science and Phylosophy, 1947
60. The Russian Revolution, 1949. The first part of this book was originally Published as a Smaller book in 1937.
61. India's Message, 1950
62. Radical Humanism 1952
63. Reason, Romanticism and Revolution 2 Vols, 1952
64 Crime and Karma : Cats and women, 1957
65. Politics, Power and Parties Calcutta, 1959
66 Roy's Memoirs' 1964 (Posthumously Published)

## ( Pamphlets )

1. My crime (on his expulsion from the comintern)
2. On Stepping out of Jail.
3. Which way, Lucknow ? (Written from Jail)
4. My Difference with the Congress.
5. Tripuri and after.
6. This war and our difence.
7. The New Path. (Manifesto of the Radical Democratic Party)
8. Message to the U. S. S. R.
9. History is not made This way. (with others)
10. On the Congress Constitution.
11. On communal question.
12. What is Marxism ?
13. The future of Socialism.
14. A new approach to communal problem.
15. Indian Renaissance Movement.
16. New Orientation.
17. The Congress and the Kisans.
18. States People's Struggle and the Congress.
19. Principles of Mass Mobalisation.
20. Twentieth century Jacobinism.
21. Relation of classes.
22. Your future.
23. Future of Democracy.
24. Sino-Soviet Treaty.
25. Satyagraha.
26. Origin of Radicalism in Congress.
27. People's Party.
28. Postwar perspective
29. Library of a revolutionary.
30. Problems of Indian Revolution.
31. Whithr Erope ?
32. World crisis.
33. Leviathan and Octopus.
34. Asia and the world.
35. Cultural prerequesites of freedom.
36. The concept of causality in modern Science.

37. The 22 Theses of Radical Democracy.
38. The way Ahead in Asia.
39. Humanist Politics.

ఇవిగాక రాయ్ రచనలు అనేకము యింకా అముద్రితము లున్నవి. అవి డెహరాడూన్‌లోని రినైజాన్సు సంస్థ కార్యాలయంలో భద్రపరచబడి వున్నవి. అవి కూడా క్రమేపి పుస్తకరూపంలో వెలువడ గలవు. వాటిని యీ క్రమపద్ధతిలో చూపవచ్చును.

1. Philosophical consequences of Modern Science.
   (9 unfinished Volumes Written in Jail)
2. Large collection of Stenograms of his speeches.
3. Large collection of his correspondence.
4. His innumerable contributions to various Journals abroad.

రాయ్ రష్యా, జర్మనీ దేశాలలో వున్నప్పుడు Masses, Van-Guard పత్రికలను స్థాపించి సంపాదకీయునిగా అనేక వ్యాసాలు వ్రాశాడు. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌లో వున్నప్పుడు Inprecor లో తరువాత అపోజిషన్ కమ్యూనిస్టు పార్టీకి చెందిన ఇతర పత్రికలలో కూడా రాయ్ వ్యాసాలు వెలువడినవి. తరువాత భారతదేశంలో Independent India, Radical Humanist, Marxian Way, The Humanist Way పత్రికలకు సంపాదకునిగా వున్నాడు. వీటితో బాటు రాయ్ భారత దేశములో టెర్రరిస్టుగా 1916 ముందు బెంగాలులోని పత్రికలకు వ్రాసిన వ్యాసాలు, మెక్సికోలో వున్నప్పుడు అచ్చట పత్రికలకు వ్రాసిన వ్యాసాలు, 1920 తరువాత ఇతర దేశాల్లో కమ్యూనిస్టేతర పత్రికలకు వ్రాసిన వ్యాసాలు, 1937 నుంచి 54 వరకు భారతదేశంలోను, విదేశాలలోను పత్రికలలో ప్రచురింపబడిన వ్యాసాలు సేకరించటానికి రినైజాన్సు కార్యాలయం వారు తగిన కృషి చేయటం ముదావహం. రాయ్ రచన లన్నింటినీ ఒక క్రమపద్ధతిలో సంపుట రూపంలో వెలువరించినచో భారత ప్రజలకే కాక మొత్తము మానవ సమాజానికి యుపయుక్తము కాగలదు. ఈ గురుతర బాధ్యత రినైజాన్సు సంస్థపై నున్నది.

★